శ్రీ సీతారామచంద్ర గ్రంథ భాండాగారం
వట్లూరు.
విర్యాహుతులు :— శ్రీ పోతకట్లె వెంగన్నశ్రేష్ఠి
గారి విరాళం

# శ్రీ వివేకానంద సంపూర్ణగ్రంథావళి

[ శతతమజన్మదినోత్సవ ప్రచురణము ]

మూడవ సంపుటము

శ్రీ రామకృష్ణ శారదా పఠన మందిరము,
శ్రీ సీతారామచంద్ర పుస్తక
భాండాగారము,
[illegible] (కృష్ణాజిల్లా)

# శ్రీవివేకానందసంపూర్ణగ్రంథావళి

[ శతతమ జన్మదినోత్సవ ప్రచురణము ]

## మూడవ సంపుటము



శ్రీ రామకృష్ణ మఠము

మైలాపూరు : : మద్రాసు - 4

మదరాసు శ్రీరామకృష్ణమఠాధ్యక్షునిచే ప్రకటింపబడినది.

సంపాదకులు :
నేలటూరి భక్తవత్సలముగారు

తొలికూర్పు—3,300

నొవెంబరు, 1962

సర్వస్వామ్యసంకలితము

అట్టబైండు వెల : రూ. 5-00
కాలికోబైండు ,, రూ. 6-50

ది జ్యూపిటర్ ప్రెస్ ప్రైవేటు లిమిటెడ్, మద్రాసు - 18

# విజ్ఞప్తి

భారతదేశైక్యసంపాదనమే. కాక సర్వదేశైక్యసంపాదనమును అత్యంతావశ్యకమైన దినాలు ఇవి, కాబట్టి శ్రీవివేకానంద స్వాముల సందేశమును వ్యాపింపజేయుట కిది ఎంతేని తగిన సమయము. అంతే కాదు. 1963 జాన్యువరినెలలో ఆరంభమై 1964 జాన్యువరినెలవఱకును విశ్వమంతట శ్రీవివేకానందస్వాముల శతతమజయంతి మహోత్సవములు జరుగ నున్నవి. కావున ఆయనసందేశమును వెదజల్లుటకు ఈ సమయము మఱింతగా తగినదగుచున్నది. ఈ యుగమహావతారపురుషుడు పరమహంస శ్రీరామకృష్ణుడు. తనశిష్యులందఱిలో వరిష్ఠునిగా ఆయనే ఎన్నుకొన్న శ్రీవివేకానందస్వామి తానును ఈ యుగమహావతార పురుషుడే. భారతదేశాధ్యాత్మికసందేశామృతమును నలుదెసల కొసలవఱకు వ్యాపింపజేసిన వాడాయన. శాఖీయ ప్రాంతీయ దేశ కాల విభేదభ్రాంతులను పటాపంచలు చేయు 'జీవైక్య తత్త్వము'ను దెసల మాఱుమ్రోగునట్లు గర్జించిన వేదాంతకేసరి ఆయన. మానవునకు తన దివ్యతలో విశ్వాసము లేక, దౌర్బల్యముచే తూలిపోవుచున్న కాలమున దివ్యత్వమును స్మరింపజేసి, దౌర్బల్యమును దులిపి వేసి, అతనిని నిత్యధీరునిగా జేయు 'నీవు అమృతపుత్రుడవోయి' అను ఉపనిషత్సూక్తి జీవాతువును ఆస్వాదింపజేసిన భవరోగవైద్యుడు ఆయన.

హృదయమును భక్తిమయముగను, బుద్ధిని జ్ఞానదీప్తముగను, శరీరమును సత్కర్మానుష్ఠానసాధనముగను, విశ్వమును విష్ణుమయముగను, నరుని నారాయణునిగను, బ్రహ్మనిర్వాణశాంతి సామ్రాజ్యపట్టభద్రునిగను— జేయు నమోఘశక్తి శ్రీవివేకానంద వాణికి కల దనుట తదనుభవైకవేద్యము. శతతమజయంతిమహో

త్సవకార్యక్రమములో ఒక అంగముగా జ్ఞానయజ్ఞముగా స్వామిజి గ్రంథావళిని వివిధప్రాంతీయభాషలలోనికి అనువదింపించి వివిధ ప్రాంతాలవారికి అందజేయు మహాత్కార్యభారమును వహించి తిమి. ఆంగ్లమూలములో ఎనిమిదిసంపుటాలుగా ఉన్న గ్రంథావళి విషయానుగుణముగా పునర్విభక్తమై అనువాదములో పది సంపుటాలుగా వెలువడుచున్నవి. తెలుగులో వెలువడ నున్న సంపుటాలు పదింటిలో ఇది మూడవది.

ఈ సంపుటమున (1) తత్త్వశాస్త్రము (2) కర్మయోగము (3) యోగములు (4) మూర్తిపూజ (5) అమెరికనువార్తా పత్రికలనివేదికలు అను ఐదు ఖండము లున్నవి. ప్రథమ తృతీయ చతుర్థఖండములను తెలిగించినవారు ఆంధ్రప్రభ పత్రిక సహాయ సంపాదకవర్గములోనివారగు శ్రీ పున్నావఝ్ఝల సీతారామబ్రహ్మము బి. ఏ. గారు. ద్వితీయఖండము శ్రీ చిరంతనానందస్వాముల యనువాదము. ఈ సంపుటమునకు సంపాదకులైన శ్రీ నేలటూరి భక్తవత్సలము ఎమ్. ఏ., బి. ఓ. ఎల్. గారు ఐదవఖండమును తా మనువదించుటే కాక ఇతరఖండములనుగూడ మూలానుగుణముగ పరిష్కరించియున్నారు. పైముగ్గురికిని మేము కృతజ్ఞులము. విషయ మెంత గహనమో, శ్రీవివేకానందస్వాముల వక్కాణము అంత సరళము. అనువాదమున లక్షణోల్లంఘనము చేయక ఆ సరళతను కాపాడుటకు యథాశక్తి ప్రయత్నించియున్నాము. అకారాదిసూచిని చేర్చి యున్నాము.

ఆంధ్రమహాజనులు మా ప్రచురణములపట్ల సదా చూపు ఆదరమునే ఈ సంపుటములపట్ల చూపుదురేని మా శ్రమకు సమృద్ధఫలము కలిగినట్లే భావింతుము.

దిపావళి 1962

ప్రకాశకుడు

## విషయసూచిక

# వేదాంతదర్శనము

వేదాంతదర్శన మని నేడు సాధారణముగా పేర్కొనబడు దానియందు భారతదేశములో నిప్పుడున్న వివిధవాదములును చేరి యున్నవి. ఎన్నో వ్యాఖ్యానము లున్నవి. ద్వైతము మొదలు అద్వైతము వఱకు అవి యొకదానిపై నొకటి మెట్టు మెట్టుగా అమరియున్నట్లు నా మనస్సునకు తోచుచున్నది. వేదాంత మను మాటకు వేదముల అంతము అని అర్థము.—వేదములు హిందువులకు పరమప్రమాణ మగు సారస్వతము.* వేదము లనగా ఋక్కులు, కర్మలు మాత్రమే అని పాశ్చాత్యదేశీయులు అర్థము చేసికొందురు. కాని, నేడీ భాగములు చాలవఱకు వాడుకలో లేకుండ పోయినవి. భారతదేశములో నిప్పుడు వేదము లనగా వేదాంత మన్న యర్థము వాడుకలోనికి వచ్చినది. మా భాష్యకారు లందఱు ప్రమాణవాక్య మేదయిన నుదాహరింపవలసి వచ్చిన యెడల—నియమముగా, వేదాంతమునుండియే ఉదాహరింతురు.

---

* వేదములలో రెండు ప్రధానభాగము లున్నవి; కర్మకాండ, జ్ఞానకాండ. ప్రసిద్ధస్తవములు, బ్రాహ్మణములలోని కర్మకలాపములు కర్మకాండకు చెందినవి; కర్మలుగాక, అధ్యాత్మతత్త్వవిషయములను గుఱించి చెప్పునవి ఉపనిషత్తులు. ఉపనిషత్తులు జ్ఞానకాండకు చెందినవి. ఉపనిషత్తు లన్నియు వేదములలో నొక ప్రత్యేకభాగముగా, రచింపబడిన వని యర్థము గాదు. కర్మకాండభాగములో కొన్ని మధ్యమధ్య చేర్పబడినవి. సంహితాభాగములో ఒక్క ఉపనిషత్తైనను ఉండును. ఒక్కొక్కప్పుడు ఉపనిషత్తు అను మాట వేదములలోభాగములు కానివానిని కూడ వ్యవహరించుట కలదు ; ఉదాహరణకు భగవద్గీత ; కాని, ఉపనిషత్తు అను పేరు విధిగా వేదములలో అక్కడక్కడగల తత్త్వజ్ఞానమును గుఱించిన భాగములకు చెందును. అట్టి రచన లన్నియు సేకరింపబడినవి. వానికి వేదాంత మని పేరు.

భాష్యకారుల పరిభాషలో వేదాంత మనగా శ్రుతులే.† వేదాంతము పేరిట వెలసిన గ్రంథము లన్నియు వేదములలోని కర్మకాండభాగములకు తర్వాతనే వ్రాయబడినవి కావు. ఉదాహరణకు : ఈశోపనిషత్తు యజుర్వేదములోని నలువదవ ప్రకరణము. ఇది వేదములలోని బహుప్రాచీనభాగములలోనిది. కర్మకాండ అనబడు బ్రాహ్మణములలోని భాగము లయిన యుపనిషత్తులును‡ గలవు; తక్కిన యుపనిషత్తులు స్వతంత్రము లైనవి; బ్రాహ్మణములలో గాని, వేదములలోని యితరభాగములలోగాని చేరినవి కావు. కాని, అవి వేదములలోని ఏ భాగముతోను బొత్తిగా సంబంధము లేక స్వతంత్రములైన వనుకొనుటకు కారణము కనబడదు. ఏల యన, వీనిలో చాలవఱకు మనకు లభింపకుండపోయిన వని, బ్రాహ్మణము లెన్నియో కాలగర్భమున కలసిపోయిన వని మనకు తెలిసిన విషయమే. కనుక స్వతంత్రములైన వని మన మనుకొనియెడి యుపనిషత్తులు కాలక్రమమున వాడుకలో లేకుండపోయిన బ్రాహ్మణములలోని భాగము లయియుండుట సంభవమే. వానిలోని ఉపనిషత్తులు మాత్రమే మిగిలియుండవచ్చును. ఉపనిషత్తులకు ఆరణ్యకములనిగూడ పేరు.

---

† శ్రుతి యనగా "విన్నది".—ఇది వేదసాహిత్యమంతటికి నన్వయించును. కాని, ప్రధానముగా ఉపనిషత్తులకే ఈ పేరు భాష్యకారులు వ్యవహరించిరి.

‡ నూటయెనిమిది ఉపనిషత్తులు గల వని చెప్పుదురు. వాని తేదీలు నిర్ధారణగా చెప్పుటకు వీలులేదు. అవి బౌద్ధోద్యమమునకు మునుపటికాలమువి అని ఖండితముగా చెప్పవచ్చును. కొన్ని చిల్లర ఉపనిషత్తులలో ఇటీవలి కాలము వగు విషయముల ప్రస్తావము గలదు. అంతమాత్రముచేతనే ఆయుపనిషత్తు లిటీవలి కాలము వని నిర్ణయింపరాదు. సంస్కృతసాహిత్యములో ననేక సందర్భములలో గ్రంథములలోని ముఖ్యభాగము ప్రాచీనమైనదే అయినను, కొందఱు స్వమత దురభిమానులు తమశాఖాధిక్యమును నిరూపించుకొనుటకు దాని కొక పూతపూసి, యిటీవలి విషయములు కొన్నిటిని చేర్తురు.

వ్యవహారములో వేదాంతభాగమే హిందువులకు ప్రమాణ గ్రంథ మయినది. సంప్రదాయమును మన్నించు తత్త్వదర్శనము లన్నియు దానినే ప్రాతిపదికగా గైకొని తీరవలసినదే. బౌద్ధులు, జైనులుగూడ తమ కనుకూలించు సందర్భములలో వేదాంతము నుండి ప్రమాణముగా నొకభాగము నుదాహరింతురు. భారత దేశములోని అన్ని దర్శనములును వేదములనే ప్రాతిపదికగా మన్నించుచున్నట్లు చెప్పుకొనుచున్నను, అవి వేర్వేఱుపేర్ల బరగు చున్నవి. వీనిలో కట్టకడపటిది వ్యాసదర్శనము. అది, తత్పూర్వ దర్శనములకంటె నెక్కువగా వేదములను ప్రమాణీకరించు కొన్నది. సాంఖ్య, న్యాయదర్శనములవంటి పూర్వవాదములను వేదాంతముతో సమన్వయించుట కది ప్రయత్నించినది. కనుక దానికి ప్రత్యేకముగా వేదాంతదర్శన మను పేరు కలిగినది; ఆధునిక భారతములో వ్యాససూత్రములే వేదాంతదర్శనమునకు ప్రాతిపదిక అయినవి. ఈ సూత్రములకు భాష్యకారులు వివిధరీతుల వ్యాఖ్యా నముచేసిరి. స్థూలముగా, నేడు భారతదేశములో ముత్తెఱగుల భాష్యకారు లున్నారు;* వారి వ్యాఖ్యానములను పురస్కరించు

* వ్యాఖ్యానము పెక్కుతీరులు—భాష్యము, టీక, టిప్పణి, చూర్ణి మొద లయినవి : వీనిలో భాష్యముతక్క, మిగిలినవి గ్రంథములకు లేదా, గ్రంథముల లోని కఠినపదములకు అర్థములుదెల్పునవి. భాష్యమును వ్యాఖ్యానము అనిన సరి పోదు. అది గ్రంథముల నాధారముగాగొని చేయు ఒకానొక తత్త్వవాద వివరణ. దాని లక్ష్యము మాటల కర్థముచెప్పుట కాదు. తత్త్వవాదమును సిద్ధాంతము చేయుట. కనుక భాష్యకారుడు మూలగ్రంథవాక్యములను ప్రమాణీకరించుకొనుచు తనవాదమును, విపులీకరించును.

వేదాంతమునకు పెక్కు భాష్యము లేర్పడినవి. వేదాంతసిద్ధాంతములు కట్టకడపట వ్యాసునిసూత్రములలో పొందుపడినవి. ఈ సూత్రములకు ఉత్తర మీమాంస యని కూడ పేరు. వేదాంతమునకేకాక హిందువుల మత సారస్వత సర్వస్వమునకు వ్యాససూత్రములే పరమ ప్రమాణమగు ప్రతిపాదనము. కేవల విరుద్ధమతములవారుగూడ వ్యాససూత్రముల నుదాహరించి, వానిని తమ వాదము

కొని మూడు వాదములు, శాఖలు ఏర్పడినవి. ఒకటి ద్వైత వాదము; రెండవది విశిష్టాద్వైతము; మూడవది అద్వైతము. వీనిలో ద్వైతమును, విశిష్టాద్వైతమును అవలంబించినవారు భారతీయులలో హెచ్చుమంది. అద్వైతుల సంఖ్య తక్కువ. ఈ మూడు వాదములలోని యభిప్రాయములను మీకు తెలియ జేసెద. ఈ పని ప్రారంభించుటకు ముందు ఒక్కమాట చెప్పెద— ఈ మూడు వాదముల మనస్తత్త్వశాస్త్ర మొక్కటే, సాంఖ్యుల మనస్తత్త్వశాస్త్రము. సాంఖ్యుల మనస్తత్త్వశాస్త్రము, వివర ములకు సంబంధించిన కొన్ని స్వల్పాంశములలోతక్క, న్యాయ, వైశేషికదర్శనముల మనస్తత్త్వశాస్త్రమునే చాలవఱకు పోలి యుండును.

వేదాంతులెల్లరు ఏకాభిప్రాయులైయుండు విషయములు మూడు—దేవు డున్నా డని, వేదములు అపౌరుషేయము లని, సృష్టిచక్రగతిని సాగుచుండు నని వారు నమ్ముదురు. వేదములను గుఱించి మనము పరిశీలించితిమి. సృష్టిచక్రమునుగుఱించి వారి నమ్మిక మిది :— విశ్వమునం దున్న సమస్తపదార్థనివహమును ఆకాశ మనియెడి మూలపదార్థమునుండి పుట్టును; గురుత్వాకర్షణ శక్తిగాని, ఆకర్షణశక్తిగాని, విద్రావకశక్తిగాని, జీవశక్తిగాని—సమస్త

---

లతో సమన్వయించుకోవలసినవా రయినారు. బహు ప్రాచీనకాలమునగూడ వేదాంతదర్శనమునకు వ్యాఖ్యానముచేసినవారు ద్వైతులు, విశిష్టాద్వైతులు, అద్వైతులనియెడి మూడు ప్రసిద్ధశాఖలుగా నేర్పడిరి. ప్రాచీన భాష్యములు కాల గర్భములో లీనమైపోయినవేమో ! కాని, బుద్ధునియనంతరము వానిని శంకర, రామానుజ, మధ్వాచార్యులు పునరుద్ధరించిరి. అద్వైతవాదమును శంకరుడు పున రుద్ధరించెను. రామానుజుడు ప్రాచీన బోధాయనుని విశిష్టాద్వైతమును, మధ్వా చార్యుడు ద్వైతవాదమును పునరుద్ధరించిరి. భారతదేశములో ఈ తెగలు ముఖ్య ముగా తత్త్వవిషయముననే భేదిల్లును; కర్మకాండలో వానికిగల భేదము స్వల్పము. తత్త్వవాదములో, మతములో వానికి ప్రాతిపదిక ఒక్కటే.

శక్తియు ప్రాణమనియెడి మూలశక్తినుండి సంభవించును. ఆకాశముపై ప్రాణశక్తిచేయు క్రియాఫలితమే విశ్వసృష్టి.† కల్పప్రారంభమున ఆకాశము నిశ్చలముగాను, అవ్యక్తముగాను ఉండును. అంతట ప్రాణశక్తి పనిచేయ నారంభించును; ఆ పని వర్ధిల్లుకొలది. ఆకాశమునుండి స్థూలవస్తువులు — మొక్కలు, పశువులు, మానవులు, నక్షత్రములు మొదలయినవి యుత్పన్నము లగును. ఇంతంతనరానంత కాలము గడచిన పిమ్మట వెలికిడబడుట (ఇవల్యూషను) ఆగిపోయి, లోనికి కొనబడుట (ఇన్వల్యూషను) ప్రారంభ మగును. ప్రతి స్థూలవస్తువును తన సూక్ష్మాతిసూక్ష్మ రూపములకు మరలి మూలపదార్థము లగు ప్రాణాకాశములలో లయించిపోవును. తరువాత సృష్టి పునఃప్రారంభ మగును. ప్రాణాకాశముల కతీతమైన మఱొకవస్తువు గలదు. అది మహత్తు— విశ్వాత్మ. విశ్వాత్మ ప్రాణాకాశములను సృష్టింపదు, తానే ప్రాణాకాశములుగా పరిణామ మొందును.

మనస్సు, ఆత్మ, దేవుడు—వీనిని గుఱించిన నమ్మకముల నిప్పుడు పరిశీలింతము. సర్వజనాంగీకృతమైన సాంఖ్యమన స్తత్త్వశాస్త్రము ప్రకారము—విషయగ్రహణమున—ఉదాహరణకు: చూచుట యను క్రియ జరుగుటకు చూచెడి కరణములు—కన్నులుండవలె. కన్నులనియెడి ఉపకరణముల వెనుక— నేత్రేంద్రియము కావలె. దానికి సంబంధించిన నాడి, దానికి సంబంధించిన నాడీ కేంద్ర మవసరము. ఇవి బాహ్యామం దుండు ఉపకరణములుగావు. ఇవి లేకున్న కన్నులు చూడలేవు. ఇంతేకాక చూడగలుగుటకు

† క్రియేషన్" అను ఇంగ్లీషుమాటకు సరియైన సంస్కృతపదము విక్షేపము. భారతదేశములో నేమతశాఖవారును సృష్టినిగుఱించి పాశ్చాత్యదేశములలోనివారు భావించినట్లు భావింపరు—శూన్యమునుండి సృష్టివచ్చినట్లు భావింపరు, సృష్టియనగా అంతకుపూర్వ మున్నదే ఆవిష్కృత మగుట అని మా యభిప్రాయము.

మఱికొన్ని కావలసియున్నవి. మనస్సు వచ్చి యింద్రియముతో చేర వలె. ఇంతే కాక, యింద్రియానుభవము బుద్ధికి గొనిపోబడ వలె. నిర్ణయించునదియు ప్రతిక్రియ చేయునదియు అగుమనఃస్థితియే బుద్ధి. బుద్ధినుండి ప్రతిక్రియ గల్గునప్పుడు దానితోపాటు వెలిజగము గోచరించును; అహంకారము తోచును. సంకల్ప ముండున దిచ్చట. ఇంతమాత్రము చేతనే సర్వము పూర్తి కాలేదు. పెక్కు వెలుగు కిరణములవలన చిత్ర మేర్పడుటకు, సంపూర్ణాకృతి దాల్చుటకు చలనము లేని తెరవంటి దొకటి యవసరము. అదే విధముగా మనస్సులోని వివిధభావము లొకచో చేరుటకు, ఆకృతిదాల్చుటకు చలనము లేని దొకటి యవసరము. దేహముకంటె, మనస్సుకంటె అది చలనము లేనిదిగా నుండ వలె—అదియే జీవుడు, పురుషుడు, ఆత్మ.

సాంఖ్యశాస్త్రము ప్రకారము మహత్తే (విశ్వాత్మయే) బుద్ధి (=మననపర మగు మనఃస్థితి) గా పరిణమించును, రూపొందును. మహత్తు చలత్సంకల్పముగ పరిణమించును. అది కొంత భాగము కరణములుగను, మఱికొంతభాగము సూక్ష్మాణువులు గను మాఱును. ఈ యన్నిటి మేళనఫలితముగా ఈ సర్వజగత్తును పుట్టు వొందును. మహత్తుకు అతీతముగాకూడ ఒక స్థితి కల దని సాంఖ్యులు భావించిరి. దానికి అవ్యక్త మని పేరు. ఆ స్థితియందు మనస్సుసైతము వ్యక్తముకాదు. కారణములు మాత్ర మే ఉండును. అవ్యక్తమునకు ప్రకృతి యనికూడ పేరు. ప్రకృతికి అతీతముగా, సదా దానికంటె వేఱై పురుషుడు గలడు. ఈ పురుషుడే సాంఖ్యుల ఆత్మ. అది నిర్గుణము, విశ్వవ్యాప్తము. పురుషుడు కర్తకాడు, సాక్షిమాత్రుడే. పురుషుని స్వరూపమును వివరించుటకు స్ఫటికము నుదాహరింతురు. పురుషుడు వర్ణరహిత మగు స్ఫటికమువంటివా డట. దానిముందు పెక్కు రంగు లున్న వనుకొందము. ముందున్న రంగు లన్నియు దాని పై

కెక్కినట్లు కనిపించును. కాని నిజమునకు దాని కేరంగును లేదు. ప్రకృతిపురుషులనుగూర్చిన సాంఖ్యుల ఆశయములను వేదాంతులు నిరాకరింతురు. సాంఖ్యమతప్రకారము ఆత్మకును, ప్రకృతికిని మధ్య సేతువులేని పెద్ద అగాధ మున్న దని వేదాంతులు చెప్పుదురు. సాంఖ్యశాస్త్రము ఒకవైపు 'ప్రకృతి'ని దరియును. తటాలున మఱొకవైపునకు ఆత్మయొద్దకు లంఘింపవలసియుండును. ఆత్మ ప్రకృతికంటె పూర్తిగా వేఱైనదికదా. వర్ణరహితమయిన ఆత్మకు సాంఖ్యులు చెప్పెడి విభిన్నవర్ణము లెట్లెక్క గలవు? అందుచేత నీ ప్రకృతి, ఈ ఆత్మ వేర్వేఱుగాక, ఈ రెండు నొక్కటే* అని మొదటినుండియు వేదాంతుల వాదము. వేదాంతులలో ద్వైతవాదులుగూడ ఆత్మ, దేవుడు, జగత్తునకు నిమిత్తకారణ మగుటే కాక, ఉపాదానకారణముకూడ నగు నని అంగీకరింతురు. వారు పైకి పెక్కుమాటలలో ఇట్లందురే కాని నిజమున కది వారి హృదయము కాదు. ఏలయన, తమ వాదపర్యవసానమునుండి తప్పించుకొనుటకు వారీ తీరున ప్రయత్నింతురు: విశ్వమున మూడు తత్త్వములు గల వని వారు చెప్పుదురు—అచిత్తు, చిత్తు, ఈశ్వరుడు. చిదచిత్తులు దేవునికి శరీరములవంటివి. ఈ విధముగా దేవుడును, అఖిలజగత్తు నొకటియే. కాని, ఈ ప్రకృతికిని, ఈ విభిన్నాత్మలకు భేదము నిత్యము. కల్పప్రారంభమునమాత్రము అవి వ్యక్తము లగును; కల్పాంతమున అవి సూక్ష్మరూపముదాల్చి, సూక్ష్మావస్థయం దుండును. అద్వైతవాదులు జీవాత్మసిద్ధాంతము

---

* వేదాంతదర్శనమునకు, సాంఖ్యదర్శనమునకు వైరుధ్యము లేనేలేదు. సాంఖ్యుల పురుషుడే వేదాంతుల బ్రహ్మముగా పరిణమించినాడు. అన్ని దర్శనములు సాంఖ్యుల మనస్తత్త్వశాస్త్రమునంగీకరించును. వేదాంతము, సాంఖ్యము ఆత్మ యనంతమైనదని విశ్వసించును; సాంఖ్యులు ఆత్మలనేకములని నమ్ముదురు. సాంఖ్యదర్శనము ప్రకార మీ విశ్వతత్త్వమును గుఱించి వెలుపలనుండి వివరింపవలసినదేదియు లేదు. ఆత్మ ఏకమే అనియు అది అనేకముగా భాసించుననియు వేదాంతమువిశ్వసించును. సాంఖ్యులు కావించిన విషయ విభజనమే మాకుపునాది.

నంగీకరింపరు. దాదాపుగా అన్ని యుపనిషత్తులును వారివాదమున కనుకూలముగా నున్నవి. వారు తమ వాదసౌధమును పూర్తిగా ఉపనిషత్తుల పునాదిపైనే నిర్మింతురు. ఉపనిషత్తులలోని భాగముల కన్నిటికిని విషయ మొక్కటే, ప్రతిపాద్య మొక్కటే. ఈ క్రింది విషయమును ఋజువుచేయుటే — "ఒక్క మట్టిముద్దనుగూర్చి తెలిసికొంటిమేని ప్రపంచమున గల మట్టియంతటినిగూర్చియు తెలిసికొన్నవార మగుదుము కదా. అదేవిధమున, దేనిని తెలిసికొన్న, సృష్టిలోని సకలవస్తువులను గుఱించియు తెలిసికొన్నవార మగుదుము?" ఏకైక మగు నేది యీ యఖిలజగత్తుగా పరిణమించినదో, అదే ఈ విశ్వము అని సూత్రించుటే అద్వైతుల హృదయము. విశ్వ మంతయు ఏక మని, ఏకసత్తు అని, అదే అనేకవివిధ రూపముల భాసించుచున్న దని వారి సిద్ధాంతము. సాంఖ్యులు చెప్పెడి ప్రకృతి కల దని వా రంగీకరింతురు. కాని, ప్రకృతి బ్రహ్మమే అని వా రందురు. ఈ వస్తువే, ఈ సత్తే—విశ్వముగా, మానవుడుగా, ఆత్మగా ఇంకను ఏమేమి కలదో అదంతయునుగ ఇన్ని వస్తువులుగా రూపొందినది. మనస్సును, మహత్తును ఆ ఏకసత్తు దాల్చు రూపములే. ఇక్కడ చిక్కె మనగా విశ్వమే దేవు డన్న ట్లగును. నిర్వికార మని వారే యంగీకరించు వస్తువు—సత్తు — నిర్గుణమైనదానికి మా ర్పుండదు కదా—సవికారముగను, సవినాశముగను మాఱుట ఎట్లు పొసగినది? దీనికి అద్వైతులు చెప్పు సమాధానమునకు వివర్తవాద మని పేరు. ద్వైతులును సాంఖ్యులును 'ఈ విశ్వమంతయు మూలప్రకృతినుండి రూపొందిన' దందురు. ఈ విశ్వమంతయు భగవంతునినుండియే రూపొందిన దని కొందఱు ద్వైతులును, కొందఱు అద్వైతులును చెప్పుదురు. శ్రీ శంకరాచార్యుల అనుచరులైన అసలు అద్వైతు లేమో 'ఈ విశ్వమంతయు దేవునినుండి రూపొందినట్లు పైకి కనిపించు' నందురు. ఈ జగత్తుకు ఉపాదానకారణము భగవంతుడే. భగవంతుడు ఈ జగముగా రూపొందినట్లు కనబడునే కాని

రూపొందుట సత్యము కాదు. ఇందుకు వారు చెప్పు సుప్రసిద్ధ న్యాయము రజ్జుసర్పన్యాయము. త్రాడు పాముగా కనబడునే కాని, నిజముగా అది పాము కాదు. త్రాడు నిజముగా పాముగా మార్పుచెందలేదు. అదేవిధముగా ఈ విశ్వమంతయు ఆ సత్తే. అందు మార్పు లేనే లేదు. మఱి మనము కాంచు మార్పు లన్నియు పైకి కనబడునవియే. ఈ మార్పులకు కారణములు దేశకాల నిమిత్తములు. ఇంతకంటె పైమెట్టుగా సూత్రప్రాయముగ చెప్ప వలె నన్న—'ఆ కారణములు నామరూపములే'. నామరూపము లనుబట్టియే కదా, ఒకవస్తువును మఱొకవస్తువునుండి వేఱుగా గుర్తించుచున్నాము! నామరూపములే భేదమునకు కారణము. నిజమునకు తత్త్వము ఏకము, అభిన్నము. వ్యక్త మొకటియు, అవ్యక్తము వే ఱొకటియు కా వందురు వేదాంతులు. త్రాడు పాముగా మాఱినట్టు కనబడినదే గాని నిజముగా మాఱ లేదు; భ్రాంతినివారణ కాగానే పాము మాయ మగును. అవిద్యలో నున్నవాడు పైకి కనబడునదే చూచును, దేవు డతని కగపడడు. బ్రహ్మసాక్షాత్కారము కలిగినవానికి జగత్తు పూర్తిగా అదృశ్య మగును. ఈ కనబడు సర్వమునకు కారణమును 'మాయ' యని పేర్కొందురు. నిర్గుణమును నిర్వికారము నగు తత్త్వమును ఈ దృశ్యమానజగముగా భ్రమించులే ఆ మాయ. మాయ అనగా శుద్ధశూన్యము కాదు, పూర్తిగా అసత్తు గాదు. సత్తును కాదు, అసత్తును కా దని మాయ నిర్వచింపబడినది. మాయ సత్తు కాదు. నిర్గుణమును నిర్వికారము నైనదానిని మాత్రమే సత్తు అని చెప్ప నగును. ఈ యర్థమున మాయ అసత్తే యగును. మాయను అసత్తు అని చెప్పుటకును వీలుగాదు; ఏల యన అది అసత్తే ఐనచో ఈ దృశ్యమానప్రపంచమును కల్పించియుండ జాలదు. కనుక అది సత్తును, అసత్తును కాని దొకటి; దానికి వేదాంతపరిభాషలో అనిర్వచనీయ మని పేరు. కాబట్టి జగత్తుకు నిజమైన కారణము మాయయే. బ్రహ్మమో, భగవానుడో

యిచ్చోడి మూలవస్తువుకు మాయ నామరూపములు కల్పించును. బ్రహ్మమే ఈ సర్వముగా పరిణమించినట్లు కనబడును. కావున అద్వైతవాదుల ప్రకారము జీవాత్మ లేదు. జీవాత్మలు మాయా కల్పితములు. నిజమునకు వ్యష్ట్యాత్మ లుండుటకు వీలు లేదు. విశ్వ వ్యాప్తమైన సత్తు ఒక్కటే అగునప్పుడు నేను వేఱు, నీవు వేఱు అగుట ఎట్లు పొసగును? మన మందఱము ఒక్కటే. చెడుగున కెల్ల కారణము ద్వైతభ్రాంతియే. నేనీ విశ్వమునుండి వే ఱని అనుకొన్న వెంటనే మొట్టమొదట గల్గునది భయము. దానివెంట దుఃఖము గల్గును. "ద్రష్ట వేఱుగా, దృశ్యమానము వేఱుగా, శ్రోత వేఱుగా, శ్రూయమాణము వేఱుగా ఉండుట క్రిందిమెట్టు. ద్రష్ట కంటె వేఱైన దృశ్యమానము లేకయు, శ్రోతకంటె వేఱైన శ్రూయమాణము లేకయు ఉండుట పరత్వము. అదే బ్రహ్మము. అఖండసౌఖ్యము ఆ పరమపదమున గలదు. జఘన్యవిషయము లందు సౌఖ్యము లేదు."

స్థూలజగమునందలి యీభేదము, ఈ దృశ్యమానము లగు వస్తువులు తాత్కాలికముగా మానవుని యథార్థస్వరూపమును మఱుగుపఱచుచున్న వనుట అద్వైతసిద్ధాంతము; అంతేకాని మానవుని యథార్థస్వరూపము నిజముగ మార్పుచెందనేలేదు. క్షుద్రాతిక్షుద్ర మగు క్రిమియందును, మహోన్నతు డగు మానవునియందును ఒక్కదివ్యత్వమే ఉన్నది. క్రిమిరూపము క్షుద్ర రూపము. దానియందు దివ్యత్వమునకు మాయచే గలుగు మఱుగు పాటు ఎక్కువ. దివ్యత్వమునకు మాయవలని మఱుగుపాటు ఏ రూపమందు అత్యల్పమో ఆ రూపము మహోన్నతము. ప్రతి వస్తువునందును ఒక్కదివ్యత్వమే ఉన్నది. ఈ యాశయము నుండియే నీతికి మూల మేర్పడుచున్నది. ఇతరులకు ద్రోహము చేయకు. అఖిలవిశ్వము ఒక్కటే గనుక నిన్ను ప్రేమించుకొన్నట్లే ప్రతివానిని ప్రేమింపుము. మఱొకనికి కీడుచేయుటలో నేను నాకే

కీడు చేసికొనుచున్నాను; మఱొకని ప్రేమించుటలో నేను నన్నే ప్రేమించుకొనుచున్నాను. ఈ ఆశయమునుండియే అద్వైతనీతి సూత్రము ఉత్పత్తిల్లుచున్నది. ఆ సూత్రము నొక్కమాటలో సంక్షేపించినారు 'అహంతా విసర్జనము' అని. 'సంకుచితమైన ఈ వ్యష్ట్యాత్మయే నా సమస్తదుఃఖమునకు కారణ మని అద్వైతి వచించును. ఇతరజీవులకంటె నేను వే అనెడి భావమును కలిగించెడి ఈ వ్యష్ట్యాత్మభావమువలన ద్వేషమును, అసూయయు, దుఃఖమును, సంఘర్షణయు, తక్కిన సర్వానర్థములును కలుగును. ఈ భావమును తొలగించుకొనుటతో ఘర్షణయంతయు సమసిపోవును; దుఃఖమంతయు నంతరించును. కాబట్టి ఈ సంకుచిత వ్యక్తిత్వమును విసర్జింపవలసినదే. క్షుద్రజంతువులకొఱకైనను సరే, మనప్రాణముల నిచ్చివేయుటకైనను సరే, మనము సర్వదా సంసిద్ధులమై యుండవలెను. చిన్నపురుగుకొఱకైనను తనప్రాణమును త్యజించుటకు సంసిద్ధుడై యున్నవాడు అద్వైతి ఆశించెడి పరిపూర్ణస్థితి నందుకొనె నన్న మాటే; అత డాతీరున సంసిద్ధుడయిన ముహూర్తముననే మాయాయవనిక అతనినుండి తొలగిపోవును. అప్పు డతనికి స్వస్వరూపము అనుభూత మగును. విశ్వమునకంటె తాను అభిన్నుడను అనుభూతి అతనికి ఈ జీవితములోనే కలుగును. కొంత సేపతనికి ఈ దృశ్యమానప్రపంచ మదృశ్యమగును. అతనికి స్వస్వరూపసాక్షాత్కారము కలుగును. కాని, ఈ దేహకర్మ యున్నంతకాల మతడు జీవించియే యుండవలె. మాయాయవనిక తొలగిపోయిన తరువాతగూడ కొంతకాలము ఈ దేహ ముండుచో అట్టిస్థితినే వేదాంతులు జీవన్ముక్తి యందురు. మృగతృష్ణవలన కొంతకాలము మోసపోయినవాని కొకనాడు భ్రాంతి తొలగిపోయినచో, మఱునాడు గాని, మఱొకనాడు గాని ఎండమావి మరల కనబడినను అతడు మోసపోడు. మృగతృష్ణ విచ్ఛిన్నము కాకమునుపు ఇది నిజము, ఇది మోస మని అతడు గుర్తింపలేకుండెను. ఒక్కసారి అది విచ్ఛిన్నమై పోయిన పిదప

భారతదేశము విదేశీయపాలకులచేతికి వచ్చినప్పుడెల్ల వారికి భారతీయుల ఐశ్వర్యము, అభ్యుదయము, రాజ్యము, ఆధ్యాత్మికాశయములు అలవడుటతో వారి చరిత్రమే మాఱిపోయెడి దనుట గమనార్హము. భౌతికసంపదను ఎంత గడింపగలము, ఎంత అనుభవింపగలము అని పాశ్చాత్యు డాలోచనచేయుచుండును. ప్రాచ్యుని దృష్టి దానికి సరిగా తలక్రిందు. ఎంత తక్కువ భౌతిక సంపదతో కాలము గడపగల్గుదునా యని అత డాలోచించును. ప్రాచీనభారతీయులు పరాత్పరునికొఱకు సాగించిన అన్వేషణ వేదములలో మనకు కననగును. ఆ ప్రయత్నములో వారు మఱొక అంతస్తుమీది కెక్కినారు; తమ వంశపూర్వులను పూజించుటతో ప్రారంభించి, తరువాత అగ్న్యారాధనకు, మేఘముల కధిపతి యగు ఇంద్రుని యారాధనకు, దేవాధిదేవు డగు వరుణుని ఆరాధనకు సాగిరి. దేవతాభక్తి బహుదేవతాభక్తిగానుండి ఏకేశ్వరభక్తిగా వర్ధిల్లుట అన్నిమతాలలోను కననగుచున్నది. అనగా వివిధవర్గాలవారి వేల్పులలో ఒకడు ప్రధానుడని, స్రష్టయు పాలకుడును సర్వజీవహృదయజ్ఞుడును అతడే అని, అభివృద్ధిశ్రేణి వేల్పుల బాహుళ్యమునుండి ఏకేశ్వరారాధన కందించిన దని అర్థము. దేవుడు మానవునివంటివాడను ఆశయము హిందువులకు సంతృప్తికలిగింపలేకపోయినది. ఆ యాశయము, దివ్యత్వాన్వేషకులైనవారికి కేవలము మానవత్వ మనిపించినది. తుదకు వారు దేవునికొఱకు ఇంద్రియగోచర మగు బాహ్యస్థూలజగత్తులో అన్వేషించుట విరమించుకొని దృష్టిని అంతర్ముఖమొనర్చుకొనిరి. అంతఃప్రపంచమొకటి కలదా? అదేది? అదే ఆత్మ. అదే 'తాను'. ప్రతివ్యక్తి నిశ్చయముగా నమ్ముకొనదగిన వస్తువ దొక్కటే. తన్ను తాను తెలిసికొన్నప్పుడే ప్రపంచమును తెలిసికొనగలడు. కాని వేఱురీతిని కాదు. ఆదికాలమున, ఋగ్వేదములోసైతము ఇదేప్రశ్న మఱొక విధముగా అడుగబడినది: "అనాదిగా నున్న దేది? ఎవరు?" ఈ ప్రశ్నను వేదాంతశాస్త్రము క్రమక్రమముగ

పరిష్కరించినది. అనాదిగా ఉండినది ఆత్మ. అనగా ఆదినుండి సకలవస్తువులను ఆవిష్కరించినట్టి, ఆవిష్కరించుచున్నట్టి, ఆవిష్కరింపనున్నట్టి శక్తి ఆత్మయే, దానినే నిర్గుణ మని, విశ్వాత్మ అని మన మందుము.

వేదాంతవిదులు ఆప్రశ్నను పరిష్కరించునప్పుడే ధర్మ మూలమును కనుగొనిరి. ''చంపకు. హానిచేయకు; నిన్ను ప్రేమించుకొన్నట్లే నీ పొరుగువానిని ప్రేమింపుము.'' ఈ మున్నగు నీతులు సకలమతములు బోధించినవి. కాని, యిందు కేమతమును కారణము చెప్పలేదు. నేను నాపొరుగువాని కేల కీడుచేయరాదు? ఈ ప్రశ్నకు సంతృప్తికరమును నిశ్చితమునగు సమాధానము రాలేదు. వట్టి సుద్దులతో తృప్తిపడి ఉండువారు కారు హిందువులు. చివరకు వారి పారమార్థిక పర్యాలోచనలనుండియే ప్రశ్నకు సమాధానము రూపొందినది. వారి ట్లనిరి— ఈయాత్మ అనిర్వచనీయము, విశ్వవ్యాప్తము; కనుక అనంతము. అనంతమైన వస్తువులు రెండుండజాలవు; ఉన్నచో ఒకదాని నొకటి పరిమితపఱచి, రెండును సాంతములే యగును. ప్రతిజీవాత్మయు ననంతమైన విశ్వాత్మలో నంశమే. కనుక, పొరుగువానికి చేసినకీడు, నిజమునకు తనకే చేసికొన్నకీడు అగును. సకల నీతిశాస్త్రముల కంతర్గతముగా నున్న తాత్త్విక సత్య మిదియే. పరిపూర్ణత్వము పొందుటకుగాను పురోగమించుచున్న సాధకుడు అసత్యమునుండి సత్యమునకు పయనించునని చాల తఱచుగ నమ్ముచుందురు; ఒక తలంపునుండి మఱొక తలంపునకు పోయినప్పు డనివార్యముగా వెనుకటి తలంపును పరిత్యజించుట తప్ప దని కూడ భావింతురు. కాని ఏ అసత్యమును సత్యమునకు చేర్పజాలదు. వివిధదశలలో పయనించు ఆత్మ సత్యమునుండియే సత్యమునకు ప్రయాణముచేయును. ప్రతిదశయుసత్యమే; అది క్రింది సత్యమునుండి మీది సత్యమునకు పోవును. ఈయంశము నీ క్రింది నిదర్శనముచే వివరింపవచ్చు : సూర్యునివంకకు పయ

నించుచున్న యొకడు అడుగడుగునకు ఆసూర్యునిబింబమును ఫొటోతీయును. మొదటి ఫొటోకు, రెండవ ఫొటోకు ఎంత భేద ముండును? మొదటి ఫొటోకు మూడవ ఫొటోకు ఇంకెంత భేద ముండును? సూర్యునిచేరుకొన్న తరువాత తీసిన కట్టకడపటిఫొటో కును మొదటి ఫొటోకును మఱెంత భేదముండును! అవన్నియు పరస్పర మెంతో భిన్నములుగా నున్నను యథార్థములే. స్థల, కాల పరిస్థితుల మార్పు వానిని పరస్పరము అంతభిన్నములుగా కన బఱచినవి. ఈ రహస్యమును గుర్తించుటచేతనే హిందువులు నికృష్ట మతమునుండి ఉత్కృష్టమతమువఱకు సకల మతములలోనుగల విశ్వ జీవనసత్యమును దర్శింపగలిగిరి; మతాంతరుల నెన్నడు హిం సించియుండనివారు వారొక్కరే అగుటకుకూడ కారణ మిదియే. మహమ్మదీయులు విస్మరించి నిరాదరించిన యొక 'మహమ్మదీయ సిద్ధపురుషాలయము'న నిప్పుడు హిందువులు పూజచేయుచున్నారు! ఈ పరమతసహనోత్సాహమును సూచించు నిదర్శనములను పెక్కింటిని చూపవచ్చును.

సమస్త మానవకోటి ఆశించు పరమలక్ష్యమును—ఐక్య మును — దర్శించువఱకు ప్రాచ్యుల మనసుకు సంతృప్తిలేదు. సూక్ష్మాణువునందో, అణువునందో ఐక్యమును కనుగొన పాశ్చాత్య వైజ్ఞానికుడు ప్రయత్నించును. ఐక్యమును కనుగొన్న తరువాత కనుగొనవలసినది వేఱొకటి అతనికి లేదు. అదేవిధముగా ఆత్మైక్య మును మనము దర్శించిన పిమ్మట ఇక పైకి పోలేము. అంతట మన కింద్రియగోచర మగు జగత్తులోని ప్రతివస్తువును ఆ యేకైక తత్త్వావిష్కారమే అని తేటతెల్ల మగును. మఱొక విషయము: పొడవుగాని, వెడల్పుగాని లేని యణువులు కొన్ని కలియుటవలన పొడవు, వెడల్పు, వ్యాప్తి కలుగుచున్న వని వైజ్ఞానికుడు భావించు టతో అత డనివార్యముగా వేదాంతసత్యమును గుర్తింపవలసిన వా డగుచున్నాడు. ఒక అణువు మఱొక అణువుపై పనిచేయు

నప్పుడు ఏదో ఒకదానిగుండ పనిచేయవలెను. దేనిగుండ? మఱొక అణువుగుండనే. అది నిజమే అయినచో ఈ రెండణువులు మూడవ అణువుపై నెట్లు పనిచేయు నన్న ప్రశ్న సమాధానము లేనిదై నిలిచిపోవును. ఇందలి అసంగతత్వము స్పష్టమే. ఈ ఆభాసవిరోధము సమస్తభౌతికవిజ్ఞానమునకు నవసరమైన ప్రమేయ మందుగూడ కానవగును. చుక్కకు స్థూలత్వములేదు; దాని యందు భాగములు లేవు. రేఖకు పొడవున్నది గాని వెడల్పు లేదు. ఇవి చూపుకును అందవు, ఊహకును అందవు. ఏల? ఏల యనగా, ఇవి యింద్రియప్రపంచమువి గావు. ఇవి వేదాంతాశయ ములు. కనుక దృశ్యమానమగు సర్వమునకు ఆకృతి కల్పించునది మనస్సే అని రూఢియగుచున్నది. నేను కుర్చీని చూచుచున్న ప్పుడు, నా కంటికి కనబడుచున్నది బాహ్యముగానున్న నిజమైన కుర్చీ. బాహ్యముగానున్న దేనితోనో చేరిన నా మానసిక ప్రతి. బింబమునే నేను కనుచున్నాను. అందుచేత కట్టకడపటికి ఐహిక పరుడుకూడ వేదాంతము నాశ్రయింపవలసి వచ్చును.

# వేదాంతతత్త్వము, దాని ప్రభావము

(బోస్టనులోని ట్వెంటియత్సెంచరి క్లబ్బులో చేసిన ప్రసంగము)

నేటి మధ్యాహ్నపు ఉపన్యాస విషయమును ప్రారంభించుటకు ముందు నా కిప్పుడు కలిగిన అవకాశమును పురస్కరించుకొని నా కృతజ్ఞతను తెలియజేయుచు కొలదిమాటలు చెప్పుటకు మీ యనుమతి కోరుచున్నాను. మీ మధ్య నేను మూడు సంవత్సరములుగా నున్నాను. దాదాపు అమెరికాలోని అన్ని ప్రాంతములలోను పర్యటించితిని. నే నిప్పుడు నా దేశమునకు పోవుచున్నాను. ఈ సందర్భమున అమెరికాకు ఏథెన్సువంటి ఈనగరములో నాకృతజ్ఞత తెలియజేయుట ఉచితము. నే నీ దేశమునకు వచ్చిన కొన్ని దినములతరువాత ఈ దేశీయులనుగుఱించి యొక గ్రంథము రచింపగల ననుకొంటిని. కాని, యిక్కడ మూడేండ్లు ఉన్నతరువాత ఒక్కపుట యైనను వ్రాయ లేకున్నానని గ్రహించితిని. వివిధదేశములలో నా పర్యటనానుభవ ఫలితముగా — ఆహారమునకు, దుస్తులకు, మర్యాదలకు సంబంధించిన స్వల్పవివరములలోని పైపై విభేదములకు మఱుగున మానవుని మానవత్వము ప్రపంచమంతటను ఒక్కతీరుగ నుండుటను గుర్తించుచున్నాను. అద్భుతమైన ఏకరీతి మానవప్రకృతియే సర్వత్ర కనబడుచున్నది. అయినను ఇక్కడ కొన్ని విశిష్టలక్షణములు గలవు. ఇక్కడి నా యనుభవము లన్నిటిని ఒకటిరెండు మాటలలో సంగ్రహించెదను. ఒక్కొక్కమానవుని ప్రత్యేక లక్షణములనుగుఱించి అమెరికాలో ఎవరును అడుగరు. మానవుడు మానవుడుగా నుండిన చాలు. అతని నాప్యాయముగా నాదరింతురు. ఈ లక్షణమును నేను మఱి ఏ దేశములోను ఎప్పుడును చూచియుండ లేదు.

నే నిక్కడకు భారతీయ తత్త్వవాదములలో నొకదానికి ప్రతినిధిగా వచ్చితిని. దానికి వేదాంతశాస్త్ర మని పేరు. ఇది బహు

ప్రాచీనమైన సిద్ధాంతము; ఇది వేదములనెడి ప్రాచీనార్య సారస్వతమునుండి వెలువడినది. శతాబ్దముల తరబడి సేకరింపబడినదియు క్రోడీకరింపబడినదియు విస్తారము నగు ఆ సారస్వతమున భద్రముగా నున్న విచారణల, అనుభూతుల, విమర్శల నిగ్గే యది. వేదాంతశాస్త్రమునకు కొన్ని ప్రత్యేక లక్షణము లున్నవి. వానిలో మొదటిది—అది ఏ వ్యక్తికిని సంబంధింపనిది. ఏవ్యక్తియో ప్రవక్తయో జనింపజేసినది కాదది. ఒక్కమానవుని కేంద్రముగా చేసికొని వర్ధిల్లునది గాదు అది. అయినను అట్లు కొందఱువ్యక్తుల చుట్టును వర్ధిల్లిన మతాలనుగూర్చి ప్రతికూలముగా చెప్పవలసినది దాని కేమియు లేదు. భారతదేశములో తరువాత తరువాత కొన్ని మతములు సిద్ధాంతములు కొందఱు వ్యక్తులను పరివేష్టించి వెలసినవి. బౌద్ధమతము, నేడు ప్రబలియున్న పెక్కు మతశాఖలు అటువంటివే. క్రైస్తవులకును, మహమ్మదీయులకును ఉన్నట్లే ఆమతాలలో ఒక్కొక్కదానికి నొకనాయకు డున్నాడు. వాని కామతము వారు విధేయులై యుందురు కాని, వేదాంతశాస్త్ర మీ విభిన్న మతముల కన్నిటికిని నిగూఢాధారముగా నున్నది. వేదాంతమునకును, ప్రపంచములో మఱి యే వాదమునకును విరోధములేదు, కలహములేదు.

వేదాంతము ప్రతిపాదించెడి ఒక సిద్ధాంత మిది: మానవునిలో దివ్యత్వ మున్నది; మనచుట్టును మనముచూచు ఈ సర్వమును ఆ దివ్య చైతన్యమునుండి యుద్భూత మైనదే. ప్రపంచములోని ప్రతిమతమునం దీ భావము గల దని కూడ వేదాంతము వక్కాణించును. మానవప్రకృతిలో ఏదేది ప్రబలమో, మంచిదో, శక్తిమంతమో అ దెల్ల ఆ దివ్యత్వమువలన గల్గినదే. అనేకులలో అది ఆవిష్కృత మగుటకు మునుపటిదశలో నున్నను అందఱును దివ్యులే గనుక మానవునకును మానవునకును సారమైన భేదము లేదు. వెనుక అనంతసాగరమువంటి దొకటి గలదు. మీరును నేనును ఆ యనంతసాగరమునుండి వెలువడిన తరంగములవంటి

వారము. మనలో ప్రతియొక్కరము అనంతత్వమును ఆవిష్కరించుటకు శక్తికొలది పాటుపడుచున్నాము. కనుక, మనలో ప్రతియొక్కరియందును అఖండసచ్చిదానంద మను ననంతసాగరము ఆవిష్కరణకు పూర్వదశలో నున్నది. అది మన జన్మహక్కు. అదియే మన నిజమైన ప్రకృతి; లోని దివ్యత నావిష్కరించు శక్తిలో గల హెచ్చుతగ్గులచేతనే మనలో భేద మేర్పడుచున్నది. ప్రతిమానవుని—అతడు ఆవిష్కరించెడిదానినిబట్టిగాక, అతడు దేనికి ప్రతినిధియో దానినిబట్టియే మనము మన్నింపవలె నని వేదాంతము ఆదేశించును. ప్రతిమానవుడును దేవుని ప్రతినిధియే. కనుక ప్రతి ఆచార్యుడు మానవునకు తోడ్పడక తప్పదు; తోడ్పడుట ఖండనచేతగాదు; అంతస్థితమైన దివ్యత్వమును వెలువఱచుటకు తోడ్పడుటచేత.

సమాజమునందు; ప్రతి కార్యరంగమునందును ప్రకటితమగుచున్న యపారమగు శక్తియంతయు వాస్తవమునకు లోపలనుండి బహిర్గతమగుచున్నదే అని వేదాంతము బోధించును; ఇతర మతాలవారు దేనిని ఈశ్వరప్రేరితజ్ఞాన మందురో, అది మానవుని నిశ్వాసమే అని వేదాంతము స్వతంత్రించి పలుకును. కాని, వేదాంతమున కితర మతశాఖలతో వివాదము లేదు; మానవుని యీ దివ్యత్వము నర్థముచేసికొనజాలనివారితో వేదాంతమునకెట్టి కలహమును లేదు. ఎఱుక గలిగియో, ఎఱుక లేకయో ప్రతి మానవుడు ఆ దివ్యత్వమును వెలువఱచుటకే ప్రయత్నించుచున్నాడు.

మానవుడు చిన్నపెట్టెలో చుట్టచుట్టుకొనియున్న యనంతమైన జోరుతీగ (స్ప్రింగు) వంటివాడు; ఈ తీగ తనచుట్టను విప్పుకొనుటకు ప్రయత్నించుచున్నది, ఆ విప్పుకొను ప్రయత్నఫలితమే సంఘమున మనకు కననగుచున్న దంతయు. మనచుట్టును గల పోటీలు, ఘర్షణలు, చెడుగులు ఈ చుట్ట విప్పుకొనుటకు కారణములును గావు, ఫలితములును గావు. మా గొప్ప తత్త్వవేత్తలలో

ఒక డిట్లు చెప్పెను: పొలమునకు నీరు పాఱించుటకు నీటిని నిల్వ చేయు తొట్టె ఎక్కడనో యెత్తున నున్నది. నీరు పొలములోనికి ప్రవహించుటకు వేగిరపడుచున్నది. కాని, ద్వారమొకటి అడ్డమున్నది. ద్వారము తెఱచిన తోడనే నీరు తన సహజధర్మము చేతనే లోనికి ప్రవహించును; దారిలో దుమ్ము, ముఱికి ఉన్న యెడల నీరు వానిమీదుగనే ప్రవహించును. కాని, దుమ్మును ముఱికియు మానవుని దివ్యతావిష్కారమునకు కారణములును కావు, ఫలితములును గావు. అవి దానితో బాటుండు పరిస్థితులు మాత్రమే. కనుక వానిని చక్కజేసికోవచ్చు.

ఈ యాశయము భారతదేశములోను, తదితరదేశముల లోను గల ప్రతిమతమునందును గలదని వేదాంతము వక్కాణించును; కొన్నిమతములలో ఈ యాశయము పురాణగాథల మూలమున, మఱికొన్ని మతములందు సంకేతముల మూలమున తెలియజేయబడుచున్నది. ప్రతి ధర్మావేశమును, ప్రతి దివ్య మానవావిష్కృతియు, ఎంత గొప్పదైనకానీ అది మానవుని ప్రకృతిలోని యనంత మగు ఏకత్వపు ప్రకటనమే అని వేదాంతము చెప్పును. ధర్మ మని, నీతి యని, పరోపకార మని మనము చెప్పున దెల్ల ఆ ఐక్యపు ప్రకటనమే. ప్రతిమానవుడు విశ్వమంతటితో అభేదము ననుభవించు క్షణములు గలవు. ఎఱిగినను ఎఱుగ కున్నను దానిని వ్యక్తముచేయుట కత డురవడించును. ఈ యైక్య ప్రకటనమునకే ప్రేమ యని, సానుభూతి యని పేరు. ఇదియే మన సకలధర్మములకు, నీతులకు పునాది. ఇదే వేదాంతశాస్త్రమున "తత్త్వమసి" 'అదే నీవు' అను ప్రసిద్ధసూత్రమున సంక్షేపింప బడినది.

ఈ విషయము ప్రతిమానవునకు నుపదేశము చేయబడు చున్నది. నీవును విశ్వపురుషుడు నొక్కరే. కనుక ప్రతియాత్మయు నీ యాత్మే; ప్రతిదేహము నీ దేహమే; ఎవరికి హానిచేసినను నీకే నీవు హానిచేసికొనినట్లు, ఎవరిని ప్రేమించినను నిన్నే నీవు ప్రేమించు

కొనినట్లు. ద్వేషప్రవాహమును వెలికి పాఱించిన తత్క్షణమే వేఱెవరి కది హానికలిగించినను, నీకుకూడ హానికలిగించును; నీనుండి ప్రేమ వెలువడునేని, అది నీయొద్దకు మరల వచ్చితీరును. ఏలయన, నేను విశ్వమును; ఈ విశ్వము నా దేహము. నే ననంతుడను. ఆ సత్యము నాకిప్పుడు ఎఱుకలో లేదు. అంతే. నే ననంతుడ నన్న యనుభూతి పొందుటకు సాధనచేయుచున్నాను. అనంతత్వానుభూతి నాకు సంపూర్ణముగా కలిగినప్పుడు పరిపూర్ణత్వము సిద్ధించును.

వేదాంతమునందలి మఱొక విశిష్టాశయ మిది: అందఱు లక్ష్య మొక్కటే. కనుక మతవిషయములో అనంతవైవిధ్యమును మన మనుమతింపవలెనే గాని అందఱను ఏకాభిప్రాయమునకు కట్టుపఱుప ప్రయత్నింపరాదు. వేదాంతి కావ్యభాషలో నుడివినట్టు, "వేర్వేఱు కొండలలో పుట్టిన పెక్కు నదులు క్రిందికి దిగి, సూటిగానో, వక్రముగానో ప్రవహించి చిట్టచివరకు సముద్రములో కలియునట్టు, విభిన్నసిద్ధాంతములు, మతములు విభిన్నదృక్పథములతో ప్రారంభమై, సూటిగానో, వక్రముగానో ప్రయాణముచేసి చివరకు నిన్నే చేరును."

ఈ సత్యమునకు నిదర్శనముగా ఈ అత్యంతప్రాచీనతత్త్వశాస్త్రము తనప్రభావముచే ప్రపంచములోనికెల్ల మొదటి ప్రచార (మిషనరి) మత మగు బౌద్ధమతమును ప్రత్యక్షముగా నుత్తేజపఱిచినది; అలెగ్జాండ్రియనుల, గ్నాస్టిక్కుల, మధ్యయుగపు ఐరోపియ తత్త్వవేత్తల మూలమున క్రైస్తవమతముపై దానిప్రభావము పరోక్షముగా ప్రసరించినది. తరువాత జర్మనుతత్త్వవేత్తల భావములపై తనప్రభావమును ప్రసరింపజేయుచు తత్త్వశాస్త్ర, మనస్తత్త్వశాస్త్రరంగములలో నది ఇంచుమించు విప్లవమునే కలిగించినది. మొత్తము ప్రపంచముపై నింతటి ప్రభావము ఇంచుమించు కంటికి కనబడనిరీతిలోనే ప్రసరించినది. రాత్రులందు నెమ్మదిగా రాలుచుండెడి మంచుబిందువులు మొక్కలకు పుష్టి

కలిగించునట్లు, ఈ దివ్యతత్త్వము మానవకోటిక్షేమముకొఱకు నిదానముగా, అనవలోకితముగా లోకమంతటను వ్యాప్తిచెందినది. ఈ మతమును బోధించుట కెక్కడకును సేనలను నడిపింపలేదు. పెద్దయెత్తున ప్రచారము సాగించిన మతములలో నొకటియగు బౌద్ధమతమున అశోకుని శాసనములు ఇప్పటికిని గలవు—బౌద్ధమత ప్రచారకులు అప్పటి నాగరకప్రపంచములో అలెగ్జాండ్రియా, ఆంటియోచ్, పర్షియా, చైనా మున్నగు పెక్కుదేశములకుపోయిన వృత్తాంతము లా శాసనములలో లిఖింపబడినవి. క్రైస్తుకు మూడు శతాబ్దములకు పూర్వమే ఆ ప్రచారకులకు పరమతదూషణమును కట్టిపెట్టు డని ఉపదేశింపబడినది: "ఏ మత మెక్కడి దయినను, సకలమతములకు ప్రాతిపదిక ఒక్కటే; చేత నయినచో దానికి సహాయపడుడు; మీకు సాధ్యమైన దంతయును బోధింపుడు. అంతే కాని వారిని హింసింప ప్రయత్నింపకుడు."

భారతదేశములో హిందువు లెన్నడును పరమతహింస కొడిగట్టలేదు. లోకములోని సకలమతములయెడ వారికి విఖ్యాత మగు ఆ అద్భుతాదరమే గలదు. హీబ్రూలు తమ జన్మస్థలమునుండి తఱుమగొట్టబడినప్పుడు వారిలో కొందఱకు హిందువు లాశ్రయ మిచ్చిరి, తత్ఫలితముగా మలబారులో యూదు లిప్పటికిని గలరు. తరువాత కొంతకాలమునకు పర్షియనుజాతి దాదాపు అంతరించి పోయిన సందర్భమున, ఆజాతికి చెందిన కొందఱను హిందువులు స్వీకరించిరి; వారు నేటికిని పార్సీ లను పేర బొంబాయిలో ఉన్నారు. వారు మాలో భాగమయి మాకు ప్రేమాస్పదులయి ఉన్నారు. జీసుక్రైస్తుదేవుని శిష్యుడగు సెయింట్ థామసుతో కలసివచ్చితిమని చెప్పుకొను క్రైస్తవులుగూడ భారతదేశమున గలరు; వారు తమ మతాభిప్రాయములను మన్నించుకొనుచు మాదేశములో నుండుట కనుమతింపబడిరి; వారు నివసించెడి ప్రాంత మొకటి ఇప్పటికిని గలదు. ఇట్టి పరమతసహనము ఇప్పటి కింకను పోలేదు. అచట అది ఇక నెప్పటికిని పోబోదు, పోజాలదు.

వేదాంతము బోధించెడి గొప్ప పాఠములలో నిది యొకటి. ఎఱుకతోనో, ఎఱుకలేకో మన మందఱము నొక్కలక్ష్యమునే చేరుకొనుటకు ప్రయత్నించుచున్నా మన్న సంగతి తెలిసినతరువాత అసహన మెందుకు? ఒకరికంటె మఱొకరు నిదానముగ నున్నంత మాత్రమున మన కసహన మక్కఱలేదు; శపింప నక్కఱలేదు; దూషింపవలసిన పని లేదు. మనకు కనువిప్పు కలిగినపుడు మన హృదయము విశుద్ధ మయినపుడు— అంతటను ఒక్క దివ్యప్రభావమే పనివడుచున్నట్టు, ప్రతి హృదయములోను ఒక్క దివ్యత్వమే ఆవిష్కార మగుచున్నట్టు స్పష్ట మగును. అప్పుడే మానవులెల్లరు మన సోదరులని మనము చెప్పుకోగలవార మగుదుము.

మానవుడు ఆత్మోన్నతి పరాకాష్ఠ నందుకొన్నప్పుడే, స్త్రీ, పురుష భేదమును, రంగు, సిద్ధాంతము, పుట్టుక మున్నగు భేదముల నతిక్రమించి, ప్రతి మానవునియందున్న దేవుని-నిజమైన మానవుని గుర్తింపగల స్థితి నందుకొన్నప్పుడే,—మానవుడు విశ్వమానవ సౌభ్రాత్రస్థాయిని అందుకొన్నవా డగును. ఆ స్థాయి నందుకొన్న మానవుడే వేదాంతి.

వేదాంతమువలన వ్యవహారమందేమి చరిత్రయందేమి కలిగిన ఫలితములలో ఇవి కొన్ని.

# వేదాంత విచార పరిణామములు

తొలుత వ్యక్తములైన మతాభిప్రాయములలో — మత మను పేరు తగని అత్యల్పభావములు కాక, మన్ననపొందుచున్న మతాభిప్రాయము లన్నిటిలో — ఈశ్వరప్రేరితజ్ఞానము, అపౌరుషేయ గ్రంథములు మున్నగువానిని గుఱించిన నమ్మకము కలదు. మొదటి మతాభిప్రాయములు ఈశ్వరభావముతో బయలు దేఱినవి: ఇక్కడ జగత్తున్నది. ఈ జగత్తు ఒకానొక పురుషునిచే సృజింపబడినది. ఈ జగత్తులో నున్న ప్రతివస్తువు అతనిచే సృజింపబడినది. తరువాతి దశలో ఈభావముతోపాటు ఆత్మను గుఱించిన ఆలోచన కలిగినది—ఇక్కడ ఈ దేహ మున్నది. ఈ దేహములో దేహమునకు భిన్నమైన దేదో కలదు అని. మనకు తెలిసినంతవఱకు మతాభిప్రాయములలోనికెల్ల ఇది ప్రాతది. దీని అనుచరులు భారత దేశములో కొలదిమంది ఉన్నారు. అతిశీఘ్రముగానే యిది విసర్జింపబడినది. భారతీయమతములు ప్రారంభమైన తీరు అనన్యసామాన్యమైనది. నిశితమైన తర్కమువలన, విశేషమైన ఆలోచనవలన, ఊహావలన మాత్రమే అట్టిదశ భారతీయమతములలో ఒకప్పుడుండె నని మనము గ్రహింపగలము. ఏస్థితిలో స్పష్టముగా మనకు భారతీయమతములు కనబడుచున్నవో అది తరువాతిదశ గాని మొదటిదశ కాదు. ప్రాథమికదశలో సృష్టినిగుఱించి యుండిన అభిప్రాయము విచిత్రము. సమస్త విశ్వము శూన్యమునుండి ఈశ్వరసంకల్పముచే సృజింపబడెను. ఈసకల ప్రపంచము ఒకప్పుడు లేకుండెను. శూన్యమునుండి ఈసర్వమును వచ్చెను. అనంతర మీ నిర్ణయము ఆక్షేపింపబడినది. శూన్యమునుండి సృష్టి ఎట్లు రాగలదు? వేదాంతమునందు ప్రారంభముననే ఈ ప్రశ్న వేయబడెను. ఈ జగత్తు ఉన్నయెడల ఇది దేనినుండియో పుట్టి యుండవలెను. ఏలనగా ఎక్కడగాని శూన్యమునుండి మఱేమియు

రా దన్న సంగతి సులభముగానే గ్రహింప వచ్చు. మానవులు తమ హస్తములతో చేయుచున్న సమస్త కృషికి వస్తు సామగ్రి కావలసియున్నది. గృహము నిర్మించినయెడల దానికి సంబంధించిన సామగ్రి అంతకుముందే యున్నది; పడవను నిర్మించినచో దానికి అవసరమైన వస్తువులు అదివఱకే ఉన్నవి; ఉపకరణము లేవేని తయారుచేయబడిన పక్షమున వానికి కావలసినవస్తువు లంతకు మునుపే ఉన్నవి. కనుక నీకార్యము సాధ్యమైనది. అందుచేత ఈ జగత్తు శూన్యమునుండి సృష్టింపబడిన దన్న తొల్లింటి అభిప్రాయము నిరాకరింపబడినది. అది సహజమే. దేనినుండియో ఈ ప్రపంచ ముత్పన్న మైన దని గుర్తించుట అవసరమైనది. నిజమునకు మతచరిత్ర అంతయు ఆమూలవస్తువుకొఱకు జరిగిన అన్వేషణే.

దేనినుండి ఈ సర్వము సృజింపబడినది? నిమిత్తకారణము (దేవుడు) అటుండనిండు. ఈ విశ్వమును దేవుడు సృష్టించె ననుట నటుండనిండు. దేనినుండి దేవు డీ విశ్వమును సృజించెను? అన్ని ప్రశ్నలలోను ఇదే పెద్దప్రశ్న. ఈ ప్రశ్నను గుఱించియే తత్త్వశాస్త్రము లన్నియు మీమాంసచేయసాగినవి. ఒకసిద్ధాంతము ప్రకారము దేవుడు, జీవుడు, ప్రకృతి — ఈ మూడు సమాంతర రేఖలవలె అనాదిగా నున్న తత్త్వములు. వీనిలో ప్రకృతి, జీవుడు పరాధీనములు; దేవుడు స్వతంత్రసత్యము. భౌతికపదార్థములోని ప్రతిఅణువువలె ప్రతిజీవుడు ఈశ్వరేచ్ఛకు పూర్తిగా అధీనుడు. తక్కిన మెట్లను పరిశీలించుటకు ముందు ఆత్మను గుఱించిన అభిప్రాయమును పరిశీలింతము. ఈ పరిశీలనవల్ల పాశ్చాత్య తత్త్వశాస్త్రమునకు వేదాంతశాస్త్రమునకు ఈవిషయమున పెద్ద భేదమున్నదని తెలియగలదు. మనస్తత్త్వశాస్త్రము భారతీయులందఱిది ఒకటే. వారి వారి తత్త్వసిద్ధాంతము లేవి అయినను మనస్తత్త్వశాస్త్రము భారతీయులందఱిది ఒకటే. అది ప్రాచీన సాంఖ్యుల మనస్తత్త్వశాస్త్రమే. దానిప్రకారము తరంగప్రసారమువలన

ఇంద్రియములు చూడగలుగుచున్నవి. అది మొదట బాహ్యేంద్రియములను తాకును. బాహ్యేంద్రియములనుండి అంతరింద్రియములకు, అంతరింద్రియములనుండి మనస్సుకు, మనస్సునుండి బుద్ధికి, బుద్ధినుండి ఆత్మ యనబడు నఖండతత్త్వమునకు ప్రసారము జరుగును. ఆధునిక శారీరశాస్త్రము (ఫిజియాలజి) వివిధములైన ఇంద్రియబోధములకు గల కేంద్రములను గుర్తించినది. దిగువ కేంద్రములు, ఉన్నతశ్రేణికిచెందిన కేంద్రములు; ఈ ఉభయ కేంద్రములు అంతరింద్రియములకు మనస్సుకు అనుగుణములుగా నున్నవి. కాని అన్ని కేంద్రముల నధీనమం దుంచుకొన గల కేంద్ర మొకటి కనుగొనబడలేదు. ఈ కేంద్రములను ఐక్యముచేయున దేదో శరీరశాస్త్రము చెప్పలేకున్నది. ఈ కేంద్రముల ఐక్య మెక్కడ? మెదడులోని కేంద్రములు వేర్వేఱు. ఇతర కేంద్రముల నన్నిటిని అదుపులో నుంపగల కేంద్ర మొక్కటియు లేదు. కనుక ఈ విషయమున భారతీయ మనస్తత్త్వశాస్త్రమున ఆక్షేపము లేకే యున్నది. స్వరూపసమగ్రతకు ఈ యేకీకరణ మవసరము. ఇంద్రియములు అందించు వానిని ప్రతిఫలింపజేయున దొకటి కావలెను. అటువంటి దొకటి లేకున్న మిమ్ముగుఱించిగాని, ఒక పటమునుగుఱించిగాని, మఱి దేనినిగుఱించిగాని నే నేమియు తెలిసి కొనజాలను. ఐక్యమునుగూర్చున దొకటి లేనియెడల మనము కేవలము చూతుము. కొంతసే పయిన తరువాత ఊపిరిపీల్తుము, అటుతరువాత విందుము. ఇట్లొకవరుసన జరుగవలసినదే. మాటాడుచున్న యొకనిమాటలను వినుచున్నంతసేపును నేనతనిని జూడనే చూడను. ఏలనగా కేంద్రములు వేర్వేఱు గనుక.

ఈ దేహము అణువులతో నేర్పడినది. ఆ అణువులను అచిత్పదార్థ మనుచున్నాము. అది జడము అచేతనము. వేదాంతులు సూక్ష్మదేహము అందురే అదియు ఇట్టిదే. సూక్ష్మశరీరము గూడ భౌతికపదార్థముతో నేర్పడినదే అని వారి సిద్ధాంతము. అది

అతి సూక్ష్మములైన అణువులతో ఏర్పడినది. సూక్ష్మదర్శినీ (మైక్రోస్కోపు) సాహాయ్యముతో కూడ దానిని చూడలేము. తన కావలనున్న వానిని తనగుండ అది కనుబఱచును (ట్రాన్స్పేరెంటు). దాని ప్రయోజనమేమి? అది సూక్ష్మశక్తుల కునికిపట్టు స్థూలదేహము స్థూలశక్తుల నిలయమైనట్లే సూక్ష్మదేహము సూక్ష్మశక్తుల నిలయము. ఆసూక్ష్మశక్తులనే మనము 'ఆలోచనయు దాని వివిధపరిణామములును' అని అందుము. దేహమున్నది. ఇది స్థూలపదార్థము, దీనిశక్తులు స్థూలములు. పదార్థమును విడిచి శక్తి ఉండలేదు. శక్తికి ఉనికిపట్టుగ పదార్థముండవలెను. కనుక స్థూలశక్తులు స్థూలదేహమునందు పనిచేయును. ఈ శక్తులే సూక్ష్మతరము లగును. స్థూలరూపములో పనిచేయుచున్న శక్తియే సూక్ష్మరూపములో పనిచేసి 'ఆలోచన'గా మాఱును. ఆ శక్తులు వేర్వేఱు కావు. స్థూలము, సూక్ష్మము అనునవి ఒక్కశక్తి దాల్చు రెండు రూపములే. సూక్ష్మ స్థూల శరీరములకును భేదము లేదు. సూక్ష్మశరీరముకూడ భౌతికపదార్థముతో ఏర్పడినదే. అది బహుసూక్ష్మపదార్థము. స్థూలదేహము స్థూలశక్తులు పనిచేయు ఉపకరణము. అదేవిధమున సూక్ష్మదేహము సూక్ష్మశక్తులు పనిచేయు ఉపకరణము. ఈ శక్తులన్నియు ఎటనుండి వచ్చుచున్నవి? వేదాంతశాస్త్రము ప్రకారము ప్రకృతియందు రెండువస్తువు లున్నవి. ఒకటి ఆకాశము. అది ఇంతంతనరానంత సూక్ష్మమైనది. రెండవది ప్రాణము, అదే శక్తి. నీవు చూచెడిది, స్పృశించెడిది, వాయువు, పృథ్వి మున్నగునవన్నియు భౌతికపదార్థములే — ఆకాశమునుండి పుట్టినవే. ప్రాణశక్తివలన అది అంతకంతకు సూక్ష్మముగానో, అంతకంతకు స్థూలముగానో పరివర్తన మొందుచుండును. ఆకాశమువలెనే ప్రాణమును ప్రతివస్తువులోనికిని చొచ్చుకొనిపోవుచు సర్వోపగతమై యున్నది. ఆకాశము జలమువంటిది. ప్రపంచములోని ప్రతివస్తువు ఆ జలముతోనే ఏర్పడి దానిమీదనే తేలియాడు

చున్న మంచుగడ్డవంటిది. ఆకాశము నీ సకలరూపములలోనికి మార్చెడి శక్తియే ప్రాణము. కండరములను కదల్చుట, నడచుట, కూర్చుండుట, మాట్లాడుటవంటి స్థూలరూపములలో ప్రాణశక్తి విలసనమునకు ఈ స్థూలదేహము ఆకాశమునుండి ఏర్పడిన ఉపకరణము. సూక్ష్మదేహముగూడ ఆకాశమునుండి ఏర్పడినదే. అది బహుసూక్ష్మరూప మైనది. ఆలోచనరూపములో ప్రాణశక్తి వ్యక్తమగుట కేర్పడినది. మొదట ఈ స్థూలదేహ మున్నది కదా. దాని వెనుక సూక్ష్మదేహ మున్నది. దాని కతీతముగా జీవుడున్నాడు. జీవాత్మే నిజమైన పురుషుడు. ఈగోళ్లు పెక్కుపర్యాయములు కత్తిరించివేయవచ్చు. కాని, ఇవి మన దేహమునకు చెందిన భాగములే గాని వేఱుగావు. మన స్థూలదేహమునకు సూక్ష్మదేహముతో గల సంబంధముకూడ నిటువంటిదే. మనస్సునకు స్థూలముగ నొకటియు సూక్ష్మముగ నొకటియునుగ రెండు దేహములు లేవు. ఉన్న దేహ మొక్కటే, అందు దీర్ఘకాలము మనగల భాగము సూక్ష్మదేహము. శీఘ్రముగా నశించెడి భాగము స్థూలదేహము. ఎన్ని మారులయినను ఈ గోళ్లు తీసివేయగలను. అట్లే ఎన్నిలక్షల పర్యాయము లయినను స్థూలదేహమును పరిత్యజింపగలను. సూక్ష్మదేహము మాత్రము నిలిచేయుండును. జీవుడు (పురుషుడు) అత్యంతసూక్ష్మస్వరూపు డని ద్వైతవాదుల మతము.

మనుష్యునికి త్వరలో నశించిపోయెడి స్థూలశరీరమును, యుగయుగములవఱకు మనగల సూక్ష్మశరీరమును, జీవాత్మయు కలవని మన కిప్పటికి స్పష్టమైనది. దేవుడు నిత్యుడైనట్లుగ జీవుడును నిత్యు డని వేదాంతశాస్త్రము చెప్పును. ప్రకృతికూడ నిత్యమైనదే. కాని, అది పరిణామశీలము కలిగి నిత్యమైనది. ప్రకృతి పదార్థములగు ప్రాణము, ఆకాశముకూడ నిత్యములైనవే. కాని, అవి వివిధరూపములలోనికి మాఱుచుండుటయు దానికి నిత్యమే.

జీవాత్మ ఆకాశమునుండిగాని, ప్రాణమునుండిగాని తయారుచేయ బడినదికాదు; భౌతికవస్తుజన్యమైనది గాదు. కనుక అది శాశ్వత ముగ నుండును. అది ప్రాణాకాశముల సంయోగసంభవ మైనది గాదు. వివిధవస్తువుల కలయికవలన ఏర్పడని దేది గాని నశింప జాలదు. నాశన మనగా మరల మూలరూపములోనికి మాఱి పోవుటే. ప్రాణమును ఆకాశమును కూడి ఈ స్థూలదేహముగ నైనవి. కనుక వానికి వీడుపాటు తప్పదు. సూక్ష్మదేహముకూడ బహుకాలమునకు నశింపగలదు. జీవాత్మ అవిభాజ్యము కనుక ఎన్నటికి నశింపదు. నాశము ఏ కారణముచేత లేదో ఆ కారణము చేతనే పుట్టుకయు జీవాత్మకు లేదు. కొన్నింటి కలయికవలన ఏర్పడని దేదో, దానికి పుట్టుక అసంభవము. అదే వాదము దీనికిని అన్వయించును. కలయికవలన రూపొందువానికి మాత్రమే పుట్టుక గలదు. కోటానుకోట్ల ఆత్మలు గలిగిన సమస్తప్రకృతియు ఈశ్వర సంకల్పమున కధీన మయి యున్నది. భగవంతుడు సర్వవ్యాపకుడు, సర్వజ్ఞుడు, నిరాకారుడు. అతడు ప్రకృతిద్వారా రాత్రింబగళ్లు పనిచేయుచున్నాడు. అది సర్వమును అతని అధీనమున నున్నది. అతడే నిత్యపరిపాలకుడు. ఇట్లని ద్వైతవాదులు చెప్పుదురు. ఈ సందర్భమున ఒకప్రశ్న కలదు: దేవుడు జగత్పరిపాలకు డయినచో, ఇంతగా చెడిన ప్రపంచము నత డేల సృజించెను? మన మింతగా ఏల బాధపడవలె? అది దేవుని దోషము కా దని వారు చెప్పుదురు. మనము బాధపడుట మనదోషమే. మన మేవిత్తనము నాటిన ఆ చెట్టు ఫలమునే అనుభవింతుము. మనలను శిక్షించుట కత డేమియును చేయలేదు. మనుష్యుడు పేదవాడుగానో, గ్రుడ్డివాడు గానో, మఱొకవిధముగానో పుట్టును. ఇందుకు కారణమేమి? అత డట్లు పుట్టుటకు పూర్వ మేదియో చేసియుండును. జీవు డెన్నడును సృష్టింపబడినవాడుకాదు; ఆత డనాదిగా నున్నవాడే. ఇంతకాలము అత డన్నివిధము లయిన పనులు చేయుచునే యున్నాడు. మన మేమి చేసినను దానిఫలితము మన పైన కలు

గును. మనము మంచిది చేసినచో మనకు సుఖము కలుగును. చెడుగు చేసినచో అసుఖము సంప్రాప్తమగును. కనుక జీవుడు బహువిధములగు పనులు చేయుచు సుఖదుఃఖము లనుభవించు చుండును.

మరణానంతర మేమి సంభవించును? జీవాత్మ స్వతస్సిద్ధముగానే నిర్మల మయిన దని వేదాంతవేత్త లెల్లరు నంగీకరింతురు. దాని స్వస్వరూపమును అవిద్య కప్పిపెట్టు నని వారు చెప్పుదురు. దుష్కర్మలవలన దాని నవిద్య కప్పివేసినట్లే, సత్కర్మలవలన అది స్వస్వరూపజ్ఞానము పొందును. అది యనంత మైనట్టే, స్వభావము చేతనే అది విశుద్ధ మయినది. ప్రతిజీవిస్వభావమును పరిశుద్ధ మయినదే.

సత్కార్యముల ఫలితముగా దానిపాపములు, దుష్టప్రవృత్తులు క్షాళితములై పోయిన పిమ్మట జీవాత్మ మరల స్వచ్ఛమగును. స్వచ్ఛత పొందిన తరువాత అది దేవయానమునకు బోవును. దాని వాగింద్రియము మనస్సునందు ప్రవేశించును. మాటలు లేక మీరు యోచన చేయజాలరు. ఎప్పుడు భావ మును నది యున్నను మాటలుకూడ ఉండవలసినదే. మాటలు మనస్సులో ప్రవేశించినట్టుగానే, మనస్సు ప్రాణములో ప్రవేశించును. ప్రాణము జీవునిలో కలియును. అంతట జీవుడు శీఘ్రముగా దేహమును విడిచిపెట్టి సూర్యమండలములోనికి పోవును. విశ్వమునం దనేక గోళము లున్నవి. ఈ పృథ్వీ ప్రపంచగోళము. ఇందు చంద్రులు, సూర్యులు, తారలు గలవు. దీని కావల సూర్యలోక మున్నది. దానికి పైన మ ఱొకటి గలదు. దానిని చంద్రలోక మందురు. దానికిని పైన మఱొక లోక మున్నది. దానిని విద్యుల్లోక మందురు. జీవు డక్కడకు బోయిన తరువాత, ఈ జీవుని గొనిపోవుటకు మఱొక జీవుడు వచ్చును. ఆ జీవు డప్పటికి పరిపూర్ణత్వము పొందినవాడయి యుండును. ఆ జీవుడు ఈ జీవుని

తోడ్కొని మఱొక లోకమునకు పోవును. అది అన్నిటికంటె పైది, దానికి బ్రహ్మలోక మని పేరు. అక్కడ జీవుడు శాశ్వతముగా నుండును. అతనికి జననముగాని, మరణముగాని ఉండదు. అతడు నిత్యానంద మనుభవించును. సృష్టిచేసెడి శక్తిదక్క, తక్కినశక్తు లన్నియు వానికి లభించును. జగత్పరిపాలకు డొక్కడే. భగవంతుడే యతడు. ఎవడును దేవుడు కాలేడు; నీవు దేవుడ వని చెప్పినచో దైవదూషణ మగు నని ద్వైతుల యభిప్రాయము. సృష్టి చేసెడి శక్తి తప్ప తక్కిన శక్తు లన్నియు జీవునకు లభించును. దేహములు ధరించి విశ్వములోని వివిధప్రాంతములలో పనిచేయవలె ననియెడి కోర్కె జీవునకు కలిగినచో, అత డట్లు చేయగలుగును. దేవత లందఱిని తనదగ్గఱకు రావలసిన దని గాని, తనపితరులు తనదగ్గఱకు రావలె నని గాని ఆ జీవు డాజ్ఞాపించినచో ఆ యానతి ప్రకారము వారు వచ్చి నిలబడుదురు. జీవుని శక్తు లంతటివి. అతని కిక బాధ యనునది లేదు. జీవుడు సంకల్పించినచో శాశ్వతముగా తాను బ్రహ్మలోకములోనే యుండగలడు. పరమోన్నతి నందుకొన్న మానవు డనగా ఇట్టివాడు; అతనికి భగవత్ప్రేమ సిద్ధించినది. అతడు సంపూర్ణముగా స్వార్థరహితు డైనాడు; సంపూర్ణముగా పరిశుద్ధు డైనాడు; సమస్త వాంఛలను త్యజించినాడు; ఈశ్వరుని ఆరాధించుట, ప్రేమించుట దక్క మఱేమి చేయుటకు నత డిష్టపడడు.

అంతటి ఉన్నతి నందుకొనని కొందఱు సత్కర్మలు చేయుట కిష్టపడుదురు. కాని, ప్రతిఫలమును కోరుదురు. పేదలకు 'ఇంత ఇచ్చుచున్నా'మని చెప్పుదురు. కాని, అందుకు ప్రతిఫలముగా స్వర్గమునకు పోవ నపేక్షింతురు. మరణించిన పిమ్మట అట్టివా రేమగుదురు? వాక్కు మనస్సులోనికి పోవును. మనస్సు ప్రాణములోనికి పోవును. ప్రాణము జీవునియందు ప్రవేశించును. జీవుడు దేహమునుండి బహిర్గతు డగును. అతడు చంద్రలోకమునకు

పోవును; అక్కడ దీర్ఘకాలము హాయిగా నుండును. అతని సత్కర్మల ఫలితము పూర్తియగువఱకు సుఖము ననుభవించును. అటుతరువాత అతడు తనకోర్కెల ననుసరించి మఱొకమాఱు భూమిలో జన్మ మెత్తును. చంద్రలోకములో జీవు డొకానొక దేవుడగు నని మన మందుము. దేవదూత యగు నని క్రైస్తవులును, మహమ్మదీయులును చెప్పుదురు. 'దేవతలు' అనుట కొన్ని పదవుల పేర్లు; దేవతల అధిపతియగు 'దేవేంద్రు' డనునది ఒకపదవికి పేరు; వేలకొలది ప్రజ లా పదవిని పొందుదురు. వేదవిహితమగు పరమోత్కృష్టకర్మలు చేసిన సత్పురుషుడు మరణించినపిమ్మట దేవేంద్రుడగును; అప్పటికి ఆ పదవిలో నున్న వాడు క్రిందికి దిగి మానవ జన్మ దాల్చియుండును. ఇక్కడ రాజులు మాఱిపోవుచుండునటులనే దేవతలును మాఱిపోవుచుందురు. దేవతలకును మరణము గల్గి తీఱును. స్వర్గములోనివా రందఱును మరణింపక తప్పదు. మరణము లేని స్థానము బ్రహ్మలోక మొక్కటే. అక్కడ జననమును లేదు, మరణమును లేదు.

ఆ విధముగా జీవులు స్వర్గమునకు పోవుదురు. వా రక్కడ హాయిగా నుందురు. అప్పుడప్పుడు అసురులుమాత్రము వారిని తఱుముచుందురు. అప్పుడప్పుడు వేల్పులను చిక్కులు పెట్టు అసురు లున్నా రని మా పురాణములలో చెప్పబడియున్నది. దేవతల, రాక్షసుల కొట్లాటలను గుఱించిన కథ లన్నిపురాణములలోను గలవు. ఒక్కొక్కప్పుడు రాక్షసులే దేవతలను జయింతురు. దేవతలు చేసినన్ని దుష్కార్యములు రాక్షసులు చేయని సందర్భము లనేకములున్నట్టు కనబడుచున్నది. ఉదాహరణకు: అన్నిపురాణములలోను స్త్రీవాంఛ విశేషముగా దేవతల కున్నట్టు కాన నగును. వారి సత్కర్మల ప్రతిఫల మనుభవించిన తరువాత దేవతలు పృథివిమీదికి మేఘములద్వారా, వర్షములద్వారా దిగి వచ్చి ధాన్యముద్వారానో, మొక్క

ద్వారానో . మొక్కనో, ధాన్యమునో మానవులు భుజించు నప్పుడు మానవదేహములలో ప్రవేశింతురు. వారు సరియైన దేహము పొందుటకు కావలసిన పదార్థమును తండ్రి యిచ్చును. ఆ పదార్థపు టుపయోగము ముగిసిన తరువాత వారు వేఱు దేహములను నిర్మించుకొనవలసియుండును. వీరు గాక—మిక్కిలి దుష్టులయిన వారు గలరు. వారు నానావిధము లగు రాక్షసకృత్యములు చేయుదురు; అట్టివారు జంతువులుగా మరల జన్మింతురు. వారు మఱింత దుష్టవర్తను లయినచో క్షుద్రజంతువులుగా పుట్టుదురు; లేదా, చెట్లుగానో, రాళ్లుగానో పుట్టుదురు.

దేవతలుగా నున్న స్థితిలో జీవులు కర్మ చేయనే చేయరు. మానవుడే కర్మ చేయును. కర్మ అనగా ఫలితము కలుగజేయు పని. మానవుడు చనిపోయి దేవత అయినప్పు డతడు కొంతకాలము సుఖ మనుభవించును. అది సుఖ మనుభవించు కాలము మాత్రమే. ఆ సమయములో అతడు క్రొత్త కర్మ చేయడు. అది యతని పూర్వ సత్కర్మకు ప్రతిఫలమే. సత్కర్మఫలానుభవ మయి పోయిన తరువాత మిగిలిన కర్మ ఫలము అనుభవమునకు రాదొడంగును. అతడు పృథ్వీమీదికి దిగును. అతడు మరల మనుష్యజన్మ మెత్తును. మిక్కిలి ఉత్కృష్టకార్యములు చేసి, పరిశుద్ధు డగు నేని అతడు బ్రహ్మలోకమునకు పోవును; తిరిగి రాడు.

క్రిందిస్థాయినుండి క్రమాభివృద్ధి పొందుచున్న జీవునకు జంతుజన్మ స్వల్పకాలమే యుండును. కొంతకాలమునకు జంతువు మనుష్యు డగును. మానవుల సంఖ్య పెరుగుచున్నకొలది జంతువుల సంఖ్య తగ్గిపోవుచున్న సంగతి గమనార్హమే. జంతువులుగా నుండిన జీవు లందఱును మానవు లగుచున్నారు. ఎన్నో జాతుల జంతువు లిప్పటికి మానవు లయినవి. కాక, అ వెక్కడకు పోయినవి?

వేదములలో నరకమునుగుఱించిన ప్రస్తావము లేదు. తరువాత రచింపబడిన పురాణములు — నరకములు లేని యెడల ఏ మతము సమగ్రము కాజాలదని భావించినవి. అంతట రకరకము లగు నరకములను సృష్టించినవి. కొన్ని నరకములలో మనుష్యులు ఱంపములతో రెండుగా కోయబడుదురు; నిర్విరామముగా చిత్రహింసకు గుఱిచేయబడుదురు. కాని, వారు చావరు. నిరంతరము దుర్భర మగు బాధ లనుభవింతురు. కాని, అది కొంత కాలమే అని గ్రంథములు దయదలచి చెప్పును. ఆ దశలో దుష్కర్మఫలానుభవ మయిపోవును. తరువాత జీవులు పృథివి మీాదికి మరల వత్తురు. వారికి మఱొక అవకాశము కలుగును. మనుష్యజన్మ గొప్పఅదృష్టము. అది కర్మదేహ మనబడును. ఈ దేహములో నున్నప్పుడే మనవిధిని నిర్ణయించుకొందుము. ఒక పెద్దచక్రములో మనము చుట్టుతిరుగుచున్నాము. అందు ఈ దశ మనభవిష్యత్తును నిర్ణయించును. కనుక ఇది అత్యంత ముఖ్యముగా పరిగణింపబడుచున్నది. దేవతలకంటెకూడ మానవుడే అధికుడు.

ఇంతవఱకు నిది అప్పటమును సరళమును అగు ద్వైతవాదము. దీనికి తరువాతిది దీనికంటె ఉత్కృష్టమగు వేదాంత తత్త్వవాదము. అది యీ ద్వైతవాదమును నిరాకరించును. ఈ జగత్తుకు ఉపాదానకారణము, నిమిత్తకారణముగూడ దేవుడే. అనంతుడగు దేవుడు, అనంతమగు జీవాత్మ, అనంతమగు ప్రకృతి కల వందు వేని, యిట్టి అనంతము లెన్నిటినయినను కల్పింపవచ్చును. ఇది కేవలము అసంగతము; తర్కము రూపుమాపినా వన్న మాట! కనుక దేవుడే ఈ విశ్వమంతటికిని ఉపాదానకారణమును, నిమిత్తకారణమును; అతడు విశ్వమును తననుండియే వెలువఱచును. అట్లగుచో, భగవంతుడు ఈ గోడలుగా, ఈ బల్లగా, పందిగా, హంతకుడుగా, లోకములోని సకలదుష్టవస్తువు

లుగా ఎట్లు అయ్యెను? భగవంతుడు పవిత్రుడని మన మనుచుందుము? మఱి అతడు చ్యుతిశీలములగు ఈ వస్తువులుగా ఎట్లు మాఱిపోగలడు? దానికి మా సమాధాన మిది: నాకు ఆత్మ, దేహము కలవు. ఒక విధముగా దేహము నాకు వేఱు కాదు. కాని, 'నేను', నిజమైన 'నేను' దేహమును కాను. ఉదాహరణకు: నేను పసిబిడ్డను, యువకుడను, వృద్ధుడను అందును. కాని, నా ఆత్మ మార్పు చెందలేదు. ఆత్మ ఆత్మగనే ఉండును. అదే విధముగా సమస్తప్రకృతితో కూడిన ఈ యఖిల విశ్వము, అసంఖ్యాకము లగు ఆత్మలు కలిసి భగవంతునికి అనంత దేహమువంటివి. అత డీ సర్వమందును చొచ్చుకొని యున్నాడు. అతడుమాత్రమే నిర్వికారుడు. కాని, ప్రకృతి మార్పుచెందుచుండును; ఆత్మ మార్పుచెందుచుండును. ప్రకృతియందును, ఆత్మయందును కలుగు మార్పులవలన అతడు మార్పు చెందడు. ప్రకృతి యే విధముగా మార్పు చెందును? దాని రూపములలో మార్పు చెందును; అది క్రొత్తరూపములు ధరించును. ఆత్మ ఆ విధముగా మార్పు చెందజాలదు. జ్ఞానమునందు ఆత్మ సంకోచవికాసములు పొందుచుండును. దుష్కార్యములవలన అది సంకోచము పొందుచుండును. ఆత్మకు సత్యమును స్వాభావికము నగు జ్ఞానమును, ఆత్మ పావిత్ర్యమును కుంచింపజేసెడి చేష్టలు దుష్కార్యములు. ఆత్మకు సహజసిద్ధమైన వైభవమును వ్యక్తముచేసెడి పనులు సత్కార్యములు. ఈ యాత్మ లన్నియు స్వచ్ఛము లైనవే. అవి సంకోచము పొందినవి; ఈశ్వరకృపవలన, సత్కార్యములవలన అవి వ్యాకోచము పొంది తమకు స్వతస్సిద్ధమగు పావిత్ర్యమును మరల ప్రాపించును. అందఱకును సమానావకాశములు గలవు. ఎప్పుడో ఒకప్పుడు ప్రతిజీవియు విముక్తి పొంది తీఱును. కాని, ఈ విశ్వ మంతరింపదు. ఏల యన ఇది నిత్య మయినది. ఇది రెండవ వాదము. మొదటిది ద్వైతవాదము. రెండవ వాదము ప్రకారము దేవుడు, జీవుడు, ప్రకృతి గలవు. జీవుడును, ప్రకృతియు

దేవునికి దేహములుగ నుండును. కనుక ఈ మూడును ఒక్కటియే. ఈ వాదము మతములో పైమెట్టు సూచించును. దీనికి విశిష్టాద్వైతవాద మని పేరు. ద్వైతవాద మీ విశ్వమును భగవంతుడు కదలించిన యంత్రముగా భావించును. విశిష్టాద్వైతవాదము విశ్వము అంగక్రమముతో గూడిన నిర్మాణ మనియు అం దంతటను ఈశ్వరుడు వ్యాపించియున్నా డనియు పరిగణించును.

కడపటివారు అద్వైతులు. దేవుడు విశ్వమునకు ఉపాదాన కారణమును నిమిత్తకారణమును కూడ నగు నను విషయమును వారును ప్రస్తావింతురు. దేవుడే ఈ విశ్వ మయ్యెను. ఆ విషయమును కా దనుట లేదు. దేవుడు ఆత్మ యని, ప్రపంచము దేహ మని, దేహము మార్పుచెందుచుండు నని, దేవుడు నిర్వికారు డని యితరులు చేయు వాద మంతయు అర్థరహిత మని అద్వైతవాదులు చెప్పుదురు. అట్లగుచో భగవంతుడు ప్రపంచమునకు ఉపాదాన కారణ మని చెప్పు టెందుకు? ఉపాదానకారణ మనగా, కార్యముగా మాఱిన కారణము; కార్య మనునది కారణమునకు మఱొకరూపమే. కార్యము కనబడినచోట నెల్ల అది పునరుత్పాదితమయిన కారణమే. విశ్వము కార్యమే అయి, దానికి ఈశ్వరుడు కారణమే అయినయెడల, ఈశ్వరుడే విశ్వముగా ఉత్పన్ను డాయె నని అర్థము. విశ్వము దేవుని దేహ మని, దేహము సంకోచము పొంది, సూక్ష్మరూపము దాల్చి కారణ మగు నని, దానినుండి ఈ విశ్వము రూపొందె నని నీవు చెప్పుదువేని, దేవుడే విశ్వ మయ్యె నని అద్వైతులు చెప్పుదురు. ఇక్కడ ఒక సూక్ష్మప్రశ్న పుట్టును. దేవుడే ఈ విశ్వముగా మాఱినచో, మీరును ఈ సకల జీవులును దేవుడే అన్న మాట. నిజమే. ఈ పుస్తకము దేవుడు. ప్రతివస్తువు దేవుడే. నా దేహము దేవుడు. నామనస్సు దేవుడు. నా ఆత్మ దేవుడు. అగుచో ఇందఱు జీవు లేల ఉన్నారు? దేవుడు కోట్లకొలది జీవులుగా విభక్తు డయ్యెనా?

ఒక్క దేవుడు కోట్లకొలది జీవులుగా మాఱిపోవునా? అగుచో అ దెట్లు సంభవించెను? ఆ యనంతశక్తిని అనంతపదార్థమును విశ్వమున కెల్ల ఒక్కసత్తును విభజింప నెట్లు శక్య మగును? అనంతమును భాగములుచేయుట అసాధ్యము. శుద్ధసత్తు ప్రపంచముగ నెట్లయ్యెను? అతడు విశ్వముగా మాఱినమాట నిజమే యగుచో అతడు మార్పుచెందుచుండు నని యర్థము. అతడు మార్పుచెందుచుండునేని ప్రకృతిలోని భాగమే యగును. ప్రాకృతమును పరిణామశీలము నగు దానికి జనన మున్నది, మరణ మున్నది. మన దేవుడుకూడ పరిణామశీలుడే యగుచో ఎన్నడో ఒకనాడు అతనికి మరణము కల్గి తీఱ వలెను. ఆవిషయమును గుర్తింపుడు. మఱొక అంశము : భగవంతునిలో ఎంతభాగము విశ్వ మయ్యెను? 'ఎక్స్' అని చెప్పిన యెడల ఇప్పుడు దేవు డనగా ఎక్స్ పోగా మిగిలిన దేవు డనుట. అతడు సృష్టికిపూర్వమం దున్న దేవుడు కాడు. ఏల యన, ఆయనలో అంతభాగము విశ్వముగా మాఱిపోయినదికదా.

అందుచేత, "జగత్తు లేనే లేదు ; ఇదంతయు భ్రాంతి." అని అద్వైతుల వాదము. "అఖిలవిశ్వము, దేవతలు, దేవుళ్లు, దేవునిదూతలు, చచ్చుచుపుట్టుచున్నసకలేతర జీవులును, లేచుచు పడుచునున్న అసంఖ్యాకు లగు ఆత్మలును, ఇ వన్నియు స్వప్నములు." అని వారు చెప్పుదురు. జీవు డసలు లేనే లేడు. అనేక జీవుల యునికి ఎట్లు పొసగును? అది ఏకైకమైన, అనంతము. ఒక్క సూర్యుడు పెక్కు జలాశయాలలో ప్రతిఫలించి అనేకసూర్యులుగా తోచును. కోట్లకొలది జలబిందువులు కోట్లకొలది సూర్యులను ప్రతిబింబించును. ప్రతి జలబిందువు సూర్యుని సంపూర్ణ ప్రతిబింబ మగును కాని, ఉన్న సూర్యు డొక్కడే. అదే విధముగా జీవు లందఱును అనేకమనస్సులలోని ప్రతిబింబములు. ఈ మనస్సులు ఒక్క సత్తను ప్రతిబింబించు వివిధానేక గోళములు. ఈ జీవు లందఱిలో భగవంతుడు ప్రతిఫలించుచున్నాడు. కాని,

సత్యము లేకున్నచో స్వప్నము గలుగదు. అనంతమైన ఆ యేక సత్తే సత్యము. దేహముగా, మనస్సుగా, ఆత్మగా నీవు స్వప్నమవే. కాని, నీ యథార్థస్వరూపము సచ్చిదానందము. ఈ జగత్తుకు దేవుడవు. నీవే ఈవిశ్వమును సృజించుచు, తిరిగి లోనికి గొనుచున్నావు.—ఇదియే అద్వైతి చెప్పునది. ఈ జన్మలు, పునర్జన్మలు, ఈ రాకపోకలు కేవలము మాయాకల్పితములు. నీవనంతుడవు. నీ వెక్కడకు పోగలవు? సూర్యుడు, చంద్రుడు, సమస్త ప్రపంచము నీ సర్వాతీత స్వరూపమందలి బిందుమాత్రములు. నీవు పుట్టుటయు, గిట్టుటయు ఎట్లు పొసగును? నే నెన్నడును పుట్టలేదు, పుట్ట బోవను. నేను సచ్చిదానందమను కదా! కనుక నాకు తల్లి లేదు, తండ్రి లేడు, మిత్రులు లేరు, శత్రువులు లేరు. 'సోఽహం' 'సోఽహం' నే నా పరాత్పరుడనే. కనుక ఈ తత్త్వవాదము ప్రకారము లక్ష్య మేమి? ఈజ్ఞానము పొందినవారికి విశ్వముతోడి ఐక్యము అనుభూత మగును. వారికి సకలస్వర్గములు, బ్రహ్మలోకముసైతము సమసిపోయినవి. స్వప్నము పూర్తిగా మాయ మగును. వారు నిత్యుడగు విశ్వస్వామి తామే అని తెలిసికొందురు. వారు అనంతచిదానందాత్మకమును యథార్థము నగు వ్యక్తిత్వమును పొంది ముక్తు లగుదురు. అల్పవిషయములందు ప్రీతి నశించును. మన మిప్పు డీ దేహమునందు, సంకుచితవ్యక్తిత్వమందు ప్రీతిని పొందుచున్నాము. ఈ విశ్వ మంతయు నా దేహమయినప్పుడు కలిగెడి ఆనంద మిం కెంత హెచ్చుగా నుండును! ఒక్క దేహములో సుఖ మున్నయెడల, అన్ని దేహములు నావి అయినప్పుడు సుఖ మింకెంత యధికముగా నుండును! అప్పుడు ముక్తుల మగుదుము. ఇదియే అద్వైతవేదాంత సిద్ధాంతము.

ఇంతవఱకు చెప్పిన మూడు వాదములను మూడు సోపానములుగా వేదాంతతత్త్వశాస్త్రము ప్రతిపాదించినది. వీనిని అతిక్రమించి పోలేము. ఏకత్వమును దాటిపోవుట సాధ్యము కాదు.

విజ్ఞానశాస్త్రము 'ఐక్యము'ను చేరుకొన్న పిదప ఏవిధముగాను, అది యింకను ముందుకు పోజాలదు. ఈ నిర్గుణతత్త్వమును మీ రతిక్రమింపజాలరు.

అద్వైతవాదము నందఱును అందుకోజాలరు; అది కఠిన మయినది. మొదటి విషయము: అది బుద్ధిగ్రాహ్యమగుటయే కష్టము. దాని నవగాహన చేసికొనుటకు నిశితమైన బుద్ధి, సాహస ముతో గ్రహింపగలశక్తి కావలె. రెండవ విషయము: అత్యధిక సంఖ్యాకప్రజల కది సరిపడదు. అందుచేతనే ఈ మూడు మెట్లున్నవి. మొదటి మెట్టుతో ప్రారంభింపవచ్చును. దానిని మననము చేయుచు, జిజ్ఞాస సాగింపగా, రెండవమెట్టు గోచరించును. జాతి పురోగమించునట్లుగానే వ్యక్తులును పురోగమింపవలె. మత విషయములలో మహోన్నతము లయిన భావశిఖరముల నందు కొనుటకు మానవజాతి ఏయేసోపానము లెక్కినదో ప్రతివ్యక్తియు ఆసోపానముల నధిరోహింపవలె. ఒక్క భేదము మాత్రముకలదు. ఒకమెట్టునుండి మఱొకమెట్టు ఎక్కుటకు జాతి కనేకలక్షలసంవత్స రములు పట్టును. మానవజాతి గడపిన జీవిత మంతటిని వ్యక్తి బహుస్వల్పకాలములో ఇముడ్చుకోవచ్చు. కాని, మనలో ప్రతి ఒక్కరము ఈ సోపానముల నధిరోహింపవలసినదే. మీలో అద్వైతవాదులు ఒకప్పుడు తా మెంత పట్టుదలతో ద్వైతవాద మును నమ్మియుండినదియు జ్ఞప్తికి తెచ్చుకొండి. నేను దేహమను, మనస్సును అని అనుకొనగానే ఈ స్వప్నమంతటిని వాస్తవముగా పరిగ్రహించితీరవలసినదే. ఒకభాగ మంగీకరించినచో మొత్త మంగీకరింపక తప్పదు. ఇదిగో, ఇక్కడ ప్రపంచ మున్న దని చెప్పుచు భగవంతుని సగుణునిగా అంగీకరింపని వాడు మూఢులు; ప్రపంచము కల దని యంగీకరించెడి పక్షమున ప్రపంచమునకు కారణ ముండి తీర వలె. ఆ కారణమే దేవుడు. కారణ మున్న సంగతి తెలిసికొనవేని కార్యము గల్గ జాలదు. ప్రపంచము

అంతరించినప్పుడే భగవంతుడును మాయమగును ; అప్పుడు మీరే భగవంతు లగుదురు ; ఇక మీకు ప్రపంచ ముండదు. మీరు దేహామే అనుకొన్నంతకాలము మీరు పుట్టుచున్నట్లు, గిట్టుచున్నట్లు కననగుచుండును ; కాని, ఆ స్వప్నము పోయినప్పుడు మీరు పుట్టుచున్నా మని చచ్చుచున్నా మని అనుకొనెడి స్వప్నముకూడ పోవును. ప్రపంచ మనెడి దొకటి కల దన్న స్వప్నముకూడ పోవును. మన కిప్పుడు ప్రపంచముగా కనబడుచున్నది అప్పుడు దేవుడుగా కనబడుచుండును. ఇంతవఱకును మనకు వేఱుగా నున్న దేవు డిక మన లోపలనే మన ఆత్మగా అనుభూతి కలుగును.

# సాధన పథము

(అమెరికాలో క్లాసు గదిలో చేసిన ఉపన్యాసము)

జ్ఞానసాధకునకు కావలసిన యోగ్యతలలో ప్రప్రథమము లయినవి శమము, దమము. ఈ రెంటిని కలిపియే మనము కొన వచ్చును. శమదమము లనగా ఇంద్రియములను వెలికిపాఱనీక వానిస్థానములందే ఉంచుట. ఇంద్రియ మన నేమో ముందు వివ రించెదను. ఇవిగో, కన్ను లున్నవి; ఈ కన్నులు దృగింద్రియములు గావు; ఇవి యుపకరణములు మాత్రమే. ఈ యుపకరణము లున్నను ఇంద్రియములు లేని యెడల నేను చూడ జాలను. ఇంద్రియములు, ఉపకరణములు ఉన్నను మనస్సు వీనితో కూడ నిచో చూచుట జరుగదు. కనుక చూచుటకు ముఖ్యముగా కావలసినవి మూడు :— మొదటిది, బాహ్యోపకరణములు రెండవది, అంతరింద్రియములు; కడపటిది, మనస్సు. వీనిలో నే యొక్కటి లోపించినను చూచుట జరుగదు. కనుక మనస్సు రెంటిద్వారా పనిచేయును: ఒకటి, వెలుపలిది, మఱొకటి లోప లిది. నేను వస్తువులను చూచునప్పుడు నామనస్సు వెలి కేగును, తాను వెలుపటి దగును. నేను కన్నులు మూసికొని, ధ్యానము చేయుచున్నా ననుకొనుడు. అప్పుడు మనస్సు బహిర్ముఖముగాక, అంతరమున పనిచేయుచున్నది. కాని, ఉభయసందర్భములలోను ఇంద్రియములు పనిచేయుచున్నవి. నేను మీవైపు చూచునప్పుడు, మీతో మాటాడునప్పుడు ఇంద్రియములు ఉపకరణములు, పని చేయుచున్నవి. నేను కన్నులుమూసికొని, ధ్యానింప ప్రారంభించి నప్పుడు ఇంద్రియములే పని చేయును; ఉపకరణములు పని చేయవు. ఈయింద్రియములు పనిచేయనియెడల ధ్యానమే యుం డదు. ఏదో ఒక సంకేతము లేక మీలో నెవరును ధ్యానింపలేరు. గ్రుడ్డివాడుగూడ ఏదో ఒక రూపపుసాయముతోనే ధ్యానింప

Acc
CUDDAP

వలెను. సాధారణముగా నేత్రేంద్రియములు, కర్ణేంద్రియములు మిక్కిలి చురుకు గల్గి యుండును. ఇంద్రియ మనగా మెదడులోని నాడీకేంద్రమే అర్థమని మీరు జ్ఞప్తియం దుంచుకొనవలెను. కన్నులు, చెవులు చూచుటకు, వినుటకు ఉపయోగపడు ఉపకరణములుమాత్రమే. ఇంద్రియములు లోపల నున్నవి. ఏకారణము చేతగాని ఆయింద్రియములు పాడయిపోయినయెడల, ఈకన్నులును, చెవులును ఉన్నను మనము కన లేము, విన లేము. అందుచేత మనోనిగ్రహము నలవఱచుకొనుటకు ముందు మన మీ యింద్రియములను నిగ్రహింప గల్గి యుండవలెను. మనస్సును వెలికి గాని, లోనికిగాని చలింపనీకుండుటయు, ఇంద్రియములను వాని స్థానములలో నుంచుటయునే శమము, దమము అను మాటల కర్థము. మనస్సును బహిర్ముఖము కానీకుండుటకు శమ మని పేరు. బాహ్యోపకరణముల నదుపులో నుంచుటకు దమ మని పేరు.

తరువాతిది ఉపరతి: ఇంద్రియవిషయములను గుఱించి తలంపకుండుటకే ఉపరతి యని పేరు. మనకాలము చాలవఱకు ఇంద్రియవిషయములనుగుఱించిన తలంపులతోనే గడచిపోవుచుండును. మనము కన్న విషయములను, విన్న విషయములను, కనబోవు విషయములను, వినబోవు విషయములను, ఇదివఱలో భుజించిన వస్తువులను, ఇప్పుడు భుజించుచున్న వస్తువులను, ఇక భుజింపబోవు వస్తువులను, మన మిదివఱకు నివసించిన స్థలములను గుఱించియు, ఇంకను ఇటువంటి విషయములను గుఱించియు తలంచుటతో కాలహరణమయి పోవుచుండును. మన కాలములో చాలవఱకు వానిని గుఱించి ధ్యానించుచుందుము; లేదా, ముచ్చటించుచుందుము. వేదాంతి కాగోరువాడు ఈ యభ్యాసమును విడిచిపెట్టవలె.

అనంతరము చేయదగిన సాధన (తత్త్వజ్ఞాని యగుట దుస్తరమగు పని!) తితిక్ష. అన్నిటిలో నిది మిక్కిలి కఠిన మయినది.

"పాపమును ప్రతిఘటింపకుడు" — అను క్షమాదర్శమున కిది తక్కువది కాదు. దీనికి కొంతవివరణ మవసరము. మనము పాపమును ప్రతిఘటింపక పోవచ్చు. కాని, మనసులోపల చాల దుఃఖపడవచ్చును. ఒకడు నాతో పరుషముగా మాట్లాడ వచ్చు; అందుకు నే నతనియెడల ద్వేషమును వెలికి కనబఱుపకపోవచ్చు; మాటకు మాట నే నతనికి బదులుచెప్పక పోవచ్చు; పైకి కోప పడినట్లు కనబడనీయక అడచుకొనవచ్చు. కాని, కోపము, ద్వేషము నా మనస్సులో నుండ వచ్చు; అతనిగూర్చి చాల ప్రతి కూలాభిప్రాయము నా కుండ వచ్చు. ఇది ప్రతిఘటింపకపోవుట కాదు; నాలో ద్వేష ముండ రాదు, కోపావేశ ముండ రాదు, ప్రతిఘటనతలంపే ఉండ రాదు; ఏమియు జరగనప్పు డున్నంత ప్రశాంతముగా నా మనస్సు ఉండవలె. ఆ స్థితికి నేను వచ్చినప్పుడే ప్రతిఘటన నాకు లేదని చెప్ప వలె; అంతవఱకును చెప్పరాదు. ప్రతిఘటనభావ మే కోశమునను లేకుండ, నివృత్తి చేసికొనవలె నను తలంపు లేకుండ, మనస్సులో దుఃఖము గాని, బాధ గాని లేకుండ సమస్తదుఃఖమును భరింప గలుగుటయే తితిక్ష. నేను ప్రతిఘటింప ననుకొనుడు. ఆ కారణముచేత పెద్దఅనర్థము సంభవించు నను కొనుడు; నాకు తితిక్షయే ఉన్నయెడల 'నేను ప్రతిఘటింపక పోతినే' అన్న పశ్చాత్తాపము కలుగకూడదు. అంతటి స్థితి పొందిన తరువాత మనస్సు తితిక్షయందు సుప్రతిష్ఠిత మయినట్టు. తితిక్ష నలవఱచుకొనుటకు భారతదేశములోని వారు అసాధారణ క్రమముల ననుష్ఠింతురు. నిర్లక్ష్యముగా తీవ్రమయిన శీతోష్ణము లను భరింతురు. మంచును సైతము వారు లెక్కచేయరు. దేహ చింతను వారు విడనాడుదురు; దేహ మేదో పరాయివస్తు వయి నట్టు దానిని దానికే వదలివేయుదురు.

పిదప సాధింపవలసిన యోగ్యత శ్రద్ధ. దేవునియందును, ఆస్తిక్యమునందును అత్యంత విశ్వాస ముండవలె. అది కుదుర

వలకు జ్ఞాని యగుట కాశించుటకే వీలు లేదు. లోకమున రెండు కోట్లమందిలో నొక్కరి కయినను దేవునియందు విశ్వాసము లే దని ఒకమహాత్ముడు నాతో ననెను. ఏల యని నే నడిగితిని. ఆయన యి ట్లనెను : "ఈ గదిలో దొంగ ఉన్నా డనుకొందము. ప్రక్కగదిలో పెద్ద సువర్ణరాశి కల దని అతనికి తెలిసిన దను కొందము. రెండుగదులకు మధ్య పలుచని చెక్క అడ్డుగా నున్న దనుకొందము; అప్పుడు చోరుని మన స్సె ట్లుండును?" నేను, "వానికి బొత్తిగా నిద్ర పట్టదు. ఏ విధముగా ఆ బంగారమును హరింతమా యన్న ఆలోచన దక్క వాని మనస్సులో మ ఱేమియు నుండదు" అంటిని. అంతట ఆయన యి ట్లనెను : "దేవునియందు విశ్వాసము కలిగియు, అతనిని పొందుటకు పిచ్చెత్తని వా డుండు నని యనుకొందువా? అనంతబ్రహ్మానంద మున్న దని, దానిని పొందుట సాధ్య మని చిత్తశుద్ధితో నమ్ముచున్నవాడు, దానిని పొందుటకు పాటుపడుచు వెఱ్ఱెత్తినవాడు కాకుండునా? శ్రద్ధ అనగా ఈశ్వరునియందు గాఢవిశ్వాసమును, అతనిని పొందవలె ననెడి యుబలాటమును.

శ్రద్ధకు తర్వాతిది సమాధానము, అనగా మనస్సును భగవంతునియందు లగ్నము చేయు నభ్యాసము. ఒక్కదినములో నే పనియు కాదు. మత మనునది మాత్రగా మ్రింగుటకు వీ లయి నది కాదు. మతమునకు నిరంతరకఠోరసాధన కావలె. నిదానము గాను, క్రమశిక్షణచేతను మాత్రమే మనస్సును జయించుటకు వీ లగును.

తరువాతిది ముముక్షుత్వము. బంధవిముక్తి కలుగవలె ననియెడి తీవ్రాశ ముముక్షుత్వము. మీలో కొందఱు ఎడ్విను ఆర్నాల్డు రచించిన "లైట్ ఆఫ్ ఏషియా" చదివియుందురు. వారికి బుద్ధుడు చేసిన మొదటి ధర్మోపదేశపు ఈ క్రింది అను వాదము జ్ఞప్తియం దుండ వచ్చు :

''ఇది యొకచక్రంబె యీ నీదు బ్రతుకు,
శోకాలె కమ్మలై శోభిల్లు నిందు,
కన్నీరె చక్రాన కంచుగా నొప్పు,
శూన్యంబె యిరుసుగాఁ జొప్పడుఁ జూవె,
మరణంబు జననంబు పరఁగఁ గాంచుచును,
నీవు చెందెడి దుఃఖనీరధి కీవె
కారకుండవు, వేఱు కర్త తా లేఁడు.'' *

మన దుఃఖ మంతయు మనము కోరి తెచ్చుకొన్నదే; మన ప్రకృతి యటువంటిది. చైనాదేశములో అఱువదిసంవత్సరములు కారాగారమున బంధింపబడిన యొకవృద్ధుని నూతనచక్రవర్తి పట్టాభిషేకమహోత్సవసందర్భమున విడుదల చేసిరి. అతడు బయటికి వచ్చి 'ఇక బ్రతుకలేను, ఘోరకారాగారమున చిట్టెలుకల, చుంచెలుకల మధ్యకు పోవలసినదే. వెలుతురు నాకు దుస్సహముగ నున్నది' అని ఆక్రందించినాడు. అందుచేత అతడు 'నన్ను చెఱసాలలోనికై నను పంపివేయుడు; లేదా చంపివేయు' డని మొఱపెట్టుకొనెను. అతనిని కారాగారమునకు తిరిగి పంపివేసిరి. మానవు లందఱి పరిస్థితి సరిగా నిదే విధముగా నున్నది. నానావిధదుఃఖముల వెంటపడుచుందుము; వానినుండి బయటబడుట కిష్టపడకుందుము. అనుదినము మనము సుఖము వెంబడి పరువులిడుచుందుము. అది మనకు లభింపకమునుపే అదృశ్యమై పోవుచున్నది. అది మన వ్రేళ్లసందున జాఱిపోవును. కాని, వెఱ్ఱి వ్యసనముల మనము విడిచిపెట్టము. విడువక, ముందుకే పాఱు చుందుము. మన మంధులమును మూర్ఖులమును కనుక.

భారతదేశములో నువ్వులనుండి నూనె తీయు గానుగలను త్రిప్పుటకు ఎడ్లను కట్టుదురు. ఎద్దు మెడపై

* పద్యానువాదము : నే. భ.

యుండును. కాడినుండి ముందుకు పొడుచుకొని వచ్చినట్లుగా ఒక కొయ్యతునుక యుండును. దానికి కొంత గడ్డి వ్రేల కట్టబడియుండును. ఎద్దుకన్నులకు కట్టబడియున్న గంతవలన ఎద్దు ముందుకే చూడగలదు; గడ్డినందుకొనుటకు అది మెడను ముందుకు చాచును; చాచినప్పుడు ఆ కొయ్యతునుకను ముందుకు త్రోసినట్లగును. ఇట్టి ప్రయత్నమును అది మరల మరల చేయుచుండును. కొయ్యతునుకకు త్రోపుడు గల్గుచునే యుండును. అది గడ్డిని అందుకోలేదు కాని, అందుకొను ఆశతో చుట్లు తిరుగుచుండును. ఆ తిరుగుటలచే గానుగ ఆడి నూనె వచ్చును. అటులనే మీరును, నేనును ప్రకృతికి ధనమునకు సంపదకు పత్నులకు పుత్త్రులకు బానిసలముగ పుట్టియున్నాము. గడ్డిచుట్టను వట్టిభ్రాంతులను సదా వెంటాడుచున్నాము. మనము తిరుగుచుట్లే మన మొత్తు లెక్కకు మిక్కిలియైన జన్మములు. మనము కోరునవేమో మనకు లభింపవు వలపే ఈ పెద్ద కల. వలచుటయు వలవబడుటయు మన అందఱి లక్ష్యము. మనకు కావలసినదీ సుఖము, ఎప్పుడు గాని దుఃఖము గల్గకుండుట. కాని, సుఖమువంకకు మనము పోవు కొలదియు అది మనకు దూరమై పోవుచున్నది. ప్రపంచగతి యీ విధముగా నున్నది; సంఘముకూడ ఇటులనే సాగిపోవుచున్నది. అంధులము బానిసలము అగు మనము, తెలిసికొనలేక శ్రమపడవలసియున్నది. మీ జీవితములను పరిశీలించుకొనుడు. అందు సుఖ మెంత పూర్ణానుస్వారమో గమనింపుడు. లోకప్రవృత్తి అనెడి యీ అడవిబాతు వేటలో నిజమునకు మీకు గల్గిన లాభ మెంత శూన్యమో గుర్తింపుడు.

సోలను, క్రీససుల కథ మీకు జ్ఞాపక మున్నదా? ఆసియా మైనరు చాల సుఖప్రదమైన ప్రదేశ మని రాజు ఆ మహర్షితో అన్నాడు. "అందఱికంటె ఎక్కువగ సుఖపడుచున్నవాడు ఎవడు? మిక్కిలి సుఖపడుచున్నవానిని నే నెన్నడును చూడ లేదు" అని

ఋషి యనెను. "అది యర్థములేని మాట. లోక మంతటికిని నేనే ఎక్కువ సుఖిని." అని క్రీసను అనెను. "ఆగు, జీవితము చివరవఱకు వేచియుండు, వేగిరపడకు." అని ఋషి చెప్పి వెడలి పోయెను. కొంతకాలమునకు పర్షియనులు ఆ రాజును జయించిరి, సజీవముగ నతనిని కాల్చివేయవలసిన దని ఆజ్ఞాపించిరి. అందుకు చితి పేర్చబడినది. ఆ చితిని క్రీసను చూచి, "సోలన్, సోలన్" అని యెలుగెత్తి యేడ్చెను. ఎవరిని పిలుచుచున్నావని యడుగగా అతడు జరిగిన కథ చెప్పెను. పర్షియను రాజు మనసు కరిగి క్రీసను ప్రాణము రక్షించెను.

మనలో ఒక్కొక్కరి జీవితగాథ యిటువంటిదే; మనమీద ప్రకృతికి గల ప్రచండప్రభావ మంతటిది. మాటిమాటికి అది మనలను పడద్రోయుచుండును. కాని, తీవ్రావేశముతో మనము దాని వెంట బడుచుందుము. అడియాస యగుచున్నను మన మాశ వదలుకోలేక పోవుచున్నాము; ఈ ఆశ, ఈ భ్రాంతి మనకు పిచ్చెత్తించుచున్నది; నిరంతరము సుఖముకొఱకు మన మారాటపడుచున్నాము.

పూర్వకాలమున భారతదేశమున ఒక గొప్ప రాజు ఉండెను. అతనిని నాలుగు ప్రశ్నలు అడిగినారు. వానిలో ఒకటి: "ప్రపంచములో అన్నిటికంటె అద్భుత మైన దేది?" "ఆశ" అని యతని సమాధానము. ఇది యత్యద్భుతమైనది. రాత్రింబగళ్లు మనచుట్టు ఎందఱో చనిపోవుట మనము గమనించుచున్నాము. అయినను చావు మనకు లే దని అనుకొందుము. మరణింతు మని ఎప్పుడును అనుకొనము. మనము బాధలుపడవలసి వచ్చు నని యనుకొనము. ప్రతివ్యక్తియు జయము తనదే అని యనుకొనును. ఆశతో స్పర్ధించు ఆశ గల్గియుండును, ఎన్ని ప్రతిబంధకము లున్నను, హేతువాదము 'తు' 'చ' తప్పక తనకు ఎంత వ్యతిరేకముగా నున్నను ఆశ గల్గియే యుండును. నిజమున

కిక్కడ సుఖ మెవరికిని లేదు, ఎప్పుడును లేదు. ఒకడు సంపన్ను డయి, తినుటకు పుష్కలముగా నున్నచో అతని జీర్ణకోశము పాడయియుండును. అతడు తినలేడు. ఒకనికి జీర్ణశక్తి బాగున్నను, సముద్రపుకాకివలె జీర్ణించుకోగల్గియున్నను అతనికి తినుట కేమియు నుండదు. ధన మున్న, బిడ్డ లుండరు. ఆకలితో మాడి పోవుచున్న పేదవానికి ఇంటినిండుగ పిల్ల లుందురు. వారిని పెట్టు కొని ఏమిచేయుటకును అతనికి పాలుపోకుండును. ఇట్లుండుట కేమి హేతువు? హేతువిది:—సుఖమును, దుఃఖమును ఒక నాణెపు టిరు వైపుల వంటివి. సుఖము నపేక్షించువాడు దుఃఖము గూడ భరింపవలసినదే. దుఃఖపు కర్తి లేని సుఖమును పొంద గల మని మన అందటి వెఱ్ఱితలంపు. ఈ తలంపునకు మన మెంత వశపడి యున్నా మనగా, ఇంద్రియములను అదుపులో ఉంచుకోలేనివార మగునంత.

నేను బోస్టనులో నుండగా ఒకయువకుడు నాదగ్గఱకు వచ్చి చిన్న కాగితము నిచ్చెను. దానిపై పేరు, చిరునామాతోపాటు క్రింది మాట లున్నవి: "లోకములోని ఐశ్వర్య మంతయు, సౌఖ్య మంతయు నీకు దక్క గలవు. కాని వాని నెట్లు పొంద వలెనో అది నీకు తెలిసియుండవలె. నీవు నాదగ్గఱకు వత్తువేని వాని నెట్లు పొంద నగునో నేను బోధింతును. ఇందుకు ఛార్జి అయిదు పౌనులు." ఇందుకు నీ వే మనియెద వని యతడు న న్నడిగెను. అంతట నే నిట్లంటిని: అబ్బాయి, ఈ చీటిని అచ్చు వేయుటకు కావలసిన పైక మేల తేవైతివి? దీని అచ్చుకు కావలసి నంత రొక్కమైనను నీయొద్ద లేదే!

ఈమాట లతనికి అర్థము కాలేదు. అపారధనమును సౌఖ్య మును శ్రమపడ నవసరము లేక సంపాదింప వచ్చు నను పిచ్చి అతనికి పట్టుకొన్నది. జనులు రెండు విపరీతభావములలో పడి పోవుచున్నారు. అంతయు చక్కగా మెఱుగుగా ప్రశస్తముగా

నున్నంతవఱకు 'సర్వము మేలునకే' అను విశ్వాసశిఖరమున కెక్కెదురు. ప్రతిదియు ప్రతికూలముగ నున్నప్పుడు "సర్వము కీడునకే" అన్న దిగులుటగాధమున కూలుదురు. ఎక్కువ మంది జనులమనస్సులు ఇంచుమించు వికాసరహితములే. చక్కగా వికసించిన మనస్సుగలవాడు పదిలక్షలకొక్క డుండును. తక్కిన వారు విపరీతధోరణిగలవారుగనో, ఏదో ఒక్కవిషయమునే పట్టుకొని, పిచ్చిగా ఆలోచించెడివారుగనో ఉందురు.

ఒక్క 'అతి' నుండి దానికి విపరీతమైన 'అతి'కి పరుగు లెత్తుట మన స్వభావము. యౌవనము, ఆరోగ్యము గల్గియున్నప్పుడు ప్రపంచములోని సమస్తైశ్వర్యము మనకేదక్కగల దనుకొందుము.

బంతివలె సంఘపు కాలితాపులుతిని వయస్సు చెల్లిన తరువాత ఒకమూల కూర్చుండి, సణుగుచు ఇతరులలోని ఉత్సాహాగ్నిని చల్లార్చుచుందుము. కష్టసుఖములొకదాని నొకటి వెన్నంటియే యుండునని గ్రహించిన వారు లేరు; కష్టము విసిగించునేని సుఖమును విసిగించునదే. ఏల యన కష్టము సుఖమునకు కవలతోబుట్టువే. దుఃఖమును తెచ్చుకొన దివురుట మానవుని పేరుకే అవమానకరము. అటులనే సుఖములబడయ తహతహపడుటకూడ అవమానకరమే. స్థితప్రజ్ఞుడు రెంటిని త్రోసిరాజనవలసినదే. ఆటబొమ్మలవలె తాము న్నారుకదా. ఈస్థితినుండి విముక్తిని మానవు లేల కోరరు? ఈక్షణమున కొరడాద్రెబ్బలకు గుఱియగుదుము. మన మేడ్వ నారంభింపగానే మహామాయ మన చేతిలో ఒక వరహాను పెట్టును; మఱొక క్షణమున మరల ద్రెబ్బపడ్డప్పుడు మన మేడ్చుచుండగా మహామాయ అల్లము వేసిన మిఠాయి ముక్క నిచ్చును. అంతట మనము మరల నవ్వ నారంభింతుము.

వివేకి స్వాతంత్ర్యమును కాంక్షించును; ఇంద్రియవిషయము లన్నియు నిస్సారము లని యతడు గుర్తించును; సుఖదుఃఖముల

కంతు లే దని తెలిసికొనును. ఎందఱు ధనికులు క్రొత్తక్రొత్త సుఖములు కావలెనని ఆత్రపడుచున్నారు! ఉన్న సుఖము లన్నియు ప్రాతపడిపోయినవి. కనుక వారికి క్రొత్తరకపు సుఖములు కావలె. క్షణకాలము నరముల లేపుటకు అనుదినము వా రెన్నెన్ని పిచ్చి వస్తువులు కనుగొనుచున్నారో! ఆ ఫలము గలిగిన వెంటనే తద్విపరీత ఫలమును ఎట్లు కలుగుచున్నదో మీరు కనుట లేదా? ప్రజలలో అధికసంఖ్యాకులు గొఱ్ఱెలమంద వంటివారు. ముందు పోవుచున్న గొఱ్ఱె గోతిలో పడినచో వెనుకవచ్చుచున్న గొఱ్ఱెలు కూడ ఆ గోతిలోనికే దూకును, వాని మెడలు విఱుగును. అదే తీరున సంఘములోని పెద్ద, ఏ పనిచేయునో, ఆ పనినే తక్కినవా రందఱు గ్రుడ్డిగా చేయుదురు. తా మేమి చేయుచున్నది వా రాలోచింపరు. ప్రాపంచికవిషయములు అసారము లని గుర్తించుటకు ప్రారంభింపగానే తాను మాయచేతి ఆటబొమ్మగా గాని మాయాకర్షణలకు గుఱిగా గాని ఉండకూడ దన్న భావము కలుగును. అట్లుండుట కేవలము బానిసతనమే కదా! దయతో నాలుగు మాటలు చెప్పగానే మానవుడు నవ్వ నారంభించును. కటువులైన మాటలు నాలుగు చెవిని పడగానే ఏడ్వ నారంభించును. పట్టెడన్నమునకు అతడు బానిస, ఒక్కసారి పీల్చుకొను పాటి గాలికి బానిస, వేషమునకు బానిస, స్వదేశాభిమానమునకు, స్వదేశమునకు బానిస, పేరుకు ప్రతిష్ఠకు బానిస; ఇట్లతడు బానిసతనపు మధ్యమున బడియున్నాడు. యథార్థమానవుడు ఈ బానిసతనమునకు లోపల పూడుకొనిపోయి యున్నాడు. మానవు డని మీరు పేర్కొనునది బానిసనే. ఈ బానిసతనమును గుర్తించినప్పుడు స్వాతంత్ర్యము కావలె నను కోర్కె కలుగును; తీవ్రమైన కోర్కె కల్గును. నిప్పుకణిక నెత్తిమీద పెట్టినప్పుడు దానిని త్రోసివేసికొనుటకై మానవు డెంత అల్లాడిపోవునో చూడుడు. మాయకు తాను బానిసగ నున్నా నని నిజముగ తెలిసికొన్నవాడు కూడ బంధవిముక్తికై అంతగా అల్లాటపడును.

ముముక్షుత్వము (మోక్షము పొందవలెనన్న అభీప్స) అన నేమో మన మిప్పుడు గుర్తించితిమి. దీని తరువాతి సాధనకూడ మిక్కిలి కఠినమే. ఏ దనగా నిత్యానిత్యవివేకము. ఏది సత్యమో, ఏది అసత్యమో; ఏది నిత్యమో, ఏది తాత్కాలికమో వివేకించుట. దేవు డొక్కడే నిత్యుడు. తక్కినదెల్ల క్షణభంగురమే. సర్వము నశించి పోవును; దేవతలు చనిపోవుదురు, మానవులు మరణింతురు, పశువులు మడియును, భూమి లంతరించును, సూర్యచంద్రులు నశింతురు, నక్షత్రములు నశించును; ప్రతివస్తువు అనుక్షణము మాఱిపోవుచుండును. నేడు పర్వతములుగా నున్నవి నిన్న సముద్రములుగా నుండినవి. మరల రేపు అవి సముద్రము లగును. సర్వము చంచలముగ నున్నది. సమస్తవిశ్వము మార్పుల కుప్ప. కాని, ఏనాటికిని మార్పుచెందని వా డొకడు కలడు. అతడే భగవంతుడు; మన మతని నెంతగా సమీపించిన మనకు పరిణామ మంత తక్కు వగును; మనమీద మాయకు ఉండు ప్రభావ మంత తగ్గిపోవును; మన మతనిని సమీపించి నప్పుడు అతనితోగూడి నిల్చినప్పుడు మాయను జయింతుము. దృశ్యమానప్రకృతి మన యేలుబడిలో నుండును. మనపై వాని కెట్టి ప్రభావము నుండదు.

ఇంతవఱకు పేర్కొన్న సాధన మనము చేసియున్నచో మన కీ జీవితములో వే ఱేదియు నక్కర లే దని మీకు తేటతెల్ల మగుచున్నది కదా! సమస్తజ్ఞానము మనయందే యున్నది. పరిపూర్ణత్వమంతయు ఆత్మయం దిదివఱకే నిహితమై యున్నది. ఈ పరిపూర్ణత్వము మాయచే ఆచ్ఛాదితమై యున్నది; ఒక పొరపై నొకపొరగా మాయ ఆత్మవిశుద్ధతను మఱుగుపఱచు చున్నది. మన కర్తవ్య మేమి? మన ఆత్మల నెంతమాత్రము నభివృద్ధిచెందింపలే మను మాట నిశ్చయము. పరిపూర్ణమైన దానికి అభివృద్ధి కూర్ప గల దేది? మనము తెఱను తీసివేయు

దుము; అంతట ఆత్మ తన తొల్లింటి పరిశుద్ధతతో, సహజాంతర్గత ముక్తస్థితితో ప్రకాశించును.

ఈ సందర్భమున ఈ సాధనకు గల ఆవశ్యకత ఏమి అన్న ప్రశ్న వచ్చును. ఏల యనగా ఆస్తిక్యము కర్ణములద్వారమున, నేత్రములద్వారమున, మెదడుద్వారమున పొందబడునది కాదు. వేదగ్రంథములును మనలను ఆస్తికులను చేయజాలవు. మనము లోకములోని గ్రంథముల నన్నిటిని పఠించియుండవచ్చును. అయినను, మతమును గురించి గాని, దేవుని గురించి గాని ఒక ముక్కకూడ మనకు అర్థము కాక పోవచ్చు. బ్రతికినన్నినాళ్లు మనము ఉపన్యాసములు చేయుచుండవచ్చును. అయినను శ్రేయ మొందక పోవచ్చును. లోకమున కంతటికి మనము మహిష్ఠ మేధానిధులుగ నుండవచ్చు. ఐనను భగవత్సామీప్యము మనకు లేకపోవచ్చు. అత్యంత మేధానిధులలో నాస్తికులను ఎందఱెందఱిని మీరు గాంచియుండ లేదు. బుద్ధివిషయమగు విద్యాసముపార్జనమే గాని హృదయమును గురించిన మెలకువయే లేకపోవుట పాశ్చాత్య నాగరకతలోని చెడుగులలో నొకటి. దానివలన మానవుని స్వార్థపరత పదంతలు హెచ్చును. అది మీకు వినాశహేతువు. హృదయమునకు మెదడుకు వైరుద్ధ్యము కలిగినప్పుడు మెదడును కాక హృదయమునే అనుసరింపుడు. మేధాశక్తి యేలుబడిలో నుండునది హేతువాదరంగ మొక్కటే. ఆ మేరలోనే యది పని చేయును; దాని పరిధి నది దాటిపోలేదు. పరమోన్నతస్థాయికి మనలను గొనిపోగలిగినది హృదయము. ఆ స్థాయిని మెదడు ఎన్నటికిని అందుకొనజాలదు. హృదయము ధీశక్తిని దాటి ఈశ్వర జ్ఞానావేశ మను స్థాయికి గొనిపోగలదు. ఆ యావేశము మేధాశక్తి కెన్నడును కలుగజాలదు. హృదయము వెలుగొందింపబడినప్పుడు ఈశ్వరజ్ఞానావేశమునొందును. హృదయశూన్యుడగు మేధావికి ఏనాడును దైవావేశము కలుగదు. ప్రేమగలవాని భావము నందించునది ఎప్పుడును అతని హృదయమే; మేధాశక్తి ఒసగగల

ఉపకరణమునకంటె గొప్ప యుపకరణమును హృదయము కనుగొనును. అనుభవావేశమే ఆ యుపకరణము. విజ్ఞానమునకు ధీశక్తి యుపకరణ మగునట్లే అనుభవావేశమునకు ఉపకరణము హృదయము. క్రింది దశలో హృదయము ధీశక్తికంటె మిక్కిలి దుర్బలమగు ఉపకరణము. అజ్ఞుడైన వాని కేమియు తెలియదు. కాని అతనిస్వభావములో కొంచె మావేశముకలదు. అతనిని ఒక గొప్ప ప్రొఫెస్సరుతో పోల్చి చూడుడు—ప్రొఫెస్సరు శక్తి యెంత యద్భుతమైనది! కాని, ప్రొఫెస్సరు ధీశక్తికి బద్ధుడు. కనుక అతడు ఏకకాలమందు అటు మేధావిగను ఉండగలడు, ఇటు రాక్షసుడును కాగలడు; హృదయశాలియగువా డెప్పుడును రాక్షసుడు కాలేడు. భావావేశపరు డెప్పుడును రాక్షసుడు కాజాలడు. తగినపరిపాకము కలిగినచో హృదయము పరిణతినొంది, ధీశక్తిని దాటిపోగలదు; అది 'ఈశ్వరజ్ఞానావేశముగ రూపొందగలదు. చివరకు మానవుడు ధీశక్తినతిక్రమింపవలసినదే. మానవుని జ్ఞానమును, అతని గ్రహణశక్తులును, తార్కికశక్తియు, ధీశక్తియు, హృదయశక్తియు ప్రపంచ మనియెడి క్షీరమును చిలుకుపనిలో వ్యగ్రములై యున్నవి. బహుకాలము చిలుకగా, చిలుకగా "వెన్న" వచ్చును. దేవుడే "వెన్న". హృదయశాలురకే "వెన్న" లభించును; ధీమంతులకు మిగులునది "మజ్జిగ" మాత్రమే.

ఈ సాధనలన్నియు హృదయపరిపాకమునకే, ప్రేమకొఱకే, గాఢమును హార్ద్రము నగు సానుభూతికొఱకే—ఉద్దేశింపబడినవి. భగవత్సాక్షాత్కారము బడయుటకు విద్యయు, పాండిత్యము నక్కరలేదు. ఒకమహాత్ముడు నాతో, "ఇతరులను చంపుటకు కత్తులు, డాళ్లు అవసరము; ఆత్మహత్య చేసికొనుటకు సూది చాలు. అటులనే పరులకు బోధించుటకు అధికధీశక్తియు, పాండిత్యమును అవసరము. కాని, నీకు నీవే ఆత్మావబోధము పొందుటకవి యవసరము కావు." అనెను. నీవు పరిశుద్ధుడవేనా? అయినచో నీవు భగవంతుని పొందగలవు. "వినిర్మలహృదయులు

ధన్యులు; వా రీశ్వరుని దర్శింతురు.'' నీవు పరిశుద్ధుడవు కానిచో లోకములోని విజ్ఞానశాస్త్రము లన్నిటిని అధ్యయనముచేసినను, అవి నీకు ఎంతమాత్రము నుపకరింపవు. నీవు చదివినపుస్తకము లన్నిటిలో నీవు పూడుకొనిపోవచ్చు; కాని, అవి నీ కెక్కువ ఉపక రింపవు. లక్ష్యమును చేరుకొనునది హృదయము. కనుక హృదయ మునే యనుసరింపుడు. నిర్మలహృదయము ధీశక్తి నతిక్రమించి చూడగలదు; అది ఈశ్వరజ్ఞానావిష్ట మగును. హేతువాదము ఏనాటికిని గ్రహింపలేని విషయముల హృదయము గ్రహింపగలదు. ఎప్పుడయినను నిర్మలహృదయమునకును బుద్ధికిని వైరుధ్యము కలిగి నప్పు డెల్ల నిర్మలహృదయపక్షమునే అవలంబింపుడు. హృదయ ప్రేరణ సహేతుకముగా లే దని తోచినను సరే, హృదయమునే అనుసరింపుడు. ఇతరులకు మేలు చేయుట మంచిదని తోచినప్పుడు అట్టి పని అలౌకిక మని మెదడు చెప్పవచ్చును. అయినను హృదయప్రేరణనే మన్నింపుడు. మెదడు ననుసరించునప్పటికంటె హృదయము ననుసరించునప్పుడు పొరపాట్లు తక్కువగ నుండుటను గుర్తింతువు. సత్యము ప్రతిఫలించుటకు శ్రేష్ఠమగు అద్దము విశుద్ధ హృదయము. ఈసాధన లన్నియు హృదయవిశుద్ధికై, ఉద్దేశింప బడినవి. హృదయము స్వచ్ఛమగుటతోడనే సత్యము లన్నియు క్షణములో అందు ప్రతిఫలించును. హృదయము చాలినంతగా పరిశుద్ధమయినయెడల విశ్వములోని సత్యమంతయు దానియందు అభివ్యక్తమగును.

అణువులను, సూక్ష్మభూతములను గుఱించిన సత్యములు మానవుల సూక్ష్మదర్శనములు కొన్ని యుగములకు పూర్వమే కనుగొనబడినవి. సూక్ష్మదర్శినిని దూరదర్శినిని ప్రయోగశాలను చూడనివారు వానిని కనుగొనిరి. వా రీ విషయము లెట్లు గ్రహించిరి? హృదయముతో గ్రహించిరి; వారు హృదయమును విశుద్ధము చేసికొనిరి. ఆపనినే నేడుకూడ మనము చేసికొనవచ్చును.

అనుభవింపలేని విషయములను మనము కనగలుగుదుము, వినగలుగుదుము, అనుభవింపగలుగుదుము. అప్పుడు మన మాడుభాష అపూర్వముగానుండును. దానిని లోకు లర్థము చేసికొనలేరు. లోకుల కింద్రియ విషయములు దక్క వే ఱొక్కటి తెలియదు! నిజమైన మతము పూర్తిగా అతీంద్రియ మయినదే. ఇంద్రియముల నతిక్రమింపగల శక్తి జగత్తులో ప్రతిజీవియందును గలదు. చిన్న కీటకము సైతము కానొకనాడు ఇంద్రియముల నతిక్రమించి దేవుని చేరుకొనును. ఏప్రాణికిని వైఫల్యము కలుగదు. సృష్టిలో వైఫల్యమనునదియే లేదు. మానవుడు నూఱు పర్యాయములు తనకు తాను కీడు చేసికొనవచ్చుగాక; వేయిపర్యాయములు పతన మొందుగాక. కాని, కడకు తాను బ్రహ్మమే అనుటను సాక్షాత్కరించుకొనును. సరళరేఖలో అభ్యున్నతి యనునది లే దని మనకు తెలియును కదా. ప్రతి ఆత్మయు చక్రములో పరిభ్రమించును. వలయము పూర్తి కావలె. ఏ ఆత్మయు అధోముఖముగానే పోవుచుండదు, ఊర్ధ్వముఖముగా పోక తప్పని కాలము దానికి వచ్చును. ఏ ఆత్మకును నాశము లేదు. మన మందఱము ఒక్క కేంద్రమునుండియే వెలువడితిమి. భగవంతుడే ఆ కేంద్రము. పరమోత్కృష్టజీవులును అత్యంతనికృష్టజీవులును మగిడి జీవుల కెల్ల జనకుడగు సర్వేశ్వరుని యొద్దకు చేరుకొనగలవు. "దేనినుండి ఈ భూతములు జనించుచున్నవో, జనించినవి దేనిచేత జీవించుచున్నవో; దేనిని పొంది, దేనిలో లీన మగుచున్నవో అదే బ్రహ్మము."

# వేదాంతము - ప్రత్యేకవ్యక్తి

(లండననగరములో చేసిన ఉపన్యాసము)

అద్వైతమునకు సంబంధించిన తాత్త్వికభాగమును మన మిప్పటికి చాలవఱకు ముగించితిమి. ఒక్క అంశము — ఇది, మిక్కిలి దురవగాహమైన అంశ మేమో — మిగిలి యున్నది. అద్వైతవాదము ప్రకారము మనచుట్టు మనము కాంచు సర్వమును, నిజమునకు అఖిలవిశ్వమును ఒక్క నిర్గుణతత్త్వపు క్రమవికాసమే. ఆ నిర్గుణతత్త్వము సంస్కృతములో బ్రహ్మ మని పేర్కొనబడును. బ్రహ్మము అఖిల ప్రకృతిగా పరిణామ మొందినది. ఇక్కడ ఒక చిక్కు గల్గుచున్నది. బ్రహ్మము మార్పొందుట ఎట్లు సాధ్యము? బ్రహ్మమును మార్పొందించిన దేది? నిర్వికారమైన దనుటే 'బ్రహ్మము'నకు నిర్వచనము. నిర్వికారమైనది వికారముపొందిన దనుట పొసగని మాట. భగవంతుడు సగుణుడని విశ్వసించువారికికూడ ఇదే చిక్కు గలుగుచున్నది. ఉదాహరణకు: ఈ సృష్టి యెట్లు సంభవించినది? శూన్యమునుండి సంభవము కాజాలదు; అది పొసగని మాట. శుద్ధశూన్యము నుండి యేదియో పుట్టుట అసంభవము. కార్యము కారణమునకు మఱొక రూపమే. బీజమునుండి మహావృక్షము వచ్చును; విత్తనమును, అది లోనికి గొన్న గాలియు, నీరును కలసి చెట్టు అయినది. వృక్షశరీరము రూపుదాల్చుటకై లోనికి ఎంత గాలి, ఎంత నీరు కొనబడినదో పరీక్షించుటకు వీలున్నచో, వాని కొలతయు వృక్షపుకొలతయు సమాన మని తప్పక గుర్తింతుము. కారణము పొందిన రూపాంతరమే కార్య మను విషయము సందేహించుటకు వీలులేనంత స్పష్టముగా ఆధునిక శాస్త్రవిజ్ఞానము రుజువు చేసినది. కారణము లోని భాగముల అమరిక మార్పొంది

కారణమే కార్య మగును. కనుక కారణము లేకయే సృష్టి యేర్పడిన దన్న చిక్కును తొలగించుకోవలసి యున్నది. అందుచేత భగవంతుడే జగముగా ఐనా డని యంగీకరింపవలసి వచ్చును.

మన మొక చిక్కును వదలించుకొన్నాము కాని, యిప్పుడు మ ఱొక చిక్కులో పడినాము. ప్రతి సిద్ధాంతములోను 'నిర్వికార' మను ఆశయమునుండియే 'భగవంతుడు' అను ఆశయము గల్గును. ఈశ్వరు నన్వేషించుటలో, అది ఎంత మోటు తీరు అన్వేషణ మైనను సరే, మన కుండు ఆశయము 'స్వాతంత్ర్యము' అని చారిత్రకముగా పరిశీలించి తెలిసికొంటిమి. స్వాతంత్ర్యమును, నిర్వికారతయు ఒక్కటే. అభిన్నములే. స్వతంత్రమయినదే యెన్నటికిని మార్పు చెందనిది ; మార్పున కతీతమయినదే స్వతంత్ర మయినది. ఒక వస్తువునకు మార్పు తెచ్చునది ఆవస్తువునకు వెలుపలనో, దానికే లోపలనో — ఉండ వలెను. మార్పును తెచ్చునట్టి అది తన చుట్టునున్నవానికంటె తాను ప్రబలతరమై యుండ వలెను. మార్పునకు లోనగు ప్రతివస్తువును బద్ధపఱచు కారణమో, కారణములో తప్పక ఉండ వలెను. ఆ కారణము గాని, కారణములు గాని తాము మార్పునకు లోగని విగ ఉండజాలవు. భగవంతుడే ప్రపంచముగా మార్పుచెందె నను కొందము. అప్పుడు భగవంతు డున్నాడు, ఆయనకు మార్పును ఉన్నది అని యర్థము. అనంతమైనది సాంతమగు ఈజగ మయినదని అనుకొందము. అంతట ఆ మేరకు అనంతమైనదానిలో వెలితి కలిగిన దన్న మాట. అప్పుడు భగవంతు డనగా అనంతమునుండి జగమును తీసివేయగా మిగిలినది యగును. మార్పులకు లోబడు దేవుడు దేవుడే కాడు. జగమే దేవు డను సిద్ధాంతమును తొలగించుటకు వేదాంతము అత్యంతధీరమైన యొక వాదమును ప్రతిపాదించెను. మనము గ్రహించు చున్న రీతిలో, భావించుచున్న రీతిలో ఈ జగము లేదు ; నిర్వికార మయినది వికారము పొంద

లేదు; ఈ నిఖిలవిశ్వము వట్టి ఆభాసమే కాని సత్యము కాదు. —ఇదియే ఆవాదము. ఈ భాగములును, చిన్న జీవులును, ఈ విభేదములును పైకి కనబడుచున్నవే గాని అసలు వస్తువుకు సహజలక్షణములు కావు. దేవు డెంత మాత్రము మాఱిపో లేదు. అతడు ఈవిశ్వముగా నెంతమాత్రము మాఱ లేదు. మనము దేశకాలనిమిత్తములద్వారమున చూడ వలసి యున్నది కనుక భగవంతుడు విశ్వముగా కనబడుచున్నాడు. యథార్థములు కాక పైకిమాత్రము కనిపించు భేదములకు దేశకాల నిమిత్తములే కారణములు. నిశ్చయముగా నిది కడు ధీరమయిన వాదమే. ఈ వాదమును మఱికొంత స్పష్టముగా వివరింప వలసి యున్నది. ఇది సామాన్యముగా గ్రహింపబడునర్థములో ఆదర్శవాదము కాదు. జగత్తు లే దని యిది చెప్పదు; అది యున్నది; కాని, అది మనము భావించుచున్న రీతిగా లేదు. ఈ విషయమును వివరించుటకు అద్వైతవేదాంతము చూపు నిదర్శన మందఱకు తెలిసినదే. చెట్టు మ్రోడును రాత్రి చీకటిలో చూచిన మూఢ విశ్వాసి అది దయ్యముగా భావించును; దొంగ, దానిని చూచి పోలీసుభటు డని భ్రాంతిచెందును; సఖు డని మిత్రునికొఱకు వేచి యున్న వ్యక్తి భ్రమించును. ఈ సందర్భము లన్నిటిలో చెట్టులో మార్పు కలుగ లేదు. మార్పులు కలిగినట్లు కనబడినది. ఈ మార్పులు చూచినవారి మనస్సులలో నున్నవి. జ్ఞాతపరముగా, మన స్తత్త్వశాస్త్రముద్వారా మన మీ విషయమును, మఱింత స్పష్టముగా గ్రహింప గలము. మనకు బాహ్యముగా నేదియో కలదు. దాని యథార్థ తత్త్వము మనకు తెలియదు. అది అజ్ఞేయము. దానిని మనము ఎక్స్ అనుకొందము. మనలోపల నొకటి కలదు. అదికూడ అజ్ఞాతమే, అజ్ఞేయమే. దానిని వై అను కొందము. మనకు జ్ఞేయ మైనది ఎక్స్ + వై మనకు తెలిసిన ప్రతివిషయములోను రెండు భాగములు కలవు. వెలుపలి ఎక్స్ భాగము, లోపలి వై భాగము; మనకు తెలిసినది ఎక్స్ + వై.

కనుక విశ్వములోని ప్రతిరూపములోను మనము కల్పించినది కొంత, వెలుపలిది కొంత ఉన్నవి. ఈ ఎక్స్, ఈ వై ఒక్కటే అని వేదాంతము చేయు సిద్ధాంతము.

కొందఱు పాశ్చాత్యతత్త్వవేత్తలు, ముఖ్యముగా హెర్బర్టు స్పెన్సరు, మఱికొందఱు ఆధునిక తత్త్వవేత్తలు సరిగా ఇట్టి నిర్ణయమునకే వచ్చిరి. 'పువ్వులో వ్యక్తమగుచున్న శక్తియే నాచేతన నుండి ఉబుకుచున్న'దందురే, అదియు, 'బాహ్యజగత్తులోనిసత్యము, అంతర్జగత్తులోని సత్యము నొక్కటే' అని వేదాంతము చేయు బోధనయు ఒక్కటే. బాహ్యాంతరభేదములుగూడ మనము ఏర్పఱచుకొన్నవే గాని వస్తుస్థితములు కావు. ఉదాహరణము: మనకు మఱొక ఇంద్రియ మున్న యెడల ప్రపంచము మనకు మఱొకవిధముగా మాఱిపోవును. దీనినిబట్టి విషయియే విషయమును మార్చు నని తేలినది. నేను మాఱినచో బాహ్యప్రపంచముకూడ మాఱును. మీరును, నేనును, ఈ విశ్వములోని ప్రతి వస్తువును బ్రహ్మమే. ఏది గాని అంగియే కాని అంగము కాదు అని వేదాంతసిద్ధాంతసారాంశము. మీరు అఖండబ్రహ్మస్వరూపులరు. అటులనే ఇతరులు అందఱును. అంగము అను భావమునకే అందు స్థానము లేదు. ఈ విభాగములు ఈ పరిమితులు పైకి కనిపించునే కాని ఆత్మలో లేవు; నేను పరిపూర్ణుడను అఖండుడను. నే నెన్నడును బద్ధుడనుగ నుండ లేదు. నీవు బద్ధుడ వను కొందువేని బద్ధుడవుగానే యుందు వనియు నీవు ముక్తుడ వను కొందువా, ముక్తుడవే యగుదువు అనియు వేదాంతము ధీరముగా బోధించుచున్నది. మనము సర్వదా ముక్తపురుషులమే అయి యుంటి మని, ఇక ముం దెప్పుడునుకూడ ముక్తులముగానేయుందు మని మనకు తెల్పుటే ఈతత్త్వశాస్త్రలక్ష్యమును ప్రయోజనమును. మన మేనాటికిని మార్పు చెందబోము; ఏనాటికి నశింపబోము. మన మేనాడును జన్మించినవారము కాము. మఱి, ఈ మార్పు

లన్నియు నేమి? ఈ దృశ్యమానప్రపంచ మే మగును? ఈజగము మిథ్య. దేశకాలనిమిత్తములు దీనిని బంధించియున్నవి. ఇట్లనుటకు సంస్కృతములో వివర్తవాద మని పేరు. ఇది ప్రకృతిపరిణామము, బ్రహ్మపు ఆవిష్కృతి. బ్రహ్మము మార్పుచెందదు; పునఃపరిణామ మొందదు. ప్రతిసూక్ష్మజీవియందు అనంతమగు పరిపూర్ణత్వము గర్భితమై యున్నది. సూక్ష్మజీవిని సూక్ష్మజీవి యనుట శరీరమును బట్టియే. అణువు మొదలు పూర్ణపురుషునివఱకు లోపల నున్న వస్తువులో మార్పు లేదు. అది ఏకము, లోబడునది కాదు. కలుగు మార్పు అంతయు పైతొడుగునందే.

బయట సుందరదృశ్య మున్నది. ఇక్కడ తెర యున్నది. తెరయందు చిన్నరంధ్ర మున్నది. రంధ్రముగుండ బయటిదృశ్యము ఈషన్మాత్రము గోచరించుచున్నది; రంధ్ర మంతకంతకు విస్తరిల్లు ననుకొనుడు. అది పెద్ద దగుచున్న కొలది బాహ్యదృశ్య మధికాధికముగా కనబడుచుండును. తెర పూర్తిగా తొలగిపోయి నప్పుడు దృశ్యము పూర్తిగా ప్రత్యక్ష మగును. ఆత్మయే బాహ్య దృశ్యము. దృశ్యమునకును మనకును మధ్య గల తెరయే మాయ—దేశము, కాలము, నిమిత్తము. ఎక్కడో చిన్న బెజ్జ మున్నది. దానిద్వారా ఆత్మను ఈషన్మాత్రముగా చూడగలుగు చున్నాను. రంధ్రము పెద్దదగు కొలదియు నే నధికాధికముగా చూడగలుగుదును. తెర పూర్తిగా పోయినప్పుడు నేనే ఆత్మనని యెఱుంగుదును. కావున విశ్వములోని మార్పులు బ్రహ్మమందు లేవు; అవి ప్రకృతిలో గలవు. బ్రహ్మము తన్ను తాను ఆవిష్కరించుకొనువఱకు ప్రకృతి అధికాధికముగా పరిణామ మొందు చుండును. ప్రతిజీవునియందు బ్రహ్మ మున్నది; ఒక కొందఱిలో తదితరులందుకంటె అ దెక్కువగా ఆవిష్కృత మగుచున్నది; అఖిలవిశ్వము యథార్థముగా ఒక్కటే. ఆత్మను గుఱించి చెప్పు నప్పు డొకడు మఱొకనికంటె అధికు డను మాట కర్థము లేదు.

ఆత్మను గుఱించి చెప్పునప్పుడు మానవుడు జంతువుకంటె, చెట్టు కంటె అధికు డను మాట కర్థము లేదు; సమస్తజగత్తు ఒక్కటే. మొక్కలలో ఆత్మవికాసమునకు గల ప్రతిబంధక మత్యధికము; పశువులలో కొంచెము తక్కువ; మానవునిలో మఱింత తక్కువ. సంస్కారము, ఆధ్యాత్మికపరత గల వారిలో నింకను తక్కువ; పూర్ణపురుషులలో ప్రతిబంధకము పూర్తిగా మాయమైపోయినది. మనపోరాటములు, సాధనలు, బాధలు, సుఖములు, దుఃఖాశ్రువులు, మందహాసములు, మనచేతలు, యోచనలు అన్నియు ఆ యవనికను చింపివేయుట, రంధ్రమును పెద్దదిచేయుట, కనబడుచున్న దానికి యథార్థమునకు నడుమ నున్న పొరలను పలుచపఱచుట అను ఆ లక్ష్యమునొద్దకు సాగునవే మనపని ఆత్మకు ముక్తి కలిగించుట కాదు, బంధములను వదలించుటే. సూర్యుని మబ్బుల వరుసలు కప్పివేయును. వానివలన సూర్యు డెట్టి మార్పు నొందకుండును. ప్రభంజనము చేయవలసిన పని మబ్బులను తఱిమివేయుటే. మబ్బు లెంతగా తొలగిపోయిన సూర్యుని వెలుగు అంతగా కననగును. నిజమున కాత్మయందు కలుగు మార్పేమియు లేదు—అది యనంతము, నిర్గుణము, నిత్యము, సత్తు, చిత్తు, ఆనందము. ఆత్మకు చావుపుట్టుకలు కూడ లేవు. చచ్చుటయు, జన్మించుటయు, మరల జన్మించుటయు, స్వర్గమునకు పోవుటయు—ఆత్మ కసంభవములు. ఇవన్నియు వివిధాభాసములు, వివిధమరీచికలు, వివిధస్వప్నములు. ఈ లోకమునుగుఱించి కలలు కనుచున్నవాడు దుశ్చింతలను, దుశ్చేష్టలను కలలో గనునేని కొంతకాలమునకు ఈ కలను గూర్చిన తలపోత తర్వాతి స్వప్నమును కల్పించును. తా నేదో భయంకరస్థలములో నున్నా ననియు, త న్నెవరో నానాహింసలు పెట్టుచున్నా రనియు నతడు కలగనును. సచ్చింతలను, సత్కార్యములను గుఱించి కలలు కనువాడు ఆ కల కనంతరము తాను మేలైన చోట నున్నా నని యనుకొనును; ఈ విధముగ ఒక కల ఇంకొక కలకు చేర్చును. ఒకానొకనాడు

ఈ సమస్తస్వప్నము పటాపంచ లగును. ఈ విశ్వ మంతయు వట్టి స్వప్న మని తెలిసికొనుకాలము మనలో ప్రతివానికి వచ్చి తీరును. పరిసరములకంటె ఆత్మ అనంతముగా ఉత్కృష్ట మని యప్పుడు గ్రహింతుము. మన పరిసరము లని మన మనుకొను వీనిగుండ త్రోసికొనిపోవుచుండు మనము, ఆత్మశక్తితో పోల్చినప్పు డీ పరిసరముల పటిమ సున్న అని గ్రహించుకాల మొకానొకనాటికి రాగలదు. కాలము పట్టును, అంతే. నిరవధికమైన దానిలో కాల మొక లెక్కయే కాదు; సముద్రములో బిందుమాత్రము. మనము వేచియుండ వచ్చు, నెమ్మదిగ నుండ వచ్చు.

సమస్తప్రపంచము ఎఱుకతోనో, ఎఱుక లేకో ఆ గమ్యము చేరుకొనుటకే పురోగమించుచున్నది. చంద్రుడు ఇతరగోళముల ఆకర్షణనుండి విడుపొందుటకు శ్రమించుచున్నాడు. సుదీర్ఘకాలమునకు అతడు వెలువడును. కాని తెలిసి శ్రమించువారు కాలమును త్వరగొల్పుదురు. ఈ సిద్ధాంతమువలన కార్యరంగములో కననగు ఒక్క ఫలిత మిది — నిజమైన విశ్వప్రేమ సాధ్య మగునది ఈ దృక్పథములో మాత్రమే. సర్వజీవులు మనసహయాత్రికులె; తోడిప్రయాణికులె — సకలప్రాణులు, మొక్కలు, జంతువులు; నా తోబుట్టువగు మానవుడే కాదు; నా తోబుట్టువగు మృగము, నా తోబుట్టువగు వృక్షముకూడ; మంచివాడైన సోదరుడు మాత్రమే కాదు, పాపి యైన సోదరుడును, ఆధ్యాత్మికపరుడైన సోదరుడును, దుష్టుడైన సోదరుడునుకూడ. వా రందఱు ఒక్క లక్ష్యమువంకకే చనుచున్నారు. అందఱు ఒక్క ప్రవాహములోనే ఉన్నారు. ప్రతిజీవియు అనంతమగు ముక్తస్థితివంకకు పరుగిడుచున్నాడు. మన మీ గతిని నరికట్టలేము. ఎవరును దీనిని ఆప లేరు; ఎంతగా ప్రయత్నించినను ఎవడును వెనుకకు మరలి పోజాలడు; అతడు ముందుకే తఱుమబడును. చిట్టచివర కతడు విముక్తి పడయును. ఎక్కడనుండి మనము విసరివేయబడినట్లు వచ్చిపడినామో, మన ఉనికి కేంద్రమగు ఆ చోటికి, ఆ ముక్తస్థితికి

పోవుటకు మనము పడుపాటే 'సృష్టి' అను మాట కర్థము. ఇచ్చట మన ఉనికియే, కేంద్రమువంకకు మనము పయనించుచున్నా మను టకు నిదర్శనము. కేంద్రమువంకకు గలుగుచున్న యీ ఆకర్షణ దాల్చు రూపమునే మనము ప్రేమ అనుచున్నాము.

ఎందుండి యీ విశ్వము వచ్చుచున్నది? దేనియం దీ విశ్వ మున్నది? తిరిగి దేనిని చేరును?—అని ప్రశ్న అడుగబడుచుండును. దీనికి సమాధాన మిది: ప్రేమనుండి విశ్వము వచ్చుచున్నది; ప్రేమయం దున్నది; తిరిగి ప్రేమను చేరును. కనుక తన కిష్ట మయినను, కాకపోయినను, ఎవరుగాని వెనుకకు మరలి పోవుట యనునది లే దని, మన మిప్పుడు తెలిసికోగల స్థితియం దున్నాము. కేంద్రమునకు దూరమై వెనుకకు పోవుట కెంతగా ప్రయత్నించినను ప్రతిజీవుడు కేంద్రమును చేరుకొనవలసినదే. ఎఱుకతో, బుద్ధి పూర్వకముగా ప్రయత్నముచేసినచో మార్గము సుగమ మగును; ప్రతిబంధకము తగ్గును; పయనము త్వరగా సాగును. సమస్త జ్ఞానము, సర్వశక్తి మనలోపలనే గలవు కాని వెలుపల లే వనెడి విషయముకూడ దీనినిబట్టి సహజముగా నిర్ధారిత మగుచున్నది. ప్రకృతి యని మనమందుమే అది ప్రతిఫలింపజేయు అద్దమువంటిది. ప్రకృతివలని ప్రయోజన మంతే. లోపలనున్నది ఈ ప్రకృతి అను నద్దమున ప్రతిఫలించుటే జ్ఞానము. శక్తు లని, ప్రకృతిరహస్యము లని, బల మని మన మనునవి యెల్ల మనలోపలనే యున్నవి. బాహ్యజగత్తులో నున్న దొక పరిణామపరంపరమాత్రమే. ప్రకృతిలో జ్ఞానము లేదు. సమస్తజ్ఞానము మానవాత్మనుండి వచ్చును. మానవుడు జ్ఞానమును వ్యక్తమొనర్చును. దానిని తన యందే కనుగొనును. అది యితఃపూర్వమే అనాదిగా తనయం దున్నది. ప్రతిజీవుడును జ్ఞానమునకు మూర్తీభావము, నిత్యానంద మునకు నిత్యసత్తకు మూర్తీభావము. దీని నైతిక ఫలితము— మఱొక సందర్భములో సమత్వమును గుఱించి మనము గుర్తించిన దానివంటిదే.

'ప్రత్యేకపుహక్కు' అనునది మానవుల మనుగడకు విషమే. అరసినచో, రెండుశక్తులు నిరంతరము పనిచేయుచున్నవి. ఒకటి వర్ణవ్యవస్థను రూపొందించుచున్నది, రెండవది వర్ణవ్యవస్థను రూపుమాపుచున్నది; ఒకటి ప్రత్యేకపుహక్కుల నిలద్రొక్కుటకు పనివడుచున్నది, మఱొకటి ప్రత్యేకపుహక్కుల కూలద్రోయుటకు పనివడుచున్నది. ప్రత్యేకపుహక్కులు కూలిపోయినప్పుడెల్ల జాతికి వెలుగును, పురోగతియు అధికాధికముగా గల్గును. ఈ పోరాటమును మనచుట్టును కాంచుచునే యున్నాము. ఏ హక్కు బలహీనులకు లేదో బలవంతులకు గలదో అది ప్రత్యేకపు హక్కులలో మొట్టమొదటిది, ఘాతుకమైనది ఐశ్వర్యమువలని ప్రత్యేకపుహక్కున్నది. ఒకని కింకొకనికంటె నెక్కువగా ధనమున్నయెడల ఆ యింకొకని కంటె అతడు ప్రత్యేకపుహక్కు తన కెక్కువగ నుండవలె నని వాంఛించును. అంతకంటె సూక్ష్మము, శక్తిమంతము నగు ప్రత్యేకపుహక్కు గలదు. అది ధీశక్తివలన గల్గునది; ఒకడు ఇతరులకంటె ఎక్కువ తెలిసినవాడగునేని ప్రత్యేకపుహక్కు నత డెక్కువగ ఆశించును. అన్నిటిలో కడపటిది, క్రూరతమ మగుటచే పరమనికృష్ట మయినది ఆధ్యాత్మికతవలని ప్రత్యేకపుహక్కు. కొందఱు దేవుని గుఱించి, ఆధ్యాత్మికతను గుఱించి తమ కెక్కువ తెలియు ననుకొందురు. ఆ హేతువుచేత ఇతరుల కెవ్వరికిని లేని ప్రత్యేకపుహక్కులు తమకుండ వలె నందురు. "దిగి రండు, పామరులసమూహములార! మమ్ము ఆరాధింపుడు; మేము దేవుని సందేశహారులము. మమ్మారాధించుట మీకు విధి" అని వా రందురు. ఒకవంక వేదాంతుల మనుచునే, మఱొకవంక మానసికముగనో శారీరకముగనో ఆధ్యాత్మికముగనో ఒకని ప్రత్యేకపుహక్కును అనుమతించుట పొసగదు. ఎవరికి గాని ఎట్టి ప్రత్యేకపుహక్కును లేనే లేదు. ప్రతినరునిలో నున్న శక్తి యొక్కటే. ఒకనిలో అ దెక్కువగా వ్యక్త మగును. మఱొకనిలో తక్కువగా వ్యక్త మగును.

ప్రతివానిలోను ఉన్న సంభావ్యశక్తి ఒక్కటే. ఇక ప్రత్యేకపు హక్కునకు అర్హత ఏమి కలదు? సమస్తజ్ఞానము ప్రతిజీవునందు నిహితమై యున్నది. పరమమూఢునియందును గలదు; దాని నతడు వ్యక్త మొనర్ప లేడు. అందుల కతనికి అవకాశము దొరకక పోయియుండవచ్చును; పరిసరాలు అనుకూలముగా లేక పోయియుండవచ్చును. అవకాశము లభించినప్పు డతడు దాని నావిష్కరించును. జన్మచేత ఒకడు మఱొకనికంటె అధికు డనుట వేదాంతమునందు అర్థములేని మాట. ఇరు దేశాలవారిలో ఒక రింకొకరికంటె అధికు లనుటయు ఇంచుకేని అర్థము లేని మాటే. వారిని అభిన్నపరిస్థితులలో పెట్టుడు, ఏకరీతి ధీశక్తి వెలువడునో లేదో చూడుడు. ఆ పని చేయక ఈ దేశీయులు ఆ దేశీయుల కంటె గొప్పవా రనుటకు నీ కధికారము లేదు. ఆధ్యాత్మికవిషయమున ప్రత్యేకపుహక్కు నాది అనుకొన కూడనే కూడదు. మానవకోటికి సేవచేయుటే ప్రత్యేకపుహక్కు; ఏల యన అది ఈశ్వరోపాసనయే. దేవు డిక్కడ, ఈ సకలమానవాత్మలందును గలడు. అతడు మానవుని ఆత్మ. మానవు లింకేమి ప్రత్యేకపు హక్కును కోరగలరు? దేవుని ప్రత్యేకసందేశహరు లనువా రెవ్వరును లేరు. ఇతఃపూర్వ ముండ లేదు. ఉండుటకు వీలు లేదు. సకల జీవులు——పెద్దవి, చిన్నవి సమానముగా ఈశ్వరుని మూర్తి భావములే; ఉన్న భేద మంతయు మూర్తిభవించుటలోనే. శాశ్వతమైన ఒక్కసందేశమే, శాశ్వతముగా ఒసగబడినది. అది కొంచెము కొంచెముగా వారి కందుచున్నది. ప్రతిజీవునిహృదయమందును ఆ నిత్యసందేశము లిఖితమై యున్నది; అది ఈవఱకే అచట నున్నది. దానిని వెలువఱచుటకే అందఱును పాటుపడుచున్నారు. అనుకూలపరిస్థితులలో నున్న కొందఱు ఇతరులకంటె ఆ సందేశమును ఇంచుక మిన్నగా వ్యక్తముచేయగలుగుచున్నారు; కాని, సందేశప్రాపకు లగుటలో అందఱు నొక్కటే. అధికు లనిపించుకొను నర్హత ఏదీ? భగవత్సందేశమం దించు గొప్పతనములో,

నిరతిశయమూఢుడగు మానవుడు కాని, నిరతిశయమూఢుడగు శిశువు కాని భూతభవిష్యత్సందేశహారులలో ఎవరికిని తీసిపోడు. ఏల యన, అనంతసందేశము ప్రతిజీవిహృదయమందు నిక చెరగని రీతి ముద్రిత మయి యున్నది. ఎక్కడ ఏ జీవి యున్నను ఆ జీవి యందు పరాత్పరుని సందేశము ఉన్నది. అది యక్కడ నున్నది. కావున 'అద్వైతము' చేయవలసిన పని ఏమనగా ప్రత్యేకపు హక్కుల నన్నిటిని తెగగొట్టుటే. అన్నిపనులకంటె నిది మిక్కిలి దుష్కరమైనది. ఈ కృషి యితరదేశములలోకంటె అద్వైతము ప్రభవించినదేశములో మిక్కిలి మందముగా నుండుట వింత. ప్రత్యేకపుహక్కు లున్న దేశ మే దేని కల దేని అది అద్వైత సిద్ధాంతము పుట్టిన దేశమే — ఆధ్యాత్మికపరునకు ప్రత్యేకపు హక్కు, ఉన్నతవంశజాతునకు ప్రత్యేకపుహక్కు. ధనమున కక్కడ ప్రత్యేకపుహక్కు అంతగా లేదు. (ఇది సత్ఫలితములలో నొకటి యని నా యభిప్రాయము.) కాని, ఉత్తమకులములో పుట్టి నందుకు, ఆధ్యాత్మికత కలిగినవా డైనందుకు ప్రత్యేకపుహక్కు అచట సర్వత్ర ఉన్నది.

ఒకమారు వేదాంతనైతికధర్మమును బోధించుటకు పెద్ద యెత్తున ఉద్యమము ప్రారంభమైనది. పెక్కుశతాబ్దములపాటు ఆ ప్రయత్నము కొంతవఱకు ఫలించినది. ఆ దేశము మహోచ్ఛ దశయందున్న కాల మదియే అని చరిత్రనుబట్టి మనకు తెలి యును. ప్రత్యేకపు హక్కులను పడగొట్టుటకు బౌద్ధమతముచేసిన కృషివిషయమే నేను ప్రస్తావించుచున్నది. బుద్ధుని సంబోధించు టకు వినియుక్తములైన చక్కని నామములు కొన్ని నాకు జ్ఞాపక మున్నవి. అవి యివి: 'వర్ణవిధ్వంసకా' 'దురధికారనిర్వాపకా' 'సర్వప్రాణి సమాత్మోపదేశకా' సమానత్వమును గుఱించి యతడు బోధించెను. శ్రమణసంఘమువారు ఈ సమత్వప్రభావ మును కొంత అపార్థము చేసికొన్నారు. వారి నొక మతసంస్థ (చర్చి)గా చేయుటకు వారిలో 'ఎక్కువవారి'ని 'తక్కువవారి'ని

కల్పించుటకు వందలకొలది ప్రయత్నములు జరిగినవి; ప్రజలందఱు దివ్యులే అని బోధించినప్పుడు 'మతసంస్థ'ను గొప్పచేయలేవు. వేదాంతమువలన కలిగిన సత్ఫలితములలో నొకటి మతస్వేచ్ఛ. భారతదేశములో మతస్వేచ్ఛ ఎప్పుడును ఉన్నది. ఇది నిజముగా గర్వకారణము. అక్కడ అన్యమతావలంబులను హింసించుట ఏనాడును జరిగియుండలేదు. మతవిషయమున ప్రజలకు పరిపూర్ణస్వేచ్ఛ ఒసగబడెను.

వేదాంతనైతికధర్మపు ఆచరణభాగమునకు పూర్వముండినంత ఆవశ్యకత నేడును గలదు. మునుపటికంటె ఇప్పు డది యింకను ఎక్కువ ఆవశ్యక మేమోకూడ. ఏలయన విద్యావ్యాప్తితో ప్రత్యేకపుహక్కులను కప్పుకొనుటయు విపరీతముగా ప్రబలిపోయినది. 'దేవుడు', 'దయ్యము' 'అహురమజ్దా,' 'అహ్రిమన్' అనుటలో ఎంతో కవిత్వము గలదు. దేవునికి, దయ్యమునకు గల భేద మంతయును నిస్స్వార్థతకును, స్వార్థపరత్వమునకును గల భేదమే. దయ్యమునకు గూడ దేవునికి తెలిసినంత తెలియును; దేవుని కున్నంత శక్తి యున్నది; పవిత్రతమాత్రమే లేదు—పవిత్రత లేకపోవుటే అతనిని దయ్యముగ జేయును. ఈ భావమును ఆధునికప్రపంచమున కన్వయింపుడు: పవిత్రత వినా, విశేషజ్ఞానమును, శక్తియు నుండుటవలన మానవులు రాక్షసు లగుదురు. యంత్రములను తదితరసాధనములను తయారుచేయుటవలన, ఘోరమహాశక్తి సంపాదిత మగుచున్నది. ప్రపంచచరిత్రలో మున్నెన్నడు లేనంతగా నేడు 'ప్రత్యేకపుహక్కుల' కాంక్ష ఉన్నది. కావుననే 'ప్రత్యేకపుహక్కుల' ఖండించి ఉపదేశింపవలెనని, మానవుల ఆత్మలపైని ఆ హక్కుల దురధికారమును పడగొట్టవలె నని వేదాంతము కోరుచున్నది.

మీలో భగవద్గీత చదివినవారికి, అందలి స్మరణీయ సూక్తులు జ్ఞాపక ముండి యుండ వచ్చును: "విద్యావినయ

సంపన్నుడగు బ్రాహ్మణునందును గోవునందును ఏనుగునందును కుక్కయందును కుక్కమాంసముతినువానియందును పండితులు సమదృష్టి గల్గి యుందురు. ఎవరి మనస్సు సమత్వమందు స్థిరముగ నున్నదో వారు ఈజీవితముననే సంసారమును జయించినవారు. బ్రహ్మము నిర్దోషమును సమమును గదా, కావున వారు బ్రహ్మమందే ఉన్నారు.'' సర్వసమదృష్టియే వేదాంత నీతిసారాంశము. విషయిజగమే విషయజగమును శాసించుచున్న దని మనము గ్రహించితిమి, విషయిని మార్పుము, విషయము విధిగా మారితీరును; మిమ్ము పవిత్రీకరించుకొండి, ప్రపంచము తప్పక పరిశుద్ధము కాగలదు. ఈ విషయమును మునుపటికంటె ఇప్పు డెక్కువగా బోధింప వలసి యున్నది. మన అక్కర ఇరుగుపొరుగువారియందు హెచ్చిపోవుచున్నది, మనయందు తగ్గిపోవు చున్నది. మనము మార్పు చెందినచో ప్రపంచము మార్పు చెందును; మనము పరిశుద్ధుల మగుచో, లోకము పరిశుద్ధ మగును. ఇతరులలోని చెడుగును నే నేల చూడవలె ననునదే ప్రశ్న. నేను చెడియుండిననే కాని ఇతరులలో చెడుగును చూడ జాలను. నాలో సారము లేకపోయిననేగాని నాకు దుఃఖము కలుగదు. నేను పసివాడనుగా నున్నప్పుడు నాకు దుఃఖము కలిగించినవి నన్నిప్పుడు దుఃఖపెట్ట జాలవు. విషయి మారెను. కనుక, విషయముకూడ తప్పక మారు నని వేదాంతము చెప్పుచున్నది. మనము ఆయద్భుత సమత్వమును అభేదమును అందుకొన్నప్పుడు పాపము అనీ, అనర్థమునకు కారణము లని యిప్పు డనుకొనుచున్న వానిని చూచి నవ్వుకొందుము. వేదాంతమున ముక్తిప్రాప్తి అని దీనికే పేరు. ఈసమత్వమును అభేదమును వర్ధిల్లుటే ఆ మోక్షము సమీపించు చుండుటకు గుర్తు. సుఖదుఃఖములలో సమత్వ ముండ వలెను. జయాపజయములలో సమత్వ ముండ వలెను. అట్టి మనస్సు మోక్షమును సమీపించుచున్న దన దగును.

మనస్సును జయించుట సులభమైన పని కాదు, ఏస్వల్ప నిమిత్తమైనను, ఆగ్రహమునకు గాని, అపాయమునకుగాని ఏ యించుక అవకాశము కనబడినను మనస్సు తరంగమువలె ఎగిరి పడును. ఆ మనస్సుల పరిస్థితి ఏ మందుము! మన స్సీ విధముగా మార్పులకు వశమై పోవుచుండగా ఆధ్యాత్మికతను గుఱించి, గొప్ప తనమునుగుఱించి ఏ మన గలము? మనస్సునకు గల ఈ యస్థిరత్వము మాఱిపోవలె. మనపై నెంతవఱకు బాహ్యప్రపంచము ప్రభావము చూప గలదో, వెలుపలి శక్తులను లక్ష్యపెట్టక మన కాళ్లపై మన మెంతవఱకు నిలబడగలమో మనలనే మనము ప్రశ్నించుకొనవలె. విశ్వములోని సకలశక్తులు కలసియైనను మన స్థైర్యమును చెదరగొట్ట జాలని స్థితి మనము పొందగలిగినప్పుడే మనము స్వతంత్రుల మైనట్టు; అంతకు ముందు గాదు. అదియే మోక్షము. అది యిక్కడ కలదే గాని మఱెక్కడను లేదు; అదియు ఈ క్షణముననే. ఈ భావమునుండి, ఈ ఊటనుండి సుందరమైన భావవాహినులు లోకముపై ప్రవహించినవి. అవి ప్రకటితములయిన తీరును బట్టి, చాలవఱ కపార్థము చేసికొన బడినవి. పైపైనిచూచిన అవి పరస్పరము విరుద్ధములుగాకనబడును. ప్రతిజాతిలోను ఈశ్వరాన్వేషణాపరాయణులు పలువురు సాహసముతో బాహ్యప్రపంచముతో సంబంధమును వదలుకొని అడవులకో,కొండగుహలకో తపస్సు చేసికొనుటకుపోవుచుండుటను గాంచుచున్నాము, ఈతలం పొక తీరు. తేజస్వంతులయిన ఆదర్శమహాపురుషులు సంఘములోనికి వచ్చి, నిఱుపేదలును, దుఃఖార్తులు నగు సోదరమానవుల సముద్ధరించుటకు కృషిసల్పుట కాంచుచున్నాము. స్థూలదృష్టికి ఈరెండు పద్ధతులును పరస్పరవిరుద్ధములుగా కనిపించును. పర్వతగుహలో ఏకాంతముగనుండువాడు సోదర మానవలోకోద్ధరణకు పాటుపడుచున్నవానిని చూచి, ఏవగింపుతో నవ్వుకొని యిట్లనును: "ఎంతటి మౌర్ఖ్యము! మనకు కర్తవ్య

మేమి కలదు? మాయాప్రపంచ మెప్పటికిని మాయాప్రపంచము గానే యుండును. దానిని మార్చుటకు సాధ్యము కాదు.'' నేను భారతదేశములోని పురోహితు నొకనిని ''నీకు వేదాంతమునందు నమ్మకము కలదా?'' అని యడిగినచో, ''అదే నా మతము. తప్పక నమ్మెదను. అదే నా ప్రాణము.'' అని యతడు చెప్పును. సరే, సర్వప్రాణిసమత్వమును సర్వగతమగు అభేదమును అంగీకరింతువా?'' అని యడిగినచో, ''తప్పక అంగీకరింతును.'' అని యనును. మఱు క్షణముననే నిమ్నవర్ణమువాడు పురోహితుని సమీపించినచో అతనిని తప్పుకొనుటకు పురోహితు డెగిరి వీధి ఆవలిచివరకు దూకును. ''ఎందు కట్లు ఎగిరి దూకితి'' వని యడిగిన పక్షమున, ''అతడు తాకిన నేను మైలపడుదును.'' అని బదులు చెప్పును. ''ఇప్పుడే కదా, మన మందఱము ఒక్కటే అని, ఆత్మలలో భేదము లేదని యంగీకరింతు నని చెప్పితివి?'' అని మరల ప్రశ్నించినచో, ''ఓహో! అది గృహస్థులకు సిద్ధాంతము మాత్రమే; నే నడవులకు పోయినప్పుడు ప్రతివానిని నాతో సమానునిగా చూచెదను.'' అని సమాధానము చెప్పును. ఇంగ్లండులో ధనవంతుడు, ఉత్తమవంశసంజాతుడు అయిన గొప్పవాని నెవనినయినను పలకరించి, ''మానవు లెల్లరు భగవంతునినుండివచ్చినవారే కనుక విశ్వమానవసౌభ్రాత్రమందు క్రైస్తవధర్మము ననుసరించి నమ్ముదువా?'' అని యడుగుడు. నమ్ముదు నని యతడు చెప్పును. కాని, అయిదు నిమిషము లయినను కాక మునుపే సామాన్యజనులను దూషించుచు కేకలు వేయును. ఈ విధముగా నీ భావము పెక్కువేల సంవత్సరములుగా సిద్ధాంతముగానే ఆచరణకురాకే నిలిచిపోయినది. అందఱును గ్రహింతురు. సత్యమే అని ప్రకటింతురు. ఆచరణలో పెట్టు డను సరికి, అందుకు పెక్కులక్షలసంవత్సరములు పట్టు నందురు.

ఒకానొక రాజు నాస్థానమున పెక్కుమంది సభ్యు లుండిరి. వారిలో ప్రతియొక్కడును ప్రభువుకొఱకు తన ప్రాణములను

అర్పించుటకు సంసిద్ధముగా నున్నా నని, ఇంతవఱకు పుట్టిన వా రందఱికంటె తానే నిజాయితి గలవాడ నని చెప్పుకొనెను. ఒక నాడు సన్న్యాసి యొకడు రాజుకడకు వచ్చెను. నిజాయితీ, నూటికి నూఱుపాళ్లు గలిగిన సభ్యులు తన ఆస్థానములోనున్నంతమంది మఱేరాజుకడను లే రని ఆరాజు స్వామితో చెప్పెను. సన్న్యాసి మందహాసము చేసి, తన కా మాటయందు నమ్మకము లే దనెను. సందేహ మున్నచో పరీక్షించి తెలిసికొనవచ్చునని రాజు చెప్పెను. అంతట తాను గొప్పయజ్ఞము చేసి, రాజుపరిపాలన చిరకాలము వర్ధిల్లునట్లు చేయుదు నని సన్న్యాసి చెప్పి, తన పరీక్షకు ఒకతొట్టి కట్టించి, అర్ధరాత్రివేళ సేవకులలో ఒక్కొక్క డొక ముంతెడు క్షీరమును అందు పోయున ట్లాజ్ఞాపింపు డని కోరెను. రాజు నవ్వి, ''ఇదేనా, పరీక్ష ?'' అనెను. రాజు అంత తనసభ్యులను రప్పించి వారు ఏమి చేయవలెనో చెప్పెను. వా రందఱు రాజుకోరికకు సంతోషముతో సమ్మతించి, వెళ్లి పోయిరి. రాత్రివేళ వా రందఱు వచ్చి, తెచ్చిన బిందెలను తొట్టిలో గ్రుమ్మరించి పోయిరి. తెల్ల వాఱిన తరువాత చూడగా తొట్టి నిండుగా నీరుమాత్రమే యుం డెను. సేవకులను సమావేశపఱచి ఆవిషయమై రాజు ప్రశ్నిం చెను. తక్కినవా రందఱు చిక్కని పాలు పోయుదురు కదా, నే నొక్కడను నీరు పోసిన, కనుగొనువా రుండ రని వారిలో ప్రతి వాడును అనుకొనెను ; దురదృష్టవశమున మనలో చాలమందికి ఇట్టి భావమే కలదు ; మనవిధులను కథలోని రాజునాస్థానికుల వలెనే చేయుచుందుము.

లోకములో సమత్వ మెంతగానో ఉన్నది ; కనుక కొంచె పాటి దగు తన ప్రత్యేకపుహక్కు నెవరును కనుగొన రని పురో హితుడు చెప్పును. మన ధనికులును అటులనే పలుకుదురు. ప్రతి దేశములోని క్రూరప్రభువులును ఆవిధముగానే చెప్పుదురు. అణగ ద్రొక్కెడివారికంటె అణగద్రొక్కబడెడివారికే ఎక్కువ ఆసపాటు కలదు. క్రూరప్రభువులు విముక్తి నొంద చాల కాలముపట్టును.

తదితరుల కంతకాలము పట్టదు. సింహమునకు గల క్రౌర్యము కంటె నక్కక్రౌర్య మెక్కువ భయంకరమైనది. సింహము ఒక్క దెబ్బకొట్టును తరువాత కొంతసేపు మిన్న కుండును. కాని నక్క తనకు లోకువైనదానిని పట్టువిడువక తఱుముచుండును. ఒక్క అవకాశము నైనను విడిచిపెట్టదు. పురోహితవృత్తి, స్వతస్సిద్ధము గానే క్రూరము, హృదయశూన్యమైనది. పురోహితవర్గము ఏర్పడి నప్పుడెల్ల మతము క్షీణించుట కదే కారణము. వేదాంత మిట్లనును : ప్రత్యేకపుహక్కును గుఱించిన తలంపును మనము విడిచిపెట్టవలె. అప్పుడే ఆస్తిక్యము సిద్ధించును. అంతవఱకు ఆస్తిక్యము లేనే లేదు.

"నీ యాస్తి సర్వస్వము నమ్మివేసి పేదల కిమ్ము" అని క్రైస్తు చేసిన బోధయందు మీకు నమ్మక మున్నదా? వాక్యములను విరిచి క్లిష్టవ్యాఖ్యానము చేయ నక్కరలేదు. సత్యమును ఉన్నది ఉన్నట్లు గ్రహించినచో ఆవాక్యములో కేవల సమత్వమున్నది. మూలవాక్యములను క్లేశపఱుపజూడకుడు. జీసస తన బోధలు వినిన ఏపిడికెడు మంది యూదులతో మాత్రమే ఆబోధలను కావించె నని చెప్పగా వింటిని. అటు లయిన జీసను చేసిన తక్కిన ఉపదేశములను గుఱించికూడ అలాగే చెప్ప వచ్చు.

గ్రంథములోని వాక్యములను క్లిష్టపఱుపక సత్యమును ఉన్నదాని నున్నట్లు ధైర్యముతో నెదుర్కొనుడు. ఆలక్ష్యమును మన మందుకొన లేక పోయినచో మన దౌర్బల్యము నంగీకరింతము. అంతే కాని లక్ష్యమును చెఱుపవలదు. ఎప్పటికో ఒకప్పటికి దాని నందుకొనగల మని ఆశించి, సాధన చేయుదము. గ్రంథములో ఈ వాక్య మున్నది :— "నీయాస్తి సర్వస్వము నమ్మివేయుము, పేదల కిమ్ము, నా వెంట రమ్ము." ప్రత్యేకపుహక్కును, హక్కుకై మనలో ఏదేది పాటుపడునో దానినెల్ల అణగద్రొక్కి సర్వమానవైక్యమును అనుభవమునకు తెచ్చు

జ్ఞానము పొందుటకు కృషిచేయుదము గాక. మీరుకొంత ఎక్కువ నాజూకుగా మాట్లాడగలరు కనుక వీథిలోని పామరునికంటె మీరు అధికు లని భావింతురు. ఈ విధముగా భావించునప్పుడు మీరు స్వాతంత్ర్యమువైపు పురోగమించుట లేదని, మీ కాళ్లకు క్రొత్తసంకెల నొకదానిని కల్పించుకొనుచుంటి రని గుర్తింపుడు. అన్నిటికి పైగా ఆధ్యాత్మికాహంకారము మీకు కలిగినదా, మీకు దుఃఖమే. ఇంతటి ఘోరబంధ మిదే గాని మఱొకటికాదు. సంపద గాని వేఱు ఏహృదయబంధము గాని ఆత్మ నింతగా బంధింపజాలదు. "ఇతరుల కంటె నేను పరిశుద్ధుడను." అనెడి భావముకంటె మానవహృదయములో ప్రవేశింప గల ఘోర భావము మఱొకటి లేదు. ఏయర్థములో నీవు పరిశుద్ధుడవు? అందఱిలో ఉన్న దేవుడే నీలో ఉన్నాడు. నీ కిది తెలియనిచో ఏదియునే తెలియ దన్న మాట. భేద మెట్లుండ గలదు? అంతయు నొక్కటే. ప్రతిజీవి పరాత్పరుని ఆలయమే; ఆ విషయము నీవు గ్రహించినచో మేలు. లేదేని, నీకు ఆధ్యాత్మికపరత ఇక మీద కలుగవలసియున్నది.

# ప్రత్యేకపుహక్కు

(లండనులోని సెసేమ్క్లబ్బులో చేసిన ఉపన్యాసము)

ప్రకృతియంతటను రెండుశక్తులు పనిచేయుచున్నట్లు కనవగుచున్నది. వీనిలో నొకటి నిరంతరము వేఱుచేయునది, మఱొకటి యనుక్షణము ఐక్యమును కూర్చునది; అధికాధికముగా ప్రత్యేకవ్యక్తులను ఏర్పఱచునది యొకటి; వ్యక్తుల నొక్కటిగా చేర్చి సకలవిభేదముల మధ్య నున్న అభేదమును నిరూపించునది మఱొకటి. ప్రకృతిలోని ప్రతిరంగమందును, మానవజీవితములోని ప్రతిరంగమందును ఈ రెండుశక్తులకు ప్రభావ మున్నదనుట కనబడుచున్నది. భౌతికరంగమున నీ రెండుశక్తులు వేర్వేఱుగా పనిచేయుచుండుట మనకు సర్వదా కనబడుచున్నది. ఈ రంగమున ఈ శక్తులు వ్యక్తులను వేఱుచేయుచున్నవి; ఇతరవ్యక్తులకంటె స్పష్టమగు విశిష్టతను కలిగించుచున్నవి; తిరిగి తరగతులుగా, జాతులుగా కలుపుచున్నవి; రూపములలో, వ్యక్తములగు లక్షణములలో పోలికలను ప్రస్ఫుటము చేయుచున్నవి. మానవుని సాంఘికజీవితమున నున్న విధానముకూడ ఇదే. సంఘ మనునది ఏర్పడిననాటినుండియు చీలజేయుచు కూడదీయుచు ఈ రెండు శక్తులు పనిచేయుచునే ఉన్నవి; ఇవి పనిచేయుతీరు బహువిధములుగా నున్నది. ఇది వివిధకాలములలో, వివిధసీమలలో, వివిధ నామములతో వ్యవహరింపబడుచున్నది. కాని, ప్రధానతత్త్వ మన్నిటియందును గలదు; విభేదములను కల్పించునది యొకటి; ఏకత్వమును కూర్చునది మఱియొకటి. ఒకటి వర్ణమును నిర్మించును; మఱొకటి దానిని పడగొట్టును. వర్గములను కల్పించి, వారికి ప్రత్యేకాధిక్యమును కలిగించున దొకటి; వానిని విధ్వంసముచేయునది మఱొకటి. విశ్వము ఈ రెండుశక్తుల రణరంగముగా నున్న

ట్టున్నది. ఈ విషయమై ప్రతిపాదింపబడు ఒకవాదము : ఏకీకరణ ప్రవృత్తి పనిచేయుచున్నను మనశక్తికొలది దానిని నిరోధింపవలె. ఐక్యము మృత్యువునకు దారిచూపును. సంపూర్ణమైన ఐక్యము సంపూర్ణమైన ప్రళయమే. లోకములో భేదిల్లు ప్రవృత్తి ఆగిన నాడు లోకమునకే అవసానము గల్గును. మనము చూచుచున్న జగమునకు కారణము 'భేదమే'. ఏకీకరణము దృశ్యవస్తువుల నెల్ల నిర్జీవమును ఏకరూపము నగు ప్రకృతిపదార్థముగా జేసివేయును. అట్టిస్థితిని నివారింపవలె నని మానవజాతి కాంక్షించుట స్వాభావికమే. ఈ వాదమును మన చుట్టు నున్న సమస్తవస్తువులకు, సంఘటనలకు అన్వయింపజేయుచున్నారు. భౌతికదేహములోను, సంఘవర్గీకరణములోనుకూడ పరిపూర్ణమైన ఏకరూపత గల్గినచో, సహజమృత్యువే సంఘవినాశమే ఫలించును. ఆలోచనయందు, అనుభూతియందు పరమైక్యము గల్గినచో మానసికపతనమును వినాశమునే ఫలించును. కనుక ఏకరూపతను నిషేధింపవలె. ఇది యొక పక్షమున చేయు వాదము. ఈ వాదము ప్రతిదేశమునందును కలదు, ప్రతికాలమునందును కలదు. ప్రతిపాదించు భాషమట్టుకే భేదిల్లును. భారతదేశములో విభేదములను, వర్ణములను నిల ద్రొక్క గోరినప్పుడును, ఇతరులకు లేక, కొందఱకుమాత్రమే గల ప్రత్యేకపుహక్కులను నిలద్రొక్కగోరినప్పుడు బ్రాహ్మణులు చేయు వాద మిదియే. వర్ణవ్యవస్థానిర్మూలనము సంఘనిర్మూలనమునకే దారి చేయు నని వారు చెప్పుచుందురు. ఇందుకు ప్రమాణముగా వారు తమసంఘము తక్కినసంఘములన్నిటికంటె నెక్కువ కాలముగా నున్న దన్న చారిత్రకాంశమును ధైర్యముతో చూపుదురు. వా రీ వాదమును కావించినప్పుడు పైకి కొంత బల మందు కనిపించును. కొన్ని ప్రమాణవాక్యముల నుదాహరించుచు, వ్యక్తి జీవితమును పొడుగించుటలో ఏది తక్కినవానికంటె ఎక్కువో అదియే అల్పకాలజీవితములకు హేతువైనవానికంటె నిజముగా ఉత్కృష్టమైనదిగ నుండితీర వలె నందురు వారు.

ఇది యిట్లుండగా, ఐక్యమును సమర్థించువారుగూడ అన్ని కాలములలోను ఉండియున్నారు. ఉపనిషత్తుల, బుద్ధుల, క్రైస్తుల తదితర మతమహాచార్యుల అందఱ కాలమునుండియు నేటిదనుక ఆధునిక రాజకీయాశయములలోను, పీడితులై నలిగిపోవుచున్న వారి వాక్కులలోను, ప్రత్యేకపుహక్కులకు నోచుకొననివారి మాటలలోను ఉద్ఘాటిత మగునది ఈ ఐక్యమే, అభేదమే. కాని, మానవప్రకృతి తన్ను నిలద్రొక్కుకొనును. ప్రత్యేకపుహక్కులు గల వారు వానిని నిలుపుకొన గోరుదురు. ఎంత మోస్తైన పాక్షికమైన సమర్థనము వారికి లభించినను, దానిని వారు గట్టిగ అవలంబింపక తప్పరు. ఈ మాట యిరుపక్షములవారికి నన్వయించును.

ఈ ప్రశ్న తత్త్వశాస్త్రమందు మఱొక రూపము దాల్చును. ఈ దృశ్యమానప్రపంచమున ఐక్యమును సాధించుటకై మనము దేనికొఱకును అన్వేషింప నవసరము లేదని బౌద్ధు లందురు. ఈ యింద్రియగోచరమగు జగత్తుతోనే తృప్తి చెందవలె నని వారందురు. జీవిత మెంత నిస్సారముగాను, దుర్బలముగాను కనిపించినను, వైవిధ్యమే జీవితసారము; అంతకు మించి మన కేమియు లభింపజాలదు. ఉన్న దెల్ల ఏకత్వమే అని వేదాంతి వక్కాణించును; నానాత్వము మన యింద్రియములకు మాత్రము గోచరమగును. అది కేవలము ఆభాసము, క్షణికము. "నానాత్వమును గమనింపకు, ఏకత్వమునకు మరలుము" అని వేదాంతి పలుకును. "ఐక్యమును విడనాడుము, అది కేవలము భ్రమయే; నానాత్వము నకే పొమ్ము" అని బౌద్ధు డనును. మతమునందు, తత్త్వశాస్త్రమునందు గల ఈ యభిప్రాయభేదములు మన కాలమువఱకు అనువర్తించుచునే ఉన్నవి. ఏల యన జ్ఞానసూత్రముల మొత్తము చాల తక్కువే. తత్త్వశాస్త్రము, తత్త్వజ్ఞానము, మతము, మతజ్ఞానము అయిదువేలసంవత్సరములకు పూర్వమే తమ పర

మోచ్చస్థాయిని పొందినవి. ఆ సత్యములనే నేడు మనము వివిధ భాషలలో మరల మరల చెప్పుకొనుచున్నాము. ఒక్కొక్కప్పుడు క్రొత్త ఉదాహరణములతో వానికి పుష్టిని మాత్రము కలిగించుచున్నాము. కనుక నేటికిని ఉన్న కలహము ఇదే. ఈ దృశ్యమానప్రపంచమును, నానాత్వమును అంటిపెట్టుకొని యుండవలసినదే అని, వైవిధ్య ముండి తీర వలసినదే అని, అది పోయినచో సర్వము పోవు నని ఘనముగా యుక్తిబలమును ప్రదర్శించుచు ఒక పక్షము వాదించును. దేనిని మనము జీవిత మందుమో అది కలునది నానాత్వముచేతనే అని అందురు వారు. మఱొక పక్షము ఐక్యమే మన లక్ష్యమని ధైర్యముతో పలుకును

నీతిశాస్త్రము దగ్గఱకు వచ్చుసరికి పెద్ద మార్పు గననగును. ఈ కలహమునుండి సాహసముతో వైదొలగు శాస్త్ర మది యొక్కటే కాబోలు! ఏల యన నీతి అనగా ఐక్యమే. ప్రేమయే దాని ప్రాతిపదిక. వైవిధ్యముపై దాని చూపు పాఱదు. నీతిశాస్త్రమునకు లక్ష్యము ఐక్యము; అభేదము. మానవకోటి నేటివఱకు కనుగొన్న పరమోత్కృష్టమైన నీతిసూత్రావళు లేవియు నానాత్వమును గుర్తింప లేదు. నిలిచి, వైవిధ్యమును చూచుటకు వానికి వ్యవధి లేదు; ఐక్యసాధనమే వాని లక్ష్యము. భారతీయుల మనస్సుకు — అనగా, వేదాంతుల మనస్సుకు — విభజించి చూచుట స్వభావము. సమస్తవిభాగపరిశోధనలచేత అది తుద కీ ఐక్యమును కనుగొనెను. సమస్తమునకును ఐక్య మనెడి ఈ ఒక్క ఆశయమును ఆధారముగా చేయ సమకట్టెను. ఈ ఐక్యమును ఎచ్చటను గుర్తింపలేని వారు(బౌద్ధులు)గూడ భారతదేశమున గలరని గుర్తించితిమి కదా. వారికి సత్యమంతయు నొక మార్పుల కుప్ప. ఒకదానికిని మఱొకదానికిని సంబంధమే లేదు.

ప్రొఫెస్సరు మాక్సుముల్లరు తన గ్రంథములలో నొకచోట ఒక కథ చెప్పియున్నాడు. నాకు జ్ఞప్తి యున్నది. అది ప్రాత

గ్రీకు కథ: ఒక బ్రాహ్మణుడు పూర్వ మొకప్పుడు ఆథెన్సునగరములో సాక్రటీసును చూచెనట. "పరమోత్కృష్టజ్ఞాన మేది?" అని బ్రాహ్మణుడు అడిగెనట. "మానవుని తెలిసికొనుటే సమస్త జ్ఞానమునకు లక్ష్యము, ప్రయోజనము" అని సాక్రటీసు చెప్పెనట. "దేవుని తెలిసికొనక మానవు నెట్లు తెలిసికొనగలవు?" అని బ్రాహ్మణు డనెనట. ఒకపక్షము గ్రీకుపక్షము. దానికి నేటి యూరపు ప్రాతినిధ్యము వహించుచున్న దనవచ్చును. ఈ పక్షము మానవుని తెలిసికొనవలె నని పట్టు పట్టుచున్నది; ప్రపంచము లోని ప్రాచీనమతములకు ప్రతినిధి యన దగు భారతీయపక్షము ఈశ్వరుని తెలిసికొనవలె నని పట్టుపట్టుచున్నది. ఒకటి ప్రకృతి యందు దేవుని, మఱొకటి దేవునియందు ప్రకృతిని దర్శించును. నేడీ రెండు పార్శ్వములకు తటస్థముగా నిలబడి సమగ్రసత్యమును నిష్పాక్షికముగా దర్శింప గల భాగ్యము మనకు దక్కిన ట్లున్నది. నానాత్వ మున్న మాట వాస్తవము. జీవిత ముండ వలె నన్న నానాత్వ ముండియే తీర వలె. నానాత్వములోను దానిమఱుగు నను ఐక్య మున్న మాటకూడ వాస్తవమే. దానిని దర్శించియే తీర వలె. ప్రకృతియందు దేవుడు కన నగు నను మాట నిజమే, దేవునియందు ప్రకృతి కన నగు నను మాటకూడ నిజమే. మానవుని గుఱించిన జ్ఞానమే పరమోత్కృష్టజ్ఞాన మనుటయు, మానవుని తెలిసికొనుటమూలముననే మనము దేవుని తెలిసికొనగల మనుటయు నిజమే. ఈశ్వరజ్ఞానము పరమోత్కృష్టజ్ఞాన మనుటయు ఈశ్వరుని తెలిసికొనుటమూలముననే మనము మానవుని తెలిసికొనగల మనుటయు కూడ నిజమే. ఈ రెండు దృక్పథములు పరస్పరవిరుద్ధములుగా నున్నట్లు కనబడినను, నిజమున కీ రెండును మానవప్రకృతికి అవసరమే. అఖిలవిశ్వము అభేదవిభేదముల లీలావిలాసమే; నిఖిలప్రపంచము అనంతమునందు సాంతము క్రీడించుటే. ఈ రెంటిలో నొకదానిని విసర్జించి, మఱొకదానిని స్వీకరించుట సాధ్యము కాదు. అయినను ఈ రెండును ఒక్క-

దృష్టితోనే గ్రహింపదగు సత్యములు కావు; ఒక్క అనుభవమునకే చెందినవి కావు; కాని, ఈ తీరుననే జగల్లీల సాగిపోగలదు.

నీతికంటె ముఖ్యముగా మతమే మన ప్రస్తుతవిషయము. దీనిని గుఱించి పరిశీలించుచో — నానాత్వమంతయు నశించి పోయి, ఏకత — నిర్జీవ మగు ఏకరూపత నిల్చుట అనునది జీవిత మున్నంత వఱకు అసంభవము. అది వాంఛనీయము గూడ కాదు. మఱొకప్రక్క ఏకత్వ మీ వఱకే ఉన్న దను మాటకూడ నిజమే. అదియే విశిష్టత — ఏకత్వము సృష్టింపవలసినది గాదు. అది యీ వఱకే ఉన్నది. అది లేనిచో ఈ నానాత్వము మనకు గోచ రింపనే గోచరింపదు. దేవుడు మన మిక సృష్టించుకోవలసినవాడు కాడు. అత డిదివఱకే ఉన్నాడు. సకలమతములు ఈ విషయ మునే చెప్పుచున్నవి. సాంతమును చూచినవా డనంతమునుకూడ చూచినవాడే. కొందఱు సాంతముపై ఊనిక నుంచిరి, వెలుపల సాంతమును చూచితి మని ఘోషించిరి; మఱికొందఱు అనంత ముపై ఊనిక నుంచిరి, తమకు అనంతముమాత్రమే కననైన దని చాటిరి. ఒకటి వినా, రెండవదానిని చూచుట సాధ్యము కాదనుట తర్కశాస్త్రదృష్టిలో అనివార్య మని మనము గుర్తించితిమి. కనుక ఈ అభేదము, ఈ ఏకత్వము దీనిని పరిపూర్ణత్వ మనినను అనవచ్చు — ఇది తయారుచేసికోవలసినది గాదు; ఇది యీ వఱకే ఉన్నది, యిక్కడే ఉన్నది. దానిని మనము గుర్తింప వలసియున్నది; అవగాహనచేసికొనవలసియున్నది. మనకు తెలిసి నను, తెలియక పోయినను, స్పష్టముగా భాషలో మనము చెప్ప గలిగినను, చెప్పలేకపోయినను, ఇంద్రియగోచర మగు వస్తువును చూచినంత స్పష్టముగా, బలముగా దీనిని మనము చూచినను, చూడలేక పోయినను ఇది ఉండనే ఉన్నది. ఇది యున్న దని తర్కశాస్త్రదృష్టిలో అంగీకరింపక మనకు తప్పదు. ఇది లేనిచో, సాంతమును చూచియే యుండము. వస్తువు, దాని గుణములను గుఱించి పూర్వపువాదమును నేను ప్రస్తావించుట లేదు. ఏకత్వ

మును గుఱించియే నేను చెప్పుచున్నాను; ఈ సమస్తదృశ్యమాన జగత్తుమధ్య మీరు, నేను వేర్వేఱు అన్న జ్ఞానముతోపాటు, దాని ననుసరించియే అదే ముహూర్తమున మీరు, నేను వేఱు కామన్న జ్ఞానమును గలుగుచున్నది. ఐక్యమే లేనియెడల జ్ఞానమే యసాధ్య మయ్యెడిది. ఈ ఐక్యాశయము చూచుట గాని, తెలిసి కొనుట గాని యసంభవము. కనుక రెండును సమాంతరములుగా సాగ వలసినదే.

కాబట్టి పరిస్థితులలో సంపూర్ణమైన ఐక్యము స్థాపించుటే నీతిశాస్త్రలక్ష్య మగుచో అది సాధ్యము కా దనియే తోచును. మన మెంతగా ప్రయత్నించినను, మానవు లెల్లరు ఏనాటికిని ఒక్కరీతివారు కాజాలరు. జన్మచేతనే మానవులలో వైవిధ్య మున్నది; కొంద ఱెక్కువ బలాఢ్యులుగ నుందురు; కొందఱ కెక్కువ సహజ శక్తు లుండును; ఇతరుల కుండవు. ఎట్టి లోటును లేని దేహములు కొందఱ కుండును; ఇతరుల కుండవు. ఈవిభేద మును మన మే నాటికిని తొలగింపజాలము. మఱొక వంక ప్రవక్తల అద్భుతధర్మసూక్తులు మనచెవులలో ప్రతిధ్వనించు చుండును: "అన్నిటియందును సమానముగా గల ఒక్కభగవం తునే దర్శించిన ఋషి ఆత్మకు ఆత్మచేత కీడు చేయడు. అట్లతడు మహోన్నత గమ్యమును చేరుకొనును. ఈ ఏకత్వమునం దెవరి మనస్సులు స్థిరపడినవో వా రీ జన్మమునందే ద్వంద్వజీవితమును గెల్చినవారు; ఏల యన భగవంతుడు పవిత్రుడు. అత డందఱ కొక్కడే. కనుక అట్టివారు భగవద్గతజీవను లని చెప్పుదురు." ఇది సత్యము కా దని మన మన లేము గదా; కాని బాహ్య రూపములలోను పరిస్థితులలోను ఏకత్వమును సాధింపజాలని చిక్కును కూడనే ఉన్నది.

కాని, సాధ్యమైన దే మనగా ప్రత్యేకపుహక్కును తొల గించుట. నిజమునకు లోకమునకు ముం దిప్పు డున్న కర్తవ్య మదియే. సంఘ జీవితములన్నింటను ప్రతి దేశమందును, ప్రతిజాతి

యందును ఆపోరాటము జరుగుచునే యున్నది. చిక్కేమనగా కొందఱు మఱి కొందఱికంటె నధికమేధావంతులయి యుండుట గాదు. కాని, వారు, తమ కెక్కువ తెలివితేట లున్న కారణమున, అంతటి తెలివితేటలు లేని వారికి శరీరసౌఖ్యములుకూడ లేకుండ నపహరించుటే చిక్కు. అట్టి దురాక్రమణమును నిర్మూలించుటకే పోరాటము. కొందఱు మఱి కొందఱికంటె నెక్కువబలాఢ్యులయి యుండుట, కనుక, వారు సహజముగా దుర్బలుల నోడించి, లొంగ దీసికొనగలుగుట మనము ప్రత్యక్షముగా కనుచున్న విషయమే. కాని బలము కలిగినంతమాత్రమున ఈజీవితములో పొంద దగు సమస్తసౌఖ్యములను తామే కవ్వుకొనుట ధర్మసమ్మతము గాదు. అట్టివిధానమును ప్రతిఘటించుటకే పోరాటము సాగుచున్నది. కొందఱు తమ సహజాభిరుచులచేత ఇతరులకంటె నెక్కువ ధనమును సంగ్రహింపగలుగుట సహజమే; కాని, అధికధనార్జనకు కావలసిన ఈ విశేషశక్తి కారణముగా, అంతధనార్జనచేయలేని వారిని పీడించి, తమకాలిక్రింద అదిమిపెట్టుట ధర్మబద్ధము గాదు. ఇట్టిపద్ధతిని కూలద్రోయుటకే పోరాటముజరుగుచున్నది. ప్రత్యేకమైన యోగ్యతవలన ఇతరులకు లేని ప్రత్యేకసౌఖ్యము ననుభవించుట యుగయుగములుగా జరుగుచున్నది. దీనిని నిర్మూలించుటే నీతిసూత్రావళికిలక్ష్యము. అనగా నానాత్వమును నశింపజేయకే ఐక్యమును, అభిన్నత్వమును సాధించుట.

ఈనానాత్వమంతయు శాశ్వతముగా నుండనిండు. జీవితసారమే యది. శాశ్వతముగా మన మందఱ మీరీతిని క్రీడింతము. మీరు ధనవంతులుగ నుండుడు, నేను పేదవాడనుగా నుందును; మీరు బలవంతులుగా నుండుడు, నేను బలహీనుడనుగానుందును; మీరు విద్యాధికులుగ నుండుడు, నేను విద్యావిహీనుడనుగా నుందును; పారమార్థికపరతలో మీరు చాల పై మెట్టున నుండుడు, నేను మీకంటె తక్కువస్థాయిలో నుందును. అట్లున్న నేమి? అటులనే యుందము. కాని, శారీరకముగా, మానసికముగా

మీరు బలాఢ్యు లన్న కారణముచేత నాకంటె మీ కెక్కువ ప్రత్యేకత యుండగూడదు. మీ కెక్కువ ధనమున్నంతమాత్రమున నాకంటె మీరు గొప్పవారనుకొనుట కాస్పదము లేదు. పరిస్థితులు భిన్నములుగా నున్నను ఆ ఐక్యమే ఇక్కడ గూడ గలదు.

నీతిశాస్త్రమున కేవలమున్న పనియు ఇకముందుగూడ నుండు పనియు ఏ మనగా — నానాత్వము నంతనొందించుట కాదు, బాహ్యప్రపంచమున ఏకత్వమును స్థాపించుట కాదు, అది యసాధ్యము. దానివలన నాశనము, మృత్యువు సంభవించును. ఈ నానాత్వమంతటికిని మఱుగుననున్న ఐక్యమును, గుర్తించుట. మనల నేది యెంతగా భయభ్రాంతులను చేయజూచుచున్నను అంతరంగమున నున్న దేవుని గుర్తించుట; పైకి దౌర్బల్య మెంతగా కనిపించుచున్నను అనంతశక్తియే ప్రతియొక్కనికి గుణ మని గుర్తించుట; ఉపరిభాగమం దపవిత్రత ఎంత మిక్కుటముగా ప్రత్యక్ష మగుచున్నను ఆత్మ పవిత్రత నిత్య మనియు అనంత మనియు, సార మనియు గ్రహించుట—ఇది మనము తెలిసికొని తీరవలసిన విషయము. సత్యములో సగభాగమే గ్రహించుట, ఒకపక్షమే అవలంబించుట—అపాయకరము; అది కలహ కారణ మగును. మనము సమగ్రవిషయమును ఉన్నదియున్నట్టు గ్రహింపవలె. దానిమీద సుస్థిరముగా నిలబడవలె. దాని వ్యష్టిజీవితములో నేమి సమష్టి జీవితములో నేమి ప్రతిభాగమందును మనము విరివి నొందింపవలె.

# భవిష్యన్మతము వేదాంతమా?

(శాన్ఫ్రాన్సిస్కోలో 1900 సంవత్సరము ఏప్రిలు 8 వ తేదీని చేసిన ఉపన్యాసము)

మీలో రమారమి నెలదినములుగా నా యుపన్యాసములను వినుచున్న వారికి ఈపాటికి వేదాంతశాస్త్రములోని ఆశయములు సుపరిచితము లయియుండవలె. ప్రపంచములోని మతము లన్నిటిలో వేదాంతము ప్రాచీనతమ మైనది; కాని, అది ప్రజాప్రీతిని చూరగొన్న దని చెప్పుట కెంతమాత్రమును వీలు లేదు. కనుక, 'భవిష్యన్మతము వేదాంతమా'' అను ప్రశ్నకు సమాధానము చెప్పుట బహుకష్టము.

అసలు ఏనాటికైనను వేదాంతము జనబాహుళ్యము మన్నించు మతము కాగలదా యను విషయము నాకు తెలియ దని ప్రారంభముననే మనవిచేయుచున్నాను. అది యేనాటికైనను అమెరికా యునైటెడ్ స్టేట్సువంటి దేశము నంతటిని వశముచేసికొనగలుగునా? వశముచేసికొన గలుగు నేమో. ఏమైనను మన మీ సాయంకాలము చర్చింపబోవు విషయ మిదియే.

ఏది వేదాంతము కాదో దానిని మొదట చెప్ప నారంభింతును. తరువాత ఏది వేదాంత మౌనో దానిని వివరించెదను. వ్యక్తిసంబంధము లేని సూత్రముల పైనే వేదాంతమునకు ఊనిక. మూలసత్యము లని తాను నమ్మినవానిని అది సడలించుకోదు, వదలుకోదు. ఐనను దానికి దేనితోను విరోధము లేదు అనుటను జ్ఞప్తియుంచుకొనుడు.

మతము రూపొందుటకు ముఖ్యముగ నుండవలసినవి కొన్ని కల వన్న సంగతి మీ యందఱకును తెలిసినదే. మొదట,

గ్రంథము అవసరము. గ్రంథమునకు గల ప్రభావము కేవల మద్భుతము! అదే దైన నగు గాక, గ్రంథమునే కేంద్రముగా గొని మానవునిభక్తి వర్ధిల్లును. నేడున్న మతములలో గ్రంథము లేని దొక్కటియును లేదు. హేతువాద మెంత యున్నను ఎంత గొప్పలు చెప్పుకొన్నను మానవకోటి నేటికిని గ్రంథపరతంత్రమే. మీ దేశములో ప్రమాణగ్రంథములేకుండ మతమును స్థాపించు టకు జరిగిన ప్రతిప్రయత్నము విఫల మయినది. భారతదేశములో మతశాఖలు మహావిజయవంతములుగ లేచును. కాని, కొలది సంవత్సరములలోనే అవి యంతరించును. వానికి మూలగ్రంథము లేకపోవుటే అందుకు కారణము. ప్రతిదేశములోను అంతే.

యూనిటేరియను ఉద్యమాభివృద్ధిని, దానిపతనమును పరిశీ లింపుడు. అందు మీదేశపు మహోత్కృష్టాశయము లున్నవి. మఱి అదెందుచేత మెథడిస్టు - బాప్టిస్టు - తదితర క్రైస్తవోద్య మములవలె వ్యాప్తి చెంద రాదు? దానికి ప్రమాణగ్రంథము లేకపోవుటే కారణము. యూదులను చూడుడు. వారొక దేశమునుండి మఱొకదేశమునకు తఱుమగొట్టబడుచున్నారు. అయినను ఆ కొలదిమంది ఏకీభావము గల్గియే వ్యవహరించు చున్నారు. ఎందు కనగా వారికి గ్రంథ మున్నది. పార్శీలను గమనింపుడు — లోకమంతటిలో వారు లక్షమంది మాత్రమే. భారతదేశములో నున్న జైనులు దాదాపు పదిలక్షలమంది మాత్రమే. ఈ పిడికెడుమంది పార్శీలును, జైనులును నిలిచియుండ గల్గుటకు కారణములు వారి గ్రంథములే. తెలిసితిరా? నేడున్న ప్రతిమతమునకు గ్రంథ మున్నది.

మతము రూపొందుట కావశ్యకములైన వానిలో రెండ వది, — పురుషవిశేషమందు పూజ్యభావము. అతడు జగత్ప్రభువు గానో, దివ్యబోధకుడుగానో ఆరాధింపబడును. మానవులు మానవ మూర్తి నారాధింపవలసినదే! వారికి అవతారమూర్తియో,

IAL LIBRARY

Date
DDAPAH.

ప్రవక్తయో, గొప్పనాయకుడో కావలె. ఈ విషయమును నేడు మీరు ప్రతిమతములోను చూతురు. హిందువులకు, క్రైస్తవులకు అవతారమూర్తు లున్నారు. బౌద్ధులకు, మహమ్మదీయులకు, యూదులకు ప్రవక్తలు గలరు. అంతయు నొక్కదానినిగుఱించియే. వారిభక్తియంతయు ఒకానొకనినో కొందఱినో పరివేష్టించి యుండును.

మతమును రూపొందించువానిలో మూడవది—అదొక్కటే సత్యమను నమ్మకము. అటు లయిననే మతమునకు పటిమయు, స్థిరత్వమును కలుగును ; జనులలో దానికి చెల్లుబడి యుండును.

'అందఱికిని స్వేచ్ఛ నొసగ వలె' నను వాదము అంతరించును. ఏల యన అది శుష్కము, మానవులమనస్సులో అది దురభిమానమును పురికొల్పజాలదు ; తనకంటె వేఱైన ప్రతిదాని మీదను అది ద్వేషమును గల్గింపజాలదు. కావుననే 'అందఱికిని స్వేచ్ఛయుండవలె' నను వాదమునకు పతనము మాటిమాటికిని గలుగుచుండును. ఆ వాదమునకు చెల్లుబడి ఏ కొలదిమందియొద్దనో మాత్రమే ఉండును. ఇందుకు కారణము కనుగొనుట కష్టము గాదు. అందఱికి స్వేచ్ఛ కావలయు నను వాదము మనలను నిస్స్వార్థులను చేయుటకు ప్రయత్నించును. మనము నిస్స్వార్థుల మగుట కిష్టపడము. — నిస్స్వార్థతవలన వెంటనే కలుగు ప్రయోజన మేమియు మనకు కనబడదు ; స్వార్థపరులముగ నుండుటచేతనే మన కెక్కువ లాభము కలుగును. మనము పేదలముగాను, బొత్తిగా ఏమియు లేనివారముగాను ఉన్నంతవఱకు 'అందఱికిని స్వేచ్ఛ కావలె' నను వాదమును మన మంగీకరించుచుందుము. ధనము, అధికారము చేతికిచిక్కగానే మనము అమలులోనున్న వ్యవస్థలను మిక్కిలి సమర్థించెడివారముగా మాఱిపోదుము. పేదవాడు ప్రజాస్వామ్యవాది. ధనవంతుడు కాగానే అతడు ఉన్నతవర్గమునకు చెందినవా డయిపోవును. మతవిషయమున కూడ మానవప్రకృతి యిదే విధమున వ్యవహరించును.

ఒకానొక ప్రవక్త అవతరించి, త న్ననుసరించిన వారికి అన్ని విధములైన సత్ఫలములును కల్గు ననును. తనదారిని కాదన్న వారికి శాశ్వతనరకము కల్గు ననును. అత డా విధముగా తన యాశయములను ప్రచారము చేయును. వ్యాపించుచున్న మతము లన్నియు ఉత్కట దురభిమానపూరితములే. ఒక తెగ మఱొక తెగ నెంతగా ద్వేషించునో అది యంతగా విజయము నొందును; అది యంత ఎక్కువగా జనులను తనలోనికి ఆకర్షించును. విశ్వ సాభ్రాత్రమును గుఱించి యెంత ఘనముగా ప్రసంగములు జరుగు చున్నను పరిస్థితు లిప్పు డున్నట్లే యిక ముందుగూడ ఉండు నని నాకు తోచుచున్నది. ప్రపంచములో విశేషభాగము పర్యటించి, అనేకజాతులతో కలిసి లోకములో నేడు ప్రబలియున్న పరిస్థితు లను పరిశీలింపగా కలిగిన యభిప్రాయ మిది.

ఈబోధలలో దేనినిగాని వేదాంతము విశ్వసింపదు. మొదటి విషయ మేమనగా వేదాంతము గ్రంథమును నమ్మదు — ఆరంభముననే ఉన్న పెద్దచిక్కు అది. ఏగ్రంథములను గుఱించియైనను సరే ఒకదానిప్రామాణ్యముకంటె వేఱొకదాని ప్రామాణ్యము హెచ్చు అనుటను వేదాంతము నిరాకరించును. దేవుని, ఆత్మను, పరమతత్త్వమును గుఱించిన సమస్తసత్యములు ఏఒక్కగ్రంథములో నైనను సరే లేనే లేవని వేదాంతము నొక్కిచెప్పును. ఆత్మ సాక్షాత్కారమునకు గ్రంథపారాయణము మార్గము కాదని ఉపనిషత్తులు మాటిమాటికిని చెప్పుచుండును. ఆమాట మీలో ఉపనిషత్తులను చదివినవారికి జ్ఞాపక ముండును.

రెండవవిషయము: గ్రంథప్రామాణ్యముకంటె వ్యక్తి ప్రామాణ్యము మఱింత అసమర్థనీయ మని వేదాంతము గుర్తిం చును. మీలో వేదాంతము నభ్యసించినవారికి — వేదాంతమనగా ఉపనిషత్తులు — వ్యక్తిపై ఆధారపడని మత మిదొక్కటే అని తెలియును. మగవారిలోకాని మగువలలోకాని వేదాంతుల కారాధ్యులైన వా రొక్క రైనను ఎప్పుడును లేరు. ఎన్నటికిని

ఉండరాదు. పక్షికంటెకాని, పురుగుకంటెకాని మానవు డధిక పూజార్హుడుకాడు. మనమందఱము సోదరులము. ఉన్న దెల్ల దశాభేదమే. అత్యంతక్షుద్రమగు క్రిమియు నేనును ఒక్కటే. ఏ మానవుడుగాని మనకు పైవాడగుటకును, మన మాతనిని చేరి పూజించుటకు—అతడు మనలను ముందుకుకొనిచనుటకును మనకు రక్షకు డగుటకును వేదాంతములో అవకాశ మెంత శూన్యమో గుర్తించితిరి కదా. వేదాంతము మీకు దాని నొసగదు. ప్రమాణ గ్రంథము లేదు, పూజ్యపురుషుడు లేడు, ఏమియు లేదు.

దేవునిగుఱించిన చిక్కు ఇంతకంటె గడ్డుది. మీకీ దేశములో ప్రజాస్వామ్యము కావలెను, వేదాంతము ప్రతిపాదించునది ప్రజాస్వామికపు దేవునే.

మీకు ప్రభుత్వ మున్నది. కాని ప్రభుత్వమునకు వ్యక్తి సంబంధము లేదు; మీప్రభుత్వము నిరంకుశమైనది కాదు కాని ప్రపంచములోని యేరాజునేలుబడికంటెనుకూడ మీప్రభుత్వమునకు గల చెల్లుబడియే ఎక్కువ. నిజమైనశక్తి, నిజమైన జీవితము, నిజమైన బలము అప్రత్యక్షమం దున్నది, అవ్యక్తమం దున్నది, అదేహమం దున్నది. ఈవిషయ మెవరును గ్రహించుచున్నట్లు లేదు. ఇతరులకంటె వేఱైన వ్యక్తిమాత్రముగా నిన్ను కొనినచో నీవిలువ శూన్యము. తన్ను తాను పరిపాలించుకొనెడి దేశములో నవ్యక్తాంగముగా నిన్ను కొనినచో నీ మహత్వ మపారము. ప్రభుత్వమందు మీ రందఱు ఒక్కటే — మీశక్తి అపారము. మఱి ఈశక్తి సరిగా ఎక్కడ ఉన్నది? ప్రతిమానవుడును ఆ శక్తియే. రాజు లేడు. అందఱును సమానులుగానే కనబడుచున్నారు. నేను టోపీ తీసి ఎవనికిని వంగి నమస్కరింపవలసిన పనిలేదు. అయినను ప్రతివ్యక్తియందు అపారశక్తి కలదు.

వేదాంత మనగా సరిగా అదే. అదిబోధించెడి దేవుడు దూరముగా సింహాసనముపై కూర్చున్న ప్రభువుకాడు. భయంకరుడును

బలులు కోరువాడునగు అటువంటి దేవుడు కొందఱకు ఇష్టుడు. వారు కొవ్వొత్తులు వెలిగింతురు; అతనియెదుట ధూళిలో పొర్లుదురు. తమ్ము శాసించుటకు వారి కొక ప్రభువు కావలె. తమ్మందఱ నేలుట కొకరాజు స్వర్గములో నున్నాడని వారి నమ్మకము. ఈ దేశమునుండియైనను రాజు అనువాడు వెడలిపోయినాడు. దివి నేలు రాజు ఇప్పు డేడీ? భువి నేలు రాజున్నచోటనే ఉన్నాడు. ఈ దేశములో రాజు మీలో — ప్రతిఒక్కరియందును చొచ్చుకొన్నాడు. ఈ దేశమున మీరందఱును రాజులె. వేదాంత మతమునగూడ ఇంతే. మీ రందఱు దేవులే. ఒక్క దేవుడు చాలడు. మీ రందఱును దేవులే అని వేదాంతము చెప్పును.

ఇందువలన వేదాంతము 'మిక్కిలి దుష్కర మయినది. దేవుడున్నా డనెడి ప్రాచీనాశయమును బోధింపదు. మేఘములపై ఆసీనుడై, మన యనుమతి కోరకయే లోకవ్యవహారములను నిర్వహించుచుండిన దేవునికి బదులు, కేవలము తన ప్రీతికైయే మనలను శూన్యమునుండి సృజించి, తనవినోదముకొఱకే మనల నిచ్చట నానావిధదుఃఖముల ననుభవింప జేయుచుండిన దేవునికి బదులు సర్వాంతర్యామియు సర్వజీవులును సర్వమును తానే ఐన దేవుని వేదాంతము బోధించును. ఈ దేశమునుండి రాజు వైదొలగినాడు; స్వర్గరాజ్యము వేదాంతమునుండి శతాబ్దములకృతమే వె దొలగినది.

భువి నేలురాజును భారతదేశము విడనాడలేదు. అందుచేత వేదాంతము భారతదేశమతము కాజాలదు. మీ దేశములో ప్రజాస్వామ్యము వ్యవహారమందుండుటచేత వేదాంతము మీ మతమగుట కవకాశము కలదు. వేదాంతమును మీరు స్పష్టముగా అర్థము జేసికో గలుగవలెను, చేసికోవలెను. మెదడులలో ఏవో అస్పష్టాశయములును మూఢవిశ్వాసములునుగల 'వారు కాక, మీరు యథార్థ స్త్రీలును, యథార్థ పురుషులును కావలెను.

ఆధ్యాత్మికపరులముగనుండ మను కోర్కి మీకు నిజముగనుండ వలెను. అట్లున్ననే వేదాంతము మీమతము కాగలదు. ఏలయన పారమార్థికపరతమాత్రమే వేదాంతమున కపేక్షితము.

'స్వర్గములోనిదేవుడు' అను ఆశయ మెట్టిది? అనాత్మ వాదమే. అనంతతత్త్వము మనలో ప్రతియొకరిలో మూర్తీభవించి యున్న దనుట వేదాంతాశయము. దేవుడు మేఘముమీద ఆసీను డయి యుండుట! అట్లందు మేని అది ఎట్లు దేవుని దూషించిన ట్లగునో యోచింపుడు! అది అనాత్మవాదము—కేవలము అనాత్మ వాదము. పసిబిడ్డ లీ విధముగా భావించిన అది ఒప్పే కావచ్చు. కాని, ప్రౌఢులు ఇట్టి విషయములు బోధింపబూనినచో అది మిక్కిలి వెగటుగొలుపును. అది దాని స్వరూపము. అ దెల్ల అనాత్మవస్తువే, అంతయు దేహబుద్ధియే, స్థూలభావమే, ఇంద్రియ భావమే. అందులో ప్రతియణువును మట్టియే, మట్టి తప్ప వేఱు కాదు. అది మతమా? ఆఫ్రికాలోని ''ముంబోఘంబో'' మత మున్నదే ఇదియు ఆపాటి మతమే. దేవుడు ఆత్మ. కావున దేవుని పారమార్థికముగ ఆత్మబుద్ధితో ఉపాసింపవలె. ఆత్మకు స్థానము స్వర్గ మొక్కటేనా? ఆత్మ యనగా నేమి? మన మందఱము ఆత్మయే. మన మెందుచేత ఆత్మను సాక్షాత్కారము చేసి కొనము? నీకును నాకును భేద మెందులో? దేహములో మాత్రమే, వే ఱెందులోను కాదు. దేహమును మఱచిపొండు. అప్పు డంతయు ఆత్మయే.

వేదాంతమున మనకు లభింపని వివి — ప్రమాణగ్రంథము లేదు. మానవతతినుండి ప్రత్యేకింపబడు మానవు డెవడును లేడు. —''మీరు పురుగులు, మేము జగత్ప్రభువులము''—అను ఇట్టిది లేనే లేదు. నీవు సర్వేశ్వరుడవగుచో నేనును సర్వేశ్వరుడనే. కనుక వేదాంతమునందు పాప మనునది లేదు. పొరపాటులు కలవు గాని పాపము లేదు. కడకు అంతయు దిద్దుపడ నున్నది.

సైతాను లేదు. అట్టి వెఱ్ఱిప్రసంగము లేనే లేదు. వేదాంతము చెప్పున, ఉన్న పాప మొక్కటే, లోకమంతటికి నొక్కటే. అది యిది: నిన్ను పాపి వనియు మఱొకనిని పాపి అనియు అనుకొందు వేని, తత్త్వణమే అదే పాపము. అన్ని తప్పులును, మామూలుగా పాప మనబడున వెల్ల తత్ఫలితములే. మనజీవితములలో ఎన్నో తప్పు లుండి యున్నవి. కాని, మనము ముందుకు సాగిపోవుచునే ఉన్నాము. తప్పులు చేసితి మనుటే మనకు బిరుదమగు గాక! నీ గతజీవితమును దూరదృష్టితో కనుము. నీ ప్రస్తుతస్థితి బాగున్నచో ఇది మునుపు చేసిన తప్పొప్పు లన్నిటి ఫలితమే. కీర్తి మన విజయాలకు కల్గుత! కీర్తి మన పొరపాట్లకు కలుగుత! ముగిసిన దానివైపు మరలి చూడకు. ముందుకు సాగు.

గుర్తించితిరా, వేదాంతము ప్రకారము పాపము లేదు, పాపి లేఁడు, భయము గలిగించు దేవుడు లేడు. ఏ ఒక్కనివలన మన మెప్పుడును భయపడమో ఆ ఒక్కడే దేవుడు. ఏలయన దేవుడు మన ఆత్మయే. ఏ ఒక్కనిగూర్చి భయపడుట మీకు శక్యము కాదో ఆ ఒక్కడే దేవుడు. అటువంటప్పుడు దేవుని గూర్చి భయపడు మానవుడు నిజముగ సాటిలేని మూఢవిశ్వాసి కాడా? సొంత నీడను చూచుకొని భయపడు మానవు డుండవచ్చు గాక; అత డయినను తన్ను చూచుకొని భయపడడుకదా! దేవుడు మానవుని ఆత్మయే. మీరు భయపడకుండగల దతని నొక్కనిగూర్చియే. దైవభీతి మానవునిలో చొచ్చుకొనుటయు అతనిని గడగడలాడించుటయు మున్నగు ఈ వెఱ్ఱి యంతయు ఏమి? మన మందఱము ఉన్మత్తశరణాలయములో లేము. అందుకు భగవానుడు మనల దీవించును గాక! మనలో అత్యధికసంఖ్యాకులము పిచ్చివారము కానప్పుడు దైవభీతివంటి ఆశయాలను మనము కల్పించు టెందులకు? మానవకోటి ఇంచుమించు అంతయునే వెఱ్ఱిది అని బుద్ధభగవానుడు నుడివెను. ఆ మాట పూర్తిగా నిజ మనియే తోచుచున్నది.

ప్రమాణగ్రంథము లేదు, మహాపురుషుడు లేడు, సాకారుడగు దేవుడు లేడు. ఇవన్నియు పోవలె. ఇంద్రియములును పోవలె. మన మింద్రియములకు బద్ధులమై యుండలేము. పెద్ద మంచుగడ్డలపై చలిచే చచ్చు మానవులవలె మన మిప్పుడు బద్ధులమై పడియున్నాము. నిద్రింత మను కోర్కె వారి కెంత బలీయముగా నుండు ననగా — 'చత్తు' రని చెప్పి మిత్రులు వారిని మేల్కొల్ప జూచినను 'నన్ను చావనిండు, నాకు కావలసినది నిద్ర' అని వారిలో ప్రతివాడును చెప్పును. క్షుద్రములైన యింద్రియవిషయములు మనకు వినాశము కూర్చుచున్నను మన మందఱము వానియందే ఆసక్తులమై యున్నాము. అంతకంటె చాల గొప్పవిషయములు కల వన్న మాట మఱచిపోవుదుము.

భగవంతు డొకతూరి పృథివిమీద వరాహావతార మెత్తెనని హిందువుల పురాణములలో నొక గాథ కలదు. ఆ వరాహమున కొక ఆడుపంది సాహచర్యము కలిగినది. కొంతకాలమునకు దానికి పెక్కు పందిపిల్లలు పుట్టినవి. బురదలో వసించుచు ఆనందముతో ఘుర్ఘురనినాదములు చేయుచు అది తన సంసారముతో హాయిగా నుండెను. తన దివ్యవైభవపు ఈశ్వరత్వపు జ్ఞప్తి దానికి లేదు. దేవతలు మిగుల కలవరము చెంది వారు పృథివిమీదికి వచ్చి 'వరాహదేహమును విడిచిపెట్టి స్వర్గమునకు రావలసిన' దని ప్రార్థించిరి. కాని, భగవంతున కది ఇంచుకేని యిష్టము లేక ఆయన వారిని తఱిమి వేసెను. 'నే నెంతో హాయిగా ఉన్నాను, నన్ను కదల్చుట నా కిష్టము లే' దని అతడు చెప్పెను. గత్యంతరము లేక దేవతలు దేవుని వరాహదేహమును నాశనము చేసిరి. తత్క్షణమే దేవునకు తన దివ్యవైభవము మరల గల్గినది. పందిరూపములో తన కొక ఆనంద ముండినందుకే ఇప్పుడు ఆయన అచ్చెరు వొందెను.

జనులప్రవర్తన ఈ తీరుననే ఉండును. రూపరహితుడగు భగవంతునిగూర్చి విన్నప్పుడెల్ల వారు, ''నావ్యక్తిత్వ మే

మగును? నా వ్యక్తిత్వము పోవునే!'' అని యందురు. మఱొక మారు ఆ తలంపు కలిగినప్పుడు వరాహకథను జ్ఞాపకముచేసి కొనుడు. మీలో ఒక్కొక్కరియందు ఎంతటి అవ్యయానంద నిధి యున్నదో ఆలోచింపుడు. మీ ప్రస్తుతపరిస్థితికి మీ రెంతగా మురిసి పోవుచున్నారు! మీ యథార్థతత్త్వమును సాక్షాత్కారము చేసికొన్నప్పుడు మీ యింద్రియజీవితమును విడనాడుట కష్టము కలుగనందుకు ఆశ్చర్యపడుదురు. మీ వ్యక్తిత్వములో నేమున్నది? ఆ పందిబ్రతుకుకంటె ఇదేదేని ఉత్కృష్ట మయినదా? దీనినేనా, మీకు విడిచిపెట్టుట కష్టము లేకపోయినది! భగవానుడు మనలనందఱను అనుగ్రహించుగాక.

వేదాంతము మన కేమి బోధించును? సత్యమును తెలిసి కొనుటకు నీవు నిన్ను సహితము దాటి బయటికి పోనక్కర లేదనునది మొదటి విషయము. చన్న దెల్ల, రానున్న దెల్ల ఇక్కడ వర్తమానమున ఉన్నవి. ఏ మానవుడును గతమును చూచియుండ లేదు. మీలో నెవరయినను గతమును చూచితిరా? గతమును తెలిసికొనుచున్నా నని నీ వనుకొనునప్పుడు నీవు గతమును ప్రస్తుతముహూర్తములో భావించుచున్నావు. భవిష్యత్తును చూడవలె ననిన మీరు దానిని వర్తమానములోనికి గొని రావలెను. వర్తమానమే వాస్తవము. తక్కిన దంతయు భావనే. ఉన్న దంతయు వర్తమానమే. ఉన్న దెల్ల 'ఏకమే'. సర్వము ఇప్పుడు ఇక్కడ సర్వముగా నున్నది. అనంతకాలములో ప్రతి ముహూర్తము తక్కిన ప్రతిముహూర్తమువలె సమగ్రమైనదే. సర్వమును తనలో నిముడ్చుకొన్నదే. ఇప్పు డున్న సర్వము, ఇది వఱకుండిన సర్వము, ఇకముం దుండగల సర్వము వర్తమానములో నున్నది. ఎవరుగాని దీనికిమించి దేనినిగాని భావించి చూడనిమ్ము—నెగ్గ లేదు.

భువిపోలికలు లేని దివిని ఏమతము కల్పింప గలదు? అ దంతయు కళ. ఈకళ మనకు క్రమక్రమముగా తెలియజేయ

బడుచున్నది ? మనము పంచేంద్రియములతో ప్రపంచమును చూచి అది శబ్దస్పర్శరూపరసగంధములతో స్థూలముగా నున్నట్లు గ్రహింతుము. నే నొకవిద్యుదింద్రియమును నలవఱచుకొంటి నను కొనుడు—అప్పు డంతయు మాఱి పోవును. నాయింద్రియములు మఱింత సూక్ష్మము లగుననుకొనుడు. మీ రందఱు మఱొక తీరుగా కనబడుదురు. నేను మాఱిన మీరును మాఱుదురు. నే నింద్రియములశక్తిని దాటి పోయినచో మీరు ఆత్మస్వరూపులుగా, భగవంతుడుగా కనబడుదురు. మనకు కనబడు వస్తువులరూపము వానిపారమార్థికస్వరూపము కాదు.

ఈవిషయము మనము ముందుముందు అవగాహన చేసికొని, సాక్షాత్కరించుకొందుము : సకలస్వర్గములు—సర్వము—ఇప్పు డిక్కడ ఉన్నవి. అవి యథార్థమునకు దివ్యసత్తలో కననగు దృశ్యములే కాని వేఱు కావు. ఈ సత్తు సకలపృథువులకంటె, స్వర్గములకంటె చాల పెద్దది. ఈ లోకము చెడ్డదని, స్వర్గ మెక్కడో కల దని ప్రజలు భావింతురు. ఈప్రపంచము చెడ్డది కాదు. తెలిసికొన్న వారికి ఇది భగవత్స్వరూపమే. ఈ విషయము నమ్ముటకంటె కూడ దీని నర్థముచేసికొనుటే కష్టము; రేపు ఉరి తీయబడ నున్న హంతకుడు భగవంతుడే. సంపూర్ణముగా భగవంతుడే. ఈమాట గ్రహించుట నిజముగా కష్టమే. కాని, గ్రహించుట సాధ్యమే.

కనుక వేదాంతము ప్రతిపాదించునది విశ్వసాభ్రాత్రము కాదు, విశ్వైక్యము. ప్రతిమానవునితోను, ప్రతి పశువుతోను —అవి మంచివి గాని, చెడ్డవిగాని ఎట్టివిగాని—నేను అభిన్నుడను. సర్వత్ర నున్నది ఒక్క దేహమే, ఒక్క మనస్సే, ఒక్క ఆత్మయే. ఆత్మకు మరణము లేదు. మృత్యు వెచ్చటను లేదు. దేహమునకు సైతము మృత్యువు లేదు. మనస్సునకుకూడ చావు లేదు. దేహమైననుసరే ఎట్లు నశించును ? ఒక ఆకు రాలి పోయినంత

మాత్రమున చెట్టు నశించునా ? విశ్వము నాదేహము. అ దెట్లు నిత్యమై ఉన్నదో చూడుడు. ఎల్ల మనస్సులు నావె. అఖిలచరణములతో నేను నడచుచున్నాను. అన్ని నోళ్లతో నేను మాటాడుచున్నాను. ప్రతి దేహమందు నున్నవాడను నేనే.

నే నట్టి యనుభూతిని ఏల పొందలేక పోవుచున్నాను ? ఈ వ్యక్తిత్వముచేత; ఈ పందిబుద్ధిచేత. నీవు ఈ మనస్సుచేత బద్ధుడయి ఉన్నావు. కావున నీ విక్కడనే ఉండ గలవు. అక్కడ ఉండ లేవు. అమృతత్వ మనగా నేమి ? "అది యీ మనజీవితమే" అని చెప్పెడివా రెంత కొలదిమంది ? ఇ దంతయు నశ్వర మని, మృత మని, దేవు డిక్కడ లే డని, స్వర్గమునకు పోయిన తరువాత తాము అమృతత్వము ప్రాపింతు మని, చాలమంది యభిప్రాయము. చనిపోయిన తరువాత దేవుని చూడ గల మని వారి యూహ. ఇప్పు డిక్కడ చూడ లేని యెడల మరణానంతరము గూడ అతనిని వారు చూడ జాలరు. వా రందఱు అమృతత్వములో నమ్మకము గలవారే. కాని, దానికి ఇక్కడ చచ్చుటయు స్వర్గమును చేరుకొనుటయు సాధనములు కావనియు ఈ పందిబుద్ధిని ఈ వ్యక్తిత్వమును విసర్జించుటయు ఈక్షుద్రదేహములందు బద్ధులు కాకుండుటయు సాధనము లగు ననియు వా రెఱుగరు. సకలజీవులతో, మన మభిన్నుల మన్న జ్ఞానమును, అఖిలదేహములలో వసించుటయు, నిఖిలమనస్సులద్వారా ఆలోచించుటయునే అమృతత్వము. ఈ దేహములోనే గాక యితరదేహములలో గూడ మన మనుభూతిని తప్పక పొందగలము. సానుభూతి యన నేమి? ఈసానుభూతి యనుదానికి, మనదేహములలో మన అనుభూతి కొక మితి గలదా? నే నీ విశ్వ మంతటను ఉన్నట్టు భావింపగల సమయ మొకానొకనాటికి వచ్చుట శక్యమే.

ఇందువలన కలుగు లాభ మేమి ? ఈ ముఱికి దేహమును విడిచిపెట్టుట కష్టము; ఈ క్షుద్రదేహ మొక్కదాని యనుభవ

మును విడిచిపెట్టుటకు మనము దుఃఖింతుము! "దీనిని విడిచిపెట్టు" మని కాదు వేదాంతము చెప్పునది. "దీని నతిక్రమింపు" మని వేదాంతము పలుకును. వైరాగ్య మవసరము లేదు — రెండు దేహముల అనుభవించుట మఱింత మంచిది.—మూడు దేహముల, నింకను మంచిది. పెక్కుదేహములు గలిగియుండుట! విశ్వ మంతటి ద్వారా నే ననుభవింప గలిగినప్పుడు, విశ్వమంతయు నా దేహమే.

ఈ యుపదేశములు విన్నచో భయపడువారు చాలమంది గలరు. "నిరంకుశు డగు దేవుడు సృష్టించిన ఈ క్షుద్రదేహములు కారు మీరు" అని చెప్పించుకొనుట వారి కిష్టము లేదు. "పైకి రండు!" అని నేను వారికి చెప్పుదును. 'మేము పాపము చేసి పుట్టియున్నాము, ఎవరేని యనుగ్రహించినగాని పైకి రాలే' మని వారు చెప్పుదురు. "మీ రీశ్వరులు" అని నే నందును. "ఈశ్వర ద్రోహీ, అట్లను తెంపు నీ కెట్లు కలిగినది? ఈ దుఃఖజీవి ఈశ్వరు డె ట్లగును? మేము పాపులము." అని వారు బదులు చెప్పుదురు. చూడుడు. ఒక్కొక్కప్పుడు నేను చాల నధైర్యపడుచుందును. "నరకము లేనిచో ఇక మత మెట్లు నిల్వగలదు?" అని వందల కొలది పురుషులు, స్త్రీలు నన్ను ప్రశ్నింతురు? ఈ జనులు తమంత తాము కోరుకొని నరకమునకు పోవుదురేని వారించు టెవరితరము?

మీరు దేనినిగుఱించి సదా కలగనుచుందురో, దేనిని భావింతురో దానిని సృష్టించుకొందురు. నరకమునే భావించుచు కలగనుచు నుండిన మీరు చనిపోయి, నరకమును చూతురు. పాపమును, సైతానును భావించుచు కలగనుచున్నచో, మీరు సైతానునే తెచ్చుకొందురు. మీరు కలగనునవి భావించునవి దయ్యము లయినచో, మీకు దయ్యములే సిద్ధించును. మీరు దేనిని భావించిన మీ రది యగుదురు. మీరు భావింపక తప్ప

నప్పుడు సద్భావములను ఉదారభావములను భావింపుడు. 'మేము దుర్బలు లయిన యల్పక్రిముల' మనుట అంగీకృతవిషయముగా మీయంతట మీరే కొనుట! మనము దుర్బలుల మని ప్రకటించు కొనుటచేత మనము దుర్బలులమే యగుదుము; ఎక్కువవారము కాము. దీప మార్పి వేసి, కిటికీలు మూసివేసి, గది చీకటిగా నున్న దని చెప్పుదు మనుకొనుడు. ఆ యవివేకమును ఊహించు కొనుడు! నేను పాపి నని అనుకొనుటవలన నాకేమి మేలు కలుగును? నేను చీకటిలో నున్నచో దీపమును వెలిగించుకొందును గాక. చీకటి పటాపంచలై పోవును. అయినను మానవప్రకృతి యెంత విచిత్రమైనది! తమజీవితమునకు మఱుగున విశ్వాత్మ కల దని సదా తెలిసియున్నను, మానవులు సైతానును, చీకటిని, అసత్యమును గుఱించియే విశేషముగా స్మరించుచుందురు. యథార్థమును వారికి చెప్పిచూడుడు — వారు దానిని గుర్తింపరు; అంధకారమే వారి కెక్కువ యిష్టము.

"జనుల కెందుల కంతటి భయము?" ఇది వేదాంతము వేయు పెద్ద ప్రశ్న. దీనికి సమాధానమిది : తమ్ము తామే వారు నిస్సహాయులనుగను, పరాధీనులనుగను చేసికొనిరి. మనము వట్టి సోమరులము. దేనిని కాని మనమే చేసికొనుట మన కిష్టము లేదు. మనకు ప్రతిది చేసిపెట్టుటకు సాకారుడగు దేవుడో, రక్షకుడో, ప్రవక్తయో కావలె. ధనాఢ్యు డెన్నడు నడవడు. ఎప్పుడును బండిలో పోవును; కొన్నియేండ్ల తరువాత ఒకనాడు నిద్రలేచు నప్పటికి అతని దేహమంతయు పక్షవాతహతమైయుండును. తాను జీవించిన పద్ధతి సరియైనది కాదని అతడు గుర్తింప నారంభించును. నాకు బదులు మఱొకడు నడవ లేడు! ఎవరేని అట్లు చేసినచో అది ప్రతిపర్యాయము నాకపకారకమే. ఒకని ప్రతిపని నితరుడు చేసిపెట్టుచుండినచో కాలక్రమమున అతడు తన అవయవముల యుపయోగమును కోల్పోవును.

మనము స్వయముగా చేసికొన్న పనియే మనము నిజముగా చేసికొన్నపని. మనకొఱ కితరులు చేసిపెట్టెడి పని ఎన్నటికిని మనపని కాజాలదు. మీరు నా యుపన్యాసములు విని ఆధ్యాత్మికసత్యములను తెలిసికొనజాలరు. మీరే మయిన నేర్చుకొని యున్న పక్షమున దానిని బహిర్గతము చేసి మెఱపించిన చిన్న విస్ఫులింగము నేను. ప్రవక్తలు, ఆచార్యులు చేయ గలిగిన దింత మాత్రమే. సాహాయ్యార్థము పరుగులెత్తుట అంతయు అవివేకము.

భారతదేశములో ఎద్దుబండ్లు గలవు. సాధారణముగా బండికి రెం డెద్దు కట్టుదురు. బండిదూలము చివర గడ్డితో పేనిన త్రాడు వ్రేలాడగట్టుదురు. అది ఎడ్లకు ఎదుటనుండును. కాని, వాని కందదు, ఆగడ్డిత్రాడు నందుకొనుటకు ఎడ్లు ప్రయత్నించును. నిరంతరము ప్రయత్నించుచుండును. కాని, అందుకొనజాలవు. మనకు కలుగు సాయ మీవిధముగానే ఉండును! భద్రత, బలము, జ్ఞానము, సౌఖ్యము మనకు బాహ్యమునుండి లభించునని అనుకొనుచుందుము. మనము సర్వదా ఆశతోనే ఉందుము. కాని, ఆశ యే నాటికిని ఫలింపదు బయటనుండి యెప్పుడుగాని యే సాయమును లభింపదు.

మానవునకు సహాయము లేదు. ఇదివఱ కెన్నడును లేదు. ఇప్పుడును లేదు. ఇక ముందును ఉండదు. ఏల ఉండ వలె? మీరు పురుషులు, స్త్రీలు కారా? పృథివికి ప్రభువులయినవారికి పరుల సాయము కావలెనా? ఇది మీకు లజ్జాకరము కాదా? మీరు వట్టి మట్టిపాటివారైనప్పుడు మీకు సాయము కావలసినదే కాని, మీరు ఆత్మస్వరూపులు. కష్టములలో నుండి మీరే మిమ్ము ఈవలికి లాగుకొనుడు! మిమ్ము మీరే రక్షించుకొనుడు! మీకు సాయము చేయువా రెవ్వరును లేరు.—పూర్వమును లేరు. ఉన్నా రనుకొనుట మధురమగు భ్రాంతి. దానివలన ఒరిగెడి దేమియు లేదు.

ఒకనాడు నాయొద్ద కొక క్రైస్తవుడు వచ్చి, "నీవు ఘోర పాపాత్ముడవు" అనెను. "ఔను. పాపాత్ముడనే. కానీ" అంటిని. అతడు క్రైస్తవమతప్రచారకుడు. అతడు నా కూపి రాడనీయలేదు. అతడు కంటపడగానే పాఱిపోవుదును. "నీకు మేలుచేయు మంచి విషయము లెన్నో నాయొద్ద కలవు. నీవు పాపివి. నీవు నరకము నకు పోవుదువు." అని యత డనెను. "చాలమంచిది. ఇంకను ఏమి చెప్పుదువు?" అని నే నడిగితిని. తరువాత, "నీ వెక్కడకు పోవుదువు?" అని నే నడిగితిని. "నేను స్వర్గమునకు పోవుదును." అని యతడు చెప్పెను. "సరే. నేను నరకమునకే పోవుదును." అని చెప్పివేసితిని. ఆనా డతడు నన్ను వదలుకొన్నాడు.

మనదగ్గఱకు క్రైస్తవు డొకడు వచ్చి, "మీాయందఱకు వినాశము తప్పదు." అని భయపెట్టును. "కాని, మీా రీ సిద్ధాంతమును విశ్వసింపుడు. క్రైస్తు మిమ్ము రక్షించును." అని యత డభయ మొసగును. ఆమాట నిజమే యగుచో - అది మూఢ విశ్వాసము తప్ప మఱేమియు కాదు—క్రైస్తవదేశములలో దారిద్ర్యమేయుండదు. పోనీ, ఆ మాట నమ్ముదము — నమ్మినంత మాత్రముచేత గల్గు నష్టమేమియు లేదు—మఱి ఫలితము కలుగ లేదే, ఏల? "ఇంతమంది దుర్జను లుండుట కేమి కారణము?" అని నే నడిగిన యెడల "ఇంకను ఎక్కువకృషి చేయవలసి యున్నది" అని సమాధానము చెప్పుదురు. దేవుని విశ్వసింపుము. కాని, నీమందు సామగ్రికి చెమ్మ తగులనీయక సిద్ధముగానుంచుకో! దేవుని ప్రార్థింపుము. దేవుడు వచ్చి నిన్ను తరింపజేయనీ! కాని, శ్రమపడునది నేను; ప్రార్థనచేయునది నేను; ఉపాసించునది నేను. నా సమస్యలను పరిష్కరించుకొనునది నేనే. ఘనత మాత్రము దేవునికి చెందును. ఇది మంచిది కాదు. నే నట్లెన్నడును చేయను.

ఒక విందుకు నన్నాహ్వానించిరి. భోజనమునకు ముందు చేయవలసిన దైవప్రార్థన సేయు మని నన్ను గృహిణి కోరినది. నేను, "తల్లీ, ప్రార్థన నీకు చేసెదను. నాకృతజ్ఞత, వందనములు నీకే." అంటిని. నేను పనిచేయునప్పుడు నన్ను నేనే కొనియాడి కొందును. నేను కష్టపడి పనిచేసినందుకు, నాకున్నదానిని నేను సాధించుకొన్నందుకు ప్రశంస నాకే దక్కవలె!

సర్వదా శ్రమపడువారు మీరు. మఱెవరికో జోహారొనర్తురు. దీనికి, కారణము మీమూఢ విశ్వాసమే. మీ భయమే, సహస్రాబ్దాలుగా వర్ధిల్లిన ఈయంధవిశ్వాసము లిక వలదు! ఆధ్యాత్మికత నలవఱచుకొనుటకు కొంచెము కష్టపడి కృషిచేయుట అవసరమె. మూఢవిశ్వాసము లన్నియు అనాత్మభావములె. ఏలయన వాని కన్నిటికి నాధారము 'నేను దేహమను' 'నేను దేహమను' అను భావమే. వానియందు ఆత్మభావమే లేదు. మూఢవిశ్వాసాలు ఆత్మకు లేవు—ఆత్మ నిస్సారములగు దేహవాంఛల కతీత మయినది.

అక్కడక్కడ ఈ వ్యర్థవాంఛలు ఆధ్యాత్మికరంగమున కూడ వ్యాపించుచున్నవి. దయ్యములందు నమ్మకము గల వారి సమావేశములకు పెక్కింటికి నేను పోయియుంటిని. ఒక సమావేశములో నాయకత్వము వహించిన వ్యక్తి ఒకస్త్రీ. ఆమె నాతో, "మీయమ్మ, మీతాత నా దగ్గఱకు వచ్చుచుందురు. నమస్కరించి నాతో మాటాడుచుందు"రని ఆమె చెప్పెను. మఱి మా తల్లి ఇంకను బ్రతికియే యున్నది! మరణానంతరముకూడ బంధువులు పూర్వశరీరములందే ఉందు రనుకొనుట జనులకు ప్రియము. ఆ మూఢవిశ్వాసాల నాధారపఱచుకొని ఈదయ్యాలవారు వంచింతురు. గతించిన నా తండ్రికి మలినదేహ మింకను నున్న దని నాకు తెలియవచ్చినచో నే నెంతగనో దుఃఖింతును. తమపూర్వులు భౌతిక దేహములు గల్గి యున్నా రనుకొనుట వలన జనులకు ఊఱట

కలుగును. మ ఆ లోకచోటవారు జీసస్సుక్రీస్తును గొని వచ్చిరి. "ప్రభూ, ఎట్లున్నావు" అంటిని. నాకు చాల నిర్వేదము కలిగినది. ఆ మహాయోగికే యింకను దేహబంధ మూడకున్న యెడల ఇక మనవంటి క్షుద్రులగతి యే మగును? ఆ దయ్యాల వారు తాము చూపిన రూపాలను నన్ను స్పృశింపనీయలేదు. ఇవి నిజమే అగు నేనియు నాకవి అపేక్షితములు కావు, నే నిట్లను కొందును: "తల్లీ, తల్లీ, నాస్తికులు — ప్రజల యథార్థస్థితి నాస్తికత! కేవలము పంచేంద్రియ తృష్ణ! వారి కిక్కడ ఉన్నది చాలక చనిపోయినతరువాతగూడ ఇదే మఱింత కావలె నని ఉబలాటము?"

వేదాంతము ప్రతిపాదించు దైవ మెట్టివాడు? అత డొక తత్త్వము. వ్యక్తి కాదు. మీరు, నేను సాకారదేవులము. అపరిచ్ఛిన్నుడగు జగన్నాథుడు, జగత్కర్త, జగద్భర్త, జగద్ధర్త అయిన దేవుడు రూపరహితతత్త్వము. మీరు, నేను, పిల్లి, ఎలుక, దయ్యము, భూతము — ఇవన్నియు దాని మూర్తీభావములు, — సాకారదేవులు. సాకారదేవులను పూజించుట మీకోర్కె. అది మీరు మీ యాత్మను పూజించుకొనుటే. నాసలహా అంగీకరించు పక్షమున మీరు ఏ గుడి (చర్చి) లోనికి ప్రవేశింపరు. బయటికి రండు. శుభ్రముగా స్నానము చేయుడు. యుగయుగములుగా మి మ్మంటుకొనియున్న మూఢ విశ్వాసములు వదలిపోవువఱకు మరలమరల స్నానము చేయుడు. స్నానము చేయుట మీకంతగా సమ్మతము కాదేమో. ఈదేశములో తఱచు స్నానము చేయు ఆచారము లేదు. — తఱచు స్నానము చేయుట భారతీయుల ఆచారము; మీ సాంఘికాచారము కాదు.

"మీ రెందు కంతగా నవ్వుదురు? ఎందు కన్ని ఛలోక్తు లాడుదురు?" అని నేను పలుమారు ప్రశ్నింపబడితిని. నేను అప్పు డప్పుడు—తీవ్రవైఖరి గల్గియు ఉందును, కడుపు నొప్పిగా నున్న

లేను, గిట్టుటలేదు. జగదీశ్వరుడగు అతడు ప్రతిజీవునియందున్నాడు. ఉన్న దేవాలయము ఒక్కటే—అది దేహమే. ఎన్నటికైనను ఉన్న దేవాలయ మదొక్కటే. ఆత్మల కధీశుడు, రాజరాజేశ్వరుడు ఈ దేహములోనే నివసించును. మన మీ విషయము గుర్తింపక రాతి విగ్రహములు చేయింతుము. వానికి ఆలయములు నిర్మింతుము. వేదాంతము భారతదేశములో ఎప్పుడును ఉన్నది. కాని, భారతదేశమునిండ ఈ దేవాలయములు నున్నవి: దేవాలయములే కావు — చెక్కడపు విగ్రహములు గల గుహలు కూడ నున్నవి. "మూర్ఖుడు గంగానదియొడ్డున నిలబడి మంచినీటి కొఱకు బావిత్రవ్వును!" మనము అట్టి వారమే! దేవుని మధ్యనే జీవించుచు మనము పోయి విగ్రహములు చెక్కుకొనవలె! మన దేహమనెడి గుడిలో ఆయన సదా ఉండగనే ఆయనను విగ్రహరూపములోనికి రొప్పుదుము. మనము పిచ్చివారము. ఇదే మన పెద్ద భ్రాంతి.

ప్రతివస్తువును భగవంతునిగా ఉపాసింపుము—ప్రతిరూపము అతని ఆలయమే. తక్కిన దంతయు భ్రమయే. చూపును సదా లోనికే సారించుకొనుము, వెలికి కానే కాదు. వేదాంతము బోధించు దేవు డిట్టివాడు. ఇది అతని ఉపాసనావిధానము. కనుక వేదాంతమునందు తెగలు లేవు, సిద్ధాంతములు లేవు, వర్ణములు లేవు. ఇటువంటి మతము భారతదేశమున దేశీయమత మెట్లు కాగలదు?

వందలకొలది వర్ణములు! ఒకడు మఱొకరి ఆహారమును స్పృశించినంతమాత్రమున అతడు లబోదిబో యని, "దేవుడా, నన్ను కాపాడు. నేను మైలపడినాను." అని కేకలు వేయును. నేను పాశ్చాత్యదేశములలో పర్యటించి భారతదేశమునకు వెడలిన తరువాత, నేను పాశ్చాత్యులతో కలసినందుకు, పూర్వాచారముల నుల్లంఘించినందుకు, పూర్వాచారపరాయణులగు హిందు

వులు పలువురు పెద్ద గోల లేపిరి. వేదములలోని సత్యములను నేను పాశ్చాత్యులకు బోధించుట వారిష్టపడ లేదు.

ఈ భేదములు, వ్యత్యాసములు ఉండుట ఎట్లు పొసగును ? మన మందఱము ఆత్మలమే అయి, ఒక్కటే అయినచో, పేదవాని యెడల ధనికుడును, నిరక్షరుని యెడల విద్యాధికుడును, ఎట్లు నిరాదరమువహింతురు. సమాజవ్యవస్థ మార్పు చెందక, వేదాంతమువంటి మత మెట్లు వర్ధిల్లగలదు ? అధికసంఖ్యాకులు నిజముగ వివేకు లగుటకు వేలకొలది సంవత్సరములు పట్టును. జనులకు క్రొత్త విషయములుచూపుట, ఉదాత్తాశయములు గల్గించుట బహుకష్టమైనపని. వారిలో పాదుకొనియున్న ప్రాతమూఢాభిప్రాయములను తొలగించుట అంతకంటె కష్టమైన పని, చాలకష్టమైనపని; అవి సులభముగా నశింపవు. విద్యాధికుడు సైతము చీకటిలో భయపడును— చిన్నప్పుడు విన్న కథ లతనికి జ్ఞాపకము వచ్చును. అతనికి దయ్యములు కనబడును.

వేదాంత మను పదము 'వేదము' నుండి వచ్చినది. వేద మనగా జ్ఞానము, సమస్తజ్ఞానము వేదమే. భగవంతు డనంతుడైనట్లు అదియు అనంతమే. జ్ఞానము నెవరునెప్పుడును సృష్టింపరు. జ్ఞానమును సృష్టింపగా మీ రెవరయిన చూచితిరా ? దాని కున్న మఱుగు తొలగును, అంతె, కప్పువడియుండినది కప్పు వీడును. జ్ఞానము దేవుడే. కనుక అది సర్వదా యిక్కడనే యున్నది. పూర్వవర్తమానభవిష్యత్తుల జ్ఞానమంతయు మనలో ఒక్కొక్కరిలోను నున్నది. దానిని మనము సాక్షాత్కరించుకొందుము. అంతే, ఈ జ్ఞానమంతయు భగవానుడే వేదములు సంస్కృత భాషలో నున్న ఉద్గ్రంథము. మా దేశములో వేదాధ్యయనము చేసినవానికి మోకరిల్లి ప్రణమిల్లుదుము. పదార్థవిజ్ఞానశాస్త్రమును చదువుచున్నవానిని లెక్కచేయము. అది మౌఢ్యము; వేదాంతము కానే కాదు, అది కేవలము అనాత్మవాదము. భగవంతుని పర

ముగా సమస్తజ్ఞానము పవిత్ర మయినదే. జ్ఞానము భగవంతుడు. అనంతజ్ఞానము మనలో ప్రతి ఒక్కరియందు అత్యంత పరిపూర్ణ ముగా నున్నది. మీరు అజ్ఞానులుగా కనబడవచ్చు గాని నిజ ముగా అజ్ఞానులు కారు. మీ రందఱు దేవుని యవతార ములు. సర్వశక్తుడు, సర్వవ్యాపి అయిన దివ్యతత్త్వమునకు మీ రందఱు అవతారమూర్తులు. నన్నుచూచి మీ రిప్పుడు నవ్వ వచ్చు. మీరు నా మాటల నర్థముచేసికొనెడి సమయ మొకా నొకనాటికి వచ్చి తీరును. మీరు విధిగా నన్నర్థముచేసికొందురు. వెనుకకు వా రొక్కరు నుండరు.

లక్ష్య మేమి? నే నింతవఱకును చెప్పుచుండిన వేదాం తము క్రొత్తమతము కాదు. చాలప్రాతది. దేవు డెంత ప్రాత వాడో అంత ప్రాతది. అ దొక స్థలమునకు, కాలమునకు పరిమిత మైనది కాదు. అది సర్వత్ర ఉన్నది. ఈ సత్య మందఱకు తెలిసినదే. అది మన అందఱి సాధనలో నున్నదే. విశ్వమంతటి కదే లక్ష్యము. ఈ మాట బాహ్యప్రకృతికికూడ అన్వయమగును. ప్రతియణువు ఆగమ్యమువైపునకు పరుగిడుచున్నది. అనంతముగా నున్న విశుద్ధాత్మలలో ఎవరికిగాని పరమసత్యమును గుఱించిన జ్ఞానము లేదనుకొందురా? అందఱకును కలదు. అందఱును ఒక్కగమ్యమువైపే పోవుచున్నారు. — లోపలనున్న దివ్యత్వ మును సాక్షాత్కరించుకొనుటే ఆగమ్యము. వెఱ్ఱివాడు, హంత కుడు, మూఢవిశ్వాసి, ఈదేశములో చెట్టుకు వ్రేలాడగట్టి కాల్చి వేయబడువాడు — అందఱు ఒక్కలక్ష్యమువైపునకే పోవు చున్నారు. మనకు తెలియకే మనము చేయుచున్నదానిని తెలిసి మఱింతచక్కగా చేయవలె. అంతే.

విశ్వైక్యము ఇప్పుడే మీలో నున్నది. అది లేక, ఎవరు నెప్పుడును పుట్టియుండ లేదు. మీ రెంతగా కాదన్నను అది సదా తన ఉనికిని చూపుకొనుచునే యుండును. మానవప్రేమ

యనగా నేమి? "నేనును నీవును, నా కళత్రమును, పుత్రుడును, మిత్రుడును ఒక్కటే!" అనుట కొంచెె మించుమించుగా ఆ ఐక్యమును జొనసును: ఐక్యమును తెలిసికొనక ఐక్యమునే మీరు వక్కాణించుచున్నారు. "ఎవతెయు భర్తను భర్తకొఱకు ప్రేమింప లేదు. భర్తయందున్న పరమాత్మకొఱకే ప్రేమించినది." భార్య అక్కడ ఐక్యమును కనుగొనును. భర్త భార్యయందు, తన్ను దర్శించును.—సహజావబోధ ప్రేరణచే అతడు దర్శించును. తెలిసి బుద్ధిపూర్వకముగ నతడు దర్శించుట లేదు.

యావద్విశ్వము అఖండసత్త, మఱొక్కటేదియు నుండ వీలులేదు. నానాభేదములనుండి మన మందఱము విశ్వసత్తను చేరబోవుచున్నాము. కుటుంబములు కులములుగా, కులములు జాతులుగా, జాతులు దేశప్రజలుగా, దేశప్రజలు విశ్వ మానవ కోటిగా కలిసిపోవుచున్నవి—ఎన్ని సంకల్పములు ఆ ఏకైకమును చేరబోవుచున్నవి! ఈయైక్య సాక్షాత్కారమే సమస్త జ్ఞానము, సకల శాస్త్రవిజ్ఞానము.

ఐక్యమే జ్ఞానము. భేదమే అజ్ఞానము. ఈజ్ఞానము మీ జన్మహక్కు. అది నేను మీకు బోధింపవలసినది కాదు. ప్రపంచములో భిన్నమతము లెన్నడును లేవు. మనము కోరినను, కోరక పోయినను మనకందఱకు ముక్తి విధిగా లభించి తీరగలదు. ముక్తస్థితియే మీస్వభావము కనుక ఏనాటికో ఒకనాటికి మీ కాస్థితి కల్గియే తీరును. ఇప్పుడుగూడ మనము ముక్తులమే. కాని, మన మా విషయమును గుర్తించుట లేదు. మనము చేయుచున్న దేమోకూడ మనము గుర్తించుటలేదు. సకలమతవిధానముల యందును, ఆశయములందును ప్రతిపాదింపబడియున్న నీతి ఒక్కటే; బోధింపబడియున్నవిషయ మొక్కటే: "నిస్స్వార్థుడవు కమ్ము. ఒరులను ప్రేమింపుము." ఇందుకు కారణముగా ఒకడు, "జిహోవా అట్లాదేశించెను." అని చెప్పును. "అల్లా

అని మహమ్మదు ఎలుగెత్తి చాటును. మఱొకడు "జీసస్" అని యఱచును. అట్లాదేశించినది 'జిహోవా' మాత్రమే అయిన యెడల, జిహోవా నెన్నడును ఎఱుగనివారి కా యాదేశ మెట్లందెను? అది జీససు నొక్కనియాజ్ఞయే అయినయెడల జీససు నెన్నడును ఎఱుగనివారి కది ఎట్లు అందెను? అది విష్ణుశాసనమే అయినచో ఆయనతో పరిచయములేని యూదుల కది ఎట్లు లభించెను? వీ రందఱికంటె ఉత్కృష్టమగు మఱొక మూలము కలదు. అ దెక్కడ ఉన్నది? భగవంతుని శాశ్వతాలయములో, బ్రహ్మాది స్తంబపర్యంతము సకల జీవుల ఆత్మలలో గలదు. అనంతమగు నిస్స్వార్థముందున దచ్చుట. అనంతమగు త్యాగముందున దచ్చుట. ఐక్యమువైపునకు మరల్చు అనంతాకర్షణ ముందున దచ్చుట.

అజ్ఞానవశమున మనము విభక్తులమైనట్టు, పరిమితులమయినట్టును కనబడుచున్నది; అంతట మనము చిన్న శ్రీమతి...... ఫలానా; శ్రీ......ఫలానా అయితిమి. సకలప్రకృతి యనుక్షణము మన కిది భ్రాంతియే అని తెల్పుచున్నది. ఇతరులనుండి వేఱుపడిన ఆ పరిమితపురుషుడను, ఆ పరిమితస్త్రీని నేను కాను; నేను అద్వితీయ విశ్వాత్మను. నైజతేజముతో ఆత్మ అనుక్షణోదయము గాంచి ప్రకాశించుచున్నది; స్వతస్సిద్ధమగు దివ్యత్వము ప్రకటించుకొనుచున్నది.

వేదాంతము సర్వత్ర గలదు. మీరు దానిని గుర్తింపవలసియున్నది. అంతే. వెఱ్ఱినమ్మకాల గ్రుడ్డినమ్మకాల పుట్ట ముందుకు పోనీయక మనలను నిరోధించుచున్నది. చేత నయినచో వీనిని పూర్తిగా పరిత్యజించి, భగవంతు డాత్మస్వరూపుడని, ఆయనను ఆత్మబుద్ధితోను పారమార్థికముగను ఉపాసింపవలె నని గ్రహింతము గాక. ఇక అనాత్మవాదులుగ నుండ జూడకుడు. ఆత్మేతరమును పాఱవేయుడు. భగవంతుని గుఱించిన భావన యథార్థముగా ఆధ్యాత్మికముగ ఉండవలె. భగవంతునిగుఱించి

ఎంతోకొంత అనాత్మవాసనగల్గిన వివిధాశయములన్నియు పోవలె. మానవు డాధ్యాత్మికతను నానాటికి హెచ్చుగా పొందుచున్న కొలది ఈయాశయముల నన్నిటిని దూరముగ పరిత్యజింపవలె. నిజమునకు ప్రతిదేశమునందును అనాత్మభావములను పూర్తిగా పరిత్యజించి, జ్యోతియందు ప్రకాశించుచు, ఆత్మను ఆధ్యాత్మికముగ ఉపాసింపగల ధీరులు కొందఱు సదా ఉండియేయున్నారు.

ఉన్నదెల్ల ఆత్మయొక్కటే అను వేదాంతము వ్యాప్తి చెందినచో మానవకోటి అంతయు ఆధ్యాత్మికపరమగును. మఱి, అది సాధ్యమా? ఏమో, నాకు తెలియదు. కొన్నివేల సంవత్సరములలో కాగలపనికాదు. ప్రాతకాలపు మూఢవిశ్వాసములన్నియు పూర్తిగా తొలగిపోవలె. మీ మూఢవిశ్వాసాలను నిలద్రొక్కుట యందు అక్కఱగలవారు మీరందఱును. ఇంతమాత్రమే కాదు. 'కుటుంబసోదరుడు' 'వర్ణసోదరుడు' 'దేశసోదరుడు' అను చుట్టఱికము లున్నవి. వేదాంతసాక్షాత్కారమున కివి యన్నియు ప్రతిబంధకములె. మతము, మతముగనుండునది మిక్కిలి కొలది మందికే.

ప్రపంచ మంతటను మతరంగములో కృషిచేసిన వారిలో అధికసంఖ్యాకులు రాజకీయోద్యోగులే. మానవులచరిత్ర అట్లే యున్నది. కక్కుఱితి లేకుండ పారమార్థికముగ జీవింప మానవులు యత్నింపనే లేదు. సంఘమునే దైవముగా వారు పూజించిరి; ప్రాయికముగ పామరప్రజాబాహుళ్యమునకు గల గ్రుడ్డినమ్మకములను, లోటుపాట్లను, నిలద్రొక్కి నెగ్గించుటయందే అధిక శ్రద్ధ వహించిరి. వారు ప్రకృతిని జయించుటకు ప్రయత్నింపరు, ప్రకృతియం దిమిడిపోవుటకే ప్రయత్నింతురు. అంతకంటె మఱేమియు గాదు. భారతదేశమునకు బోయి క్రొత్తసిద్ధాంతమును బోధింపుడు.—వారు వినిపించుకొనరు. అది వేదములలో నున్నదని చెప్పుడు. "బాగున్నది ఈ మతము" అందురు. ఇక్కడ నేనీ

సిద్ధాంతమును బోధింపగలను. కాని, మీలో ఎంతమంది శ్రద్ధతో అంగీకరింతురు? కాని, సత్యమంతయు నిందు గలదు. నేను మీకు సత్యమును తప్పక చెప్పవలెను.

ఈ విషయమునకు మఱొక పక్ష మున్నది. స్వచ్ఛమును, పరమోత్కృష్టమును అయిన సత్యము నందఱును తటాలున సాక్షాత్కరించుకోలేరు అని, జనులను ప్రార్థనద్వారా ఉపాసన ద్వారా వాడుకలోనున్న తదితరసాధనానుష్ఠానముల మూలమున క్రమక్రమముగా ముందుకు గొనిపోవలె నని ప్రతివాదును చెప్పు చుండును. ఇది సరియైనపద్ధతి అవునో కాదో నేను నిశ్చితముగా చెప్పజాలను. భారతదేశములో నేను ఉభయపద్ధతులలోను కృషి చేయుదును.

కల్కత్తాలో దేవునిపేరిట, వేదముల పేరిట, బైబిలు పేరిట, క్రైస్తుపేరిట, బుద్ధునిపేరిట విగ్రహములు, ఆలయములు కలవు. ఆ పద్ధతిలోకూడ ప్రయత్నము సాగనీ. హిమాలయ పర్వతములమీద నొకచోటు నిర్ణయించితిని, అక్కడ వినిర్మల సత్యము తప్ప వే ఱేవేమియు ప్రవేశింపరాదని నా నిశ్చయము. నేడు మీకు నే నుపన్యసించిన పద్ధతి నక్కడ ప్రయోగించి చూడ వలెనని నాకోరిక. ఆస్థానమును విచారించు కొనుచు ఒక ఆంగ్లే యుడును, ఒక ఆంగ్లస్త్రీయు నున్నారు. సత్యాన్వేషులకు శిక్షణ యిచ్చుట, భయము, మూఢవిశ్వాసాలు లేని వారినిగ బాలురను పెంచి పెద్దలచేయుట అచటి లక్ష్యము. క్రైస్తులు, బుద్ధులు, శివులు, విష్ణువులు — వీ రెవ్వరినిగుఱించియు వారు వినకూడదు. ప్రారంభమునుండియు తమకాళ్లపై తాము నిలబడుట వారు నేర్చు కొందురు. శైశవదశనుండియు దేవు డాత్మస్వరూపుడని, అతనిని ఆధ్యాత్మికముగ పారమార్థికముగ ఉపాసింపవలె నని నేర్చు కొందురు. ప్రతిజీవుని ఆత్మస్వరూపునిగా పరిగణింపవలె. ఇది లక్ష్యము. ఈ ప్రయోగ మెంతవఱకు జయప్రద మగునో చెప్ప

జాలను. నేడు నా కిష్టమగు విషయమును నేను బోధించుచున్నాను. ద్వైతభావమును పురస్కరించుకొని యేర్పడిన మూఢవిశ్వాసము లేవియు లేని వాతావరణములోనే నేను పెరిగియుండిన బా గుండెడి దని నా కోరిక.

ద్వైతవిధానమున కొంత మంచి కల దని నే నప్పుడప్పుడు అంగీకరించుచుందును: దుర్బలు రగు పెక్కండ్ర కది ఉపకరించును. ధ్రువనక్షత్రమును చూపవలసిన దని మి మ్మొకడు కోరిన యెడల, మొదట దానికి దగ్గరగా నున్న కాంతివంతమగు నక్షత్రమును చూపుదురు. తరువాత కాంతి తక్కువగానున్న నక్షత్రమును, పిమ్మట ఇంకను తక్కువకాంతిగల నక్షత్రమును, అనంతరము ధ్రువతారను చూపుదురు. ఈ క్రమముచే దానిని చూచు పని అతనికి సులభ మగును. వివిధసాధనలు, శిక్షణలు, బైబిలులు, దేవులు ఆస్తికతకు ప్రారంభరూపాలు. మతమున శిశుపాఠాలు.

కాని అన్యపక్షమును గూడ ఆలోచింతును. మెట్టుమెట్టుగా ఈదారి నిట్లు మెల్లగ పోవుచుండినచో సత్యమును చేరుకొను టకు ప్రపంచ మెంత కాలము వేచియుండవలె ? ఎంతకాలము ? ఏ నాటికిగాని చెప్పదగినమేరకు అది నెగ్గి తీరుననుటకు ప్రమాణమే మున్నది ? ఇంతవఱకును లేదు. ఇంతకును ద్వైతమార్గము మెట్టు మెట్టుగా సాగునది కానీ, కాకపోనీ, సత్త్వహీనులకది సుకరము కానీ కాక పోనీ, ఆ మార్గమున కాధార మేమో అసత్యమే కదా. ప్రచారములో నున్న సాధన లన్నియు తఱచుగా జనులను నిర్వీ ర్యులను చేయుట లేదా ? కనుక అవి తప్పులు కావా? వాని కాధారము మానవునిగూర్చిన దురభిప్రాయమును భ్రాంతియు. రెండు తప్పులు ఒక ఒప్పు అగునా ? అసత్యము సత్య మగునా ? చీకటి వెలు గగునా ?

నేను గతించిన ఒకమానవుని సేవకుడను. నేను దూతను మాత్రమే. ప్రయోగము (ఎక్స్పెరిమెంటు) చేయవలె నని నాకోరిక.

మీకు నేను చెప్పిన వేదాంతబోధలు నిజమునకిదివరలో ఆచరణలో పరీక్షింపబడ్డవికావు. వేదాంతము ప్రపంచములోని తత్త్వశాస్త్రలలో మిక్కిలి ప్రాచీనమే అయినను అది సర్వదా గ్రుడ్డినమ్మకములతోను, సర్వేతరములతోను కలిసిపోయియున్నది.

"నేనును నాతండ్రియు ఒక్కరమే" అని క్రైస్తు చెప్పెను. మీరును ఆమాటను వల్లించుచుందురు. అయినను అది మానవకోటికి ఉపకరింపలేదు. పందొమ్మిదివందలయేండ్లు గడచినను జనులామాట నర్థముచేసికొనలేదు. క్రైస్తును మానవకోటికి రక్షకుని జేసిరి. అతడు దేవుడు. మనము క్రిములము! భారతదేశములోను అంతే. ప్రతిదేశములోను ప్రతిశాఖకు నిట్టి నమ్మకమే వెన్నెముక. వేలకొలది సంవత్సరములుగా లోకమంతటను కోట్లకొలది జనులకు జగదీశ్వరుని పూజయు, అవతారముల పూజయు, రక్షకుల పూజయు, ప్రవక్తల పూజయు కలుపబడినది. "మీరు అసహాయుల రనుకొండి, దుఃఖభాగుల రనుకొండి; మోక్షము నొందవలెనన్న మీ కొకానొకని కృపయో కొందఱి కృపయో ఆధారమని భావింపు"డనివారికి నేర్పబడినది. ఇట్టి నమ్మకములలో అనేకాద్భుతవిషయము లున్న వనుటకు సందేహములేదు. కాని ఎంతైనను మతరంగమున ఇవి కేవలము శిశుపాఠములు. వానివలని మేలిమి స్వల్పమే. నేటికిని జనులు మత్తిల్లి అధఃపతనము చెందుచున్నారు. ఐనను ఇట్టి భ్రాంతిని అతిక్రమించు ధీరాత్ములు కొందఱు గలరు. మహాత్ము లుద్భవించి, మతమున నీశిశుపాఠముల తొలగించి ఆత్మ ఆత్మనారాధించు యథార్థమతమును స్పష్టముగను, శక్తిమంతముగను నిరూపించుకాలము సమీపించును.



# బహిరంగ రహస్యము

(కాలిఫోర్నియా, 'లోసేంజెలిసు'లో చేసిన ఉపన్యాసము)

విషయముల కలరూపు తెలిసికొన ప్రయత్నించు నప్పుడు మన మేవంకకు మరలినను, బహుదూరము పరిశీలనచేసి చూచి నచో తుద కొక విచిత్రమైన పట్టును దరియుదుము. స్థూలదృష్టి ఆ పట్టు అసంగతముగా కనిపించును: మన తర్కమున కది అందదు కాని, అదేమో సత్యమే. మన మేదో ఒక విషయమును తీసికొందుము — అది పరిచ్ఛిన్నమయిన దని మనకు తెలియును; దానిని పరిశీలనచేయ ప్రారంభింపగానే అది మనలను తర్కసీమ లను దాటించును. దాని గుణములకు, అందున్న అవకాశములకు, దాని శక్తులకు, సంబంధముల కంతు కనబడదు. అది యనంత మగును. చాల చిన్న దగు సాధారణపుష్పమును తీసికొనుడు ; దానినిగుఱించిన సర్వము తనకు తెలియు నని యెవరు చెప్ప గలరు? ఆ ఒక పుష్పమునుగుఱించిన జ్ఞానము పారమును చేరు కొనుట కెవరికిగాని సాధ్యము కాదు. ప్రారంభమున పరిచ్ఛిన్న ముగా నుండిన పుష్ప మనంత మయినది. ఇసుక రేణువును తీసి కొనుడు. దానిని పరిశీలింపుడు. అది సాంత మనియెడి పూర్వాభి ప్రాయముతో ప్రారంభింతుము. సాంతము కా దని, అది యనంత మని చివరకు తెలిసికొందుము ; కాని, అది సాంత మనియే మనము గణించుచుంటిమి. పుష్ప కూడ అటులనే సాంతమనియే గణించుచుంటిమి.

మనశారీరకమానసికానుభవములు, ఆలోచన లన్నిటి విషయ మింతే. కొంచెపాటి అంచనతో వానిని చిన్నవానినిగ గ్రహింప మన మారంభింతు మనకో వచ్చు కాని, త్వరలోనే అవి మన బుద్ధికి పట్టు చిక్కక అనంతత్వపు అగాధములో మునిగి

పోవును. మనము చూచెడివానిలో అగ్రగణ్యత మనకే, గొప్ప తనమును మనకే. ఉనికిని గుఱించిన ఆ సందిగ్ధస్థితిలోనే మనము గూడ నున్నాము. మన మున్నాము. మనము పరిచ్ఛిన్నజీవుల మని గమనించుచునే యున్నాము. మనము బ్రతుకుదుము, చత్తుము. మనచూపుమేర చాల సంకుచితము. మన మిక్కడ పరిచ్ఛిన్నులము. ప్రపంచము మన చుట్టును కననగుచున్నది. క్షణమాత్రములో ప్రకృతి మనలను నలిపి చంపగలదు. ఈ మన క్షుద్ర దేహములు ఇప్పటికి నిలిచియున్నవి. లిప్తకాలములో తుత్తునియలుగ విరిసిపోవుటకు సిద్ధములుగ నున్నవి. మన కావిష యము తెలియును. కార్యరంగములో మన మెంత నిర్వీర్యుల ముగ నున్నాము! మన సంకల్పమునకు మెట్టుమెట్టునను, అడ్డం కులు గల్గుచున్నవి. ఎన్నెన్నో పనులు చేయవలె నని మన మను కొందుము. కాని, మనము చేయగలిగిన వెన్ని? మన సంకల్ప మున కవధిలేదు. దేనినైనను మనము తలపెట్టగలము. దేని నైనను మనము కోరుదుము. జ్యేష్ఠానక్షత్రమును చేరుకొనవలె నని కోరుకొనగలము. మనకోర్కెలలో నెఱవేఱునవి ఎన్ని? అందు కడ్డుదగులునది మనదేహమే. ప్రకృతి మనసంకల్పసిద్ధికి ప్రతికూలముగ నుండును. మనము దుర్బలులము. పువ్వునుగుఱిం చియు, ఇసుకరేణువునుగుఱించియు, భౌతికజగత్తునుగుఱించియు, ప్రతితలంపునుగుఱించియు—ఏది నిజమో, అది మనలను గుఱించి నూఱింత లెక్కువగా నిజము. మనము ఏకకాలమున పరిచ్ఛిన్ను లముగను అపరిచ్ఛిన్నులముగను నున్నందున మనఉనికియందును అదే సందిగ్ధత కలదు. మనము సాగరములోని తరంగముల వలె నున్నాము; తరంగము సాగరమే, తరంగము సాగరము కాదు కూడ. "ఇది సాగరము" అని మీరు చెప్పుటకు వీలుకానిది తరంగమునం దేభాగమునను లేదు. "సాగరము" అను పేరు తరంగమున కన్వయించును. సాగరములోని తక్కిన ప్రతిభాగము నకుగూడ అన్వయించును. ఆ పే రేమో సాగరమునకంటె వే?

అటులనే సత్తయనెడి యనంతసాగరమున మనము తరంగముల వంటివారము. అయినను మనలను గుఱించిన యథార్థము తెలిసి కొన ప్రయత్నించినప్పుడు మనము తెలిసికొనలేకపోవుదుము. మనము అనంతములో ఏకమై పోయియుందుము.

మనము స్వప్నములో నడచుచున్న ట్లనిపించుచుండును. కలలు కనుచున్నంతసేపు కలలు బాగుగనే యుండును; కాని, వానిలో నొకదాని గ్రహింప ప్రయత్నింపగానే అది మాయమై పోవును. ఎందుచేత? అది యసత్య మగుటచేత కాదు, తర్క మున కందనిదగుటచేత, దాని ఆకళింత మనబుద్ధి కశక్యమగుట చేత. జీవితములో ప్రతివిషయమును ఎంతో పెద్దది. దానిముందు మనబుద్ధి యత్యల్పము. బుద్ధిసూత్రముల కది 'కట్టువడను' అనును! దాని చుట్టును ధీశక్తి పఱువగోరెడి బంధములను చూచి యది పరిహసించును. మానవాత్మవిషయమై యీ పరిస్థితి సహ స్రాధికముగా నిజము. 'మనము' అనునదే సృష్టిమర్మము లన్ని టిలో అధికమర్మము.

ఇ దంతయు నెంత యద్భుతముగా నున్నది! నరునినేత్ర మును చూడుడు. ఎంత సులభముగా దానిని నాశనము చేయ వచ్చును! కాని, మీకన్ను చూడగలుగుచున్నది కనుకనే మిక్కిలి పెద్ద సూర్యగోళముల ఉనికి సార్థక మగుచున్నది. 'ఉన్నది' అని మీ చక్షువులు చెప్పుటచేతనే ప్రపంచపు టునికి చరితార్థ మగుచున్నది. ఈ రహస్యమునుగుఱించి యోచింపుడు! పాపము! ఎంత చిన్నకన్ను లివి! కంటిని నాశముచేయుటకు పెద్ద వెలుతురు చాలు, సూది చాలు. అయినను అత్యమోఘమారణ యంత్రములు, అత్యఘోరజలప్రళయములు, జగత్తులోని అద్భుత వస్తువులు, లక్షలకొలది సూర్యులు, నక్షత్రములు, చంద్రులు, పృథివి—ఈ యన్నింటి యునికియు ఈ రెండు చిన్నవస్తువులపై అవి తెల్పుదానిపై ఆధారపడియున్నవి! ఇవి, "ప్రకృతీ, నీ

నొకటి కావలె నని వెదకును. ప్రకృతిని సర్వశక్తిగా భావింపని వానిని, ప్రకృతిని వశపఱచుకొనఁగలవానిని, ఏ ధర్మమునకును లొంగని వానిని, రాక్షసునో దయ్యమునో దేవునో ప్రత్యక్షము చేసికొనవలె నని కోరును. మానవుని హృదయమునుండి వెలు వడు మొఱ ఇది — శాసనశృంఖలను త్రెంపగల్గిన వాఁడొకఁడు కావలయు నే — అనుట 'శాసనశృంఖలను త్రెంపగలవాఁ డెవఁడా' అని మనము సదా అన్వేషించుచున్నాము. రైలుఇంజను పట్టాల మీఁద వేగముగా వచ్చుచున్నది. పట్టామీఁద నున్న చిన్నపురుగు ప్రక్కకు తప్పుకొనును. మనము వెంటనే, "ఇంజను నిర్జీవమగు లోహపదార్థము, యంత్రము, పురుగు జీవముగలది" అని చెప్పుదుము. ఏలయన, విధిని ప్రతిఘటించుటకు పురుగు ప్రయత్నించినది. ఇంజనుకు శక్తి, బలము ఎంతగా నున్నను అది నియమము నతిక్రమింపఁజాలదు. మానవు డెటు త్రిప్పిన అది యటు పోయి తీరవలసినదే. మఱొకవిధముగా నది పోఁజాలదు. అది అట్లు నిర్మితమై యున్నది కాని, క్రిమి చిన్న దయినను, యల్పమయిన దయినను విధి నతిక్రమించి యపాయమును తొలఁగించుకొనుటకు ప్రయత్నించినది: విధికి విరుద్ధముగా నది తన శక్తిని తన స్వేచ్ఛను నిరూపించుకొన ప్రయత్నించినది: దానిలో ముందు ముందు వ్యక్తము కానున్న దేవుని సూచించున దదే.

సర్వత్ర మన మీ స్వాతంత్ర్యనిరూపణమును, ఆత్మ స్వాతంత్ర్యనిరూపణమును కనుచున్నాము. ఈ స్వాతంత్ర్యము దేవునిరూపమున, దేవతలరూపమున ప్రతిమతమునందును ప్రతి ఫలించుచున్నది; కాని, దేవునిబాహ్యమున మాత్రమే చూడఁగల వారికి ఇది యింకను బాహ్యముగనే ఉన్నది. తాను అకించనుఁడ నని మానవుఁడు తీర్మానించుకొన్నాఁడు. తా నెన్నటికిని ముక్తుఁడను కాలే నని భయపడెను; అందుచేత స్వతంత్రు నొకని ప్రత్యక్ష మొనర్చుకొన మానవుఁడు ప్రకృతికి వెలుపల అన్వేషణచేయుటకు

బయలుదేరెను. తరువాత అట్టి ముక్తపురుషు లసంఖ్యాకులు గల రను ఆశయము అతనికి కలిగెను. క్రమక్రమముగా అతడు దేవతల నందఱను ఒక దేవాధిదేవునియందు, ఒక్క పరాత్పరునియందు కలిపివేసెను. ఇదియు అతనికి సంతృప్తి కలిగింపలేకపోయెను. అతడు సత్యమునకు మఱొకమెట్టు సమీపమునకు చేంతకువచ్చెను, తానెట్టివాడైనను, దేవాధిదేవునితో, పరాత్పరునితో ఏదోవిధమైన సంబంధము తనకు కలదని అతడు క్రమక్రమముగా గ్రహింపసాగెను; తాను బద్ధుడనని, హీనుడనని, దుర్బలుడనని అనుకొనుచున్నను అట్టితనకు దేవాధిదేవునితో ఏదో ఒకవిధమైన సంబంధము కల దని గుర్తించెను. అతనికి దివ్యదర్శనములు కలిగెను; ఆలోచన లేచినది ; జ్ఞానము ముందుకు సాగినది. అతడు దేవుని కింకనింకను సన్నిహితుడు కాసాగెను. దేవుడేమి, సకలదేవత లేమి, సర్వ శక్తియౌ ముక్తాత్మకై సాగిన యీ అన్వేషణమునకు సంబంధించిన సకల మనస్తత్త్వమేమి, ఇదంతయు తన్ను గూర్చిన తన ఆశయపు ప్రతిబింబమే అని అతడు చిట్టచివరకు కనుగొనెను. ''దేవుడు తన ప్రతిబింబముగా మానవుని సృష్టించిన'' మాటే కాక, ''మాన వుడు దేవుని తనప్రతిబింబముగా సృష్టించిన''మాటకూడ నిజమే అని తుదకు మానవుడు గుర్తించెను. 'జీవుడు దివ్యుడు ముక్తుడు' అను నాశయము నిది ప్రకాశపఱచినది. భగవంతుడు సర్వదా మనలోపలనే ఉన్నాడు. అతడు సన్నిహితములన్నిటికంటె సన్ని హితుడు. అతనికొఱకు మనము వెలుపల అన్వేషించుచుంటిమి. చివర కతడు మన ఆత్మల కాత్మ అని కనుగొంటిమి. తనహృదయ స్పందనమును విని, ఎవరో తలుపుకొట్టుచున్నారని భ్రమపడిన వానిని గుఱించి మీరు వినియే యుందురు. అతడు పోయి తలుపు తీసి చూడగా, అక్కడ ఎవరును లేరు. అతడు వెనుదిరిగివచ్చెను. మరల అతడు తలుపుతట్టుచున్నట్టు వినెను. కాని, అక్కడ ఎవ రును లేరు. కడ కది తనగుండెయధ్వనియే అనియు, తలుపు నెవరో తట్టుచున్నట్టు తాను భ్రమించితి ననియు అతడు గ్రహిం

చెను. అదే విధముగా మానవుడు వెదకి వెదకి తుదకు ఇంత కాలము బాహ్యప్రకృతియందు కలదని తాను భావించుచువచ్చిన అనంత విముక్తి తనలో అంతర్యామిగనున్న ద్రష్టయే అనియు ఆత్మల కెల్ల ఆత్మయైన నిత్య మనియు, పరమార్థ మనియు, తానే అనియు తెలిసికొనును.

కట్టకడ కత డద్భుతమగు ద్వైతస్థితిని గుర్తించును : విషయియందే అనంతము, సాంతము కలసి యున్నది — అనంతాత్మయు పరిచ్ఛిన్నాత్మయు అభిన్నములు. అనంతాత్మ బుద్ధి వలలో చిక్కుకొన్నట్లయి పరిచ్ఛిన్నజీవులుగా పైకి భాసించును. కాని, సత్యము మార్పుచెందక యెప్పటివలెనే ఉండును.

కనుక పరమార్థజ్ఞానమిది : మన ఆత్మల కెల్ల ఆత్మగా, మనలోపలనున్న సత్యము నిర్వికారమయినది, నిత్యమయినది, నిత్యశుద్ధమయినది, నిత్యముక్తమయినది. మనము కాలూనుటకు చలింపని ఆధార మి దొక్కటే.

మృత్యువున కిదే అవసానము, దుఃఖమున కిదే ముగియిక, అమృతత్వమున కిదే ప్రాదుర్భావము. అనేకముల కంతర్గతముగ నున్న ఏకమును, పరిణామశీలమగు జగమున కంతర్యామిగ నున్న నిర్వికారతత్త్వమును — ఎవడు సాక్షాత్కరించుకొనునో, దానిని తన ఆత్మ కాత్మగా కనునో అతనికే శాశ్వత శాంతి — తదితరులకు కాదు.

దుఃఖపతనగర్తములమధ్య నున్నప్పుడు ఆత్మ, తేజఃకిరణము నొకదానిని ప్రసారముచేయును. మానవుడు మేల్కొనును, ఏది యథార్థముగా తనదో దానిని తాను ఎన్నటికిని కోల్పోజాల నని తెలిసికొనును. ఔను. నిజముగా ఏది మనదో దానిని మన మెన్నడును పోగొట్టుకోలేము. తన సత్తను ఎవడు పోగొట్టుకో గలడు? తనయునికినే పోగొట్టుకొనగలవా డెవ్వడు? నేను సుజను

డనుగా నున్నచో అది మొట్టమొదట 'ఉనికి'. ఆ 'ఉనికి'కి సౌజన్య మను వన్నె గల్గినది. నేను దుర్జనుడనుగా నున్నచో అదియు మొట్టమొదట ఉనికియే. ఆ ఉనికికి దౌర్జన్య మను వన్నె గల్గినది. కావున ఉనికియే మొదటిది, ఉనికియే కడపటిది; ఉనికియే నిత్యమైనది. అ దెన్నటికి పోవునది కాదు, సర్వదా ఉండునదే.

అందుచేత అందఱకును ఆసపా టున్నది. ఎవ్వారికిని మృత్యువు లేదు; ఎవ్వరును శాశ్వతముగా పతనావస్థలో నుండ జాలరు. జీవితము క్రీడారంగము. ఈ క్రీడ యెంత మొరటుదిగా నైన ఉండ వచ్చు. మన మెటువంటి దెబ్బలు తినుచున్నను, మన మెంతగా త్రోపుళ్లకు గుఱియగుచున్నను ఆత్మవస్తువు గలదు. అ దెప్పటికిని గాయపడునది కాదు. ఆ అనంతతత్త్వమే మనము.

ఒక వేదాంతి యిట్లు గానము చేసెను: "నా కేనాడును భయము లేదు, సందేహము లేదు. మృత్యువు నాయొద్ద కేనాడును రాలేదు. నాకు తండ్రిగాని, తల్లిగాని ఎప్పుడును లేరు. ఏలయన, పుట్టుక నా కెన్నడును లేదు. నాకు శత్రువు లెక్కడ నున్నారు? — సర్వమును నేనే కదా! నేను అఖండసచ్చిదానంద మను. సోఽహం సోఽహం. కోపము, కామము, అసూయ, దుశ్చింతలు — ఇట్టి వన్నియు నాయొద్ద కెప్పుడును రాలేదు. ఏల యన, నేను అఖండసచ్చిదానందమను. సోఽహం సోఽహం."

ఇదియే యన్ని వ్యాధులకును మందు; ఇదే మరణమును నివారించు అమృతము. మన మీ ప్రపంచములో నున్నాము. మనప్రకృతి దాని కెదురుతిరుగును. కాని, మన మిట్లు వల్లింతము: "సోఽహం సోఽహం. నాకు భయము లేదు, శంక లేదు, మృత్యువు లేదు. నేను స్త్రీని కాను, పురుషుడను కాను. నాకు సిద్ధాంతము లేదు, రంగు లేదు. నా కేమి సిద్ధాంత ముండగలదు?

నేను చెందవలసిన వర్గ మేది? ఏ వర్గము నన్ను తనలో నిముడ్చు కొనగలదు? ప్రతివర్గములోను నే నున్నాను!''

దేహ మెంతగా ప్రతిఘటించినను, మన స్సెంతగా ఎదురు తిరిగినను, బంధురాంధకారములో, అతిబాధాకరమగు చిత్ర హింసకు గుఱియగుచున్నప్పుడు, అత్యంతనిస్పృహుడవై యున్న ప్పుడు ఈ మాటను ఒకమాఱు, రెండుమాఱులు, ముమ్మాఱు, ఇంక నెక్కువమార్లు వల్లింపుము. నెమ్మదిగా, నిదానముగా వెలుతురు వచ్చును; తప్పక వచ్చును.

పస్తు మాడి, కాళ్లు నొచ్చి, విసిగి నే నెన్నియో పర్యాయ ములు మృత్యువువాత పడితిని; పెక్కు దినములపాటు నాకు ఆహార ముండెడిది కాదు. పలుమార్లు ఇక ముందడుగు పెట్టలేక పోయెడివాడను; నే నొక చెట్టుక్రింద చతికిల పడెడివాడను. ప్రాణము పోవుచున్న ట్లనిపించెడిది. మాటాడ లేకుండెడివాడను, ఆలోచింపలేకుండెడివాడను. చివరకు నా మనస్సు ఈ భావమునకు మరలెడిది. ''నాకు భయము లేదు, మృత్యువు లేదు; ఆకలి దప్పులు లేవు. 'సోఽహం' 'సోఽహం'. అఖిలప్రకృతి యేక మైనను నన్ను అణంపజాలదు; అది నా బంటు. ప్రభువులకు ప్రభువవు, దేవులకు దేవుడవు. నీ శక్తిని బల్లగ్రుద్ది ఘోషింప వోయి! కోల్పోయిన సామ్రాజ్యమును మరల స్వాధీనము చేసి కొనుము! లే, లెమ్ము. ముందుకు నడువుము. ఎక్కడను ఆగకు!'' అంతట నేను మరల వీర్యవంతుడనయి లేచువాడను. అట్లు నే నీనా డిచ్చట సజీవుడనై ఉన్నాను. అంధకార మావ రించినప్పుడెల్ల సత్యమును ఉద్ఘాటింపుము. అందుకు ప్రతికూల మయినదెల్ల అంతరించిపోవలసినదే. ఎందుచేతననగా ఇదింతకును స్వప్నమే. కష్టములు పర్వతములంతగా కనిపించినను, పరిస్థితు లన్నియు భయంకరములుగాను, నిరాశాజనకములుగాను ఉన్నను అవన్నియు మాయయే. దానికి భయపడకు — అది తొలగి

పోవును. దాని నణచి పెట్టుము. అది యదృశ్య మగును. దానిని త్రొక్కి వేయుము. అది చచ్చును. భయపడకు. 'ఎన్ని మాఱులు పరాజయ మొందితి' నని అనుకోకు. లెక్క చేయకు. కాల మనంతము. ముందుకు సాగిపో. ఆత్మశక్తిని మాటిమాటికి నిలద్రొక్కుకో. వెలుగు వచ్చియే తీరును. పుట్టిన ప్రతిప్రాణిని నీవు ప్రార్థింప వచ్చును. కాని, నీ కెవరు వచ్చి సాయపడుదురు? మృత్యువుమాటేమిటి? దానినుండి తప్పించుకొన్న వా రెవ్వరు? నిన్ను నీవే తరింప జేసికో, సఖా, వే ఱెవరును నీకు తోడ్పడ లేరోయి. ఏల యన నీకు నీవే ప్రబలతమశత్రువవు, నీకు నీవే ప్రబలతమమిత్రమవు. కనుక ఆత్మనే అవలంబింపుము. లెమ్ము. భయపడకు. సకలదుఃఖముల నడుమను, దౌర్బల్యముల నడుమను ఆత్మను వెలువడనీ. మొదట అది అస్పష్టముగను అగోచరముగను నుండ వచ్చును. నీకు ధైర్యము వచ్చును. కడకు సింహమువలె నీ విట్లు గర్జింతువు. 'సోఽహం' 'సోఽహం'. నేను పురుషుడను కాను, స్త్రీని కాను; దేవతను కాను, రాక్షసుడను కాను; జంతువులలో నే నేదియు కాను, మొక్కలలో నే నేదియు కాను, చెట్టులలో నే నేదియు కాను. నేను పేదను కాను, ధనికుడను కాను; విద్యాధికుడను కాను, చదువురానివాడను కాను నా యథార్థస్వరూపము నెదుట ఇ వన్నియు మిక్కిలి క్షుద్రములు; ఏల యన 'సోఽహం' 'సోఽహం'. సూర్యచంద్రనక్షత్రములను చూడుడు! వానిలో ప్రకాశించుచున్నజ్యోతి నేనే! నే నగ్ని లోని సౌందర్యమను! విశ్వములోని శక్తి నేనే! ఏల యన 'సోఽహం' 'సోఽహం'.

"తా నల్పుడ నని భావించువాడు పొరపడుచున్నాడు. ఎందుచేత ననగా, ఉన్న దెల్ల ఆత్మయే. సూర్యు డున్నా డని నేను చెప్పుచున్నాను కనుక సూర్యు డున్నాడు. జగ మున్నదని నేను చెప్పుచున్నాను కనుక జగ మున్నది, నేను లేకున్న అవి

లేవు, ఏల యన నేను అఖండసచ్చిదానందమను, నిత్యసుఖిని, నిత్యశుద్ధుడను, నిత్యసుందరుడను. ఈ విషయము గమనింపుడు : మనచూపునకు కారకుడు సూర్యుడే, కాని ఎవరికంటిలోని ఏ దోష మును ఆయనకు సోకదు. అటులనే నేనును. నేను సర్వేంద్రియ ములతో పనిచేయుచున్నాను. సర్వవస్తువులద్వారా పనిచేయు చున్నాను. కాని, పని మంచిచెడుగులు నన్నంటవు. నాకు శాసనము లేదు, కర్మ లేదు. కర్మసూత్రములకు స్వామిని నేను. నాకు నిత్యసత్త పూర్వమును ఉండినది, ఇప్పుడును ఉన్నది.

"ఐహికవిషయములలో నా కెన్నడును నిజమగు ప్రీతి లేదు—ప్రీతి భర్తయందు లేదు, భార్యయందు లేదు, బిడ్డలందు లేదు, తదితరవస్తువులందు లేదు. నేననంతనీలాకాశమువంటి వాడను; రంగురంగుల మబ్బులు దానిమీదికివచ్చి క్షణ మాట లాడి పోవును; అవి తొలగిపోవును. తరువాత మిగిలినది మార్పు చెందని నీలాకాశమే. సుఖదుఃఖములు, మంచిచెడుగులు క్షణ కాలము నన్నావరింప వచ్చుగాక. ఆత్మను మఱుగుపఱుప వచ్చు గాక. కాని, నేను సదా ఉండనే ఉన్నాను, వానికి మార్పు కలదు కనుక అవి తొలగిపోవును. నేను నిర్వికారుడను. కనుక నేను ప్రకాశింతును. కష్టము కలిగినచో దానికి అవసానము కలదని నాకు తెలియును. అది అంతరింపవలసినదే. చెడుగు సంభవించి నచో, దానికి అవసానము కల దని నాకు తెలియును. అది యంత రింపక తప్పదు. ఏదియు అంటనివాడును అంతము లేనివాడును నే నొక్కడనే. ఏల యన నేను అపరిచ్ఛిన్న - నిత్య - నిర్వికా రాత్మను" — అని మా కవులలో నొకడు గానముచేసెను.

మనము దీనిని ద్రాగుదము. ఇది మనలను నిత్యమయిన దానియొద్దకెల్ల, నిర్వికారమయినదానియొద్దకెల్ల చేర్చును. భయ పడకుడు. మనము పాపుల మని, పరిచ్ఛిన్నుల మని, ఎప్పుడో చనిపోయెడివార మని నమ్మకుడు. అది నిజము కాదు.

"ఇది శ్రోతవ్యము, మంతవ్యము, నిదిధ్యాసితవ్యము." చేతులు పనిచేయుచున్నప్పుడు మనస్సు 'సోఽహం' 'సోఽహం' అని పలుకుచుండవలె. అది మీ యెముకలలో ఎముకగా, కండర ములలో కండరముగా మాఱెడి వఱకు, అల్పత్వము, దౌర్బల్యము, దుఃఖము, చెడుగు — వీనిని గుఱించిన భీకరస్వప్నములు సమగ్ర ముగ మాయమగువఱకు దానినే ధ్యానింపుడు. దానిని కలగనుడు. అటుతరువాత క్షణకాల మయినను సత్యము మీనుండి మఱుగు పడజాలదు.

# నిశ్శ్రేయస మార్గము*

నేటిరాత్రి మీకు వేదములనుండి యొకకథ చెప్పెదను. వేదములు హిందువుల పవిత్ర మతగ్రంథములు. వేదసారస్వతము బహువిస్తార మయినది. వేదములలోని చివరిభాగములకు వేదాంత మని పేరు. వేదాంత మను మాటకు వేదముల తుద యని యర్థము. అది వేదములలో నున్న వాదములను ముఖ్యముగా మన కిప్పుడు ప్రకృతమయిన తత్త్వవిషయమును ప్రతిపాదించును. అది ప్రాచీనసంస్కృతభాషలో రచింపబడినది. అది వేలకొలది సంవత్సరములకు పూర్వము రచింపబడిన దన్న విషయము మీరు మఱవరాదు. ఒకానొకడు గొప్ప యజ్ఞము చేయ సంకల్పించెను. హిందువుల మతములో యజ్ఞమునకు విశేషప్రాముఖ్యము గలదు. యజ్ఞములు పలు తెఱగులు. బలిపీఠములు నిర్మించుట, అగ్నిలో ఆహుతులను హోమము చేయుట, వివిధమంత్రములు పఠించుట, మున్నగునవి యజ్ఞాంగములు. యజ్ఞము ముగిసిన పిదప బ్రాహ్మణులకు, పేదలకు దానములు చేయుదురు. ఒక్కొక్క యజ్ఞమునకును దానికి ప్రత్యేకముగ చేయవలసిన దానము ఉన్నది. కర్త తన సర్వస్వము నిచ్చివేయవలసిన యజ్ఞ మొకటి యుండెను. ఈ యజ్ఞము తలపెట్టినవాడు ధనికుడైనను పరమ లుబ్ధుడు. కాని ఈ దుష్కరయజ్ఞమును చేసిన గొప్పపేరును సంపాదింపవలె నని యత డాశించెను. యజ్ఞము పూర్తి అయిన తరువాత అతడు తన సర్వస్వము నిచ్చివేయుటకు బదులు తన ఆవులలో కుంటివానిని గ్రుడ్డివానిని ముసలివానిని ఇక పాలీయని వానినిమాత్రమే దానము చేసెను. అతనికి నచికేతు వను కుమారుడు కలడు. నచికేతుడు ప్రతిభగల యువకుడు. తండ్రి చేసిన యల్పదానముల నతడు గమ

* ఈ ఉపన్యాసము రమారమి కఠోపనిష దనువాదము (సం)

నించెను. అందువలన తప్పక సంభవించు పాపమును గుఱించి యతడు తలపోసెను. అందులకు పరిహారముగా నతడు తన్నే దానముగా అర్పించుకొన కృతనిశ్చయుడయ్యెను. అంతట అతడు జనకుని యొద్దకేగి, "నన్నెవరికి దానము చేయుదువు?" అని యడిగెను. తండ్రి సమాధానము చెప్ప లేదు. కాని, కుమారుడు అదే ప్రశ్న రెండవసారి మూడవసారికూడ అడిగెను. జనకుడు విసుగుకొని, "నిన్నా? నిన్ను యమున కిత్తును. నిన్ను మృత్యుదేవతకిత్తును." అని గద్దించెను. నచికేతువు సూటిగా వెడలి, యముని రాజ్యమున కేగెను. అప్పుడు యము డింట లేడు. నచికేతువు వేచి యుండెను. మూడుదినముల తరువాత యముడు వచ్చి, "ఓ బ్రాహ్మణుడా, నీవు నా అతిథివి. మూడు దినములుగా ఆహారము లేక నీ విక్కడ నుంటివి. నీకు నా వందనములు. నీ ఈ క్లేశమునకు పరిహారముగా నేను మూడు వరము లిత్తును." అనెను. నచికేతువు తన మొదటివరముగా, "నాయందు నా తండ్రికి కలిగిన ఆగ్రహము చల్లాఱును గాక." అనికోరెను. రెండవవరముగా తా నొకానొకయజ్ఞమును తెలిసికొనవలెనని కోరెను. తరువాత మూడవవర మి ట్లడిగెను: "ప్రశ్న ఏ మనగా — మరణించిన తరువాత, మానవు డే మగును? అత డిక లే డని కొందఱు చెప్పుదురు. ఉన్నా డని మఱికొందఱు చెప్పుదురు. ఇదియే నా మూడవవరము. దయచేసి ఆ ప్రశ్నకు సమాధానము తెల్పుము." యము డిట్లు చెప్పెను: "పూర్వము దేవత లీ మర్మమును భేదించుటకు ప్రయత్నించిరి. ఇది బహుసూక్ష్మము. దీని నవగాహన చేసికొనుట కష్టము. కనుక మ ఱొక వర మేదయిన అడుగు. దీనిని అడుగవలదు. నూఱేండ్ల దీర్ఘజీవితము కోరుకో. పశువులను కోరు. గుఱ్ఱములను కోరు. పెద్దరాజ్యముల కోరు. ఈప్రశ్నకే సమాధానమి మ్మని ఒత్తిడిచేయకు. భోగానుభవమునకు మానవు డేమేమి కోరునో వాని నెల్ల కోరుకొనుము. వాని నెల్ల నేను తీర్చెదను కాని, ఈరహస్యము తెలిసికొనవలె నని కోరకు." బాలుడనెను,

"స్వామీ, అట్లు కాదు. "మానవుడు ధనముతో సంతృప్తిపడ వలసినవాడు కాడు. ధనమే కావలసియున్నచో మీదర్శనమాత్ర ముచే అది సిద్ధించితీరును. దీర్ఘాయువా, అదియు మీరు పరిపా లించునంతకాలము సాగును. అధోలోకములో వసించుచు, నాశిల్లుచున్న ఏ మానవుడు ఆటపాటలలోని వినోదములో గల పస తెలిసికొన్న తరువాత సంప్రాప్తజ్ఞానుడయి, అజరామరుల సాంగత్యముపొంది దీర్ఘాయువుచే సంప్రీతుడగును? కనుక మర ణానంతరమునుగూర్చిన గొప్పరహస్యమునే తెలుపుమా. నాకు మఱేమియు నక్కఱ లేదు. నచికేతువు కోరునది అదే—మృత్యు రహస్యము" అని. అంతట యముడు ప్రీతుడాయెను. గడచిన రెండుమూడు ఉపన్యాసములలో ఈ జ్ఞానము మనస్సును సంసిద్ధ పఱచు నని చెప్పి యుంటిమి. కనుక చూచితిరా, సత్యముదక్క మఱేమియు కోరకుండుట, సత్యమును సత్యముకొఱకే కాంక్షిం చుట మానవుని సన్నాహములో మొదటి మెట్టు. ఈబాలు డెట్లు యము డిత్తు నన్న వరము లన్నిటిని,—వస్తువులను, ఆస్తిని, ధన మును దీర్ఘాయువును — నిరాకరించెనో చూడుడు. ఒక్కదాని కొఱకు, జ్ఞానముకొఱకు, సత్యముకొఱకు సర్వమును త్యజించుట కతడు సిద్ధపడెను. సత్యసిద్ధి క దొక్కటే మార్గము. యముడు సంప్రీతు డాయెను. "రెండు మార్గము లున్నవి. ఒకటి ప్రేయో మార్గము. మఱొకటి శ్రేయోమార్గము. ఈ రెండును వివిధ గతుల మానవకోటి నాకర్షించును. ఎవడు ప్రేయమును విసర్జించి శ్రేయమున కను వగు మార్గము ననుసరించునో అతడే వివేకి. ప్రేయోమార్గము ననుసరించెడివాడు పతనము చెందును. నచికేతూ, నీకు నా కైవారములు. కోర్కెలు నీవేదియు కాంక్షింప లేదు. ప్రేయోమార్గము వంకకు నిన్ను నానావిధాల ఆకర్షింప చూచితిని. కాని, నీవు ఆయాకర్షణల నన్నిటిని ప్రతిఘటింప గలిగితివి. భోగజీవితముకంటె జ్ఞాన మెంతో ఉత్కృష్ట మయిన దని నీవు గ్రహించితివి." అని యత డనెను.

"భోగసక్తుడై జీవించు అజ్ఞాని మోటుమృగమునకంటె భిన్నుడు కాడని నీవు గ్రహించితివి. అయినను అజ్ఞానమున మునిగియుండియు, హృద్గతాహంకారముచే తాము మహావివేకుల మని అనుకొనుచు గ్రుడ్డివారి ననుసరించు గ్రుడ్డివారివలె పెక్కు వక్రమార్గముల చుట్టుచుండువా రనేకులు గలరు. కొన్ని మట్టిముద్దలచేత వంచితులయి వివేకహీనులగు బాలకులవంటి వారి హృదయములలో ఈ సత్యము నచికేతూ ఎప్పుడును ప్రకాశింప దోయి. వారికి ఈ ప్రపంచము బోధపడదు. మఱొకప్రపంచము బోధపడదు. వారు దీనిని, దానిని కూడ కాదనుచు మాటి మాటికి నాచే జిక్కుచుందురు. దీనిని గుఱించి విను నవకాశము సైతము పెక్కండ్రకు లేదు; పలువురు విన్నప్పటికి అర్థము చేసి కొనజాలరు. ఏల యన, దీని వక్త ఆశ్చర్యకరుడుగ నుండ వలె. ఈ జ్ఞానమును ప్రాపించువాడును ఆశ్చర్యకరుడుగ నుండవలె. వక్త ఉదాత్తపరిణతి నొందనివా డైనచో నూఱు పర్యాయములు బోధించినను, నూఱుపర్యాయములు విన్నను పరమార్థము ఆత్మ నే నాడును వెలుగొందింపదు. నచికేతూ, నీ మనస్సును రిక్త తర్కాలచే చెదరగొట్టుకొనకు, పరిశుద్ధహృదయములోనే ఈ సత్యము ప్రకాశించును. దుర్దర్శమును గూఢమును గుహాహిత మును పురాణమును బాహ్యనేత్రముల కగోచరము నగు దీనిని అధ్యాత్మయోగముచే చూచు ధీరుడు హర్షశోకముల విడనాడును. ఎవ డీ రహస్యమును దెలిసికొని రిక్త వాంఛల విడనాడి, ధర్మ్య మగు అణువును సాక్షాత్కరించుకొనునో, అతడు నిత్యమోదము ననుభవించును. నచికేతూ, ఇదియే శ్రేయోమార్గము. అతడు ధర్మమునకును అధర్మమునకును, కృతమునకును అకృతమునకును భూతమునకును భవ్యమునకును వేఱైనవాడు. దీని నెఱిగినవాడే ఎఱిగినవాడు. సర్వవేదములును ఏ పదము (గమ్యము)ను ప్రతిపా దించుచున్నవో, సర్వతపములును దేనిని (ఫలముగా) ఘోషించు చున్నవో, దేనిని గోరి జనులు బ్రహ్మచర్యము చరింతురో ఆ

గమ్యముపేరు నేను నుడివెదను : అది 'ఓమ్'. నిత్యమగు ఈయక్షరమే బ్రహ్మము. ఈయక్షరమే పరము; ఈ యక్షరమును తెలిసికొన్నవారు ఏమి కోరుదురో అది వారి దగును. నచికేతూ, నీవిప్పు డన్వేషించుచున్న జీవాత్మ యెన్నడును పుట్టదు. అ దెన్నటికి మరణింపదు. శరీరము చచ్చుచున్నప్పుడు అజమును నిత్యమును పురాణము నగు ఆత్మ చావదు. చంపువాడు తాను చంపుచున్నా నని భావించినను, చంపబడువాడు తాను చంపబడుచున్నా ననుకొనినను ఇరువురును తెలియనివారే. ఆత్మ చంపునదియు కాదు, చచ్చునదియు కాదు. అణువుకంటె అణీయమును మహత్తుకంటె మహీయమును అగు ఆత్మ జంతువుల హృదయములందు (గుహాకాశమున) నెలకొనియుండును. అక్రతువు (కామరహితుడు)ను వీతశోకుడై ధాతుప్రసాదముచే ఆత్మ మహిమను దర్శించును. (భగవత్సాక్షాత్కార సాధకములలో భగవత్కృపయు నొకటి అని మనకు తెలియుచున్నది.) ఆసీనుడయియే యతడు దూరము పయనించును. శయనించియుండియే అతడు ఎల్లెడల కేగును; పరస్పరవిరుద్ధము లగు గుణములను తనలో సమన్వయించుకొను దేవుని తెలిసికొనుటకు విశుద్ధము, నిశితము అయిన ధీశక్తి గల వారు కాక మఱెవ్వరు యోగ్యులు? భంగురము లగు దేహములందు నెలకొన్న వాడును అశరీరియు మహీయుడును విభువు నగు నాత్మను ఎఱిగిన ధీరులు సకలదుఃఖముల నుజ్జగింతురు. ఈయాత్మ, ప్రవచనముచేత లభ్యము కాదు, మేధాశక్తిచే లభ్యము కాదు, బహుశ్రుతముచే లభ్యము కాదు. ఈ యాత్మ తా నెవనిని వరించునో అతనికే లభ్య మగును. తన స్వరూపమును అతనికే వెలువఱచును. దుశ్చరితమునుండి విరమించుకొనినవాడును, అసమాహితుడును, అశాంతుడును, అశాంతమానసుడును హృదయగతుడగు పరమాత్మను ప్రజ్ఞానముచేతసైతము పొందలేడు. ఓ నచికేతూ, ఈ దేహమే రథమని, ఇంద్రియములే అశ్వములని, మనస్సే కళ్లెమని, బుద్ధియే సారథి యని, ఆత్మయే

Acc No.
Date

రథి యని — యెఱుంగుము. ఆత్మ, సారథియైన బుద్ధితోను, తరువాత బుద్ధిద్వారమున కళ్లెమైన మనస్సుతోను, పిమ్మట మనస్సు ద్వారమున అశ్వములయిన ఇంద్రియములతోను చేరినప్పుడు అతడు భోక్త అన బరగును; అత డప్పుడు ద్రష్ట, కర్త, వ్యవహర్త. ఎవడు అవిజ్ఞానవంతుడో, ఎవడు సదా అయుక్త మానసుడో అతనికి ఇంద్రియములు, సారథికి దుష్టాశ్వములవలె, వశపడకుండును. ఎవడు విజ్ఞానవంతుడో, సదా యుక్తమానసుడో, అతనికి ఇంద్రియములు, సారథికి సదశ్వములవలె, లోబడియుండును. ఎవడు విజ్ఞానవంతుడో సదా సమనస్కుడో (=సమాహితచిత్తుడో) శుచియో అతడు, ఏగమ్యమును పొందిన వారి కిక జన్మము లేదో, ఆగమ్యమును పొందును. ఓ నచికేతూ, ఈ మార్గము దుర్గమము సుదీర్ఘము, సుదుస్తరము. సూక్ష్మాతిసూక్ష్మదృష్టి నధిగమించినవారే దీనిని చూడ గలరు, అర్థము చేసికొన గలరు. ఐనను నీవు భయపడకు. లెమ్ము, మేల్కొనుము, గమ్యము చేరుకొనువఱకు ఆగకు. పదనుగల కత్తియంచువలె ఈ దారి దురత్యయ మని, దుర్గ మని, కవులు చెప్పుదురు. అశబ్దము అస్పర్శము అరూపము అవ్యయము అరసము నిత్యము అగంధవంతము, అనాది, అనంతము, మహత్తుకంటె పరము, ధ్రువము నగు ఆత్మను సాక్షాత్కరించుకొన్నవాడు మృత్యుముఖమునుండి విముక్తు డగును.

ఇంతవఱకు యముడు ప్రాప్యస్వరూపమును వర్ణించెనని గుర్తించితిమి. మనకు అందునట్టి మొదటి ఆశయ మిది — లోకములో మనము గుఱి యగుచున్న జననమును మరణమును దుఃఖమును వివిధములగు పాట్లను తరించుటకు పరమార్థజ్ఞాన మొక్కటే మార్గము. ఏది పరమార్థము? ఏది నిర్వికారమో, ఏది మానవునకంతరాత్మయో, ఏది సర్వజగదంతరాత్మయో — అదే పరమార్థము. పరమార్థజ్ఞానము దురధిగమ మనియు చెప్పుదురు. తెలిసికొనుట

యనగా కేవలము బుద్ధితో అందుకొనుటకాదు; సాక్షాత్కారము పొందుటే. విముక్తి అనగా ఆత్మసాక్షాత్కారమే ఆత్మదర్శనమే అని మాటిమాటికిని చదివియున్నాము. దానిని ఈ కన్నులతో చూడలేము. అందుకు అత్యంతసూక్ష్మమైన చూపు కావలెను. ఈ గోడలను, పుస్తకములను మనము చూచుచున్న చూపు స్థూల దృష్టి. పరమార్థమును గుర్తించుటకు దృష్టి అత్యంతసూక్ష్మము కావలసియున్నది. ఇదియే ఈ జ్ఞానములోని రహస్యసర్వస్వము. యముడు చెప్పిన మ ఱొక్కటి—సాధకుడు మిక్కిలి విశుద్ధుడుగ నుండ వలెను. దృష్టి నిశితమగుట కదియే మార్గము. తరువాత అత డింకను ఇతరమార్గములుకూడ చెప్పెను. స్వాయంభువగు పరమాత్మ ఇంద్రియములకు మిక్కిలి అతీతుడు. ఇంద్రియములు వెలుపలమాత్రమే చూడ గలవు. స్వాయంభువగు పరమాత్మను 'లోపల' దర్శింపవలెను. దర్శించుటకు కావలసిన అధికారమును మీరు జ్ఞాపకముంచుకొనవలె: 'చూపును అంతర్ముఖము కావించు కొని ఆత్మసాక్షాత్కారము పొందవలె'నను కోరికయే ఆ యోగ్యత. ప్రకృతిలో మనము తిలకించు సుందరవస్తువు లన్నియు చాల మంచివే. కాని, భగవంతుని దర్శనము పొందుటకు మార్గ మది కాదు. మన చూపును అంతర్ముఖముచేయుట నేర్చుకొనవలె. బాహ్యవస్తువులను చూడవలె నను తృష్ణను అరికట్టవలె. జన సమ్మర్దము గల వీథిలో నడచునప్పుడు నీతో కూడ నడచువారు చెప్పెడి మాటలు తిన్నగా వినబడవు. వచ్చుచు, పోవుచున్న బండ్ల చప్పుడే అందుకు కారణము. శబ్ద మెక్కువగా నుండును కనుక అతడు చెప్పునదియు నీకు వినబడదు. నీ మనస్సు వెలికే పాఱుచున్నది. కాన, నీ ప్రక్కనే ఉన్న వారి మాటలే నీకు విన బడవు. అటులనే మనచుట్టు నున్న ప్రపంచము అంత గోల చేయుచు మనస్సును వెలికే ఆకర్షించుచుండును. ఇక మన మాత్మ దర్శన మెట్లు పొందగలము ? ఈబహిర్ముఖవ్యాపారమును నిరో ధింపవలె. "చూపును అంతర్ముఖము చేసికోవలె" నను మాట

కర్థ మిదియె: అప్పుడే అంతరమందున్న సర్వేశ్వరుని మహిమ గోచరించును.

ఈ ఆత్మ ఎట్టిది? అది మనబుద్ధికి సహితె మతీత మయిన దని గుర్తించితిమి. అదే యుపనిషత్తునందు ఆత్మ నిత్యమయినదని, విశ్వవ్యాప్తమయిన దని మీరు, నేను, మన మందఱము విశ్వ వ్యాప్తుల మని, ఆత్మ నిర్వికారమయిన దని—చెప్పబడినది. విశ్వ వ్యాప్తమైన ఆత్మ ఒక్కటే అయియుండ గలదు. సమానముగా విశ్వవ్యాప్తములైనవి రెం డుండ జాలవు. అ దెట్లు పొసగును? అనంతములయినవి రెం డుండుటకు సాధ్యము కాదు. కనుక పర్యవ సాన మిది—ఆత్మవస్తు వొక్కటే. మీ రేమి, నే నేమి, ఈ జగ మంతయు నేమి అనేకముగా కనిపించు ఆ యేక మే. ఒక్కడే అగు అగ్ని భువనమున ప్రవేశించి ఒక్కొక్కరూపమును బోలిన రూపము గలవా డగునటులనే, ఒక్కటే అగు సర్వభూతాంత రాత్మ ప్రతిరూపమునందును తన్ను ప్రకాశపఱచుకొనుచున్నది.'' ఇప్పు డిక్కడ ప్రశ్న యిది: ఆత్మ పరిపూర్ణము, పరిశుద్ధము అయినచో జగమున సత్తు అది యొక్కటే యయినచో, అది మలిన దేహములోనికి, దుష్టదేహములోనికి, మంచిదేహములోనికి ఇట్లు ఒక్కొక్కదానిలోనికి ప్రవేశించినప్పు డే మగును? అది పరిపూర్ణ ముగా ఎట్లుండ గలదు? ''సర్వలోకమునకు చక్షువు సూర్యుడే, కాని చాక్షుషములగు బాహ్యదోషములు సూర్యు నంటవు.'' పచ్చకామెరలుగలవానికి ప్రతివస్తువు పచ్చగా కనబడును; అతని చూపునకు కారణము సూర్యుడే. అన్నిటిని పచ్చగా కనబఱచు చున్నట్టి అతని నేత్రదోషము సూర్యు నంటదు. అటులనే సర్వ భూతాంతరాత్మ ఒక్కటే ఐనను వెలుపలి పరిశుద్ధతయు, అపరి శుద్ధతయు ఏదియు దానిని నంటజాలదు. ''సర్వమును భంగుర మయిన ప్రపంచమున నిర్వికారు నెవరు సాక్షాత్కరించుకొందురో, అచిజ్జగత్తున ఏకచేతనుని ఎవరు తెలిసికొందురో, అనేకసంభృతమగు

నీ జగమున ఏకము నెవరు కందురో, ఆఏకము తమ ఆత్మయే అని గుర్తించుకొందురో, ఆ ధీరులకే శాశ్వతశాంతి గల్గును. ఇతరులకు కాదు, ఇతరులకు కాదు. అక్కడ సూర్యుడు ప్రకాశింపడు, నక్షత్రములు గాని చందమామ గాని ప్రకాశింపవు. ఈ మెఱపుతీగెలట ప్రకాశింపవు. ఇక అట అగ్నికి ప్రకాశ మెక్కడిది? ప్రకాశించుచున్న ఆత్మ ననుసరించి సర్వము ప్రకాశించును; ఆత్మజ్యోతిచేతనే ఇ దెల్ల ప్రకాశించును, హృదయమందున్న వాంఛలన్నియు వీడి పోయినప్పుడు మర్త్యు డమృతు డగును. అతనికి బ్రహ్మప్రాప్తి ఇక్కడనే కల్గును. హృదయము లోని వక్రతలన్నియు అంతరించినప్పుడు హృదయగ్రంథు లన్నియు ప్రభిన్నములయినప్పుడు మాత్రమే మానవు డమృతు డగును. ఇదియే అనుశాసనము. ఇది మనలను కాపాడునుగాక ; మనలను పోషించునుగాక; ఇది మనకు వీర్య మిచ్చును గాక. ఇదే మనలో వీర్యమగునుగాక. మనలో మనము ద్వేషించుకొనకుందుము గాక; అందఱకు శాంతి కలుగు గాక!''

వేదాంతశాస్త్రమున మీరు గాంచు భావనాక్రమ మిది : ప్రపంచములో వెతెచ్చుట కాని మనము కను ఆశయముకంటె పూర్తిగా భిన్నమైన ఆశయ మిం దున్నదని మనము మొదట గుర్తింతుము. వేదములలోని ప్రాచీనతమభాగములలోని యన్వేషణ యితరగ్రంథములలోని యన్వేషణవంటిదే. అది బాహ్యప్రపంచమునం దన్వేషణ. బహు ప్రాచీనగ్రంథములు కొన్నిటిలో ఈ ప్రశ్నను లేపినారు. ''ఆదిలో ఉండిన దేది?'' ''సత్తుగాని, అసత్తుగాని లేనప్పుడు, తమస్సు తమసావృత మయినప్పుడు దీని నంతను సృజించిన దెవరు?'' అట్లు అన్వేషణ ప్రారంభమయినది. వేల్పులనుగూర్చి దేవయోనులనుగూర్చి ఇంకను దేనిని దేనినో గుఱించి వారు ప్రసంగింప నారంభించిరి. అనంతరము ఆసపాటు లే దని వారు ఆ అన్వేషణమును మానుకొని రనుట స్పష్టము.

ఆకాలమున వారు బాహ్యప్రపంచములో అన్వేషణ చేసిరి. వారి కేమియు అంతు చిక్క లేదు; తరువాత వారు స్వయంభువగు ఏకేశ్వరుని కొఱ కన్వేషణమును 'లోపల' సాగింపవలసివచ్చె నని వేదములవలన దెలియుచున్నది. తారామండలములో, గ్రహము లలో ఛాయాపథములో, బాహ్యజగత్తంతటిలో మన మెంతగా అన్వేషించినను ఫలితము శూన్యము. ఈయన్వేషణవలన మన జననమరణ సమస్య యేనాటికిని పరిష్కారము కాదు. ఇదియే వేదములలో మూలభూతమైన ఆశయము. మనలోపల నున్న అద్భుతయంత్రనిర్మాణమును సంశోధింపవలసివచ్చినది. ఆసంశోధన సృష్టిరహస్యమును బట్టబయలుచేసినది; నక్షత్రములవలన గాని, సూర్యునివలన గాని ఆమర్మము తెలియలేదు. మానవుని తెఱచి లోని యంగవిన్యాసమును పరిశోధింపవలసి వచ్చెను; మానవ దేహమును కాదు మానవాత్మను. ఆత్మయందు వారికి సమాధానము అగపడినది. వారు కనుగొన్న సమాధాన మేమి? దేహమునకు మఱుగున, మనస్సునకు సైతము మఱుగున స్వయంభువగు ఏకేశ్వరుడు కలడు. ఆపరమాత్మకు జననములేదు, మరణము లేదు. స్వయంభువగు నతడు సర్వవ్యాపికూడ. ఏలయన అతనికి రూపము లేదు. రూపరహితమయినది, స్థలకాలములచేత పరిచ్ఛిన్నముకానిది ఒక్కచోటనే ఉండజాలదు, ఎట్లుండగలదు? అది సర్వత్ర ఉండును, సర్వవ్యాపి, మన అందఱియందును సమానముగా నున్నది.

మానవుని ఆత్మ యనగా నేమి? దేవు డొకడు కల డని, దేవునితోపాటు అనంతసంఖ్యాకము లగు ఆత్మలు కూడ కల వని, తత్త్వమునందు, రూపమునందు, ప్రతివిషయమునందు ఈయాత్మలు శాశ్వతముగా దేవునికంటె భిన్నములయిన వని ప్రతిపాదించు మత మొకటి కలదు. ఇది ద్వైతము. ఈ యాశయము చాల ప్రాతది, ముతకది. మఱొక పక్షము ప్రకారము—ఈ దేహము

స్వయంసంపూర్ణమగు నొక ప్రపంచము. దీనిలో మనస్సు కలదు. దానివెనుక వ్యష్ట్యాత్మ ఉన్నది. అటులనే విశ్వమంతయు నొక దేహము. ఆదేహములో విశ్వమనస్సు, దానివెనుక విశ్వాత్మ గలవు. ఈ దేహము విశ్వదేహములో భాగ మయినట్టే, ఈ మనస్సు విశ్వమనస్సులో భాగము. ఈయాత్మ విశ్వాత్మలో అంశ. అనంతవిశ్వాత్మలో జీవాత్మ లన్నియు అంశములు. ఈ మతము నకు విశిష్టాద్వైత మని పేరు. విశ్వాత్మ యనంత మయిన దని మనకు దెలియును. అనంతమునందు భాగము లెట్లుండ గలవు? అ దెట్లు విభజింపబడగలదు? ఎట్లు ముక్కలు కాగలదు? అనంతమునందు నే నొక కణము నని చెప్పుట ముచ్చటయిన కవిత్వమే కావచ్చును. కాని, వివేచనచేయు బుద్ధికి అది అసంగతము, అనంతమును విభజించుట యను మాట కర్థ మేమి? నీవు భాగములుగ చీలదీయగల్గుట కది భౌతికపదార్థమా? అనంతమయినది ఎన్నటికిని విభాజ్యము కాదు. విభజించుట సాధ్య మగు నేని అది యనంతమే కాదు. మఱి పర్యవసాన మేమి? ఇది జవాబు — విశ్వాత్మ నీవే. నీవు అఖండాత్మస్వరూపుడవే కాని తదంశమాత్రుడవు కావు. నీవు దేవుని పరిపూర్ణస్వరూపమే. అగుచో, ఈ నానాత్వ మంతయు నేమి? లక్షలకొలది వ్యష్ట్యాత్మలను మనము చూచుచున్నాము. అ వన్నియు నేమి? సూర్యుడు లక్షలకొలది నీటిబిందువులలో ప్రతిఫలింపగా; ప్రతిబిందువునందును సూర్యుని ఆకృతి, సంపూర్ణరూపము గలదు; కాని అవి ప్రతిబింబములు మాత్రమే నిజమగు సూర్యు డొక్కడే. అటులనే మనలోని ప్రతియొక్కరియందును గల ఆత్మ దేవుని ప్రతిబింబముమాత్రమే. అంతకంటె మఱేమియు గాదు. వెనుకనున్న సత్యస్వరూపము అద్వితీయ బ్రహ్మమే. మన కందఱికినిగల ఐక్యము అందులోనే. ఆత్మగా ఈ జగత్తులో నున్నది ఒక్కటే. అది నాయందున్నది, నీయం దున్నది. అ దొక్కటియే; ఆ ఒక్క ఆత్మయే యీ వివిధ దేహాలలో వివిధాత్మలుగా ప్రతిఫలించుచున్నది. కాని, మన కీ

విషయము దెలియదు; మనము పరస్పరము వే అని భావింతుము. పరమాత్మనుండి కూడ మనము వే అని భావింతుము. ఈ విధముగా మనము భావించునంతకాలము లోకములో దుఃఖ ముండక తప్పదు. ఇది వట్టి భ్రమ.

దుఃఖమునకు మఱియొక కారణము, పెద్ద కారణము భయము. ఒకడు మఱొకని కేల కీడు చేయును? తనకు కావలసినంత సౌఖ్య ముండ దనెడి భయమువలననే కదా. ఒకడు ధనము తనకు చాలకపోవు నేమో అని భయపడును. ఆ భయమే అతనినింకొకని హింసించునట్లును దోచుకొనునట్లును చేయును. ఉన్న దెల్ల ఒక్కరే అయినచో భయమున కవకాశమేది? నాపై పిడుగు పడినచో, ఆపిడుగును నేనే, ఏల యన, ఉన్న దొక్క వస్తువే గదా! ప్లేగువ్యాధి వచ్చినచో ప్లేగువ్యాధి నేనే; బెబ్బులి వచ్చినచో అదియు నేనే. మృత్యువే సమీపించినను అది నేనే గదా. జీవితమును, మృత్యువును ఉభయమును నేనే. విశ్వములో ఇద్దఱున్నా రనుకొనుటవలననే భయము కలుగుచున్న దని తెలిసికొంటిమి. ''పరస్పరము ప్రేమించుకొనుడు.'' అన్న ప్రవచనమును మనము సదా వినుచున్నాము. ఎందుకొఱకు? ఆసిద్ధాంతము బోధింపబడినది. దాని భావవివరణ మిందు గలదు. నేను ప్రతినరుని ఏల ప్రేమింపవలె? ఏల యన వారును నేనును ఒక్కరమే. నేను నాసోదరు నేల ప్రేమింప వలె? అతడును నేనును ఒక్కరమే కనుక. ఈ ఏకత్వము, ఈ విశ్వైక్యము ఉన్నది. మన పాదముల క్రింద ప్రాకు అల్పిష్ఠకీటము మొదలు, వెలసిన మహోన్నత జీవుల వఱకు—అందఱకు దేహములు వేర్వేఱుగానున్నవి; కాని, అందఱు నొక్క ఆత్మయే. అన్ని నోళ్లతోను నీవు భుజింతువు; అన్ని చేతులతోను నీవు పనిచేయుదువు; అన్ని కన్నులతోను నీవు చూతువు. లక్షలకొలది దేహములలోని ఆరోగ్యమును నీ వనుభవింతువు. లక్షలకొలది దేహములలోని వ్యాధితో నీవు బాధపడుదువు. ఈ ఆశయము పుట్టినప్పుడు, అది మనకు ప్రత్యక్షమై

నప్పుడు, అనుభూతమైనప్పుడు దుఃఖము అంతరించును. దానితో భయమును అంతరించును. నే నెట్లు మరణింపగలను? నాకు పై దొక్కటియు లేదు. భయ మంతరించును. అప్పుడే సంపూర్ణ సౌఖ్యము, సంపూర్ణప్రేమ సాధ్య మగును. ఆవిశ్వసానుభూతి, విశ్వప్రేమ, ఏనాటికిని మాఱని విశ్వానందము మానవుని సర్వాతీతుని చేయును. దానికి ప్రతిఘాతము లుండవు. దుఃఖము దానిని నంటజాలదు. కాని, ఐహికములైన ఈ అల్పాన్నపానములకు ప్రతిఘాతములు సదా ఉండును. దీనికి కారణము ఈద్వైతబుద్ధియే; నేను ప్రపంచమునకు, భగవంతునికి భిన్నుడ ననుభావమే. "నే నతడే, నేను విశ్వాత్మను. నేను శాశ్వతానందస్వరూపుడను. నిత్యముక్తుడను." అన్న సత్యమును అందుకొన్న తత్క్షణమే నిజమగు ప్రేమ ఉదయించును; భయము పలాయన మగును; దుఃఖ మంతరించును.



# యాజ్ఞవల్క్యుడు, మైత్రేయి

"మబ్బు ముసరుకొన్న దినము కాదు దుర్దినము, హరి సల్లాపకథాపీయూషవర్జితమగు దినమే దుర్దిన మని తలంతుము." అని మన మందుము. యాజ్ఞవల్క్యు డొక గొప్ప ఋషి. ప్రతి మానవుడు వార్ధక్యములో సన్న్యసింపవలె నని భారతదేశములోని శాస్త్రములు విధించును కదా. యాజ్ఞవల్క్యుడు తన ధర్మ పత్నితో ఇట్లనెను : "ప్రేయసీ, ఇదిగో నా సర్వధనము ; నా ఆస్తి అంతయు. నే నిక వెడలిపోవుచున్నాను." అందు కామె యిట్లనెను: "ఆర్యా, సంపదలు నిండిన ఈపృథివియంతయు నా దైనప్పటికిని, అందుచే నా కమృతత్వము సిద్ధించునా ?" యాజ్ఞ వల్క్యుడు, "సిద్ధింపదు. నీవు సంపన్నురాల వగుదువు. అంతే, ధనము అమృతత్వము నీయ జాలదు." అని చెప్పెను. "అయి నచో దేనిచే నా కమృతత్వము గల్గునో దానిని పొందుట కేమి చేయవలె ? మీకు తెలిసినచో చెప్పుడు." అని యామె కోరెను. అంతట యాజ్ఞవల్క్యు డిట్లు చెప్పెను : "నీవు సర్వదా నాకు ప్రియురాలవే. ఇప్పు డీ ప్రశ్నతో నాకు మఱింతగా ప్రియు రాల వయితివి. రమ్ము. కూర్చుండుము. నేను చెప్పెదను. విన్న తరువాత ఆవిషయమును నిదిధ్యాసనము చేయవలెను", అత డిట్లు చెప్పెను : "పెనిమిటిమీది కామమునకై కాదు, పెనిమిటి ప్రియు డగుట. ఆత్మయందలి కామమునకే యే : ప్రియు డగు చున్నాడు. ఎవరికి గాని భార్యమీది కామముచేత కాదు భార్య ప్రియ యగుట, ఆత్మయందలి కామముచేతనే భార్య ప్రియ యగు చున్నది. ఎవరికి గాని బిడ్డలమీది కామముకై కాదు బిడ్డలు ప్రియు లగుట, ఆత్మయందలి కామముకైయే బిడ్డలు ప్రియు లగు చున్నారు. ఎవరికిగాని విత్తముమీది కామముకై కాదు విత్తము ప్రియ మగుట, ఆత్మయందలి కామముకైయే విత్తము

ప్రియ మగుచున్నది. ఎవరికిగాని బ్రాహ్మణునందలి కామముకై కాదు బ్రాహ్మణుడు ప్రియు డగుట. ఆత్మయందలి కామముకై యే బ్రాహ్మణుడు ప్రియు డగుచున్నాడు. ఎవరికిగాని క్షత్రియునందలి కామముకై కాదు క్షత్రియుడు ప్రియు డగుట, ఆత్మయందలి కామముకై యే క్షత్రియుడు ప్రియు డగుచున్నాడు. ఎవరికిగాని లోకములమీాది కామముకె కాదు లోకములు ప్రియము లగుట, ఆత్మయందలి కామముకై యే లోకములు ప్రియము లగుచున్నవి. ఎవరికిగాని దేవతలమీాది కామముకె కాదు దేవతలు ప్రియులగుట. ఆత్మయందలి కామముకై దేవతలు ప్రియు లగుచున్నారు. ఎవరికిగాని భూతములమీాది కామముకై కాదు భూతములు ప్రియము లగుట, ఆత్మయందలి కామముకై భూతములు ప్రియము లగుచున్నవి. ఎవరికిగాని ఏది గాని దానిమీాది కామముకై కాదు అది ప్రియ మగుట, ఆత్మయందలి కామముకై అది ప్రియ మగుచున్నది. కావున ఆత్మ ద్రష్టవ్యము, శ్రోతవ్యము, మంతవ్యము, నిదిధ్యాసితవ్యము. ఆత్మదర్శన – ఆత్మ శ్రవణ – ఆత్మ మనన – ఆత్మ విజ్ఞానములచే ఈ సర్వమును విదిత మగును.'' అప్పుడు మనకు లభించున దేమి? మన యెదుట నున్న ఇది యొక వింత తత్త్వవాదము. సర్వప్రేమయు నికృష్టతమమయిన స్వార్థపరత్వముగా చెప్పబడినది: నేను నాకు ప్రియుడను కనుక ఇతరులును నాకు ప్రియు లట! ఇది యసంగతము. లోకములోగల యేకైకప్రేరకశక్తి ఆత్మయే యని చెప్పిన తత్త్వవేత్తలు ఆధునికకాలమున గలరు. అది నిజమే గాని, అది తప్పుకూడ. మఱి ఈ యాత్మ దీని వెనుక నున్న యథార్థమగు ఆత్మకు ప్రతిబింబమే. ఇది చిన్నదిగా నున్నందున తప్పుగాను, పాపముగాను కనబడుచున్నది. ఆత్మయే జగము. ఆత్మయందలి అనంతప్రేమ స్వల్పభాగముగుండ కనబడుచున్నందున చెడ్డదిగాను, అల్పమయినదిగాను తోచుచున్నది. భార్య భర్తను ప్రేమించునప్పుడుకూడ, ఆమెకు తెలిసినను తెలియకపోయినను,

ఆత్మకొఱకే భర్తను ప్రేమించుచున్నది. లోకములో వ్యక్తమగు చున్నతీరును బట్టి అది స్వార్థపరత్వమే. నిజమునకు ఈ స్వార్థ పరత్వము ఆ ఆత్మతత్త్వమునం దొక చిన్నభాగమే; ఎవ్వ డెవరు దేనిని ప్రేమించినను ఆప్రేమకు ఆధారమును ద్వారమును ఆత్మయే. ఈ యాత్మను తెలిసికొనవలె. ఉన్న భేద మేమి? ఎవ రాత్మను తెలిసికొనక ప్రేమింతురో, వారి ప్రేమ స్వార్థ పరత్వమే. ఆత్మతత్త్వము నెవరు తెలిసికొని ప్రేమింతురో వారి ప్రేమ నిరుపాధికము; వారు ఋషులు. "బ్రాహ్మణుని ఆత్మగా కాక తదితరముగా భావించువానిని బ్రాహ్మణుడు విసర్జించును. క్షత్రియుని ఆత్మగా కాక తదితరముగా భావించువానిని క్షత్రి యుడు విసర్జించును. లోకములను ఆత్మగా కాక తదితరముగా భావించువానిని లోకములు విసర్జించును. దేవతలని ఆత్మగా కాక తదితరముగా భావించువానిని దేవతలు విసర్జింతురు. భూతతతిని ఆత్మగా కాక తదితరముగా భావించువానిని భూతములు విసర్జిం చును. సర్వమును ఆత్మగా కాక తదితరముగా భావించు వానిని సర్వము విసర్జించును. ఈ బ్రాహ్మణులు, ఈ క్షత్రియులు, ఈ లోకములు, ఈ దేవతలు, (ఈ భూతములు) ఈ సర్వమును ఆత్మయే." 'ప్రేమ' అనుటకు తా ననుకొన్న అర్థము నత డిట్లు వివరించెను.

ఒకవస్తువును మనము విశేషించి నప్పు డెల్ల దానిని ఆత్మ నుండి ప్రత్యేకించుచున్నాము. నే నొక స్త్రీని ప్రేమింపజూచు చున్నాను; నే నా స్త్రీనిప్రత్యేకింపగానే ఆమె ఆత్మనుండి వే ఱగును. ఆమెయందు నా ప్రేమ నిత్యము కా జాలదు. అది దుఃఖాంతము కాగలదు. నే నా స్త్రీని ఆత్మగనే దర్శింతునేని వెంటనే ఆ ప్రేమ నిర్దుష్ట మగును, దాని కెప్పుడును విఘాతము కలుగదు. అటులనే ప్రతివిషయమును; ఏవస్తువునైనను విశ్వ మంతటినుండి - ఆత్మనుండి - పృథక్కరించి ఆ వస్తువునందు

ఆసక్తుడ వగుదు వేని ఆ ప్రేమకు ప్రతిఘాతము కల్గును. ఆత్మకు వెలిగా మనము దేనిని ప్రేమించినను దానిఫలితములు దుఃఖమును, దైన్యమునే. అన్నిటిని ఆత్మగను ఆత్మస్థముగను ప్రేమించినచో ఎట్టి ఆపదగాని, ప్రతిఘాతముగాని కలుగ జాలదు. ఇది పరిపూర్ణానందము. ఈలక్ష్యమును సాధించు టెట్లు? ఈ లక్ష్యము నందుకొనుట కనుసార్యమైన మార్గమును యాజ్ఞవల్క్యుడు మనకు వివరించుచుబోవును. ఆత్మజ్ఞానము లేకున్నప్పుడు మనము ప్రతి వస్తువును ఆత్మగా భావించు టెట్లు? "వాయింపబడుచున్న దుందుభినుండి వెల్వడు శబ్దములను గ్రహింప శక్యము కాదు, దుందుభినేని దుందుభ్యాఘాతమునేని గ్రహించినచో, శబ్దము గృహీత మగును. ఊదబడుచున్న శంఖమునుండి వెలువడు శబ్దమును గ్రహింప శక్యము కాదు, శంఖమునేని శంఖధ్మమునేని గ్రహించినచో శబ్దము గృహీత మగును. వాయింపబడుచున్న వీణియనుండి వెలువడు శబ్దమును గ్రహింప శక్యము కాదు. వీణియనో వీణావాదనమునో గ్రహించినచో, శబ్దము గృహీతమగును. పృథగ్ధూమములును (విస్ఫులింగములును) తడి కట్టెయల నిప్పునుండి వెలువడునవైనట్లు వేదజాలము ఆ మహాభూతపు నిశ్వసితమే, అన్నియు అతని నిశ్వసితములే. సకల వేదజాలము నతని ఊర్పునుండివెలువడినట్లు వెలువడినవే. నీళ్ల కన్నిటికిని సముద్రమే ఏకాయన మైనట్లు, సర్వస్పర్శలకును చర్మమే ఏకాయన మైనట్లు, సర్వగంధములకును నాసికయే ఏకాయన మైనట్లు, సర్వరసములకును జిహ్వయే ఏకాయన మైనట్లు, సర్వరూపములకును చక్షువే ఏకాయన మైనట్లు, సర్వశబ్దములకును శ్రోత్రమే ఏకాయన మైనట్లు, (సర్వతర్కములకును మనస్సే ఏకాయన మైనట్లు,) సర్వవిద్యలకును హృదయమే ఏకాయన మైనట్లు, సర్వకర్మలకును హస్తములే ఏకాయన మైనట్లు సర్వమునకును అతడే ఏకాయనము. నీటవేసిన ఉప్పుపలుకు నీట కరగిపోవును. కరగిపోయిన ఉప్పును వెనుకకు తీసికొనలేము కదా. అట్లే ఓ మైత్రేయీ, ఈ

మహాభూతము అనంతము అపారము విజ్ఞానఘనము. జగ మతని నుండి జనించి అతనిలోనే లీన మగును. అటు తరువాత తెలిసి కొనుట లేదు, చనిపోవుట లేదు, మృత్యువు లేదు.'' పరముని నుండి విస్ఫులింగముల వలె మనము వెలువడితి మనియు పరముని నీ వెతిగినప్పుడు మగిడి నీ వతనిలో ఐక్యమొందుదు వనియు అభి ప్రాయ మిందుచే స్ఫురించుచున్నది. మనము ఆజగదంతరాత్మయే.

సర్వత్ర అందఱును భయపడు నటులనే మైత్రేయికూడ భయభ్రాంత అయినది. ఆమె యిట్లన్నది: ''ఆర్యా, మీరు నన్నిక్కడ భ్రమలో పడవేసితిరి. దేవత లెవ్వరు నుండ రని, వ్యక్తిత్వమంతయు నశించిపోవు నని చెప్పి, నాకు భయముకలిగించి తిరి. గుర్తించుట కెవ్వరును ఉండరే; ప్రేమించుట కెవ్వరు నుండరే, ద్వేషించుటకు ఎవ్వరు నుండరే, మన మే మగుదుము ?'' యాజ్ఞ వల్క్యు డిట్లు బదులుచెప్పెను. ''మైత్రేయీ, నేను నిన్ను కల వరపెట్టుట నా యుద్దేశ్యము కాదు. పోనీ, ఆ విషయ మట్లుండ నిమ్ము. నీకు భయము గల్గవచ్చును. ద్వైత మున్నచోట ఒక డొకనిని చూచును, ఒక డొకనిని వినును. ఒక డొకనికి స్వాగతము పల్కును. ఒక డొకనిని తలంచును. ఒక డొకని నెఱుంగును. కాని, సర్వము ఆత్మయే అయినప్పుడు ఎవడెవనిని చూచును ? ఎవ డెవనిని వినును ? ఎవ డెవనికి స్వాగతము పల్కును ? ఎవ డెవని నెఱుగును.'' ఈ భావము నొక్కదానిని స్కోపెన్హోరు గ్రహించి తన తత్త్వవాదమున మాఱు ప్రయోగించెను. ఈ సర్వము నెఱుగుట కెవడు సాధనమో వాని నెఱుగు టెట్లు ? విజ్ఞాతను, ప్రియా, తెలిసికొను టెట్లు? ఏసాధనమున మనము జ్ఞాతను తెలిసి కొన గలము ? అ దెట్లు సాధ్యము కాగలదు ? ఎందుచేత ననగా, పరమునియందే పరమునిగుండనే మనము సర్వము తెలిసికొను చున్నాము. ఏసాధనమున మన మతనిని తెలిసికొందుము ? ఏ సాధనమును లేదు. ఏల యన అతడే సాధనము.

ఉన్న దంతయు నఖండ మగు ఒక్కయనంతవస్తువే అన్న విషయ మింతవఱకు స్పష్ట మయినది. ఎందు మఱి విభజన ముండదో, భాగాలు లేవో, అదియే నిజమగు వ్యక్తిత్వము. ఈ యల్పభావము లన్నియు చాల నీచములు, భ్రాంతిజన్యములు. అయినను ప్రతివ్యక్తిత్వపుకణమునందును, ప్రతివ్యక్తిత్వపువిస్ఫులింగముద్వారమునను ఆ యనంతవస్తువే ప్రకాశించుచున్నది. ప్రతివస్తువును ఆత్మదాల్చిన రూపమే. దానిని పొందు టెట్లు? యాజ్ఞవల్క్యుడు ప్రవచించినట్లు మీరును మొదట ప్రతిపాదన చేయుడు : "ఈ యాత్మ శ్రోతవ్యము" అని యతడు చెప్పెను. తరువాత అతడు దానినిగుఱించి తర్కించెను. దేనిమూలమున మనకు సమస్తజ్ఞానము కలుగుచున్నదో దాని నెట్లు సాక్షాత్కరింపజేసికొనవలె ననునది అతడు కడపట ప్రదర్శించినది. అటుపిమ్మట కడపట దానిని గూర్చి నిదిధ్యాసన మొనర్పవలె. పిండాండమునకును బ్రహ్మాండమునకును గల అంతరమును ప్రస్తావించి ఆ రెంటి గతులు ఎట్లు ప్రత్యేకమార్గములలో సాగుచున్నవో, అ దంతయు నెంత సుందరముగా నున్నదో అతడు వివరించును. "ఈ పృథివి సర్వభూతములకును మధువు. ఈ పృథివికి సర్వభూతములును మధువు. ఈ సర్వమును తేజోమయము ఆనందమయము నగు నాత్మకు మూర్తిభావములే." సమస్తానందము, మిక్కిలి జఘన్యమగు ఆనందముసైతము పరమాత్ముని ప్రతిఫలనమే. ఏదేది మేలైనదో అ దెల్ల అతని ప్రతిఫలనమే. ప్రతిబింబము అస్పష్టముగ నున్నప్పుడు దానిని కీడు అందుము. ఇరువురు దేవులు లేరు. అతని వ్యక్తీభావము మందముగా నున్నప్పుడు దానిని అంధకారమని, పాపమని అందుము; వ్యక్తీభావము అధిక మయినప్పుడు దానిని వెలుగు అందుము. అంతే. మంచి చెడ్డలు తరతమభేదములె : ఎక్కువగా వ్యక్తమగుట, తక్కువగా వ్యక్తమగుట. మన జీవితములనే ఉదాహరణములుగా తీసికొనుడు. నిజముగా మంచివి కానివియు మనశైశవములో మనము

'మంచివి' అనుకొన్నవియు నగు విషయము లెన్ని లేవు? పైకి చెడ్డవిగా కనిపించు మంచివిషయము లెన్ని లేవు! అభిప్రాయము లెట్లు మాఱిపోవుచున్నవి! అభిప్రాయ మెట్లు మెట్లెక్కి పోవు చున్నది! ఒకప్పు డెంతో మంచి దని మనము భావించినదాని నిప్పు డంత మంచిదిగా మనము భావించుట లేదు. కనుక మంచి చెడ్డ లనునవి కేవల మంధవిశ్వాసములే. అవి నిజముగ లేవు. ఉన్నది తరతమభేదమే. అదంతయు ఆత్మకు మఱుగే, ప్రతివస్తువు లోను ఆత్మ మఱుగుపడి యున్నది; మఱుగు మిక్కిలి దట్టముగా నున్నప్పుడు మనము దానిని పాప మనుచున్నాము; అది చాల పలుచగా నున్నప్పుడు దానిని పుణ్య మనుచున్నాము. మఱుగు పూర్తిగా తొలగినప్పుడు అది సర్వోత్కృష్టము. కనుక సృష్టిలోని ప్రతివస్తువును ఆయాశయముతోనే ధ్యానము చేయవలె. అది సర్వోత్కృష్టమగుటచేత సంపూర్ణముగా మంచిదని భావించుట శక్యమే. మంచి యున్నది; చెడుగును ఉన్నది ; వాని శిఖరమును హృదయమును పరతత్త్వమే. పరమునిలో పుణ్యమును లేదు, పాప మును లేదు; సర్వోత్కర్ష ఉన్నది. సర్వోత్కృష్టమయినది. ఏకైకముగ నుండునది పొసగును. మంచి వనేకము లుండవచ్చు. చెడ్డవియు ననేకము లుండ వచ్చు. మంచి వానికిని చెడ్డ వానికిని నడుమ భేదపుటంతరువు లుండును. కాని, సర్వోత్కృష్ట మయిన దొక్కటే. పలుచనిమఱుగుల గుండ చూచునప్పుడు ఆసర్వో త్కృష్టమైనదానికి మనము రకరకాల మంచివాని పేళ్లు పెట్టు దుము. దళసరి మఱుగుగుండ చూచినప్పుడు దానినే చెడు గందుము. మంచిచెడ్డలు అంధవిశ్వాసపు విభిన్నరూపములు. అవి అన్నివిధాల ద్వైత భ్రాంతులకును అన్నివిధాల ఆశయములకును పాల్పడినవి. ఆమాటలు మానవహృదయములో నాటుకొని భయం కర క్రూరప్రభువులవలె అవి స్త్రీలను, పురుషులను గడగడ లాడించుచున్నవి. అవి మనలను బెబ్బులులనుగా మార్చివేయు చున్నవి. మన మితరుల నెంతబలముగా ద్వేషించుచున్నామో ఆ

ద్వేషమున కంతకు కారణము చిన్ననాటనుండి మనము మనలోని కెక్కించుకొన్న మంచిచెడుగు లనెడి భావములె. మానవుల గుణ దోషములను గూర్చిన మన నిర్ణయము పూర్తిగ అయథార్థ మగును. సుందరముగా నున్న పృథివిని నరకముగా మనము చేసి పెట్టుచున్నాము. మంచిచెడ్డలు రెంటిని మన మేనాడు విడిచిపెట్టు దుమో అప్పుడు పృథివి స్వర్గ మగును.

"ఈపృథివి సకలజీవులకు మధువు. సకలజీవులు ఈపృథివికి మధువు; అవి పరస్పరము సాయము చేసికొనును. సకల మాధు ర్యము పృథివి కంతర్యామిగ నున్న అమృతమయ జ్యోతిర్మయ, మగు ఆత్మదే. ఎవరి దీ మాధుర్యము? అతడు కాక మఱొక మాధుర్య మెట్లుండ గలదు? ఆ మాధుర్య మొక్కటే నానావిధ ముల తన్ను వ్యక్తముచేసికొనుచున్నది. ప్రేమయు మాధుర్య మును ఏమానవునిలోగాని — వాడు యోగి కాని పాపి కాని, వేల్పు గాని, హంతకుడు కాని—ఉన్నచో, దేహమందో మనసు నందో, ఇంద్రియములందో ప్రేమయు మాధుర్యము నుండునేని ఆప్రేమమాధుర్యములు అతడే. శారీరభోగము లతడు. మానసిక భోగము లాతడే. ఆధ్యాత్మికానుభవము లాతడే. ఆతడు కాక మఱొక టేమి యుండగలదు? ఇరువదివేల దేవతలు, దయ్యములు పరస్పరము కొట్లాడుకొనుచు నుండుట ఎట్లు పొసగును? శిశూచిత స్వప్నములు! జఘన్యమైన శారీరసౌఖ్య మతడే. పరమోత్కృష్ట మయిన ఆత్మానంద మతడే. ఆతడుకాని మాధుర్యమే లేదు. యాజ్ఞవల్క్యుడు చెప్పిన దిదియే. నీ వాస్థితికి వచ్చి సర్వవిషయ ములను సమదృష్టితో చూచినప్పుడు, త్రాగుబోతు మద్యపాన మునం దనుభవించు మాధుర్యములో సైతము ఆమాధుర్యమునే నీవు గుర్తింపగలిగినప్పుడు, సత్యమును అధిగమించినట్లే. అప్పుడే నీకు సౌఖ్యమననేమో, శాంతియననేమో, ప్రేమ అన నేమో తెలియ గలదు; ఎంతకాలము నీవీ నిరర్థకములగు భేదములను,

పసితనపు, పనికిమాలిన, మూఢభావములను మన్నింతువో, అంత వఱకు నానావిధదుఃఖములు సంప్రాప్తించుచుండును. కాని, అమృతమయుడును తేజోమయుడు నగు పురుషుడు పృథివిలోపల నున్నాడు. మాధుర్యమంతయు నతని మాధుర్యమే. ఆ మాధుర్యమే దేహమునం దున్నది. ఈ దేహమే పృథివి. దేహశక్తులన్నిటిలో, దేహానుభవములన్నిటిలో అత డున్నాడు; కన్నులు చూచును; చర్మము స్పర్శ నెఱుగును. ఈయనుభవము లన్నియు నేమి; దేహములోని జ్యోతిర్మయపురుషుడే ఆత్మ. సకలభూతములకు మధురముగా నున్న యీ పృథివియు, పృథివికి మధురముగా నున్న ప్రతిజీవియు ఆ తేజోమయపురుషుడే; అమృతమయుడే ఆ ప్రపంచములోని యానందము. మనలోగూడ అతడే యానందము. అతడే బ్రహ్మము. "ఈవాయువు సకల జీవులకు మధురము, సకలజీవులు ఈవాయువుకు మధురము. కాని, ఈ వాయువులోగల అమృతమయ తేజోమయ పురుషుడు — ఈ దేహములోగూడ నున్నాడు. అతడు సకలజీవుల ప్రాణరూపమున తన్ను వ్యక్తమొనర్చుకొనుచున్నాడు. ఈ సూర్యుడు అఖిలప్రాణులకు మధువు. అఖిలప్రాణులును ఈ సూర్యునకు మధువు. సూర్యునియం దున్న జ్యోతిర్మయపురుషుడే మనలో కొంచెపాటిగా ప్రతిఫలించుచున్నాడు. అతని ప్రతిబింబముకాని దేది యుండగలదు? అతడు మన దేహమం దున్నాడు. అతని ప్రతిబింబమే మనలను వెలుగును చూచునట్లు చేయుచున్నది. ఈ చంద్రు డన్ని ప్రాణులకుమధువు. సర్వప్రాణులు ఈ చంద్రునకు మధువు. కాని చంద్రునిలోని ఆత్మగానున్న ఆ అమృతమయ తేజోమయ పురుషుడే మనలో మనస్సుగా ప్రకాశించుచున్నాడు. ఈమెఱుపు మిక్కిలి అందముగా నున్నది. ప్రతిప్రాణి మెఱుపునకు మధురము. అమృతమయ తేజోమయపురుషుడే మెఱుపునందలి యాత్మ. మనలో నున్నదియు ఆ యాత్మే. ఏలయన సర్వమును బ్రహ్మమే. ఆత్మయే నిఖిలప్రాణులకు నియంత." ఈ ఆశయములును మానవకోటికి

మిక్కిలి ఉపకారకములు. ఇవి ధ్యానింపదగినవి. ఉదాహరణకు : పృథ్విని ధ్యానింపుడు; పృథివిని తలంపుడు. పృథ్వి కేది ఆత్మయో అదే మనకును ఆత్మ అని, రెండును ఒక్కటే అని, తెలిసికొనుడు. దేహము, పృథివి ఒక్కటే అని భావింపుడు. దాని యాత్మ, మీ యాత్మ ఒక్కటే అని గ్రహింపుడు. వాయువును దానియందున్న ఆత్మ నాయందున్న ఆత్మ ఒక్కటే అని భావింపుడు. అవన్నియు నొక్కటే; వివిధరూపముల వ్యక్తమైనవి. ఈ యేకత్వమును సాక్షాత్కరింపజేసికొనుటే ధ్యానమునకు లక్ష్యము, ప్రాప్యము. యాజ్ఞవల్క్యుడు మైత్రేయికి తెలియచెప్పుటకు ప్రయత్నించిన విషయ మిదియే.



# ఆత్మ, ప్రకృతి, దేవుడు

వేదాంతశాస్త్రముప్రకారము మానవుని రూపొందించు వస్తువులు మూడున్నవి. ఈ మూటిలో అన్నిటికంటె వెలుపల నున్నది దేహము, మానవుని స్థూలరూపము. అందు కన్నులు, ముక్కు, చెవులు మున్నగు ఇంద్రియోపకరణము లున్నవి. ఈ కన్ను చూపునకు ప్రభవము కాదు; ఇది యుపకరణము మాత్రమే. దీనివెనుక ఇంద్రియమున్నది. అట్లే చెవులు శ్రవణేంద్రియములు కావు. అవి ఉపకరణములు మాత్రమే. వాని వెనుక నింద్రియ మున్నది. ఆధునికశారీరశాస్త్రమున కేంద్ర మని దానిని వ్యవహరింతురు. ఈ "ఇంద్రియములు" అనునది సంస్కృతపదము. కన్నులను శాసించు కేంద్రము పాడయిపోయిన యెడల కన్నులు చూడ లేవు; తక్కిన యింద్రియముల విషయము కూడ ఇంతే. ఇంద్రియములుకూడ తమంతట దేనినిగాని గ్రహింప జాలవు. వానితో మఱొకటి చేర వలె. ఆ మఱొకటి మనస్సే. అనేకపర్యాయములు, మీ రేదో విషయము తీవ్రముగా ఆలోచించుచుండగా గడియారము గంటకొట్టియుండును. కాని, మీరు విని యుండరు. ఎందుచేత? చెవి అక్కడే ఉన్నది. ధ్వనితరంగములు దానిలో ప్రవేశించినవి. మెదడుకు గొనిపోబడినవి. అయినను మీరు విన లేదు. ఎందుచేత? ఇంద్రియమునకు మనస్సు అనుసంధింపబడియుండకపోవుట చేతనే. బాహ్యావస్తువులను గుఱించిన భావములు ఇంద్రియములకు గొనిపోబడును. మనస్సు ఇంద్రియముల కనుసంధానమయియున్నప్పుడు అది వానిని గ్రహించి, వాని కొక విధమైన వన్నె గూర్చును. "నేను" అను అహంకారమే ఆ వర్ణము. నే నేదో పనిలో నున్నప్పుడు నా వ్రేలిమీద దోమ కుట్టిన దనుకొనుడు. అది నాకు తెలియదు. ఏల

యన, నా మనస్సు మఱొకదానితో చేరియున్నది. తరువాత నా మనస్సు ఇంద్రియముల బోధమున కనుసంధానమయినప్పుడు ప్రతిక్రియ వచ్చును. ఈ ప్రతిక్రియతో నాకు దోమను గుఱించి యెఱుక గల్గును. మనస్సు ఇంద్రియముల కనుసంధానమై యున్నను చాలదు; సంకల్పరూపమున ప్రతిక్రియ రావలె. ఏ శక్తి నుండి ఈ ప్రతిక్రియ వచ్చునో, ఆ ధీశక్తికి "బుద్ధి" అని పేరు. మొదట బాహ్యోపకరణ ముండవలె. తరువాత ఇంద్రియ ముండవలె. పిమ్మట మనస్సు వచ్చి యింద్రియములను చేర వలె. పిదప బుద్ధినుండి ప్రతిక్రియ రావలె. ఇవన్నియు పూర్తి ఐనప్పుడు, "నేనును – బాహ్యవస్తువును" అను ఎఱుక కలుగును. చూపున్నది, భావించుట ఉన్నది, ఎఱుగుట ఉన్నది. ఉపకరణమాత్రమైన బాహ్యేంద్రియము దేహములో నున్నది. దాని వెనుక లోపలి యింద్రియ మున్నది. ఇది సూక్ష్మతరమయినది; దాని వెనుక మనస్సు కలదు, అటువెనుక ధీశక్తి యున్నది, అనంతర మహంకార మున్నది. అది, "నేను – నేను చూచుచున్నాను, నేను వినుచున్నాను" ఇత్యాదిగా అనును. ఈ క్రమము నంతటిని కొన్నిశక్తులు నిర్వహించుచున్నవి. వీనిని మీరు జీవశక్తులనవచ్చును. వీనికి సంస్కృతములో ప్రాణ మని పేరు. ఇంద్రియముల బాహ్యోపకరణములు గలదగు మానవుని యీ స్థూలాంగమునకు ఈ దేహమునకు—సంస్కృతములో స్థూలశరీర మని పేరు. దాని వెనుక ఇంద్రియములతో ఆరంభమై, మనస్సు, బుద్ధి, అహంకారముల వరుస గలదు. ఇవియు, ప్రాణశక్తులును ఒక్కటిగా కలసిపోవును. ఆ మొత్తమునకు సూక్ష్మశరీర మని పేరు. ఈ శక్తులు బహుసూక్ష్మద్రవ్యములతో నేర్పడినవి. ఎంత సూక్ష్మములనగా, దేహమున కెంతటి దెబ్బ తగిలినను, ఇవి చెక్కుచెదర నంతటి సూక్ష్మములు. స్థూలశరీరమున కెంత సంక్షోభము గలిగినను ఇవి అట్లే ఉండ గలవు. స్థూలశరీరము స్థూలపదార్థములతో నిర్మిత మయినది. కనుక అది సదా మాఱుచుండును; స్థూలశరీర

ములు క్రొంగ్రొత్తవి గల్గుచుండును. అంతరింద్రియములు, మనస్సు, బుద్ధి, అహంకారము—ఇవి బహు సూక్ష్మద్రవ్యములతో చేయ బడినవి. అవి యుగయుగముల కయినను మన గలిగినంత సూక్ష్మము లయినవి. దేనిచేతను అవి ప్రతిహతములు కాజాలవు. అవి యెటువంటి యాటంకముల నయినను దాటుకొని రాగలవు. స్థూలశరీరము జడము. సూక్ష్మద్రవ్యములతో రూపొందిన సూక్ష్మశరీరముకూడ అంతే. అదియును సూక్ష్మమగు భౌతిక పదార్థముతో నేర్పడినదే. ఒకటి మనస్సు అని, మఱొకటి బుద్ధి అని, వేఱొకటి అహంకార మని వ్యవహరింపబడుచున్నను వీనిలో నేదియు "జ్ఞాత" కాదన్న విషయ మొక్క-చూపుతో మనము గ్రహింప గలము. వీనిలో నేదియు ద్రష్ట కాదు, సాక్షి కాదు; కర్మఫలభోక్త కాదు. ఈ మనోవ్యాపారము లన్నియు, ఈ ధీశక్తియు, ఈ అహంకారమును మఱియొకరికై ఏర్పడియుండవలెను. ఇ వన్నియు సూక్ష్మభౌతికపదార్థముతోనే నిర్మితము లయినందున స్వయంప్రకాశములు అగుట పొసగదు. వాని ప్రకాశమానత్వము వానికి సొంతము కాదు. ఉదాహరణకు ఈ బల్లరూపములో వ్యక్తమగుచున్నదానికి కారణము ఏ భౌతికవస్తువును కా జాలదు. కనుక వీని కన్నిటికిని వెనుక నిజ మయిన ప్రకాశకుడు, నిజ మగు ద్రష్ట, నిజ మగు భోక్త ఒక డుండి తీర వలె. అతనిని సంస్కృత ములో ఆత్మ యని, జీవాత్మ యని, మానవుని యథార్థాత్మ యని వ్యవహరింతురు. నిజముగా వస్తువులను చూచునది యతడు. బాహ్యోపకరణములు, ఇంద్రియములు భావములను గ్రహించి మనస్సున కందజేయును. మనస్సు బుద్ధి కందజేయును. బుద్ధి వానిని అద్దమునందుం బోలె ప్రతిఫలింపచేయును. బుద్ధికి వెనుక నే ఆత్మ కలదు. ఆత్మ వానికి శాస్త్ర, నియంత. అతడే ఈ యుపకర ణముల కన్నిటికి నొడయడు, గృహాధిపతి, దేహమున సింహాసనా సీనుడగు ప్రభువు. అహంకారము, బుద్ధి, మనస్సు, ఇంద్రియములు, ఉపకరణములు, దేహము — ఇ వన్నియు అతని యాజ్ఞల తల

దాల్చును. వీని నన్నిటిని ప్రకాశింపజేయుచున్న దతడే. అతడే మానవుని ఆత్మ.

విశ్వములో నొకభాగములో నేమున్నదో అదే విశ్వమంతట నుండవలె ననుట స్పష్టము. సాదృశ్యమే విశ్వసూత్రమగు నేని, యావద్విశ్వము నిర్మితమైన రీతిలోనే అందలి ప్రతిభాగమును నిర్మితమై యుండవలెను. కనుక మన విశ్వ మను పేర నున్న స్థూల భౌతికరూపమునకు వెనుక మనఃప్రపంచ మనెడి సూక్ష్మభౌతికప్రపంచ ముండవలెననియు, దాని వెనుక ఆత్మయుండవలెననియు సహజముగా మన మనుకొందుము. ఆత్మవలననే సర్వమనోవ్యాపారమును సాధ్య మగుచున్నది. ఆత్మయే శా_ ఆత్మయే సింహాసనాసీనుడగు జగత్ప్రభువు. ప్రతిదేహమునకు, ప్రతిమనస్సునకు వెనుక నున్న ఆత్మకు ప్రత్యగాత్మ వ్యష్ట్యాత్మ అని పేరు. జగత్తు వెనుక నున్న ఆత్మ, జగన్నాయకుడు, జగత్పాలకుడు, నియంత, భగవంతుడు.

ఈసమస్తవస్తువులు ఎందుండి పుట్టుచున్న వనుటే తరువాతి విషయము. సమాధాన మిది: పుట్టుట యనగా నేమి? శూన్యమునుండి దేనినైన ఉత్పత్తిల్లజేయుటే 'పుట్టుట' కర్థమగుచో అది యసాధ్యము. ఈసమస్తసృష్టిని వ్యక్తీకరణమును శూన్యమునుండి సృష్టింప శక్యము కాదు. కారణములేక దేనినిగాని సృష్టించుట శక్యము కాదు. కార్యము కారణమునకు రూపాంతరమే. ఇక్కడ అద్దము కలదు. దానిని ముక్కలు చేసి, పొడుము చేసి, రసాయనికవస్తువుల సాయముతో దానిని ఇంచుమించు పూర్తిగా రూపుమాపుద మనుకొందము. అది శూన్య మగునా? ఎంతమాత్రము కాదు. రూపము విచ్ఛిన్న మగును కాని ఏయణువులతో ఆ రూప మేర్పడినదో అవి యుండును. ఈ యణువులనుండి మఱియొక అద్దము నేర్పఱచుట ఎంతయు సాధ్యమే. ఈ మాట ఒక విషయములో నిజ మగు నేని ప్రతివిషయములోను నిజమే కాగలదు. శుద్ధ శూన్యమునుండి దేనిని గాని సృజించుటసాధ్యము.

కాదు. అటులనే దేనినిగాని శూన్యముగా మార్చుటయు శక్యము కాదు. అది యంతకంతకు సూక్ష్మతర రూపము దాల్పవచ్చును, పిమ్మట అంతకంతకు స్థూలతరరూపమును దాల్ప వచ్చును. వర్ష బిందువు ఆవిరిరూపమున సముద్రమునుండి ఆకృష్టమైనదే. ఆవిరి గాలికి కొట్టుకొని పోయి కొండలను డాయును. అక్కడ అది మరల నీరుగా మాఱును. అది వందలకొలది మైళ్లు ప్రవహించి తన ఆకర మైన సముద్రములోనికే మరల చేరుకొనును. విత్తనము చెట్టును పుట్టించును. చెట్టు నశించి, విత్తనమును మాత్రము మిగుల్చును. అది మరల చెట్టుగా వికసించును. చెట్టు మరల బీజశేష మగును. ఈక్రమము సాగిపోవుచుండును. పక్షిని చూడుడు. అది గ్రుడ్డు నుండి పుట్టును. అందమగు పక్షి యగును. బ్రతికినన్నాళ్లు బ్రతు కును. తరువాత గ్రుడ్లు పెట్టి చచ్చి పోవును. ఆగ్రుడ్లలో పుట్ట నున్న పక్షుల బీజము లున్నవి. జంతువుల విషయముగూడ ఇదే విధము. మనుష్యుల విషయము సైత మిదే తీరు. ప్రతివస్తువున కును ప్రారంభ మొక బీజము, ఒకమూలద్రవ్యము, ఒక సూక్ష్మ రూపము. అది వర్ధిల్లు కొలది అధికాధికముగ స్థూలరూపమగును. తర్వాత మరల సూక్ష్మరూపమునకు నివర్తిల్లి అందు లయించును. అఖిలప్రపంచము ఈ తీరుననే నడచుచున్నది. ఒకానొకనాటికి ఈ సమస్త విశ్వము కరగిపోయి, సూక్ష్మతమరూపము దాల్చి, చిట్ట చివరకు సంపూర్ణముగా అదృశ్య మయిన ట్లనిపించును. కాని, అ దంతయు అత్యంతసూక్ష్మభౌతిక పదార్థముగా నుండును. ఆధు నిక విజ్ఞానమును బట్టి ఖగోళశాస్త్రమునుబట్టి ఈ పృథివి చల్లబడు చున్న దనియు, కొంతకాలమున కది చాలశీతలమయి, ముక్కలు ముక్కలుగా విరిసిపోవు ననియు అంతకంతకు సూక్ష్మరూపముగ మాఱి చివరకు మరల ఆకాశ మగు ననియు తెలియుచున్నది. కాని, ఆ యణువు లన్నియు ఉండును. అవి మఱియొకపృథివిని వెలువఱచుట కుపయోగపడు మూలపదార్థ మగును. ఆపృథివియు అంతరించును. తరువాత ఇంకొక పృథివి యేర్పడ గలదు. ఈవిధ

ముగా ఈవిశ్వము తనకారణరూపములోనికి మరలును. దాని మూలద్రవ్యములు మరల కూర్పొంది రూపము ధరించును; అడగిపోయిన తరంగము మరల పైకిలేచి యాకృతిధరించును కదా! అట్లే. ఈవిధముగా కారణరూపము పొందుటకు, మరల కార్యరూపము దాల్చుటకు సంస్కృతభాషలో సంకోచమని వికాసమని పేర్లు. సమస్తసృష్టి సంకోచము పొందును. తర్వాత మరల వికాసము నొందును. ఆధునికవిజ్ఞానశాస్త్రమున ఈ క్రమ వికాససంకోచాలకే ఇవొల్యూషన్ అనియు ఇన్వొల్యూషన్ అనియు పేర్లు. క్రమవికాసమును గుఱించి మీరు వినియే యుందురు. తక్కువస్థితి నుండి సకలరూపములును మెట్టుమెట్టుగా క్రమ వికాసము పొందు చుండును. అదెంతయు నిజమే. కాని, ప్రతి వికాసమును తనకు పూర్వము సంకోచముండె నని సూచించును. ఈ జగత్తులో వ్యక్తమగుచున్న శక్తిమొత్తము సర్వదా ఒక్కటియే అనియు, పదార్థమనశ్వర మనియు మనమెఱిగినదే. ఏ విధముగాను అణువు నయినను తీసివేయజాలము. ఒక మోతాదు శక్తిని తీసివేయ జాలము, చేర్ప జాలము. మొత్త మెప్పుడును ఒక్కటియే. అది వ్యక్తమగు సంకుచిత వికసిత విధములు మాత్రమే మాఱుచుండును: కాబట్టి సంహారమొందిన పూర్వసృష్టినుండియే ఇప్పటి సృష్టి వికాసమొందుచున్నది. ఈ సృష్టియు మరల సూక్ష్మసూక్ష్మతర రూపములోనికి సంహృత మగును. ఆ సూక్ష్మరూపములనుండి భవిష్యత్సృష్టి వెలువడును. అఖిలవిశ్వ మీతీరుననే నడక సాగించుచున్నది. కనుక శూన్యమునుండి యేదో ఉప్పతిల్లుట అను నర్థముగల సృష్టి లేనే లేదు. సృష్టికంటె వ్యక్తీకరణ మనుట మేలైన మాట. జగత్తును వ్యక్తముచేయువా డీశ్వరుడు. ఈజగత్తు శ్వాసమువోలె భగవంతునినుండి వెలువఱుపబడును, మరల ఆయన యందు డిందును, మరల ఆయన దానిని వెలువఱచును. వేదములలో మిగుల చక్కని ఉపమానము చెప్పబడియున్నది: "అక్షరుడు ఈ విశ్వమును నిశ్వాసముతో వెలువఱచును, ఉచ్ఛ్వాస

ముతో లోగొనును. మనము ధూళిరేణువు నొకదానిని లోపలికి పీల్వగలము. మరల దానిని బయటికి విడిచివేయగలము. ఇదంతయు బాగుగానే యున్నది. కాని ఈ ప్రశ్న అడుగ వచ్చు "మొట్ట మొదటి సృష్టిలో అ దెట్లుండినది?" దానికి సమాధానము : "మొట్టమొదటి సృష్టి అను మాట కర్థ మేమి?" అట్టిదేమియు లేదు. కాలమున కొక ప్రారంభమును కల్పింతువేని కాలమును గుఱించిన ఆశయమే మాసి పోవును. కాల మెప్పుడు ప్రారంభమైనదో ఆలోచించిచూడుడు. ఆహద్దునుదాటి మీరు కాలమును భావింప వలసి యుండును. దేశ మెక్కడ ప్రారంభమైనదో ఆలోచించి చూడుడు. ఆహద్దున కావలి దేశమునుగూడ మీరు భావింపవలసియుండును. దేశకాలము లనంతములు. వానికి ఆద్యంతములు లేవు. దేవు డయిదు నిమిషములలో ప్రపంచమును సృష్టించి అప్పటినుండి నేటివఱకును నిద్రపోవుచున్నాడనుటకంటె ఈ తలంపు మేలైనది. ఈ యాశయముచే భగవంతుడు నిత్యసృష్టికర్త అను అభిప్రాయము కలుగును. తరంగపరంపర లేచి పడుచున్నది; ఈ నిత్యక్రియాక్రమమును భగవానుడు నడపుచున్నాడు. జగత్తు ఆద్యంతరహితమైనట్లే భగవంతుడును ఆద్యంతరహితుడు. అట్లే కాకతప్పదు. సూక్ష్మరూపములో గాని, స్థూలరూపములోగాని సృష్టిలేని కాలము కల దందు రేని ఆకాలమున భగవంతుడు లే డని యర్థ మగును. భగవంతుని మనము జగత్సాక్షిగా నెఱిగియున్నాము. జగత్తులేనప్పు డతడును లేడు. ఒక ఆశయము ఒండొకదాని ననుసరించును. కార్యమును చూచి నప్పుడు కారణమును ఉన్నదను తలంపు మనకుకలుగును. కార్యము వినా కారణము లేదు. దీనినిబట్టి జగత్తు నిత్యమయినట్టే ఈశ్వరుడును నిత్యుడే.

ఆత్మకూడ నిత్యమయినదే అయియుండవలె. ఏలయన, ఆత్మ భౌతికపదార్థము కాదు. ఇది మొదటి విషయము. అది స్థూలదేహము కాదు, మన స్సనిమెడి సూక్ష్మదేహమును కాదు,

అతని వలెను అతడు వేఱని, మానవుడు తనమట్టుకు తాను వేఱని, ప్రకృతి దానిమట్టుకు అది వేఱని భావించును. ఇది ద్వైతము. దీనిప్రకారము విషయమునకును విషయికిని ప్రత్యంశమందును విరోధమే. మానవుడు ప్రకృతినిచూచునప్పుడు అతడు విషయి, ప్రకృతి విషయము. జ్ఞాతకు, జ్ఞేయమునకు నడుమ ద్వైత మతనికి గోచరించును. అతడు దేవుని చూచునప్పుడు అతని దృష్టిలో తాను జ్ఞాత, దేవుడు జ్ఞేయము. ఈ రెండును పూర్తిగా వేర్వేఱు. ఇది దేవుడు వేఱు జీవుడు వేఱు అనెడి ద్వైతము. సాధారణముగా నిది మతమునందు ప్రాథమిక దృక్పథము.

దీని తరువాత నే నింతకుముందే వివరించిన మఱొక దృక్పథము తోచును. భగవంతుడు కారణమును, జగత్తు కార్యము నయినచో, భగవంతుడే జగత్తుగను, ఆత్మలుగను అయినాడనియు తాను కేవలము అంగమనియు, భగవంతుడు అంగి అనియు మానవుడు గుర్తింప దొడగును. మన మందఱము క్షుద్రజీవులము. ఆ తేజోరాశిలోనుండి వచ్చిన విస్ఫులింగములము. ఈ సమస్త విశ్వముగ రూపొందినవాడు భగవంతుడే. ఇదియే తరువాతిమెట్టు. ఈవాదమునకు సంస్కృతభాషలో విశిష్టాద్వైత మని పేరు. నాకీ దేహ మున్నది. ఈ దేహము ఆత్మను ఆచ్ఛాదించుచున్నది. ఆత్మ దేహమం దున్నది, దేహమున వ్యాపించియు నున్నది. అటులనే ప్రకృతితోను, అనంతాత్మలతోను కూడిన ఈ జగము దేవునకు దేహమువంటిది. సంహారకాలమున జగము క్రమముగా సూక్ష్మ సూక్ష్మతరరూపములను దాల్చును. అప్పుడును దేవునకు తాను దేహముగనే ఉండును. జగము స్థూలరూపము దాల్చినప్పుడును అది దేవునకు దేహముగనే ఉండును. జీవాత్మ జీవుని దేహమునకు, జీవునిమనస్సునకు ఆత్మ అయినట్టు, దేవుడు మన ఆత్మల కాత్మ. ప్రతిమతము నందును, "అతడు మన ఆత్మలకు ఆత్మ." అను ప్రతిపాదనమును మీరు వినియే యుందురు. దాని భావ మిదియే. అతడు వాని కంతర్యామి; వానికి ప్రవర్తకుడు.

వాని కన్నిటికి నియంత. మొదటి దృక్పథమునందు ద్వైతవాదమందు మనలో ప్రతియొక్కరమును దేవునికిని, ప్రకృతికిని శాశ్వతముగా వేఱుగా నున్న వ్యష్ట్యాత్మలము. రెండవ దృక్పథమందును మనము వ్యష్ట్యాత్మలమే. కాని, భగవంతునుండి వేఱయినవారము కాము. ఒక్క రాశియందు తేలియాడుచున్న అణువులవంటివారము. ఆ రాశియే దేవుడు. మనము వ్యష్ట్యాత్మలమే. కాని, దేవుని యందు మన కైక్యము. మన మందఱ మతని యం దున్నాము. మన మతని కవయవములమే. కనుక మన మందఱ మొక్కటే. అయినను మానవునకును, మానవునకును, మానవునకును దేవునకును నడుమ భిన్నమును అభిన్నమునగు వ్యక్తిత్వము గలదు.

దీని తరువాత ఇంతకంటె సూక్ష్మమైన మఱొక ప్రశ్న లేచును. అది యిది: అనంతమునందు భాగము లుండుట పొసగునా? అనంతములో భాగము లనుమాట కర్థ మేమి? ఈవిషయమును లోతుగా తరిచితి రేని అది యసంభవమని గ్రహింతురు. అనంతము అవిభాజ్యము. సర్వదా అది యనంతమే. దానిని విభజించుట శక్యమే అగు నేనియు, ప్రతిభాగము అనంతమే యగును. అనంత మయినవి రెం డుండ జాలవు. ఉన్న వనియే అనుకొందము. అప్పు డొకటి మఱొకదానిచే పరిచ్ఛిన్న మగును. రెండును సాంతములే యగును. అనంతమయినది అవిభాజ్యముగను ఏకముగనే ఉండుట పొసగును. అందుచేత అనంత మొక్కటే గాని అనేకము కా దని నిర్ణయ మగును. అనంతమగు ఏకాత్మయే వేలకొలఁది అద్దములలో ప్రతిఫలించుచున్నది; అనేకాత్మలుగా భాసించుచున్నది. జగత్తునకు ఆధారముగానున్న ఆ యనంతాత్మనే, మనము భగవంతు డందుము. మానవాత్మ యని మనము వ్యవహరించు మానవమనస్సునకుకూడ ఆ యనంతాత్మయే ఆధారము.

# ముక్తాత్మ

(న్యూయార్కులో 1896 వ సంవత్సరములో చేసిన ఉపన్యాసము)

సాంఖ్యుల తత్త్వవిభజన, ప్రకృతి ఆత్మ అను రెండు తత్త్వముల ప్రతిపాదించుటతో, ఆగిపోవును. ఆత్మ లనంతసంఖ్యాకములు. అవి అసమ్మిశ్రములు, విరిసిపోవు, కావున ప్రకృతినుండి వేఱైనవిగ నుండి తీర వలెను, ప్రకృతి తనయందు తాను మార్పు చెందుచు, ఈ దృశ్యమాన ప్రపంచమును రూపొందించును. సాంఖ్యుల మతముప్రకారము ఆత్మ నిష్క్రియ మయినది. అది తాను అసమ్మిశ్రము. దానివిముక్తికొఱకు ప్రకృతి ఈ దృశ్యజగద్వ్యాపారమును సాగించుచున్నది; ఆత్మ తాను ప్రకృతి కా నని గ్రహించుటే దానికి విముక్తి. అయినను ప్రతి ఆత్మ విశ్వవ్యాప్త మైన దని సాంఖ్యు లంగీకరింపక తప్పినదికాదని మనము గుర్తించితిమి. అసమ్మిశ్ర మగుటవలన ఆత్మ పరిచ్ఛిన్నమై యుండుట పొసగదు. ఏల యన సకలపరిచ్ఛేదములును దేశముచేతనో కాలముచేతనో కార్యకారణనియతిచేతనో ఏర్పడునవి. ఈమూడింటికిని ఆత్మ పూర్తిగా అతీత మగుటచేత దాని కెట్టి పరిచ్ఛేదమును ఉండుటకు వీలు లేదు. పరిమితి యుండుట కొక దేశములో నుండవలె. దేశ మనగా దేహము. దేహము ప్రకృతిస్థముగనే ఉండవలె. ఆత్మకు ఆకృతియున్నచో అది ప్రకృతి కభిన్నముగనే గుర్తింపబడును. కనుక ఆత్మ నిరాకారమయినది. ఆకారములేనిది యిక్కడనో, అక్కడనో, మఱెక్కడనో మాత్రమే ఉన్న దని చెప్పుట పొసగదు. అది విశ్వవ్యాప్తముగ నుండ వలె. ఇంతకు మించి సాంఖ్య దర్శనము చెప్పిన దేమియు లేదు.

దీనిని ఖండించుచు వేదాంతులు చెప్పు మొట్టమొదటి యుక్తి 'సాంఖ్యుల ప్రతిపాదనము సమగ్రము కా' దని. ఈ

"ప్రకృతి"యు స్వతంత్రమయిన దగునేని, ఆత్మకూడ స్వతంత్ర మయినచో, రెండు స్వతంత్రతత్త్వము లున్న వన్న మాట. ఆత్మ సర్వవ్యాపి యని ప్రతిపాదించుటకు చెప్పు యుక్తు లన్నియు ప్రకృతికి సైత మన్వయించును. అంతట ప్రకృతికూడ దేశమునకు కాలమునకు కార్యకారణనియతికి అతీత మగును. అగు నేని మార్పుండదు, వ్యక్తీకరణ ముండదు. అప్పుడు స్వతంత్రతత్త్వములు రెం డగు చిక్కు ప్రాప్తించును. రెం డగుట యసాధ్యము. మఱి, వేదాంతి చెప్పు పరిష్కార మేమి? స్థూలభౌతికమునుండి మహత్తువఱకు సకలపరిణామములందును ప్రకృతి చైతన్యరహితమే గనుక మనస్సును యోచించునట్లును, ప్రకృతిని పనిచేయునట్లును ప్రేరించుటకు పురుషుడు ఉండుట అవసరమే అని సాంఖ్యులు చెప్పు మాటనే వేదాంతియు చెప్పును. 'మేము భగవంతు డని చెప్పునది విశ్వ మంతటికిని వెనుక నున్న ఆ చైతన్యపురుషునే. కనుక ఈ విశ్వ మతనికి భిన్నము కాదు' అని వేదాంతి యనును. అతడే ఈ జగత్తుగా రూపొందినాడు. అత డీ విశ్వమునకు నిమిత్తకారణమే కాదు, ఉపాదానకారణము కూడ. కారణ మెన్నడును కార్యమునకంటె భిన్నము కాదు. కార్యము కారణమునకు రూపాంతరమే. ఈ విషయము మన మనుదినము చూచుచునే యున్నాము. కనుక పురుషుడు ప్రకృతికి కారణము. జగత్తునకు నిమిత్తకారణమే కాక ఉపాదానకారణమును ఈశ్వరుడే, ఉన్న దెల్ల అతడే — అను ఈ ప్రతిపాదనమే అన్ని రూపాల వేదాంతమునకు, వేదాంతములోని అన్ని భాగాలకు ప్రాతిపదిక. వేదాంతము చెప్పు రెండవ విషయ మే మనగా, ఈ యాత్మలుకూడ ఈశ్వరాంశలే. అనంతజ్యోతిలో నొక విస్ఫులింగము "సుదీప్తమగు అగ్నినుండి వేలకొలది విస్ఫులింగము లెట్లు వెలువడునో అటులనే అక్షరునినుండి ఈ యాత్మ లన్నియు ఉద్భవించినవి." ఇంతవఱకు సరే. కాని, ఇంకను సంతృప్తి కలుగలేదు. అనంతములో భాగ మన నేమి? అనంత మవిభాజ్యము; అనంతములో భాగము లుండు

బుద్ధులు మున్నగు అవతారపురుషులను మానవకోటి పూజించును. నిత్యాత్మకు వారు మిక్కిలి పరిపూర్ణములగు నావిష్కారములు. భగవంతుని గుఱించి 'మీకును నాకును గల్గగల తలంపు లన్నిటి కంటె వారు చాల పైమెట్టువారు. 'దేవుడిట్టివా' డనెడి మన తలంపులకంటె చాల పైమెట్టువారు సిద్ధపురుషులు. వృత్తమును పూర్తిచేయువారు సిద్ధపురుషులే. విషయమునకు విషయికిని ఐక్యము గల్గును. అతనియందు సమస్తభ్రమలు పటాపంచలగును. వాని స్థానమున 'ఎప్పుడును ఆ పరిపూర్ణుడను నేనే' అన్న సాక్షాత్కారము కలుగును. ఈ బంధ మెట్లు కలిగినది? పరిపూర్ణుడు అపరిపూర్ణస్థాయికి పతనము చెందు టెట్లు సాధ్యమైనది? ముక్తుడు బద్ధు డగుట ఎట్లు పొసగెను? 'నే నెన్నడును బద్ధుడనుగ నుండ లేదు, నే నెల్లప్పుడును ముక్తుడనే' అని అద్వైతి చెప్పును. నానావర్ణసంశోభితములగు మబ్బు లనేకములు ఆకాశము నాచ్ఛాదించును. క్షణకాల ముండి అవి పోవును. ఆకాశ మెప్పుడు నట వ్యాపించియున్న నీలాకాశమే. ఆకాశము మార్పు చెందుట లేదు; మార్పు చెందుచున్నది మబ్బుమాత్రమే. అటులనే నీవును సర్వదా పరిపూర్ణుడవు; నిత్యపరిపూర్ణుడవు. నీ స్వరూపమును మార్చున దెప్పుడును లేదు, ఉండ బోదు. నే నసంపూర్ణుడను, నేను పురుషుడను, నేను స్త్రీని, నేను పాపిని, నేను మనస్సును, నాకు సంకల్పము ఉన్నది, నేను సంకల్పింతును — ఈ భావము లన్నియు భ్రాంతులు; నీకు సంకల్ప మెప్పుడును లేదు; నీకు దేహ మెప్పుడును లేదు; నీ వెన్నడును అపరిపూర్ణుడవుగ నుండ లేదు. నీ వానందస్వరూపుడవు, ఈ జగత్తునకు ఈశ్వరుడవు. ఉన్న – రానున్న – సమస్తమునకు సర్వశక్తివగు ఏకైకప్రభువవు. ఈ ఆదిత్యులకు, నక్షత్రములకు, చంద్రులకు, భూములకు, గ్రహములకు, చిన్నచిన్నవగు విశ్వఖండముల కన్నిటికిని బలవంతుడగు ఏకైక పాలకుడవు నీవే. సూర్యుడు ప్రకాశించుటకు; తారలు కాంతిని విరజిమ్ముటకు; పృథివి సుందరముగా నుండుటకు మూలము నీవే.

వాని పరస్పరప్రేమకు పరస్పరాకర్షణకు మూలము నీ పావనతయే. అన్నిటియందు నీవు ఉన్నావు. అన్నియు నీవే, ఇక గ్రహించు ఎవరిని? పరిహరించు ఎవరిని? నీవే సర్వమవు. సర్వగతుడవు. ఈ జ్ఞానోదయమైన వెంటనే భ్రాంతి మటుమాయమగును.

నే నొక పర్యాయము భారతదేశములోని ఎడారిలో ప్రయాణము చేయుచుంటిని. నెలదినములకుపైగా ప్రయాణము చేసితిని. అన్నాళ్లును అత్యంత సుందరప్రదేశములు సుందర సరస్సులు మున్నగువానిని తిలకించుచుంటిని. ఒకనాడు దాహము మిక్కుటము కాగా ఆసరస్సులలో ఒకదానిలో నీరు త్రాగుద మనుకొంటిని. సమీపించునప్పటి కది మాయమై పోయినది. వెంటనే విసురుగా దెబ్బకొట్టినట్లు 'అది ఎండమావి, బ్రతికినన్ని నాళ్లు నేను గ్రంథాలలో చదివియున్న ఎండమావి' అను జ్ఞప్తి కలిగినది. ఆ జ్ఞప్తితో నేను చెందిన భ్రాంతికి నాలో నేను నవ్వు కొంటిని. గత మాసముదినములుగా నేను తిలకించుచుండిన సుందరప్రదేశములును సరస్సులును ఈమృగతృష్ణయే. కాని అప్పుడు వాని నావిధముగా గుర్తింపలేకపోయితిని. మఱునాటి ఉదయము మరల ప్రయాణము ప్రారంభించితిని; సరస్సులు ప్రదేశాలు కనబడినవి. దానితోపాటు, "ఇది మృగతృష్ణ" అను జ్ఞాపకముగూడ గలిగినది. ఒకసారి తెలిసికొన్నతరువాత దానికి భ్రమగొలిపెడి శక్తి నశించినది. అటులనే ఒకానొకనాడు జగత్తును గుఱించిన భ్రమకూడ పటాపంచలయి పోగలదు. ఈ సర్వము అదృశ్యమై పోవును; కరగిపోవును. ఇదియే సాక్షాత్కారము. తత్త్వశాస్త్రము తమాషావ్యవహారము కాదు, మాటలు చెప్పుట కాదు. సాక్షాత్కారము పొంద వలె; ఈ దేహము మాయ మగును; ఈ పృథివి, ఈ సర్వము మాయ మగును. 'నేను దేహమను' 'నేను మనస్సను' అనెడి ఆశయము కొంతకాలమువఱకు తొలగును ; కర్మ పర్యవసన్న మయినచో

ఆయాశయము మరల రాకుండురీతిని అంతరించును; కర్మలో కొంత 'భాగము మిగిలి యున్నచో—కుమ్మరివాని చక్రము, కుండపూర్తి అయినతరువాతకూడ—మునుపటి ఊపునకు ఫలితముగా ఇంకను కొంతకాలము తిరుగుచుండునట్లు — భ్రాంతి పూర్తిగా పోయిన తరువాతకూడ కొంతకాలము దేహయాత్ర సాగుచుండును. ఈ జగము, మరల వచ్చును. పురుషులు, స్త్రీలు, వత్తురు. మృగగణము వచ్చును. ఎండమావి మఱునాడును వచ్చినట్లే ఈ సమస్తము వచ్చును; కాని, భ్రమగొలిపెడి మునుపటిశక్తి యుండదు. దానితోపాటు 'దాని తత్త్వము నా కిప్పుడు తెలియును; అది నన్నిక బంధములో పడవేయ జాలదు, నన్ను బాధింపదు, నాకు దుఃఖమును దైన్యమును కలిగింపదు అనెడి జ్ఞానముకూడ వచ్చును. ఎప్పుడయినను ఏదయిన దుఃఖపరిస్థితి సంప్రాప్తమయినయెడల, ''నీవు మిథ్యవు, నాకు తెలియునుపో'' అని మనస్సు ఉద్ఘాటింపగలదు. అంతటి స్థాయి నందుకొన గలిగిన మానవుని 'జీవన్ముక్తుడు', 'జీవించియుండగనే ముక్తదశనందు కొన్నవాడు' అందురు. జీవన్ముక్తస్థితిపొందుటే జ్ఞానయోగికి జీవిత లక్ష్యము. నిస్సంగిగా జీవితయాత్ర సాగింపగలవాడే జీవన్ముక్తుడు. అతడు నీటనుండియు నీరంటని తామరాకువంటివాడు. మానవులలో అతడు మహోన్నతుడు. మానవులలోనే కాదు. సకల జీవులలోను అతడే మహోన్నతుడు. ఏల యన, అతడు బ్రహ్మముతోడి తన ఐక్యమును సాక్షాత్కరించుకొన్నాడు. పరముడును తానును ఒక్కరమే అనుట నతడు సాక్షాత్కరించుకొనెను. దేవునకు నీకు ఏకొంచెము భేద మున్నట్టు నీవు భావించినను భయము నిన్ను గ్రసించును. నీవతడే అని, నీకు అతనికి భేదము లేదని, భేద మేమాత్రమును లేనే లేదని, నీవతడే అని, అతని పూర్తిస్వరూపమే సమగ్రస్వరూపమే నీవని తెలిసికొన్నప్పుడు సమస్త భయము మటుమాయ మగును. ''అప్పు డెవ రెవరిని కందురు? ఎవ రెవరిని భజింతురు? ఎవ రెవరితో భాషింతురు? ఎవ రెవరిని

వినరు? ఏస్థితియందు ఒకరు మఱొకరిని చూతురో, ఒకరు మఱొకరితో భాషింతురో, ఒకరు మఱొకరి మాటలు విందురో అది క్షుద్రము, ఏస్థితియందు ఎవరును ఎవరిని చూడరో, ఎవరును ఎవరితోను భాషింపరో ఆ స్థితి పరమోన్నతము, మహిష్ఠము. అది బ్రహ్మము''. బ్రహ్మమవైన నీవు సదా బ్రహ్మమవే. అప్పు 'డీ జగ మే మగును?' 'లోకమున కేమి మేలు చేయుదము?' అను ఇట్టి ప్రశ్నలు కలుగవు. ''నేను పెద్దవాడ నయినచో నా అల్లపు మురబ్బా ఏ మగును?'' అని పసిబిడ్డ అడుగును. ''నేను పెద్దవాడ నయినయెడల నాగోలీల గతి ఏమి? కనుక నేను పెద్దవాడను కాను.'' అని బాలు డనును. ''నేను పెద్ద నయినయెడల నా బొమ్మ లే మగును?'' అని శిశువు అనును. ఈ జగమును గుఱించిన విషయముకూడ అటువంటిదే. ఈ జగమునకు ఉనికి మునుపు లేదు, ఇపుడు లేదు, ఇంకముందు నుండదు. ఆత్మ యాథార్థ్యమును తెలిసికొన్నచో, ఆత్మతప్ప వే ఱేదియు లే దని, ఆత్మేతర మయిన దెల్ల స్వప్నమే అని, వానికి పారమార్థికసత్త లే దని— తెలిసికొన్నచో దారిద్ర్యముతోను, వ్యసనముతోను, చెడుగుతోను, మంచితోను కూడిన ఈజగత్తు మనలను కలవరపెట్టజాలదు. అవేవియు లేనప్పుడు ఎవరికొఱకు, దేనికొఱకు మనము శ్రమపడుదుము? జ్ఞానయోగులు చేయు బోధ యిది. కనుక 'నేను ముక్తుడనే' అను ధీరత వహింపుము. నీ మనసు నిన్ను కొనిపోగలిగినంతదూరము ధైర్యముతో పొమ్ము. భావించినదెల్ల ధైర్యముతో ఆచరింపుము. జ్ఞానము నధిగమించుట బహుదుష్కరము. ధీరతములకే నిరతిశయ సాహసోపేతులకే, సకల ప్రతిమలను, భావనకు చెందిన ప్రతిమలనే కాక, ఇంద్రియములందలి ప్రతిమను సైతము తుత్తునియలు చేయగల తెంపుగలవారికే జ్ఞానమార్గము. ఈ దేహము నేను కాను; ఇది పోవలె. ఇందుండి అన్ని విధాల వింతసుద్దులు వెలువడ వచ్చు. ఒకడు లేచి, ''నే నీ దేహమను కాను. కనుక నా తలనొప్పి పోవలె'' అనును. మఱి

తలనొప్పి దేహములో కాక మ రెక్కడ గలదు? వేయి తలనొప్పులు, వేయి దేహములు రానిమ్ము, పోనిమ్ము. అందువలన నాకు కలిగెడి దేమి? నాకు జననము లేదు, మరణము లేదు. నాకెన్నడును తండ్రి లేడు, తల్లి లేదు, మిత్రులు లేరు, శత్రువులు లేరు. ఏల యన, వా రందఱును నేనే. నేనే నా మిత్రుడను, నేనే నా శత్రువను. అఖండసచ్చిదానంద మగు బ్రహ్మమనే నేను. సోఽహం. సోఽహం. వేయి దేహములలో నేను జ్వరముతోను, ఇతరవ్యాధులతోను బాధపడుచున్నచో, లక్ష దేహములలో నేనారోగ్యవంతుడనై యున్నాను. ఒక వేయి దేహములలో నేను పస్తున్నచో, మఱొక వేయిదేహములలో విందు లారగించుచున్నాను. వేలకొలది దేహములలో నేను దుఃఖపడుచున్నచో, వేలకొలది దేహములలో నేను సుఖపడుచును ఉన్నాను. ఎవ రెవరిని నిందింతురు? ఎవ రెవరిని స్తుతింతురు? ఎవరిని వెదుకవలె? ఎవరిని విడనాడవలె? నే నెవరిని అన్వేషింపను. ఎవరిని విసర్జింపను. ఏలయన విశ్వ మంతయు నేనే. నన్ను నేనే స్తుతించుకొందును. నన్ను నేనే నిందించుకొందును. నాకొఱకే నేను బాధపడుదును. నా సంకల్పముచేతనే నేను సుఖించుచున్నాను. నేను ముక్తుడను. ధీరుడును సాహసియు నగు జ్ఞాని ఇట్టివాడు. అఖిల విశ్వము కూలి పోనిమ్ము; అతడు చిఱునవ్వు నవ్వి అస లదెన్నడును లేనే లే దనును; అ దంతయు భ్రమ. ప్రపంచము కూలి పోవుట అతడు చూచును. అది ఉండిన దెక్కడ? పోయిన దెక్కడికి?

ఆచరణభాగమును ప్రస్తావించుటకు ముందు సిద్ధాంతమునకు సంబంధించిన మఱొక విషయమును పరిశీలింతము. ఇంతవఱకు తర్కము నిశితాతినిశితముగా నున్నది. మానవుడు హేతువాదమును సాగించునేని నిర్ణయమునకు వచ్చువఱకు అతనికి కాలూన ఆధారమే ఉండదు. నిర్ణయము: ఉన్న వస్తు వొక్కటే. తక్కిన

దంతయు మిథ్య. తార్కికదృష్టి గల మానవకోటి యీ నిర్ణయమునకు రాక గత్యంతరము లేదు. మఱి, అనంతము, నిత్యపరిపూర్ణము, నిత్యశుద్ధము, సచ్చిదానందము నగు బ్రహ్మము ఈ భ్రమలలో నెట్లు తగుల్కొన్నది? లోకమం దెల్లడల అడుగబడుచున్న ప్రశ్న ఇదే. ముదుగుగా అడిగితి మేని ఈ ప్రశ్న యిట్లు రూపొందును: "జగములోనికి పాప మెట్లు ప్రవేశించినది?" ఇది యీ ప్రశ్నకు మిక్కిలి అసభ్యమైన రూపము. ఎంతయు ఇంద్రియపరులగు వారు అడుగు రూపము. రెండవది తత్త్వశాస్త్రీయ రూపము. ఈ రెంటికి సమాధాన మొక్కటే. ఈ ప్రశ్నయే వివిధ వైఖరుల, వివిధములగు అంతస్తులలో వేయబడుచున్నది. దిగువస్థాయిలో దీనికి సమాధానము కుదరదు. ఏల యన ఆపిలు పండ్లను, పాములను, స్త్రీలనుగుఱించిన కథలు సమాధాన మీయజాలవు. దిగువస్థాయిలో ప్రశ్న శిశూచితముగా నుండును. సమాధానముకూడ తదనుగుణముగానే యుండును. ఇప్పు డీ ప్రశ్న మిగుల ఉదాత్త రూపము దాల్చినది: ఈభ్రమ ఎట్లు కలిగినది? దీని సమాధానముగూడ అంత చక్కగానే ఉన్నది. 'అసంగతమగు ప్రశ్నకు సమాధాన ముండు ననుకొనరా' దనుటే దీనికి సమాధానము. అసలు ఆప్రశ్న పుట్టుటకే అవకాశము లేదు. ఈ ప్రశ్న వేయుట కధికారము నీకు లేదు. ఎందుచేత? పరిపూర్ణత అన నేమి? స్థలకాలనిమిత్తముల కతీతమై ఉండుటే పరిపూర్ణత. పరిపూర్ణమైన దెట్లు అపరిపూర్ణమైన దని నీవు ప్రశ్నింతువు? తార్కికభాషలో ఈ ప్రశ్న రూప మిట్లుండును: కార్యకారణ నియతి కతీతమైనదానికి కారణ మేది? ఇది స్వవచనవ్యాఘాతము. అది కార్యకారణబంధమునకతీతమైన దని నీవు మొదట అంగీకరించితివి. తరువాత దానికి కారణ మేది యని ప్రశ్నించుచున్నావు. కార్యకారణనియతికి లోబడినంతలో ఈప్రశ్న నడుగవచ్చు. స్థలకాలనిమిత్తములపరిధి కావల ఈ ప్రశ్న కర్థములేదు; ఈప్రశ్న తర్కవిరుద్ధ మగును. ఈప్రశ్నకు స్థలకాలనిమిత్తముల

పరిమితిలో సమాధాన మేనాటికిని దొరకదు. ఈ పరిమితి కావల ఏమి సమాధానము గలదో మనము దీని నతిక్రమించిన గాని తెలియదు; కనుక వివేకు లీ ప్రశ్నను త్రోసిపుత్తురు. వ్యాధి గ్రస్తుడు వ్యాధిచికిత్సను గుఱించియే శ్రద్ధవహించును గాని జబ్బు ఎట్లు వచ్చినదో ముందుగా తెలిసికోవలె నను పట్టు పట్టడు.

ఈ ప్రశ్నకు మఱియొక రూపము గలదు. ఆ రూపము ఇంతకంటె క్రిందిమెట్టుది కాని, దీనికంటె ఎక్కువ అనుభవ సిద్ధము, ఎక్కువగ స్పష్టపఱచునది. ఈ భ్రాంతిని కలుగ జేసిన దేది? సత్య మేదైనగాని, భ్రాంతిని కలిగించునా? ఎంతమాత్రము కలిగింపదు. ఒక భ్రమ మఱొక భ్రమను కలిగింప గలదు. అది యింకొక భ్రమను, అది వేఱొక భ్రమను కలిగించును. భ్రమయే భ్రమను కలిగించును; వ్యాధియే వ్యాధిని కలిగించును. ఆరోగ్యము వ్యాధిని కలుగ జేయదు. కెరటమును నీరును ఒక్కటే. కార్యము కారణమునను రూపాంతరమే. ఇక్కడ కార్యము భ్రమ. కనుక దానికారణముకూడ భ్రమయే కాక తప్పదు. ఈ భ్రమను కలిగించిన దేది? మఱొక భ్రమయే. కార్యములుగను కారణ ములుగను ఉన్న భ్రమల పరంపర కొక మొదలు లేదు. ఇక నీ వడుగుటకు మిగిలియుండు ప్రశ్న ఒక్కటే: ఇది అద్వైత మును ఖండించుట కాదా? ఏల యన రెండింటి ఉనికి సిద్ధించు చున్నది. ఒకటి నీవు, మఱొకటి మాయ. దీనికి సమాధాన మిది. 'భ్రమ'ను 'ఉనికి' అని పేర్కొనుటకు వీలు లేదు. నీజీవిత ములో వేలకొలది స్వప్నములు కాంతువు. అవి నీ జీవితములో నొక భాగముగ నగుట లేదు. కలలు వచ్చును, పోవును; వానికి నిలుకడ లేదు; భ్రమను ఉనికిగా పరిగణించుట కుతర్కము. అందుచేత జగత్తులో నున్న నిత్యముక్తము, నిత్యశుద్ధమును అగు సత్తు ఒక్కటే. అదే నీవు. అద్వైతుల కడపటి నిర్ణయ మిదియే.

ఇక్కడ ఒక ప్రశ్న అడుగవచ్చును: వివిధము లగు ఈ యుపాసన లేమగును? అవి యుండును. అవి వెలుగుకొఱకు చీకటిలో తడుముకొనుటవంటివి. తడుముకొనుటచే వెలుగు వచ్చును. ఆత్మ తన్ను తాను చూచుకోజాల దని మన మింతకు ముందే గ్రహించితిమి కదా, మన జ్ఞాన మంతయును మాయా (=అసత్య) జాలములోనిదే. దాని కావల నున్నది స్వాతంత్ర్యము; మాయాజాలములో నున్న దెల్ల బానిసతనమే; అంతయు శాసనబద్ధము. దీని వెలుపల శాసనము లేదు. ఈ జగత్తుకు సంబంధించినంతవఱకు ఉన్న దంతయు శాసనబద్ధము. దీని కావలనే ఉండునది ముక్తి. దేశకాలనిమిత్తముల అల్లికలో తగుల్కొని యున్నంతవఱకు నీవు ముక్తుడ వనుట అర్థము లేనిమాట. ఆ వలలో సర్వము కఠోరశాసనబద్ధము, క్రమబద్ధము, హేతుబద్ధము. నీవు భావించెడి ప్రతిభావము కారణప్రేరితమే; ప్రతి యనుభవము కారణజన్యమే; సంకల్పము స్వాతంత్ర మనుట కేవలము అసంబద్ధప్రలాపము. అపరిచ్ఛిన్న సత్త (=ఎక్సిస్టెన్సు), మాయాజాలములోనికి వచ్చినప్పుడే అది సంకల్పరూపము దాల్చును. మాయాజాలములో చిక్కుకొనియున్న పురుషునిలో భాగమే సంకల్పము. కనుక 'స్వతంత్రసంకల్పము' అనునది అతుకని పేరు. దాని కర్థము లేదు. మాయలో స్వేచ్ఛ లేదు.

రాయి, ఈ బల్ల ఎంతగా బద్ధములయినవో ప్రతిజీవుడును మనోవాక్కర్మలందు, సంకల్పించుటందు అంతగా బద్ధుడే. నా పలుకులు మీరు వినుటయు, మీ యెదుట నేను భాషించుటయు సమానముగా కఠోరకార్యకారణనియతికి బద్ధములే. మాయ నతిక్రమించువఱకు స్వేచ్ఛ లేదు. అదియే నిజమగు ఆత్మవిముక్తి. ఎంతెంత చుఱుకుగలవారును మేధావులును ఇక్కడి దేదియు స్వతంత్రముగ నుండుట పొసగదని నిశితమగు తర్కవిమర్శ చేత ఎంత స్పష్టముగా తాము గ్రహించినను తాము ముక్తులమే అని

యనివార్యముగా భావింపవలసినవా రగుచున్నారు; భావింపక పోవుట వారికి శక్యము కాదు. మనము ముక్తులమని చెప్పకొన ప్రారంభించిన గాని ఏ పనియు సాగదు. మనము భావించెడి స్వాతంత్ర్యము మబ్బులగుండ కనబడెడి నీలాకాశమువంటిది. నిజమగు స్వాతంత్ర్యము — వినిర్మలనీలాకాశము వెనుకనై యున్నది. ఈ మాయ, ఈ భ్రాంతి, ప్రపంచపు ఈ అస్తావిస్తము, ఈ యింద్రియజగము, ఈ మేను, ఈ మనస్సు — వీనినడుమ నిజమైన స్వాతంత్ర్య ముండుట పొసగదు. ఈ స్వప్నములకు మొదలు తుదలు లేవు, ఇవి మన వశములో లేవు, మన వశము లోనికి రావు, వీనికి పొందిక లేదు, ఒద్దిక లేదు, సామరస్యము లేదు. ఈ స్వప్నములచేత రూపొందినదే ఈ జగత్తునుగూర్చిన మన ఆశయము. స్వప్నములో ఇరువదితలలు గల రాక్షసుడు నిన్ను తఱుముచు, నీ వతనినుండి పాఱిపోవు చున్నప్పు డదంతయు నసంగత మని నీ వనుకోవు; అది సమంజసమే, సవ్యమే అనియే భావింతువు. ఈ శాస్త్రముకూడ అట్టిదే, శాస్త్రమని నీవు చెప్పున దంతయు నర్థములేని కాకతాళీయసంఘటనే. ఈ స్వప్నరాజ్య ములో నీవు దానిని శాస్త్ర మందువు. మాయావరణలో దేశ-కాలనిమిత్తములున్నంతమేరకు స్వాతంత్ర్యము లేదు; వివిధములగు ఈ ఉపాసనారీతులు మాయావరణలోనివే. దేవునిగుఱించిన ఆశయ ములు పశువును, మనుష్యుని గుఱించిన ఆశయములు ఈ మాయా జాలములోనివే. కనుక అవన్నియు సమానముగా భ్రాంతిజన్య ములే; అవన్నియు స్వప్నములే. ఈ కాలమున కొందఱు అసా ధారణపురుషులను గుఱించి మనము వినుచున్నామే వారు వాదించు నట్లు నీవు వాదింప రాదు, జాగ్రత్త! దేవునిగుఱించిన ఆశయము మాత్రము భ్రాంతి యనియు, జగత్తును గుఱించిన ఆశయము సత్య మనియు వా రందురు. ఈ రెండు భావములకు నాధారమగు తర్క మొక్కటే కనుక ఈ రెండు భావములు సత్యములే కా వలె; లేదా, రెండును అసత్యములే కావలె. ఈ లోకమును

పరలోకమును కూడ లేదన గలవానికే నాస్తికు డనిపించుకొను అధికారము గలదు. ఈ రెంటిని సాధించు తర్క మొక్కటే. దేవుని మొదలు క్షుద్రప్రాణివఱకు, స్తంబము మొదలు బ్రహ్మవఱకు వ్యాప్తమై యున్న మాయాపుంజ మొక్కటే. నిలబడుటకును, కూలిపోవుటకును రెంటికి అన్వయ మగు తర్కము ఒక్కటే. దేవుని గుఱించిన ఆశయములో అసత్యమును గుర్తింపగలవాడు తన దేహమును, తనమనస్సును గుఱించిన ఆశయములోకూడ గుర్తింప వలె. దేవుడు లేకపోయినప్పుడు దేహమును మనస్సును కూడ లేకపోవును. అదియు, నిదియు పోయిన తరువాత, ఏది పారమార్థికసత్తయో అది నిత్యముగా నిలుచును. "అక్కడకు చూపు ప్రసరింపజాలదు. వాక్కు పోలేదు. మనస్సును చేర జాలదు. దానిని మనము దర్శింప లేము, తెలిసికొనను లేము." మాటయు, మనమును, జ్ఞానమును, ధీశక్తియు అందుకొనగలిగినంత మేర ఈ మాయలోనే, బంధములోనే యున్న దనుట మన కిప్పు డర్థ మైనది. దీని కావలనే సత్య మున్నది. దానిని భావముగాని, మనస్సుగాని, మాటగాని అందుకొన జాలదు.

బుద్ధితో యోచించినంతవఱకు ఇదంతయు చక్కగానే యున్నది. ఇక ఆచరణవిషయ మున్నది. నిజమునకు ఆచరణే సాధన. ఈ ఐక్యమును సాక్షాత్కరింపజేసికొనుటకు సాధన లేవేని అవసరమా? నిశ్చయముగా అవసరము. నీవు బ్రహ్మముగా అగుదు వనుట కాదు. నీ విప్పుడును బ్రహ్మమే. దేవుడవుగా, పరిపూర్ణుడవుగా నీవు కాబోవుచున్నా వనుట కాదు. నీ విప్పుడును పరిపూర్ణుడవే; ఎప్పుడయిన పరిపూర్ణుడవు కా వనుకొన్న యెడల అది భ్రమయే. నీవు శ్రీమాన్......అని గాని, శ్రీమతి...... అని గాని అనుకొనునట్లు చేయు భ్రమను పోగొట్టుట మఱొక భ్రమచేతనే సాధ్యమగును. ఆ మఱొక భ్రమయే సాధన. అగ్నిని అగ్ని దహించును. ఒకభ్రమను తొలగించుటకు నీవు మఱొక

భ్రమను ప్రయోగింపవచ్చును. ఒకమబ్బువచ్చి మఱొకమబ్బును త్రోసివేయును. చివరకు రెండుమబ్బులును పోవును. అటులయిన ఈ సాధన లేమి? ముక్తి ఇకమీాద మనకు గలుగవలసినది కాదనియు, సర్వదా ఇప్పటికే మన కున్న దనియు, నిరంతరము జ్ఞప్తియం దుంచుకొనవలెను. మనము బద్ధుల మనుకొను ప్రతి తలంపును భ్రమయే. మనము సుఖముగానున్నా మనియో, కష్టపడుచున్నా మనియో అనుకొను ప్రతితలంపు నొక మహా భ్రాంతియే; మఱొకభ్రమకూడ కలుగును — 'మనము ముక్తుల మగుటకు కృషిచేయవలసియున్న' దని, 'ఉపాసనచేయవలసియున్న' దని, 'శ్రమపడి సాధనచేయవలసియున్న' దని. ఈ భ్రమ మొదటి భ్రమను పోగొట్టును. తరువాత రెండును పోవును.

నక్క మిక్కిలి అపవిత్రజంతువు అని మహమ్మదీయులును, హిందువులును భావింతురు. అటులనే కుక్క ఆహారపదార్థము నేకొంచెము ముట్టుకొనినను దాని నంతను పాఱవేయవలసిన దే. దానిని మనుష్యు డెవ్వడును తిన రాదు. ఒకానొక మహమ్మదీయునియింట ఒకనక్క చొరబడి బల్లమీాద ఉన్న ఆహారములో నుండి కొంచెము కైకొని, తిని, పాఱిపోయినది. అతడు నిఱుపేద. తనకై చాల చక్కనిభోజనమును సిద్ధముచేసికొనెను. అది మైలపఱుపబడినది. దానిని అతడు తినకూడదు. అత డంతట పురోహితుడగు ముల్లాయొద్దకు బోయి, "నా కిట్లైనది; నక్క వచ్చి నా భోజనమునుండి ఒక కబళమును కఱచుకొని పోయినది. కర్తవ్య మేమి? నేను విందుభోజనము సిద్ధముచేసికొని, భుజింపవలె నని ఎంతో ఆశతో నుంటిని. నక్క వచ్చి దాని నంతను పాడుచేసినది" అని చెప్పెను. ముల్లా నిమిష మాలోచించెను. ఒక్క ఉపాయముమాత్రము అతనికి స్ఫురించెను. అత డిట్లనెను: "ఇందు కొక్క మార్గమే ఉన్నది. ఒకకుక్కను తెప్పించి, దాని చేతకూడ ఆ పళ్లెములోని ఆహారము కొంచెము తినిపింపు.

కుక్కలకు నక్కలకు నిత్యవైరము కదా. నక్క తినగా మిగిలిన ఆహారము నీకడుపులోనికి పోవును. కుక్క తినగా మిగిలిన ఆహారముకూడ నీకడుపులోనికి పోవును. రెండును అక్కడ పవిత్రితము లగును." మనము చాలవఱకు ఈ స్థితిలోనే ఉన్నాము. మన మసంపూర్ణుల మనుకొనుట భ్రాంతి; మనము పరిపూర్ణుల మగుటకు సాధనచేయవలె ననుకొను మఱొక భ్రాంతియు మనము వహింతుము. అంతట ఒకటి మఱొకదానిని తఱిమివేయును. ముల్లు తీయుటకు ముల్లు నుపయోగింతుము. తరువాత రెంటిని పాఱవేయుదుము. కొందఱకు "తత్త్వమసి" అన్న మాట వినుటయే చాలు. జ్ఞానము కలుగును. మెఱపువలె ఈ జగత్తు అదృశ్య మగును. యథార్థతత్త్వము ప్రకాశించును. ఈ బంధ భ్రాంతిని తొలగించుకొనుటకు కొందఱు చాల శ్రమపడవలసి యుండును.

మొదటి ప్ర యిది జ్ఞానయోగులు కాగల అధికారు లెవరు? ఆవశ్యకము లైన ఈ క్రింది లక్షణములు గల వారు అధికారులు:— మొదటిది: కర్మఫలత్యాగము, ఈజీవితము లోను, తరువాతి జీవితములోనుగూడ భోగములపట్ల వైరాగ్యము. నీవు జగత్కర్త వయినచో కోరిన దెల్ల నీకు తప్పక లభించును, నీకు వలసిన వానిని నీవే సృష్టించుకొందువు. ఎప్పుడు లభించు ననుటొక్కటే ప్రశ్న. కోర్కెలు కొందఱకు వెంటనే ఫలించును; కొందఱకు వారి పూర్వసంస్కారములు కోర్కెలసాఫల్యమునకు ప్రతిబంధకములుగా నిలుచును. ఈ జీవితములోనో మఱొక జీవితములోనో మనకు వలసిన భోగములకు ప్రప్రథమస్థానమిత్తుము. జీవితము కల దనుమాటనే నిరాకరింపుము. ఏల యన జీవితము మృత్యువునకు మఱియొక పేరుమాత్రమే. నీవు జీవించియున్నావను విషయముఃనే 'లేదు పో' మ్మనుము. జీవితము ఎవరికి లక్ష్యము? జీవితము ఈ భ్రమలలో నొక్కటే. దానికి జోడు మృత్యువు. ఈ భ్రాంతులలో మోద మొకభాగము, ఖేద మొక భాగము.

C. P. BROWN
MEMORIAL LIBRARY
Acc No. 03
Date
CUDDAPAH.



ఇదియే క్రమము. జీవితముతోగాని మృత్యువుతోగాని నీ కేమి పని? ఇ వన్నియు మనఃకల్పితములు. ఈ జీవితములోను, తరువాత జీవితములోను భోగవాంఛలను విసర్జించుట యనగా నిదియ్యే.

పిమ్మటిది మనస్సంయమము. అందు పెక్కు కెరటములు లేవ కుండునట్లును, అన్ని విధములగు కోర్కెలును కలుగ కుండునట్లును మనస్సును శాంతింప జేసికోవలె. వెలుపలి కారణములచేతగాని లోపలికారణములచేతగాని మనస్సు చీలికలై చెదరిపోకుండ దానిని నిశ్చలముగ నిల్పుకోవలె. సంకల్పబలముచేత మనస్సును సంపూర్ణముగా స్వాధీనముచేసికొనవలె. జ్ఞానయోగి ఏ భౌతికసహాయములనుగాని, మానసికసహాయములనుగాని అవలంబింపడు. కేవలము తత్త్వవిచారము, వివేకము, తన సంకల్పము అను ఈ యుపకరణములనే అతడు నమ్మును. తరువాత కావలసిన లక్షణము తితిక్ష, ఓర్పు, గొణుగక నిందింపక సకల కష్టములను భరించుట. ఏదేని హాని కలిగినప్పుడు దానిని లక్ష్య పెట్టకు. బెబ్బులి వచ్చినచో అచ్చటనే నిలబడుము. ఎవడు పాఱిపోవును? తితిక్ష సాధనచేసి, అందు ఉత్తీర్ణులగు వారు కలరు. భారతదేశములో మండువేసంగిలో గంగానదిగట్టున గాఢనిద్ర చెందువారు గలరు. శీతకాలమున దిన మంతయును గంగాజలములలో తేలియాడువారును గలరు; వారి కివేమియు లక్ష్యము లేదు. హిమాలయపర్వతముల మంచున కూర్చుండి దుస్తు లేమియు ధరింపక నిర్లక్ష్యముగ నుండువా రున్నారు. వేడి ఏమి? చలి ఏమి? ఏమైన రానిమ్ము. పోనిమ్ము. దానితో నాకేమి? నేను దేహము కాను కదా. ఈ విషయ మీపాశ్చాత్యదేశములవారు నమ్ముట కష్టము. కాని, ఇట్లు చేయువా రున్నా రని తెలిసికొనుట మంచిది. ఫిరంగి ఎదుటికి దుముకు సాహసమును, రణరంగములోని కుఱుకు సాహసమును మీప్రజల కున్నట్లే వేదాంతమును భావించు సాహసమును అనుష్ఠించు సాహసమును మావారికి కలదు. అందుకు వారు తమ ప్రాణముల నర్పింతురు. "నేను అఖండ సచ్చి

దానందస్వరూపుడను; సోఽహం, సోఽహం" ఐహిక జీవిత భోగముల కగ్రస్థాన మిచ్చుట పాశ్చాత్త్యుల లక్ష్యమయినట్లే ఆధ్యాత్మికపరతను మహోన్నతరూపమున అగ్రస్థానమున నుంచుట ఆస్తిక్య మనగా రిత్తమాటలు కావనియు దానిని, అందలి ప్రత్యంశమును ఈజీవితముననే సాధించుకొనుట శక్యమనియు చూపుట మాలక్ష్యము. ఇదే తితిక్ష, 'అయ్యో ఇది ఇట్లున్నదే' అని దేనిని గాని నిందింపక సర్వమును భరించుట, "నే నాత్మను; ఈ జగత్తు నా కేమి లక్ష్యము? సుఖము గాని, కష్టము గాని, ధర్మము గాని, అధర్మము గాని, వేడి గాని, చలి గాని నా కేదియు నొక లెక్కలోనిది కాదు." అని చెప్పువారిని నేను స్వయముగా చూచియున్నాను. తితిక్ష అనగా నిదియె గాని ఇంద్రియసుఖముల వెంటబడుట కాదు. మత మనగా నేమి? "ఇది యిమ్ము. అది యిమ్ము." అని ప్రార్థించుటా? ఇవి మతమును గుఱించిన మతిమాలిన ఆశయములు! వీనిని నమ్మువారు దేవునిగుఱించియు, ఆత్మనుగుఱించియు సరిగా నెఱుగరు. "రాబందు ఆకాశములో చాల పైకెగురును. అది ఒక చుక్కవలె మనకు కనబడునంత పైకి పోవును. కాని, దాని చూపు నేలమీది క్రుళ్లిన మృతకళేబరముపైనే ఉండును." అని నా గురుదేవుడు చెప్పుచుండెడివాడు. ఇంతకును మతమును గుఱించిన మీ ఆశయాల పర్యవసానమేమి? వీథు లూడ్చుట, మఱింత భోజనము, దుస్తులు సంపాదించుట యునా? కూడుగుడ్డ లెవరికి లక్ష్యము? అనునిమిషము లక్షలకొలదిగా వచ్చును, పోవును, లక్ష్యపెట్టువా రెవరు? ఈ క్షుద్ర జగములోని సంతోషములను విపర్యయములను ఏల లెక్కచేయుదువు? సాహస మున్నచో దీనిని దాటిపొమ్ము; నియతి నతిక్రమింపుము. అఖిలజగత్తు అదృశ్యము కానిమ్ము. నీ వొక్కడవయి నిలబడుము. "నేను అఖండసత్తు, అఖండచిత్తు, అఖండానందము; సోఽహం, సోఽహం."

# పెక్కుగ కననగు ఒక్కటి

(న్యూయార్కులో 1896 వ సంవత్సరములో చేసిన ఉపన్యాసము)

వివిధములగు యోగము లన్నిటిలోను, వైరాగ్యము పరిపాకమున కందించు మెట్టు. కర్మి, తనకృషిఫలములను పరిత్యజించును. భక్తుడు సర్వశక్తిమంతము, విశ్వవ్యాప్తము నగు ప్రేమ కొఱకు అల్పప్రేమ లన్నిటిని విసర్జించును. యోగి తన అనుభవము లన్నిటిని విడనాడును. ఏల యన ప్రకృతియంతయు ఆత్మానుభవము కొఱకే యున్న దైనను చివర కది అతడు ప్రకృతిలోనివాడు కాడనియు, ప్రకృతికి నిత్యభిన్ను డనియు జ్ఞానము కలిగించు నని యతని సిద్ధాంతము. జ్ఞాని సర్వమును త్యజించును. అతని సిద్ధాంతముప్రకారము ప్రకృతి యెన్నడును లేనే లేదు; పూర్వమును లేదు; ప్రస్తుతమును లేదు; భవిష్యత్తునందు నుండబోదు. ఈ యుదాత్తవిషయములలో 'వీని యుపయోగ మేమి' అని ప్రశ్నించుట పొసగదు, మిక్కిలి అసంగతముగ నుండును; ఒక వేళ ఈ ప్రశ్న వేసినను, సక్రమపరిశీలనవలన ఉపయోగమును గూర్చిన యీ ప్రశ్నయందు మనకు కనబడున దేమి? సౌఖ్యము పొందవలె ననెడి ఆదర్శముప్రకారము తన కేది యెక్కువ సౌఖ్యము కలిగించునో అదియే అతని కెక్కువ ఉపయోగకరము. అంతటి గొప్ప సౌఖ్యము కలిగింపజాలని, అతని భౌతికపరిస్థితులను చక్కబఱుప లేని ఈ యుదాత్తవిషయము లతనికి అంత ఉపయోగకరములు కావు. మానవకోటికి సౌఖ్యము సాధించు టొక్కటే సకలవిజ్ఞానశాస్త్రముల లక్ష్యము; ఏది అధికసౌఖ్యము నిచ్చునో దానినే మానవుడు స్వీకరించి, అల్పసౌఖ్యము నిచ్చెడి దానిని పరిత్యజించును. సౌఖ్య మనునది దేహమునందో, మనస్సునందో, ఆత్మయందో ఏ విధముగా నుండునో మనము గుర్తించితిమి కదా. జంతువులకును, జంతుస్థాయికి దగ్గరగా నున్న నీచమానవులకును

సౌఖ్య మంతయు దేహగతమే. తినుటయందు ఆకొన్న శునకము నకును, తోడేలునకును కలుగునంతటి ప్రీతి ఏ మానవునకును కలుగఁజాలదు. కావున కుక్కకును తోడేలుకును సౌఖ్యమంతయు దేహగతమే. పై మెట్టుకు చెందిన సౌఖ్యము మానవుల యందు కనిపించును. అది మానసికము; జ్ఞాని అనుభవించు సౌఖ్యము అన్నిటికంటె పై మెట్టుది. అది ఆధ్యాత్మికము. తత్త్వజ్ఞునకు ఆత్మజ్ఞానము మహోన్నతప్రయోజనము. ఏల యన, అది యతనికి మహోన్నతసౌఖ్యము నిచ్చును. అతనికి ఇంద్రియ పరితృప్తి గాని, భౌతికవస్తువులు గాని మహోన్నతప్రయోజన కరములు కాజాలవు. ఏల యన అతనికి జ్ఞానమునం దున్నట్టి సౌఖ్యము వానియందు లేదు; ఇంతకును మనకు తెలిసినంతవఱకు జ్ఞానమే ఏకైక గమ్యమును మహోన్నతసౌఖ్యమును. అజ్ఞాన ములో పనిచేయువా రందఱు ఒకవిధముగా విబుధులకై బరువు మోయు జంతువులు. ఇక్కడ విబుధశబ్దము వివేకి యను అర్థ ములో వ్యవహరింపబడినది. శ్రమపడి కృషిచేయువా రందఱికిని యంత్రములవలె పనిచేయువా రందఱికిని నిజముగా జీవితానం దానుభూతి లేదు. నిజమైన యానందానుభూతి గలవాఁడు జ్ఞానియే. ధనికుడు లక్షడాలర్లను కాబోలు వెచ్చించి ఒక చిత్రము కొనును. కాని, దానిని చూచి నిజముగా నానందింపగలవాడు కళావేత్తయే. ధనికునకు కళాజ్ఞానము లేనిచో ఆ చిత్ర మతనికి నిష్ప్రయోజనము. అతడు దానికి సొంతదారు మాత్రమే. లోకములో నెక్కడయి నను సరే, వివేకియే జీవితమాధుర్య మనుభవింపగలవాడు. మూఢున కెన్నడును సుఖానుభవము లేదు. అతడు, తనకు తెలియకే, ఇతరులకొఱకు పనిచేయవలసినవాడే.

ఆత్మ యొక్కటె సద్వస్తు వని, రెండు సత్తు లుండుట పొసగ దని, అద్వైత వేదాంతుల సిద్ధాంతముల నింతవఱకు పరిశీ లించితిమి; ఈ విశ్వమంతటిలోను ఉన్న సత్తు ఒక్కటే అని

మనము గుర్తించితిమి; ఆ సత్తును ఇంద్రియములద్వారమున చూచునప్పుడు దానిని భౌతికప్రపంచ మని పేర్కొందుము. దానినే మనస్సుద్వారమున చూచునప్పుడు 'భావాల ఆశయాల జగ' మని పేర్కొందుము. యథాస్థితముగ చూచినప్పుడు అదే ఏకము అనంతమునగు సత్తు. మీరు జ్ఞప్తియందుంచుకొన వలసినవిషయ మిది: జీవాత్మను వివరించుటకై మాత్రమే అట్టి దొకటి ఉన్నట్లు నేను గణింపవలసివచ్చినది, కాని జీవాత్మ ఏమో లేదు. ఉన్న సత్తు ఒక్కటే. ఆ ఒక్కటియు ఆత్మయే. ఇంద్రియ ములద్వారమున ఇంద్రియకల్పనలద్వారమున చూచినప్పు డాత్మయే దేహ మనబడుచున్నది. భావనాపథమున చూచునప్పు డాత్మయే మన స్సన బడుచున్నది. దాని స్వస్వరూపమున చూచి నప్పు డది యాత్మ, ఏకము అద్వితీయము అగు సత్తు. వివరించు నప్పుడు సౌకర్యార్థము మూడింటిని పేర్కొన్నను, దేహము, మనస్సు, ఆత్మ అను మూడు తత్త్వము లొక్కదానియం దున్న వనుట అర్థము కాదు. కాని, ఉన్న దెల్ల ఆ యాత్మ ఒక్కటే. ఆ ఏకసత్తును ఒకప్పుడు దేహ మని, మ ఱొకప్పుడు మన స్సని, వేఱొకప్పుడు ఆత్మ యని దృక్కోణభేదముల కనుగుణముగా వ్యవహరించుచున్నాము. ఉన్న తత్త్వ మొక్కటే. దానినే అజ్ఞానులు జగ త్తందురు. ఎఱుకలో పై మెట్టందుకొన్నవారు దానినే భావ జగ త్తందురు. జ్ఞానము కల్గిన పిదప సకలభ్రమలు పటాపంచలయిపోవును; అదంతయు ఆత్మయే కాని మఱేమియు కా దని మానవుడు గుర్తించును. ఆ ఏకసత్తు నేనే. ఇదియే తుది నిర్ణయము. జగములో మూడు లేవు, రెండు లేవు; ఉన్న దెల్ల నొక్కటే. ఆ ఒక్కటే మాయాప్రభావమువలన పెక్కుగా చూపట్టుచున్నది, త్రాడు పామువలె చూపట్టునట్లు. పాముగా కనబడుచున్నది త్రాడే. త్రాడు వేఱుగా, పాము వేఱుగా— రెండు వస్తువులు లేవు. ఏకకాలమునం దీ రెండువస్తువులను చూచెడి వా రెవరును లేరు. ద్వైతము, అద్వైతము అనునవి

చక్కని వేదాంతపారిభాషికపదములె. కాని, సమ్బదలట సత్యమును మిథ్యయు ఏకకాలమున మన కెన్నడును కనబడవు మన మందఱము పుట్టుకతోనే అద్వైతులము. మఱొకటి యగుట మన తరము కాదు. సర్వదా మనము ఏకమునే చూతుము. త్రాడును చూచునప్పుడు పామును చూడనే చూడము; పామును చూచునప్పుడు త్రాడును చూడనే చూడము — అది యదృశ్య మైనది. మిథ్యను చూచునప్పుడు నీవు తథ్యమును చూడనే చూడవు. దూరమునుండి వచ్చుచున్న నీ మిత్రుని వీథిలో చూతు వనుకొనుము; నీ వతనిని బాగుగా నెఱుగుదువు. కాని, మంచు వలన చూపు సరిగా ఆనక నీ వత డెవరో అనుకొందువు. నీ మిత్రుని మఱెవరో వ్యక్తిగా, నీవు భ్రమించినప్పుడు నీమిత్రుని చూడనే చూడవు. అత డదృశ్యుడయినాడు. నీవు చూచుచున్న దొక్కనినే. నీ మిత్రునిపేరు "అ" అని అనుకొందము. కాని, "అ" ను "ఇ" గా భ్రమించునప్పుడు "అ" ను చూడనే చూడవు. "అ" ను చూచునప్పుడు కాని "ఇ" ని చూచునప్పుడు కాని నీ వొక్కనినే చూతువు. నిన్ను నీవు దేహముగా చూచు నప్పుడు నీవు దేహమే గాని మ ఱేమియు గాదు; మానవకోటిలో అత్యధికసంఖ్యాకుల చూపు అదే. 'ఆత్మ' అని, 'మనస్సు' అని యింక నీ విషయాల గూర్చి వారు మాటాడ వచ్చును. కాని, వారు చూచునది స్పర్శ, రుచి, చూపు మున్నగా భౌతికరూపమే. కొందఱు మాత్రము తమ మెలకువ దశలలో కొన్నిటిలో తమ్ము మనస్సుగా దర్శింతురు. సర్హం ఫ్రీడే వీని గుఱించి చెప్పు కథ మీకు తెలియును కదా. నవ్వించు వాయువు [లాఫింగ్ గాస్] తో అతడు తన విద్యార్థుల సమక్షములో ప్రయోగము (ఎక్స్పెరిమెంటు) చేయుచున్నాడు. ప్రమాదవశమున ఒక గొట్టము పగిలిపోయినది. దానినుండి వచ్చుచున్న వాయువు నతడు పీల్చెను. కొన్ని నిమిష ములనే పతడు శిలాప్రతిమవలె నిలబడి పోయెను. తరువాత అతడు తన విద్యార్థులకు 'ఆస్థితిలో నాకు ప్రపంచమంతయు సంక

ల్పాల నిర్మాణముగా స్పష్టముగా కనన య్యె' నని చెప్పెను. ఆ వాయువు తాత్కాలికముగా నతనికి దేహస్మృతి లేకుండ చేసెను. దేహముగా నతని కనిపించుచుండినదే సంకల్పముగా కనబడ నారంభించెను. చేతన, మఱికొంత మైమెట్టు కెక్కినచో, ఈయల్ప క్షుద్రచేతన శాశ్వతముగా తొలగిపోయినచో, దాని వెనుక నున్న సత్యము ప్రకాశించును. అది అఖండసచ్చిదానందమనియు ఏకాత్మ యనియు విశ్వవ్యాప్తమనియు మనము గుర్తింతుము. "జ్ఞానస్వరూప మైన యేకము. ఆనందస్వరూపమైన యేకము. నిరుపమానము; నిరవధికము, నిత్యముక్తము; సర్వదా బంధరహితము; ఆకసము వలె ననంతము; ఆకసమువలె నిర్వికారము; ఆ ఏకతత్వము ధ్యానదశలో నీహృదయములో తన్ను చూపుకొనును."

స్వర్గనరకములును, అన్నిమతములందును గల యిట్టి యనేకాశయములను అద్వైతి ఎట్లు సమర్థించును? నరుడు మరణించిన పిదప స్వర్గమునకో, నరకమునకో, ఇక్కడికో, అక్కడికో పోవు నని, లేదా—స్వర్గములోనో, మఱొక లోకము లోనో మ తెక్కడనో వేఱొక దేహముతో మరల జన్మించు నని చెప్పబడుచున్నది. ఇ వన్నియు భ్రమలు. నిజమున కెవ్వరును ఏనాడును పుట్టుటయు లేదు, గిట్టుటయు లేదు; స్వర్గమును లేదు, నరకమును లేదు, ఈ లోకమును లేదు; నిజమున కీ మూడును ఎన్నడును లేవు. బాలునికి దయ్యముల కథలు చెప్పుము. సాయంకాల మతనిని వీథిలోనికి పోనిమ్ము. కొంతదూరములో నున్న చెట్టుమొద్దును చూచి అత డే మనుకొనును? చేతులు చాచుకొని తన్ను మ్రింగ సిద్ధముగ నున్న భూత మనుకొనును. ప్రేయసిని కలసికొన గోరి వీథి చివరనుండి వచ్చుచున్న వ్యక్తి ఆ మ్రానును చూచి తన ప్రియురా లని భ్రమపడును; దూరమునుండి వచ్చుచున్న రక్షకభటుడు దానిని చూచి చోరు డని భ్రాంతిచెందును. చోరుడు దానిని చూచి రక్షకభటు డనుకొనును. ఇన్ని విధము

లుగా అగపడుచున్న దా ద్రమానే. ద్రమాను మాత్రమే నిజము. అది ఏమేమిగా అగపడినదో అవెల్ల వారి వారి మనఃకల్పనలు. ఉన్న సత్తు ఒక్కటే. అది ఆత్మ, అది వచ్చునది కాదు, పోవునది కాదు. మానవు డజ్ఞానిగా నున్నప్పుడు స్వర్గమునకో, మఱెక్కడికో పోవలె నని కోరుచుండును. బ్రతికినన్నినాళ్లు అతడు దీనినే తలపోయుచుండును. భూలోకస్వప్నము తొలగి పోగానే ఈలోకమే అతనికి స్వర్గముగను ఇందు దేవతలును, దేవదూతలును ఇటు అటు పర్వుచున్నట్లును — ఇంకను అట్టి దృశ్యము లెల్ల కననగును. తనతాతముత్తాతలను చూడవలె నని జీవితకాలమంతయు తీవ్రముగా కాంక్షించువానికి ఆదామునుండి తనపూర్వులందఱును కనబడుదురు. ఏల యన వారి నందఱి నతడే సృష్టించుకొనును. అజ్ఞానము మఱింత ఎక్కువగా గల మానవుడు నరకమునుగూర్చి అచటి అన్నిరకాల శిక్షలనుగుఱించి స్వప్నములు కలిగించి మతదురభిమానులు పుట్టించిన భయమునకు లోనై చనిపోవు నేని ఈలోకమే అతనికి నరకముగా కనబడును. మరణము, పునర్జన్మము అనుమాటల కర్థము దృగ్గోచరమగు దాని ఉపరిభాగమున కలుగు మార్పులే. నీవును చలింపవు. దేనిపై నీచూపును పాఱింతువో అదియును చలింపదు. నీవు నిత్యుడవు, నిర్వికారుడవు. నీవు వచ్చుటయు పోవుటయు ఎట్లు పొసగును? అది యసాధ్యము; నీవు విశ్వవ్యాపివి. ఆకాశ మెప్పుడును కదలదు. దానిపై మబ్బులు మాత్రమే కదలును. ఆకాశమే కదలుచున్నట్లు మన మనుకొనవచ్చును. రైలులో పోవునప్పుడు భూమి కదలుచున్నట్లు తోచును. అదేమో కదలుట లేదు. పోవుచున్నది రైలే కదా. నీ వున్నచోటనే ఉన్నావు; ఈస్వప్నములు; ఈ వివిధమేఘములు మాత్రమే కదలును. సంబంధము లేకుండ ఒకస్వప్నము వెంబడి మఱొకస్వప్నము వచ్చుచుండును. జగత్తులో నియమము గాని, లంకె గాని లేదు. ఎంతో సంబంధ మున్నట్టు మన మనుకొనుచున్నాము. మీ రందఱును

ఆలిస్ ఇన్ వండర్లాండ్ చదివియే యుందురు. బాలబాలికలకై ఈ శతాబ్దములో రచింపబడిన పుస్తకములలో నెల్ల అది నిరతిశయాద్భుతమైనది. దానిని నేను చదివినప్పుడు మిక్కిలి యానందించితిని; బాలబాలికలకొఱకు అటువంటి పుస్తకము రచింపవలెనను తలంపు నాకు సదా ఉండెడిది. దేనిని మీరు మిక్కిలి అసంబద్ధమని ఒకదానితో నొకటి అతుకని దని భావింతురో అదే నా కెక్కువ ప్రీతిని కలిగించినది. ఒక భావము కలుగును. అది మఱొకభావములోనికి దుముకును. ఈ రెంటికి సంబంధ మేమియు ఉండదు. మీరు చిన్నతనములో అదేమో పెద్దసంబంధ మనుకొంటిరి. ఈ గ్రంథకర్త పసితనపు తలంపుల నన్నిటిని మరల మనసుకు తెచ్చుకొన్నాడు. శిశువుగా నున్నప్పుడు తన దృష్టిలో అవి పరస్పరము చక్కని సంబంధము గలవే. వానితో ఇప్పు డీ గ్రంథమును పిల్లలకై వ్రాసెను. తమ భావముల బాలబాలికలచేత భ్రమింగించుటకు జనులు రచించు పుస్తకము లన్నియు పనికిమాలినవి. మనమును పెద్దపెరిగిన బాలురమే. అంతె. జగము ఎప్పటి అసంబద్ధమైనదే — ఆలిస్ ఇన్ వండర్ లాండ్ — దేనికిని మఱిదేనితోను ఎట్టి సంబంధము లేదు. సంఘటనలు ఒకానొకవరుసలోనే అనేకపర్యాయములు జరుగుట మనము చూచినప్పుడు వానిని కార్య కారణము లందుము. ఆ సంఘటన మరల జరుగు ననియు చెప్పుదుము. ఈ స్వప్నము పోగానే దానిస్థానము నాక్రమించు మఱొక స్వప్నములోకూడ ఇంత గట్టిసంబంధ మున్నట్టుగానే కనబడును. కలకనుచున్నప్పుడు మనకు కననగు సంభవము లన్నియు పరస్పరసంబంధము కలవిగానే తోచును; స్వప్నావస్థలో అవి సంబంధములేని వని మన మనుకొనము. జాగ్రదవస్థకు వచ్చిన తర్వాత చూతుమేని వాని అసంబద్ధత కనిపించును. ఈ జగము అనెడి స్వప్నమునుండి మనము మేల్కొని, దీనిని పరమార్థముతో పోల్చినప్పుడు అదంతయు సంబంధము లేనిదిగా, అర్థము లేనిదిగా, ఒకదానికి మఱొక

దానికి సంబంధము లేని దేదో మన ముందు సాగిపోవుచున్నట్టుగా కనబడును. ఎటనుండి ఎటకు పోవుచున్నదియు మనకు తెలియదు. కాని, దానికి ముగింపు కల దని మనకు తెలియును; దీనికే మాయ అని పేరు; ఇది ఉన్నిమొత్తమును బోలుచు నిలుకడలేని మబ్బుల వంటిది. అది పరిణామశీలమగు ఈ జగత్తును సూచించును. మార్పుచెందని సూర్యుడవు నీవు. నిర్వికారమగు ఆ సత్తును వెలుపలనుండి చూచినప్పుడు దానినే నీవు దేవు డందువు; లోపలి నుండి చూచినప్పుడు దానినే నీ ఆత్మ అందువు. అది ఒక్కటే. నీకంటె, నిజమైన 'నీకంటె భిన్నుడగు దేవుడు లేడు. నీకు పై బడిన దేవుడును లేడు. నీముందు, వేల్పు లందఱును క్షుద్రులే. దేవుని గుఱించిన, స్వర్గలోకమందున్న జనకుని గుఱించిన, భావము లన్నియు, నీ ప్రతిబింబములే. అసలు దేవుడే నీ ప్రతిబింబము. "దేవుడు మానవుని తన పోలికలతో సృజించెను." అన్న మాట తప్పు. మానవుడే దేవుని తన పోలికలతో సృజించుకొనెను. అనుట ఒప్పు. విశ్వ మంతటను మనము మనకు ప్రతిరూపములుగా వేల్పులను సృజించుకొనుచున్నాము. మనమే దేవుని సృజించి, అతని కాళ్లమీద పడి పూజింతుము; ఈస్వప్నము కలిగినప్పుడు మనము దానికి ప్రియపడుదుము!

ఇది గ్రహింపతగిన చక్కని అంశము — ఈయుపన్యాస సారాంశము ఉన్న సత్తు ఒక్కటే అని. ఆ ఒక్క సత్తును వివిధ నిర్మాణములగుండ చూచునప్పుడు భూమిగానో, స్వర్గముగానో, నరకముగానో, దేవతలుగానో, దయ్యములుగానో, మానవులు గానో, రాక్షసులుగానో, జగముగానో ఈయన్నిగానో కనబడు చున్నది. ఈ యన్నిటిలోను "ఎవ రీ మృత్యుసాగరమున ఆ ఒక్కనిని దర్శింతురో, తేలియాడుచున్న ఈవిశ్వములో ఆ ఏకైక ప్రాణమును కనుదురో, నిర్వికారమగు ఆ ఏకతత్త్వమును సాక్షాత్కరింపజేసికొందురో వారికే శాశ్వతశాంతి లభింపగలదు.

తదన్యులకు కాదు, తదన్యులకు కాదు.'' ఈ ఏకసత్తును సాక్షాత్కరింపజేసికొనవలె. ఏవిధముగా అనునదే తరువాత ప్రశ్న. దానిని సాక్షాత్కరించుకొను టెట్లు? ఈ స్వప్నము నెట్లు ఛేదింపనగును? మనము క్షుద్రమానవుల మని క్షుద్రమహిళల మని ఇంకను ఇట్టి భావములు గల స్వప్నమునుండి మేల్కొను టెట్లు? మనము విశ్వమందలి అఖండసత్తుగా మన మీ యల్పజీవుల ముగా భౌతికరూపము దాల్చితిమి. పురుషులము, స్త్రీలము అయితిమి. ఒకని తియ్యని మాటపైనో, మఱొకని ఆగ్రహవచనము పైనో ఆధారపడవలసినవార మయితిమి. ఎంతటి ఘోర పరాధీనత యిది? ఎంతటి దారుణ దాస్య మిది? నేను సుఖదుఃఖాతీతుడను. నా ప్రతిబింబమే ఈ యఖిలవిశ్వము. ఈ సూర్యులు, ఈ చంద్రులు, ఈ నక్షత్రములు నా జీవితభాగములే — ఘోర దాస్యమున నే నణగి యున్నాను! నీవు నా దేహము గిల్లినచో నేను బాధపడుదును. ఎవ రయిన ఒక మంచి మాటచెప్పినచో నేను పొంగిపోదును. నాస్థితి చూడుడు. శరీరమునకు బానిసను, మంచిమాటకు బానిసను, చెడ్డమాటకు బానిసను, ఆవేశమునకు బానిసను, సౌఖ్యమునకు బానిసను, జీవితమునకు బానిసను, మృత్యువుకు బానిసను, సర్వమునకు బానిసను. ఈ దాస్యమును ఛేదింపవలె. ఎట్లు? ''ఈయాత్మ తొలుత శ్రోతవ్యము. తరువాత మంతవ్యము. పిమ్మట నిదిధ్యాసితవ్యము,'' అద్వైతజ్ఞాని అనుసరించు మార్గ మిది. సత్యమును తొలుత వినవలె. తరువాత దానిని గుఱించి మననము సేయవలె. అనంతరము దానిని సదా ప్రతిపాదింపవలెను. ''నేను బ్రహ్మమును'' అని నిరంతరము భావింపుము. ఇందుకు భిన్నమగు ప్రతిభావమును దౌర్బల్యము కలిగించెడి దని మనము త్రోసిపెట్టవలె. మీరందఱు పురుషు లనెడి, స్త్రీ లనెడి ప్రతి తలంపును విడనాడుడు. దేహమును పోనిండు. మనస్సును పోనిండు. దేవతలను పోనిండు. దయ్యములను పోనిండు. ఆ ఏకసత్తు దక్క తక్కినదెల్ల పోనిండు. ''ఎందు ఒకరు మఱొక

రిని విందురో, ఒకరు మఱొకరిని కందురో అది క్షుద్రదశ; ఎందు ఒకరు మఱొకరిని వినరో, ఒకరు మఱొకరిని కనరో అది అనంత దశ.'' జ్ఞాతయు జ్ఞేయమును ఐక్యము పొందు మెట్టు అన్నిటికంటె పైది. నేనే శ్రోతను, వక్తను, నేనే గురువను, శిష్యుడను, నేనే స్రష్టను, సృష్టిని — అయినప్పుడే భయము అంతరించును; మనలను భయపెట్టుటకు మఱొక రెవ్వరును లేరు. నేను తక్క మఱేదియు లేదు. న న్నేది భయపెట్టగలదు? ఇది మన మను దినము వినుచుండవలసినది. తక్కిన తలంపు లన్నిటిని వదలించుకోవలె. తక్కిన దంతను ఆవలికి త్రోసివేయవలె. నిరంతరము వల్లించుచుండవలసినది దీనినే. హృదయమున కెక్కునంతవఱకును, ప్రతినరమును ప్రతి కండరమును ప్రతిరక్తబిందువును 'సోఽహం' అను ఆశయముతో ఝల్లు మను వఱకును వీనులగుండ పోయుచుండవలసినది దీనినే. మృత్యుముఖమునకూడ 'సోఽహం' అని వక్కాణింపుము. భారతదేశములో ఒక ఆయన, ఒకసన్న్యాసి యుండెను. అతడు ''శివోహం''—''నేను నిత్యానందుడ'' నని సదా చెప్పుచుండును—ఒకనాడు బెబ్బులి అతనిపై దుమికి దూరముగా ఈడ్చుకొని పోయి చంపివేసెను; అతనికంఠములో ప్రాణమున్నంతవఱకు ''శివోహం'', ''శివోహం'' అన్న శబ్ద మతని నుండి వినవచ్చుచునే యుండెను. మృత్యుముఖమున, మహాపత్సమయమున రణరంగమధ్యమున, సాగరగర్భమున, మహోన్నత పర్వతాగ్రములందు, కీకారణ్యమున ''సోఽహం'', ''సోఽహం'' అని ని న్నుద్బోధించుకొనుము. దివారాత్రములు ''సోఽహం'' అని చెప్పుచుండుము. అదియే మహిమ్మమైన బలము, అదియే ఆస్తికధర్మము. 'నాయ మాత్మా బలహీనేన లభ్యః' 'బలహీను డాత్మసిద్ధి నొందజాలడు' ''ఓభగవంతుడా, నేను మహాపాపిని.'' అని ఎప్పుడును అనకు. నీ కెవరు సాయముచేయుదురు? నీవే లోకమునకు సహాయుడవు. ఈవిశ్వములో నీకు సాయపడగలిగిన దేది? నీకు సాయపడగల మానవుడు గాని, దానవుడు గాని, దేవుడు

గాని ఏడీ? నిన్ను లొంగదీయ గలిగిన దేది? నీవే జగదీశ్వరుడవు; ఎచట నీవు సాయ మన్వేషించుట పొసగును? నీలో నుండి కాక వేఱెట నుండియు సాయ మెప్పుడును రాలేదు. నీవు చేసిన ప్రార్థన ఫలించినప్పు డెల్ల మఱెవరో ఫలింపజేసినట్టు నీ అజ్ఞానములో నీ వనుకొంటివి. నీకు తెలియదు కాని నీ ప్రార్థనను ఫలింపజేసికొన్నది నీవే. నీనుండియే సాయము లభించినది. ఎవరో సాయ మంపుచుండి రనుట నీ వెఱ్ఱి ఊహ. నీకు తోడ్పడువా రెవ్వరును నీకు వెలుపల లేరు; విశ్వసృష్టికర్తవు నీవే. పట్టుపురుగువలె నీ చుట్టును నొక ఆవరణమును కట్టుకొంటివి. నిను రక్షించు వా రెవ్వరు? నీ ఆవరణమును భేదించుకొని, చక్కని సీతాకోక చిలుకవలె, ముక్తాత్మగా వెలువడుము. అప్పుడే నీకు సత్యము ప్రత్యక్ష మగును. సదా, 'సోఽహం' అని నీకు నీవు చెప్పుకొను చుండుము. నీ మనస్సులో నున్న త్రుప్పును భస్మముసేయు పలుకు లివి; ఇదివఱకే నీలో నున్న మహాద్భుతశక్తిని, నీహృదయమందు నిద్రాణమైయున్న అనంతశక్తిని బహిర్గత మొనర్చు పలుకు లివి. ఈ శక్తిని బహిర్గతము చేయునది నిరంతర పరమార్థశ్రవణము తప్ప వేఱేదియు కాదు. దౌర్బల్యపు తలంపు గలట్టియే చోటునుగాని సమీపింపకుము. నీవు జ్ఞానివి కాగోరితివేని క్లైబ్యమును పూర్తిగా విడువుము.

సాధన ప్రారంభించుటకు పూర్వము నీ మనస్సులోని సకల సంశయములను తుడిచివేసి కొనుము. పోరాడుము, తర్కింపుము, వాదింపుము; సత్య మిదియే, ముమ్మాటికి నిదియే గాని మఱొకటి కా దని నీ మనస్సున స్థిరపఱచుకొన్న పిమ్మట, ఇక వాదింపకు, నోరు మూసికో. నీవును వాదింపకు, ఒరుల వాదాలను వినకు. ఇక వాదము లెందుకు? నిన్ను నీవు సంతృప్తిపఱచుకొంటివి. సమస్యను నీవు పరిష్కరించుకొంటివి. మిగిలిన దేమి? ఈ సత్యము నిప్పుడు సాక్షాత్కరించుకొనవలె. కనుక ఇక రిక్తవాదములతో అమూల్యమగు కాలము నేల వ్యర్థపఱచుకొందువు? ఇప్పుడు పర

మార్గమును మననముచేయవలె. బలావహములైన ఆశయముల నెల్ల అవలంబింపవలె. క్లైబ్యకారకమగు ప్రతితలంపును విసర్జింపవలె. భక్తుడు రూపములను ధ్యానించును, విగ్రహములను ధ్యానించును. అట్టివాని నన్నిటిని ధ్యానించును, దేవుని ధ్యానించును. ఈక్రమము సహజమైనను ఎక్కువకాలము పట్టునది. యోగి తన దేహములోని వివిధ కేంద్రములను ధ్యానముచేసి, మనస్సునందలి శక్తులను అనుకూలపఱచుకొనును. మనస్సును అసత్తే, దేహమును అసత్తే, అని జ్ఞాని వక్కాణించును. 'దేహము', 'మనస్సు' అను ఆశయములు పోవలె. వానిని తఱిమివేయవలె; కనుక వానిని గుఱించి తలంచుట సాధ్యము. ఒకవ్యాధిని తొలగించుకొన ప్రయత్నించుచు మఱొకవ్యాధిని కలిగించుకొనుటవంటి దది. కనుక అతనిధ్యాన మన్నిధ్యానములకంటె అధిక దుష్కరమైనది, అది (నెగటివ్) వ్యతిరేకరూపమైనది; అతడు వేఱేదియు లేదు పొమ్మనును. మిగిలినది ఆత్మ. ఇది మిాదుమిక్కిలి విభజించిచూచు (అనెలెటికల్) మార్గము. జ్ఞాని, కేవలము విభజించిచూచుశక్తి చేత ఆత్మనుండి జగత్తును చీలదీయగోరును. 'నేను జ్ఞాని' నని చెప్పుకొనుట చాల సుకరమే. కాని, నిజముగా జ్ఞాని యగుట బహు దుష్కరము. "దారి మిగుల నిడివిగలది. ఇది ఇంచుమించు అసిధారపై నడచుటే. అయినను నిరాశ చెందకు. మేల్కొనుము. లెమ్ము. గమ్యము చేరువఱకు ఆగకు." అని వేదములు చెప్పుచున్నవి.

కాగా ఇక జ్ఞాని చేయు ధ్యాన మేమి? నేను దేహము, నేను మనస్సు ఈ మున్నగు తలంపులన్నిటికి అతీతుడు కాగోరును జ్ఞాని. తాను దేహమ నన్న భావమును తఱిమివేయవలె నని అతని ఆశయము. ఉదాహరణకు: "నేను స్వామిని" అనగానే నాకు ఈ దేహమును గుఱించిన తలంపే గల్గును. అప్పుడు నేను చేయవలసిన దేమి? నా మనస్సును గట్టిగా ఒకదెబ్బ కొట్టి, "కాదు, నేను దేహము కాదు. నేను ఆత్మను.' అని హెచ్చ

రింపవలె. వ్యాధి రానీ, అత్యంతఘోరరూపములో మృత్యువే రానీ! లక్ష్యపెట్టువా రెవ్వరు? నేను దేహమును కాను. ఎందుకు ఈ మేనికి సింగారింపులు? భ్రమను మఱొకసారి అనుభవించుటకా? దాస్యమును మఱికొంతకాలము పొడిగించుకొనుటకా? దానిని పోనిమ్ము. నేను దేహమునుకాను.'' ఇదియే జ్ఞాని అవలంబించు మార్గము. భక్తుడి ట్లనును: ''నే నీ సంసారసాగరమును తరించుటకే ఈశ్వరుడు నాకీ దేహము నిచ్చెను. నా ప్రయాణము పూర్తియగువఱకు నేను దానిని పోషించుకోవలె.'' యోగి యిట్లు చెప్పును: ''నేను దారి తప్పక పురోగమించి, తుదకు విముక్తిని పొందవలె. అందుకొఱకే దేహమువిషయమై శ్రద్ధ వహింపవలె.'' జ్ఞానికి తాను దీర్ఘకాలము వేచియుండ జాల ననిపించును. ఈ ముహూర్తములోనే అతడు గమ్యము చేరితీరవలెను. అతడి ట్లనును : ''నేను నిత్యముక్తుడను. నే నెన్నడును బద్ధుడను కాను. నేను ఈ జగత్తునకు నిత్యేశ్వరుడను. నన్నికమీద పరిపూర్ణునిగా చేయువా రెవ్వరు? నేనిప్పటికే పరిపూర్ణుడను.'' పరిపూర్ణుడయినవాని కితరులలో పరిపూర్ణత కనిపించును. అసంపూర్ణత్వము కనిపించెనా, అది అతని మనశ్ఛాయయే. అసంపూర్ణత్వము అతనిలోనే ఉండకున్న అతని కది ఎట్లు కనిపించును? కనుక జ్ఞాని పూర్ణత్వమును గాని, అసంపూర్ణత్వమును గాని లక్ష్యపెట్టడు. అతని కేదియు లేదు. ముక్తుడయినంతనే అతనికి మంచిచెడుగులు కనిపింపవు. పాపపుణ్యము లెవరికి కనిసించును? ఎవరిలో అవి ఉన్నవో, వారికి. దేహ మెవరికి కనిపించును? తాను దేహమ నని ఎవ రనుకొందురో, వారికి. నీ వీ దేహమ వన్న భావము నీకు తొలగినతోడనే నీ కీ జగత్తు అగపడదు; అది శాశ్వతముగా అదృశ్యమై పోవును. తన మతి ప్రత్యయశక్తిచే భౌతికబంధములను విదళించి తన్ను విడిపించుకొనుట - జ్ఞాని లక్ష్యము. ఇది ''నేతి, నేతి''—''ఇది కాదు, ఇది కాదు'' అనెడి మార్గము.



షిల్లాంగ్‌లో శ్రీ వివేకానంద స్వామి 1901

# ఆత్మ తత్త్వము, దాని గమ్యము

మానవుడు మరణముతో అంతరించిపోడన్న యభిప్రాయము మొట్టమొదటినుండి యున్నది. మనుష్యుడు చనిపోయిన తరువాత గూడ ఏదో ఒకటి జీవించియే యుండును, దాని జీవితము కొనసాగుచునే యుండును. ఈ విషయమై బహుప్రాచీనులగు ఈజిప్టు దేశీయులను, బాబిలోనియా దేశీయులను, ప్రాచీన హిందూ దేశీయులను పోల్చి పరికించి వారందఱియొద్దనుండి ఈ యాశయమును గ్రహించుట యుచితమేమో! ఈజిప్టు దేశీయులలోను, బాబిలోనియావారిలోను ఆత్మను గూర్చిన ఒక విధమైన ఆశయముండినట్లగపడుచున్నది. అదొక "ప్రేత" మని. వారి యభిప్రాయము ప్రకారము ఈ దేహము లోపల మఱొక దేహము కలదు. దాని సంచారము, దాని పని ఇక్కడే సాగుచుండును; బాహ్యదేహము నశించిన తరువాత రెండవ దేహము బహిర్గతమై కొంతకాలము జీవించియుండును; కాని, బాహ్యదేహ సుస్థితిపై నాధారపడి యున్నది లోపలి దేహ జీవితము. ఏ బాహ్యదేహమునుండి రెండవ దేహము వెలువడినదో ఆ బాహ్యదేహమున నేదేనొక యవయవము గాయపడిన యెడల రెండవ దేహమున కూడ సరిగా అదే అవయవము గాయపడును. అందుచేతనే పరిమళ ద్రవ్యము లలదుట, పిరమిడులు కట్టుట మున్నగు పనులచే శవములను పదిలపఱచుటలో ప్రాచీన-ఈజిప్టు దేశీయులకంత అక్కఱ. కాని, ఈ సూక్ష్మదేహము శాశ్వతముగా నుండునది కాదని బాబిలోనియనులు, ప్రాచీన ఈజిప్టు దేశీయులును భావించి రనుట మనకు స్పష్టము. అది కొంతకాలమే యుండగలదు. ఎంతకాల మనగా బాహ్యదేహము నెంతకాలము సురక్షితముగా పెట్టగలమో అంతకాలము.

మఱొక విశేష మేమనగా — ఈ ప్రేతమునకు సంబంధించిన కొంత భయము వారికి కలదు. ప్రేతమునకు సదా అసుఖమే, దైన్యమే. దాని మనుగడ ఆత్యంతిక బాధామయము. అది మాటిమాటికి జీవులయొద్దకు వచ్చి, తన కిక అలభ్యములైన ఆహారపానీయములను,భోగములను కోరుచుండును. త్రాగుటకు తన కిక లభ్యముకాని నైలునదీజలమును నిర్మలజలమును వాంఛించుచుండును. ఇక్కడ జీవించినప్పుడు తాను భుజించుచుండిన ఆహారపదార్థములను మరల తినగోరును. అవి తనకు లభింపవని తెలిసినప్పుడు అది భీకరమగుచుండును. తన కాయాహారముల నందజేయని యెడల ఆపదలు కలిగింతునని, ప్రాణము తీయుదునని అది బ్రతికియున్నవారిని భయపెట్టుచుండును.

ఆర్యుల ఆశయములను పరిశీలించినచో, అది ఇంతకంటె అత్యంతము భిన్న మని వెంటనే స్పష్ట మగును. వారికిని 'ప్రేత' భావము కలదు. కాని అ దొక విధమగు ఆధ్యాత్మిక దేహముగ నైనది; ఒక గొప్ప భేద మిది: దానిని ఆధ్యాత్మిక దేహ మను పేరుతోనో, ఆత్మ అను పేరుతోనో, మఱే పేరుతోనో వ్యవహరింపుడు. దానిజీవితము భౌతిక దేహమును విడుచుటతో ఆగిపోదు. పైగా, దానికి ఈ దేహము నుండి విముక్తి కలిగినది. కనుకనే ఆర్యులలో మృతకళేబరమును దహనము చేసెడి ప్రత్యేకాచారము కలిగినది. జీవుడు విడిచిన దేహమును ఉండనీయరాదని వారి కోరిక. దానికి పరిమళద్రవ్యములను రాచియు దానిని భూస్థాపితము చేసియు దానిపై పిరమిడులు కట్టియు పదిలపఱుపవలె నని ఈజిప్టుదేశీయుల యభిమతము. మృతకళేబరములను పాఱవేసెడి అత్యంత ప్రాచీనాచారము అటుండ నిండు. కొంత అభివృద్ధి జెందిన దేశీయులలో మృతకళేబరములను దహించెడి విధానము కలదు గదా. 'ఆత్మ ఉన్న'

దనెడి వారి యాశయమునకు ఆ విధానము గొప్ప సూచకము. వీడిపోయిన ఆత్మకు మృతదేహమునకు సన్నిహితసంబంధము కల దన్న అభిప్రాయ మున్న వారిలో దేహమును భద్రపఱుచుట యందు శ్రద్ధ సదా కననగుచున్నది. దేహమును భూస్థాపిత మొనర్చు నాచార మేదో ఒకరూపమున కననగుచున్నది. ఆత్మ దేహమునకంటె పూర్తిగా వేఱైన దనియు, కళేబరమును నాశనము చేసినప్పటికిని ఆత్మ కెట్టి సేగియు లే దనియు నమ్మకము పెంపొందినట్టి ప్రజలలో దహనసంస్కారమే ఆచారముగ నున్నది. కావుననే, పార్సీలుమాత్రము మృతకళేబరములను బురుజులపై పాఱవేయు నాచారమునకు మాఱినను, ప్రాచీనార్యజాతు లన్నిటను శవమును దహించు ఆచారమే కననగుచున్నది. బురుజుకు ఉన్న పేరు కే (దఖ్మ) దహించుచోటని అర్థము. ఆ యర్థము, పూర్వము శవములను దహనము చేసెడి ఆచారము వారిలోకూడ నుండె నని సూచించుచున్నది. మఱియొక వింత ఏమనగా — ఈ సూక్ష్మశరీరాలనుగూర్చిన ఆర్యుల ఆశయాలలో భయ మేమాత్రమును లేదు. ఆ ప్రేతములు సాయ మడుగుటకో భోజన మడుగుటకో దిగి వచ్చుట లేదు. సాయము లేదు పొమ్మన్నప్పుడు అవి భయంకరము లగుట గాని, బ్రతికియున్న వారిని చంపుటకు ప్రయత్నించుట గాని లేదు. మీదు మిక్కిలి దేహబంధమునుండి విముక్తి చేకుఱినందుకు అవి సంతోషపూర్ణములుగ నుండును. సొదనిప్పు లయచిహ్నము. ప్రేతాత్మను పితృదేవత లున్న చోటికి, దుఃఖములేనేలేక నిరంతరము ఆనందమే యుండుచోటికి గొనిపోవలసిన దని అగ్ని ప్రార్థింపబడును.

ఈ రెండు ఆశయాల స్వరూపము పరస్పరసదృశమైన దనుట మనకు తత్క్షణమే స్పష్టమైనది. ఒకదానిలో ఆశావాదము (ఆప్టిమిసము) ఉన్నది. మఱొకదానిలో నిరాశ (పెసిమిసము) కలదు. ఇది ప్రాథమికదశ. రెండవదాని పరిణతరూపమే

మొదటిది. ఈజిప్టుదేశమువారి కున్న యీ యభిప్రాయము బహు ప్రాచీనకాలమున ఆర్యులకే యుండియుండవచ్చును. వారి మిక్కిలి పురాతన గ్రంథముల పరిశీలింపగా వారి కట్టి యభిప్రాయ ముండియుండుట సుసంభవమే అనుట స్పష్టమగును. కాని అది మిక్కిలి ఉజ్జ్వలమైనది. తేజోమయమయినది. నరుడు మరణించి నప్పుడు ఆత్మ పితృదేవతలతోగూడియుండుటకు పోయి, వారి సౌఖ్యమునే తానును అనుభవించుచు అట వసించును. పితృదేవత లీ యాత్మను మిక్కిలి కరుణతో ఆదరింతురు; మిక్కిలి ప్రాచీన కాలములో భారతదేశమందు ఆత్మను గుఱించి యుండిన యభి ప్రాయ మిది. ఈ యభిప్రాయము తరువాత తరువాత ఉన్న తోన్నతపరిణామ మొందినది. అప్పుడు తా మంతకుముందు దేని నాత్మ యని పేర్కొనుచుండిరో అది నిజమునకు ఆత్మ కా దని వారికి తెలిసినది. ఈ యుజ్జ్వలదేహము, సూక్ష్మదేహము, ఎంత సూక్ష్మమైన దగు గాక, అ దేమో దేహమే. దేహము లన్నియు సూక్ష్మపదార్థములతోనో, స్థూలపదార్థముతోనో రూపొందవలసినదే. రూపమో, ఆకృతియో కల దెల్ల పరిచ్ఛి న్నమై యుండవలసినదే. కాని నిత్యముగా నుండ జాలదు. ప్రతి రూపమునందును మార్పు అంతర్గతమై యున్నది. పరిణామశీల మైనది నిత్య మెట్లు కాగలదు? కావున ఈ యుజ్జ్వలదేహమునకు వెనుక మఱొకదానిని వారు గుర్తించిరి. అదే మానవుని ఆత్మ. దానిని వారు ఆత్మ యనిరి. ఆత్మ అను ఆశయము అప్పుడు ఆరంభమైనది. ఈ యాశయముగూడ పెక్కుమార్పులకు లోను గావలసివచ్చెను. ఈ యాత్మ నిత్య మయిన దని, అది మిక్కిలి సూక్ష్మ మని, దాదాపు అణువంత సూక్ష్మ మని; అది దేహములో నొకానొక చోట ఉండు నని, మానవుడు చనిపోయినప్పు డది ఉజ్జ్వలదేహమును తనతో కొనిపోవునని — కొంద ఱభిప్రాయ పడిరి. మఱి కొందఱు ఈ యుజ్జ్వలదేహము ఆత్మ కా దని దేనిని

బట్టి చెప్పిరో దానినిబట్టియే ఆత్మస్వరూపము అణువు కాదనియు

ఈ విభిన్నవాదములలో నుండి సాంఖ్యదర్శనము ఆవిర్భవించినది. మన కందు తీవ్రభేదములు కనిపించును. అందలి యభిప్రాయ మిది: మానవునకు ఈ స్థూలదేహ మున్నది; దాని వెనుక సూక్ష్మదేహ మున్నది. అది మనస్సుకు అధిష్ఠానము వంటిది. దానివెనుక 'మనసుకు సాక్షి' యని, ఆత్మ యని సాంఖ్యులు పేర్కొనునది కలదు; అది సర్వోపగతమయినది. అనగా నీ యాత్మ, నా యాత్మ, ప్రతిజీవునియాత్మ ఏక కాలమందే సర్వత్ర ఉన్నది. అది నిరాకార మయినచో ఏదే నొక చోట నున్న దని ఎట్లు చెప్ప నగును? చోటు నాక్రమించు ప్రతివస్తువునకు ఆకారము కలదు. నిరాకారమయినది అనంతమే యగును. కనుక ఒక్కొక్కయాత్మయు సర్వత్ర ఉన్నది. ప్రతిపాదితమైన రెండవ సిద్ధాంతము ఇంతకంటె నింకను మహోద్భుతావహమైనది. మానవులలో కనీసము చాలమంది అభివృద్ధిపొందువారే అని వా రందఱు ప్రాచీనకాలమున గుర్తించిరి. పరిశుద్ధతయందు, శక్తియందు, జ్ఞానమునందు వా రభివృద్ధి పొందిరి; అంతట, 'మానవులలో వ్యక్తమగు జ్ఞానము, పరిశుద్ధత, బలము ఎక్కడివి?' అను ప్రశ్న కలిగెను. ఏవిధమయిన జ్ఞానములేని శిశు విక్కడ కలదు. ఈ శిశువు పెరిగి బలము, శక్తి, వివేకము గలవా డగును. ఆ జ్ఞానధనమును, శక్తిసంపదయు శిశువున కెక్కడినుండి వచ్చినవి? అ వన్నియు ఆత్మయందు గల వని సమాధానము. బిడ్డని ఆత్మలో ఈ జ్ఞానమును, శక్తియు మొట్టమొదటినుండియే ఉండినవి. ఈ శక్తి, ఈ పరిశుద్ధత, ఈ బలము ఆత్మయం దుండినవి కాని అవి యవ్యక్తములై యుండెను; ఇప్పు డవి వ్యక్తము లైనవి. వ్యక్తము లగుటకు, అవ్యక్తములుగ నుండుటకు అర్థ మేమి? సాంఖ్య సిద్ధాంతములో చెప్పినట్లు ప్రతిఆత్మయు పవిత్ర మని, పరిపూర్ణ

మని, సర్వశక్తి యని, సర్వజ్ఞ మని, అది తన్ను తాను వెలికి వ్యక్త మొనర్చుకొనగల్గుట దానికి ఉన్న మనస్సునుబట్టి యుండు నని అర్థము. మనస్సు ఆత్మను ప్రతిఫలింపజేయు అద్దము వంటిది. నా మనస్సు నా యాత్మశక్తులను కొంతవఱకు ప్రతిఫలింప చేయును; నీ యాత్మ విషయ మంతే; ప్రతియొక్కని ఆత్మవిషయ మంతే. ఎక్కువ నిర్మలముగా నున్న అద్దమునందు ఆత్మ ఎక్కువ స్పష్టముగా ప్రతిఫలించును. కనుక వ్యక్తీకరణము వారివారి మనస్సులనుబట్టి భేదిల్లుచుండును. కాని పవిత్రతయు పరిపూర్ణ తయు ఆత్మలకు స్వతస్సిద్ధములే.

ఇది సరి కా దనియెడి మఱియొక వాదము గలదు. పరిశుద్ధతయు పరిపూర్ణతయు ఆత్మకు సహజమైనను, ఈ పరిశుద్ధ తయు, పరిపూర్ణత్వమును, ఒక్కొక్కప్పుడు సంకోచమును, మఱొకప్పుడు వ్యాకోచమును పొందుచుండునట. కొన్ని చేష్టల వలన, కొన్నితలంపులవలన ఆత్మస్వరూపము సంకోచము పొందును; మఱికొన్ని చేష్టలు, తలంపులు ఆత్మస్వరూపమును వెలువఱచును, వ్యక్త మొనర్చును. ఈ విషయము వివరింపబడినది. ఆత్మశక్తిని, పరిశుద్ధతను సంకోచింపజేయు తలంపులును, చేష్టలును, చెడ్డతలంపులు, చెడ్డచేష్టలు. ఆత్మను వ్యక్తముచేయుటకు, దాని శక్తులను వెలువఱుచుటకు తోడ్పడు తలంపులును, చేష్టలును మంచివి, నీతిబద్ధములయినవి. ఈ యుభయవాదములకును గల భేదము బహుస్వల్పము; అది దాదాపు సంకోచవ్యాకోచములను మాటల గారడియే. హెచ్చుతగ్గులు ఒక్కొక్క ఆత్మకు గల మనస్సుపై ఆధారపడియుండు నని చెప్పెడి వాదమే మేలు, సందేహము లేదు. కాని, సంకోచవ్యాకోచవాదము సంకోచ వ్యాకోచము లనెడి శబ్దముల మఱుగును ఆశ్రయింప గోరును. 'ఆత్మసంకోచము' అనుటకు గాని 'ఆత్మవికాస' మనుటకు గాని అర్థ మేమి యని వారిని అడుగవలసిన దే. జీవుడు ఆత్మస్వరూపి.

భౌతికపదార్థము ఆపేరి స్థూలవస్తువుగావచ్చు. మనస్సనియెడి సూక్ష్మవస్తువు కావచ్చు. అట్టి భౌతికపదార్థమువిషయమై సంకోచవ్యాకోచము లన నేమి యని మీరడుగవచ్చును. అంతకు మించి, భౌతికపదార్థము కానిదాని విషయమై, స్థల కాలములచే బద్ధము కానిదానినిగుఱించి సంకోచవ్యాకోచము లను మాటల కర్థము చెప్పు టెట్లు? కనుక ఆత్మ సర్వదా పరిశుద్ధ మని, పరిపూర్ణ మని, దాని స్వరూపము కొన్నిమనస్సులద్వారా ఎక్కువగ వ్యక్తమగు నని, కొన్నిమనస్సులద్వారా తక్కువగా వ్యక్తమగు నని చెప్పు వాదమే ఎక్కువ సమంజస మనిపించును. మనస్సు మార్పొందు కొలది, అది మఱింత స్వచ్ఛముగా పెంపొందు కొలది, ఆత్మను మఱింత చక్కగా ప్రతిబింబించును, అట్లే అది సాగిపోవును. తుదకు ఆత్మస్వరూపమును సమగ్రముగా ప్రతి బింబింపగలంత స్వచ్ఛత మనస్సుకు గల్గును. అప్పుడు ఆత్మ విముక్త మగును.

ఆత్మతత్త్వ మిది. దాని గమ్య మేమి? భారతదేశము లోని వివిధశాఖలవారిలో ఆత్మకు గమ్య మొక్కటిగానే కనబడు చున్నది. అందఱికి గల ఆశయ మొక్కటే. ఏ మనగా విముక్తియే. మానవు డనంతుడు; అత డిప్పుడు కొన్ని పరిచ్ఛేదములకులోనై ఉన్నాడు. కాని ఆ ఉనికి యతని స్వరూపము కాదు. అనంతమును అపరిచ్ఛిన్నమును జన్మహక్కును ఐన స్వస్వరూపము నొందు వఱకు నతడు ఈ పరిచ్ఛేదముల గుండ ముందు కేగుటకు పైకెక్కు టకు పాటుపడుచున్నాడు. మనచుట్టును చూచుచున్న కలయికలు, పునస్సంయోగములు, వ్యక్తీకరణములు, ఇవి లక్ష్యము కావు, గమ్యము కావు; ఇవి తాత్కాలికములు, ఆనుషంగికములు. ఏ అనుభవములగుండ ఆత్మ తన పరిపూర్ణస్వరూపమును వ్యక్తి మొనర్చి బంధముల నూడ్చివైచునో, ఆ అనుభూతి నందుటకు మనకు తోడ్పడునవే ఈ భూముల - సూర్యుల - చంద్రుల -

నక్షత్రముల – గుణదోషముల – మంచిచెడుగుల – హాసవిలాపముల– సుఖదుఃఖముల రూపమున నున్న యీ కలయికలు. ఆత్మ ఇక బాహ్యప్రకృతిశాసనముల బంధమున గాని అంతఃప్రకృతిశాసనముల బంధమున గాని ఉండదు. అది సకలశాసనములను, సకల పరిమితులను, సకలప్రకృతిని అతిక్రమించి పోయినది. ఆత్మ ఇప్పుడు తాను ప్రకృతివశమున నున్నట్లు ఎంచునే కాని అది ప్రకృతివశమున లేదు, ప్రకృతియే ఆత్మవశములోనికి వచ్చినది. అ దొక్కటే ఆత్మకు గల గమ్యము; ఏ మెట్లమీదుగ అది తన్ను వ్యక్తము చేసికొనుచున్నదో ఆ మెట్లును, లక్ష్యమును ముక్తిని పొందుటకై ఆత్మ వరుసగా గుఱియగుచున్న అనుభూతు లన్నియు దాని జన్మలుగా సూచింపబడుచున్నవి. ఆత్మ తక్కువస్థాయికి చెందిన దేహమును ధరించి, దానిద్వారా తన్ను తా నభివ్యక్తము చేసికొనుటకు ప్రయత్నించును. ఆ యుపాధి తనకు చాల దని గ్రహించి, విసర్జించును. తరువాత అంతకంటె పైదగు దేహమును ధరించును. దానిద్వారా ఆత్మ తన్ను తా నభివ్యక్తము చేసికొనుటకు శ్రమపడును. ఆ యుపాధిసహితము సరిపోవుట లే దని విడిచిపెట్టును; పిమ్మట అంతకంటె నుత్కృష్టమగు ఉపాధి ధరించును. ఆత్మ తన మహోన్నతాశయములను ప్రకటించుకొనుటకు చాలి యుండు దేహము లభించువఱకు ఒక దేహము తరువాత మఱియొక దేహమును దాల్చుచునే యుండును. అనంతరము ఆత్మ విముక్త మగును.

ఇక్కడ వేయదగు ప్రశ్న యిది: జీవాత్మ అనంతము, సర్వత్ర ఉండునది, ఆత్మ అగుటచే విశ్వవ్యాప్తమె ఉండవలసినదే కదా. అయినచో అది దేహములను ధరించు నను మాటకు, ఒక దేహము వీడి యొక దేహమును కూడు నను మాటకు అర్థ మేమి? ఆత్మ వచ్చునదియు కాదు, పోవునదియు కాదు; పుట్టునదియు కాదు, గిట్టునదియు కాదు అనుట భావము. సర్వవ్యాప్తమయినది

పుట్టు టెట్లు? ఆత్మ దేహములో నివసించు ననుట అర్థములేని పిచ్చిమాట. నిరవధికమయినది పరిమితమగు స్థలములో నెట్లుండ గలదు? ఒకడు తనచేతులలో పుస్తకము పట్టుకొని ఒక పుట చదివి, దానిని ప్రక్కకు త్రిప్పి, మఱొక పుట చదివి, దానిని ప్రక్కకు త్రిప్పి తరువాత పుట చదువును. ఈ త్రిప్పట పుస్తకమునకే, దాని పుటలకే గాని, పాఠకునకు కాదు. అతడు మొదట ఎక్కడ ఉండినాడో, అక్కడే ఉన్నాడు. ఆత్మ విషయమును అటులనే. ప్రకృతియంతయు గ్రంథము. దానిని ఆత్మ చదువు చున్నది. ఒక్కొక్క జన్మ ఆ గ్రంథములోని ఒక్కొక్క పుట వంటిది. దానిని చదువగానే అది త్రిప్పివేయబడుచున్నది. గ్రంథము ముగియువఱకు, ప్రకృతితో అనుభవములు పూర్తి అగు వఱకు ఆత్మ పరిపూర్ణత్వము పొందువఱకు పుటలు త్రిప్పివేయ బడుచుండును. అయినను ఆత్మ యెన్నడును ఉన్నచోటనుండి కదల లేదు, రాలేదు, పోలేదు; అది యనుభవములను మాత్రమే పొందుచుండెను. కాని, మనము కదలుచున్నట్లు మనకు అనిపించు చుండును. తిరుగుచున్నది భూమి. కాని, భూమి తిరుగక సూర్యుడే తిరుగుచున్నా డని మన మనుకొందుము. అది తప్పు అని, యింద్రియముల భ్రాంతి అని మనకు తెలియును. అటులనే మనము పుట్టితి మని, గిట్టుదు మని, వచ్చుచున్నా మని, పోవు చున్నా మని యనుకొనుటకూడ భ్రాంతియే. మనము వచ్చుటయు లేదు, పోవుటయు లేదు, పుట్టుటయు లేదు. ఏల యన, ఆత్మ పోవలసినది యెక్కడకు? పోవుటకు దానికి చోటు లేదు. అది యిప్పుడు లేని చో టేది?

'ప్రకృతిపరిణామము', 'ఆత్మవ్యక్తీకరణము' అను సిద్ధాంత మిట్లు కల్గినది. పరిణామక్రమము, ఉన్నతోన్నతము లయిన సంయోగములు ఆత్మయందు లేవు; దాని స్వరూప మిప్పు డెట్టిదో ఇదివఱకు నట్టిదే. పరిణామములు, సంయోగములు ప్రకృతి

గతములే. కాని, ప్రకృతిపరిణామము ముందుకు సాగిపోవుచు, ఉన్నతోన్నతములగు సంయోగములు పొందుచున్నకొలది, ఆత్మమహత్త్వ మధికాధికముగా వ్యక్త మగుచున్నది. ఇక్కడ ఒక తెఱ ఉన్న దనుకొనుడు. తెఱమఱుగున అద్భుతమగు దృశ్య మున్న దనుకొనుడు. తెఱయందు చిన్నరంధ్ర మున్న దనుకొనుడు. ఆ రంధ్రములోనుండి మనము దృశ్యములోని స్వల్పాంశమును చూడ గలుగుదుము. ఆ రంధ్రము పెద్ద దయిన దనుకొనుడు. పెద్ద దగుకొలది దృశ్య మధికాధికముగా మన చూపుమేరలోనికి వచ్చును. తెఱ పూర్తిగా తొలగిపోయిన తరువాత దృశ్యమునకును ద్రష్టకును నడుమ ఏదియు లేదు. దృశ్యము సంపూర్ణముగా మీకు కనబడును. మానవుని మనస్సే తెఱ. దాని వెనుక ఆత్మమహత్త్వము, పరిశుద్ధత, అనంతశక్తి గలవు. మనస్సు అధికాధికముగా నిర్మల మగుకొలది, పరిశుద్ధ మగుకొలది ఆత్మమహత్త్వ మధికముగా ప్రకాశ మొందుచుండును. ఆత్మ మార్పు చెందుచున్న దనుట కాదు. మార్పు గలునది తెఱయందే. ఆత్మ నిర్వికారము, అమృతము, పరిశుద్ధము, నిత్యపావనము.

కనుక ఈ సిద్ధాంతపర్యవసాన మిది: మహోన్నత మానవుని మొదలు పరమనీచుడును పరమదుష్టుడును అయిన వానివఱకు, పరమోత్కృష్టమానవుని మొదలు మనపాదములక్రింద ప్రాకిపోవు తుచ్ఛక్రిమివఱకు సర్వజీవులలోను పరిశుద్ధమును, పరిపూర్ణమును, అనంతమును, నిత్యపావనమునైన ఆత్మ ఉన్నది. క్రిమియందు ఆత్మ తన పరిశుద్ధతలో, శక్తిలో అత్యంతస్వల్పాంశమునే వ్యక్తము చేయుచున్నది; పరమోత్కృష్టమానవునియందన్ననో ఆత్మ తన పరిశుద్ధతలోను, శక్తిలోను అత్యధికాంశమును వ్యక్తపఱచుచున్నది. ఉన్న భేద మంతయు వ్యక్తమగుటలోని ఎక్కువ తక్కువలలోనే గాని తత్త్వములో లేదు. అన్ని జీవులందును ఉన్న పరిశుద్ధము, పరిపూర్ణము నయిన ఆత్మ ఒక్కటే.

స్వర్గములను, తదితరస్థలములను గుఱించిన ఆశయములు కూడ గలవు. కాని ఇవి అప్రధానములుగ పరిగణింపబడినవి. స్వర్గము అనునది నికృష్టాశయముగా పరిగణింపబడినది. భోగ మనుభవించుటకు చోటు కావలె నన్న కోర్కెనుండియే 'స్వర్గము' అను ఆశయము పుట్టినది. మన మవివేకులమై మన ప్రస్తుతాను భవముతో జగత్తునంతను పరిచ్ఛిన్నముగ నొనర్ప జూతుము. పసిబిడ్డలు ప్రపంచమంతయు పసిబిడ్డలమయ మనుకొందురు. పిచ్చివాండ్రు లోకమంతయు ఉన్మత్తులశరణాలయ మనుకొందురు. ఇటులనే ఎవరిమట్టుకు వా రనుకొందురు. ఎవరికి ఈ ప్రపంచము ఇంద్రియభోగమయమో, ఎవరికి జీవితమంతయు భుజించుటయు, విందులు కుడుచుటయు కాక మఱేమియు కాదో, — ఎవరికిని, పశువులకును భేదము లేనే లేదో — అట్టి వారు సహజముగ ఇంక నింకనెక్కువ భోగము లనుభవింప గల స్థలములనుగుఱించిభావన చేయుచుండుట ప్రత్యక్షము. ఏల యన, ఈ జీవితము క్షణికము. వారి భోగాసక్తి యనంతము. కనుక నిర్విఘ్నముగా, ఇంద్రియ భోగములు లభించు స్థలములను వారు భావనచేయుట తప్పనిసరి. అటువంటి తావులకు పోగోరువారు పోవలసియే యుండు నని మనము ముందుముందు గ్రహింతుము. వారు కలగందురు. ఈ స్వప్నము ముగిసిన తరువాత మఱొక స్వప్నమున పడుదురు. అందు ఇంద్రియభోగము సమృద్ధిగా నుండును; అదికూడ ముగిసిన పిదప మఱొకటి వారు భావింపవలసినవా రగుదురు. ఈవిధముగా వా రొకస్వప్నమునుండి మఱియొక స్వప్నమునకు తిరుగాడు చుందురు.

కట్టకడపటి సిద్ధాంత మొకటి కలదు. అది యాత్మను గుఱించిన మఱొక ఆశయము. విశుద్ధతయు పరిపూర్ణతయునే ఆత్మతత్త్వమును ఆత్మసారము నగుచో, ఒక్కొక ఆత్మయు అనంతమును, విశ్వవ్యాప్తము నగుచో, ఇన్ని ఆత్మ లుండుట ఎట్లు

పొసగును? అనంతములు పెక్కు లుండ జాలవు. పెక్కు అను టెందులకు? అనంతములు రెండైనను ఉండుట సాధ్యము కాదు. అనంతములు రెం డున్నచో అం దొకదానిచే మఱొకటి పరిచ్ఛిన్నమై రెండును సాంతము లగును. అనంతమైన దేకైకముగ నుండుటే పొసగును. కావున ఈ కట్టకడపటి నిర్ణయమును ధైర్యముతో అందుకొనుచున్నాము:— 'ఆత్మ ఒక్కటే గాని రెండు కాదు'.

ఒక చెట్టుమీాద రెండు పక్షులు కూర్చుండి యున్నవి. ఒకటి పైనున్నది, మఱొకటి దిగువను కూర్చున్నది. రెండిటి ఈకలును మిక్కిలి అందముగా నున్నవి. ఒకటి పండ్లు తినుచున్నది. రెండవది ప్రశాంతముగా, గంభీరముగా, తన మహిమయందే ఏకాగ్రచిత్తము గల్గియున్నది. దిగువ నున్న పక్షి మంచిపండ్లు, చెడ్డపండ్లు తినుచు ఇంద్రియభోగముల వెంటబడుచుండును; అప్పుడప్పు డది చేదుపండ్లు తినునప్పుడు పైకొమ్మమీాది కెగిరి, పైకి చూచును, రెండవ పక్షిని గాంచును. పైపక్షి మంచిపండ్లను గాని, చెడ్డపండ్లనుగాని లెక్కచేయక, ఆత్మయందే సంతుష్టమై, తనకుపరమగు సుఖము నాశింపక, ప్రశాంతముగా, గంభీరముగా కూర్చుండియున్నది. అది తానే యనుభూతిస్వరూపము; కోరుటకు తన కవ్వలిది దాని కేమి గలదు? దిగువపక్షి పైనున్నపక్షిని చూచి దానిని సమీాపింప గోరును. అది మఱికొంచెము పైకెక్కును; కాని, దాని పూర్వభావముద్రలు దానియం దింకను గలవు. మరల అది మునుపటి పండ్లనే తినుచు సంచరించుచుండును. మరల విపరీతమయిన చేదుపండు తినుట తటస్థించును; అది క్షోభిల్లిపోవును, పైకి చూచును, మునుపు తాను చూచిన ప్రశాంతగంభీరపక్షియే అట ఉన్నది. దిగువ పక్షి దానిని సమీాపించును. కాని, పూర్వకర్మలు దానిని క్రిందికి లాగివైచును; తియ్యనిపండ్లను, చేదుపండ్లను తినుచునే యుండును. మఱొక

మారు కడుంగడు చేదుపండు తినును. పక్షి పైకి చూచును, చేరువకు పోవును. అది పైనున్నపక్షిని సమీపించుకొలది దాని యీకెల వెలుగు దీనిపై ప్రతిఫలించును. దీని యీకెలు అదృశ్యములై పోవుచున్నవి. చాలినంత దగ్గఱకు వచ్చిన తరువాత దృక్పథ మంతయు మాఱిపోవును. దిగువపక్షి యెప్పుడును లేనే లేదు. ఉన్న దెల్ల పైపక్షియే. పక్షి అని అది యను కొన్నది ఈపన్మాత్రపు ప్రతిబింబమే.

ఇట్టిది ఆత్మతత్త్వము. మానవాత్మ ఇంద్రియసుఖముల వెంట, ఐహికాహంకారముల వెంబడి చనుచుండును; పశువులవలె అది యింద్రియరంగముననే జీవితము గడపును; నరముల క్షణికో ద్రేకములకు వశమై జీవించుచుండును. ద్రెబ్బ తగిలినపుడు క్షణకాలము తల తిరుగును. సర్వము అదృశ్యము కాదొడగును. జగము తా నంతకు ముం దనుకొన్నట్టిది గాదని గ్రహించును. జీవితము సుఖమయము గా దని గుర్తించును. అది ఊర్ధ్వాభిముఖమై క్షణముసేపు అనంతుడగు ఈశ్వరుని తిలకించును. అద్వితీయగంభీరమూర్తిదర్శన మొక్కసారి పొందును, అతని నించుక సమీపించును. కాని, దాని పూర్వకర్మలు దానిని దూరమునకు లాగుకొనిపోవును. తరువాత మఱియొక ద్రెబ్బ తగిలినపుడు ఆ ద్రెబ్బ మరల దానిని భగవదభిముఖ మొనర్చును. ఆయనంతమూర్తిసన్నిధిని మఱొక్కమారు దర్శించి, సమీపించును. అది పరాత్పరునికి సన్నిహితమగుకొలది నీచమును, క్షుద్రమును, గాఢస్వార్థపరము నగు తన వ్యక్తిత్వము కరగిపోవు చుండుటను గుర్తించును; ఆ సంకుచితవ్యక్తిత్వమును సుఖపెట్టుటకు గాను యావద్విశ్వమును బలి ఇత్త మనెడి కోర్కె క్షీణించిపోవు చుండును; అది క్రమముగా పరాత్పరుని మఱింత సమీపించు కొలది ప్రకృతియు కరగిపోదొడగును. చాలినంత సమీపమునకు వచ్చినప్పుడు దాని దృక్పథము పూర్తిగా మాఱిపోవును ఆ

మఱొక పక్షి తానే అని, దూరమునుండి చూచినట్టుగా తాను చూచిన అనంతతత్త్వము తన ఆత్మయే అని, దేని మహాద్భుత దర్శనము తనకు గల్గెనో ఆ జ్యోతి ఆ మహత్త్వము తానే అని, నిజమునకు తానే పరమార్థ మని — గుర్తించును. ప్రతివస్తువు లోను పరమార్థ మేదో దానిని ఆత్మ గ్రహించును. ఎవడు ప్రతి అణువునకును అంతర్యామియో, ఎవడు సర్వత్ర కలడో, ఎవడు సకలవస్తువులలో సారమో, ఎవడు ఈ జగత్తుకు దైవమో —, నీ వతడే అని, నీవు బంధరహితుడ వని తెలిసికొనుము.

# ఆత్మ అనశ్వరమా?*

'వినాశ మవ్యయ స్యాస్య న కశ్చి త్కర్తు మర్హతి'

అవ్యయమైన ఆత్మకు వినాశము గూర్ప ఎవరికిని శక్యము కాదు. —భగవద్గీత.

మహాభారత మనెడి యితిహాసశ్రేష్ఠమున ఈ కథ కలదు. "'లోకములోని కెల్ల మిక్కిలి ఆశ్చర్యకరమైన దేది?'' అని ధర్మదేవత, కథానాయకుడగు యుధిష్ఠిరుని ప్రశ్నించెను. అనుక్షణము తమ చుట్టును మృత్యువు తాండవమాడుట స్వయముగా చూచుచున్నను, మానవుల కెవరిమట్టుకు వారికి 'తమకు మాత్రము మృత్యువు లే' దను నమ్మకము నిల్చియే యుండును. ఈ మొండి నమ్మకమే అత్యాశ్చర్యకరమైన దని యుధిష్ఠిరుడు చెప్పెను. నిజమున కిదియే మానవజీవితములోని కెల్ల మహాద్భుతము. వివిధ కాలములలో వివిధమతాలవారు దీనిని ఖండించుచు వాదములు కావించియున్నారు. హేతువాదమునకు అభేద్యమైన మర్మయవనిక ఇంద్రియజగత్తుకును, అతీంద్రియజగత్తుకును మధ్య ఎప్పుడును వ్రేలుచున్నది. ఐనను మరణము తనకు లే దను గట్టి నమ్మకము మానవునకు ఉండనే ఉన్నది.

మన జీవితకాలమంతయు మనము చదువుచునే యుండవచ్చును. చివరకు చావుబ్రదుకుల విషయమును 'ఇట్టిది' అనియో 'ఇట్టిది కాదు' అనియో సయుక్తికముగ నిరూపింపగల స్థాయికి కొనిరాలేక పోవచ్చు. మానవుని యునికి శాశ్వత మనియో

* ఈ విషయమునుగూర్చి చర్చ జరుగుచుండిన దినాలలో శ్రీ వివేకానందస్వామి "ది న్యూయార్క్ మార్నింగ్ అడ్వర్టయిజరు" అను పత్రికకు వ్రాసిన వ్యాస మిది.

అశాశ్వత మనియో మన కిష్టము వచ్చినట్లు అనుకూలముగానో ప్రతికూలముగానో మాటాడవచ్చు, వ్రాయవచ్చు, బోధింప వచ్చు, ఉపదేశింపవచ్చు; ఆవేశముతో మన మీ పక్షము వారమో ఆ పక్షమువారమో కావచ్చు; ప్రతిపేరును దాని మునుపటి పేరులకంటె జటిలముగ నుండునట్లు మనము వందల కొలది పేళ్లను కల్పింపవచ్చు. ఈ సమస్యను శాశ్వతముగా పరిష్కరించితి మను భ్రమకు వశులమై క్షణకాలము మనల శాంతింప జేసికొని విశ్రమింప వచ్చు; విపరీతమూఢవిశ్వాసాలలో నే యొక్కదానినో మన సర్వశక్తులతో మన మంటిపట్టుకొని యుండ వచ్చు; లేదా, అంతకంటెను మఱింత ఎక్కువ ఆక్షేప ణీయములైన వైజ్ఞానికమూఢవిశ్వాసముల నంటిపట్టుకొని యుండ వచ్చు. కాని, తుట్టతుదకు మనప్రజ్ఞ కొలదియు మన మెత్తిన యెత్తులెల్ల మాటిమాటికిని పడగొట్టబడుచుండ, హేతువాద మనెడి కందుకక్రీడారంగమున ఎడతెంపులేని ఒక ఆటను మన మాడుచుంటి మని గుర్తింతుము.

మానసిక మైన యీ శ్రమకును ఈ బాధకును గలుగు ఫలితములు తఱచు వట్టి క్రీడల ఫలితములకంటె ఎక్కువ ఆపత్కరములుగ నుండును. కాని దీని కంతటికిని మఱుగున ఆక్షేపింపబడని ఆక్షేపింప శక్యముకాని యథార్థము మహాద్భు తము కలదు. మహాభారతము చెప్పినది దానినే. అది ఏ మనగా— "మన వినాశమును మనము భావించుకో లేకుండుట." నా వినాశ మును భావించుటకైనను నేను తటస్థుడనై సాక్షినై చూచుచుండ వలసినదే.

ఈ వైచిత్ర్యమున కర్థ మేమో తెలిసికొన ప్రయత్నించు టకు ముందు ఈ యొక్క సత్యమే అఖిలవిశ్వమున కాధార మని మనము గుర్తింపవలె. బాహ్యజగన్నిత్యత అంతర్జగన్నిత్య తతో అనివార్యముగా సంబంధపడియున్నది. ఈ రెంటిలో ఒకచే

నిత్య మని, రెండవది నిత్యము కా దని ప్రతిపాదించు సిద్ధాంతము పైకి ఎంత యుక్తియుక్తముగ నైన కనబడవచ్చును. కాని, అట్టి వాదమును ప్రతిపాదించు వాడు తన నిర్మితినే చూచుకొన్నచో 'వెలుపలి' 'లోపలి' జగత్తుల రెండింటి నిత్యత ఇచ్ఛాశక్తిని ప్రేరించు కారణములలో ఒక్కటిగా ఉండనిదే తెలిసి ఏ పనిని గాని చేయ తనకు సాధ్యము కా దని గుర్తించును. మానవుని మనస్సు తన అవధుల అతిక్రమించునేని ద్వైతము అవిభాజ్యమగు ఐక్యమున పర్యవసించియుండుటను గుర్తించు ననుట పూర్ణసత్యమే ఐనను, అందుకు క్రింది మెట్టున నున్నప్పుడు 'విషయ' ప్రపంచ మును మన మెఱిగిన యీ జగత్తును విషయికొఱకే ఉన్న దానినిగా మన మెఱుగుదుము. మన మెఱుగగలిగినదియు అంతే. కావున 'విషయి' లే డని మనము భావించుటకు ముందు 'విషయప్రపం చముకూడ లే' దని మనము భావింపక తప్పదు.

ఇంతవఱకు విషయము స్పష్టమే. ఇక్కడ ఒక చిక్కు కలదు. సాధారణముగా 'నేను దేహము' నని కాక మఱొక విధముగా నన్ను గూర్చి భావింపజాలను. 'నేను నిత్యుడను' అను నా భావమునందు 'నేను దేహము' నన్న భావము కలిసియే యున్నది. కాని దేహము నిత్యము కా దని ప్రత్యక్షముగా తెలిసిన విషయము. ప్రకృతియంతయు అంతే కదా—నిరంతరము మాఱిపోవు స్వభావము గలది.

అటు లయిన నిత్యత్వ మనున దెం దున్నది ?

మన జీవితములతో సంబంధించిన మఱొక అద్భుత విషయము కలదు. అది లేక "ఎవరు బ్రతుక గలరు ? క్షణకాల మైనను జీవిత మెవరికి భోగ్యముగా నుండును ?" — ఏ దనగా మోక్షాశయము.

మన మడుగు తీసి అడుగుపెట్టుటకు దారిచూపునది ఈ భావమే. దీనివలననే మన ఉద్యమాలు శక్యము లగుచున్నవి.

మానవుల పరస్పరసంబంధమును నిర్ణయించుచున్నదియు ఈ భావమే — అంతేకాదు. మానవజీవితపుటల్లికలో పడుగును పేకయు ఈ భావమే. బుద్ధిగతజ్ఞానము ఆ యాశయమును తన యేలుబడినుండి ఇంచుకించుకగా తఱిమివేయ ప్రయత్నించును. దాని రాజ్యమునుండి పరగణాల నొక్కొక్కటిగా గుంజుకొనును. ఒక్కొక్కఘట్టమును 'కార్య' 'కారణము' లనెడి యినుపపట్టాలతో కట్టుదిట్టము చేయును. అది మన ప్రయత్నము లన్నిటిని చూచి నవ్వును. ఏ శాసనాల కార్యకారణనియమాల గొప్పభారము క్రింద దానిని నలిపివేసి చంపజూచితిమో దాని కెల్ల అది అందకే ఉండును. వే ఱొక లా గెట్లుండ గలదు? పరిచ్ఛిన్నమైనదానిని బోధపఱచుటకు అపరిచ్ఛిన్నమైనదాని సాధారణధర్మ మవసర మగుచుండును. బంధరహితమైన దాని సాయముననే బద్ధమును వివరింప గలము. కారణజన్యమైనదానిని కారణరహితమైనదాని తోడ్పాటుననే వివరింపగలము. అయిన నేమి? మునుపటి చిక్కు మరల ప్రత్యక్ష మగుచున్నది. ఏది ముక్త మైనది? దేహమా? పోనీ, మనస్సా? విశ్వములో కడమ అన్నింటికి నున్నన్ని బంధములు మనశ్శరీరములకును ఉన్న వనుట ప్రత్యక్షము.

ఇప్పుడు ప్రశ్న ఈ సందిగ్ధరూపము దాల్చినది: ఒక పక్షము:—ఏ అణువునకును తనలో తన కైక్యము లేదు. కాని 'నిత్యము' 'ముక్తము' అను భ్రాంతిని వింతగాను తొలగించుకొనరానట్లును కలిగించుచున్నది. విశ్వమంతయు ఎడతెంపులేని మార్పులకుప్పయే. కాని వే ఱేమియు కాదు. తప్పింప శక్యము కాని రీతిలో కార్యకారణనియతి కది కట్టువడియున్నది. మఱొక పక్షము—మనలోను, జగత్తులోను నిత్యము, ముక్తము నగున దొకటి కలదు. అది మానవుల చిత్తములలోని సహజ-మూల-విశ్వాసము భ్రాంతి కాదని సూచించుచున్నది. వాస్తవసంఘుటనలను వానికి పైదగు సామాన్యసూత్రమున కన్వయించి వివరిం

చుట విజ్ఞానశాస్త్రమువిధి. వివరింపవలసినవానిలో ఒకభాగమును మొదట రూపుమాపి, కడమభాగమునకు మాత్రము తాను సరిపడు నట్టి సమాధానము వేఱేమైన కావచ్చును గాని శాస్త్రీయము మాత్రము కాదు.

నిరంతరము ప్రస్ఫుటముగా తన్ను తాను నిరూపించు కొనుచు, సర్వావసరమై యున్న స్వాతంత్ర్యభావమును నిర్లక్ష్యము చేసెడి ప్రతిసమాధానమునను పైని పేర్కొన్న పొరపాటున్నది. ఏమనగా, ఉన్న సంఘటనలో కొంతభాగమునకు సమాధానము చెప్పుటకుగాను మఱికొంత భాగమును 'లేదుపొ'మ్మనుటే. కనుక ఆ వాదము తప్పే. ఇక మన కున్న మార్గాంతర మొక్కటే. నిత్యము, ముక్తము అయిన దొకటి మనలో కల దని మన ప్రకృతి కనుగుణముగా అంగీకరించుటే.

కాని మన దేహము అట్టిది కాదు; మనస్సు సహితము కాదు. దేహ మనుక్షణము నశించుచున్నది. మనస్సు సదా మార్పు చెందుచున్నది. కొన్నింటి కలయికయే దేహము, మనస్సు కూడ అంతే; కనుక అవి సమస్తపరిణామముల కతీతమైన స్థితి ఏనాడును పొందజాలవు. క్షణికమైన యీ స్థూలభౌతికపదార్థా వరణము (దేహము) న కతీతమై, సూక్ష్మావరణము (మనస్సు) నకును అతీతమై, ఆత్మ అనునది కలదు. అదియే మానవుని స్వస్వరూపము. అది నిత్యము, నిత్యముక్తము. మనశ్శరీరము లనెడి పొరలగుండ వెలువడి కాన నగుచున్న దతని ముక్త స్వరూపమే. నామరూపాల వన్నెల నతిక్రమించి కననగుచున్నది బంధరహితమగు ఆత్మసత్తయే. ప్రగాఢములగు అజ్ఞానావరణముల చీల్చుకొని వెలికి ప్రకాశించుచు మన అనుభవములకు తాకుచున్న దతని అమరత్వమే, అతని ఆనందమే, అతని శాంతియే, అతని దివ్యతయే. ఆత్మయే నిజమైన మానవుడు, నిర్భయుడు, అనశ్వరుడు, స్వతంత్రుడు.

ఏ బాహ్యశక్తియు ఎట్టి ప్రభావమును ప్రసరింపజేయలేని, ఏ మార్పును కలిగింపలేని దశయే విముక్తదశ కానోపును. అన్ని ఉపాధులకును, అన్ని శాసనములకును కార్యకారణబంధముల కన్నిటికిని అతీతుడయినవానికి మాత్రమే విముక్తి సాధ్యము. అనగా, ఏది నిర్వికారమో అదే విముక్తముగ నుండుట పొసగును, విముక్తము కనుకనే అది అమృతమైనది. ముక్తము, నిర్వికారము నయిన ఈ సత్తు, ఈ యాత్మ, మానవుని ఈ నిజమైన యాత్మ అన్ని ఉపాధుల కతీతమైనది. కనుక దీనికి జననము లేదు, మరణము లేదు.

"ఈ మానవాత్మకు జననము లేదు, మరణము లేదు, ఇది నిత్యము, సదాస్థితము."



# పునర్జన్మ*

"అర్జునా, నీకును నాకును పెక్కు జన్మములు గడచిపోయినవి. వానినన్నిటిని నే నెఱుగుదును. ఓ పరంతపా, నీ వెఱుగవోయి."—భగవద్గీత.

సర్వకాలములందును, సర్వదేశములందును మానవబుద్ధి కంతు చిక్కక తికమకపఱచిన పెక్కు గడ్డుప్రశ్నలలో మిక్కిలి జటిలమైనది మానవుని గుఱించిన ప్రశ్నయే. చరిత్రప్రారంభము నుండియు, మానవుడు గణనాతీతములగు రహస్యముల పరిష్కారమునకై తన శక్తియుక్తు లన్నిటిని వినియోగించియున్నాడు. అట్టి రహస్యములలో మిక్కిలి మర్మగర్భమైనది అతని ప్రకృతియే. అది పరిష్కారమునకు లొంగని మర్మము; సమస్యల కెల్ల సమస్య. మన జ్ఞానమునకును మన అనుభూతికిని మన కార్యములకును ప్రాతిపదిక మానవప్రకృతియే. వానికి ఉనికిపట్టు మానవప్రకృతియే. తన ప్రకృతిని గుఱించిన జిజ్ఞాసకు మానవుడు ప్రథమస్థానమును వరిష్ఠస్థానము నొసగని కాల మిదివఱ కెన్నడును లేదు; ఇక ముందుండ బోదు.

తక్కిన అన్నిటికంటె తన ఉనికితో మిక్కిలి ఆంతరంగికముగ సంబంధపడిన ఆ పరమార్థమును అధిగమించు తృష్ణ మానవున కున్నది. వెలుపలి జగమునకు కొలబద్ద కాగల అంతఃప్రమాణ మొకటి కావలెనను ఉత్కటకోటికమగు కోర్కి అతని కున్నది. పరిణామశీలమగు విశ్వమున స్థిరమైన ఒకపట్టును కనుగొను ఆవశ్యకత సహజముగను ఆత్యంతికముగను అతని కున్నది. ఈ తృష్ణచేత – కోర్కిచేత – ఆవశ్యకతచేత మానవుడు బంగారమనుకొని పట్టిన దెల్ల ఒక్కొక్కతఱి మట్టిగా పరిణమించినది.

* 1895-వ సంవత్సరము మార్చినెలలో న్యూయార్కులోని మెటఫిజికల్ మాగజైన్‌లో ప్రచురింపబడిన వ్యాసము.

యుక్తికిని బుద్ధికిని పైదగు అంతర్వాణి మానవుని ప్రేరేపించు చున్నను, తనయందలి దివ్యతకు గల పరమార్థమును సరిగా వ్యాఖ్యానించుకో లేక పలుసార్లు అతడు పరాజయ మొందినాడు. ఐనప్పటికిని ఈ అన్వేషణము ప్రారంభమైనది మొదలు ఏదో ఒక జాతియో లేక కొందఱు వ్యక్తులో సత్యదీపమును పైకెత్తి ప్రదర్శింపని యుగము లేనే లేదు.

పరిసరములను, అప్రధానములగు వివరములను గూర్చి దురభిమానపూరిత పాక్షిక స్థూలాభిప్రాయములను కుదుర్చుకొని, పెక్కుమతాలవారి వర్గాలవారి వాదముల అస్పష్టతకు ఒక్కొక్కప్పుడు విసుగుజెంది తఱచు, పాపము! — పురోహితవర్గము కలసికట్టుగా ప్రచారముచేయు ప్రబల మూఢ విశ్వాసములకు మనస్సు విరిగి, పురోహితులకు తాము ఎదుటిపక్షమువారై నిస్పృహతో అన్వేషణ చాలించుకొనుచేగాక, అట్టి యన్వేషణ నిష్ఫలమని, నిష్ప్రయోజన మని చాటి చెప్పినవారు పూర్వకాలమునను, ప్రస్తుతకాలమునను మేధానిధులలోనే లేక పోలేదు. తత్త్వవాదులు కటకటపడవచ్చు, పరిహసింపవచ్చు. పురోహితులు కత్తులు జళిపించి తమవృత్తిని సాగించుకోవచ్చు. కాని, ఎవరు నిర్భయముగా లాభాపేక్ష లేక సత్యదేవతను ఆమె ఆలయములోనే ఆమె కొఱకే - ఉపాసింతురో వారికే సత్యము సిద్ధించును.

స్వప్రజ్ఞతో, తెలిసి చేయు ప్రయత్నముల ఫలితముగా వ్యష్టిమానవులకు జ్ఞానజ్యోతి లభించును. ఆ జ్యోతియే, అజ్ఞాతద్వారములగుండ జాతికంతటికిని మెల్లమెల్లగానైనను లభించును. మహాత్ములు దృఢసంకల్పముతో సాగించిన కఠోరసాధనలను తత్త్వజ్ఞులుచూపుచుందురు. సత్యమునిశ్శబ్దముగావ్యాపించి సామాన్యప్రజలచే జీర్ణించుకోబడు క్రమమును చరిత్ర తెలియజేయును.

తన్నుగుఱించి మానవుడు ప్రతిపాదించుకొన్న సిద్ధాంతములన్నిటిలోను 'దేహమునకంటె ఆత్మ భిన్నము, అది అనశ్వరము'

అను సిద్ధాంతము మిక్కిలి వ్యాప్తిలో నున్నది; అటువంటి ఆత్మ ఉన్న దని నమ్మిన విచారవత్తులలో అధికసంఖ్యాకులకు ఆత్మకు పూర్వజీవితముగూడ కలదను నమ్మకము సైత ముండెను.

ఈకాలమున మానవులలో అధికసంఖ్యాకులు మతమును వ్యవస్థిత మొనర్చుకొని, 'పూర్వజన్మ' లందు నమ్మకము గల్గి ఉన్నారు. మిగుల అభ్యుదయమునొందిన దేశములలో శ్రేష్ఠ వివేకులు పెక్కండ్రు — ఆత్మకు పూర్వజీవిత మున్న దన్న అభిప్రాయమును ప్రకటముగ విరోధించు మతములలో పుట్టి పెరిగినను — పూర్వజన్మసిద్ధాంతము నామోదించిరి; హిందూ బౌద్ధ మతముల కది మూలసిద్ధాంతము, పూర్వము ఈజిప్టుదేశీయులలో విద్యాధికులు దానిని విశ్వసించిరి. ప్రాచీన పారశీకులు ఆసిద్ధాంతమునకే వచ్చిరి; గ్రీకుతత్త్వవేత్తలు దీనిని తమ తత్త్వశాస్త్రమునకు పునాదిగా కావించుకొనిరి; హీబ్రూలలో ఫారిసీలు దాని నంగీకరించిరి; మహమ్మదీయులలో సూఫీలు ఇంచుమించు చందఱును దాని నిజమును గు ర్తించిరి.

ప్రజలలో కొన్నికొన్ని విశ్వాసములు గలుగుటకును వర్ధిల్లుటకును ప్రత్యేకపరిసరము లుండవలె. దేహములోనైనను మరణానంతరము ఒకానొక భాగము—నిల్చియుండునను నభిప్రాయము ప్రాచీనజాతులలో నేర్పడుటకు యుగములు పట్టినవి; దేహమునకు వేఱయి, దేహనాశనము తరువాతకూడ నిల్చి జీవించు దీనిని గుఱించి సయుక్తికమైన నిర్ణయమునకు వచ్చుటకు ఇంకను పెక్కుయుగములు పట్టినవి. దానికి దేహముతోగల సంబంధము తాత్కాలిక మన్న అభిప్రాయముగల జాతులలోనే, వా రా నిర్ణయమునకు వచ్చిన తరువాతనే "ఇది ఎందుండి వచ్చినది, దీని గమ్య మేమి?" అను అనివార్యమైన ప్రశ్న ఉత్పత్తిల్లినది. ప్రాచీన హీబ్రూలు ఆత్మను గుఱించిన ప్రశ్నలు లేపుకొని తమ

మనస్సులను చీకాకు పఱచుకొనలేదు. మృత్యువుతో సర్వము సమాప్తమని వారు నమ్మిరి. "కారల్లైకేలు చెప్పిన యీమాటలు సమీచీనములు. బైబిలు ప్రాతనిబంధనములో ప్రవాసఖండమునకు పూర్వము దేహముకంటె వేఱయిన జీవతత్త్వమును హీబ్రూలు గుర్తించిరి. అది ఒక్కొక్కప్పుడు "నెఫెష్" అని కాని, "రుఅఖ్" అని కాని, "నెషమ" అని కాని వ్యవహరింపబడు చుండెడిది. కాని, ఈశబ్దముల కన్నిటికిని 'ఊపిరి' అను అర్థమే కాని 'ఆత్మ' అను నర్థము లేదు. ప్రవాసఖండమునకు తరువాత కూడ పాలస్తీనా హీబ్రూల రచనలలో నాశనము లేని వ్యష్ట్యాత్మను గుఱించిన ప్రసక్తి లేదు. ఈశ్వరునినుండి వెలువడిన ప్రాణవాయువు దేహనాశనముతో మరల దివ్య "రుఅఖ్" నందు కలసి పోవును."

ప్రాచీన ఈజిప్టుదేశీయులకును ఛాల్డీనులకును ఆత్మను గుఱించి యుండిన నమ్మకములు విచిత్రములు ; శరీరపతనానంతరము జీవించియుండు భాగమును గుఱించి వారి యభిప్రాయము లును, ప్రాచీనహిందువులు, పారశీకులు, గ్రీకులు మున్నగు ఆర్య జాతులకు గల అభిప్రాయములును ఒక్కటే అనుకొన రాదు. ఆత్మనుగుఱించిన అభిప్రాయములో ఆర్యజాతులకును, సంస్కృతేతరభాషలు వ్యవహరించు మ్లేచ్ఛజాతులకును అనాదికాలము నుండియు విశేషభేదము గలదు. వారి శవసంస్కారాచారములు ఆభేదమును స్పష్టముగా సూచించుచుండును. మ్లేచ్ఛులు జాగ్రత్తగా భూస్థాపితము చేసియో లేదా, పరిమళద్రవ్యము లలది ఎండగట్టెడి జటిలవిధాన మవలంబించియో తమచేత నయినంత వఱకు శవములను భద్రపఱతురు — ఆర్యుల ఆచార మన్ననో సాధారణముగా శవములకు దహనసంస్కారము చేయుటే.

ఒక పెద్దరహస్యమునకు బీస ఇందులో గలదు — ఆత్మ దేహమునకంటె భిన్నమై దేహముతో నక్కఱ లేకే జీవింపగలది

అన్న అభిప్రాయము, ఈజిప్టువారు, అస్సిరియావారు, బాబిలోనియావారు మున్నగు ఏ మ్లేచ్ఛజాతికిని ఆర్యులసాయము లేక, ముఖ్యముగా హిందువుల సాయము లేక, కల్గియుండ లేదను టే ఆ కిటుకు.

ఆత్మనిత్యత్వమును మొట్టమొదట భావించినవారు ఈజిప్టు దేశీయులే అని హెరోడొటసు చెప్పెను. వారి సిద్ధాంతము ప్రకారము, ''దేహము నశించినతరువాత ఆత్మ, పుట్టబోవు నొకజంతువునందు ప్రవేశించును; అనంతరమది భూమియందును, సాగరమునందును గల ప్రాణు లన్నిటిగుండను పక్షులగుండను తిరుగాడును. చివరకు మూడువేలసంవత్సరములకు మానవదేహమునకు మరలును.'' అని యతడు చెప్పెను, కాని ఈజిప్టువిజ్ఞానము గుఱించి జరిగిన ఆధునికపరిశోధనలవలన ఈజిప్టుదేశీయులలో ప్రజాభిమానపాత్రమగు మతమునం దట్టి జన్మాంతరములో నమ్మకము లున్న సూచనలేవియు లేవు. అంతే కాదు. ఇటీవల ఈజిప్టునకు సంబంధించిన విజ్ఞానమును ప్రముఖపండితులగు మాస్పెరొ, ఎ. ఎర్మన్ వంటివారు చేసిన పరిశోధనలవలన పునర్జన్మవాదము ఈజిప్టువారికి పరిచితము కా దని కూడ రూఢ మగుచున్నది.

ప్రాచీనపు ఈజిప్టుదేశీయుల నమ్మకము ప్రకారము ఆత్మ కేవల మొక ప్రేతమే. దానికి వ్యక్తిత్వము లేదు. అది దేహముతో తనసంబంధము నెన్నటికిని త్రెంచివేసికొనలేదు. దేహము ఉన్నంతవఱకే అదియు నుండ గలదు; ఒక వేళ మృతకళేబరము నశించినచో ఆత్మ మరణమునకును నిర్మూలనమునకును రెండవ పర్యాయమును గుఱి కావలసినదే. శరీరపతనానంతరము ఆత్మ స్వేచ్ఛగా ప్రపంచమంతటను సంచారము చేయుచుండవచ్చుకాని, రాత్రియగుసరికి ఆ శరీరము పెట్టబడియున్నచోటికి తాను సదా రావలసినదే. అది నిత్యదీనము, దాని కెప్పుడును ఆకలియే, ఎప్పుడును దప్పియే. మఱొక పర్యాయము జీవితసౌఖ్య మనుభవింప

వలె నని మిక్కిలి ఆత్రపడుచుండును. కాని, ఆ తన కోర్కె నే నాటికిని నెఱవేర్చుకొన సమర్థముకాదు. పూర్వ దేహమునందు ఏ దయిన నొక భాగము గాయపడినచో ప్రేత దేహమునందును అదే భాగము గాయ పడును. చనిపోయినవారి దేహములను భద్రపఱుపవలె నను ప్రాచీన ఈజిప్టు దేశీయులకోర్కె కిదియే కారణము. ఒకప్పుడు మృతకళేబరములను భూస్థాపితముల చేయుటకు ఎడారి ప్రదేశములు ప్రశస్తము లని ఎన్నుకోబడుచుండినవి. ఎడారిలోని గాలి పొడిగా నుండుట చేత అది దేహమును శీఘ్రముగా విరిసిపోనీయదు. అందువలన ఆత్మకుకూడ సుదీర్ఘ కాల జీవితము గల్పించిన ట్లగుచుండెను. కాలక్రమమున పీనుగులకు పరిమళద్రవ్యము లలది ఎండించి పెట్టు విధమును ఒకానొక దేవత కనుగొనెను. ఆ పద్ధతివలన భక్తులు తమ పూర్వుల మృతకళేబరములను దాదాపు నిరవధికముగనే భద్రపఱచుకొన గలుగుదుమనియు, ప్రేతము ఎంతటి దీనస్థితి ననుభవించుచున్నను దాని కమృతత్వము సిద్ధించు ననియు శ్రద్ధాళువుల నమ్మకము.

తా నింక నెట్టి అక్కఱయు వహింప జాలని యీ లోకమునుగూర్చిన వ్యసనము ప్రేతమును బాధించుటను ఎన్నటికిని మానదనే మానదు. ప్రేత మిట్లు ఆక్రందించు నట - "ఓ సోదరా, నీవు తినుట, త్రాగుట మాన వలదు, మద్యపానమును, కామోపభోగమును విడిచిపెట్టకుము. ఏ భోగమును గాని త్యజింపవలదు. రాత్రింబగళ్లు నీ యిచ్ఛానుసరణమును మానుకోకు; హృదయములో దుఃఖమునకు తావీకుము. భూమిమీద మానవుడు బ్రతుకున దెన్ని సంవత్సరములు? పశ్చిమసీమ నిద్రామయము, సాంద్రచ్ఛాయామయము. ఇక్కడ జీవు లొకసారి నెలకొల్పబడుదురేని తమ శవరూపములలో సదా నిద్రపోవుచుందురు. తమ సోదరులను చూచుటకు గాని; తమతల్లిదండ్రులను గుర్తించుటకుగాని, ఇ కెన్నడును మేల్కొనరు. భార్యాపుత్రులను పూర్తిగా మఱచి

పోవుదురు. పృథివి తన మీద జీవించెడి వారందఱకు సస్యగ్రహించెడి జీవజ్జలము నాపాలిటికి పాఱుదలయు ప్రాణమును లేని నీరే; భూమిమీద నుండెడి వారందఱకు ఆ జలము పాఱుదల గల జలమే. నాకు మాత్ర మది మఱుగుడు నీరే. ఈ వల్లకాటి కను మను చేరుకొన్న నాటినుండి నే నెవరనో ఎక్కడ నున్నానో నే నెఱుగను. ప్రవహించుచున్న జలము నాకు త్రాగుట కిమ్ము.... నన్ను నీటి గట్టున ఉండ నిమ్ము. నా ముఖమును ఉత్తరదిశగా పెట్టుము. చల్లగాలివలన నాకు ఉపశమనము కలుగనీ; శోకభార ముతో నున్న నాహృదయమునకు ఊరట కలుగనీ.''

మరణానంతరపు ఆత్మస్థితిని గుఱించి ఈజిప్టుదేశీయులు చేసి నన్ని ఊహలు ఛాల్డీలు చేయ లేదు కాని ఛాల్డీల యభిప్రాయమున, ఆత్మ ఇంకను ప్రేతరూపమే, అది సమాధికి కట్టువడి యుండును. భౌతిక దేహము లేని స్థితి వారి భావన కంద లేదు. శవము ప్రాణముతో మరల లేచి వచ్చు నని వారి నమ్మకము. ఇష్టారు అను దేవత మహాపదల ననుభవించి సాహసములు చేసి తన భర్తను మరల బ్రతికించుకొన్న దట. అత డొక గొల్ల. వాని పేరు డుముజి. డుముజి 'ఈ'కిని 'డమినా'కును కుమారుడు. ఇష్టారు ఒక్కతే అట్లు బ్రతికించుకొన్నను, ''భక్తపుంగవులు చనిపోయిన తమ మిత్రులను మరల బ్రతికించుకొనుటకై ఒక్కొక్క దేవాలయమునకును పోయి చేసిన పూజలు ఫలింపనే లేదు.''

ప్రాచీనపు ఈజిప్టుదేశీయులు గాని ఛాల్డీనులు కాని ఆత్మను మృతకళేబరమునుండియు, సమాధినుండియు వేఱుచేసి భావింప లేక పోయిరి. ఇంతకును వారికి భువిపైని జీవితమే పరమోత్కృష్టమైనది; గతించినవారు మరల భూమిమీదికి వచ్చి జీవించు నవకాశముకొఱకు కువ్విళ్లూరుచుందురు; జీవించి యున్నవారు, దుఃస్థితిలో నున్న ప్రేతముల జీవితకాలము పొడిగించుటకు సాయ

పడ గల మను మనఃపూర్వకమైన నమ్మకముతో తమ శక్తివంచన లేక తోడ్పడుచుందురు.

ఇట్టి ఆశయమునుండి ఆత్మను గుఱించి ఇంతకంటె నున్నతమైన జ్ఞానము కలుగ నేరదు. మొదటి సంగతి:—ఇది మీదు మిక్కిలి భౌతికమైన ఆశయము. అంతే కాదు. ఇందు భయమున్నది. వెత యున్నది. ఇంచుమించు లెక్కలేనన్ని దుష్టశక్తులకు భయపడి, వానినుండి తప్పించుకొనుటకు నిర్వేదముతోను ఖేదముతోను శ్రమపడుచు జీవించియున్న వారి ఆత్మలు, ప్రేతాత్మలను గుఱించి తాము భావించినట్లె తామును లోకమంతయు ఎంతగా తిరుగాడుచున్నను అవి ఎన్నటికిని సమాధిని దాటిపోలేక పోయినవి, విరిసిపోవుచున్న మృతకళేబరమును దాటిపోలేక పోయినవి.

ఆత్మను గుఱించి యింతకంటె ఉన్నతములగు ఆశయముల జన్మస్థానము వలయునేని మన మిప్పుడు మఱొక జాతివారివైపునకు మరల వలయును, ప్రాచీనార్యులవైపునకు మరల వలయును. వారి దేవుడు ఎల్లరయెడ కరుణాపూర్ణుడు, విశ్వవ్యాప్తుడు, ఉజ్జ్వలులై దయాళువులై ఉపకారశీలురగు వివిధదేవతలుగా రూపొందువాడు. మానవజాతిఅంతటిలో దేవుని 'తండ్రి' అని సంబోధించుటకు ఈ ఆర్యులే ప్రప్రథములు, "తండ్రి గారాబుకుమారున కిచ్చినట్లుగా నాకు కరావలంబ మిమ్మా" అని. ఆర్యులకు జీవిత (సార)ము విశ్వాసమే కాని నిరాశ కాదు. వారికి ఆస్తిక్యమనగా ఉద్రేకోన్మత్తజీవితమునడుమ వ్యథితమానవుని నోటినుండి ఆగి ఆగి వెలువడు మూలుగు కాదు. వారియొద్దనుండి మన కందునట్టి ఆశయాలలో పంటభూముల వనస్థలుల పరిమళము గుబాళించుచుండును. ఉదయభానుకిరణరంజితమగు నీ సుందర భువనమును కైవారము చేయునప్పుడు పక్షుల కంఠములనుండి వెలువడు శ్రావ్యకూజితముల బోలుచు వారి (=ఆర్యుల) స్తోత్ర

గీతములు మన కందుచున్నవి. ఎనిమిదివేలసంవత్సరములనాటి వైనను ఆ గీతములు ఇప్పుడే క్రొత్తగా దివినుండి మనల నెచ్చరించుచున్నట్లుండును.

"స్వర్గజ్యోతియు నిత్యతేజమును ప్రకాశించునదియు అజరమును అమరము నగు లోకమున నన్ను నెలకొల్పుమా" "రహస్య స్వర్గమందిర ముండునట్టిదియు రాజగు వైవస్వతుడు వసించునట్టిదియు అగు రాజ్యమున నన్ను అమర్త్యునిగా నొనర్పుమా", "కామగమనము గల వా రుండు రాజ్యమున నన్ను అమర్త్యునిగా నొనర్పుమా", "కాంతిపూర్ణములగు లోకము లుండునట్టి అంతరతమమగు సౌర త్సతీయ మండలమున ఆ ఆనంద ధామమున నన్నమర్త్యునిగా నొనర్పుమా" ఇవిఆర్యులప్రార్థనలు, అత్యంతప్రాచీనమగు వారిఋగ్వేదసంహితలోనివి.

దీనినిబట్టి మ్లేచ్ఛుల ఆదర్శములకును, ఆర్యుల ఆదర్శముల కును అపారమగు అంతరము కల దని మనకు తెలియుచున్నది. మ్లేచ్ఛులకు ఈ దేహమును ఈలోకమును మాత్రమే నిజములు. వారినమ్మకమిది.— మరణకాలమున దేహమును వీడి పాఱిన క్షుద్రజీవము, ఇంద్రియభోగముల కోల్పోయినందుకై బాధయు వ్యధయు అనుభవించుచుండును. కాని శరీరమును జాగ్రత్తతో కాపాడియుంచిన అందులోనికి ఆజీవమును మరల రప్పింపవీలగును. కావున బ్రతికియున్న మానవునిపైనున్నంతకంటె పీనుగుపై శ్రద్ధ ఎక్కువాయెను. ఆర్యుల యభిప్రాయము:—ఏది దేహమునువిడిచి పెట్టెనో అదియే నిజమైన మానవుడు. దేహమున నున్నప్పటికంటె దేహమును విడిచిన పిమ్మటనే మానవుని కానందానుభవము హెచ్చును. క్రుళ్లిన శవమును వెంటనే దహించి రూపుమాపవలె ననుట వారి తొందర.

ఆత్మను గూర్చి యథార్థమైన ఆశయము ఉత్పత్తిల్లుటకు బీజ మిచ్చుట నున్నది. ఇచట నిజమైన మానవుడు దేహము

కాదు, ఆత్మయే. యథార్థమానవునకును దేహమునకును అవినా భావసంబంధముగల దనునట్టి ఆశయము లేవియు ఇచట బొత్తుగా లేవు. 'ఆత్మవిముక్తి' అనెడి ఉదాత్తాశయము పుట్టగల్గిన దిచ్చటనే. ప్రేతాత్మను కప్పియుండిన భాస్వరవస్త్రమువంటి (సూక్ష్మ) దేహపు మఱుగునుగూడ భేదించుకొని చూచినప్పుడే ఆర్యులు నిరాకారమును అఖండమును ఏకైకము అగు యథార్థాత్మస్వరూపమును గుర్తించిరి. అటు పిమ్మట 'ఎందుండివచ్చినది' అను ప్రశ్న అనివార్యమై లేచినది.

ఆత్మ అఖండ మని, అమృత మని, అనాదిసిద్ధమని సిద్ధాంతము మొట్టమొదట పుట్టినది భారతదేశములోనే, ఆర్యులలోనే. ఈజిప్టులో ఇటీవల సాగిన పరిశోధనలందు కూడ_ 'భూలోకజీవితమునకు ముందును వెనుకను కూడ ఆత్మ ఉండును. ఆత్మ స్వతంత్రము అఖండము' అను సిద్ధాంతపుజాడ ఏమియు అగపడలేదు. ఈ ఆశయము కొన్ని రహస్యములలో కలదు. కాని, వానిలోని ఆయాశయమునకు జన్మభూమి భారతదేశ మని చూపబడినది.

కారల్లొకెల్ ఇట్లనెను—'ఇంక నింకను లోతునకు దిగి ఈజిప్టువారి మతమును పరిశీలించుకొలదియు పునర్జన్మసిద్ధాంతము ఈజిప్టువారి సర్వజనీనమతమునకు పూర్తిగా విజాతీయమను సంగతి మఱింత స్పష్ట మగు ననియు; ప్రత్యేకరహస్యాలలో ఆసిద్ధాంత భాగ మే కొంతేని ఉన్నచో అది భారతదేశమునుండి సంక్రమించినదే కాని ఆసిరిసుబోధనలకు సహజము కా దనియు—నా గట్టి నమ్మకము.''

అనంతరకాలమున అలెగ్జాండ్రియాలోని యూదులలో జీవాత్మ సిద్ధాంత ముండినది. ఇంతకు ముందు చెప్పినట్టి జీసను కాలమునాటి ఫారసీలకు జీవాత్మ కల దనియే గాక అది వివిధ దేహములగుండ వచ్చుచు బోవుచును ఉండు నన్న నమ్మకము కూడ నుండెను ; కనుక మరల నవతరించిన ఒకానొక పూర్వ

MEMORIAL LIBR.
Acc No ..
Date
CU

ప్రవక్తయే జీససు అని గుర్తించుటయు ఏలియాసు అను యోగియే బాప్టిస్టు జానుగా పుట్టెనని జీససే స్వయముగ చెప్పిన వాక్యమునే మనకు సుబోధములే. ''మీరు రామోదింతురేని అవతరింప నుండిన ఏలియాసు ఇతడే''—మాత్-XI-14.

ఆత్మను గుఱించిన, దాని ప్రత్యేకతను గుఱించిన, ఆశయములు, ఈజిప్టుదేశీయులలో భగవదనుభవసంపన్నులగువారి ఉన్నతోపదేశములనుండి, హిబ్రూలకు సంక్రమించె ననుట స్పష్టము. ఈజిప్టువారికి అవి భారతదేశమునుండి వచ్చినవి. అలెగ్జాండ్రియా నుండి అవి వచ్చె ననుటలో అర్థ మున్నది. అలెగ్జాండ్రియాలోను, ఆసియామైనరులోను బౌద్ధమతప్రచారక కార్యక్రమము సాగుచుండె నని బౌద్ధగ్రంథములు స్పష్టముగ తెలుపుచున్నవి.

గ్రీకులకు పునర్జన్మసిద్ధాంతమును బోధించిన మొట్టమొదటి గ్రీకు 'పైథాగర' సని చెప్పుదురు. గ్రీకులు ఆర్యజాతివారే కావునను, శవములను దహనముచేసెడి యాచారమును, జీవాత్మసిద్ధాంతమునందు నమ్మకమును గలవారే కావునను పైథాగరసు బోధనల మూలమున తమ కందిన పునర్జన్మసిద్ధాంతము నంగీకరించుట వారికి సులభమే. పైథాగరసు భారతదేశమునకు వచ్చియుండెననియు అక్కడి బ్రాహ్మణులతనికి ఉపదేశములు కావించిరనియు అప్యులియసు చెప్పియున్నాడు.

మన మింతవఱకు తెలిసికొన్న విషయములు—ఆత్మ దేహమునకు చైతన్య మిచ్చు తదవయవమాత్రము కా దనియు, అది అవిభాజ్య మనియు అదే యథార్థమానవుడనియు నమ్మకమున్న చోట్లలో నెల్ల ఆత్మ అనాది అను సిద్ధాంతముకూడ అనివార్యమై ఏర్పడినది. ఆత్మ స్వతంత్రము అవిభాజ్యము అని నమ్మిన దేశాలవారు శవములను దహించునాచారముచే తమ నమ్మకమును వెలికి సూచించినారు. ప్రాచీనార్యులలో చేరిన వారే ఐనను పారశీకులు మాత్రము అత్యంతప్రాచీనకాలములోనే, తమపై సెమిటిక్కు—

ప్రభావ మేమియు లేకున్నను, శవసంస్కారమున కొక ప్రత్యేక విధానమును వర్ధిల్లజేసికొనిరి. వారు పీనుగులను నెలకొల్పు 'మౌనగోపురముల' (టవర్స్ ఆఫ్ సైలెన్స్) పేరు (దఖ్మ) దహ్ అను ధాతువునుండి నిష్పన్న మైనదే.

వేయేల, మానవ తత్త్వమును పరిశీలించుకొనుటలో ఎక్కువ శ్రద్ధ వహింపని జాతులవారికి భౌతిక దేహమే సర్వస్వము, దానిని వా రతిక్రమించి చనసే లేదు. ఉదాత్తమైన వెలుగు వారిని "ఇంకను ఆవలికి పొండి" అని తఱిమినప్పుడు కూడ "ఎట్లో ఒకట్లు ఎప్పుడో ఒకప్పుడు ఈ దేహము అవ్యయ మగును" అను తీర్మానమునకే వారు వచ్చిరి.

మానవుని వివేకిగా గుర్తించి, అతని తత్త్వమును గూర్చిన విచారమునకు తమ శ్రేష్ఠశక్తులను వినియోగించినవారు భారతీయార్యులు. వినియోగించి "ఈదేహమునకు మఱుగున, తమ తండ్రితాతలు ఆసగొన్న ఆభాస్వరదేహమునకు సైతము మఱుగున, యథార్థమానవు డున్నాడు. అవిభాజ్యమగు తత్త్వము (ఆత్మ) ఉన్నది. ఆత్మ తన్ను ఈ దేహముతో కప్పుకొనును, దేహము జీర్ణమైనప్పుడు దానిని త్యజించును" అని అచిరకాలములోనే కనుగొన్నారు. అట్టి తత్త్వము సృజింపబడినదా? సృష్టి యనుమాటకు అర్థము శూన్యమునుండి యేదో పుట్టుటే అయినచో "సృజింపబడినదా" అను ప్రశ్నకు 'లేదు' అనియే ఖండితమగు సమాధానము. ఆత్మకు జననము లేదు, మరణము లేదు; అది సంకీర్ణము కాదు, సమ్మిశ్రము కాదు, స్వతంత్రము, అవిభాజ్యము. కనుక దానిని సృజించుట గాని నశింపజేయుటగాని పొసగదు. వివిధదశలలో ఒకదానినుండి ఒకదాని కది చనుచున్నది. అంతే.

ఈపట్టున సహజముగా నొక ప్రశ్న కలుగును: ఇంతి కాలము అ దెక్కడ ఉండినది? దీనికి హిందూతత్త్వజ్ఞులు "అది వివిధదేహములగుండ పయనించుచుండినది. ఇది భౌతికార్థము.

పారమార్థికముగ, తాత్త్వికముగా, అది వివిధ మానసికదశలగుండ పోవుచుండినది'' అని చెప్పవచ్చును.

హిందూతత్త్వవేత్తలు ప్రతిపాదించిన పునర్జన్మ సిద్ధాంతమున కాధారముగా శ్రుతిప్రమాణములు కాక, మఱే వేని నిదర్శనములు గలవా? కలవు. సర్వజనీనముగా అంగీకరింపబడెడి ఏ సిద్ధాంత మున కయినను ఎంతటి చక్కని ఆధారము లుండునో దీనికిని అంతచక్కని ఆధారములు గలవు. వానిని ముందు ముందు చూప గలుగుదు మనియే మా ఆశ. కాని, ప్రప్రథమముగా యూరపు ఖండములోని ఆధునికవేత్తలు పునర్జన్మనుగుఱించి యేమి చెప్పిరో గమనింతము.

ఐ. హెచ్. ఫిక్టు ఆత్మ అమృతత్వమును గుఱించి ప్రసం గించుచు ఇట్లు చెప్పెను :

''ఎడతెంపులేని ఉనికి లేదనుటకు ఉదాహరింప దగిన సాదృశ్య మొకటి ప్రకృతియం దున్నమాట నిజమే. అది యంద ఱకును తెలిసిన వాదమే. కాలమానముచొప్పున దేని దేని కొక ఆది కలదో దాని దాని కొకానొకప్పుడు అంతరించిపోవుటయు తప్పదు. కనుక ఆత్మ ఈ జన్మకు ముందున్నదని చెప్పినచో, అంతకుపూర్వముగూడ అది యుండియుండవలె నని చెప్పవలసి వచ్చును. ఇది చక్కని నిర్ణయమే. కాని యిది యాత్మనిత్యత్వ వాదమునకు బాధకముగ నుండుటకు బదులు మఱింత సాధక మగు చున్నది. నిజమునకు దేనినిగాని సృష్టించుటయు పొసగదు, నాశనముచేయుటయు పొసగదు అనెడి ఈ తాత్త్విక - శారీరక శాస్త్రసూత్రార్థమును సమగ్రముగా గ్రహించిన చాలు, భౌతిక దేహము దాల్చి ప్రత్యక్షమగుటకు పూర్వము ఆత్మ యుండి యుండె నని గ్రహింప వచ్చును.''

స్కోఫెన్ హోర్ డై వెల్ట్ ఆల్స్ విల్లీ అండ్ వోర్ స్టెల్లంగ్ అను గ్రంథములో పునర్జన్మను గూర్చి చెప్పుచు ఇట్లనెను :

"వ్యక్తికి నిద్ర యెట్టిదో 'సంకల్పము'నకు మృత్యు వట్టిది. దానికి జ్ఞాపకశక్తి, వ్యక్తిత్వము ఉన్నచో నిజమైన ప్రయోజనము లేక అనంతకాల మొక్కవిధమగు పనులనే చేయుచుండుటకు, ఒక్కవిధమగు బాధలనే పడుచుండుటకు అది తాళజాలదు. వీని నది దులిపివేయును. అదియే విస్మృతి. మరణ మనెడి ఈ నిద్ర ద్వారా అది మఱొక బుద్ధిని ధరించి క్రొత్తవ్యక్తిగా మరల కన బడును; క్రొత్త దినము క్రొత్తతీరములకు పోవుద మనిపించును. నిరంతరము క్రొత్తగా కలుగుచున్న ఈ జన్మ లన్నియు కలసి సంకల్ప మనుభవించు 'జీవితము' లనెడి స్వప్నపరంపర. సంకల్పము అనివార్యము. నిరంతరము నవీనరూపములో కలిగెడి వివిధ జ్ఞాన పరంపరవలన అది సుశిక్షితమై, పెంపొంది తన్ను తాను ఉపసంహ రించుకొని రద్దగు వఱకు నీక్రమము సాగుచునే యుండును. ...ఈ విధమగు పునర్జన్మను అనుభవప్రమాణములు కూడ నిరూ పించుచున్న వన్న విషయము అనుపేక్ష్యము. నిజమునకు జీర్ణించి పోయిన ప్రాణుల మరణమునకు క్రొత్తగా నగపడుచున్న ప్రాణుల జననమునకును సంబంధ మున్నది. ఈ సంబంధము వినాశకరము లయిన మహాజాడ్యముల ఫలితముగా మానవతతిలో కల్గు అత్యధిక సంఖ్యాభివృద్ధిరూపమున కననగును. పదునాలవ శతాబ్దమున ప్లేగువ్యాధిచే ప్రాతప్రపంచములోని జనాభా చాలవఱకు అంత రించిపోయినప్పుడు వెంటనే మానవులలో మామూలుకంటె అత్యధికసంఖ్యాకములుగా జననములు గల్గినవి. కవలలు పుట్టుట మిక్కిలి తఱచయ్యెను. ఆ కాలమున పుట్టినబిడ్డల కెవరికిని నోట రావలసిన దంతము లన్నియు రాలేదు. . ఇదియు నొక విశేషము. ప్రకృతి తనశక్తివంచనలేక ప్రయత్నించుచున్నది. కాని, వివర ముల విషయమున ప్రకృతికి లోభము గల్గియున్నది. ఈ విషయము 1825-వ సంవత్సరమున ఎఫ్. స్క్నరరు తన గ్రంథములో తెలిపి యున్నాడు. కాస్పర్ కూడ 1835-వ సంవత్సరమున తన గ్రంథ ములో "ప్రజలజీవితకాలమును మరణములును తప్పక వారిలోని

జననముల సంఖ్యను బట్టి యుండు'' నను సూత్రమును స్థిరపఱచి నాడు, ఏలన జననముల సంఖ్య సర్వదా మరణముల సంఖ్యతో తులతూగుచుండును. జననములు మరణములు సర్వదా, సర్వత్ర ఒక్క పరిమాణములోనే పెరుగును, తఱుగును. ఈ విషయమున సందేహించుటకు ఎడ మీయక వలసిన సాక్ష్యమును అతడు వివిధ దేశములలోని వివిధరాష్ట్రములనుండి సేకరించి యున్నాడు. అయినను నా అకాలమరణమునకు, నాకు సంబంధము లేని ఒక దంపతుల సంతానప్రాప్తితో కాని వారి సంతానప్రాప్తికి నా మరణముతో కాని భౌతికసంబంధమో కార్యకారణసంబంధమో ఉండుట అసంభవము. ఇక్కడ భౌతికసంభవమునకు సమాధానముగూర్చు సన్నిహితాధారము, మహాద్భుతకరమైన ఆధారము, తత్త్వవాదము. ఆ తత్త్వవాదమును కాదన లేము. ప్రతి శిశువును క్రొత్తగా, ఉల్లాసముతో ఈ క్రొత్తజీవితములో ప్రవేశించుచున్నది. ఉచితముగా లభించిన వరముగా ఈ జీవితమును అనుభవించును; కాని, ఉచితముగా లభించున దేదియును లేదు, ఉండుట పొసగదు. ఈ క్రొత్తజీవితమునకు మూల్యము ఇంతకు మునుపటి దేహము జరాజీర్ణమై నశించుటే. నశించిన దానియందనశ్వరమగు బీజ ముండెను. ఆ బీజమునుండియే ఈ క్రొత్త జీవితము వచ్చినది. అందును ఇందును ఉన్న ప్రాణియొక్కటే.

ఆంగ్లేయతత్త్వవేత్త హ్యూమ్ శూన్యవాదియే. అయినను అతడు శంకలను ప్రతిపాదించుచు అమృతత్వమును గుఱించి వ్రాసిన వ్యాసములో ''ఇట్టి సిద్ధాంతములలో తత్త్వవాదము చెవి యొగ్గి ఆదరింపగలది పునర్జన్మసిద్ధాంత మొక్కటే'' అని పేర్కొనెను. తత్వవేత్త యగు లెస్సింగ్ గాఢమగు కవితాదృష్టితో, ''ఈ సిద్ధాంతము అత్యంతప్రాచీనమయినంతమాత్రముచే, అంత హాస్యాస్పదమా? వివిధమతాలవారి కుతర్కములచే తమ బుద్ధి

చెదరుటకు ముందే, సత్త్వహీనమగుటకు ముందే, ఆ బుద్ధి ఒక్క ఊపున పునర్జన్మసిద్ధాంతము నందుకొన్నదే, అందుచే ఆ సిద్ధాంతము హాస్యాస్పద మయినదా? ...... శ్రోత్రజ్ఞానము, శ్రోత్ర అనుభవము పొందగలిగి నన్ని పర్యాయములు నే నేల మరల మరల జన్మింప గూడదు? మరల మరల వచ్చుటను సార్థకమొనర్ప ఏమియు మిగిలి యుండకుండునంతగా ఒక్కపర్యాయమే నే నంతయు గొనివచ్చితినా?'' అని ప్రశ్నించెను.

'పెక్కు జన్మము లెత్తుచున్న ఆత్మ అనాది' అను సిద్ధాంతమునకు అనుకూలములైన యుక్తులును ప్రతికూలములయిన యుక్తులును పెక్కులు గలవు. ఆ సిద్ధాంతపక్షమున పోరాడుటకు కొమ్ములు తిరిగిన మేధావులు యుగయుగమునను నడుముకట్టిరి. మనము గ్రహింపగలిగినంతవఱకు, వ్యష్ట్యాత్మ కల దేని, దానికి పూర్వజన్మమును ఉండి తీరవలసిన దే. ఆత్మ అవిభాజ్యము కాక, మాధ్యమికబౌద్ధులు చెప్పునట్లు వివిధ 'స్కంధాల' సమవాయమే అగు నేనియు, తమవాదమును సమర్థించుటకు పూర్వజన్మము నొప్పుకొనుట వారికిసైతము అనివార్యమయ్యెను.

అనంతమైన సత్తుకు 'ఆది' ఉండుటయు పొసగ దను ప్రతిపాదనమును కా దనుట సాధ్యము కాదు. దానిని పరాస్తము చేయుటకు 'దేవుడు సర్వశక్తి' యని, 'యుక్తి కెంత విరుద్ధమైన దాని నైనను సరే భగవచ్ఛక్తి సాధింప గల' దని నచ్చచెప్పుటకు కొందఱు ప్రయత్నించిరి. ధీమంతులు సహిత మిట్టి కుయుక్తి నొడ్డుట శోచనీయము.

భగవంతుడు విశ్వకారణుడు. దృశ్యమైన దానికెల్ల ఉమ్మడి ఐన కారణము దేవుడు. మానవాత్మయందలి సంఘటనలకు సహజహేతువులను కనుగొనుటే మన సమస్య. కనుక 'ఈ జంత్ర దయ్యపు' సమాధానమునకు సందర్భశుద్ధి లేదు. ఆ సమాధానము

చెప్పుట అజ్ఞానము నొప్పుకొనుటే. మానవవిజ్ఞానములో ప్రతిశాఖ లోను ప్రతిప్రశ్నకును మన మీ సమాధానమునే చెప్పి జిజ్ఞాసనే జ్ఞానమునే పూర్తిగా ఆప వచ్చు. ఇది మొదటి విషయము.

రెండవ విషయ మే మన, దేవుడు సర్వశక్తి అనుమాటనే ప్రతిపర్యాయము చెప్పుట పదములతో వ్యూహ మల్లుట. కారణము, కారణముగా . కార్యమునకు చాలియుండు నని మన మెఱుగుదుము. మన మెఱుగ గల దంతే. అంతకంటె ఏమియు కాదు. అందుచేత నిరవధికమగు కార్యమును మన మెంత ఎఱుగుదుమో సర్వశక్తియగు కారణమును మన మంతే ఎఱుగుదుము. ఇంతేకాదు. దేవునిగుఱించిన మన ఆశయము లన్నియు పరిచ్ఛిన్నములే. జగత్కారణు డనుట కూడ దేవుని పరిచ్ఛేదించుటే.

మూడవ విషయము: ఈవాదము నింతవఱ కంగీకరించినను, ఇంతకంటె మేలైన సమాధానము మనము చెప్పగలిగియున్నంతవఱకు ''అభావమునుండి భావము పుట్టుట'' ''అనంతమైనదాని కొక ఆదియుండుట'' అనునిట్టి అసంగతవాదములను, మన మంగీకరింపవలసిన జరూరు లేదు.

ఆత్మ ఇతఃపూర్వము లే దనుటకు పూర్వజన్మజ్ఞాన మెవ్వరికిని లేకపోవుట ప్రబలకారణముగా కొందఱు చెప్పుదురు. ఈ యుక్తిని సాధు వని నిరూపింపవలెనేని, వారు జీవాత్మసమగ్రముగ స్మృతియావరణమున ఇమిడియున్న దని రుజువు చేయవలసియుండును. ఒకవస్తువు కలదా లేదా అనుటకు దాని జ్ఞాపకము మన కున్నదా లేదా అనుటే ప్రమాణ మయినచో ఇప్పుడు మనకు జ్ఞాపకము లేని మనజీవితవిషయము లన్నియు లేవనియే చెప్పవలసియుండును. మైకముకలిగినందువలనగాని, మఱెందువలనగాని ఒకానొకనికి తన స్మృతితప్పియున్నచో అతడు లే డనియు తీర్మానము చేయవలసి వచ్చును.

ములు అంతరించిపోజాలవు. మన పనులు (కర్మలు) అదృశ్య మగుచున్నట్టు పైకి తోచునే గాని, నిజమున కవి కనబడని (అదృష్ట) రూపములో నుండును. వాని ఫలితము ప్రవృత్తుల రూపములో మరల ప్రత్యక్ష మగును. శిశువులు సహితము కొన్ని కొన్ని ప్రవృత్తులతో జన్మింతురు — ఉదాహరణకు: మృత్యు భయము.

కర్మల ఆవృత్తికి ఫలముగా ప్రవృత్తి ఏర్పడునేని, పుట్టుకతో మనలో నున్న ప్రవృత్తులకు ఉపపత్తిని ఆ ప్రమాణానుసారముగనే చెప్పవలెను. ఆ ప్రవృత్తికి కారణము మన కీ జన్మముననే ఉన్న దనుట పొసగదు. కావున ఆ కారణమును మనము ఈ జన్మకు మునుపు వెదుక వలయును. మానవులకే ప్రత్యేకమగు మనఃపూర్వక ప్రయత్నముల ఫలితముగ మనలో కొన్ని ప్రవృత్తు లేర్పడుచున్న వనుట ప్రత్యక్షము. మన మట్టి ప్రవృత్తులతోనే జన్మించియున్నచో వానికి కారణము గతజన్మలో నుండి యుండ వలె నను తీర్మానము అనివార్యముగ గల్గును. అనగా, ఈ జన్మమునకు ముందు గూడ మానవ స్థాయి అని మనము పేర్కొను ఈ మానసికస్థాయిలోనే మన ముండి యుండ వలె ననుట.

ఈ జీవితములోని ప్రవృత్తులను గతకాలమున మనఃపూర్వకముగ గావించిన ప్రయత్నముల ఫలితముగ వివరించునంత మేరకు భారతదేశములోని పునర్జన్మవాదులును ఆధునికపరిణామవాదులును ఏకీభవించుచున్నారు. ఒక్కటే ఈ యుభయులకును భేదము. హిందువు లాత్మవాదులు. కనుక వ్యష్ట్యాత్మలు మనఃపూర్వకముగా నొనర్చిన ప్రయత్నములను కారణముగా పేర్కొందురు. భౌతికపక్షమువారగు పరిణామవాదులు 'వంశక్రమమున శారీరకముగ సంక్రమించుటే కారణముగా చెప్పుదురు. శూన్యమునుండి సృష్టి గల్గిన దను వారి కిక్కడ తావు లేనే లేదు'.

సర్వానుభవములు భోక్తయగు వ్యష్ట్యాత్మ యందు ప్రవృత్తుల రూపములో నిల్వచేయబడి, అఖండము నవిభాజ్యము

నగు ఆ ఆత్మ పునర్జన్మమెత్తినప్పు డతనితో వచ్చుచుండు నని పునర్జన్మవాదులు చెప్పుచురు. సమస్తకార్యములకు కర్త మెదడు అని, జీవాణువులమూలమున సంక్రమణము జరుగుచుండు నని భౌతికవాదులు చెప్పుదురు. ఇప్పు డీ యుభయపక్షములవారు పరస్పరము పోరాడుకొని ఈ విషయమును తేల్చుకోవలయును.

ఇట్లు పునర్జన్మసిద్ధాంతమునకు మన మనసులలో అంతులేని ప్రాముఖ్యము గల్గినది. పునర్జన్మసిద్ధాంతమునకు, "జీవాణువుల మూలమున సంక్రమించు"నను (సెల్యులర్ ట్రాన్స్మిషను) వాదము నకు జరుగు పోరు ఆత్మవాదమునకు, భౌతికవాదమునకు జరుగు పోరే. జీవాణువులమూలమున సంక్రమించు ననువాదము సమగ్ర పర్యాప్త సమాధాన మయినచో భౌతికవాదమే అనివార్యము అగును. అంతట 'ఆత్మ' సిద్ధాంతము అక్కఱలేని దగును. అది చాలినట్టి సమాధానము కానిచో, వ్యష్ట్యాత్మ పూర్వజన్మలోని అనుభవముల నీ జీవితములోనికి కొనివచ్చుననన్న వాదమును అంతటి పరిపూర్ణసత్యమే అగును. ఈ రెంటిలో ఏదో ఒకటి మనకు తప్పని దగును: పునర్జన్మవాదము, భౌతికవాదము. మనము దేని నంగీకరింతము?



# వేదాంతము : క్రైస్తవము

(కాలిఫోర్నియాలోని ఓక్లండులో యూనిటేరియను చర్చియొద్ద 1900 సంవత్సరము ఫెబ్రువరి 28-వ తేదీనాడు చేసిన యుపన్యాసజ్ఞాపికలు)

ప్రపంచములోని మహామతము లన్నిటియందును, సదృశాంశము లనేకములు గలవు; విభిన్నమతములు పెక్కువివరములను ఒండొకదానినుండి గ్రహించినవనెడి ఆశయమును మనకు ఒక్కొక్కప్పుడు స్ఫురింపజేయునంత ఆశ్చర్యకరముగ నుండును వాని సామ్యము.

ఒకమత మితరమతముల కనుకరణ మనెడి యారోపణ వివిధమతములపైని గలదు; కాని, యిది పైపై ఆరోపణ మాత్రమే అని దిగువ నుదహరించిన విషయములనుబట్టి స్పష్టము కాగలదు:

మానవజాతియాత్మలోనే మతము మూలభూతమైయున్నది. అంతర్గతమయియున్నదాని క్రమవికాసమే జీవిత మంతయు కనుక, మత మనివార్యముగా వివిధదేశీయులద్వారా విభిన్నప్రజలద్వారా తన్ను ప్రకటించుకొనుచున్నది.

ఆత్మభాష ఒక్కటే. ఆయాదేశాలవారి భాషలుపెక్కులు; వారి జీవితాచారవిధానములు మిక్కిలి భిన్నములు. మత మాత్మకు సంబంధించినది. అది వివిధదేశీయులద్వారా, భాషలద్వారా, ఆచారములద్వారా ప్రకట మగుచుండును. ఆత్మభాష, ఏప్రజలలో ఎట్టిపరిస్థితులలో తన్ను వ్యక్తమొనర్చుకొన్నను, అది ఒక్కటే కావున లోకములోని మతములకున్న భేద మంతయు వ్యక్తీకరణమందే కాని సారాంశమందు కా దనుటయు వానిలోని సదృశాంశములును ఐక్యమును ఆత్మగతములు సహజము లను

టయు ఫలితార్థము. వివిధానేక సంగీతవాద్యములందు గల మధుర సామరస్య మక్కడగూడ విన నగుచుండును.

ప్రపంచములోని మహామతము లన్నిటియందు ఉమ్మడిగా గల అంశములలో మొట్టమొదటిది ప్రమాణగ్రంథము. ప్రమాణ గ్రంథము లేని మతము లంతరించి పోయినవి. ఈజిప్టుదేశములోని మతముల కట్టి గతియే పట్టినది. ప్రమాణగ్రంథము ప్రతిగొప్ప మతవ్యవస్థకును ఆధారశిలవంటిది. దానిచుట్టునుతన్మతావలంబులు పరివేష్టింతురు. దానినుండియే ఆవ్యవస్థకు శక్తియు, జీవనమును ప్రసార మగును.

ప్రతిమతము తనప్రత్యేక ప్రమాణగ్రంథమే ఈశ్వరవాణి యని చెప్పుకొనును; ఇతర పవిత్రగ్రంథము లన్నియు అసత్యము లని, అవి యమాయికప్రజలను వంచించున వనియు, ఇతరమత ముల ననుసరించుట మౌఢ్య మనియు, ఆధ్యాత్మికముగా నది అంధత్వమే అనియు వక్కాణించును.

అట్టి దురభిమానము ప్రతిమతములోని పూర్వాచార ప్రియులందును గలదు. ఉదాహరణకు : వైదికమతమువారిలో పూర్వాచారపరాయణులు లోకములోని కెల్ల వేదములే ప్రామా ణిక మగు ఈశ్వరవాణియని పలుకుదురు; దేవుడు జగత్తుతో వేద ములమూలముననే మాటాడె నందురు; అంతే కాదు, వేదముల వలననే ప్రపంచము నిలిచి యున్న దనికూడ చెప్పుదురు. జగత్తు పుట్టకపూర్వమును వేదములు ఉండినవి. ప్రపంచములోని ప్రతి దాని ఉనికికిని కారణము అది వేదములో నుండుటయే. ఆవు ఉండుటకు హేతువు ఆవు అను మాట వేదములలో నుండుటే. అనగా గోవు అని మన మెఱిగిన జంతువు వేదములలో పేర్కొన బడి యుండుటే. వేదభాష స్వతంత్రభాష; దేవునిభాష. తక్కిన భాష లన్నియు దేవభాషలు కావు. తద్భాషాభేదములు మాత్రమే. వేదములలోని ప్రతిశబ్దమును చక్కగ నుచ్చరింప

వలె. ప్రతిస్వరభేదమును చక్కగ పలుక వలెను. ఈ కఠిన నియమములనుండి యేమాత్రము ఇటు గాని, అటు గాని తప్పినను మన్నింపరాని మహాపాతక మగును.

ఈ విధమగు, దురభిమానము అన్నిమతములలోని పూర్వాచారప్రియులందును గలదు. శబ్దార్థములను గుఱించిన యీ పెనుగులాటకు పూనుకొనువారు మూఢులు, ఆధ్యాత్మికదృష్టి విహీనులు. నిజమగు ఆధ్యాత్మికశీలమును వాస్తవముగ అలవఱచు కొన్న వా రెప్పుడును వివిధమతములు ప్రకటమైన రూపమును గూర్చి వాదులాడరు. అన్నిమతములలోను ప్రాణమగు భాగము ఒక్కటే అని వారికి తెలియును. కనుక తమభాషలోనే మాటాడ నందులకై వా రెవరితోను కలహింపరు.

నిజమునకు వేదములు ప్రపంచములోని పవిత్రగ్రంథము లన్నిటిలోను ప్రాచీనతమము లైనవి. వాని నెవరు వ్రాసిరో, ఎప్పుడువ్రాసిరో ఎవరికిని ఇంచుకయు తెలియదు. అవి పెక్కు సంపుటములు. ఆసంపుటము లన్నిటిని అధ్యయనముచేసిన వా రెవ రయిన గలరాయని నాకు సందేహమే.

వైదికమతము హిందువుల మతము అది ప్రాచ్యమతము లన్నిటికిని పునాది. అనగా ఇతర ప్రాచ్యమతము లన్నియు వైదిక మతశాఖలే; ప్రాచ్యమత వ్యవస్థల కన్నిటికి వేదములే ప్రమాణములు.

జీససుక్రైస్తు బోధనలను విశ్వసించుచునే ఆతని బోధలలోని అధికభాగము ఈకాలమున కన్వయింప దను ప్రతిపాదనము యుక్తియుక్తము కాదు. విశ్వాసముగలవారికి సిద్ధులు లభింపక పోవుటకు కారణము (సిద్ధులు లభించు నని జీససుక్రైస్తు చెప్పెను) విశ్వాసమును, పరిశుద్ధతయు చాలినంత లేకపోవుటే అని మీరు చెప్పినచో సమంజసమే. అంతే కాని, అవి ఈ కాలమున కన్వయింప వని చెప్పుట హాస్యాస్పదము.

కనీసము నాకు సమానుడయినను కాని మానవుని నేను చూడ లేదు. నేను ప్రపంచ మంతటను పర్యటించితిని; నేను అత్యంతనికృష్టులగు ప్రజలమధ్య మెలగితిని — మానవులనుచంపి తినువారిమధ్య నుంటిని. కనీసము నాకు సమానుడైనను కాని మానవుని నేను చూడనే లేదు. వారు చేసిన పనులు వివేకము పుట్టక మునుపు నేనును చేసితిని. వారి కున్నంతకంటె ఎక్కువ జ్ఞానము నా కప్పుడు లేదు, ఇప్పు డున్నది. ఇప్పుడు వారి కింతకు మించిన జ్ఞానము లేదు; కొంతకాలమునకు వారికి జ్ఞానము గలుగును. ప్రతివాడును తనస్వభావమున కనుగుణముగా నడచుకొనును. మన మందఱము క్రమవికాసము పొందుచున్నాము. ఈదృక్పథమునుండి చూచినచో మానవులలో ఒకరు మఱొకరికంటె హెచ్చైనవారు కారు.



# సృష్టిశాస్త్రము

సూక్ష్మజగత్తు స్థూలజగత్తు అను రెండు జగత్తులు గలవు. ఈ రెంటినుండియు మన కనుభవముమూలమున సత్యముపలబ్ధమగుచున్నది. అంతరనుభవమువలన సేకరింపబడు సత్యమే మన స్తత్త్వశాస్త్రముగను తత్త్వశాస్త్రముగను మతముగను అగుచున్నది. బాహ్యానుభవమువలన సేకరింపబడు సత్యమే భౌతికవిజ్ఞానశాస్త్రములగుచున్నది. సమగ్రము అయిన సత్యము ఈ యుభయప్రపంచములలోని యనుభవములతో సామరస్యము కలిగి యుండ వలె. స్థూలజగత్తును సూక్ష్మజగత్తు నిరూపింప వలె. సూక్ష్మజగత్తును స్థూలజగత్తు నిరూపింప వలె; భౌతిక సత్యమున కంతర్జగత్తులో ప్రతిరూప ముండ వలె. అంతర్జగత్తునకు బాహ్యజగత్తులో నిరూపణ ఉండ వలె. అయినను, నియతముగా ఈ సత్యము లనేకములు పరస్పర విరుద్ధములుగ నుండుటను గాంచుచున్నాము. ప్రపంచచరిత్రలో ఒకానొకదశలో అంతర్జగత్తత్త్వవేత్తలు ప్రధానులై బాహ్యజగత్తత్త్వవేత్తలతో పోరాడ నారంభింతురు. ఈ కాలమున బాహ్యజగత్తత్త్వవేత్తలు, భౌతిక విజ్ఞానవేత్తలు ప్రబలులైరి. వారు మన స్తత్త్వశాస్త్రజ్ఞులు, తత్త్వశాస్త్రజ్ఞులు ప్రతిపాదించిన పెక్కువిషయములను నిరాకరించిరి. నాకు తెలిసినంతవఱకు మన స్తత్త్వశాస్త్రములోని యథార్థములగు ప్రధానభాగములకు, ఆధునికవిజ్ఞానశాస్త్రములోని యథార్థములగు ప్రధానభాగములకు సంపూర్ణమైన ఒద్దిక గల్గి యున్నది. ప్రతివిషయములోను అధికుడుగ నుండు ప్రాప్తి ఎవనికిని ఉండదు; అన్ని విజ్ఞానరంగములలోని పరిశోధనలలోను సమానసామర్థ్యము ఏ జాతివారికిగాని ఏ దేశమువారికిగాని ఉండదు. బాహ్యభౌతికవిజ్ఞానపరిశోధనమునం దాధునిక

యూరపియను దేశీయులు అత్యధికశక్తిసమంచితులై యున్నారు. కాని, మానవుని అంతఃప్రకృతిపరిశోధనయందు వారి సామర్థ్య మంత గొప్పది కాదు. మఱి ప్రాచ్యులు బాహ్యాభౌతికవిజ్ఞాన పరిశోధనల అధికప్రబలురు కారు. కాని, అంతర్జగత్తు పరిశోధన యందు వా రత్యంతదక్షులు. అందుచేతనే ప్రాచ్యుల భౌతికాది విజ్ఞానశాస్త్రములకు పాశ్చాత్యుల విజ్ఞానశాస్త్రములకు పొత్తు కుదురలేదు; పాశ్చాత్య మన స్తత్త్వశాస్త్రమును ప్రాచ్యమన స్తత్త్వ శాస్త్రము నొక్కటిగా లేవు. ప్రాచ్యభౌతికవిజ్ఞానవేత్తలను పాశ్చాత్యవైజ్ఞానికు లోడించిరి. ఉభయులును ఎవరిమట్టుకు వారు తమశాస్త్రమే సత్యముపై నాధారపడిన దని చెప్పుకొందురు; ఇంతకు ముందు చెప్పినట్లు ఏ విజ్ఞానరంగములోని సత్య మయినను సరే, తన్ను తాను ఖండించుకోదు. అంతర్జగత్తులోని సత్యము లకు బాహ్యజగత్తులోని సత్యములతో సామరస్య మున్నది.

ఆధునిక ఖగోళశాస్త్రజ్ఞులు, భౌతికవిజ్ఞానవేత్తలు సృష్టి రహస్యమును గుఱించి ప్రతిపాదించు సిద్ధాంతము లేవో మన కంద ఱకు తెలియును. అవి యూరపువారి భగవత్తత్త్వశాస్త్రమును, ఎంత శోచనీయముగా అణచిపాఱవేసినదియుగూడ తెలియును. ఈ వైజ్ఞానికపరిశోధనఫలితములు భగవత్తత్త్వశాస్త్రదుర్గముపై ప్రేల్చిన బాంబులవంటి వయినవి. భగవత్తత్త్వవేత్తలు సర్వకాల ములలోను వైజ్ఞానికపరిశోధనల నడచివేయుటకు ఎట్లు ప్రయత్నిం చుచువచ్చిరోకూడ మన మెఱుగుదుము.

సృష్టిశాస్త్రమును గుఱించి, దానికి సంబంధించిన విషయ ములను గుఱించి ప్రాచ్యుల మన స్తత్త్వశాస్త్రములోని ఆశయముల నిక్కడ పరామర్శింపదలచితిని. అవి ఆధునికవిజ్ఞానరంగములో పరిశోధనచేసి క్రొత్తక్రొత్తగా కనుగొన్న సత్యములకు ఎంత అద్భుతముగా సరిపడుచున్నవో మీరు గుర్తింపగలరు; ఎక్క డయినను అపశ్రుతి యున్న యెడల, లోపమాధునిక వైజ్ఞాని

కలదే గాని ప్రాచ్యవేత్తలది కాదనియు మీరు గుర్తింతురు. మన మందఱము ప్రకృతి యను మాటను వ్యవహరింతుము. దానిని ప్రాచీనసాంఖ్యదార్శనికులు రెండుపేళ్లతో వ్యవహరించిరి. ఒకటి ప్రకృతి. ఇది చాలవఱకు ఇంగ్లీషులోని నేచర్ వంటిదే. మఱొకటి దీనికంటె శాస్త్రోచిత నామము: అవ్యక్తము. దేనినుండి అణువులు, సూక్ష్మాణువులు, శక్తులు, మనస్సు, సంకల్పము, బుద్ధి మున్నగు సమస్తము వచ్చునో అది. యుగములకు పూర్వమే భారతదేశములోని తత్త్వజ్ఞులును వేదాంతులును మనస్సు భౌతిక పదార్థమని నిర్ధారణచేసియుండి రని తెలిసినప్పుడు మిక్కిలి ఆశ్చర్యము కలుగుచున్నది. ఆధునిక భౌతికవాదులు చేయుచున్న ప్రయత్న మేమి? దేహ మెంత ప్రకృతిజన్యమో మనస్సును అంత ప్రకృతిజన్యమే అని రుజువుచేయుటే కదా? సంకల్పమును అట్టిదే. బుద్ధికూడ అటువంటిదే అని ముందు ముందు మనము గ్రహింపగలము. 'సర్వము అవ్యక్త మనియెడి అభిన్నప్రకృతి నుండియే ఉద్భూత మగుచున్నది. అది సత్త్వరజస్తమశ్శక్తుల సమస్థితి యని సాంఖ్యులు నిర్వచింతురు. వీనిలో నికృష్ట మగు తమస్సు ఆకర్షణశక్తి. ఇంతకంటె ఉత్కృష్టమయినది రజస్సు. ఇది నెట్టివేయు శక్తి. మిక్కిలి ఉత్కృష్టమయినది సత్త్వము. ఇది రజస్తమస్సులను సమస్థితి యందుంచును. రజస్తమశ్శక్తులను సత్త్వము సంపూర్ణముగా స్వాధీనమందుంచుకొన్నప్పుడు సృష్టి లేదు. జగత్తులో చలనమే యుండదు. ఈ సమస్థితికి ఈ తూగునకు భంగము కలిగినప్పుడు, ఈ రెంటిలో ఏదో యొకశక్తి మఱొకదాని కంటె ప్రబలినప్పుడు చలనము ప్రారంభమగును, సృష్టి జరుగును. ఈ క్రమము చక్రరీతిలో మాటిమాటికిని జరుగుచుండును. అనగా, సమత్వము చెదరిపోయినస్థితి కొంతకాల ముండును. ఆ స్థితిలో శక్తులు కలిసి కలిసి, వస్తువులు ఉప్పతిల్లుచుండును. కాని, దీనితోపాటు ప్రతివస్తువునకు తొలిసమస్థితిని చేరుకొనవలె ననెడి ప్రవృత్తి గలదు. సర్వసృష్టి లయమై పోవు కాల మొకనాటికి

వచ్చును. మరల కొంతకాలమునకు సమస్థితి సర్వము చెదరి పోవును; సృష్టి జరుగును. తరువాత నెమ్మదిగా కెరటములవలె అంతయు అడగిపోవును. సమస్తచలనమును, సృష్టిలోని ప్రతి విషయమును లేచుచు, పడుచు నుండు తరంగములతో పోల్చ వచ్చును. సృష్టియంతయు కొంతకాల మడగి యుండు నని కొందఱు తత్త్వజ్ఞుల మతము. ఒక్కొక్క పర్యాయము కొన్ని కొన్ని గోళకుటుంబములకు మాత్రమే విలయము కల్గుచుండు నని మఱికొందఱి యభిప్రాయము. అనగా, ఒకగోళకుటుంబము సూర్యకుటుంబము ఇక్కడ అడగి, అవ్యక్తమున లయించు చుండగా, లక్షలకొలది యితర గోళములు ఉత్పత్తిల్లుచుండును, వెలువడుచుండును. "సమస్తవిశ్వము ఒక్కమాఱుగా లయము కాదు, వివిధప్రాంతములలో వివిధసంభవములు జరుగుచుండు" నను ఈ రెండవ అభిప్రాయమే నాకు ఎక్కువ నచ్చినది. కాని, సూత్ర మొక్కటే: మనము చూచు సమస్తము, ఈ ప్రకృతి, అభ్యుదయపతనముల నొకదాని వెంట నొకదానిని మరల మరల ప్రాపించుచు ముందుకు సాగుచుండును. పతనముతో తిరోగమ నముతో తొల్లింటి సంపూర్ణసమస్థితి పొందుటకు ప్రళయ మని పేరు. అది కల్పమునకు సమాప్తి. ప్రపంచసృష్టిలయములను భారతదేశములోని ఆస్తికరచయితలు ఈశ్వరుని నిశ్వాసోచ్ఛ్వాస ములుగ రూపించిరి; భగవంతుడు ఊపిరివిడువగా విశ్వము బహిర్గతమగును; మరల అది యతనిలోనికి మగుడును. ప్రపంచము లీనమైపోయినప్పుడు దాని కేమగును? అది ఉండును; సూక్ష్మాతి సూక్ష్మరూపములలో నుండును; సాంఖ్యశాస్త్రపరిభాషప్రకారము "అది కారణరూపమున ఉండును." అది స్థల కాల కార్యకారణ నియతులను తప్పించుకోలేదు; అవి అక్కడే గలవు; కాని అత్యంత సూక్ష్మరూపములం దుండును. ఈ విశ్వమంతయు సంకోచము పొంద ప్రారంభ మయిన దనుకొందము. మనలో ప్రతియొక్క రము చిన్నచిన్నలుసుగా మాఱిపోవుచుందుము. కాని, మన మీ

వనూర్చు నెంత మాత్రమును గుర్తింపజాలము. ఏల యన, మనతోపాటు మనకు సంబంధించిన ప్రతివస్తువు సూక్ష్మ మగు చుండును. ఈ సర్వము సంకోచము పొందును. మరల వ్యాకోచము చెందును. కారణము కార్యమును బహిర్గత మొన ర్చును. ఈ క్రమము సాగిపోవుచుండును.

ఈ కాలమున మనము స్థూలద్రవ్య మను దానిని ప్రాచీన మనస్తత్త్వవేత్తలు భూతము లని వ్యవహరించిరి. వారిమతము ప్రకార మొక్కభూతముమాత్రమే శాశ్వత మైనది; దాని నుండియే తక్కిన భూతము లన్నియు ఉద్భవిల్లును. ఆకాశ మని ఆ భూతమునకు పేరు. ఆధునికులు చెప్పు 'ఈథర్' అనుదానికి అది కొంత సదృశముగా నున్నది. కాని ఈ రెండును సరిగా ఒక్కటే కావు. ఈ భూతముతోపాటు ఆదిశక్తి గలదు. దానికి ప్రాణ మని పేరు. ప్రాణాకాశములు కలసి కలసి, తమనుండి భూతములను రూపొందించును. కల్పాంతమున సర్వము సమసి ఆకాశములో, ప్రాణములో లీనమై పోవును. ఇంతివఱకు గల మానవరచనలలో ప్రాచీనతమ మగు ఋగ్వేదములో సృష్టిని గూర్చిన చక్కనివర్ణన ఉత్తమకవిత్వము కలదు. — "అప్పుడు సత్తును లేదు, అసత్తును లేదు. తమస్సు తమోావృత మైనప్పుడు ఉండినదేది?" దానికి సమాధాన మిట్లీయబడినది : "అప్పు డది చలనము లేక యుండెను." అప్పుడీ ప్రాణ ముండెను. అందు చలనము లేదు. ఆనిదవాతము అనగా చలనములేనిదని అర్థము. చలన మాగిపోయినది; తరువాత కల్పము ప్రారంభమైనప్పుడు— బహుదీర్ఘకాలవిరామము తరువాత — ఆనిదవాతము (చలనము లేని సూక్ష్మాణువు) చలింప ప్రారంభించును. ప్రాణము ఆకాశ మును మాటిమాటికిని తాడనముచేయును. అణువులు ఘనీ భవించును. అవి చిక్కనగుకొలది వివిధభూతము లేర్పడును. ఈ విషయములు వింతవింతగ అనువదింపబడుచుండుటను మనము

సాధారణముగ కనుచుందుము. జనులు తత్త్వవేత్తలదగ్గఱకో, వ్యాఖ్యాతలదగ్గఱకో పోయి యర్థము చెప్పించుకొనరు. సొంతముగ నర్థము చేసికొనుటకు వారికి బుద్ధి లేదు. సంస్కృతము మూడక్షరములనైన నేర్చెనో లేదో వెంగలి, పూర్తిగ్రంథమునే అనువదించును. భూతములను గాలి, నిప్పు మొదలయినవిగా అనువాదము చేయుదురు. భాష్యకారులదగ్గఱకు పోయి అడుగుదురేని ఆ మాటల కర్థము వాయువు మొదలయిన వేదియు కాదని కనుగొందురు.

ఆకాశమును ప్రాణము మాటిమాటికిని తాడనము చేయగా చలనము అనగా వాయువు కలుగును, వాయువు చలించును. ఈ ప్రసారవేగ మంతకంత కధికము కాగా, ఒరపిడికల్గును. అందుండి తేజస్సు జనించును. ఈ తేజస్సు ద్రవరూపము దాల్చి నీరు (అప్పు) అగును. తరువాత ఈ ద్రవము ఘనీభవించును. ఆకాశము - వాయువు - తేజస్సు - అప్పు - ఘనపదార్థము (పృథివి) ఈవరుసన రూపుదాల్చుట గంటిమి. రూపు విరిసిపోవునప్పు డిందుకు వ్యతిరిక్తమైన వరుసలో మార్పు సాగును. ఘనపదార్థము నీరగును. నీరు తేజ స్సగును. తేజస్సు నెమ్మదిగా వాయు వగును. వాయు చలనము ఆగి పోవును. ఈకల్ప ముపసంవృత మగును. మరల సృష్టి మొదటి క్రమమాన రూపుదాల్చును, రెండవక్రమాన ఆకాశములో విలీన మగును. ఆకాశసాహాయ్యము లేక ప్రాణ మొక్కటే పని చేయ జాలదు. చలనము, స్పందనము, సంకల్పము అను రూపములలో మనకు తెలిసిన దేది కలదో అ దెల్ల ప్రాణమునకు రూపాంతరమే. రూపముగానో, ప్రతిఘటనగానో పదార్థముగా మనకు తెలిసిన దెల్ల ఆకాశమునకు రూపాంతరమే. ప్రాణము తానొక్కటే ఉండ జాలదు ; మ ఱొక వస్తువు గుండనే కాని అది పనిచేయజాలదు. ప్రాణము స్వచ్ఛరూపములో నున్నప్పు డాకాశమే దానికి ఆశ్రయము; వికిరణ - గురుత్వాకర్ష

ఇది ప్రకృతిశక్తులుగా మారినప్పుడు దానికి పదార్థాశ్రయము కావలెను. పదార్థములేని శక్తిని గాని, శక్తిశూన్యమయిన పదార్థమును గాని మీ రెన్నడును చూచి యుండరు, అత్యంతసూక్ష్మరూపములో వేఱని ప్రాణ మనియు ఆకాశ మనియు మనము పేర్కొందుమో కేవలము వాని స్థూలరూపములే శక్తియనియు పదార్థమనియు వ్యవహరింపబడుచున్నవి. ప్రాణమును మీరు ఆంగ్లములో 'లైఫ్' 'జీవశక్తి' అన వచ్చు. ప్రాణ మనగా మానవుని జీవము మాత్రమే కాదు. ప్రాణమే ఆత్మ యనియు అనుకొనరాదు. ఇదియే సృష్టిక్రమము. సృష్టికి ఆద్యంతము లుండజాలవు ; అది నిత్యప్రవర్తమానమగు వ్యాపారము.

ఈప్రాచీన మన తత్త్వవేత్తల యభిప్రాయమును మఱొకదానిని ప్రస్తావింతును: స్థూలవస్తువు లన్నియు సూక్ష్మవస్తుప్రభవములె. ప్రతిస్థూలవస్తువును సూక్ష్మవస్తువులచేరికచే నేర్పడినదే. ఆసూక్ష్మవస్తువులను వారు తన్మాత్ర లందురు. తన్మాత్ర లనగా సూక్ష్మాణువులు. నేను పువ్వును వాసన చూచుచున్నాను. ఆఘ్రాణించుటకు నా ముక్కును ఏదో వచ్చి తాక వలె ; పువ్వు అక్కడే యున్నది. అది నాయొద్దకు కదలి రాలే దనుట స్పష్టమే. పువ్వునుండి వచ్చి, నాఘ్రాణేంద్రియమును స్పృశించుదానికే తన్మాత్ర అని పేరు. బహుసూక్ష్మమగు పుష్పరేణువులే తన్మాత్రలు. వేడిమి వెలుగు మొదలగు ప్రతిదాని విషయ మింతే. ఈతన్మాత్రలను మరల అణువులుగా విభజింపవచ్చును. పలువురు తత్త్వజ్ఞులు పలువాదములను ప్రతిపాదించిరి. ఇ వన్నియు కేవలము వాదములె అని మన మెఱుగుదుము. ప్రతిస్థూలవస్తువు సూక్ష్మాతిసూక్ష్మవస్తువుల చేరికచే నేర్పడినదని తెలిసికొనుట మన ప్రస్తుత విషయమునకు చాలు. మొదట మనకు స్థూలభూతములు గోచరించును; బాహ్యముగ వానిని మన మనుభవింతుము. తరువాత సూక్ష్మభూతములు మనఘ్రాణమును, చక్షువులను, కర్ణములను

స్పృశించును. ఆకాశతరంగములు వచ్చి నా చక్షువులను తాకును; అవి నాకగపడవు. కాని, అవి వచ్చి నా నేత్రములను స్పృశించిన గాని నేను చూడజాలనన్న విషయము నాకు తెలియును.

కన్ను లివిగో. కాని, ఈ కన్నులు చూడవు. మెదడు లోని కేంద్రమును తీసివేయుడు; కన్ను లక్కడనే యుండును. బాహ్యప్రపంచపు నిండు ప్రతిబింబము నేత్రాంతఃపటలముమీదనే ఉండును; అయినను కన్నులు చూడవు. కావున కన్నులు అప్రధానోపకరణములే కాని దృగింద్రియములు కావు. మెదడు లోని నాడీకేంద్రమే నేత్రేంద్రియము. అటులనే ముక్కు కూడ ఉపకరణమే. దానివెనుక ఇంద్రియ మున్నది. ఈచక్షుశ్శ్రోత్రా దులు కేవలము బాహ్యోపకరణములు. ఈయుపకరణములవెనుక నున్నవి సంస్కృతభాషలో ఇంద్రియము లనబడునవి. అవే యథార్థజ్ఞానస్థానములు.

చూడగలుగుటకు మనస్సు ఇంద్రియమున కనుసంధింపబడి యుండవలె. మనము చదువులోమునిగియున్నప్పుడు గడియారము కొట్టు గంట వినబడదు. ఇది సర్వసాధారణానుభవమే. చెవి యిక్కడే యున్నది. ధ్వనితరంగములు దానిద్వారా మెదడుకు గొనిపోబడినవి; అయినను శబ్దమును వినలేదు. దీనికి కారణము మనస్సు శ్రవణేంద్రియమున కనుసంధింపబడక పోవుటే.

ఒక్కొకఉపకరణమున కొక్కొక్క ఇంద్రియ మున్నది. ఒక్కటే ఉపకరణము అన్ని యింద్రియములకును ఉపయోగపడు నెడల దానికి మనస్సు అనుసంధింపబడినప్పు డన్ని యింద్రియము లొక్కమారుగా పనిచేయును. గడియారపుశబ్దము నుదా హరణమున మనము గుర్తించిన రీతిగా అది అట్లు లేదు. అన్ని ఉపకరణములకు ఒక్క ఇంద్రియమే యున్న యెడల మనస్సు ఏకకాలమందే కనును, వినును; ఆఘ్రాణించును. సరిగా ఏకకాలముననే ఇన్ని పనులు చేయకుండుట దానికసాధ్యము.

కనుక ఒక్కొక్క ఉపకరణమునకు ఒక్కొక్క ఇంద్రియ మవసరము. ఆధునిక శారీరశాస్త్రముకూడ ఈవిషయమును ధ్రువ పఱచినది. చూచుట, వినుట మన కేకకాలమందు సాధ్య మగు చున్నవి. ఇందుకు కారణము మన సీ రెండు కేంద్రములలో కొంత దానితోను కొంత దీనితోను అనుసంధింపబడి యుండుటె.

ఇంద్రియములు వేనితో చేయబడినవి? కన్నులు, చెవులు, ముక్కు మొద లయిన ఉపకరణములు స్థూలపదార్థముతో చేయ బడిన వనుట స్పష్టము. ఇంద్రియములుకూడ పదార్థముతోనే చేయబడినవి. ఈ దేహము స్థూలపదార్థముతో నిర్మిత మయి నది; ఇది ప్రాణమును వివిధస్థూలశక్తులుగా రూపొందించు చున్నది. అటులనే ఇంద్రియములు ఆకాశము, వాయువు, తేజస్సు మున్నగు సూక్ష్మపదార్థములతో నిర్మితము లయినవి; ఇవి ప్రాణమును జ్ఞానసాధకములగు సూక్ష్మశక్తులుగా రూపొం దించును. ఇంద్రియములు, ప్రాణవ్యాపారములు, మనస్సు, బుద్ధి అన్నియు కలసి మానవుని 'లింగశరీరము' 'సూక్ష్మశరీరము' అగును. పదార్థమయినదానికెల్ల రూప ముండ వలె కనుక లింగశరీరమునకు వాస్తవమగు రూప ముండియే తీర వలె.

వృత్తియందు, సచలనస్థితియం దున్న చిత్తమే మనస్సు. కొలనులో మీఁద రాయి విసరివేసిన మొదట చలనము కలుగును. తరువాత ప్రతిఘటన ముండును. క్షణకాలము నీరు చలించును. తరువాత అది రాయిమీఁద ప్రతిక్రియ చూపును. అటులనే భావ ముద్ర చిత్తముమీఁద పడినప్పు డది మొదట కొంచెము చలించును. అదియే మనస్సు. మనస్సు ఆ భావమును ఇంకను లోనికి గొని పోయి బుద్ధి కందజేయును. బుద్ధి, నిశ్చాయకశక్తి. అది ప్రతిక్రియ సేయును. బుద్ధి వెనుక అహంకార మున్నది. అది ''అహ మస్మి'' అని పల్కు ఆత్మచైతన్యము. అహంకారమునకు వెనుక మహత్తు కలదు. మహత్తు అనునది ప్రజ్ఞ. ఇది ప్రకృతిస్థితి దాల్చు

పరిమోత్కృష్టరూపము. వీనిలో ప్రతిది తన తరువాతి దాని ఫలితమే. కొలనువిషయములో దానికి తగిలెడి ప్రతిదెబ్బ బాహ్యప్రపంచమునుండియే వచ్చుచున్నది. మనస్సువిషయములో దెబ్బ బాహ్యజగత్తునుండియు రావచ్చు; అంతర్జగత్తునుండియు రావచ్చు. బుద్ధికి వెనుక పరిశుద్ధుడును పరిపూర్ణుడు నగు మానవాత్మ, పురుషుడు, ఆత్మ ఉన్నాడు. అత డొక్కడే సాక్షి. అతని కొఱకే ఈ సమస్తపరిణామమును.

మానవు డీ సమస్తపరిణామములకును సాక్షిగ నుండును; అతడు ఎప్పుడును తనంతట అపరిశుద్ధుడు కాడు; కాని, వేదాంత శాస్త్రమున అధ్యాస మనబరగుదానిచేతను, చింతనచేతను, వ్యంగ్యముచేతను అత డపరిశుద్ధుడైనట్లు కనబడుచున్నాడు. ఎఱ్ఱని పువ్వో, నల్లని పువ్వో చెంత నున్నప్పుడు స్వచ్ఛ మగు స్ఫటికము ఎఱ్ఱగానో, నల్లగానో కనబడుట వంటి దది: వర్ణము స్ఫటికముపై ప్రతిఫలించినదే కాని, స్ఫటికము స్వచ్ఛముగానే ఉన్నది. అనేకాత్మ లున్న వనియు ప్రతిఆత్మయు పవిత్రమును, పరిపూర్ణము ననియు నంగీకరింతము; బహువిధములయిన సూక్ష్మ, స్థూలపదార్థములు ఆత్మ నావరించి, దాని పెక్కువన్నెలు కూర్చును. ఇ దంతయు ప్రకృతి యేల చేయును? ఆత్మవికాసముకొఱకు ప్రకృతి యీ పరిణామముల కన్నిటికి లోనగుచున్నది; ఈ సృష్టియంతయు ఆత్మకొఱకే, ఆత్మవిముక్తి కొఱకే. జగత్తనెడి బృహద్గ్రంథము మానవుడు చదువుకొనుటకై అతని సమక్షమున తెఱచిపెట్టబడియున్నది; తుదకు తాను సర్వజ్ఞుడ నని, సర్వశక్తి నని అతడు కనుగొనును. మాలోని మన తత్త్వశాస్త్రవిద్వరిష్ఠులకు కొందఱికి దేవునియందు మీకున్న రీతి నమ్మకము లే దని యీ సందర్భమున నేను స్పష్టము చేయవలసియున్నది. మా మన తత్త్వశాస్త్రమునకు జనకుడగు కపిలుడు దేవుడు లే డనెను. సగుణబ్రహ్మము బొత్తిగా అనవసర మని యతని యభిప్రాయము; సమస్తసృష్టిని నిర్వహించుటకు ప్రకృతియే

సమర్థమై యున్నది. సంకల్పసిద్ధాంతము నతడు త్రోసిరా జనెను. అంతకంటె అవివేకప్రవాదము మఱియొకటి లేదని యత డనెను. కాని, ఒకవిధముగ విశిష్టదైవము నత డంగీకరించెను. అతని వాదము: మనము ముక్తుల మగుటకు నిరంతరము పోరాటము సాగించుచునే యున్నాము; మనము ముక్తులమయినప్పుడు ప్రకృతి యందు లీనులమై పోగలము. మఱొకకల్పప్రారంభమప్పుడు మరలి, మనము దానికి పాలకులము కాగలము. మన మప్పుడు సర్వజ్ఞులముగా, సర్వశక్తులముగా వెలువడుదుము. ఆ యర్థములో మనలను దేవులని పేర్కొనవచ్చు; మీరేమి, నేనేమి, అల్పిష్ఠజీవులు సైతము వివిధకల్పములలో భగవంతులము కాగలము. అట్టి దేవుడు అనిత్యుడుగ నుండు ననియు, నిత్యుడును నిత్యసర్వశక్తి యునై జగమునేలు దేవు డసంభవ మనియు కపిలుని సిద్ధాంతము. అట్టిదేవు డుండినచో ఈ చిక్కు కలుగును: అతడు బద్ధాత్మ అయినను కావలె, బంధరహితాత్మ అయినను కావలె. పరిపూర్ణ స్వతంత్రుడగు దేవుడు సృష్టిసేయడు; అతనికి ఆ యవసరమే లేదు. అతడు బద్ధు డయినచో సృష్టి చేయడు; ఏల యన సృష్టిసామర్థ్య మతనికి లేదు, అతడు శక్తిరహితుడుగ నుండును. ఏమైనను సర్వజ్ఞుడును, సర్వశక్తియు, జగత్తునకు నిత్యపాలకుడు నగు దేవు డసంభవము. మా గ్రంథములలో దేవుని ప్రస్తావ మెక్కడ వచ్చినను ముక్తు డయిన మానవు డనియే యర్థ మని యాతని వాదము.

అన్ని యాత్మల ఐక్యమునందు కపిలునకు నమ్మకము లేదు. అతడు కావించిన విభజన దాని మట్టుకు అది యద్భుతమయినది. భారతీయతత్త్వవేత్తల కతడు జనకుడు; బౌద్ధమతమును, తదితర మతములును అతని వాదము నాధారముచేసికొని పుట్టినవే.

అతని మనస్తత్త్వవాదము ప్రకారము అఖిలాత్మలు తమ విముక్తిని మరల తాము పొందవచ్చును; తమ సహజహక్కులను

మరల బడయవచ్చును. సర్వజ్ఞత్వమును, సర్వశక్తిత్వమునే ఆ సహజహక్కులు. ఇక్కడ ఉత్పత్తిల్లు ప్రశ్న యిది: ఈ బంధ మెందున్నది ? అది యనాది యని కపిలు డనును. అగుసేని, దేనికి ఆది లేనో దానికి తుదియు నుండదు కదా. మన మేనాటికిని ముక్తులము కానేరము. బంధ మనాదియే అయినను, అది ఆత్మవలె సర్వదా ఏకరీతినుండు స్వభావము కలది కా దని, అతని ప్రతిపాదన. అనగా, ప్రకృతి (బంధహేతువు) ఆద్యంతములు లేనిది; కాని, ఏ అర్థములో ఆత్మ కాద్యంతములు లేవో ఆ యర్థములో మాత్రము కాదు. ఏలయన, ప్రకృతికి అవిభాజ్యత లేదు కదా; అది, అనుక్షణము క్రొత్త నీటిమొత్తము వచ్చి కలియు నదివంటిది; ఈ నీటిమొత్తము లన్నియు కలిసియే నది యగుచున్నది. నది యెల్లప్పుడు నొక్కవిధముగా నుండునది కాదు. ప్రకృతిలోని ప్రతివస్తువు నిరంతరము మార్పు చెందుచున్నది. కాని, ఆత్మ యేనాటికిని మార్పు చెందదు; ప్రకృతి నిరంతరము మార్పు చెందునది గనుక దానిబంధమునుండి విముక్తినొందుట ఆత్మకు సాధ్యమే.

ఈవిశ్వములోని ఒక్కభాగము ఏసూత్రముపై నిర్మితమయినదో విశ్వమంతయు నదేసూత్రముపై నిర్మిత మయినది. కనుక నా కొక మనస్సు ఉన్నట్లే విశ్వమునకు నొక మనస్సు ఉన్నది. వ్యష్టియం దెట్లో సృష్టియంతటను అట్లే. విశ్వమునకు స్థూలదేహ మున్నది; దాని వెనుక విశ్వపు సూక్ష్మదేహమున్నది; దాని వెనుక విశ్వమన స్సున్నది. దాని వెనుక విశ్వాహంకారము (చైతన్యము) ఉన్నది; దాని వెనుక విశ్వబుద్ధి ఉన్నది. ఇదంతయు ప్రకృతిలోనిది; ప్రకృతివికాసము; దానికి వెలుపలిది కాదు.

మన జననీజనకుల దగ్గఱనుండి మనకు స్థూలదేహమును, చైతన్యమును వచ్చినవి. నా దేహము నాతల్లిదండ్రుల దేహముల లోని భాగమే అని, నాచైతన్యమును, నా అహంకారమును నా

తల్లిదండ్రుల చైతన్యాహంకారముల భాగములే అని తు. చ. తప్పని సంశోపరింపరానియమము చెప్పుచున్నది. తల్లిదండ్రుల దగ్గఱనుండి సంక్రమించిన స్వల్పమునకు విశ్వచైతన్యమునుండి గ్రహించినది చేర్చ వచ్చును. అనంతమయిన బుద్ధిభాండారము గలదు. దానినుండి మనకు కావలసినది గ్రహింతుము; ప్రపంచములో అనంతముగు మనశ్శక్తినిలయ మున్నది. దానినుండి మనము నిరంతరము గ్రహించుచున్నాము; కాని, బీజము జననీజనకులనుండియే రావలె. వంశపరంపరధర్మమును, పునర్జన్మ సిద్ధాంతమును కలుపుకొనునది మా సిద్ధాంతము. వంశపరంపర సూత్రము ననుసరించి పునర్జన్మ మెత్తు జీవుడు తల్లిదండ్రులదగ్గఱ నుండి మానవుని నిర్మాణమునకు కావలసిన పదార్థములు గ్రహించును.

నేనున్నాను కనుక ఈ ప్రపంచ మున్న దని కొందఱు యూరోపియను తత్త్వవేత్తలు వక్కాణించిరి; నేను లేనిచో ప్రపంచము నుండదు. ఒక్కొక్కప్పు డీ విషయ మీ విధముగా చెప్పబడును : లోకములోని జను లందఱును మరణింతు రేని, మఱి మానవు లెవరును లేకుందు రేని, చూడగల, గ్రహింపగల శక్తిగల్గిన జంతువు లేవియు లేకుండు నేని, ఈ ఆవిష్కారము లన్నియు నదృశ్యములై పోవును. ఈయూరోపియనుతత్త్వవేత్తలు సిద్ధాంతమును గుర్తించిరే గాని, దాని మన స్తత్త్వరహస్యము వారికి బోధపడ లేదు; ఆధునికతత్త్వశాస్త్ర మా రహస్యమును ఈషన్మాత్రము గ్రహించినది. సాంఖ్యుల దృక్పథముతో చూచిన ఈవిషయము సుబోధ మగును. సాంఖ్యసిద్ధాంతము ప్రకారము నా మనస్సులో కొంతభాగముతో రూపొందని వస్తువు ఏది కాని ఉండుట దుర్ఘటము. ఈ బల్ల ఉన్నదున్నట్టుగా నే నెఱుగను, దానినుండి ఒకముద్ర నాకన్నుల కందును; తరువాత ఇంద్రియముల కందును తరువాత మనస్సున కందును. అంతట మనస్సు ప్రతీకారము

చేయును. ఆ ప్రతీకారమునే నేను బల్ల అనుచున్నాను. కొల నులో రాయి విసరి వేయుటవంటిదే యది; రాతి నెదుర్కొను టకు కొలను కెరటమును విసరును; మనకు తెలిసినది ఈకెరటమే. బయట ఉన్న దేమో ఎవరికిని తెలియదు; తెలిసికొనుటకు నేను ప్రయత్నించినప్పుడు, అది నేను సరఫరాచేయు నొకపదార్థముగ రూపుదాల్పవలెను. నేను నా మనస్సుతో నా కన్నులకు విష యము నందజేసితిని. బయట ఏదో ఉన్నది. అది అవకాశము, సూచకముమాత్రమే. నే నా సూచనపై నా మనస్సును ముందుకు నిగిడింతును; అంతట అది నేను చూచెడి రూపమును దాల్చును. మన మందఱ మొక్కవస్తువునే ఎట్లు చూచుచున్నాము; మన అందఱిలోను విశ్వమనస్సులోని భాగము లొక్కవిధమైనవే కలవు కనుక. సదృశచిత్తులు సదృశవస్తువులను చూతురు. సదృశ మన స్సులు లేనివారు సదృశవస్తువులను చూడ జాలరు.



# సాంఖ్య దర్శనము

ప్రకృతిని అవిభక్త మని సాంఖ్యులు వ్యవహరింతురు. అది దానియందున్న పదార్థముల సంపూర్ణసమస్థితి యని వారు నిర్వచింతురు. సంపూర్ణసమస్థితియందెట్టి చలనము గాని లేకుండుట సహజము. సృష్టికి పూర్వపుస్థితియందు, సంపూర్ణసమత్వమేగాని ఎట్టి చలనము లేనప్పుడు, ప్రకృతి అవినాశ్యము. ఏల యన మార్పో అస్థిరతయో ఉన్నప్పుడే విరిసిపోవుటో మరణమో సంభవించును. సాంఖ్యులవాదము ప్రకారము అణురూపము ప్రథమ దశ కాదు. అణుత్వదశ రెండవదో, మూడవదో అయియుండ వచ్చు. విశ్వము అణువులనుండి పుట్ట లేదు. బీజభూతమగు ఆదిమపదార్థము అణువులుగా మాఱి యుండ వచ్చు; తరువాత స్థూలవస్తువులుగా పెద్దవస్తువులుగా మాఱి యుండ వచ్చు; సాగినంతవఱకు ఆధునికపరిశోధనలు గూడ అదే నిర్ణయమును సూచించుచున్నవి. ఉదాహరణకు: 'ఈథరు'ను గుఱించి ఆధునిక సిద్ధాంతమును తీసికొనుడు. 'ఈథరు' అణువులవలన ఏర్పడిన దందురా, దానివలన నేమియు పరిష్కారము కాదు. అంతకంటె స్పష్టముగా వివరింపవలె ననిన—వాయువు అణువులతో నేర్పడిన దనుడు. ఈథరు సర్వత్ర ఉన్న దని మనకు తెలియును. అది ప్రతివస్తువుగుండ అంతటను వ్యాపించినది. వాయువులోని అణువులు ఈథరులో తేలియాడుచున్న వన్న మాట. ఈథరు అణువులతో నేర్పడిన దనుకొన్నచో అందలి ప్రతి రెండణువుల మధ్య స్థల ముండును. ఈ స్థలమును నింపున దేది? ఈ స్థలముల ఇంతకంటె సూక్ష్మతరమగు మఱొక ఈథరు కల దని భావింతుమేని సూక్ష్మతరమగు ఆ ఈథరులోని అణువులమధ్య నింపవలసినస్థలము లుండును. 'కార్యరహితకారణ' మని సాంఖ్యులు చెప్పు దీనికొక అంతు లేదు. కనుక అణు సిద్ధాంతమే కట్టకడపటి సిద్ధాంత

మనుట పొసగదు. సాంఖ్యవాదము ప్రకారము ప్రకృతి సర్వోప గత మయినది. సకలసృష్టికిని కారణములు అఖండము సర్వగతము నగు ప్రకృతియందు ఉన్నవి. కారణ మనగా నేమి? వ్యక్తస్థితికి సూక్ష్మదశయే కారణము; వ్యక్తము కాబోవుదాని అవ్యక్తదశ అది. నాశన మనగా నేమి? కారణరూపమునకు మరలుట. మీా యొద్ద మృణ్మయపాత్ర కలదేని, దాని నొక దెబ్బ కొట్టినచో అది పగిలిపోవును. అనగా కార్యములు తమప్రకృతిలోనికి మగుడునన్న మాట. ఏవస్తువులతో కుండ చేయబడినదో ఆ వస్తువులు తమ ప్రకృతిస్థితికి మరలుచున్నవి. నాశన మను మాట కీ యర్థమునకు మించి — 'శూన్యముగా మాఱిపోవుట' వంటి అర్థమును చెప్పిన అది పొసగ దనుట స్పష్టము. నాశన మను మాటకు యుగము లకు పూర్వమే కపిలుడు చెప్పినదే అర్థము. — కారణరూపము పొందుటే అర్థ మని ఆధునిక భౌతిక విజ్ఞానముప్రకారము నిరూ పింప వచ్చు. సూక్ష్మరూపమునకు మరలుట అనియే నాశన మను మాట కరము. ప్రయోగశాలలో పదార్థమునకు నాశనము లేదని యెట్లు ఋజువుచేయ నగునో మీాకు తెలియును. విజ్ఞానములో మన మిప్పు డధిగమించిన దశలో ఎవ రయిన లేచి, 'పదార్థమును కాని, ఆత్మనుకాని మొదలంట లేకుండ చేయ వచ్చు' నని చెప్పి నచో వారు పరిహాసపాత్రు లగుదురు, అవిద్యులు, అవివేకులు మాత్రమే అట్లు పల్కుదురు. ఆధునిక విజ్ఞానము ప్రాచీనతత్త్వ వేత్తల బోధనలతో సరిపడుచుండుట వింత. అది యట్లే యుండ వలె. సత్యమున కదే ఋజువు, మనస్సును ప్రాతిపదికగా గొని వారు తమ యన్వేషణను సాగించిరి. ఈ జగత్తులోని మనోభాగ మును విభజించి, కొన్ని సిద్ధాంతములు చేసిరి. భౌతికభాగమును విభజించి చూచు మనమును ఆనిర్ణయములకే రావలెను. ఏల యన రెండును ఒక్క కేంద్రమునకే చేర్పవలె కదా.

సాంఖ్యులు 'మహత్తు' అందురే, అదే సృష్టిలో ప్రకృతి దాల్చు ప్రప్రథమరూప మని జ్ఞప్తియుంచుకొనవలె. మనము

దానిని ప్రజ్ఞ యన వచ్చు — గొప్పసూత్రమని మాట కర్థము. ప్రకృతియందు కలిగెడి మొట్టమొదటి మార్పు ఈ ప్రజ్ఞయే. దీనిని 'తన్ను గూర్చిన తన యెఱుక' అని నే ననువదింపను. ఎఱుక ఈ ప్రజ్ఞయం దొకభాగము మాత్రమే. మహత్తు విశ్వ మంతటిది. దానియందు ఎఱుకకడుగుది, ఎఱుక, ఎఱుకకుపైది అనెడి యన్ని అంతస్తులును చేరి యున్నవి; కనుక ఎఱుకలోని ఒకానొక దశను మాత్రమే మహత్తుగా పరిగణించుట చాలదు. ప్రకృతిలో మీ కన్నులయెదుటనే జరుగుచున్న కొన్ని మార్పులు మీరు చూచుచున్నారు, అర్థము చేసికొనుచున్నారు. కాని, ఏ మానవుని దృష్టికిని అందని సూక్ష్మ, సూక్ష్మతర పరిణామములు గూడ కలవు. అవి యన్నియు నొక్క కారణమునుండియే ఉత్పత్తిల్లుచున్నవి. ఈ మార్పులను కలిగించుచున్నది మహత్తు. మహత్తునుండి విశ్వాహంకార ముద్భవించును. ఇదంతయు పదార్థమే. తరతమభేదము దక్క మనస్సునకును పదార్థమునకును భేదము లేదు. సూక్ష్మరూపములోను, స్థూలరూపములోను గల మూలద్రవ్య మొక్కటే; ఒకటి మఱొకటిగా మార్పుచెందు చుండును. ఈ సిద్ధాంత మాధునికశారీరశాస్త్రపరిశోధనలవలన తేలిన నిర్ణయములకు సరిగా సరిపోవుచున్నది. మనస్సు మెదడు నుండి వేఱైనది కా దనెడి బోధను విశ్వసించుటవలన చాలవఱకు కలహము పెనగులాట తప్పిపోవును. అహంకారము మరల రెండు రకములుగా మాఱును. ఒక రకముది ఇంద్రియములుగా మాఱును. ఇంద్రియములు మరల రెండు విధములు: జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు. అవి కన్నులు కాని, చెవులు కాని కావు. కాని, వీని వెనుక నున్న నాడీకేంద్రములు, మెదడులోని కేంద్రములు మొద లయినవి. ఈ యహంకారము, ఈ పదార్థము మార్పు చెందును; ఈ ద్రవ్యమునుండియే ఈ కేంద్రములు రూపొందును. ఈ పదార్థముతోనే రెండవ రకమునకు చెందిన తన్మాత్రలు, ద్రవ్యసూక్ష్మాణువులు, తయారుచేయబడినవి. అవి

మన జ్ఞానేంద్రియములను తాకును; అంతట బోధ కలుగును. అవి మన కగపడవు. కాని, అవి యున్న వని మనకు తెలియు చుండును. తన్మాత్రలనుండి స్థూలపదార్థము — పృథివి, అప్పు మున్నగు వస్తువు లన్నియు, మనము చూచెడి, అనుభవించెడి వస్తువు లన్నియు ఉత్పత్తిల్లినవి. ఈ విషయము మీ మనస్సుల కెక్కునట్లు చెప్పవలె నని యున్నది. ఇది గ్రహించుట మిక్కిలి కష్టము. ఏల యన, పాశ్చాత్యదేశములలో మనస్సును గుఱించియు, పదార్థమును గుఱించియు వింత అభిప్రాయము లున్నవి. ఆ భావముద్రలను మన మనస్సులనుండి తీసివేయుట కష్టము. బాల్యదశలో పాశ్చాత్యతత్త్వశాస్త్రము నభ్యసించియుండినందున నాకే చాల కష్ట మయినది. ఇ వన్నియు సృష్టిని గుఱించిన విషయములు. మూలద్రవ్యము విశ్వవ్యాప్తమై అవిచ్ఛిన్నమై అవిభిన్నమై ఏకమై ఉండుటను భావింపుడు. అది అన్నింటి ప్రథమ దశ. ఆ దశ మార్పొంద నారంభించును, పాలు పెరుగైనట్లు. ఈ మొట్టమొదటి మార్పు మహత్తు. మహత్పదార్థము అహంకార మను స్థూలపదార్థ మగును. మూడవమార్పులో విశ్వేంద్రియములు విశ్వపరమాణువులు ఏర్పడినవి. ఈ కడపటివి కలసి మనము కన్నులతో చూడ గల, ఘ్రాణముతో వాసన చూడ గల, వీనులతో విన గల— ఈ స్థూలజగత్తుగ నగుచున్నది. సాంఖ్యుల మతముప్రకారము సృష్టిప్రణాళిక యిదియే. విశ్వ మంతట నున్నది అందలి ప్రతిచిన్నభాగమునందును ఉండవలెను. వ్యష్టిమానవుని తీసికొనుడు. మొదట అభిన్న మగు ప్రకృతియం దొక భాగము అతనియందు గలదు. ఆ భౌతికప్రకృతి అతనిలో మహత్తుగా మాఱును. అది విశ్వప్రజ్ఞలో నొక పరమాణువు. విశ్వప్రజ్ఞలోని ఈయణువు అతనిలో అహంకారముగ రూపొందును. తరువాత ఇదే ఇంద్రియములుగను, తన్మాత్రలుగను మాఱును. ఈ తన్మాత్రలు కలసి దేహమును రూపొందించును. ఈవిషయము స్పష్టము కావలె నని నా కోర్కె. ఏల యన

శ్వసము స్వముచేసికొనుట కిది మొదటిమెట్టు. ఇది తెలిసికొనుట మీ కత్యంత ముఖ్యము ఏల యన యావద్విశ్వ తత్త్వశాస్త్రమునకు ఇది ప్రాతిపదిక. కపిలునకు ఋణపడని తత్త్వవాదము ప్రపంచములో నేదియును లేదు. పైథాగరసు భారత దేశమునకు వచ్చి యీ తత్త్వశాస్త్రము నేర్చుకొనెను. అదే గ్రీకుల తత్త్వశాస్త్రమునకు ప్రారంభము. తరువాత ఇదే అలెగ్జాండ్రియను వాద మయినది. అటు తరువాత గ్నాస్టిక్కు వాద మయినది. అది రెండుశాఖలయినది, ఒక శాఖ యూరపునకును, అలెగ్జాండ్రియాకును వెడలినది. రెండవది భారతదేశమందే నిలిచినది; దీనినుండియే వ్యాసదర్శనము వర్ధిల్ల చేయబడినది. లోక మెఱిగిన మొట్టమొదటి హేతుజ్ఞాననిబద్ధమగు తత్త్వవాదము కపిలుని సాంఖ్యదర్శనమే. జగత్తులోని ప్రతి తాత్త్వికుడును కపిలునకు జోహారు లర్పింపవలసిన దే. తత్త్వజ్ఞానమున కా మహనీయుని జనకునిగా పరిగణించి, ఆతడు చెప్పినది వినక తప్ప దను విషయమును మీ మనసులలో హత్తుకొనునట్లు చెప్పవలె నని నా కోరిక. శ్రుతులలో సహిత మీ ప్రాచీనతమతత్త్వవేత్తను, ఈ మహాద్భుతపురుషుని గుఱించిన ప్రస్తావము ఈలాగు గలదు: "ఓ జగత్ప్రభూ, నీవు తొట్టతొల్త కపిల మహామునిని సృజించితివి." అని యున్నది. అతడు కనుగొన్న విషయములు ఎంత యద్భుతము లయినవి! యోగుల చూపులు అసాధారణము లయిన వనుటకు నిదర్శ మే మయిన కావలసి యున్న యెడల అట్టి మహాత్ములే నిదర్శనము. వారికి సూక్ష్మదర్శినులు లేవు, దూరదర్శినులు లేవు. అయినను వారి చూపు ఎంత పదు నయినది! వారి విషయవివేచన ఎంత నిర్దుష్ట మయినది, ఎంత అద్భుత మయినది!

ఇక్కడ షోపెన్హోరు తత్త్వవాదమునకును భారతీయ తత్త్వశాస్త్రమునకునుగల భేదమును స్పష్టము చేసెదను. సంకల్పమే సమస్తమునకును కారణ మని షోపెన్హోరు నభిప్రాయము.

జీవింపవలె నను సంకల్పమే మనలను రూపొందించు చున్న దనును కాని, మేము దీనిని కాదందుము. సంకల్పమును కండరముల కుద్రేక మెక్కించు నరములు నొక్కటియే. నే నొక వస్తువును చూచునప్పుడు సంకల్పము లేదు; దాని బోధమును మెదడుకు గొనివచ్చినప్పుడు, ''ఇది చేయుడు'', ''అది చేయకుడు'' అని ప్రతిక్రియ వచ్చును. ఈస్థితియం దున్న అహంకారపదార్థమునే సంకల్పము అందుము. ప్రతిక్రియారూపముకాని సంకల్ప మొక్క అణువంతయైనను ఉండుట పొసగదు. సంకల్పమునకు ముందే ఎన్నియో పనులు జరుగును. సంకల్ప మహంకారమునుండి తయారుచేయబడిన ఒకానొకటే. అహంకారము తనకు పైదైన ప్రజ్ఞనుండి యుత్పత్తిల్లినది. ప్రజ్ఞయును అభిన్నమగు ప్రకృతికి రూపాంతరమే. మనము చూచున దంతయు సంకల్పమే అనుట బౌద్ధుల ఆశయము. మన స్తత్త్వశాస్త్రమునుబట్టి అది పూర్తిగా తప్పు. సంకల్పమును కండరముల కుద్రేక మిచ్చు నాడీవితతిగా మాత్రమే గుర్తింప వీలగును. ఆ నరములను తీసివేసినచో మానవునకు సంకల్ప మనునదియే యుండదు. మీకు బాగుగా తెలిసియున్నట్లుగానే, క్రిందితరగతి జంతువులతో బహుకాల మెన్నెన్నియో ప్రయోగములు చేసి కనుగొన్న విషయ మిది.

ఈవిషయమును పరిశీలింతము. మానవునియందలి మహత్తునుగుఱించి, ఈ గొప్పసూత్రమును గుఱించి, ఈప్రజ్ఞనుగుఱించి తెలిసికొనుట చాల ముఖ్యము. ఈ ప్రజ్ఞయే అహంకార మన బడునదిగా మాఱును. దేహములోని శక్తుల కన్నిటికిని ఈ ప్రజ్ఞయే కారణము. స్మృతి కడుగుననుండు దానిని స్మృతి తలముననుండుదానిని స్మృతికి పైదానిని ఇది తనలో ఇముడ్చు కొనును. ఈ మూడు స్థితు లేమి? స్మృతికడుగుననుండుస్థితి మనకు జంతువులందు కననగును. దానిని సహజావబోధము (ఇన్‌స్టింక్టు) అందుము. ఇది దాదాపు అమోఘమయినదే; కాని

చాల పరిమితమయినది. సహజావబోధము ఎప్పుడును తప్పిపోదు. తినదగిన మొలక యేదో, విషమూలిక యేదో జంతువు ఇంచు మించు సహజావబోధముచేతనే గ్రహింపగలదు. కాని, ఆ సహజావబోధశక్తి బహుపరిమితము. క్రొత్త దేదయిన వచ్చి నప్పు డది గ్రుడ్డిదే. అది యంత్రమువలె పనిచేయును. తరువాత దీనికి పైదగు జ్ఞానదశ కలుగును. ఇది అమోఘమయినది కాదు. ఇది తఱచు తప్పిపోవుచుండును. కాని, దీనిరంగము పెద్దది. ఇది నిదానముగ పని చేయును. దీనిని వివేకము (రీసన్) అందురు. వివేకము సహజావబోధమునకంటె విశాల మయినది; కాని, సహజావబోధము వివేకమునకంటె గుఱితప్పనిది. సహజావబోధ మునం దున్నంత కంటె వివేకమున పొరపాట్ల కవకాశ మెక్కువ. ఇంతకంటె పైదైన మనఃపరిస్థితియు కలదు. అది స్మృతికి పైదశ. దాని నలవఱచుకొన్న వారికి యోగులకు అది సిద్ధించును; ఇది అమోఘమయినది; వివేకరంగమునకంటె దీనిరంగము ఎక్కువ విస్తార మయినది. ఇది అన్నిటికంటె నున్నతమైన దశ. కనుక ఇక్కడ నున్న సమస్తమునకు నిజమయిన కారణము మహత్తు అనియు, మహత్తు తన్ను తాను బహువిధముల వ్యక్తముచేసికొను ననియు; స్మృతి కడుగుది, స్మృతి తలముది, స్మృతికి పైది అను మూడు జ్ఞానదశలును మహత్తులో ఇముడును అనియు మనము జ్ఞప్తి యుంచుకొనవలెను.

సూక్ష్మమయిన ప్రశ్న యొకటి ఇట ప్రసక్తించును. సదా అడుగబడుచుండు ప్రశ్న అది. పరిపూర్ణుడగు దేవు డీ ప్రపంచ మును సృజించియున్నచో ఇం దిన్ని లోటుపాట్లు ఏల గలవు? మనము విశ్వ మనునది మనకు కనబడు దానినే, స్మృతియు వివేక మును ప్రసరించు పరిమితరంగమునే. దీనికి అవ్వలిది మనకు గోచరింపనే గోచరింపదు. ఇక మన ప్రశ్నే పొసగని ప్రశ్న. పెద్దరాశినుండి కొంతభాగమును మాత్రము కైకొని చూచినప్పు

డది పొందిక లేనిదిగానే కనిపించును. అది సహజమే. ఈ జగత్తులో పొందిక లేదు. ఎందు కనగా మనము దాని నట్లు చేయుదుము. ఏ విధముగా? వివేక మనగా నేమి? జ్ఞాన మనగా నేమి? ఒక్కొక్కవస్తువునకును సంబంధించినవాని నెల్ల కనుగొనుటే జ్ఞానము. మీరు వీధిలోనికి పోయి, ఒక మనుష్యుని చూచి, "నే నీయన నెఱుగుదు" నని చెప్పుదురు. ఏల యన, మీ మనస్సులమీది ముద్రలు, చిత్తముమీది గుర్తులు మీకు జ్ఞాపక మున్నవి. మీరు పెక్కండ్రు మనుష్యులను చూచి యున్నారు. అందొక్కొక్కనిముద్రయు మీ మనస్సుమీద కలదు. ఈ మానవుని చూడగనే వీనిముద్రను మీ మనసులోని ముద్రల ప్రక్కన నుంచి, పెక్కుపోలికలను గుర్తింతురు. పోలిక లగపడగానే, మీరు సమాధానపడి ఈ క్రొత్తముద్రను ప్రాత వానితో చేర్చుకొందురు. పడిన క్రొత్తముద్రకు అంతకు ముందున్నవానితో పొత్తు కుదిరినచో మీరు తృప్తిచెందుదురు. ఈ విధముగా సంబంధమును గుర్తించుటకే జ్ఞాన మని పేరు. కనుక మనలో ఉన్న అనుభవరాశిలో క్రొత్త అనుభవమును కలుపుకొనుటే జ్ఞానము. చాలినంత అనుభవము మీకు ముందుగనే లేనిదే, ఎట్టి జ్ఞానమును మీకు సాధ్యము కాదనుటకు గల గొప్ప ప్రమాణములలో ఇదొకటి. కొందఱు యూరపియను తత్త్వవేత్తలు అనుకొనునట్లు ఏ యనుభవము మీకు లేనియెడల, మీ మనస్సులు ఖాళీగానే ఉన్నయెడల, మీకు జ్ఞానము కలుగుటయే అసాధ్యము. ఏల యన, జ్ఞాన మనగా క్రొత్తదానిని మనస్సులోని ప్రాతఅనుభవములతో జోడించి గుర్తించుట. క్రొత్తముద్రను పోల్చిచూచుటకు ముందుగనే సంచితమైన రాశి యుండవలె. అట్టి యనుభవనిధి లేకుండ శిశు వొకడు జన్మించె ననుకొందము. ఎప్పటికిగాని అతనికి జ్ఞానము పడయుట అసాధ్యము. అందుచేత బిడ్డ యింతకుముందు అనుభవనిధి గల స్థితియందుండియుండవలె. కనుకనే జ్ఞానాభివృద్ధి సదా సాగుచున్నది

ఈ వాదము నెట్లు కాదన గలమో చెప్పుడు. ఇది గణితశాస్త్ర జుష్టమైన నిజము. పూర్వానుభవరాశి లేక జ్ఞానము సాధ్యము కాదని కొందఱు పాశ్చాత్యతత్త్వవేత్తలుకూడ వాదింతురు. వారు శిశువు జ్ఞానముతోనే పుట్టు ననిరి. పుట్టుకతో శిశువు తనతో కూడ తెచ్చుకొను భావములు శిశువు పూర్వము పొందినవి కావనియు, తన పూర్వులనుండి శిశువునకు సంక్రమించినవనియు ఈ తత్త్వజ్ఞులు చెప్పుదురు. అవి వంశక్రమాగతములు. ఈ యభిప్రాయము పూర్తిగా తప్పు అని వారు త్వరలోనే గ్రహింపగలరు; వంశపారంపర్యముగా సంక్రమించు నను సిద్ధాంతమును కొందఱు జర్మను తత్త్వజ్ఞులు ఇప్పుడు ప్రచండముగ ఖండించుచున్నారు. తాతముత్తాతలనుండి జననీజనకులనుండి సంక్రమించు ననువాదము చాల సరియైనదే; కాని, అసమగ్రము. భౌతిక విషయమునకు సంబంధించినంతవఱకే దాని వివరణము. పరిసరముల ప్రభావములు మనపై పడుచున్నవి. దీని కేమి యర్థము? అనేక కారణములవలన ఒక కార్యము కలుగును. పరిసరము ఫలితమును మార్పుచేయుశక్తులలో నొకటి; మనపరిసరములను మనమే కల్పించుకొందుము; మన గతపరిసరమున కనుగుణమైనదిగానే మన ప్రస్తుతపరిసరము మనకు లభించును. త్రాగుబోతు మనస్సు సహజముగా పట్టణములో నికృష్టభాగములగు మురికిపేటల మీదికే పోవును.

జ్ఞాన మనగా నేమో మీ రెఱుగుదురు. క్రొత్తభావముద్రను ప్రాతభావముద్రలతోబాటు మనఃపేటికలో జొన్పుకొని ఆక్రొత్తదానిని అంగీకరించుటే జ్ఞానము. అంగీకరించుట యన నేమి? ఈవఱకే మనలో నున్న సదృశభావముద్రలతో క్రొత్త భావముద్రకు గల పొందికను కనుగొనుటే. జ్ఞానమున కింతకు మించిన అర్థమేమియు లేదు. అదియే జ్ఞాన మగుచో, పొందికను గుర్తించుటే జ్ఞాన మగుచో, మన మే విషయమును తెలిసికొన

వలె నన్నను తత్సదృశముల నన్నిటిని పరిశీలింపవలసినదే. కాదా మఱి? మీ రొక గులకరాయి తీసికొనుడు; పొత్తును కనుగొన వలె నన్న దానిని పోలిన గులకరాళ్లవరుసల నన్నిటిని చూడ వలసినదే. కాని ప్రపంచమును అఖండముగా చూచునప్పుడు మన మట్లు చేయలేము. ఏల యన మన మనస్సనెడి గువ్వతొఱటలో మనము చూచిన ప్రపంచపుముద్ర ఒక్కటే ఉన్నది. అట్టిదిగా ఆతరగతిదిగా మనము చూచినది వేఱొకటి లేదు. కాబట్టి దానిని పోల్చుటకు వేఱేదియు లేదు. సంబంధపడినవానితో దానిని కలిపి చూచుట సాధ్యపడదు. మన యెఱుకలో నిముడు టచే వేత్తైన విశ్వఖండము అద్భుతావహముగ క్రొత్తది. ఏల యన దానితో సంబంధపడినవానిని మనము కనుగొన జాలక పోయితిమి. కనుక దానితో మనము శ్రమపడుచున్నాము. అది ఘోరమయినదిగా, దుష్టమయినదిగా చెడ్డదిగా భావించు చున్నాము; ఒక్కొక్కప్పు డది మంచి దని కూడ మనము భావింప వచ్చు. కాని, అది లోపభూయిష్ఠ మని సర్వదా తల పోయుచున్నాము. పోలికలు కలిగి, జతపఱుపదగినవి కనబడి నప్పుడే విశ్వము మనకు గ్రాహ్య మగును. ప్రపంచమును, ఎఱు కను దాటినప్పుడే దానిని మనము గుర్తింపగలుగుదుము. అప్పుడు ప్రపంచరహస్యము బట్టబయ లగును. మన మా పని చేయగలిగి నంతవఱకు మన తలలను గోడలకేసి బ్రద్దలుకొట్టుకొన్నను సృష్టి యర్థము తెలియదు. ఏల యన జ్ఞాన మనగా సదృశములను కను గొనుటే; ఈయెఱుకస్థాయిలో మనచూపు ఒక్క చూపే. దేవుని గుఱించిన మన అనుభవము కూడ అంతే. ప్రపంచములో ఒకా నొక భాగమునే మనము చూచునట్లు దేవునిలోను మనము చూచున దెల్ల ఒక్క భాగమే. తక్కిన దంతయు మానవుల జ్ఞానమున కతీతము. “నేను విశ్వోపగతుడను; నేను ఎంత పెద్ద వాడ ననగా, ఈవిశ్వము సైతము నాయం దొక చిన్నభాగమే.”

అందుచేతనే మనచూపునకు దేవుడు పరిచ్ఛిన్నుడుగ కననగును. మన మతని తెలిసికొనలేకున్నాము. భగవంతుని గాని, ప్రపంచము నుగాని తెలిసికొనుటకు మనము, తర్కమును, స్మృతియవధులను అతిక్రమింపవలె. అదొక్కటే మార్గము. "శ్రుతమును, శ్రవణమును, ధ్యాతమును, ధ్యానమును అతిక్రమించినప్పుడే నీవు సత్యమును అధిగమింపగలవు." "శాస్త్రగ్రంథములను దాటి పొమ్ము, ఏల యన అవి ప్రకృతివఱకు, త్రిగుణాలవఱకు మాత్రమే బోధించును." వాని నతిక్రమించినప్పుడే మనకు సామరస్యము కననగును. అంతకు ముందు కానరాదు.

పిండాండమును, బ్రహ్మాండమును ఒక్క ప్రణాళి ననుసరించియే నిర్మింపబడినవి. పిండాండములో మనకు తెలిసిన దొక్క భాగమే—మధ్యభాగము. మన స్మృతి కడుగుది మనకు తెలియదు, మన స్మృతికి పైది మనకు తెలియదు. స్మృతితలమున నున్నది మాత్రమే మనకు తెలిసినది. ఒకడు లేచి, "నేనుపాపిని" అన్నచో అతడు చెప్పునది నిజము కాదు. ఏలయన అతడు తన్ను తా నెఱుగడు. మానవు లందఱికంటె అతడు ఎక్కువ అజ్ఞాని; తన్ను గుఱించి అతనికి తెలిసిన దొక్కభాగమే. అత డున్న భూమిలో కొంతమేరయే అతనియెఱుకలో నిముడునది. అటులనే జగతును గుఱించియు హేతుజ్ఞానముచే తెలిసికొనుటకు సాధ్యపడునది ఈషన్మాత్రమే; పూర్తిగా తెలిసికొనుట సాధ్యముకాదు; స్మృతి కడుగుది, స్మృతితలముది, స్మృతికి పైది, వ్యష్టిమహత్తు, విశ్వమహత్తు, వాని తరువాతి పరిణామములు—కలిసి ప్రపంచమైనది.

ప్రకృతిని మార్పుచెందించున దేది? ప్రకృతియంతయు జడమయ మని, చైతన్యవిహీన మని మనము ఇంతవఱకు గుర్తించితిమి. అది సమ్మిశ్రపదార్థము, చైతన్యరహితము. ఎక్కడెక్కడ శాసనము కలదో అక్కడక్కడెల్ల దాని క్రీడారంగ మచేతన

మనుట కదే తార్కాణము. మనస్సును ప్రజ్ఞయు సంకల్పమును ఇతరము సర్వమును నిశ్చేతనమే. కాని అవి యన్నియు "చిత్తు"ను జ్ఞానమును ప్రతిఫలింపజేయుచున్నది. ఆ చిత్తు వీని కన్నిటికిని అతీత మయిన ఒకానొక తత్త్వముది. దానిని సాంఖ్యులు "పురుషు" డని వ్యవహరింతురు. జగత్తులోని సమస్త పరిణామములకును అబుద్ధిపూర్వక కారకుడు పురుషుడే, అనగా సర్వసామాన్యార్థమున ఈ పురుషుడు జగత్తునకు దేవుడు అన్న మాట. ఈశ్వరునిసంకల్పమే ప్రపంచమును సృష్టించె నని చెప్పుదురు. సామాన్యవాక్యముగా అది చాల చక్కగానే యున్నది. కాని, అది యథార్థముమాత్రము కా దనుట మనకు స్పష్టమే. అది సంకల్ప మెట్లగును? ప్రకృతిపరిణామములలో సంకల్పము మూడవదో నాల్గవదో అగును. దానికి ముం దెన్నియో కలవే. వానిని సృజించిన దెవరు? సంకల్పము మిశ్రపదార్థము. మిశ్రమయిన దెల్ల ప్రకృతిజన్యమే. కనుక సంకల్పము ప్రకృతిని సృజించె ననుట పొసగదు. కనుక ఈశ్వరునిసంకల్పము విశ్వమును సృజించిన దన్న మాట అర్థవిహీనము. మనలను గుఱించిన మన యెఱుకలో స్వల్పాంశమే సంకల్పము. అది మన మెదడును నడిపించును. మన దేహమును గాని, విశ్వమును గాని నడిపించుచున్నది సంకల్పము కాదు. ఈ దేహమును ఒకశక్తి నడిపించుచున్నది. దాని సాక్షికావిష్కృతియే సంకల్పము. అటులనే జగత్తులోకూడ సంకల్పము కలదు. కాని అది విశ్వములో నొక భాగము మాత్రమే. ఈ సృష్టినంతటిని నడపుచున్నది సంకల్పము కాదు. కనుకనే సంకల్పసిద్ధాంతముచేత మన మీ విశ్వమును వివరింపజాలము. సంకల్పమే దేహమును నడిపించుచున్న దని అంగీకరింతము. నా సంకల్పానుసారము దానిని నేను నడిపింపలేక పోవుచున్నా నని గ్రహించుటతో నే నావేశపడుదును, ఆగ్రహింతును. ఆ తప్పు నాది. సంకల్పసిద్ధాంతమును అంగీకృతముగ కొనుటకు నాకు హక్కు లేదు. అదే విధముగా విశ్వమును సంకల్పమే

నడిపించుచున్న దని భావించి, అందు కనుకూలింపని విషయములు కొన్ని కననగునేని ఆ తప్పు నాది. అందుచేత పురుషుడుసంకల్పము కాడు; ప్రజ్ఞయు కాడు. ఏల యన ప్రజ్ఞయు మిశ్రపదార్థమే. మెదడువంటి ఏదో కొంత పదార్థముతో సంబంధము లేక ప్రజ్ఞ ఉండ జాలదు. ప్రజ్ఞ యున్నచోటనెల్ల, మనము 'మెదడు' అందుమే, దాని వంటి దొకటి కావలెను. అది ముద్దగా ఒకానొక రూపు దాల్చి 'మెదడు'గా నుపయోగపడును. ప్రజ్ఞ ఉన్నచోట నెల్ల ఆపదార్థము ఏదో ఒక రూపములో అక్కడఉండును. కాని, ప్రజ్ఞ యనునదికూడ మిశ్రపదార్థమే. మఱి, ఈ పురుషు డెవడు? అతడు ప్రజ్ఞయు కాడు, సంకల్పమును కాడు. కాని, పురుషుడు ఈ సకలమునకు కారణము. వీని నన్నిటిని నడపునది కలుపునది పురుషసాన్నిధ్యమే. పురుషునకు ప్రకృతితో కలయిక లేదు; పురుషుడు ప్రజ్ఞయు కాడు, మహత్తును కాడు; మ ఱేమగు ననగా శుద్ధ మయిన ఆత్మ యగును. "నేను సాక్షిమాత్రుడను, నా సాక్షిత్వముచేత ప్రకృతి చేతనాచేతనముల నన్నిటిని సృజించు చున్నది."

ప్రకృతియందలి ఈచైతన్య మేమి? ప్రజ్ఞయే చైతన్యము. ఇది చిత్తు అనివ్యవహరింపబడుచున్నది. ఈచైతన్యమున కాధారము పురుషునియందే గలదు. అది అతని నైజమందే కలదు. దానిని వివరింపలేము. కాని, మనము జ్ఞాన మనుదానికంతకు నదియే కారణము. పురుషుడు ఎఱుక కాడు. ఎఱుక కూడ సంకీర్ణవస్తువే; కాని ఎఱుకయందు భాస్వరమును మంచిదియు నగున దంతయు పురుషునకుచెందినదే. చైతన్యము పురుషుడు ఎఱుగడు కాని ప్రజ్ఞలో భాస్వరమైనదెల్ల పురుషునిదే. పురుషునందు చైతన్య మున్నది, కాని అత డెఱుగడు, ఎఱుగగలవాడు కాడు. మనచుట్టును మనము చూచుచున్నది పురుషునియందలి చిత్తును, దానితోబాటు ప్రకృతిని. సుఖము, సంతోషము, వెలుగు సృష్టిలో ఎక్కడ ఉన్నను అవి పురుషునివే; కాని అది

మిశ్రమే. ఏల యన అది పురుషుడు + ప్రకృతి. "ఎక్కడ ఏ సౌఖ్యము గాని, ఏ ఆనందము గాని యున్నను అక్కడ ఆ అమృతత్వకిరణ మున్నది. అదియే దేవుడు." విశ్వములో గొప్పగ ఆకర్షించువాడు పురుషుడు; ప్రపంచస్పృక్కు గాని, ప్రపంచ సంబంధము కాని అతనికి లేకున్నను అతడు సమస్త సృష్టిని ఆకర్షించుచున్నాడు. స్వర్ణముకొఱకు కాత్రపడు మానవుని మీరు చూచుచున్నారు. అందుకు కారణము స్వర్ణమునందు ఎక్కువ మలికితో కూడియే యైనను పురుషుని విస్ఫులింగము ఉండుటే. ఒకడు తనబిడ్డలను ప్రేమించినను, భార్య భర్తను ప్రేమించినను, ఆకర్షించుచున్న శక్తి యేది? వాని వెనుక నున్న పురుషుని విస్ఫులింగము. విశేషముగా మలికితో కూడియున్నను అదేమో అచట నున్నది. ఆకర్షించుశక్తి మఱి దేనికిని లేదు. "చైతన్యవిహీనమయిన ఈ ప్రపంచములో పురుష డొక్కడే చైతన్యమయుడు." సాంఖ్యుల పురుషు డనగా నిట్టివాడు. దీనిని బట్టి పురుషునకు విశ్వవ్యాప్తి తప్పదు. సర్వవ్యాపి కానిది పరిచ్ఛిన్నమై యుండవలెను. సకలపరిచ్ఛేదములును ఏవో కారణాలచేత నేర్పడును. కారణాలచేత నేర్పడుదానికెల్ల ఆద్యంతము లుండక తప్పదు. పురుషునకు పరిచ్ఛేద మున్నచో మరణమును ఉన్నది, ముక్తి లేదు, అతడు తానే పరముడు కాడు; అతని కొక కారణ ముండితీరవలె. కనుక అతడు సర్వోపగతుడు. కపిలుని సిద్ధాంతముప్రకారము పురుషు లనేకులు; ఒక్కడు కాడు; అనంతసంఖ్యాకులు. మీకును, నాకును ఒక్కొక్కని కొక్కొక్క పురుషుడు కలడు. ప్రతివానికిని ఒకపురుషుడు కలడు. అనంత సంఖ్యాకవృత్తములు. ప్రతివృత్తము అనంతమే. అది యీ విశ్వమంతటికిగుండ తిరుగుచున్నది. పురుషుడు మనస్సును కాదు, పదార్థమును కాదు. పురుషునినుండి ప్రతిఫలించునవి మాత్రమే మన మెఱుగునవి. పురుషుడు విశ్వవ్యాపి యగుచో అతనికి చావు పుట్టుకలు లేవనుట మనకు నిశ్చితమే. దానిపై ప్రకృతి తన ఛాయ

బరపుచున్నది : జననచ్ఛాయ, మృత్యుచ్ఛాయ. స్వాభావికముగ నేమో అది పరిశుద్ధ మయినది. ఇంతవఱకు సాంఖ్యదర్శన మద్భుతముగా నున్నదని స్పష్టపడినది.

ఇక ఈ వాదమునకు ప్రతికూలములుగ నున్న ప్రమాణములను పరిశీలింతము. ఇంతవఱకు విషయవిభజన నిర్దుష్టముగా నున్నది. మన తత్త్వశాస్త్రము నిరాక్షేపముగ నున్నది. ఇంద్రియములను, వాని యుపకరణములను వేఱుగా పరిగణించుటచేత అవి అసంకీర్ణవస్తువులు కావని మిశ్రమము లని గ్రహించితిమి; అహంకారమును బోధముగాను, పదార్థముగాను విభజించుటచేత అదియును పదార్థమే అని తెలిసికొంటిమి. మహత్తుకూడ ఒకానొకదశలో నుండు పదార్థమే. కట్టకడపట పురుషుడు కలడు. ఇంతవఱ కెట్టి యాక్షేపణయు లేదు. "ప్రకృతి నెవరు సృజించిరి?" అని మనము సాంఖ్యులను ప్రశ్నించితిమేని పురుషుడుకాని ప్రకృతి కాని సృజింపబడినవి కావని, అవి రెండును సర్వోపగతములనియు వారు బదులు చెప్పుదురు. పురుషు లనంతసంఖ్యాకు లని కూడ వా రందురు. ఈ ప్రతిపాదనలను మనము ఖండింపవలసి వచ్చును; ఇంతకంటె మేలైన సమాధానము కనుగొనవలసి యుండును. అట్లు చేయుటలో మన మద్వైతసిద్ధాంతమునకు వత్తుము. అనంతమైనవి ఈ రెం డెట్లుండ గల వని మన మొట్టమొదటి ఆక్షేపణ. సాంఖ్యసిద్ధాంతము సమగ్రమయినది కాదు. దానియందు సంపూర్ణముగా సంతృప్తికలిగించెడి సమాధాన మగపడలేదు. ఈ చిక్కు లన్నిటినుండి వేదాంతు లెట్లు బయటబడి, నిర్దుష్టమగు సిద్ధాంతమును ప్రతిపాదింతురో మనము చూతము. అయినను కీర్తి నిజముగా సాంఖ్యదర్శనమునకే దక్కును. భవనము నిర్మింపబడిన తరువాత దానికి మెఱుగులు దిద్దుట చాల సులభమే.



# సాంఖ్యము, వేదాంతము

మనము పరిశీలించుచుండిన సాంఖ్యదర్శనమునే ఇప్పుడు కొంత సంక్షేపించి చెప్పెదను. ఈదర్శనమున లోపము లెక్కడ కలవో, వేదాంత మెక్కడ దీనికి సంపూరకమగుచున్నదో కను గొనుటే ఈ యుపన్యాసమునకు లక్ష్యము. సాంఖ్యదర్శనము ప్రకారము సంకల్పము, బుద్ధి, వివేకము, ప్రేమ, ద్వేషము, స్పర్శ, రుచి, స్థూలద్రవ్యము అను వానికన్నిటికిని ప్రకృతియే కారణము. సర్వమునకును ఉత్పత్తిస్థానము ప్రకృతియే. ఈ ప్రకృతి సత్త్వరజస్తమములను మువ్విధములైన మూలపదార్థములు గలది. ఇవి గుణములు కావు; మూలద్రవ్యములు. వీనినుండియే సమస్త సృష్టియు రూపొందినది. కల్పారంభమున ఇవి సమస్థితియం దుండును; సృష్టిజరుగునప్పు డివి పెక్కు పాళ్లలో పెక్కు పర్యా యములు కలసి జగత్తును రూపొందించును. సాంఖ్యులు మహత్తు అందురే, అదే సృష్టిలో ప్రప్రథమముగా వ్యక్తమగునది. దాని నుండి చైతన్యము వచ్చును. సాంఖ్యుల మతము ప్రకార మిది యొక తత్త్వము. చైతన్యమునుండి మనస్సు, ఇంద్రియములు, తన్మాత్రలు (శబ్ద, స్పర్శాదుల యణువులు) వచ్చినవి. సూక్ష్మాణువులన్నియు చైతన్యమునుండి రూపొందినవే. ఈ సూక్ష్మాణువులనుండి, మనము స్థూలపదార్థము లందుమే, ఆ స్థూలద్రవ్యములు వచ్చినవి. తన్మాత్రలు కంటికి కనబడునవి కావు; కాని, అవి స్థూలాణువులుగా మాఱినప్పుడు మనము వానిని అనుభవింపగలము, ఇంద్రియముల చేత గ్రహింపగలము.

ప్రజ్ఞగా చైతన్యముగా మనస్సుగా త్రివిధములలో పని పడు చిత్తము, ప్రాణశక్తులను తయారుచేయును. ప్రాణ మనగా శ్వాస యనియెడి అభిప్రాయమును మీరు వెంటనే విడిచిపెట్టవలె.

ORIAL LIB... No-02... UDDAPAH.


ప్రాణఫలితములలో నొకటి ఊపిరి. ప్రాణ మనగా దేహము నంతను కదలించి, నడిపించెడి నరములశక్తులే. ఈశక్తులే సంకల్పముగను రూపుదాల్చును. ప్రాణశక్తి దాల్చు రూపములలో అన్నిటికంటె స్పష్టమైనది అగ్రగణ్యమైనది శ్వాసక్రియ. ప్రాణము గాలిమీదపనిచేయునే కాని గాలి ప్రాణముమీదపనిచేయదు. ఉచ్ఛ్వాసనిశ్వాసములను కట్టుపాటులో ఉంచుటే ప్రాణాయామము. శ్వాసక్రియను వశపఱచుకొనుటకే ప్రాణాయామము నభ్యసించుట; ఊపిరిని కట్టుపాటులో ఉంచుకొనుటయు శ్వాసకోశములను బలపఱచుకొనుటయు కాదు లక్ష్యము. అది వ్యాయామము గాని ప్రాణాయామము కాదు. ఈప్రాణములు దేహమును నడిపించు శక్తులు. వానిని దేహములోని తక్కినఇంద్రియములు నడుపును. ఆయింద్రియముల కంతరింద్రియము లని, మనస్సు అని పేర్లు. ఇంతవఱకు సరియే ఈమన తత్త్వశాస్త్రము మిక్కిలి స్పష్టముగాను, సరిగాను ఉన్నది; ప్రపంచములోనికెల్ల మిక్కిలి పురాతనమును యుక్తియుక్తము నగు వాద మిది! ఎక్కడెక్కడ ఉన్న తత్త్వవాదములును, యుక్తియుక్తాశయములును, ఎంతో కొంత కపిలమహర్షికి ఋణపడియున్నవి. పైథాగరసు దానిని భారతదేశమువారినుండి నేర్చుకొని గ్రీసుదేశమువారికి నేర్పెను. తరువాత ప్లేటో దానిని జాడగా గ్రహించెను; పిమ్మట గ్నాస్టిక్కులు దానిని అలెగ్జాండ్రియాకు గొనిపోయిరి. అలెగ్జాండ్రియానుండి అది యూరపునకు అందినది. మన తత్త్వవిషయమున గాని, తత్త్వవిషయమున గాని ఎక్కడ ఏ ఉద్యమము జరిగినను దాని కంతకు మహాజనకుడు ఇతడే, ఈకపిలుడే. ఇంతవఱ కతని మన తత్త్వశాస్త్రము అద్భుతముగా నున్న దని గుర్తించితిమి; కాని, పోను పోను కొన్ని యంశములలో మనయభిప్రాయములు అతని అభిప్రాయములనుండి భేదిల్లక తప్పదు. కపిలుని వాదపద్ధతియంతయు క్రమపరిణామము (ఇవల్యూషన్) అనియెడి ప్రధానసూత్రముపై ఆధారపడియున్నదనుట స్పష్టము. ఒకవస్తువునుండి మఱియొక వస్తువు రూపొందు

ననుట అతని ప్రతిపాదన. "కార్యము కారణమునకు రూపాంతరము" అనియే అతడు కార్యకారణసంబంధమును నిర్వచించును. మనకు కననగుచున్నంతమేరకు అఖిలవిశ్వమును పరిణామమును పురోగతిని పొందుచున్నది. మనము మట్టిని చూచుచున్నాము; మఱొకరూపములో దానినే కుండ అందుము. మట్టి కారణము. కుండ కార్యము. ఇంతకు మించి కార్యకారణనియతిని గుఱించి మన మేమియు తెలిసికోలేము. ఈ విశ్వమంతయు ప్రకృతి యనెడి మూలద్రవ్యమునుండి రూపొందినది. ఇట్లు ఈ ప్రపంచము ప్రధానముగా దీని కారణమునకంటె భిన్నమై యుండుట పొసగదు. కపిలునివాదము ప్రకారము అభిన్నముగా నున్న ప్రకృతినుండి సంకల్పమువఱకు గల పరిణామములలో ఏదియు 'అనుభవించునది' కాదు, 'ప్రకాశపఱచునది' కాదు. 'అనుభవించునది' 'ప్రకాశపఱచునది' అనునవి కపిలుడు వాడిన మాటలే. మట్టిముద్దవలె మనస్సుకూడ నొక ముద్ద. మనస్సునకు సొంత వెలుగు లేదు; కాని, అది తర్కించుట మనకు తెలియును. అందుచేత దాని వెనుక ఎవరో ఉండవలె. అతని వెలుగు మహత్తుగుండ, చైతన్యముగుండ వాని యనంత రూపాంతరముల గుండ చొచ్చుకొని వచ్చుచున్నది. అతనినే కపిలుడు పురుషుడనెను. ఆత్మ యని వేదాంతి యనునదియు నదే. కపిలుని సిద్ధాంతము ప్రకారము పురుషుడు అసంకీర్ణతత్త్వము; కొన్నింటి కలయిక కాదు; అతడు భౌతికపదార్థము కాడు. భౌతికముకాని దతడొక్కడే. ఈ వివిధపరిణామములు భౌతికములే. నా కెదుట నల్లబల్ల యున్న దనుకొనుడు. మొదట బాహ్యోపకరణములు దానియనుభూతిని ఇంద్రియములకు నాడీకేంద్రములకు గొనిపోవును. అక్కడనుండి యది మనస్సుకు పోయి అక్కడ ముద్రిత మగును. మనస్సు దానిని బుద్ధి కందజేయును. కాని, బుద్ధి ఏమియు చేయజాలదు; వెనుక నున్న పురుషునిదగ్గఱనుండి క్రియ వచ్చును. ఇవన్నియు పురుషుని సేవకులు. ఇవి అనుభూతుల నతనిదగ్గఱకు

గాని తెచ్చును. వీనికి ఉత్తరువు లిచ్చున దతడు. ప్రతిక్రియ చేయున దతడు. అతడు భోక్త, ద్రష్ట, పరమార్థతత్త్వము, సింహాసనాసీనుడగు ప్రభువు, జీవాత్మ; అప్రాకృతుడు. అతడు అప్రాకృతుడు కనుకనే అనంతుడై యుండవలె. అతనికి ఎట్టి పరిమితియు నుండుట పొసగదు. ప్రతిపురుషుడును సర్వవ్యాపియే; మనలో ప్రతియొక్కరము సర్వవ్యాపకులమే. కాని మనము సూక్ష్మదేహ మగు లింగశరీరముగుండ మాత్రమే వ్యవహరింపగలము. మనస్సు, నే ననెడి చైతన్యము, ఇంద్రియములు, ప్రాణశక్తులు కలసి సూక్ష్మశరీరము (కోశము) అగును. క్రైస్తవ తత్త్వపరిభాషలో దీనికి మానవుని ఆధ్యాత్మిక దేహ మని పేరు. మోక్షమో, శిక్షయో, స్వర్గమో పొందునది ఈ శరీరమే; జన్మమెత్తునది, పునర్జన్మమెత్తునది యీ శరీరమే. ఏల యన వచ్చుటయు, పోవుటయు పురుషునకు ఆత్మకు ఘటిల్ల వని మొదటి నుండియు మనము గుర్తించుచున్నాము. కదలిక యనగా రాకడ, పోకడ. ఒకచోటనుండి మఱొకచోటికి రాకపోకలు చేయునది సర్వవ్యాపిగ నుండ నేరదు. కపిలుని మన స్తత్త్వ శాస్త్రమునుండి ఆత్మ యనంత మని, ప్రకృతిజన్యముకాని దది యొక్కటే అని మనము ఇంతవఱకు తెలిసికొంటిమి. ప్రకృతికి వెలుపల నున్న వా డత డొక్కడే. కాని, అతడు ప్రకృతిబద్ధు డయినట్టు కనబడును. ప్రకృతి అతని చుట్టు నున్నది. అదే తాను అని అత డనుకొనెను. "నేను లింగశరీరమను" "నేను స్థూల ప్రకృతిని, స్థూలదేహమను" అని యత డనుకొనును. అందుచేత అతడు కష్టసుఖము లనుభవించును. నిజమున కవి యతనికి చెందవు. అవి లింగశరీరమునకు, సూక్ష్మదేహమునకు చెందును.

ధ్యానావస్థ పరమోత్కృష్టస్థితిగా యోగి సదా పరిగణించును. అది నిష్క్రియమును కాదు, సక్రియమును కాదు; ఆ స్థితియందు మనకు పురుషునితో ఆత్యంతికసామీప్యము గల్గును.

ఆత్మకు సుఖమును లేదు, దుఃఖమును లేదు; అది సర్వసాక్షి, సమస్తకార్యములకు శాశ్వతసాక్షి. కాని, యే కర్మఫలమును దాని కంటదు. ప్రతికంటిచూపునకును కారకుడు సూర్యుడే; కాని ఏ కంటిదోషములు గాని సూర్యుని కంటవు. స్ఫటికము చెంత ఎఱుపు, నీలము రంగుల పువ్వు లుంచినప్పుడు అది యెఱుపుగాను, నీలముగాను కనబడును. కాని, దానికి ఎఱుపురంగును లేదు. నీలవర్ణమును లేదు. అటులనే ఆత్మకు క్రియయు లేదు, నిష్క్రియత్వమును లేదు. అది రెంటికిని అతీత మయినది. ఈ యాత్మస్థితిని వర్ణింపవలె నన్న నిజమునకు చాలచేరువుగా దానిని వర్ణింపగల పదము 'ధ్యానము'. ఇది సాంఖ్యదర్శనము.

సాంఖ్యదర్శనము చెప్పు మఱొక విషయ మిది: ప్రకృతి చెందు పరిణామ మంతయు ఆత్మకొఱకే. జరుగు కలయిక లన్నియు మఱొకనికొఱకే. ప్రకృతియని మనము వ్యవహరించెడి కలయిక లన్నియు ఈ నిరంతరపరిణామములు ఆత్మ అనుభవించుటకే, దాని విమోచనకొఱకే. అధమానుభూతినుండి ఉత్తమానుభూతి వఱకు సర్వానుభవములును ఆత్మకు గల్గుటకే. ఈ యనుభవములు పొందిన పిదప ఆత్మ, తా నెన్నడును ప్రకృతియందు లే నని గ్రహించును. తాను ప్రకృతికి పూర్తిగా వే ఱని, తా నవినాశ్య మని, తనకు రాకపోకలు లే వని తెలిసికొనును. స్వర్గలోకమునకు పోవుట, మరల జన్మించుట ఇవి ప్రకృతిగతములే గాని ఆత్మయందు లేవు. ఈ విధముగా ఆత్మ ముక్త మగును. అత్మ అనుభవించుటకును, ఆత్మ భోగించుటకునే సకల ప్రకృతి వ్యాపారములును. లక్ష్యమును చేరుకొనుటకే అది యీ యనుభవము పొందుచున్నది. ముక్తస్థితియే ఆ లక్ష్యము. మఱి, సాంఖ్యదర్శనము ప్రకారము ఆత్మ లనేకములు. ఆత్మ లసంఖ్యాకములు. జగత్కర్తగా నొక దేవుడు లే డనుట కపిలుని మఱొక నిర్ణయము, ప్రతివిషయమునకు కారణము, అర్థము ప్రకృతియందే కలదు. దేవు డవసరము లే దనియే సాంఖ్యులు చెప్పుదురు.

ఆత్మస్వరూపము అఖండసత్తు, అఖండచిత్తు, అఖండానందమని వేదాంతము చెప్పును. ఇవి ఆత్మకు గుణములు కావు. ఇ వన్నియు నొక్కటే, మూడు కావు; ఇది ఆత్మసారము. ప్రజ్ఞ ప్రకృతిద్వారా వచ్చును కనుక అది ప్రకృతికే చెందిన దనుటలో వేదాంతము సాంఖ్యముతో నేకీభవించుచున్నది. ప్రజ్ఞ సమ్మిశ్రపదార్థ మని వేదాంతముకూడ సూచించును. ఉదాహరణకొఱకు మన విషయగ్రహణావిధానమును పరిశీలింతము. నేను నల్లబల్ల చూచుచున్నాను. నా కీ జ్ఞాన మెట్లు కలుగుచున్నది? 'వస్తువు తనంతట' అందురు జర్మను తత్త్వవేత్తలు. నల్లబల్ల ఆ రీతిగ తెలియబడలేదు. నేను దాని నెప్పుడును తెలిసికొనలేను. దానిని 'ఎక్స్' అందము. 'నల్లబల్ల ఎక్స్' నా మనస్సుపై పనిచేయును. మనస్సునుండి ప్రతిక్రియ గలుగును. మనస్సు సరస్సువంటిది. దానిలోని కొక రాయి విసరివేయుడు. ప్రతిక్రియగా లేచు కెరటము రాయి నెదుర్కొనును; ఈ కెరట మెంతమాత్రమును రాయివలె లేదు. ఇది కెరటమే. 'నల్లబల్ల ఎక్స్' రాయివంటిది. అది నా మనస్సును కొట్టును. అంతట నా మనస్సునుండి కెరటము లేచి ఆ రాతి నెదుర్కొనును. మనస్సునుండి లేచు ఈ కెరటమునే మనము నల్లబల్ల అనుచున్నాము. నేను నిన్ను చూచుచున్నాను. పారమార్థికముగ నిన్ను నే నెఱుగను, ఎఱుగ శక్యము కాదు. నీవు 'ఎక్స్'. నీవు నా మనస్సును తాకుదువు. తనకు తాకుడు గలిగిన వంకకు మనస్సు కెరటమును విసరును. ఈ కెరటమునే నేను శ్రీ ఫలానా, శ్రీమతి ఫలానా అని అనుచున్నాను. గ్రహించుటయందు మూలవిభాగాలు రెండున్నవి. వెలుపలనుండి వచ్చున దొకటి 'ఎక్స్', లోపలనుండి వచ్చున దొకటి 'మనస్సు'. ఈ రెంటి కలయికయే 'ఎక్స్' + 'మనస్సే' మన బాహ్యప్రపంచము. జ్ఞానలబ్ధి అంతయు ప్రతిక్రియమూలముననే. తిమింగిలముతోకను కొట్టిన తరువాత ఆ నొప్పి అది గుర్తించుట కెంతసేపు పట్టునో లెక్కవేసి నిర్ధారింపబడినది. అంతర్దృష్టి విషయమయి గూడ

ఇదే తీరు. నాలోని ఆత్మ నాకు తెలియనిది, తెలియరానిది. దానిని 'వై' అందము. నేను నన్ను ఫలానా, ఫలానా అని గుర్తించినప్పు డది వై + మనస్సు అన్న మాట. 'వై' నా మనస్సుపై దెబ్బకొట్టును. కనుక మనప్రపంచమంతయు వెలుపల 'ఎక్స్' + మనస్సు; లోపల 'వై' + మనస్సు. 'ఎక్స్' బాహ్య ప్రపంచములోని తత్త్వము, 'వై' లోపలి ప్రపంచములోని తత్త్వము.

వేదాంతము ప్రకారము మన యెఱుకలో మూలభాగములు మూ డున్నవి — 'నే నుండుట', 'నే నెఱుగుట', 'నా ఆనందము'. "నాకు అపేక్షితమే లేదు, విశ్రాంతి సమృద్ధముగ నున్నది, శాంతి సమృద్ధముగ నున్నది, నన్ను కదల్పగల దేదియు లేదు" అను ఇట్టి ఆశయము అప్పు డప్పుడు కలుగుచుండును. అది మన జీవితసారము, జీవితమూలసూత్రము. దాని కొక పరిచ్ఛేదమును అం దొక కత్తియు కలిగినప్పుడు అది దృశ్యసత్తగను, ప్రత్యక్షజ్ఞానముగను, ప్రేమగను తన్ను వ్యక్తమొనర్చుకొనును. ప్రతిమానవునికిని సత్త కలదు; ప్రతిమానవునికిని జ్ఞానముండక తప్పదు, ప్రతిమానవుడును ప్రేమోన్మత్తుడై యున్నాడు. అతడు ప్రేమింపకుండ లేడు. అత్యధములనుండి అత్యున్నతుల వఱకు సకలప్రాణులును ప్రేమించుట విధాయకము. మనస్సుతో కూడి సత్తను జ్ఞానమును ప్రేమను రూపొందించు ఆంతరతత్త్వమును, వైని, వేదాంతులు అఖండసత్తని అఖండచిత్తని అఖండానందమని పేర్కొందురు. అపరిచ్ఛిన్నమును అసంకీర్ణమును అసమ్మిళితమును నిర్వికారము నగు పారమార్థికసత్తే విముక్తాత్మ. ఘటాకాశమును గదిలోని ఆకాశమును విశ్వవ్యాప్తమగు ఆకాశమునుండి వేఱైనదిగ కనబడునట్లు, విశ్వాత్మ మనస్సుతో కూడినప్పుడు మనస్సులో కలిసిపోయినప్పుడు అదే వ్యష్టిసత్త అనబడునదగును. తరులతాదుల జీవితము జంతుజీవితము మానవజీవితము

ఇట్లు ఏర్పడునవే. ఆ పారమార్థిక జ్ఞాన మున్నదే, అది మన కున్న తెలివి కాదు, స్ఫురణ (ఇంట్యూ్యషను) కాదు, వివేకము కాదు, సహజావబోధము కాదు. చెడి సంకీర్ణమైనప్పుడు దానిని స్ఫురణ అందుము. మఱికొంత చెడినప్పుడు దానినే వివేక మందుము. అంతకంటెకూడ ఎక్కువగా చెడినప్పుడు దానినే సహజావబోధ మందుము. పారమార్థికజ్ఞానము విజ్ఞానము. అది స్ఫురణయు కాదు, వివేకమును కాదు, సహజావబోధమును కాదు. దాని కించుమించు సరిపోవు పేరు సర్వజ్ఞత్వము. దానికి పరిచ్ఛేదము లేదు. అందు కల్తి లేదు. ఆ ఆనందమునకు కొంత మసక క్రమ్మినచో, దానినే 'ప్రేమ' అని 'స్థూలదేహములవంకకు సూక్ష్మదేహములవంకకు ఆశయములవంకకు గల్గు ఆకర్షణ' మని అందుము. ఇది ఆ ఆనందపు మాఱురూపమే. అఖండసత్త, అఖండచిత్తు, అఖండానందము అనునవి ఆత్మస్వరూపమే కాని ఆత్మగుణములు కావు. వానికిని ఆత్మకును భేదము లేనే లేదు. మూడును ఒక్కటే. ఒక్కటి మూడు విభిన్నవైఖరులలో కననగుచున్నది. అవి సకలవ్యావహారికజ్ఞానమునకును అతీతములైనవి. నిత్యాత్మజ్ఞానము మానవుని బుఱ్ఱగుండ చొచ్చుకొన్నప్పుడు 'స్ఫురణ'గా 'వివేకము'గా ఇంక నితరముగా నగును. దేనిగుండ తాను ప్రకాశించుచున్నదో అందుంబట్టి దాని ఆవిష్కృతి భేదిల్లును. ఆత్మగా భావించినప్పుడు మానవునకును మిక్కిలి జఘన్యమగు జంతువునకును భేదమే లేదు. జంతువుమెదడు తక్కువ పరిపక్వత నొందినది. అందుగుండ రూపొందు చిత్తును మనము సహజావబోధ మందుము. అది చాల మందముగ నుండును. మానవుని మెదడు ఎక్కువ పదును గలిగి యుండును. కావున అందుగుండ గల్గు ఆవిష్కృతి మఱింత స్పష్టముగ నుండును. అత్యున్నతిని గడించిన మానవునిలో అది సమగ్రస్పష్టత గల దగును. సత్తవిషయముకూడ అంతే. ఆత్మస్వరూపమగు పారమార్థికసత్తకు కేవలము ప్రతిబింబమే మన మెఱిగిన సత్త,

పరిచ్ఛిన్నసత్త. ఆనందము విషయముకూడ నింతే. మనము 'ప్రేమ' 'ఆకర్షణ' అందుమే ఇది ఆత్మస్వరూపమగు నిత్యానంద మునకు ప్రతిబింబమే. ఆవిష్కరింపబడినప్పుడు పరిచ్ఛేద మేర్ప డును. అవ్యక్తాత్మస్వరూపము అపరిచ్ఛిన్నము. ఆ ఆనందమునకు పరిచ్ఛేదము లేదు. ప్రేమలో పరిమితులు గలవు. నిన్ను నేనొక నాడు ప్రేమింతును, మఱునాడు ద్వేషింతును. ఒకనాడు నాప్రేమ హెచ్చును, మఱునా డది తగ్గును. ఇందులకు కారణ మది ప్రతి బింబ మగుటే.

కపిలునితో మేము వివాదపడు మొదటి విషయము దేవుని గుఱించి. వ్యష్టిబుద్ధితో ప్రారంభమై, వ్యష్టిదేహమువఱకు జరుగు ప్రకృతిపరిణామముల కన్నిటికిని వెనుక శాసకుడు, పాలకుడు అయిన పురుషు డొక డుండుట అవసరమైనట్లే, విశ్వములోకూడ విశ్వబుద్ధికిని, విశ్వాహంకారమునకును, విశ్వమనస్సునకును, సూక్ష్మస్థూలరూపములలో నున్న విశ్వవస్తువుల కన్నిటికిని శాసకుడు, పాలకుడు ఉండవలె. వెనుక శాసకుడుగా, పాలకుడుగా విశ్వపురుషు డొకడు లేకున్న విశ్వక్రమమునకు సమగ్రత ఎట్లు? విశ్వక్రమమునకు వెనుక విశ్వపురుషుడు లే డని మీరు చెప్పిన పక్షమున, వ్యష్టిక్రమమునకు వెనుక మీరు చెప్పు పురుషుడు లే డని మేము చెప్పగలము. మెట్టుమెట్టుగా వరుసగా వికసించిన వ్యష్ట్యావిష్కృతులకు మఱుగున వాని కన్నిటికి నతీతుడుగ అప్రాకృతు డొక డుండుట నిజమేని, ఆ న్యాయమే విశ్వావిష్కృ తుల విషయమునగూడ అన్వయించును. ఈ విశ్వప్రకృత్యావి ష్కారాలకు అతీతుడై ఉన్న విశ్వాత్మయే 'ఈశ్వరుడు' 'పరా త్పరుడు' 'భగవంతుడు' అను పేర్ల వ్యవహరింపబడును.

ఇంతకంటె నెక్కువ ముఖ్యమైన భేదము నిక చెప్పెద:— పురుషు డొక్కడు కాక అంత కెక్కు డుండుట సాధ్యమా? పురుషుడు సర్వవ్యాపి యనియు, అనంతు డనియు గుర్తించితిమి.

సర్వవ్యాప్తము ననంతము నయినవి రెం డుండ జాలవు. 'అ' అని 'ఇ' అని అనంతములు రెం డున్నచో అనంతమగు 'అ' అనంతమగు 'ఇ' ని పరిమితపఱచును. ఎందు కనగా అనంతమగు 'ఇ' అనంతమగు 'అ' కాదు; అనంతమగు 'అ' అనంతమగు 'ఇ' కాదు. వేర్వేఱు కాబట్టి ఇందులో అది చేరదు, అందులో ఇది చేరదు. వేఱగుట పరిమిత మగుటే. కనుక పరస్పరము పరిమితపఱచుకొనుటచే 'అ' 'ఇ' లు రెండును అనంతములు కాక పోవును. కనుక అనంతమయిన దొక్కటిగ ఉండుటే పొసగును. అనగా పురుషు డొక్కడే.

ఇప్పుడు మనము 'ఎక్సు'ను, 'వై'ని తీసికొని, ఈ రెండును ఒక్కటే అని ఋజువుచేయుదము. బాహ్యప్రపంచము 'ఎక్స్' + మనసు అనియు; లోపలిప్రపంచము 'వై' + మనస్సు అనియు ఋజువుచేసితిమి. 'ఎక్స్'ను 'వై'యు తెలియనివి, తెలియరానివి, సమస్తవిభేదము స్థలకాలనిమిత్తములవలన కలుగుచున్నది. ఇవి కూడియే మనస్సుగ రూపొందుచున్నవి. ఇవి లేక ఎట్టి చిత్తవృత్తియు లేదు. కాలము లేక, భావించుట మీ కసాధ్యము; స్థలసంబంధములేక మీరు దేనినిగాని ఊహింపజాలరు; కారణము లేక మీ కేదియును ఎప్పుడును గలుగదు. ఇవి మనస్సుదాల్చు రూపములు. వీనిని తీసివేయుడు. మనస్సే ఉండదు. కావున సకలభేదములకును కారణము మనస్సే. వేదాంతదర్శనముప్రకారము మనస్సే, మనస్సు ధరించిన రూపములే 'ఎక్సు'ను, 'వై'యు పరిచ్ఛిన్నములైనట్లును, బాహ్యజగత్తుగను, అంతర్జగత్తుగను కనబడునట్లును చేసినవి. కాని 'ఎక్సు'ను, 'వై'యు రెండును మనస్సున కతీతములైనవే. కావున అవి అభిన్నములు; రెండు నొక్కటే. వాని కెట్టి గుణము నారోపింపజాలము; ఏల యన, గుణముల కన్నిటికిని ప్రభవము మనస్సే. నిర్గుణమయినది ఏకముగా నుండక తప్పదు; 'ఎక్స్' గుణరహితమయినది; అందు కాన్పించు గుణములు మనస్సువి. 'వై' కూడ అంతే. కనుక

'ఎక్స్'ను 'వై'యు రెండును ఒక్కటే. విశ్వమంతయు ఒక్కటే. ప్రపంచములో నున్న ఆత్మ ఒక్కటే. ఒక్క సత్తే. ఆ ఏకసత్తు దేశకాలనిమిత్తరూపములగుండ చనునప్పుడు బుద్ధి సూక్ష్మ పదార్థము, స్థూలపదార్థము, సకల మానసిక భౌతికరూపములు అనెడి — వివిధనామములతో వ్యవహరింపబడుచున్నది. సృష్టి లోని ప్రతిదియు ఆ ఒక్కవస్తువే. అదే భిన్నరూపములలో కన బడుచున్నది. అందు కొంత ఈ దేశకాలనిమిత్తము లనెడి వలలో తగుల్కొన్నప్పుడు రూపముల దాల్చును; వలను తీసివేయుడు. అంతయు నొక్కటే. కనుక అద్వైతవాదముప్రకారము ఈ విశ్వమున కంతటికిని బ్రహ్మమందు ఆత్మయందు ఐక్యము. ఆ యాత్మ విశ్వమునకు వెనుకనుండి కనబడినప్పుడు భగవంతు డని వ్యవహరింపబడుచున్నాడు. అదే దేహ మనెడి యీ చిన్న ప్రపంచము వెనుకనుండి కనబడినప్పుడు ఆత్మ యనబడుచున్నది. ఇదే మానవునిలోనున్న ఆత్మ, ఉన్న దొక్కపురుషుడే. అతడే వేదాంతదర్శనమునందు నిరూపింపబడిన బ్రహ్మము; విభజించి చూచినప్పుడు బ్రహ్మమందు దేవుడును జీవుడును ఒక్కటే. ఈ జగత్తు మీరే, ఎడతెంపులేని మీరు; మీరు విశ్వవ్యాప్తులరై ఉన్నారు. ''అన్ని చేతులతోను మీరే పనిచేయుచున్నారు; అన్ని నోళ్లతోను మీరే భుజించుచున్నారు; అన్ని నాసికలతోను మీరే ఊపిరిపీల్చుచున్నారు; అన్ని మనస్సులతోను మీరే యోచించుచున్నారు.'' ఈ విశ్వమంతయు మీరే; విశ్వము మీ దేహము; సాకారజగమును నిరాకారజగమును కూడ మీరే; ఈ విశ్వమునకు ఆత్మయు దేహమును గూడ మీరే. దేవుడు మీరే, దేవదూతలు మీరే, మానవులు మీరే, మృగములు మీరే, వృక్షములు మీరే, ఖనిజములు మీరే, సర్వము మీరే, అన్నింటి ఆవిష్కృతి మీరే. ఉన్నదెల్ల మీరే. అనంతతత్త్వము మీరే. అనంత మవిభాజ్యము. అనంతమున భాగము లుండుట పొసగదు. ఉన్నచో ప్రతిభాగము అనంతమే

అగును. అప్పుడు అంగమును, అంగియు నొక్కటే యగును. అది యసంగతము. కనుక మీరు శ్రీ శ్రీ ఫలానా, ఫలానా యను ఆశయ మెన్నటికిని నిజము కాదు. అది పగటికల. దీని నెఱుగుడు, ముక్తులు కండు. ఇదే అద్వైతసిద్ధాంతము. "నేను దేహమను కాను, ఇంద్రియములు కాను, మనస్సను కాను; నేను అఖండసచ్చిదానందమను, సోఽహమ్". ఇదియే యథార్థ జ్ఞానము; తర్క మేమి, బుద్ధి యేమి, తక్కిన సర్వమును అజ్ఞానము. నాకు జ్ఞాన మేమి? ఏల యన నేనే జ్ఞానమను. నాకు జీవిత మేమి? నేనే జీవమను. నేను జీవించియున్నానని నాకు గట్టిగా తెలియును. ఏల యన జీవమను నేనే, ఏకసత్తు నేనే. నేనుగా కాక, నాయందు కాక, నా ద్వారా కాక ఏదియు లేదు. భూతములద్వారా వ్యక్తమగుచున్నది నేను, కాని, నేను బంధరహితమగు నేకతత్త్వమను. ముక్తి నెవరు కాంక్షింతురు? ఎవ్వరును కాంక్షింపరు. మీరు బద్ధులని అనుకొందురా, బద్ధులయియే యుందురు; మీ బంధమును మీరే కల్పించుకొందురు. మీరు ముక్తులని యెఱిగితిరా, ఈ క్షణమందే మీరు ముక్తులరు. ఇదియే జ్ఞానము. మోక్షజ్ఞానము. అఖిలప్ర గమ్యము ముక్తియే.



# భగవద్గీత - 1

(శాన్ఫ్రాన్సిస్కోలో 1900 వ సంవత్సరము మే 26 వ తేదీని
చేసిన ఉపన్యాసము)

భగవద్గీత నర్థము చేసికొనుటకు దాని చారిత్రకసందర్భము కూడ గ్రహించుట అవసరము. భగవద్గీత ఉపనిషత్తులకు వివరణమే. ఉపనిషత్తులు భారతదేశమునకు బైబిలువంటివి. క్రొత్త నిబంధనమున (న్యూటెస్టమెంటు) కెట్టిస్థానము కలదో, వానికిని అట్టి స్థానము కలదు. ఉపనిషత్తులు నూటికి పైగా కలవు. వానిలో చిన్నవి ఉన్నవి. పెద్దవి ఉన్నవి. దేని కదే ప్రత్యేకగ్రంథము ఉపనిషత్తులు ఏ ఆచార్యునిజీవితమును తెలియజేయవు. అవి సిద్ధాంతములను మాత్రమే బోధించును. పండితసమావేశములలో, సాధారణముగా రాజసభలలో చర్చలు జరిగినప్పుడు సంక్షిప్తలిపి (షార్టుహాండు) లో వ్రాసిపెట్టుకొన్న జ్ఞాపికలవంటివవి. సమీపమున కూర్చుండుట, ఆచార్యునిచెంత కూర్చుండుట అని కాబోలు ఉపనిషచ్ఛబ్దమునకు అర్థము. మీలో ఉపనిషత్తులలో కొన్నిటిని చదివినవారికి అవి సంక్షిప్తలిపిలో వ్రాసికోబడ్డ సంక్షేపములవంటివని తెలిసియుండును. దీర్ఘముగా చర్చలు జరిగిన అనంతర కాలమున జ్ఞప్తిలో నున్నంతవఱకు ఇవి వ్రాసిపెట్టుకొనబడియుండును. చర్చలసందర్భము మనకు తెలియదు; ప్రజ్వలాంశములుమాత్రమే అట తెలుపబడినవి. ఇదొక చిక్కు. ప్రాచీన సంస్కృతభాష క్రీస్తుకు అయిదువేలసంవత్సరములకు పూర్వమువి. ఉపనిషత్తులంతకు కనీసము రెండువేల సంవత్సరములు పూర్వమువి. అవి ఎంత ప్రాచీనములో సరిగా ఎవరికిని తెలియదు. భగవద్గీత ఉపనిషత్తులలోని భావములను తీసికొనును. కొన్నిచోట్ల ఉపనిషత్తులలోని శబ్దములనే కైకొనును. ఉపనిషత్తులలో ప్రతి

పాదింపబడియున్న విషయములను సంక్షిప్తముగా, క్రమబద్ధముగా, పొందికగా తెల్పుటకై అవి గీతలో కూర్పబడినవి.

హిందువుల తొలిప్రమాణగ్రంథములు వేదములు. అవి ఎంత విస్తారములైన వనగా కేవలము మూలగ్రంథములను మాత్రమే ఇక్కడకు తెచ్చినను వానికి ఈగది చాలదు. వానిలో చాలవఱకు ఖిలమై పోయినవి. వేదములు శాఖలుగా విభజింపబడినవి. ఒక్కొక్క శాఖయు కొందఱు పురోహితులకు కంఠస్థమై వారిజ్ఞప్తిలో సజీవముగ నున్నది. ఆవిధముగా వానిని కాపాడుచున్న వా రిప్పటికిని గలరు. ఒక్క స్వర మయినను తప్పక, వారు ఒకభాగము తరువాత నొకభాగముగా, వేదములను వల్లింపగలరు. వేదములలో అధికభాగ మంతరించినది. మిగిలియున్న యల్పభాగమే ఒకబృహద్భాండాగారమంతయున్నది. వీనిలో ఋగ్వేదమునందలి ఋక్కులు తక్కిన అన్నిటికంటె ప్రాచీనములైనవి. వానిని కాలక్రమమునుబట్టి ఒకదాని తర్వాత నొకటిగ మరల అమర్పవలె నని ఆధునికవిద్వాంసుని ప్రయత్నము. పూర్వాచార పరాయణుల అభిప్రాయ మిందుకు భిన్నము. మీలో బైబిలును గుఱించి మీసనాతనుల ఆశయములు ఆధునికపండితుల ఆశయములకు భిన్నములు కదా. వేదములలో రెండు భాగము లున్నవి. ఒకటి, తత్త్వకాండము, అదే ఉపనిషత్తులు. రెండవది కర్మకాండము.

కర్మకాండ మెట్టిదో సంగ్రహముగా తెలియజేయుటకు ప్రయత్నింతుము. దానిలో కర్మలు, స్తవములు వివిధదేవతల నుద్దేశించి చేసిన వివిధస్తవములు గలవు. కర్మభాగములో క్రతువులు వివరింపబడియున్నవి. వానిలో కొన్ని క్రతువులు చాల విపులములైనవి. వాని కనేకపురోహితుల అవసరము కలదు. క్రతువుల పెల్లిదమునకు ఫలితముగా పురోహితకృత్యము ప్రత్యేకముగా నొకశాస్త్రముగా రూపొందెను. క్రమముగా నీ స్తవము

లందు, కర్మలందు సామాన్యప్రజల కాదరము పెంపొందెను. దేవత లదృశ్యు లయిరి. వారి స్థానమున క్రతువు లేర్పడినవి. భారతదేశములో జరిగిన విచిత్రపరిణామ మది. వైదికహిందువు లకు మీమాంసకులకు దేవతలందు విశ్వాసము లేదు. వైదికులు కానివారికి దేవతలందు నమ్మక మున్నది. వైదికులను, వేదముల లోని దేవతల కర్థ మేమి యని ప్రశ్నించినచో, వారు సంతృప్తి కరమగు సమాధానము చెప్ప జాలరు. పురోహితులు ఋక్కులు వల్లింతురు, ఆహుతులను ఉపహారములను అగ్నిలో వ్రేల్తురు. దీని కంతటికి అర్థ మేమి యని వైదికు నడిగినచో, ఈ ఈ ఫలిత ముల గల్గించు శక్తి ఈయామంత్రమునకు కలదు అని యతడు చెప్పును. అంతే. ప్రాకృతశక్తులు, అప్రాకృతశక్తులు — అన్నియు అట నున్నవి. సరియైన స్వరముతో ఉచ్చరించినచో ఫలము లొసంగు అద్భుతశక్తిగల శబ్దములే వేదములు. ఒక్క శబ్దము పొల్లయినను పనికి రాదు. ప్రతిస్వరమును సరిగా ఉండ వలెను. ఈవిధముగా, ఇతరమతములలో దేనిని ప్రార్థన అందురో అది అదృశ్యమై, వేదములే వేల్పులయినవి. వేదములలోని శబ్ద ముల కెంతటి ప్రాధాన్యము కలిగినదో గమనించితిరి కదా! ఈ వాణి నిత్యమైనది. ఇందుండియే అఖిలవిశ్వమును సృజింపబడినది. శబ్దము లేనిదే భావ మసంభవము. కాబట్టి సృష్టిలో నున్న దెల్ల భావావిష్కృతియే. భావము తన్ను తాను మాటలలోనే వ్యక్తముచేసికోగలదు. అవ్యక్తముగా నున్న భావము ఏశబ్దము లచే వ్యక్తమైనదో అట్టి యీ శబ్దసముదాయమే వేదములు. దీనినిబట్టి మనకు వెలుపల నున్న ప్రతివస్తుస్థితియు వేదముపై ఆధారపడియున్న దని తేలుచున్నది; ఏల యన శబ్దము లేక భావ ముండ జాలదు. ''అశ్వము'' అను మాట లేనియెడల ఎవరును అశ్వము నూహింప జాలరు. కనుక భావమునకు, శబ్దమునకు, వస్తువునకు సన్నిహిత సంబంధ ముండ వలెను. నిజమున కీశబ్దము లేవి? వేదములే. ఆభాషను సంస్కృత మనరు. అది వైదికభాష

యని, దేవభాష యని యందురు. దాని యపభ్రంశరూపమే సంస్కృతము. ఇతరభాష లన్నియు అంతే. వేదభాషకంటె పురాతనమగు భాష మఱొకటి లేదు. "వేదముల నెవరు రచించిరి?" అని మీరడుగ వచ్చును. అవి అపౌరుషేయములు. శబ్దమే వేదము. నేను సరిగా పలుకగలిగినచో శబ్దమే వేదము. అంతట అది మనము వాంఛించిన ఫలితమును వెంటనే కలుగజేయును.

ఈ వేదములు నిత్యములు. సకలప్రపంచము ఈ శబ్దముల ఆవిష్కృతియే. కల్పాంతమున వ్యక్తమైన ఈశక్తి సూక్ష్మ, సూక్ష్మతర రూపములు దాల్చును. శబ్దరూపమునకు, భావరూపమునకు మరలును. అనంతర కల్పమున భావము మొదట శబ్దముగా మాఱును. శబ్దమునుండి ఈ యఖిలవిశ్వము సృజింపబడును. వేదములలో లేని దేదేని యిక్కడ ఉన్న దన్న యెడల అది నీ భ్రాంతియే. అట్టిది లేనే లేదు.

ఏతద్విషయికములగు నసంఖ్యాకగ్రంథములు వేదములను సమర్థించుచున్నవి. ఆ గ్రంథరచయితలయొద్ద కేగి "వేదములు తొలుత మానవుని నోటనుండి వెలువడినవే" అని చెప్పుదువేని వారు నవ్వుదురు. మొట్టమొదట మానవుడే దానిని పల్కగా మీరు వినియుండలేదు. బుద్ధుని మాటలను తీసికొనుడు. ఆ మాటల నతడంతకుపూర్వమును పెక్కుజన్మలలో పల్కియుండె నను సంప్రదాయ మొకటి గలదు. క్రైస్తవుడు లేచి, "నామతము చారిత్రకమైనది. కనుక నీ మతము తప్పు. నామతమే సరియైనది" అని చెప్పినచో, మీమాంసకు డిట్లు బదులుచెప్పును: "నీ మతము చారిత్రకమైనది కనుక పందొమ్మిదివందలయేండ్ల కృతము దానిని మనుష్యుడు కల్పించె నని నీవే అంగీకరించుచున్నావు. ఏది సత్యమో అది ఆద్యంతరహితము, నిత్యము నయి యుండ వలె. అదే సత్యమున కేకైక ప్రమాణము. అది

యెన్నటికిని నశింపదు. అది సర్వదా ఒక్కటే. మీ మతమును ఫలానా......ఫలానావారు సృష్టించి రని మీరే యొప్పుకొను చున్నారు. వేదములు పురుషప్రణీతములు కావు. ఏప్రవక్తలు......మఱెవరు సృష్టించినవి కావు. ఆద్యంతరహితమగు శబ్దము—ఆద్యంతరహితత దానిస్వరూపము. ఆ శబ్దము నుండియే ఈ సమస్త ప్రపంచము వచ్చుచున్నది, అందులోనికే పోవుచున్నది.'' తాత్త్వికముగా అది మిక్కిలి సరియైన జవాబు. సృష్టికి శబ్దమే మొదలు. బీజరూపములవలెనే బీజశబ్దములుకూడ గలవు. మాటలు లేక భావము లుండ జాలవు. ...... ఎక్క డెక్కడ అనుభవములు, అభిప్రాయములు, ఆవేశములు కలవో అక్కడక్క డెల్ల శబ్దము లుండ వలె. ఈ నాలుగుగ్రంథములే వేదములు, ఇంతకు మించి మఱేమియు వేదములు కా వన్నప్పుడే చిక్కంతయు కలుగును. అంతట బౌద్ధులు కూడ లేచి, ''మా గ్రంథములుకూడ వేదములే. అవి తరువాత మాకు వెలువరింపబడినవి'' అని చెప్పుదురు. అది పొసగనిమాట. అది ప్రకృతి పద్ధతి కానే కాదు. ప్రకృతి తనశాసనములను కొంచెము కొంచెముగ వ్యక్తము చేయదు. గురుత్వాకర్షణశక్తిని నేడు కొంత, రేపు కొంతగ వ్యక్తము చేయదు. ప్రతినియమము సంపూర్ణమే. నియమమునందు క్రమపరిణామ మనునది లేదు. ఒక్కమారు వ్యక్తమైన దట్లే నిల్చును. '' 'ఇది క్రొత్తమతము, ఇది వరిష్ఠమగు ఈశ్వరప్రేరితజ్ఞానము' మున్నగునవి అర్థము లేని మాటలు.'' అభావమే వాని అర్థము. లక్షశాసనము లుండ వచ్చును. వానిలో కొన్నిటినే మానవుడు ఇప్పటికి తెలిసికొనియుండవచ్చును. మనము వానిని కనుగొందుము — అంతే కదా! శబ్దము నిత్యమని పెద్దవాదము చేయు ప్రాతపురోహితులు దేవతలను త్రోసిరాజు చేసి, తామే దేవతల స్థానము నాక్రమించిరి. వా రిట్లనిరి: ''శబ్దముల శక్తి మీకు తెలియదు. వాని ప్రయోగము మే మెఱుంగుదుము. లోకములో మేమే ప్రత్యక్షదేవతలము. మాకు ధన

మిందు; మేము శబ్దముల ప్రయోగింతుము. మీ కోర్కెలు ఫలించును. ఈ శబ్దములు మీరు ఉచ్చరింప గలరా? మీరు ఉచ్చరింప లేరు. ఒక్క అక్షర మయినను తప్పుగా పలికితిరా, జాగ్రత్త! బెడిసికొట్టును. మీకు ఐశ్వర్యము, సౌందర్యము, దీర్ఘాయువు, చక్కనిభర్త కావలెనా? పురోహితునకు డబ్బు ముట్టచెప్పి, నిశ్చింతగా నుండుడు!''

మఱొక భాగ మున్నది. వేదములలోని మొదటిభాగము నకు గల లక్ష్యము ఉపనిషత్తు లనియెడి రెండవ భాగమునకు గల లక్ష్యమునకు పూర్తిగా భిన్నము. మొదటిభాగమునకు గల లక్ష్యము, ఒక వేదాంత మతలక్ష్యముతో తక్క, తక్కిన అన్ని మతముల లక్ష్యముతో సరిపోవును. ఇహలోకములోను, పరలోకములోను భోగము ననుభవించుటే లక్ష్యము — భార్య, భర్త, బిడ్డలు. మీ రుసుము చెల్లించుకొండి. మతగురువు మీకు యోగ్యతాపత్రము నిచ్చును. అంతట మీకు పరలోకమున సకల సుఖములు గల్గును. అక్కడ మీ వారంద ఱుందురు. మీ భోగానుభవాలకు విచ్ఛేద ముండదు. కన్నీ రుండదు, విలాపము ఉండదు. — నిరంతరము నవ్వే. కడుపునొప్పి యనునది లేకుండ తినుచుండుటే. తలనొప్పి లేకుండ వినోదించుచుండుటే. ఇది మానవజీవితమునకు పరమ లక్ష్య మని పురోహితుల భావము.

ఈ తత్త్వవాదములో మఱొక ఆశయ మున్నది. అది మీ యాధునిక భావముల కనుగుణ మయినది. మానవుడు ప్రకృతికి బానిస. అతడు శాశ్వతముగా బానిసగ నుండవలసినదే. మేము దీనిని కర్మ యందుము. 'కర్మ' అనగా 'కర్మ' సిద్ధాంతము. అది యన్నిటికిని అన్వయించును. సర్వము కర్మ కధీనము. ''దీనినుండి బయటబడుదారి లేదా?'' ''లేదు! ఎల్ల కాలము బానిసలుగా నుండి తీరవలసినదే.—చక్కని బానిసలు. మేము కొన్ని శబ్దముల ప్రయోగించి నీకు మేలే గాని కీ డనునది లేకుండ జేయుదుము.

కాని, అందుకు మీరు మాకు చాలినంత డబ్బు చెల్లింపవలె, ఇది మీమాంసకుల లక్ష్యము. ఈ ఆశయములు యుగయుగములుగా జనప్రీతి చూఱగొన్నవి. ప్రజలలో అత్యధికసంఖ్యాకులు ఆలోచన గల వారు కారు. ఒకవేళ ఆలోచించుటకు ప్రయత్నించినను, పుట్టలు పుట్టలుగా పెరిగిపోయిన మూఢవిశ్వాసాల ప్రభావము వారిపై దారుణముగా కలదు. ఏ ముహూర్తములోగాని అవి కొంచెము సడలిపోగానే ఏదో కష్టము కలుగును. దానితో వారి వెన్నెముక యిరువది ముక్క లగును. ఆశ, భయము ఈ రెండే వారిని నడిపించునవి. వారు తమంత తాముగా ముందుకు కదలరు. అదలింపుడు, బెదరింపుడు, భయపెట్టుడు; వారు మీకు శాశ్వత దాసులుగ నుందురు. డబ్బుచెల్లించుచుండుట, విధేయులయి యుండుట తప్ప వారు ఇకనేమియు చేయ నక్కఱ లేదు. తక్కిన దంతయు పురోహితుడే చేయును. ... ఇందువలన మత మెంత సులభ మయినదో చూచితిరా! మీరు చేయవలసిన దేమియు లేదు. ఇంటికి పోయి హాయిగా కూర్చుండుడు. మీకై మ ఱొకరు సర్వము చేయుచున్నారు. నిర్భాగ్య లగు పశువులు!

దీనితో బాటే మఱొక విధాన మున్నది. ఉపనిషత్తుల నిర్ణయములు వీనికి పూర్తిగ విరుద్ధములు. ప్రప్రథమవిషయము:— విశ్వస్రష్టయు విశ్వపాలకుడు నగు దేవు డున్నా డను విశ్వాసము ఉపనిషత్తులలో కలదు. తరువాత తరువాత భగవానుడు కరుణా మయు డను ఆశయము కలిగినది. అది పూర్తిగా విరుద్ధ మగు భావము. పురోహితుని ఒకచెంప మన్నించుచున్నను ఇప్పటి లక్ష్యము సూక్ష్మతరము, పెక్కు వేల్పులకు బదులు ఒక్క దేవు డేర్పడినాడు.

రెండవభావము: మన మందఱము కర్మసూత్రబద్ధులమయి యున్నా మని ఉపనిషత్తు లంగీకరించును; కాని, యీ పరాధీనత నుండి విముక్తిపొందునుపాయము నవే తెల్పును. మానవునిలక్ష్యము

నియతి నతిక్రమించుటే. భోగము జీవితలక్ష్య మెన్నడును కానేరదు; ఏల యన భోగము ప్రకృతి సీమలకు లోబడినదే.

మూఁడవభావము: ఉపనిషత్తులు యజ్ఞయాగాది కర్మల నన్నిటిని ఖండించును, సర్వము బూటక మనును. వానివలన మీ కోర్కె లన్నియు తీర వచ్చు గాక. కాని, అది వాంఛనీయము కాదు. ఏల యన, లభించుకొలదియు, ఇంకనింకను కావలె నను మీకోర్కెలు పెరుగుచుండును. సుడిలో మీరు సదా చుట్లు తిరుగుచుందురు. మీతృప్తికొక అం తుండదు. అనుభవించు చుందురు ఏడ్చుచుందురు. నిత్యసుఖమునది యెక్కడ గాని అసాధ్యము. అది కేవలము శిశుస్వప్నము. సంతోషముగాను, దుఃఖముగాను మార్పొందు శక్తి ఒక్కటే.

నా మనస్తత్వములో నేడించుక మార్పున్నది. చాల వింత విషయమును కనుగొంటిని. మీ కేదో తలంపు కలిగిన దనుకొనుడు. అది మీ కిష్టము లేదు. మీరు మనసును మఱొక విషయముమీఁదికి త్రిప్పుదురు. మీ రడచివేసికొన దలచిన తలంపు పూర్తిగా అడగిపోవును. ఏది ఆ తలంపు? పదునయిదు నిమిషములలో నది మనసులోనికి వచ్చుట నేను గమనించితిని. అది నన్ను ఉఱ్ఱూతలూపినది. అది వచ్చినప్పుడు ఎంత ప్రబలముగను ఎంత ఉద్రిక్తముగను ఎంత భయంకరముగను వచ్చిన దనగా — వెఱ్ఱిపట్టిన దనియే అనుకొంటిని. అది ముగిసినప్పుడు, ఇంతకును జరిగిన దేమి. నా మునుపటి భావోద్రేకము అణచుకోబడ్డది. వెలువడిన దేది? అది నాభ్రాంతియే, దానిని తీర్చుకో వలసివచ్చినది. ''భూతములు ప్రకృతి ననుసరించును. నిగ్రహమేమి సేయును?''* అనుట భగవద్గీతలో నున్న యొక భీకరసూక్తి. తుద కీశ్రమ వ్యర్థము కావచ్చు నని కూడ తోచుచున్నది. మీలో లక్షప్రేరణ లొక్కసారిగా పోటాపోటీగా మిమ్ము కలవర

* భగవద్గీత 3-33

పెట్టుచుండవచ్చును. వానిని మీా రడంపవచ్చును. కాని, అదుముడు తొలగిపోగానే అవన్నియు మరల పూర్వస్థాయికి వచ్చును.

కాని, ఆశ కవకాశ మున్నది. చాలినంత శక్తి నీ కున్నచో నీ అవధానమును ఏకకాలమందే యిరువదిభాగములుగ విభజించుకొనవచ్చు. నా మన స్తత్వమును మార్చుకొనుచున్నాను. మనస్సు వర్ధిల్లును. వర్ధిల్లు నని యోగులు చెప్పుదురు. ఒక భావోద్రేకము మఱొక భావోద్రేకమును లేపును. పిమ్మట మొదటిది అడగిపోవును. నీకు మొదట కోపము, తర్వాత సంతోషము గల్గు నేని మలి క్షణమున కోపము మాయ మగును. ఆ కోపమునుండియే దానితరువాతి దశను నీవు కల్గించుకొంటివి. ఈయవస్థావిశేషములలో ఇందుండి అందులోనికి అందుండి ఇందులోనికి మార్పులుగల్గు నవకాశము సదా ఉన్నది. నిత్యసుఖము నిత్యదుఃఖము అనునవి శిశుస్వప్నములు. మానవజీవితగమ్యము సుఖమును కాదు, దుఃఖమును కాదు; దేనినుండి యివి పుట్టునో దానిని వశపఱచుకొనుటే జీవితలక్ష్యము. ఏ పరిస్థితిని గాని దాని మూలమునొద్దనే వశములోనికి తెచ్చుకోవలెను.

మఱొక భేద మిది : ఉపనిషత్తులు సమస్తకర్మలను, ముఖ్యముగా జంతుబలులతో కూడిన కర్మలను ఖండించును. అవి యర్థము లేని పిచ్చిపను లని ఉపనిషత్తులు ఘోషించును. ఆశించిన ఫలితము కలుగుటకు ఒకానొక జంతువును ఒకానొకసమయములో చంపవలె నని ఒక ప్రాచీనవర్గమునకు చెందిన తత్త్వవాదులు చెప్పుదురు. దీనికి మీా రీవిధముగా చెప్పవచ్చు: "జంతువు ప్రాణము తీయుట వలని పాపముకూడ నున్నది. దానిఫలితము నీ వనుభవింపక తప్పదు." అదంతయు అర్థములేని మాట యని వా రందురు. ఏది తప్పో, ఏది ఒప్పో నీ కెట్లు తెలియును? నీ మన స్సట్లు చెప్పుచున్నదా? నీమనస్సు నీ కేమి చెప్పిన ఎవరికి లక్ష్యము? ఏమి పిచ్చి మాట లివన్నియు? ప్రమాణగ్రంథము

లకు వ్యతిరేకముగా నీ మనస్సును చననిచ్చుచున్నావు. నీ మనస్సొక విధముగాను, వేదములు మఱొక విధముగాను చెప్పినచో, నీ మనస్సును అరికట్టు. వేదములనే నమ్ము. నరహత్య పుణ్యమని వేదములు చెప్పినచో అది పుణ్యమే. కాదు. కాదు. నా అంతరాత్మ అందుకు భిన్నముగా చెప్పుచున్న దందువా, అది చెల్లదు. ఏగ్రంథమందైన 'అది నిత్యవాణి, పవిత్రమైనది,' అను నమ్మకము నీకు గల్గిన తత్‌క్షణమే దాని నాక్షేపించుటకు నీ కధికారము లేదు. "బైబిలులోని మాటలు ఎంత అద్భుతముగా నున్నవి? అవి యెంత సరిగా నున్నవి! ఎంత బాగున్నవి?" అని మీ రనునప్పుడు ఆ గ్రంథమునందు మీకు గల విశ్వాస మెటువంటిదో నాకు తెలియుట లేదు. ఏల యన, బైబిలు భగవద్వాణి అను నమ్మకము నీ కున్నచో ఇక గుణదోషపరామర్శకు నీ కధికారము లేదు. గుణదోషపరామర్శ చేయుదువేని, బైబిలుకంటె నీవే పైవాడ వని అనుకొనుచున్నా వన్న మాట. అటు లయినచో, బైబిలు నీ కెందుకు? మతాచార్యు లిట్లందురు: "మీ బైబిలుతోగాని, మఱిదేనితోగాని పోల్చుటకు మే మంగీకరింపము. పోల్చుటవలన ప్రయోజనము లేదు. ఎందు కనగా — ప్రమాణము ఏదీ? అది అంతటితో సరి. ఏది గాని సరి కాదని నీకు తోచినచో వేదముల బట్టి దానిని సవరించుకో."

ఈవాదమందు ఉపనిషత్తులకు విశ్వాస మున్నది. కాని, వాని కంతకంటె పైదైన ప్రమాణముకూడ గలదు. ఒక చెంప వేదములను త్రోసిరాజనుట వానికి సమ్మతము కాదు. మఱొక చెంప ఈ పశుయజ్ఞములగుట్టును, పురోహితవర్గము అందఱిధనము నపహరించుచున్న సంగతియు, వానికి తెలిసినవే. కాని, మన స్తత్వశాస్త్రవిషయమున అవి అన్నియు ఒక్కతీరువే. ఉన్న అభిప్రాయభేదము లన్నియు ఆత్మతత్త్వమునుగుఱించియే, అనగా, తత్త్వశాస్త్ర విషయములోనే. ఆత్మకు దేహమును, మనస్సును కలవా? మనస్సనగా కండరముల కుద్రేకమిచ్చు నరములయు భావముద్రాప్రాప

కములగునరములయు కూడికమాత్రమేనా? మన స్తత్త్వశాస్త్రము సమగ్రశాస్త్ర మని అందఱ నమ్మకము. అందు అభిప్రాయభేదమున కవకాశము లేనేలేదు. వివాద మంతయు తత్త్వశాస్త్రమునుగుఱిం చియే—ఆత్మతత్త్వము, దేవుఁడు, మున్నగువానినిగుఱించియే.

ఉపనిషత్తులకు, మతాచార్యుల బోధల కింకను వేఱొక ప్రముఖభేదము కలదు. సన్న్యసింపు డని ఉపనిషత్తులు బోధిం చును. అన్నిటి కదియే గీటురాయి. సర్వమును త్యజింపుఁడు. సృజించుప్రజ్ఞయే మనలను ఈ చిక్కులలో పడవేయును. శాంత స్థితియే మనస్సునకు ప్రకృతి. మనస్సును శాంతపఱచుకోఁగలిగిన తత్క్షణమే నీవు సత్యమును తెలిసికొనఁగలవు. మనస్సును త్రిప్పు చున్న దేది? భావనయు, కల్పనయునే. కల్పన నాపివేయుము. నీవు సత్యమును తెలిసికొందువు. సృజించుప్రజ్ఞ పూర్తిగా ఆగి పోవలె. వెంటనే నీవు సత్యమును తెలిసికొనఁగలవు.

కాని, కల్పనయే మతాచార్యుల కందఱకు నభిమతము. కల్పనయే లేని యొక ప్రాణివర్గమును మనస్సుకు తెచ్చుకొని చూడుఁడు. అట్టి ప్రాణివర్గ మసంభావ్యము. సుదృఢమైన యొక సమాజవ్యవస్థను నిర్మించుటకు పథకము ప్రజలకు కావలసి వచ్చెను. గుణవంతుల నెన్నుకొను నొక కఠినవిధానము అవలం బింపబడెను. ఉదాహరణకు: గ్రుడ్డివారికి, కుంటివారికి వివాహము చేయరాదు. ఈనియమఫలితముగా ప్రపంచమందలి యితరదేశ ములప్రజలలోకంటె భారతదేశములోనిప్రజలలో అంగవైకల్యము తక్కువ. అక్కడ మూర్ఛరోగులు, వెఱ్ఱివారు చాల అరుదు. ప్రత్యక్షముగ గుణమునుబట్టి ఎన్నుకొనుటే అందుకు కారణ మని మతాచార్యులు చెప్పుదురు. "అటువంటివారు సన్న్యాసు లగుదురు గాక" అని మతాచార్యు లందురు. కాని, "అ దెంత మాత్రము తగదు. భువి గల పుష్పములలో శ్రేష్ఠము లనే రమ్యతమములనే క్రొంగ్రొత్తవానినే బలిపీఠముపై పెట్ట వలెను", "దృఢగాత్రులు, యువకులు, మనశ్శరీరములు సుస్థితియం

దున్నవారు – ఇట్టివారే పరమార్థసాధనకు పాటుపడవలసినవారు”
అని ఉపనిషత్తులు ఘోషించును.

ఈయభిప్రాయభేదము లన్నియు గల్గి పురోహితులు తా మొక ప్రత్యేకవర్గముగా ఈవఱకే ఏర్పడి రని చెప్పితిని. తరువాతి వర్ణము వారు రాజులు.....ఉపనిషత్సిద్ధాంతము లన్నియును పుట్టినది రాజులప్రతిభనుండియే కాని, బ్రాహ్మణులప్రతిభనుండి కాదు. ప్రతిమతకలహమందును మొదటినుండి తుదవఱకు ఆర్థికఘర్షణ కూడ గలదు. మానవు డనబడు ఈపశువుపై కొంతవఱకు మత ప్రభావ మున్నను, పొదుపే అతని లక్ష్యము. వ్యక్తులకు వేఱు లక్ష్యములు గలవు, కాని మానవసమష్టి, పొదుపుమీదిదృష్టితోనే తప్ప ఒక్క అడుగుకూడ ముందుకు వేయలేదు. నీవు బోధించు మతము అన్నివివరములందును నిర్దోషముగ నుండక పోవచ్చు. కాని దాని కొక ఆర్థికమూలము ఉండు నేని దానిని ప్రచారముచేయుటకు ప్రచారదీక్షాపరతంత్రులు నీకులభింపగలరు. యావద్దేశమును నీవు నమ్మింప గల్గుదువు.

ఏ మత మెప్పుడు విజయమును సాధించినను దానిలో ఆర్థికప్రయోజన మిమిడి యుండక తప్పదు. ప్రజలలో తమకే చెల్లుబడి గల్గ వలె నని అట్టి మతశాఖలు వేలకొలదిగ పాటుపడుచుండును. కాని, నిజమైన ఆర్థికసమస్యను పరిష్కరింపగల మతములకే విజయము కలుగును. మానవుని పాట్లన్నియు పొట్టకై. అతడు నడచునప్పుడు ముందు పోవునది పొట్ట. తరువాతనే శిరస్సు. ఈవిషయము మీరు గుర్తింప లేదా? శిరస్సే అగ్రగామి యగుటకు యుగములు పట్టును. అఱువది సంవత్సరములు నిండునప్పటికి మానవునికి ఈలోకమునుండి ర మ్మని పిలుపు వచ్చును. జీవితమంతయు ఎడతెంపులేని భ్రమయే. విషయముల కలహాపు గుర్తింప నీ వారంభించుక్షణముననే మృత్యువు నిన్ను కొనిపోవును. పొట్టకు ప్రాథమ్యము చెల్లుచుండినన్నినాళ్లు మీరు బాగుగానే యుంటిరి. పసిబిడ్డల ఊహలు పోయి, వస్తువుల యథార్థ

తత్త్వమును గుర్తింపనారంభింపగానే బుద్ధుకు ప్రాథమ్యము గల్గును. బుద్ధికి ప్రాథమ్యము కల్గ నారంభించుక్షణముననే, మీకు నిష్క్రమణము.

ఉపనిషన్మతమును ప్రజలకు నచ్చజేయుట దుష్కరమయిన పని. ఆర్థికప్రయోజనమం దేమియు లేదు. కాని, అత్యధికలోక హితప్రవణత......

ఉపనిషద్ద్రష్టలు సకల రాజ్యాధికారము గల రాజులే అయినను, వానికి గల రాజ్య మత్యల్పము. కనుక ఘర్షణ... తీవ్రము కాసాగినది. దీని పర్యవసానము రెండు వేలసంవత్సరముల తరువాత బౌద్ధమతముగ రూపుదాల్చినది. రాజులకు పురోహితులకు సాగిన సామాన్యకలహమందే బౌద్ధమతబీజ మున్నది. ఆ కలహములో అసలుమతమే క్షీణించినది. మతమునే సమూలముగా తుడిచివేయుట కొక పక్షము ప్రయత్నింపగా, వేదముల లోని దేవతలను, యజ్ఞములను అంటిపెట్టుకొనుటకు మఱొక పక్షము ప్రయత్నించినది. బౌద్ధమత మవతరించి ప్రజల శృంఖలములను త్రెంచివేసెను. సకలవర్ణములును, మతములును క్షణ కాలములో సమానములై పోయినవి. మహోత్కృష్టములగు పారమార్థికాశయములు భారతదేశములో గలవు. వానిని ప్రచారము చేయవలసియున్నది. ప్రచారము లేనియెడల ప్రయోజనము లేదు.

ప్రతిదేశములోను పురోహితుడే ప్రాచీనాచారాల వదలక ప్రాకులాడువాడు. ఇందుకు గల కారణములు రెండు : అవి అతనికి జీవనాధారములు, ప్రజల అభిరుచుల కనుగుణముగ నతడు నడవవలెను. పురోహితు లందఱును గట్టివారు కారు. రెండు వేల దేవుళ్లను గుఱించి ప్రచారము సేయుడని ప్రజలు కోరినచో పురోహితు లటులనే చేయుదురు. తమకు డబ్బు ముట్టచెప్పెడి ప్రజలకు పురోహితులు సేవకులు. దేవుడు వారికి రాగిదమ్మిడీకూడ ఈయడు. కనుక పురోహితులను దూషించుటకు ముందు మిమ్మే దూషించు

కొనుడు. మీయర్హతకు తగినట్టుగానే మీకు ప్రభుత్వమును మతమును పురోహితవర్గమును లభించుచుండును. అంతకంటె మేలైనవి లభింపవు.

ఈవిధముగా భారతదేశములో నారంభమైన మహాకలహాపు పరిసమాప్తిఘట్టములలో నొకటి భగవద్గీతలో వచ్చును. యావద్భారతదేశ మీ యిరుపక్షములుగా చీలిపోవు నన్న భయము కలుగుచుండినపరిస్థితిలో శ్రీకృష్ణు డవతరించెను. అతడు గీతలో పురోహితుల కర్మవాదమునకును ప్రజల తత్త్వవాదమునకును సామరస్యము సాధింప ప్రయత్నించెను. మీరు క్రైస్తును ప్రేమించి, పూజించునట్లే మాదేశములో శ్రీకృష్ణుని ప్రేమించి, పూజింతురు. వారి కాలములు మాత్రమే వేర్వేఱు. మీరు క్రైస్తుజయంత్యుత్సవము జరుపునట్లుగా హిందువులు శ్రీకృష్ణజయంతి జరుపుదురు. కృష్ణుడు ఇప్పటికి అయిదువేలయేండ్లకు పూర్వ ముండినవాడు. అతని జీవిత మద్భుత లీలలతో నిండినది; కొన్ని అద్భుతలీలలు క్రైస్తుజీవితములోని లీలలను మిక్కిలి పోలియుండును. శిశువు కారాగారములో జన్మించెను. తండ్రి అతనిని తీసికొని పోయి గొల్లలయొద్ద నుంచెను. అతడు పుట్టిన సంవత్సరము పుట్టిన బిడ్డల నందఱను చంపివేయవలసిన దని ఆజ్ఞయైనది. అతడును చంపబడెను. అట్టిది అతనివిధి.

కృష్ణుడు గృహస్థుడు. అతనిని గుఱించి వేలకొలదిగ్రంథములున్నవి. వానియందు నాకెక్కువ రుచి లేదు. కథలు చెప్పుటలో హిందువులు మొనగాండ్రు, తెలిసినదా? క్రైస్తవప్రచారకులు బైబిలులోనుండి ఒకకథ చెప్పినచో, హిందువు లిరువది కథలు చెప్పుదురు. తిమింగిలము జోనాను మ్రింగిన దని మీరు చెప్పినచో, ఒకానొకడు ఏనుగును అమాంతముగా మ్రింగివేసె నని హిందువులు చెప్పుదురు.... నేను నా చిన్నతనమునుండియుకృష్ణుని జీవితమును గుఱించి వినియున్నాను. కృష్ణ డను పేరుగల మానవు

డొక డుండియుండవలె నని నేను నమ్మితిని. అతడు మన కొక అద్భుతగ్రంథము నిచ్చిపోయినా డని భగవద్గీత తెల్పుచున్నది. ఒకనిని గుఱించి వాడుకలో నున్న కట్టుకథల నన్నిటిని పరిశీలించినచో, అతని శీలమును గ్రహింప నగు నని నేను చెప్పితినికదా. కట్టుకథ లన్నియు నలంకారములు. అవి శీలమున కతుకునట్లుగా కల్పితములై మెఱుగులు పెట్టబడియుండును. ఉదాహరణకు బుద్ధుని తీసికొందము. అతని ప్రధానగుణము త్యాగము. అతనిని గుఱించి ప్రజలు చెప్పుకొను కథలు వేలకొలది గలవు. ప్రతికథలోను త్యాగగుణము ఎత్తిచూపబడక తప్పదు. అబ్రహాము లింకనును గుఱించి వేలకొలది కథలు గలవు. ఆమహాపురుషుని ఒకానొక గుణవిశేషము వానిలో ప్రతిదానిలోను ఉండును. ఆగాథ లన్నిటిని గ్రహించి, వానిలో ఉమ్మడిగనున్న ఆశయమును గుర్తించి అది ఆమహాపురుషుని శీలములోని ప్రధానగుణ మని తెలిసికొందురు. అటులనే శ్రీకృష్ణునిలో నిస్సంగత్వము ప్రధానగుణ మని మీరు గుర్తింతురు. అతని కేదియు కావలసినది లేదు. అతని కే కోర్కెయు లేదు. అతడు కర్మను కర్మకొఱకే చేయును. కృషికొఱకే కృషి. ఉపాసనకొఱకే ఉపాసన. మేలుచేయుట మంచిది కనుక మేలు చేయుడు. మఱేమియు కోరకుడు. ఇది ఆ మహాపురుషునిశీలమై యుండవలె. కానిచో, ఆ కట్టుకథ లన్నిటియందును నిస్సంగత్వమనియెడి యొక్కగుణమే తేలదు. కృష్ణుని ధర్మోపదేశము గీతమాత్రమే కాదు......

నాకు తెలిసినంత వఱ కతడు ప్రజ్ఞయందు ఔదార్యమందు కౌశలమందు సమానముగా, అద్భుతముగా పెంపొంది సర్వతోముఖ సమగ్రతగలవాడు. గౌరవార్హమహాపురుషుడుగ నేమి యోధుడుగనున్నప్పుడేమి, సచివుడుగనున్నప్పుడేమి, మఱొక్క దశలోనేమి అతని జీవితములో ప్రతిక్షణమును క్రియావ్యగ్రతతో రక్తిగొలుపుచుండును. అతడు పురుషులలో గొప్ప, పండితులలో

గొప్ప, కవులలో గొప్ప. సర్వతోముఖసమగ్రమును అద్భుతావహమును అగు ఈ క్రియావ్యగ్రతయు ఈఔదార్యప్రజ్ఞామేళనమును భగవద్గీతాది గ్రంథములలో గాననగును. ఔదార్యము మహాద్భుతము. వాణి అత్యంతమనోహరము. దానికి సాటి ఎందును లేదు. అతని ఈ అత్యంతక్రియావ్యగ్రత కలదే, దీని ముద్ర ఇప్పటికిని అం దున్నది. ఐదువేల సంవత్సరములు గడచిపోయినవి. కోట్లకొలది మానవులపై ఆయన ప్రభావము ప్రసరించినది. మీకు తెలిసియుండవచ్చు, తెలియకుండవచ్చు, అఖిలవిశ్వముపై అతని ప్రభావ మెంతగా నున్నదో ఊహించిచూడుడు. అతని మతి నిష్కళంకము. అందుకే అతనియందు నా కాదరము. ఆ బుద్ధిలో సాలెపట్లు లేవు, గ్రుడ్డినమ్మకాలు లేవు, ప్రతిదాని ఉపయోగ మత డెఱుగును. దేనికి తగిన స్థానము దానికి నిర్ణయింపవలసివచ్చినప్పుడు నిర్ణయించున దతడే. వాక్చాతురులు విశ్వసంచారులు వేదరహస్యముల నధిక్షేపించువారు ఉన్నారే, వారికి పరమార్థజ్ఞానము లేదు. లోకవంచకులకంటె వారు మిన్న కారు. గ్రుడ్డినమ్మకాలకు అజ్ఞానమునకుగూడ వేదములలో స్థాన మున్నది. దేని కేది తగిన స్థానమో కనుగొనుటే ఉన్న కిటు కంతయు.

ఇక అతని ఔదార్యమో! ప్రతివర్ణమువారికిని మతములో ప్రవేశము కలుగ వాకిలి తెఱచుటకు అతడే ప్రథముడు. ఆవిషయములో బుద్ధునకు సైతము అతడు మార్గదర్శకుడు. ఎటువంటి అద్భుతప్రజ్ఞ అతనిది! ఎంతటి క్రియావ్యగ్రమైన జీవిత మది! బుద్ధుడు పనిచేసినది ఒక్కరంగములోనే, బోధనారంగ మది. అతడు భార్యాపుత్రుల తనతో నుంచుకొని, ధర్మోపదేష్ట కాలేకపోయెను. కృష్ణుడు రణరంగములో ధర్మోపదేశము చేసెను. "ఎవడు కర్మయం దకర్మను గాంచునో, అకర్మయందు కర్మను జూచునో మనుష్యులలో అతడే బుద్ధిమంతుడు[2] అతడే యోగి, సర్వ

2. భ. గీ. IV-18.

కర్మకర్త" తన చుట్టును బాణములు పర్వుచునే యున్నను, అది అతనికి లెక్కలేదు. నిశ్చల ప్రశాంత చిత్తముతో అతడు 'జీవిత' 'మరణ' సమస్యలను గూర్చి చర్చించుచుబోవును. ప్రవక్తలలో ఒక్కొక్కని ఉపదేశమునకును ఉత్కృష్టవ్యాఖ్యానము అతని జీవితమే. బైబిలు క్రొత్తనిబంధనములోని సిద్ధాంతమును గుఱించి తెలిసికొనవలె నన్నచో మీరు ఫలాన ...ఫలాన వారి దగ్గఱకు పోవుదురు. నాలుగు సువార్తలను మరల మరల చదువుదురు. అట ప్రతిపాదింపబడ్డ గురుదేవుని అద్భుతజీవితమును ముందుంచుకొని ఆ సువార్తల నర్థముచేసికొన ప్రయత్నింపుడు. మహాపురుషులు యోచింతురు. మీరును నేనునుగూడ యోచింతుము. వారి ఆలోచనకు మన ఆలోచనకు భేద మున్నది. మన తలంపులను మన దేహము లనుసరింపవు. మనచేతులకు మనభావాలతో పొత్తు కుదురదు. వేదవాక్యములుగ రూపొందు మాటలకుండు శక్తి మన మాటలకు లేదు......వారు సంకల్పించిన దెల్ల జరిగితీరవలసినదే. వారు, "నే నిది చేయుదును." అన్నచో వారి దేహము దానిని చేసివేయును. సంపూర్ణవిధేయత. ఇదే లక్ష్యము. 'నేను దేవుడ' నని భావించుట కేమో నీ వొక్క నిమిషములో భావింపగలవు, కాని, దేవుడుగా నగుట నీకు సాధ్యము కాదు. ఇదే, ఉన్న చిక్కంతయును. తా మనుకొన్నది తాము వెంటనే కాగలరు వారు. మన మనుకొన్నది మనమును అగుదుము కాని, మెట్టు మెట్టుగ అగుదుము.

కృష్ణునిగుఱించియు, అతనికాలమును గుఱించియు ఇంత వఱకు చెప్పితిని. తరువాతి ఉపన్యాసములో అతనిగ్రంథమును గుఱించిన ఎక్కువ వివరములు తెలియును.



# భగవద్గీత - 2

(శాన్ఫ్రాన్సిస్కోలో, 1900 వ సంవత్సరము మే 28 వ తేదీని చేసిన ఉపన్యాసము)

భగవద్గీతకు ఉపోద్ఘాతముగా కొంత చెప్పుట అవసరము. గీతోపదేశము జరిగిన చోటు కురుక్షేత్ర రణరంగము. అయిదు వేల సంవత్సరములకు పూర్వము భారతసామ్రాజ్యాధిపత్యమునకై ఒక్కవంశమునకే చెందిన రెండుశాఖలవారికి పోరాటముజరిగినది. అందు ధర్మము పాండవులది, బలము కౌరవులది. పాండవు లయిదుగు రన్నదమ్ములు. వా రొక యరణ్యమున వసించుచుండిరి. కృష్ణుడు పాండవులకు మిత్రుడు. పాండవులకు సూదిమొన మోపునంత భూమి నయిన నిచ్చుటకు కౌరవులు ఇష్టపడరైరి.

భగవద్గీత యుద్ధభూమివర్ణనతో ప్రారంభమగును. ఉభయ పక్షములవారు తమ బంధుమిత్రులను చూచుకొన్నారు — అన్న ఒకపక్షము, తమ్ము డింకొకపక్షము; తాత ఒకపక్షము; మనమడు మఱొక పక్షము...శత్రుపక్షములోని తన బంధుమిత్రులను అర్జునుడు చూచి, వారిని తాను సంహరింపవలసియున్నదన్న తలంపు మనస్సులోనికి రాగానే, అతని హృదయము ద్రవించును. తా నిక యుద్ధము చేయనని అర్జునుడు చెప్పును. ఇట్లు ప్రారంభమగును భగవద్గీత.

మనకందఱకు నీలోకమున జీవిత మనగా ఎడతెంపు లేని పోరాటమే......మనదౌర్బల్యమును, పిఱికితనమును క్షమాశీలముగా, వైరాగ్యముగా మనము వ్యాఖ్యానించుకొనుసందర్భములనేకపర్యాయములు వచ్చును. బిచ్చగాని వైరాగ్యమున కేమి విలువ? దెబ్బకొట్టగలవాడు నిగ్రహము చూపినచో అందు విలువ కలదు. ఉన్నవాడు త్యాగముచేసినచో అందు విలువ గలదు. సోమరితనమువలన, పిఱికితనమువలన యుద్ధము విరమించుకొని,

శూరుల మని ఆత్మవంచన చేసికొనుటకు ఎన్నిపర్యాయములు ప్రయత్నింతుమో మన మెఱుగుదుము.

భగవద్గీతకు ప్రారంభము యావదర్థక మగు నీ శ్లోకము: "పార్థా, క్లైబ్యము నొందకు. ఇది నీకు తగదు. ఓపరంతపా, క్షుద్రమైన హృదయదౌర్బల్యమును విడిచి, లెమ్ము"[1] అంతట అర్జునుడు కృష్ణునితో వాదింప ప్రయత్నించును, మహోన్నతనైతికాశయముల నేకరువు పెట్టును, 'ప్రతిఘటించుటకంటె ప్రతిఘటింపకుండుట మేలు' ఇత్యాదిగ నుపన్యసించును. అతడు తన్ను తాను సమర్థించుకొన జూచుచున్నాడే గాని, కృష్ణుని మోసగింప లేడు. కృష్ణుడు పరమాత్మ, భగవంతుడు, కదా. అర్జునుని వాదసారమతనికి వెంటనే తెలిసిపోయినది. ఇక్కడ అర్జునుని వెనుక కీడ్చుచున్నది అతని దౌర్బల్యము. ఎదిరిపక్షమున కననగుచున్నవారు. సొంత బంధువులు. వారిని చంపుట కతనికి చేతు లాడవాయె....

అర్జునుని హృదయములో అతని భావోద్వేగమునకును నిర్వహింపవలసిన విధికిని సంఘర్షణ కలిగినది. మనము పశువులపక్షుల స్థాయికి ఎంత సమీపముగానున్న, భావోద్వేగముల నరకయాతన కంత అగ్గ మగుచుందుము. దానిని ప్రేమ అందుము. అది ఆత్మవంచన. పశువులవలెనే మనము భావావేశమున కధీనులమైయున్నాము. దూడకై ఆవు తన ప్రాణ మర్పింప గలదు. ఆపని ప్రతిజంతువును చేయగలదు. అందు కేమి? పక్షులకు సహజమైన అంధోద్రేకము కాదు, మనలను పరిపూర్ణత్వమునకు చేర్చునది. నిత్యాత్మసాక్షాత్కారమును పొందుట మానవజీవితగమ్యము. అందు భావోద్వేగమునకు స్థానము లేదు. భావపరతకు గాని, ఇంద్రియములకు సంబంధించిన దేనికిగాని అందు స్థానము లేదు. అక్కడ నుండినది కేవలము నిర్మలవివేకజ్యోతియే. ఆ దశలో మానవుడు కేవలము ఆత్మస్వరూపి.

1. భ. గీ. II-3.

అర్జును డిప్పుడు భావావేశవివశుడయి యున్నాడు. అతడు తా నుండవలసినట్లు లేడు—అనగా ఆత్మసంయమముకలిగి, ప్రబోధము నొంది వివేకమనెడి నిత్యజ్యోతిలో ప్రవర్తించు యోగిగా లేడు. అతడు పశువువలె శిశువువలె నైనాడు, అతడు తన బుద్ధిని హృదయోద్వేగపుత్రిప్పులకు లోబఱచినాడు, తెలివితక్కువగ ప్రవర్తించినాడు, తన దౌర్బల్యమును ప్రేమ మున్నగు మెఱుగైన పేళ్లతో కప్పిపుచ్చుకొనుటకు ప్రయత్నించుచున్నాడు. కృష్ణున కిది తెలిసిపోయెను. అర్జునుడు కొంతచదువుకొన్నవానివలె మాటాడును, పెక్కు యుక్తులు చూపును; కాని, అతని భాష తెలివి తక్కువవాని భాషే.

"పండితులు చచ్చినవారికొఱకుగాని, బ్రతికియున్నవారికొఱకుగాని దుఃఖింపరు."[2] కృష్ణు డిట్లు చెప్పెను: "చావు నీకును లేదు, నాకును లేదు. మనము లేనికాల మెన్నడును లేదు. మనము లేనికాల మెన్నటికిని రాదు. దేహికి, ఈదేహమందు కౌమారము నుండి యౌవనమునకును, యౌవనమునుండి వార్ధక్యమునకును మార్పు గల్గునట్లే దేహాంతరములోనికి మాఱుటయు ప్రాప్తించును. అంతమాత్రముచేత ధీరులు మోహమునకు లోబడరు.[3] నిన్ను పూనిన యీ భావావేశ మెక్కడిది? అది యింద్రియములం దున్నది. "విషయేంద్రియసంయోగము శీతోష్ణ సుఖదుఃఖముల గలిగించుచుండును. అవి అనిత్యములు; వచ్చుచు పోవుచు నుండుట వాని స్వభావము."[4] మానవు డీ క్షణమున దుఃఖించును, మఱుక్షణమున సుఖపడును. అట్టి స్థితియందు ఆత్మస్వరూపానుభూతి అతనికి గలుగదు......

"అసత్తైనదానికి సత్త లేదు. సత్తైనదానికి అభావము లేదు......కనుక ఏది ఈ విశ్వమంతటను వ్యాపించి యున్నదో దానికి నాశము లేదని తెలిసికో. అది అవినాశ్యము. అవ్యయమైన

2. II-11, 3. II-12, 13. 4. II-14.

దానికి వినాశ మెవ్వడును కలిగింప లేడు. ఈ దేహములకంత మున్నదే కాని, దేహి నిత్యుడు, అనాశి, అప్రమేయుడు. కావున నో భారతా, లెమ్ము, యుద్ధము చేయుము.''[5]

ఒక్క అడుగు అయినను వెనుకకు వేయరాదని తాత్పర్యము....ఏమైన రానీ, పోరాడి తేల్చుకో. గ్రహతారలు గతులు తప్పినను సరే! లోక మంతయు నేకమై నిన్ను ప్రతిఘటించినను సరే! మరణ మనగా దుస్తులను మార్చుకొనుట వంటిదే. అందు కేమి? కనుక పోరాడుము! పిఱికివాడవైనచో నీకు ఒరిగెడి దేమియు లేదు....ఒక్క అడుగు వెనుకకు వేయుట వలన నీకు ఏ విపత్తును తప్పిపోదు. లోకములో నున్న వేల్పు లందఱతో మొఱపెట్టుకొంటివి కదా! కష్టమునుండి గట్టెక్కితివా? భారతదేశప్రజలు ఆఱుకోట్ల దేవతలను మొఱపెట్టుకొనుచుందురు; చివరకు కుక్కచావు చత్తురు. ఏరీ, ఆ దేవతలు?...మీరు నెగ్గియైన పిమ్మట వేల్పులు తోడ్పడ వత్తురు. కనుక ప్రయోజన మేమి? చివరవఱకు ధైర్యము వీడకు....ఓ ఆత్మా, మూఢవిశ్వాసాలకు మోకరిల్లుట, నీ మనస్సుకు నీ నమ్ముడుపోవుట నీకుతగదు! నీవు అనంతుడవు, అమరుడవు, అభవ్రుడవు. నీ వనంతాత్మవు కనుక బానిసగా నుండుట నీకు తగదు....లెమ్ము! మేల్కొనుము! లేచి యుద్ధము చేయుము! తప్పనిచో, మరణింపుము. నీకు తోడ్పడుట కెవ్వరును లేరు. నీవే ఈసమస్త ప్రపంచమును. ఇక నీకు సాయపడ గల వా రెవ్వరు?

''భూతముల ఆది మన మెఱుగము, నడిదశ మాత్రమే మనకు తెలిసినది, వాని నిధనమును మన మెఱుగము. ఇక నీ విషయమున విలపించు టెందులకు?''[6]

''కొందఱు దానిని (ఆత్మను) ఆశ్చర్యముతో చూతురు. మఱికొందఱు దానినిగూర్చి ఆశ్చర్యపూర్ణ మని మాటాడుదురు.

5. II-16, 18. 6. II-28.

వేఱు కొందఱు అది యద్భుత మని విందురు. ఇంకను కొందఱు దానిని గుఱించి విందురు. కాని, అది వారి కర్థము కాదు.'' 7

నీవు వీరినందఱను చంపుట పాపకార్యమందువేని, ఇది నీకులధర్మ మను దృష్టితో యోచింపుము....''సుఖదుఃఖములను, లాభాలాభములను జయాపజయములను సమములనుగా భావించి, లేచి యుద్ధము సేయుము.''8

ఇది గీతోపదేశములో విశిష్టమగు మఱొక సిద్ధాంతమునకు ఉపక్రమము. 'సంగమును త్యజింపవలె' నను సిద్ధాంతము. కర్మల యందు మనకు సంగ మున్నది. కనుక వానిఫలితము మన మను భవింపక తప్పదు. ఫలసంగములేక అనుష్ఠితమైన స్వధర్మము కర్మబంధమును త్రెంపును.9 ఇందు అభిక్రమనాశము లేదు, ప్రత్యవాయము లేదు. ఇంచుక అనుష్ఠించినను ఇది సంసారమహాభయ మునుండి కాపాడును.10

''వ్యవసాయాత్మికమైన బుద్ధియే నెగ్గ గలది. అర్జునా, రెండువేల విషయములను గుఱించి ఆలోచించెడివారి శక్తి బహు ముఖముగా చెదరిపోవును. కొందఱు పుష్పితవాక్కు పల్కగలరు. వారు, వేదములకు మించి యేమియు లేదని తలంతురు. స్వర్గము నకు పోవలె నని వారి యాశ. వేదముల ప్రభావముద్వారా శుభ ములు పడయ గోరి వారు యజ్ఞములు చేయుదురు.11 అటువంటి వారు ఐహికాశయముల నన్నిటిని విడువకున్న ఆధ్యాత్మికజీవితమం దెంతమాత్రము నెగ్గ లేరు.12

అది మఱొక గొప్ప పాఠము. ఐహికాశయముల నన్నిటిని పరిత్యజింపకున్న ఆధ్యాత్మికత ఎన్నటికిని సిద్ధింపదు...ఇంద్రియ ములలో నే మున్నది? ఇంద్రియానుభూతు లన్నియు భ్రాంతులు. చనిపోయిన తరువాత స్వర్గములోకూడ ప్రాణులు ఇంద్రియముల

7. II-29. 8. II-38. 9. II-39. 10. II-40.
11. II-41-43. 12. II-44.

నిల్పుకో గోరుదురు__రెండు కన్నులు, ఒకముక్కు. మఱికొందఱు తమ కిక్కడ ఉన్నవానికంటె ఎక్కువ యింద్రియములు అక్కడ ప్రాప్తించు నని భావింతురు. ఎల్లకాలము సింహాసనాసీనుడై యుండు దేవుని, దేవునిభౌతికదేహమును చూచుచుండవలె నని వారి ఆశ....అట్టి వారి కోర్కెలు దేహముకొఱకే, అన్నము కొఱకు, పానముకొఱకు, భోగముకొఱకు. అది యీ యైహిక జీవితమునకు పొడిగింపుమాత్రమే. మానవు డీ జీవితమునకు మించి ఏమియు భావింపలేడు. దేహముకొఱకే ఈజీవిత మంతయును. "అట్టి వానికి సమాధియందు వ్యవసాయాత్మికమగు బుద్ధి కుదురదు."[13]

"వేదములు త్రైగుణ్యవిషయములు. సత్త్వరజస్తమోగుణ ప్రభవమగు సంసారస్వరూపమునే తెలియ జేయునవి.[14] ప్రకృతి గత విషయములనే వేదములు బోధించును. పృథివిమీద తాము ప్రత్యక్షముగా చూచియుండని ఏ వస్తువునుగుఱించిగాని జనులు భావింప జాలరు. వారు స్వర్గమునుగుఱించి మాట్లాడుదురన్నచో, సింహాసనముమీద రాజుకూర్చున్నట్లు, ప్రజ లతనికి ధూప మర్పించుచున్నట్లు భావింతురు. అదంతయు ప్రకృతిగతమే. ప్రకృతికి అతీతముగాదు. కనుక వేదములు మనకు దెల్పునది ప్రకృతిని గుఱించియే కాని మఱేమియు కాదు. "నిర్ద్వంద్వుడవు కమ్ము, నిత్యసత్త్వస్థుడవు కమ్ము, నిర్యోగక్షేముడవు గమ్ము, ఆత్మవంతుడవు కమ్ము."[15]

"దేహములమే" మన మనుకొనుచున్నాము. మనము దేహములమే. లేదా, దేహములు గలవారము. నన్ను గిల్లినచో నేనేడ్తును. ఇ దంతయు వెట్టి. ఏల యన నే నాత్మను. ఈ దుఃఖ పరంపర, ఈభావన, ఈపశువులు, దేవతలు, రాక్షసులు, సర్వము, ఈ సమస్తప్రపంచమును దేహాత్మభావమువలననే కలుగుచున్నవి.

13. II-44. 14. II-45. 15. II-51.

నే నాత్మను. మీరు నన్ను గిల్లినప్పుడు నే నేల ఎగిరిపడవలె?...
అందులోని దాస్యమును గుర్తింపుడు ? ఇది మీకు లజ్జాకరముగా
లేదా ? పైగా, మనము పారమార్థికపరులము! తత్త్వవేత్తలము
మనము వివేకులము! భగవానుడు మనల నాశీర్వదించును గాక!!
మన మెవరము? సజీవనరకములము! అంతే. పిచ్చివారము, అంతే.

దేహభావమును మనము విడనాడ లేము. భూలోక
బంధమున నున్నాము....మన భావాలు వల్లకాళ్లు. మన మీ
దేహమును విడిచిపెట్టునప్పుడు, దానికి సంబంధించిన భావాంశము
లొక వేయి మనలను బంధించియుండును.

సంగములేక, పనిచేయగలవా రెవ్వరు ? అది అసలు
సమస్య. నిస్సంగముగా కర్మ చేయగలవానికి అతని పని సఫల
మయినను, విఫలమయిన నొక్కటే. ఆతడు యావజ్జీవము చేసిన
కృషియంతయు క్షణములో బుగ్గియై పోయినను అతని గుండెలో
తటతట ఉండనే యుండదు. "బుద్ధియుక్తులగు మనీషులు కర్మజ
మగు ఫలమును త్యజించి, జన్మబంధవినిర్ముక్తులై, అనామయ
పదమును అధిగమింతురు."[16]. అప్పు డత డీ సంగ మంతయు
భ్రాంతిజన్యమని గుర్తించును. ఆత్మకు సంగ మెన్నడును పొస
గదు...అప్పు డతడు. శ్రుతము నెడను శ్రోతవ్యము నెడను నిర్వే
దము నొందును. గ్రంథములును వేదములును మనస్సును భ్రమలో
తగుల్కొల్పి సుడిగుండములోనికి ఈడ్చునేని ఇక ఆ ప్రమాణ
గ్రంథము లెందులకు? ఒకటి ఒకవిధముగా చెప్పును. మఱొకటి
మఱొకవిధముగా చెప్పును. ఏ గ్రంథమును మన్నింతురు ? నీ
మట్టుకు నీ వుండు ! నీయాత్మవైభవమును చూచుకో. కర్మ చేయక
నీకు తప్పదని తెలిసికో. అప్పుడు నీబుద్ధి సమాధియందు అచలమై
నిల్చును.[17]

అర్జును డిటు ప్రశ్నించును : "స్థితప్రజ్ఞు డెట్టివాడు?"[18]

16. II-52. 17. II-53. 18. II-54.

కృష్ణు డిట్లు సమాధానము చెప్పెను: "మనోగతములైన సర్వకామములను విడిచినప్పుడు [ఎట్టి కోర్కెయు లేకుండపోయి నప్పుడు, ఈజీవితమునందుగాని ముక్తియందుగాని వేల్పులందు గాని కర్మమందుగాని దేనియందుకాని కోర్కె లేకుండ పోయి నప్పుడు] ఆత్మచే ఆత్మయందు తుష్టినొందినప్పుడు మానవుడు స్థిత ప్రజ్ఞు డనబడుచున్నాడు."[19] అతడు తన ఆత్మవైభవమును దర్శించినవాడు; విశ్వమును, దేవతలును, స్వర్గమును....తన ఆత్మ యందే ఉండగాంచినవాడు. అప్పుడు దేవతలు దేవతలు కాక పోవుదురు; మృత్యువు మృత్యువుకాక పోవును; జీవితము జీవితము కాక పోవును. ప్రతిదియు మాఱిపోయినది. దుఃఖములం దను ద్విగ్నమనస్కుడును సుఖములందు విగతస్పృహుడును వీతరాగ భయక్రోధుడు నగు ముని, స్థితప్రజ్ఞు డనబడును...."[20]

"తాబేలు తనకాళ్లను లోపలికి ముడుచుకొని, దెబ్బ కొట్టినప్పటికి నొక్కకాలునైన ఎట్లు వెలి కిడ కుండునో, అటులనే స్థితప్రజ్ఞుడు తన యింద్రియములను ఇంద్రియార్థములనుండి మర ల్చుకో గలడు."[21] అతని యింద్రియముల నింద్రియార్థముల వంకకు పాఱునట్లు బలాత్కరింప గల దేదియు లేదు. ఏ ఆకర్షణ గాని ఏది కాని అతనిని కదల్ప లేదు. చుట్టునున్న విశ్వమే కూలి పోనీ, అతని మనస్సు తొణకదు.

ఇక్కడ ఒక ముఖ్యప్రశ్న లేచును: ఒక్కొక్కసమయ ములో కొందఱు కొన్ని దినాలు పస్తుందురు....ఎంతటి నీచు డయినను ఇరువదిరోజులు పస్తున్నచో చాల మెత్తపడును. పస్తుం డుట శరీరమును హింసించుకొనుట ప్రపంచములో అన్నిప్రాంత ములవారి వాడుకలోను ఉండినవే. కాని, ఇ వన్నియు నిరర్థకము లని కృష్ణుని మతము. తన్నుతాను హింసించుకొన్నవాని యింద్రి యములు తాత్కాలికముగా ఉపశమింపవచ్చును గాని తరువాత

19. II-55. 20. II-56. 21. II-58.

ఇరువదంతల బలముతో నవి మరల విజృంభించునని కృష్ణుడు చెప్పెను.... మఱి నీవు చేయవలసిన దేమి? స్వభావానుగుణముగ నడచుకోవలెనని యభిప్రాయము, శరీరహింస కూడదు. కర్మ చేయుచునే ఉండు. నీకు సంగము మాత్ర ముండకుండ చూచుకో. నిస్సంగతను నేర్వని పాటింపని వాడు స్థితప్రజ్ఞుడు కాలేదు.

నేను బయటికిపోయి చూచినప్పుడు, ఎదురుగా నే దయిన నున్నచో నా కంటబడి తీఱును. తప్పదు. మనస్సు ఇంద్రియముల వెంట పరుగిడును. ఇక ప్రకృతికి ప్రతిక్రియ చూపుటను ఇంద్రియములు మానుకొనవలె.

"సర్వభూతములకును ఏది నిశయో అప్పుడు సంయమి మేల్కొనియుండును. అది అతనికి పగలు....ఎందు సర్వభూతములు మేలుకొనియుండునో అది పారమార్థికదృష్టిగల మునికి నిశ."[22] లోకము మేల్కొనియుండున దెందులో? ఇంద్రియ జగమున. తిండి కావలె నని, త్రాగుడు కా వలె నని, బిడ్డలు కావలె నని లోకులు కోరుచుందురు. తుదకు వారు కుక్కచావు చత్తురు....ఇంద్రియవిషయాలలో వారికి సదా మెలకువయే.... మనముగూడ వారి కందుకే. వారు దేవు నొకనిని కల్పించుకొనుటయు తమకు కామినులను కాంచనమును సంతతిని ఇంకను హెచ్చుగ నిచ్చుచు తోడ్పడుటకే. తాము ఎక్కువ దివ్యులుగా నగునట్లు తమకు తోడ్పడు దేవుడు వారి కెప్పుడును అక్కఱ లేదు. "ఏవిషయములో ప్రపంచమంతయు మేల్కొని యున్నదో ఆవిషయములో యోగి నిద్రించుచుండును. ఏవిషయములో మూఢులు నిద్రయందుందురో, అక్కడ సంయమి మేల్కొనియుండును."[22] తాను పక్షి ననియో, పశువు ననియో, దేహము ననియో కాక —తాను నాశమెఱుగని, అమృతమగు అనంతాత్మ నని గుర్తించు

22. II-69.

జ్యోతిర్మయజగమున సంయమి మేల్కొనియుండును. ఎక్కడ మూఢులు నిద్రలో నుందురో, అర్థము చేసికొనుటకు వారికి ఎక్కువ వ్యవధి గాని, తెలివి గాని, శక్తి గాని లేదో అక్కడ సంయమి జాగరూకుడయి యుండును. అది వానికి పగటివేళ.

"లోకములోని నదు లన్నియు తమనీళ్లను నిరంతరము సముద్రములో కలుపుచున్నను సముద్రగాంభీర్యము, కొంచెమయి నను చలింపక, మార్పుచెందక ఉండునట్లే, ఇంద్రియములు ప్రకృతి నుండి అనుభవములను నిరంతరము గొనివచ్చుచున్నను, సాగర గంభీరమగు యోగి హృదయ మించుకయినను చలింపదు. భయ పడదు."[23] కష్టములు లక్షలకొలది నదులుగా ముంచుకొని రానీ! సుఖములు వందలకొలదిగ రానీ! నేను అటు దుఃఖమున కును బానిసను కాను! ఇటు సుఖమునకును బానిసను కాను!

23. II-70.

# భగవద్గీత - 3

(శాన్ఫ్రాన్సిస్కోలో, 1900 సంవత్సరము మే 29-వ తేదీని చేసిన ఉపన్యాసము)

అర్జును డిట్లు ప్రశ్నించును: "కర్మచేయు మని నాకు హితము చెప్పితివి. మఱి బ్రహ్మజ్ఞానముకలిమియే పరమోత్కృష్ట జీవితమని పల్కుచున్నావు. కృష్ణా, కర్మకంటె జ్ఞానమే ఉత్కృష్ట మని నీ యభిప్రాయ మగుచో కర్మ చేయు మని నా కేల విధించితివి?"[1]

దానికి కృష్ణుడు చెప్పిన సమాధాన మిది: "అనాది కాలమునుండి యీ రెండు విధానములును మనకు వచ్చుచున్నవి. సాంఖ్యులకు జ్ఞానయోగము, యోగులకు కర్మయోగము. కాని, కర్మను చేయకున్నంతమాత్రమున పురుషునకు నైష్కర్మ్యము సిద్ధింపదు. ఈ జీవితములో నెవరును క్షణమయినను కర్మను చేయకుండ లేరు. ప్రకృతిగుణవశుడై ప్రతివాడును కర్మచేయు చుండును. కర్మచేయుట మానుకొనియు కర్మనే సదా స్మరించు చుండువాడు దేనినిగాని సాధించుకోలేడు. పైగా, అతడు మిథ్యాచారు డగును. 'ఎవడు మనసుచేత ఇంద్రియములను అదుపులో ఉంచుకొని సంగరహితుడై కర్మేంద్రియములచే కర్మయోగమును అనుష్ఠించునో వాడు విశిష్టుడు. కనుక నీవు నియతమైన కర్మ నొనర్పుము'...[2]

"నీకు కర్తవ్యము లే దని, నీవు ముక్తుడవే అని — రహస్యము నీకు తెలిసియున్నను లోకసంగ్రహామునకై నీవు కర్మ చేయవలసిన దే. శ్రేష్ఠుడు ఏ దేది ఆచరించునో ఇతరజనులును దానినే ఆచరింతురు.[3] చిత్తశాంతియు ముక్తియు గల యుత్తముడు

1. భ. గీ. III-1. 2. III-2-8. 3. III-20-21.

కర్మాచరణమును మానుకొన్నచో ఆ జ్ఞానమును ఆ శాంతియు లేని ఇతరు లందఱునుగూడ అతనినే అనుకరింతురు. అంతట సంకర మేర్పడును.[4]

'అర్జునా, చూడు. ముల్లోకములందును నేను పొందని దియు పొందవలసియుండునదియు ఏదియు లేదు, అయినను కర్మ యందే ప్రవర్తిల్లుచున్నాను క్షణమైనను నేను కర్మల చేయ కుండినచో ఈ లోకులు నశింతురు.[5] అవిద్వాంసులు సంగసహి తులై ఎట్లు కర్మలను చేయుదురో, అట్లు విద్వాంసుడు సంగరహి తుడై (లోకసంగ్రహముపై దృష్టిగలిగి) కర్మలను చేయ వలెను.''[6]

నీవు జ్ఞానివే అయినను, అజ్ఞుల శిశూచితామాయికవిశ్వా సమును చెదరగొట్టకు. అంతే కాదు. నీవు వారి స్థాయికి దిగి వారిని మెట్టుమెట్టుగా పైకి తెమ్ము.[7] ఇది అత్యమోఘమైన ఆశయము. ఇదే భారతదేశమునకు లక్ష్యముగ నైనది. ఇందు చేతనే గొప్పగొప్పతత్త్వజ్ఞులు సైతము దేవాలయములకు పోయి, విగ్రహములను పూజించుచుందురు. అది మిథ్యాచారము కాదు.

అనంతరము కృష్ణు డిట్లు చెప్పెను: ''అన్యదేవతాభక్తులై శ్రద్ధాన్వితులై ఆరాధించువారు నిజమునకు నన్నే (అవిధిపూర్వక ముగ) పూజించుచున్నారు.''[8] మానవుని పూజలందుకొనువాడు భగవదవతారమూర్తియే. దేవుని తప్పుపేరుతో సంబోధించినచో అత డాగ్రహించునా? అగుచో, అతడు దేవుడే కాడు! మానవుడు తనహృదయపీఠిపై దేని నధిష్ఠింపజేసికొనునో అదియే దైవము అను విషయము మీరు గ్రహింపలేరా? — అతడు రాయిని పూజించినను సరే. దానివలన తప్పేమి!

4. III-22-24. 5. III-22-24. 6. III-25. 7. III-26-29. 8. IX-23.

మతము సిద్ధాంతములలో నున్న దనియెడి భ్రమను దులిపి వేసికొన్నచో, మన కీ విషయము మఱింత స్పష్టమగును. ఆదాము ఆపిల్ పండు తినుటవలన ఈ లోకమంతయు పుట్టువొందిన దనియు ఇందుండి తప్పించుకొను దారి లే దనియు ఒకమతాశయము. జీసస్ క్రైస్తును నమ్ముము. ఒకానొక మానవుని మరణమును నమ్ముము! భారతదేశీయుల అభిప్రాయము దీనికంటె పూర్తిగా భిన్నమైనది. అక్కడివారికి, మత మనగా సాక్షాత్కారమే, మఱేమియు కాదు. ఒకడు నాలుగు గుఱ్ఱాల బండిమీద వెళ్ల వచ్చు, ఒకడు విద్యుచ్ఛకటములో పోవచ్చు, ఒకడు వీధిమీద దొర్లుచు పోవచ్చు. గమ్య మేమో అందఱి కొక్కటే. భయంకరుడగు దేవుని ఆగ్రహమునకు గుఱికాకుండ తప్పించుకొనుటెట్లనుట క్రైస్తవుల సమస్య. కోల్పోయిన ఆత్మత్వమును మరల పొందు టెట్లు, పారమార్థికస్వరూపమును బడయు టెట్లు అనుట భారతీయుల సమస్య. .........

మీరు ఆత్మస్వరూపు లని తెలిసికొంటిరా? 'నేను పని చేయుదును' అని నీ వనునప్పుడు 'నే' నను మాట కర్థ మేమి? దేహ మనియెడి ఈ మాంసపు ముద్దయా? లేక అనంతము, నిత్యానందము, స్వప్రకాశము, అమరమునగు 'ఆత్మ'యా? నీవు తత్త్వవేత్తలలో కొమ్ములుతిరిగినవాడవు కా వచ్చు. కాని, 'దేహమే నే' ననియెడి ఆశయము నీ కున్నంతవఱకు నీ కాలిక్రింద ప్రాకెడి పురుగునకంటె నీవించు కేని మేలైనవాడవు కావు. నీకు మన్నన లేనే లేదు. దర్శనము లన్నిటిని క్షుణ్ణముగా చదువుకొనియు దేహాత్మభావము కలిగియుండుట మఱింత హేయము. దేహదేవులు మీరు అంతే కదా! అదియా పారమార్థికపరత?

ఆత్మను ఆత్మగా సాక్షాత్కారము చేసికొనుటే మతము. మన మిప్పుడు చేయుచున్న దేమి? సరిగా ఇందుకు విరుద్ధమయినది; ఆత్మను భౌతికతత్త్వమే అనుకొనుట. అమృతస్వరూపుడగు

భగవంతునినుండి మనము మృత్యువును, భౌతికద్రవ్యమును తయారుచేయుదుము; నిర్జీవజడతత్త్వమునుండి మన మాత్మను తయారుచేయుదుము. ... ...

తలక్రిందుగా నిలబడుటవలన, లేదా, ఒంటికాలిమీద నిలబడుటవలన, మూడేసి తలలు గలిగిన అయిదువేల దేవతలను పూజించుటవలన మీకు బ్రహ్మసాక్షాత్కారము కలుగునేని, తప్పక ఆలాగు చేయవలసినదే! ... వీలయిన విధముగా చేయుడు! ఏ మనుటకును ఎవరికిని అధికారము లేదు. కనుక నీ పద్ధతి మేలైనదయినను, ఉదాత్తతరమైనను, ఇతరుల పద్ధతి యెంత చెడ్డదని నీకు తోచినను, అది తప్పు అని చెప్పవలసిన పని నీకు లేదని కృష్ణుడు వచించును.

మతము అనున దొకపరిణతి గాని, వెఱ్ఱి మొఱ్ఱి మాటల ప్రోవు కా దనుటను గుర్తింప వలె. రెండువేలసంవత్సరములకు పూర్వ మొకానొక మనుష్యుడు దేవుని చూచెను. దేవుని మోసెసు మండుచున్న పొదలో దర్శించెను. దేవుని దర్శనము కలిగినప్పుడు మోసెసు చేసిన పని మిమ్ము రక్షించునా? ఏ మానవుని సాక్షాత్కారముకాని నీ కుపయోగపడదు; అట్టి యనుభూతిని ఆ విధముగా పొందవలె నన్న కాంక్షను, ఆత్రమును నీకు కలిగించిన కలిగింపవచ్చును కాక. అదియే పూర్వుల జీవితోదాహరణముల విలువ. అంతకు మించిన విలువ లేదు. వారు కేవలము త్రోవదెలుపు స్తంభాలవంటివారు. ఒకరు భుజించిన మఱొకరికి కడుపు నిండదు. ఒకరి భగవత్సాక్షాత్కారము మఱొకరికి మోక్ష మీయజాలదు. దేవుని నీవే చూడ వలె. భగవంతు డెట్లుండును? అతనికి దేహ మొక్కటి, తలలు మూడు గలవా? ఆఱు దేహములు, అయిదు తలలు గలవా?— అని జనులు కలహించుచుందురు. మీరు దేవుని దర్శించితిరా? లేదు. ... తాము ఎన్నటికైన దర్శింపగలమన్న నమ్మకము

వారికి లేదు. మానవులమగు మన మెంత మూఢులము! నిశ్చయముగా పిచ్చివారము!

భారతదేశములో నేర్పడిన సంప్రదాయముప్రకారము దేవుడనువాడు ఉన్నచో, అతడు నీకును దేవుడే, నాకును దేవుడే. సూర్యు డెవరికి సొంతము! చందమామ అందఱకును మామ అని మీ రందురు. దేవు డున్నచో మీ రతనిని తప్పక చూడగలిగి యుండవలె. లేనిచో, ఆ దేవుడు మన కక్కఱలేదు.

ప్రతివాడును తనపద్ధతియే శ్రేష్ఠమని యనుకొనును. చాల మంచిదే! కాని, ఒక్కవిషయము గుర్తుంచుకొండి. అది మీకు శ్రేష్ఠమే కావచ్చు. ఒకరికి మిక్కిలి అజీర్ణము చేసెడి ఆహారము మఱొకరికి చాల సులభముగా జీర్ణమగునది కావచ్చును. మీకు మంచిదయినంతమాత్రమున మీ పద్ధతియే అందఱికిని పద్ధతియని, 'జాక్'కు సరిపోవు కోటు జానుకును మేరీకినికూడ సరిపోవునని యనాలోచితముగా తీర్మానముచేయకుడు. చదువు, సంస్కారము, ఆలోచన లేని స్త్రీపురుషు లందఱు అట్టి తీర్మానాలవారే (ఒక్కచొక్కానే అందఱు సరిపుచ్చుకొనజూచువారు). మీరు సొంతముగ ఆలోచింపుడు. నాస్తికులు కండు! భౌతికవాదులు కండు! అది యింతకంటె మేలు. మీ బుద్ధిని వినియోగింపుడు! ఒకనిపద్ధతి తప్పు అనుటకు మీ కేమి హక్కు గలదు? మీ కది సరిపడక పోవచ్చు. అనగా, మీ రా పద్ధతిని అనుసరించినచో, మీరు పతనము చెందిన చెందుదురుగాక; అంతమాత్రముచేత అతడుకూడ పతనముచెందు నని యర్థము గాదు. అందుచేతనే కృష్ణు డిట్లు చెప్పెను: మీరు జ్ఞానులయి, ఒకదుర్బలుడు మీకంట బడునేని అతనిని నిరసింపకుడు. మీకు చేతనయినచో వానిస్థాయికి దిగి తోడ్పడుడు. అతడు పెంపొందవలె. నే నయిదుగంటలలో నయిదుబిందెల జ్ఞానము నతని తల కెక్కింప గలను. అ దేమి మేలు సేయును? ఇంతకు ముందున్నస్థితికంటె మఱింత అధస్స్థితికి దిగిపోగలడు.

ఈ కర్మబంధ మంతయు ఎట్లు వచ్చుచున్నది? మన మాత్మను కర్మతో బంధింతుము గనుక. భారతీయుల శాస్త్రము ప్రకారము ఉన్న తత్త్వములు రెండు: ఒకప్రక్క ప్రకృతి; మఱొకప్రక్క ఆత్మ. ప్రకృతి యనగా ఈ సకలబాహ్యప్రపంచముమాత్రమే కాదు; మన దేహములు, మనస్సులు, సంకల్పములు, "నేను" అని అనుకొనుదానితోసహా అంతయు ప్రకృతే. వానికి అన్నిటికి అతీతముగా అనంతమైన ఆత్మజీవనము, ఆత్మ జ్యోతియు గలవు. ...... ఈ తత్త్వవాదముప్రకారము ఆత్మ ప్రకృతికి పూర్తిగా వేఱు. ఇప్పుడును ఇంతకు మునుపును ఇక మీదనుకూడ అది ప్రకృతికి భిన్నమే. ఆత్మ, మనస్సుతోనైనను అభిన్నమని చెప్పగల సమయ మింతవఱ కెప్పుడును లేనే లేదు....

మీరు భుజించెడి యాహారమునుండియే మీ మనస్సులు సదా రూపొందుచున్న సంగతి స్వతస్స్పష్టము. మనస్సు భౌతిక పదార్థమే. ఆత్మ ఆహారముతోడి సకలసంబంధముల కతీతము. మీరు తిన్నను, తినకపోయినను ఆత్మ కొక్కటే. మీరు యోచించినను, యోచింపకపోయినను ఆత్మ కొక్కటే. అది యనంతజ్యోతి. దానిజ్యోతి సర్వదా ఏకరూపమే. దీపమునకు ముందు నీలపు అద్దమునో, ఆకుపచ్చ అద్దమునో ఉంచినచో దానికి దీపమునకు నేమి సంబంధము? వెలుగురంగు మార్పు చెందునది కాదు. అటులనే మార్పులు చెందునది, వివిధవర్ణముల గూర్చునది మనస్సు. ఆత్మ దేహమును త్యజించినప్పు డీ సర్వము తుత్తునియ లగును.

ప్రకృతియం దున్న పరమార్థము ఆత్మయే. మన దేహములు, మనస్సులు మున్నగువానిగుండ కదలునదియు మాటాడునదియు సర్వమును చేయునదియు పరమార్థమే, ఆత్మజ్యోతియే. ఆత్మమీద ఆత్మశక్తిమీద ఆత్మప్రాణముమీద ప్రకృతి ప్రభావము వివిధరీతుల ప్రసరించుచుండును. మన తలంపుల కన్నిటికిని, మన

శరీరచర్యల కన్నిటికిని, సమస్తమునకును కారణము ఆత్మయే, అన్నిటికిని వెలుగు నిచ్చునది ఆత్మయే కాని, పాపపుణ్యములు, సుఖదుఃఖములు, శీతోష్ణములు మున్నగా ప్రకృతిలోగల ద్వంద్వము లేవియు ఆత్మ కంటవు.

"కనుక, అర్జునా, ఈ కర్మ లన్నియు ప్రకృతిలో జరిగిపోవు చుండును. ప్రకృతియే... మన మనస్సులలోను, దేహములలోను తన విధులను నిర్వహించుకొనుచుండును. "మనమే ప్రకృతి" యనుకొని "నే నిది చేయుచున్నాను" అని యనుచుందుము. ఈ విధముగా మనము భ్రాంతిలో పడుదుము."[9]

మనము సదా ఒక ఒత్తిడికి గురి అయి పనిచేయుదుము. ఆకలి బాధించినప్పుడు నేను భుజింతును. బాధ ననుభవించుట బానిసతనముకంటె మఱింత దుస్సహము. యథార్థమగు "నేను" సదా ముక్తుడనే. ముక్తాత్మను నిర్బంధించి, దానిచేత పనిచేయింప గలిగినది ఏది? బాధకు గురియగునది ప్రకృతిలో గలదు. మనము దేహములమే అని అనుకొన్నప్పుడే, "నేను బాధపడుచున్నాను; నేను ఫలానా......" అను అర్థరహితప్రసంగము చేయుదుము. సత్యము తెలిసికొన్నవాడు తాను తటస్థుడుగ నుండును. తన దేహ మేమి చేసినను, తన మన స్సేమి చేసినను అతడు లక్ష్య పెట్టడు. జనులలో అత్యధికసంఖ్యాకు లీ భ్రాంతికి లోనై యున్న వారే అనుటను జ్ఞప్తియుంచుకొండి. వారెప్పుడే మంచి పని చేసినను తామే కర్తల మని భావింతురు. అంతకంటె ఉన్నత తత్త్వమును తెలిసికొను సామర్థ్యము వారి కింకను లేదు. వారి నమ్మకమును చెఱుప వలదు! వారు చెడుగును వర్జించి, మంచి చేయుచున్నారు. గొప్ప ఆశయమే! అది వారి కుండనిండు! ... వారు లోకశ్రేయస్సుకై పాటుపడువారు. లోకహితము చేయుట

9. III-27.

MEMORIAL LIBR
Acc No .. 315
Date

కంటె పైదైన గొప్పతనముకూడ కల దనుట క్రమక్రమముగా వారి మనసుకు వచ్చును. వారు చూచుచున్న చాలును, పనులు జరిగిపోవుచుండును. ... క్రమముగా వా రర్థముచేసికొనుదురు. సకల పాపమును వర్జించి, సకల పుణ్యమును చేసినప్పుడు సకల ప్రకృతికి తాము అతీతుల మను విషయమును వారు గ్రహింప నారంభింతురు. వారు కర్తలు కారు. వారు తటస్థులు. వారు ... సాక్షులు. చూచుచుందురు. ప్రకృతినుండియే సకలవిశ్వము జనించుచున్నది. ... వారు ఆ విషయమున విముఖులుగ నుందురు. "సౌమ్యుడా, మొదట ఉండినది ఒక్క సత్తే. మరేమియు లేకుండెను. అది సంకల్పముచేయగా తక్కిన దెల్ల సృజింపబడెను."[10]

"జ్ఞానవంతుడుసైతము తన ప్రకృతికి సదృశముగనే ప్రవర్తించును. ప్రతిప్రాణియు తన ప్రకృతి కనుగుణముగా ప్రవర్తించును. దాని నత డతిక్రమింప లేడు."

అణువు నియతిని ఉల్లంఘింప జాలదు. అది భౌతికాణువు కానీ, మానసికాణువు కానీ, నియతికి లోబడి తీరవలసినదే. "నిగ్రహ మేమి చేయ గలదు?"[11]

జీవితములో దేనికిగాని ఏది విలువ? సుఖము కాదు, సంపదలు కావు. ప్రతివిషయమును విభజించి చూడు. మన కొక పాఠము నేర్పు అనుభవముదక్క మఱొక విలువ కనిపింపదు. అనేకసందర్భములలో సుఖములకంటె కష్టములే మనకు మేలైన అనుభవము కలిగించును. అనేకపర్యాయములు ప్రకృతివలన గలుగు లాలనకంటె ప్రకృతివలన గల్గు తాడనలే మనకు మేలగు అనుభవములు కలిగించును. ... కాటకమునకు సైతము దాని స్థానము, ప్రయోజనము గలవు....

10. ఛాందోగ్యోపనిషత్తు - VI-ii-2-3.

11. III-33.

కృష్ణుని మత మిది — మన మిప్పుడే పుట్టిన క్రొత్త ప్రాణులము కాము. మన మనస్సులు క్రొత్త మనస్సులు కావు. ... ప్రతిశిశువును తనతో గతము నెల్ల — మానవతతికి చెందిన గతమును మాత్రమే కాదు, వృక్షజాతికి చెందిన గతమును సైతము — తెచ్చుకొను నని ఆధునికయుగమున మన మందఱ మెఱుగుదుము. వెనుకటి ప్రకరణము లన్నియు నున్నవి. ప్రస్తుత ప్రకరణ మున్నది. భవిష్యత్ప్రకరణాల మొత్తము పూర్తిగా అతనికి ముం దున్నది. ప్రతి జీవునకును అతని దారి పన్నాగింప బడియున్నది, దాని పటము గీయబడియున్నది, దాని రమారమి రూపము చిత్రితమై యున్నది. అంధకారమింతగానున్నను, ఏది కాని, ఏ సంభవము కాని, ఏ సందర్భము కాని కారణము లేక ఉండుట పొసగదు. ఉండు ననుకొనుట మన అజ్ఞానము. ప్రకృతి నుండి ఆరంభమై ఒకదాని కొకటిగ తగుల్కొన్న కొక్కెములు గలదై, కార్యకారణము లనెడి యీ గొలుసు అంతులేనిదై సాగు చున్నది. ఈ సర్వజగత్తు ఆ విధ మగు గొలుసుచే బంధింపబడి యున్నది. అది విశ్వవ్యాప్తమగు 'కార్యకారణాల' గొలుసు. అం దొక కొక్కి ఒకభాగము నీవంతు, మ ఱొకటి నావంతు. మన సొంత ప్రకృతియే మన భాగము.

శ్రీకృష్ణుని సూక్తి:—పరధర్మమున చొచ్చుటకంటె స్వధర్మమున చచ్చుట మేలు.[12] ఈ క్రిందిది నా దారి. నే నిం దున్నాను; మీరు ఎత్తైన దారిలో ఉన్నారు. నా దారిని వదలు కొందమను బుద్ధి నాకు సదా కల్గుచుండును, మీ దారికి వత్త మని, అచట మీతో నుంద మని నా తలంపు. పై కెక్కుదు నేని నే నిందును ఉండను, అందును ఉండను. ఈ సిద్ధాంతమును మనము ఒప్పరికింపరాదు మెట్టుమెట్టుగ నొందవలసిన పెంపు అది. వేచియుండుము, అభివృద్ధిపొందుము; అంతట నీకు సర్వ

12. III-35.

మును సిద్ధించును. అట్లు కాదేని, ఆధ్యాత్మికముగా పెద్దముప్పు వాటిల్లును. మతమును బోధించుటలో గల మూల మర్మ మిం దున్నది.

"ప్రజలను రక్షించుట" అను మాటకు మీ యర్థ మేమి? అందఱును ఒక్క-సిద్ధాంతమందే నమ్మకముగలవారుగ నుండ వలె ననుటలో మీ భావ మేమి? అది పొసగదు. మానవకోటికి సామాన్యముగా బోధింప తగు ఆశయములు గలవు. మీ ప్రకృతిని మీకు గాను కనుగొనగల శక్తి నిజమగు గురువునకే ఉండును. మీ ప్రకృతిని మీ రెఱుగకుండవచ్చు. మీ ప్రకృతి యని మీ రనుకొనునది పూర్తిగా భ్రాంతి కావచ్చు. మీ యెఱుక కందు నంతగ మీ ప్రకృతి వృద్ధిపొందియుండకపోవచ్చు. దీనిని కను గొనవలసినవాడు గురువే. ... ఒక్క-సారి మీ ముఖమును చూడ గానే మీ ప్రకృతిని తెలిసికొని మీ గురువు మిమ్ము మీకు తగిన దారిలో పెట్టవలె. ఆ జీవితవాహినిలో బడి దానిచేత గమ్యము చేర్పబడు వఱకు మనము దేవులాడవలె, ఇక్క-డ అక్క-డ ప్రయాసపడవలె, ఏమేమో చేయవలె, చేసియు పురోగతి ఉండదు. ఆ జీవితవాహినిలో పడితిమేని వెంటనే తేలుదుము. అదే గుఱుతు. ఇక ఎట్టి శ్రమయు ఉండదు. దానిని కనుగొన వలె. కనుగొన్న తర్వాత దానిని వీడి మఱొకదానిని అవలం బించుటకంటె, అందే యుండి చచ్చినను మేలే.

ఇట్లు చేయక, మన మొక మతమును స్థాపింతుము. ఒక సూత్రావళిని నిర్మింతుము. అందఱి ప్రకృతి సరిగా నొక్క-టే అను తలంపుతో మానవకోటి గమ్యమునే తప్పింతుము. ఏ యిరువురి మనస్సులు గాని, దేహములు గాని ఒక్క-టే కావు. ... ఏ యిరువురి మతము నొకటి కాదు. ...

మీరు మతపరులుగ నుండ గోరినచో వ్యవస్థాపితములైన మతములలో దేనియందును ప్రవేశింపకుడు. అవి మేలుకంటె

శతాధికముగా కీడు చేయును. ఏల యన అవి ప్రతివ్యక్తి ప్రత్యేక వికాసమును నిరోధించును. అన్నిటిని తెలిసికొనుడు. కాని, మీ స్థానమున నిశ్చలులై ఉండుడు. మీరు నా సలహా వినెడి పక్షమున, బోనులో మెడ దూర్పకుడు. ఏ క్షణమున వారు ఉచ్చు తగిలింప ప్రయత్నింతురో, ఆ క్షణముననే అందు తగుల్కొననీక మీ మెడను తప్పించుకొని, బయటి కెక్కడకయినను పొండి. పెక్కు కుసుమములలోనుండి మధువు నాస్వాదించెడి మధుప మెట్లు ఏ పువ్వులోను తగుల్కొనక స్వేచ్ఛగా నున్నదో— ... ఆ విధముగానే మీరు వ్యవస్థాపితమగు నే మతమునందును ప్రవేశింపకుడు. మత మనునది మీకును మీ దేవునికిని నడిమి విషయము. మీ యిరువురి మధ్య మూడవవ్యక్తి యెవరును రాకూడదు. వ్యవస్థాపితములైన యీ మతము లేమి చేసినవో చూడుడు! ఈ మతాంతరుల హింస కంటె ఏ నెపోలియను ఎక్కువ భయంకరుడు? ... మీరును, నేనును వ్యవస్థలు చేయుదుమేని, ప్రతి మానవుని ద్వేషింప నారంభింతుము. ప్రేమించుట అనగా పరులను ద్వేషించుటయే యైనచో ప్రేమింపకుండుటే మేలు. అది ప్రేమయే కాదు. అది నరకము! మీ వారిని ప్రేమించుకొనుట అనగా తక్కినవారి నందఱను ద్వేషించుటయే యగుచో అది స్వార్థపరత్వమునకు, మృగత్వమునకు నిగ్గు. మిమ్ము మృగప్రాయులనుగ చేయుటే దాని ఫలితము. కావున పరధర్మ మెంత గొప్పదిగ నీకు కనిపించినను, దాని ననుసరించుటకంటె, స్వధర్మముననే నిధన మొందినను మేలే.[13]

"అర్జునా, కామక్రోధములు మహాశత్రువులు! వానిని అణచుకోవలె. జ్ఞానుల జ్ఞానముసయినను నివి కప్పివేయును. కామాగ్నిని చల్లార్చుట అశక్యము. దానికి స్థానములు ఇంద్రియములును మనస్సును. ఆత్మ దేనినిగాని కాంక్షింపదు.[14]

13. III-35. 14. III-37-40.

"నేనీ యోగమును పూర్వము వివస్వంతునకు బోధించితిని. వివస్వంతుడు మనువుకు చెప్పెను. ... ఈ విధముగా ఈ విద్య ఒకరాజునుండి మఱొకరాజునకు సంక్రమించినది. కాలక్రమమున నీ గొప్పయోగము నష్ట మాయెను. అందుచేతనే నేను నీకీనాడు చెప్పుచున్నాను."15

అంతట అర్జును డిట్లడుగును: "ఏల ఇట్లందువు? నీవు మొన్న మొన్ననే పుట్టినవాడవు. వివస్వంతుడు నీకంటె చాల మునుపటివాడు. నీ వతనికి చెప్పితి ననుచున్నావే, ఆ మాట కర్థమేమి?"16

దానికి కృష్ణుని సమాధాన మిది: "అర్జునా, నీవును, నేనును ఈ వఱ కెన్నియో పర్యాయములు పుట్టితిమి; చనిపోతిమి. నీ కా విషయము గుర్తు లేదు. నాకు ఆది లేదు. జన్మము లేదు. నేను సర్వభూతమహేశ్వరుడను. నా ప్రకృతి నధిష్ఠించి నేను జన్మించుచున్నాను. ఎప్పుడెప్పుడు ధర్మమునకు గ్లానియు, అధర్మమునకు అభ్యుత్థానమును గల్గునో, అప్పుడెల్ల మానవకోటి సముద్ధరణనిమిత్తము నే నవతరించుచుందును. సాధుపరిత్రాణము కొఱకును, దుష్కృద్వినాశముకొఱకును, ధర్మసంస్థాపనకొఱకును నేను యుగయుగమునను అవతరింతును. ఎవరెవరు నన్ను ఏయే తీరుల చేరుటకు ప్రయత్నింతురో నేను వారివారికి ఆయారీతుల అందుపాటులో నుందును. అర్జునా, నా మార్గమును విడిచి ఎవరును పోలేరు."17 ఇంతవఱ కెవరును పోలేదు. ఎట్లు పోగలము? అతని మార్గమునుండి ఎవరును తొలగి చనజాలరు.

... సకలసమాజములును తప్పుడు సూత్రములమీద నాధారపడి యున్నవి. నిర్దుష్టసూత్రము నాధారముచేసికొనియే నియతి రూపొందును. ప్రాతసామెత కలదు కదా!: ప్రతి

15. IV-1-3. 16. IV-4. 17. IV-5-8-11.

సామాన్యసూత్రమునకు మినహాయింపు (అపవాదము) గల దని. ... అది నియతియే యగుచో దాని నుల్లంఘించుట సాధ్యము కాదు. దాని నెవరును ఉల్లంఘింప లేరు. ఆపిల్ పండు గురుత్వాకర్షణశక్తి నియతి నతిక్రమింపగలదా? నియతి ఉల్లంఘింపబడిన క్షణముననే జగత్తు అంతరించును. మీరును నియతి నుల్లంఘింపగలకాల మొకానొకనాటికి వచ్చును. ఆ క్షణమున మీ స్మృతి, మీ మతి, మీ దేహము కరగిపోవును.

అక్కడ ఒకడు దొంగిలించుచున్నాడు. అత డేల చౌర్యము చేయును? మీ రతనిని శిక్షింతురు. అతనికి మీ రేల అవకాశ మీయజాలరు? అతనిశక్తి నేల పనివడనీయరు? ... "నీవు పాపివి" అని మీ రందురు. అతడు శాసనము నుల్లంఘించె నని పెక్కండ్రు అందురు. ఈ మానవకోటియంతయు ఏకక్రమము ననుసరింప నిర్బంధింపబడుచున్నది. అందుచేతనే కష్టము, పాపము, దౌర్బల్యము సంభవించు చున్నవి. ... ప్రపంచము మీ రనుకొను చున్నంత చెడ్డది కాదు. మూఢుల మగు మనమే దానిని పాపపంకిలము చేసితిమి. మనదయ్యములను, మనరాక్షసులను మనమే సృష్టించుకొందుము. పిమ్మట ... వానిని మనము వదలించుకొనలేక పోవుదుము. మన చేతులను కన్నుల కడ్డము పెట్టుకొని "ఓహోయి ఎవరేని వెలుతు రిండు" అని గోలపెట్టుదుము: వట్టిమూఢులు! కన్నులమీదనుండి చేతులు తీసివేయుడు! దానికి కావలసిన దంతే. మనలను రక్షింపవలసినదని దేవతలకు మొఱపెట్టుకొందుమే కాని ఎవరును తన్ను తాను నిందించుకొనరు. అదే అందులో శోచనీయాంశము. సంఘములో నింతటి చెడుగు ఏల యున్నది? అందఱు నేమి చెప్పుదురు? ఇంద్రియములు, సైతాను, స్త్రీ — ఇవి కారణములుగా పేర్కొందురు. వీని నేల కల్పించుకొందురు? వీనిని కల్పించుకొనవలసిన దని మి మ్మెవ్వరు కోరలేదే? "అర్జునా, నా మార్గమునుండి ఎవరును తప్పుకో

లేరు."[18] మనము మూఢులము. మనవి మూఢపద్ధతులు. మన మీ మాయయంతటిగుండను సాగిపోవలసినదే. భగవానుడు స్వర్గమును సృష్టింపగా, మానవుడు తనకు తానే నరకమును కల్పించుకొన్నాడు.

"నన్ను ఏ కర్మయు నంటదు. కర్మఫలమందు నాకు వాంఛ లేదు. నన్నా విధముగా నెఱిగినవారు రహస్యము నెఱిగినవారు. వారు కర్మబద్ధులు కారు. పూర్వ ఋషు లీ రహస్యమును గ్రహించి నిరుపద్రవముగ కర్మచేయగల్గిరి. నీవును అటులనే కర్మ చేయుము."[19]

"ఎవడు అత్యధికకార్యనిమగ్నుడైయు గాఢప్రశాంతత గల్గియుండునో, గాఢప్రశాంతతలో నుండియే తీవ్రకార్యవ్యగ్రుడుగ నుండునో అతడే బుద్ధిమంతుడు."[20] ... విషయ మిది : యింద్రియములును ఉపకరణములును కార్యవ్యగ్రములుగ నున్నను, దేని చేతను చెడని గాఢశాంతి నీకున్నదా? బజారువీధిలో, నీచుట్టు నంత సమ్మర్దము, త్రొక్కిడి ఉండగా... కారుకొఱకు నిరీక్షించుచు నీవు నిలబడియున్నప్పుడు, శాంతనిశ్చలధ్యాననిమగ్నుడవై ఉందువా? పర్వతగుహాలో - అంతటి ప్రశాంతావరణమున నీవు ప్రచండకార్యవ్యగ్రుడవుగ నుందువా? ఉన్నచో, నీవు యోగివి, లేనిచో యోగివి కావు.

"ఎవని సర్వసమారంభములును కామసంకల్పవర్జితములో, స్వతంత్రములో అతనిని బుధులు పండితు డందురు."[21] మనము స్వార్థపరులముగా నున్నంతవఱకు మనకు సత్యము సిద్ధింపదు. మనము అన్నిటికిని మన రంగే వేయుదుము, వస్తువులు స్వస్వరూపముతోనే వచ్చును. అవి మఱుగుపడియున్నవనుట కాదు. ఎంతమాత్రమును కాదు! మనమే వానిని మఱుగు పఱచుచున్నాము. కుంచె మనచేతిలో ఉన్నది. ఒకవస్తువు

18. IV-11. 19. IV-14-15. 20. IV-18. 21. IV-19.

వచ్చును. మన కది నచ్చదు. కుంచెతో దానికొక పూత పూసి, మరల చూతుము. ... జ్ఞానము మనము కోరము. సర్వమునకును మనము మన రంగునే పూయుదుము. సకలవ్యాపారములకును ప్రేరకము స్వార్థపరతయే. ప్రతివస్తువును మనమే మఱుగుపఱచు చున్నాము. సాలెపురుగు తనమేనినుండి దారము తీసి, తన చుట్టును గూడుగట్టుకొనును. అందులో తాను బందీ యగు చున్నది. తనపనిచే తానే బంధిత మగుచున్నది. మనము దానివంటివారము. మనము చేయుచున్న పని అదే. "నేను" అని అనిన క్షణముననే దారము నన్నొక్క చుట్టు చుట్టును. "నేను, నాది," అంటినా, మఱొక్క చుట్టు చుట్టును. ఇటులనే సాగును. ...

పని చేయక మన మొక్క నిమిషమయిన నుండ లేము. పనిచేయుము కాని, నీకు నీవే సాయముచేసికొనునప్పుడు ఎట్టి భావముతో చేసికొందువో నీ పొరుగువాడు నీ సాయము కోరినప్పుడును సరిగా అట్టిభావముతోనే సాయము చేయుము. అంతకంటె హెచ్చేమియు కాదు. జాను దేహపువిలువకంటె నీదేహపువిలువ హెచ్చు కాదు. జానుకు నీ వేమి చేయుదువో అంతకంటె ఎక్కువ నీదేహమునకు చేసికోకు. ఇదే పారమార్థికపరత.

"ఎవని సర్వసమారంభములును కామసంకల్పవర్జితములో, ఎవని కర్మలను జ్ఞానాగ్ని దహించివైచినదో అతడు పండితుడు."[22] గ్రంథపఠనముచేత ఆ పని నెఱవేఱదు. గాడిదవీపుమీద పూర్తి పుస్తకభాండారమునే మోప వచ్చును; అంతమాత్రమున అది పండితము కానే కాదు. పెక్కుగ్రంథములు చదువుటవలన ప్రయోజన మేమి? "కర్మఫలాసంగమును త్యజించి నిత్యతృప్తుడును నిరాశ్రయుడునైనవాడు కర్మయందు ప్రవర్తించినను, అతడు కర్మ కతీతుడే."...[23]

22. IV-19. 23. IV-20.

మాతృగర్భమునుండి నేను దిగంబరుడనుగా వచ్చితిని. దిగంబరుడనుగా మరలుదును. వచ్చినప్పుడును నాకు సహాయులు లేరు, పోవునప్పుడు నుండరు. ఇప్పుడును నేను నిస్సహాయుడనే. మన గమ్యము మన మెఱుగము! దాని తలంపే మనకు భయంకరము. మన కట్టి విపరీతాశయాలు గలుగును. ఒకమధ్యవర్తి నాశ్రయింతుము. ఆ దయ్యము సాయపడు నేమో అని నిరీక్షింతుము. ఎంతటి క్లైబ్యమో, తలంపుడు! 'దయ్యములారా, భూతములారా, దేవతలారా, రండి'—పురోహితులారా, పండితమ్మన్యులారా, అందఱు! మనము బలహీనులముగ నుండు క్షణమే పురోహితులకు అదను, మనలను తమచేత చిక్కించుకొనుటకు! అప్పుడు సకలదేవతలను తెత్తురు.

మా దేశములో ఒకనికి బలము విద్య తత్త్వజ్ఞానము, చేకూరగానే అతడు "ఈప్రార్థనలు, స్నానములు అర్థములేని పనులు" అనును......అతని తండ్రి మరణించును, తల్లి మరణించును, హిందువుకు అంతకుమించిన భయంకరాఘాతము మఱొకటి లేదు. అంతట నతడు కనబడిన ప్రతిముఱుగుగుంటలోను మునుగును; దేవాలయములకు పోవును ; పాదధూళిని కతుకును...... 'కాపాడుడీ, ఎవరైన'. కాని, మనము నిస్సహాయులము. ఎవడును సాయపడడు. ఇదియే సత్యము. మానవుల కంటె దేవత లధికసంఖ్యాకులుగ నున్నారు. అయినను సాయము లేదు. మనము కుక్కచావు చత్తుము, దిక్కుండదు. ఎక్కడ బట్టినను పశుత్వమే, కాటకమే, వ్యాధులే, దుఃఖమే, పాపమే! అందఱును సాయముకొఱకు రోదనముచేయుచున్నారు. కాని, సాయము లభించుట లేదు. ఆస నిరాశ యగుచున్నను, ఆశ వదలక సాయముకొఱకు ఆక్రందనము చేయుచునే యున్నాము. ఆహా! ఏమి దుఃస్థితి! ఎంత భయంకరము! మీ హృదయములనే పరిశీలించుకొండి! చిక్కులో సగము మన దోషమువలననే గల్గినది

కాదు; మనజనసీజనకుల దోషమువలన గల్గినది. ఈదౌర్బల్యము జన్మచేతనే కలుగగా మఱింత దౌర్బల్యము మనతలలోనికి చొప్పింపబడినది. మెట్టుమెట్టుగా మనము దీని నతిక్రమింప గలము.

అసహాయుల మనుకొనుట మహాదోషము. ఎవరినుండియు సాయ మపేక్షింపకుము. మనమే మనకు సహాయులము. మనకు మనము సాయము చేసికోలేనియెడల మనకు సాయపడువా రెవ్వరును లేరు......"నీవే నీ యేకైక మిత్రుడవు, నీవే నీయేకైక శత్రువవు. ఆత్మకు ఆత్మయే బంధువు, ఆత్మకు ఆత్మయే రిపువు."[24] ఇదే కట్టకడపటి పాఠము. పాఠములలో నెల్ల మిక్కిలి గొప్ప పాఠ మిది. అయ్యో, దీనిని నేర్చుకొనుట కెంతకాలము పట్టును! అ దేదో మనకు అవగతమైనట్లే యుండును. మఱునిమిషములోనే మునుపటి కెరటము వచ్చి పైకొనును. వెన్నెముక విఱుగును. మనము చేవచెడి వెనుకటి మూఢభావమును పట్టుకొని సాయ మర్థింతుము. ఆ మహాదుర్దశను భావించి చూడుడు, సాయమునకు ఒరులు ఆశ్రయణీయు లనెడి భ్రాంతియె దీని కంతటికిని కారణము.

పురోహితుడు తన మామూలుమాట లేవో వల్లించి కాసుల కెదురుచూచును. అరువదివేలజనులు మింటి మొగమై ప్రార్థన చేయుదురు; పురోహితులకు దక్షిణసమర్పింతురు. మాసము తరువాత మాసము వారు ధనమిచ్చుచు ఫలితము కొఱకు ప్రార్థనలు చేయుదురు. ...... ఈ విషయమును గుఱించి ఆలోచింపుడు! ఇది ఉన్మాదము కాదా! కాక, మఱేమి? ఇందు కెవరు బాధ్యులు? మీరు మతప్రచారము చేయవచ్చును కాని, పసిబిడ్డల మనసుల నుద్రేకపఱచుటయా?......ఇది మిమ్ము కట్టి కుడుపక తీఱదు. మీ హృదయాంతరాభిప్రాయములో మీ

24. VI-5.

లేపాటి ? ఒరుల మనస్సులలో చొప్పించు దౌర్బల్యకరాశయము లలో ప్రతిదానికిని మీరు చక్రవడ్డీతో పరిహారము చెల్లించుకో వలసివచ్చును. కర్మసూత్రము రాబట్టుకోవలసిన దానిని రాబట్టు కొనియే తీఱును.

ఉన్న పాప మొక్కటే. దౌర్బల్యమే అది. నేను బాల్య దశలో మిల్టను రచించిన "పారడైజ్లాస్టు"ను చదివితిని. నా పూజ్యభావమును చూఱగొన్న సత్పురుషుడు సైతాను. దౌర్బ ల్యమునకు వశుడు కాక, దేని నయిన నెదుర్కొనుచు తుదవఱకు పట్టు విడువ కుండు నతడే యోగి.

లెమ్ము, ఉత్సాహము వీడకుండు...... ఒక మఱొక వెఱ్ఱిని కలుపుకోకు. కలుగనున్న అనర్థముతో నీ క్లైబ్య మును కలుపుకోకు. నేను ప్రపంచమునకు చెప్పవలసిన దంతే. బలవంతులై ఉండుడు!......మీరు దయ్యములనుగుఱించి, భూత ములనుగుఱించి చెప్పుచుందురు. మనమే సజీవులమైయున్న భూత ములము. పటుత్వమును, వృద్ధియు జీవలక్షణములు. దౌర్బ ల్యము మృత్యులక్షణము. ఏదేది దుర్బలమో దాని నెల్ల విడ నాడుడు! అది మృత్యువే. బలమే అగు నేని, అది నరకములో నున్నను సరే పోయి దక్కించుకొండి. ధీరులకే మోక్షము. "అందగత్తెల బడయు నర్హత ధీరునకే" ధీరశ్రేష్ఠులకే మోక్షా ర్హత. నరక మెవరిది ? చిత్రహింస ఎవరిది ? పాప మెవరిది ? దౌర్బల్య మెవరిది ? మరణ మెవరిది ? వ్యాధి ఎవరిది ?

మీరు దేవుని విశ్వసింతురు. అయినచో నిజమగు దేవుని విశ్వసింపుడు : "నీవు స్త్రీవి. నీవు పురుషుడవు. నీవు యౌవన బలముతో నడచుచున్న యువకుడవు...... నీవు చేత కఱ్ఱబూని తడబడుచు నడచు వృద్ధుడవు."[25] నీవే దౌర్బల్యము. నీవే భయము. నీవే స్వర్గము. నీవే నరకము. నీవే కాటువేసెడి

25. శ్వేతాశ్వతర - IV-3.

సర్పము. భయరూపములో రమ్ము! మృత్యురూపములో రమ్ము! దుఃఖరూపములో రమ్ము!......

సమస్తదౌర్బల్యము, సమస్తబంధము కేవలము మనఃకల్పనయే. దానితో ఒక్క మాట చెప్పు. అది అదృశ్యము ఐతీఱును. క్లైబ్య మొందకుము? బయటపడు దారి మఱొకటిలేదు...... లెమ్ము, దృఢముగ నుండుము. భయపడకు. గ్రుడ్డినమ్మకాలు వలదు. సత్యమును ఉన్న దానినున్నట్లు ఎదుర్కొనుము. మృత్యువు సంభవించునా,—కష్టము లన్నిటికంటె కష్టమైన దది.—సంభవింపనిమ్ము! తుదవఱకు ఉత్సాహము నిల్పుకొనియె యుండవలెనను నిశ్చయము గల్గి యున్నాము. నాకు తెలిసిన మత మంతే. నే నా స్థాయి నందుకోలేదు. అందుకొనుటకు ప్రయాసపడుచున్నాను. నే నందుకోలేక పోవచ్చు. నీ వందుకో గల్గవచ్చు. సాగి పొమ్ము.

ఎక్కడ ఒకరు మఱొకరిని చూచునో, ఒకరు మఱొకరిని వినునో, ఇరువురు ఉన్నంతవఱకు భయ ముండక తప్పదు. భయమునుండియే సమస్తదుఃఖము పుట్టుచున్నది. ఎక్కడ మఱొకదానిని చూడరో, ఎక్కడ ఉన్న దొక్కరేనో, అక్కడ దుఃఖపడువారు, కష్టపడువారు లేరు.[26] ఉన్నది అద్వితీయమైన ఏకమే కనుక భయపడకుము. మేల్కొనుము. లెమ్ము. గమ్యమును చేరుకొనువఱకును ఆగకుము!



26. ఛాందోగ్యోపనిషత్తు - VII₂

# భగవద్గీత విశిష్టత

వివేకానందస్వామి 1897 వ సంవత్సరమున కలకత్తాకు వచ్చియున్నప్పుడు విశేషకాలము రామకృష్ణమిషన్ ప్రధాన కార్యాలయమగు మఠమునందు నివసించువాడు. మఠ మప్పు డాలంబజారులో నుండెను. ఈకాలమున పెక్కుమంది యువకులు, కొంతకాలముముందునుండియే సాధనసన్నాహములు చేసికొను చుండినవారు, స్వామిజీని పరివేష్టించి బ్రహ్మచర్యదీక్షను, సన్న్యాసదీక్షను స్వీకరించిరి. భవిష్యత్కార్యక్రమమునకు తర్ఫీతుచేయుటకై వారిని కూర్చుండబెట్టుకొని భగవద్గీతను, వేదాంతమును పాఠము చెప్పినాడు. ధ్యానసాధనలు నేర్పినాడు. అట్లొకనాడు పాఠముచెప్పుచు స్వామి భగవద్గీతనుగుఱించి బెంగాలిలో ధాటీమండితముగ నుపన్యసించెను. ఆ యుపన్యాస సంక్షేపము మఠము దినచర్యాపుస్తకములో వ్రాయబడెను: దాని ఆంగ్లానువాదమున కీ క్రిందిది ఆంధ్రానువాదము:

గీత యను గ్రంథము మహాభారతములో నొకభాగము. గీతను సరిగా అర్థముచేసికొనుట కనేకవిషయములు తెలియుట అవసరము. మొదటిది: గీత మహాభారతములోని భాగమేనా? అనగా, దానిరచయిత వేదవ్యాసు డని చెప్పబడుచున్నమాట యథార్థమా? లేక ఆ మహాకావ్యములో నిది తరువాత ప్రక్షే పింపబడినదా? రెండవది: కృష్ణు డను నొక చారిత్రకపురుషు డుండెనా? మూడవది: గీతయందు చెప్పబడినరీతి కురుక్షేత్ర యుద్ధము నిజముగా జరిగినదా? నాల్గవది: అర్జునుడును తదితరు లును నిజముగా చారిత్రకపురుషులేనా?

ఇట్టి పరిశీలనకుగల ఆధారము లేవన్న సంగతిని మొదట చూతము. వేదవ్యాసు డను పేరుగలవారు పలువు రుండి రని

మనకు తెలియును; వారిలో గీతాకారు డెవరు?—బాదరాయణ వ్యాసుడా, లేక ద్వైపాయనవ్యాసుడా? "వ్యాసుడు" అనునది బిరుదు మాత్రమే. క్రొత్తపురాణము రచించినవానిని వ్యాసు డందురు. 'విక్రమాదిత్య'నామమువలె 'వ్యాస'నామమును వర్గ నామమే. మఱియొక విషయము: శంకరాచార్యుడు గీతపై గొప్ప భాష్యమును వ్రాసి దానికి ప్రసిద్ధి చేకూర్చుటకుముందు, భగవద్గీతను గుఱించిన జ్ఞానము సామాన్యప్రజల కెక్కువగ లేదు. అంతకు చిరము పూర్వము గీతపై బోధాయనవ్యాఖ్య ప్రచారములో నుండె నని పలువుర నమ్మకము. ఈ విషయమును రుజువు చేయగలిగినచో గీతపురాతనత్వమును, వ్యాసుని తత్కర్తృత్వమును చాలవఱకు నిరూపితమగు ననుటకు సందేహము లేదు. రామానుజుడు బ్రహ్మసూత్రములకు తాను వ్రాసిన శ్రీభాష్యమున ఏ బోధాయనభాష్యము ననుసరించెనో, శంకరాచార్యుడు సైతము ఏ బోధాయనభాష్యమును పేర్కొనుటే కాక అందుండి ఉదాహరణములనుసైతము అక్కడక్కడ చూపియున్నాడో, ఏ బోధాయనభాష్యమునుగూర్చి దయానందస్వామి అంతగొప్పగా చర్చించెనో — ఆ బోధాయనభాష్యగ్రంథప్రతి ఒక్కటైనను భారతదేశమంతటను పర్యటించినను నాకు కనబడలేదు. శ్రీభాష్యము వ్రాయునప్పుడు రామానుజునకు లభించిన బోధాయన వృత్తివ్రాతప్రతికూడ చెదలుతినివేసినప్రతి యట. గొప్పదగు బోధాయనుని వేదాంతసూత్రభాష్యమే యింతటి సందిగ్ధతాంధకారమున మఱుగుపడియుండగా భగవద్గీతపైకూడ నతని భాష్యముండె నని నిరూపింప ప్రయత్నించుట వ్యర్థము. శ్రీశంకరాచార్యుడే గీతాకారు డని, అతడే దానిని మహాభారతములో చొప్పించె నని కొందఱి యూహ.

రెండవ విషయము — గీతాకారుడగు కృష్ణుని గుఱించి చాల సందేహము కలదు. ఛాందోగ్యోపనిషత్తునం దొకచోట

దేవకీకుమారుడు శ్రీకృష్ణుడు ఘోరుడను యోగియొద్ద ఆత్మోపదేశములు పొందినట్లు చెప్పబడినది. మహాభారతమున కృష్ణుడు ద్వారకాధిపతి; విష్ణుపురాణములో గోపికలతోడి శ్రీకృష్ణుని క్రీడలవర్ణన గలదు. భాగవతములో సుదీర్ఘమైన అతనిరాసలీలా వర్ణన కలదు. మనదేశములో బహుప్రాచీనకాలమున మదనోత్సవము జరిపెడి యాచార ముండెను. అదియే డోలగా మార్పు చేయబడి, కృష్ణునికారోపితమైనది. అటులనే ఈ రాసలీల మున్నగునవి కృష్ణుని కంటకట్టబడినవి కావని చెప్పగలంతిగ నెవ్వరు సాహసింపగలరు? చారిత్రకపరిశోధనద్వారా సత్యము తెలిసికొను దృష్టి పూర్వకాలమున మనదేశమున లేనే లేదు. సరియైన నిదర్శనములను, ఆధారములను చూపకే ఎవరికి ఉత్తమ మని తోచిన అభిప్రాయమును వారు చెప్పుచుండెడివారు. మఱొక విషయము: ఆ కాలములో జనులు పేరుప్రతిష్ఠలకై ప్రాకులాడెడి వారు కారు. . అందుచేత ఒకరు గ్రంథము రచించి దానిని తమ గురువుపేరిటనో, మఱొకరి పేరిటనో ప్రచారము చేయుట తఱచు సంభవించుచుండెను. అటువంటి సందర్భములలో చారిత్రకవిషయ పరిశోధకునకు నిజము తెలిసికొనుట చాల దుస్తర మగును. పూర్వకాలమున జనులకు భూగోళజ్ఞానము లేదు. తోచిన ట్లెల్ల భావన చేసెడి వారు. కనుక మధుసముద్రము, పాలసముద్రము, పెరుగుసముద్రము, వెన్నసముద్రము వంటి వింతవింత మనఃకల్పనలు జరిగినవి! పురాణములలో ఒకడు పదివేలసంవత్సరములు జీవించును. మఱొకడు లక్షసంవత్సరములు బ్రతుకును! కాని, శ్రుతులు "శతాయుర్వై పురుషః — మానవుడు నూఱేండ్లు జీవించును" అని చెప్పినవి. ఇక్కడ మన మెవరిని మన్నింపవలె? కృష్ణునివిషయమై ఇదమిత్థ మని యథార్థమును నిర్ధరించుట ఇంచుమించ చసాధ్యమే.

ఒకమహాపురుషుని యథార్థశీలమునకు చుట్టును. ఊహాగోచరములైన రకరకాల అతిమానుషగుణములను కల్పించుట

మానవస్వభావము. కృష్ణుని విషయమైకూడ ఇట్లే జరిగియుండ వలె. ఐనను అతడు రాజుగ నుండి యుండు ననుట మిక్కిలి సుసంభవ మని తోచుచున్నది. మిక్కిలి సుసంభవ మని ఏల చెప్పితి ననగా పూర్వకాలమున మనదేశములో బ్రహ్మజ్ఞానప్రచారమునకు విశేషముగా పాటుపడినవారు రాజులే. ఇట ముఖ్యముగ గుర్తింపవలసిన ఇంకొకవిషయ మే మన, గీతాకారు డెవ రయిన గానీ, గీతోపదేశమును యావన్మహాభారతోపదేశమును ఒక్కటిగనే ఉన్నది. దీనినిబట్టి మహాభారతకాలములో ఒకమహాపురుషుడవతరించి నాటి సమాజమున కీ క్రొత్తపద్ధతిని బ్రహ్మజ్ఞాన ముపదేశించియుండునని ధారాళముగ నూహింపవచ్చును. స్పష్టముగ గననగు మఱొకవిషయము — ప్రాచీనకాలమున ఒకటివెంబడి నొకటిగా మతశాఖలు పుట్టినట్లే, ఒకటివెంబడినొకటిగా ప్రమాణగ్రంథములును పుట్టి అమలులోనికి వచ్చుచుండినవి. కొంతకాలమునకు మతశాఖయు దానిప్రమాణగ్రంథమును కూడ అంతరించెడిది, లేదా మతశాఖ అంతరించి ప్రమాణగ్రంథము మాత్రము మిగిలెడిది. అట్లే ఒకానొకమతశాఖవారు తమ ఉదాత్తోన్నతాశయములను ఈ గీతలో రూపొందించి యుండవచ్చును. గీత ఆ మతశాఖవారి ప్రమాణగ్రంథమై యుండ వచ్చు.

మూడవవిషయమునకు కురుక్షేత్రయుద్ధమును గుఱించిన దానికి వత్తము. ఆయుద్ధము జరిగినదా లేదా అనుటకు ప్రత్యేక ప్రమాణము చూపుట సాధ్యము కాదు. కౌరవులకును పాంచాల రాజులకును యుద్ధము జరిగె ననుటకు సందేహము లేదు. వేఱొక విషయము: మహాసైన్యములు వ్యూహములుతీఱి పోరాడుటకు ఆజ్ఞనునిరీక్షించుచు సిద్ధముగానున్న రణరంగమున జ్ఞానమును భక్తిని యోగమును గూర్చిన అంత చర్చ సాగుట ఎట్లు శక్యము? యుద్ధభూమిలో ఆగడబిడలో ఆరొదలో శ్రీకృష్ణార్జునసంవాదములో ప్రతిమాటను వ్రాసిపెట్టుటకు సంక్షిప్తలిపి (షార్టుహాండు) లేఖకు

డుండెనా? ఈకురుక్షేత్రసంగ్రామకథ అన్యాపదేశార్థకము (ఆలిగొరి) అని కొందఱి యభిప్రాయము. దానియంతరార్థమును సంక్షేపించి చెప్పవలె ననిన — మానవుని హృదయములో మంచిచెడ్డలకు నిరంతరము జరుగుచున్న పోరాటమే దాని కర్థము. ఈ యభిప్రాయము యుక్తివిరుద్ధము కాదు.

ఇక నాల్గవవిషయము అర్జున ప్రభృతుల చారిత్రక యాథార్థ్యమును సందేహించుటకు కావలసినంత అవకాశమున్నది. శతపథబ్రాహ్మణము బహుప్రాచీనగ్రంథము. దానియందొకచోట అశ్వమేధయాగముచేసినవా రందఱి పేర్లను పేర్కొనబడియున్నవి. అందు అర్జునుని మునిమనుమడును, పరీక్షిత్తుపుత్త్రుడును అగు జనమేజయుని ప్రస్తావము కలదు. కాని, అర్జునప్రభృతులపేర్లు లేవు సరికదా వానికి సూచన అయినను లేదు. కాని, మహాభారతమందును, తదితరగ్రంథములందును యుధిష్ఠిరుడు, అర్జునుడు మున్నగువారు అశ్వమేధయాగము చేసినట్లు చెప్పబడియున్నది.

ఇక్కడ ఒకవిషయమును ముఖ్యముగా జ్ఞప్తియందుంచుకొనవలసియున్నది. ఈచరిత్ర పరిశోధనలకును మన యథార్థలక్ష్యమయిన ధర్మసాధన కవసరమగు జ్ఞానసిద్ధికిని సంబంధము లేదు. చారిత్రకముగా ఈసర్వము పూర్తిగా అసత్యమని నిర్ధారణ అయినను మన కెంతమాత్రమును నష్టము లేదు. అటు లయిన చరిత్రపరిశోధనలను అంతగా సాగించుటవలన ప్రయోజన మేమని మీ రడుగుదురు. నిజ మేమో తెలిసికొనవలె కనుక దాని ప్రయోజనము దానికి గలదు; అజ్ఞానములో బడి తప్పుడు అభిప్రాయములకు మనము కట్టుబడియుండుట చెల్లదు. ఈ దేశములో అట్టి పరిశోధనల ప్రాముఖ్యమును గణింపనే గణింపరు. జనులకు మేలు కలిగించు విషయము బోధించుటకు, అట్టి బోధను తోడ్పడునేని, అసత్యము చెప్పినను తప్పు లే దని అనేకమతశాఖల నమ్మ

కము; అనగా లక్ష్యము సాధనమును సాధూకరించును. కనుకనే పెక్కు తాంత్రిక గ్రంథములు, "మహాదేవుడు పార్వతి కిట్లు చెప్పెను:" అని ప్రారంభ మగును. కాని. సత్యమును గుర్తించుటయు, సత్యమును విశ్వసించుటయు మనవిధి. సత్యమును పరిశీలింపకే, ప్రాచీనసంప్రదాయములందు మనవారికున్న విశ్వాస ప్రభావ మట్టిది, వారి కరచరణములను కట్టివేసినది. జీసస్ క్రైస్తు, మహమ్మదువంటి మహాపురుషులయినను సరే — అట్టి మూఢ భావము లనేకములను విశ్వసించిరి; వానినిత్యజింపలేక పోయిరి. కాని, మీ దృష్టిని సర్వదా సత్యముపైనె నిలుప వలె; సకల మూఢవిశ్వాసములను పూర్తిగా పరిత్యజింపవలె.

గీతలో నున్న విషయ మేమో మన మిప్పుడు తెలిసికొన వలెను. ఉపనిషత్తులను చదువుదు మేని, వానిలో ఒకదానితో నొకదానికి సంబంధములేక గహనములయి యున్న విషయముల గుండ ముందునకు పోవుదు మేని పోగా పోగా ఒకమహాసత్యమును గుఱించి ఆకస్మికముగ ప్రవేశపెట్టబడిన సంవాద మొకటి కన నగును, కీకారణ్యములో పయనించు బాటసారికి అక్కడక్కడ చిక్కవడ్డ ఆకులు ముండ్లు వేరులు గల్గి బహుసుందరమైన గులాబి పువ్వొ కనబడినట్లు. ఆదృశ్యముతో పోల్చిచూచినప్పుడు, తగిన స్థానముల సొంపుగా అమర్పబడిన ఆ మహాసత్యములబోలినది భగవద్గీత. శ్రేష్ఠసుమముల చక్కనిమాలవంటిది, లేదా చక్కని చెండువంటిది. ఉపనిషత్తులు పెక్కుచోట్ల శ్రద్ధనుగుఱించి విస్తారముగా చెప్పును కాని అందు భక్తిప్రస్తావము లేనేలేదు. మఱి భగవద్గీతలో నన్ననో భక్తి మాటిమాటికి చెప్పబడియుండుటే కాదు, భక్తిసారము అందు పరమోచ్ఛస్థాయి నందుకొన్నది.

గీతలో చర్చింపబడిన ప్రధానాంశములు కొన్నిటిని పరిశీలింతము. అంతకు ముందున్న గ్రంథములనుండి భగవద్గీతను ప్రత్యేకించునట్టిదియు భగవద్గీతకే సొంతమైనదియు నగు విశేష

మేమి? అది యిది: గీతపుట్టుటకు పూర్వముకూడ యోగము, జ్ఞానము, భక్తి మొదలయిన మార్గములను దీక్షతో అనుసరించిన వా రుండిరి. ఎవరికి వారు తమ మార్గమే తదన్యములకంటె శ్రేష్ఠ మైన దని చెప్పుచు వారు పరస్పరము కలహించుకొనుచుండిరి. ఈ విభిన్న పథముల సమన్వయమునకై ప్రయత్నించిన వా రొక్క రును లేరైరి. వానిని సమన్వయించుటకు తొలిసారిగా ప్రయ త్నించినవాడు గీతాకారుడే. ఆనాటి వివిధపథములవారు చెప్పు విషయములలో శ్రేష్ఠాంశముల నతడు స్వీకరించి వాని నన్నిటిని గీతాసూత్రమున గ్రుచ్చెను. సంపూర్ణసమన్వయమును కృష్ణుడు సాధింపలేకపోయినచోట్లగూడ పందొమ్మిదవ శతాబ్దమున రామకృష్ణపరమహంస సాధించినాడు.

అనంతరవిషయము నిష్కామకర్మ: అనగా నిస్సంగముగ కర్మ ననుష్ఠించుట. ఈకాలమున ప్రజలు దీనిని బహువిధములుగా అర్థము చేసికొనుచున్నారు. సంగము లేకుండుట యనగా ఎట్టి ప్రయోజనము నుద్దేశింపకుండుట యని కొంద అందురు. అదియే నిజమైన అర్థ మయినచో హృదయములేనిపశువులు, ఈ గోడలు నిష్కామకర్మాచరణకు పరమోత్కృష్టనిదర్శనము లగును. చాల మంది జనకుని ఉదాహరింతురు. తమ్ము జనకునితో సమానులనుగా, నిష్కామకర్మలో ఆరితేఱినవారినిగా పరిగణింపవలె నని కోరుదురు! జనకుని (=తండ్రి) గొప్పతనము బిడ్డలను కనుటచేత కలిగినది కాదు. కాని, వీ రందఱును గుంపెడేసి బిడ్డలకు తండ్రులై, ఆ ఒక్క యోగ్యతచేతనే తాము జనకులు కావలె నని కోరుకొందురు. అది కుదరదు! నిజమైన నిష్కామకర్మి పశువుగాగాని, జడుడుగాకాని, హృదయశూన్యుడుగాగాని ఉండ రాదు. అతడు తామసికుడు కాడు, శుద్ధసత్త్వసంపన్నుడు. అఖిలజగత్తును ఆలింగనము జేసికొనగలంతటి ప్రేమతో, సానుభూతితో అతని హృదయము నిండియుండును. సర్వాలింగనసమర్థములగు అతని

ప్రేమయు, సానుభూతియు సాధారణముగా లోకుల కర్థము కాదు.

వివిధధర్మమార్గముల సమన్వయము, నిష్కామకర్మ — ఇవి భగవద్గీతలో గల రెండు విశేషములు.

ఇక రెండవ అధ్యాయమునుండి కొంచెము చదువుదము :

సంజయ ఉవాచ :

తం తథా కృప యావిష్ట మశ్రుపూర్ణకులేక్షణమ్,
విషీద న్త మిదం వాక్య మువాచ మధుసూదనః ॥

శ్రీభగవా నువాచ :

కుత స్త్వా కశ్మల మిదం విష మే సముపస్థితమ్,
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున ॥
క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్ త్వ య్యుపపద్యతే,
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వో త్తిష్ఠ పరంతప ॥

సంజయు డిట్లు చెప్పెను :

"అట్లు దయావిష్టుడును నీరునిండుటచే కలగిన నేత్రములు కలవాడును విషాదమునొందుచున్నవాడు నగు అర్జునునితో మధుసూదను డిట్లు పలికెను" :

భగవాను డిట్లు పలికెను :

"ఈ సంకటసమయమున ఈ మోహము నీ కెక్కడినుండి దాపురించిన దోయి? అర్జునా, ఇట్టి మోహమును పొందువారు అనార్యులు; ఇది అప్రతిష్ఠాకరము; స్వర్గప్రాప్తికి ప్రతిబంధకము".

"పార్థ, పిఱికితనమును పొందకు. ఇది నీకు తగదోయి. తుచ్ఛమగు ఈ హృదయదౌర్బల్యమును విడిచి ఓ పరంతపా, లెమ్ము".

'తం తథా కృప యావిష్టమ్' అనుటతో ప్రారంభ మగు శ్లోకములలో ఎంతసుందరముగా, ఎంతటికవిత్వపు సొబగుతో అర్జునుని వాస్తవపరిస్థితి వర్ణింపబడినది! అంతట శ్రీకృష్ణు డర్జునునకు, హిత ముపదేశించును, ''క్లైబ్యం మాస్మగమః పార్థ'' మున్నగు మాటలచే. అత డర్జునుని పోరాడు మని పురికొల్పుచున్నాడే ఎందులకు? ఏల యన, శుద్ధసత్త్వగుణప్రాధాన్యము తలమునుకలై, అందుండి పుట్టినది కాదు అర్జునుని యుద్ధవిరక్తి. అతనికి ఈవైముఖ్యమును కల్గించిన దెల్ల తమోగుణమే. సంపద కలుగనీ ఆపద రానీ సకలజీవితపరిస్థితులందును సమానప్రశాంతత గల్గియుండుట సత్త్వగుణుని స్వభావము. అర్జునుడు భయపడినాడు, కృపావిష్టుడైనాడు. అతడు యుద్ధభూమికి వచ్చినది పోరాడుటకే, కాని వేఱొకందుకు కాదు. పోరాడుద మను సహజావబోధమును ఇష్టమును అతని కున్న దనుటకు, అతడు యుద్ధభూమికి వచ్చుటే ప్రమాణము. మనజీవితములలోకూడ అట్టి సందర్భములు తఱచు కలుగుచుండును. అనేకులు తాము సాత్త్వికస్వభావుల మని యనుకొందురు. యథార్థమునకు వారు తామసికులే గాని మఱేమియు కారు. అనేకులు అశుచిమార్గాలలో జీవించుచు తాము పరమహంసల మనుకొందురు! ఎందుచేత? పరమహంసలు జడులుగానో, పిచ్చివారుగానో, అశుద్ధాత్ములుగానో ఉందు రని శాస్త్రములలో చెప్పబడినది. పరమహంసలు శిశువులతో పోల్చబడినారు. ఇట సామ్యము పాక్షికము, పరమహంసయు పసిబిడ్డయు ఒక్కరు కారు, అభిన్నులు కారు. కానివారు విపరీతపరాకాష్ఠలు (ఎక్స్ట్రీమ్ పోల్స్) కావున ఒక్కవిధముగానే ఉన్నట్లు కనబడుదురు. ఒకరు జ్ఞానాతీతులు, మఱొకరు పూర్తిగా అనధిగతజ్ఞానులు. కాంతిస్పందన మతివేగముగా నున్నను, అతిమందముగా నున్నను అది మన కనుచూపున కందదు. కాని, ఒకదాని యుష్ణ మత్యధికము. మఱొకదానియందు ఉష్ణము లేనే లే దనవచ్చును. పరస్పరవిరుద్ధములగు సత్త్వతమోగుణముల విషయముగూడ

నింతే. కొన్నివిషయములలో అవి అభిన్నములుగానే కనబడును. కాని ఆరెంటికి పరస్పర మపారమగు భేదము గలదు. సత్త్వగుణ వేషమున తన్ను అమర్చుకొనుట తమోగుణమునకు మిక్కిలి యిష్టము. ఇక్కడ మహావీరుడగు అర్జునియం దది దయారూప మున వెల్వడినది.

అర్జునుని వశముచేసికొన్న ఈ భ్రాంతిని నివారించుటకు భగవాను డేమి చెప్పెను? ఎవరినిగాని పాపి యని దూషింప వల దని, అతనియందున్న సర్వశక్తివంక కతని చూపు మరల్పవలసిన దని నే నెప్పుడును చెప్పుచుందునే, అటులనే భగవంతుడు అర్జును నకు చెప్పెను : నైతత్ త్వ య్యుపపద్యతే. "ఇది నీకు తగదోయి!" "నీవు ఆత్మవు, సమస్తపాపముల కతీతుడవు, అనశ్వరుడవు, నీ యథార్థస్వరూపమును మఱచిపోయితివి, "నేను పాపిని, దేహ దోషాపన్నుడను, మనోవ్యధితుడను" అను నీ తలంపే ని న్నట్టి వానినిగా చేసినది. — నీ కిది తగ దోయి!" అని భగవానుడు చెప్పెను. క్లైబ్యం మాస్మగమః పార్థ! — "పార్థా, క్లైబ్యము నొందకు! లోకములో పాపము లేదు, దైన్యము లేదు, వ్యాధి లేదు, విషాదము లేదు. ప్రపంచములో పాప మన తగిన దే దయిన కల దేని అది యిదే — "భయము;" నీయందు గూఢ ముగా నున్న శక్తిని బహిర్గతము చేయు ఏపనిఅయినను పుణ్య మనియు, దేహమును, మనస్సును దుర్బలపఱచు పనియే నిజమగు పాప మనియు గ్రహింపుము. ఈదౌర్బల్యమును, ఈభీరుత్వమును దులిపివేసికో! క్లైబ్యం మాస్మగమః పార్థ! నీవు వీరుడవు. ఇది నీకు తగనిది."

బిడ్డలారా, క్లైబ్యం మాస్మగమః పార్థ, నైతత్ త్వ య్యుపపద్యతే అను ఈసందేశమును మీరు లోకమునకు చాటుదు రేని సమస్తవ్యాధి, విషాదము, పాపము, దుఃఖము ఈపృథివినుండి మూడుదినములలో మటుమాయ మగును. ఈ దౌర్బల్యపుతలంపు

లేనియు ఎక్కడను ఉండవు. ఇప్పుడిది — ఈ భయకంపన ప్రవాహము — సర్వత్ర గలదు. ప్రవాహమును త్రిప్పివేయుము. దీనికి వ్యతిరిక్తమగు స్పందనమును గొనితెండు. అప్పటి అద్భుత పరివర్తనమును కనుడు! మీరు సర్వశక్తులరు—పొండి. ఫిరంగి ముందుకు పొండి. భయపడకుడు. ఎంతటి హీనపాపిని గాని ద్వేషింపకుడు. అతని బాహ్యమును చూడకుడు. మీ చూపును లోనికి మరల్పుడు. అచ్చట పరమాత్మ ఉన్నాడు, భేరీ మ్రోగించి నట్లుగా లోకమంతటను ఘోషింపుము: "నీలో పాపము లేదు; నీలో దైన్యము లేదు. నీవు అఘటితఘటనాశక్తినిధివి. లెమ్ము మేల్కొనుము, నీలోని దివ్యత్వమును వ్యక్తమొనర్పుము!"

'క్లైబ్యం మాస్మగమః పార్థ, నైతత్ త్వయ్యుపపద్యతే,
క్షుద్రం హృదయదౌర్బల్యం, త్యక్త్వోత్తిష్ఠ పరంతప ॥

ఈ ఒక్క శ్లోకమును పఠించిన చాలు, సమగ్రగీతాపారాయణ ఫలము పూర్తిగా కలుగును; గీతోపదేశమంతయు ఈ ఒక్క శ్లోకములో పొందుపడియున్నది.

# గమ్యము*

(శాన్‌ఫ్రాన్సిస్కోలో 1900 సంవత్సరము మార్చి 27-వ తేదీని చేసిన ఉపన్యాసము)

మానవునిచుట్టు అతనికంటె పరమయిన దేదో ఆవరించి యున్న దని, దానిని తెలిసికొనుటకు మానవుడు ప్రయత్నించు చున్నాడని మనకు తెలియుచున్నది. పరమోత్కృష్టమగు లక్ష్య మునే అతడు సర్వదా అన్వేషించును. అట్టి దొకటి కల దనియు, దానికై చేయు అన్వేషణమే మత మనియు అతనికి తెలియును. సంపూర్ణ మానవతత్త్వమును గూర్చిన అతని జ్ఞానము కొలది ప్రారంభమున అతనియన్వేషణ అంతయు బాహ్యప్రపంచమున స్వర్గములో, తదితరవివిధప్రదేశములలో జరిగినది.

అనంతరము మానవుడు తనచూపును తనవంకకే మఱింత సన్నిహితముగ పాఱింప సాగెను. 'నేను' అను మాటకు నిజమైన అర్థము, ఆ మాట సాధారణముగ సూచించు నర్థము కా దని అతడు గ్రహింప మొదలుపెట్టెను. ఇంద్రియముల కతడు గోచర మగు రీతి అతని యథార్థస్వరూపము కాదు. అతడు తనలోపల అన్వేషణ సాగించెను; వెలుపల తానుంచుకొనియుండిన లక్ష్యము ఇంతకాలము తనలోపలనే ఉండినదని యతడు గుర్తించెను. బాహ్యమున అత డారాధించుచు వచ్చినది తనలోపలనే ఉండిన పరమార్థ తత్త్వమునే. ద్వైతమునకు అద్వైతమునకు గల భేద మిదియే. లక్ష్యమును బాహ్యమునం దుంచుకొన్నప్పు డది ద్వైత మగును. భగవంతుని మనలోపలనే దర్శించుట అద్వైతము.

---

* "వేదాంత అండ్ ది వెస్ట్" పత్రిక 1958-వ సంవత్సరము మే-జూన్ సంచికనుండి పునర్ముద్రితము.

మొదటిప్రశ్న ప్రాతదే 'ఎందుకు' 'ఎందుకు'. మానవు డెట్లు పరిచ్ఛిన్ను డాయెను? అపరిచ్ఛిన్నము పరిచ్ఛిన్న మె ట్లయినది? నిర్మల మెట్లు మలిన మయినది? ఏద్వైతసిద్ధాంతము నాధారపఱచుకొన్నను ఈప్రశ్నకు సమాధాన మొసగుట సాధ్యము కా దన్న సంగతి మీరు ముందు మఱువకుండవలెను.

భగవంతుడు దోషభూయిష్ఠమగు జగము నేల సృజించెను? పరిపూర్ణుడును అనంతుడును, దయామయుడు నగు తండ్రి సృజించిన మానవు డింత దుఃఖిగా నుండుట కేమి హేతువు? స్వర్గ మర్త్యములను గాంచినప్పుడు 'నియతి' మన కవగత మగుచున్నది. ఈ స్వర్గమర్త్యము లెందుకు? ఎవరికిగాని కంటితో చూడనిది భావనలోనికి రాదు.

మన మీజీవితములో ననుభవించు సకలబాధలను మఱొక చోట నెలకొల్పుదుము. ఆచోటే మన నరకము....

అనంతుడగు దేవు డీప్రపంచము నేల నిర్మించెను? 'కుమ్మరి కుండలను చేయురీతిని'... అని ద్వైతవాది చెప్పును. దేవుడు కుమ్మరి; మనము కుండలము......ఇంతకంటె తాత్త్వికమగు పరిభాషలో ఈప్రశ్న ఈవిధముగా వేయబడును: ''మానవుని యథార్థస్వరూపము నిర్మలమని, పరిపూర్ణమని, అనంతమని అంగీకరించుట కేమి ఆధారము? అద్వైతమును ప్రతిపాదించు ఏ వాదములో గాని ఉన్న చిక్కు ఇదొక్కటే. తక్కిన దెల్ల నిర్దుష్టముగను సుస్పష్టముగనే ఉన్నది. ఈప్రశ్నకు సమాధానము చెప్పలేము. ఈప్రశ్నయే అసంగత మని అద్వైతులు చెప్పుదురు.

ద్వైతవాదమును తీసికొనుడు — దేవు డేల ప్రపంచమును సృజించె నను ప్రశ్న ఉన్నది. ఈప్రశ్న అసంగతము. ఏల? ఏల యన — భగవంతుని స్వరూప మేమి? తనకు వెలుపల నున్న దేనిప్రభావమునకును వశుడు కాని వాడు భగవంతుడు.

మీరు, నేను స్వతంత్రులము కాము. నాకు దాహ మగుచున్నది. దాహ మనున దొకటి కలదు. అది నావశములోనిది కాదు. నీరు త్రాగు మని యది నన్ను బలాత్కరించును. నా దేహచేష్ట ప్రతిదియు నామనోవ్యాపారము ప్రతిదియు అనివార్యమై నానుండి వెలువడునదే. దానిని చేయక నాకు తప్పదు. కనుక నేను బద్ధుడను......'దీనిని చేయుము' అని 'దీనినిపొందు' మని నేను బలాత్కృతుడ నగుచున్నాను. 'ఎందులకు' 'ఎందువలన' అను ప్రశ్నల కర్థ మేమి? [బాహ్యశక్తుల అధీనమున నుండుట] మీరు నీ రెందుకు త్రాగుదురు? మిమ్ము దాహము నిర్బంధించును కనుక. మీరు బానిసలు, స్వేచ్ఛచే మీ రెప్పుడును దేనిని చేయరు. అనగా, ప్రతిపనిని బలాత్కృతులై చేయుచున్నారు. మీరు చేసెడి ప్రతిపనికి ప్రేరకము ఏదో ఒక బలాత్కారము......

పృథివి, త న్నేదో బలాత్కరింపనిచో, తనంత తానుగా చలింపదు. దీప మేల వెలుగుచున్నది? ఎవరో ఒకరు వచ్చి, అగ్గిపుల్ల గీయకుండ తనంతట దీపము వెలుగదు. ప్రకృతి యంతటను ప్రతివస్తువును బద్ధమే. బానిసతనము! బానిసతనమే!! ప్రకృతితో పొత్తుకుదిరియుండుట బానిసతనమే. ప్రకృతికి బానిసలమై, బంగారుపంజరములో ఉండు ఉనికిలో విశేష మే మున్నది? స్వాతంత్ర్యమును దివ్యతయు మానవత్వసార మను జ్ఞానములోనే మహిమ్మధర్మమును క్రమమును ఉన్నవి. ఎందుకు ఎందువలన అను ప్రశ్నలు అజ్ఞానమువలననే వేయబడుచుండు నని మన కిప్పుడు తెలిసినది. ఒకదానిని చేయునట్లు నన్ను బలాత్కరించుట మఱొకదానిచేతనే శక్య మగును.

దేవుడు స్వతంత్రు డని మీ రందురు. అయినను దేవు డేల ప్రపంచమును సృజించె నని మీ రడుగుదురు. మీ వాక్యమును మీరే ఖండించుకొనుచున్నారు. పూర్తిగ నిరంకుశమైన

సంకల్పమే భగవంతు డను మాట కర్థము. ఈప్రశ్నకు తార్కిక రూప మిట్లుండును : ఎవరిచేతను బలాత్కరింపబడజాలని దేవుని ప్రపంచమును సృజింపు మని బలాత్కరించినదేది ? ఈప్రశ్నలోనే అతనిని బలాత్కరించిన దేది అని యడుగుచున్నారు. ఇది యర్థములేని ప్రశ్న. తనస్వరూపముచేతనే ఆత డనంతుడు; ముక్తుడు. తర్కయుక్తమగు భాషలో మీరు ప్రశ్నలు వేయ గలిగినప్పుడు మేము సమాధానము చెప్పగలము ? ఉన్న సత్య మొక్కటే అని, మ ఱేమియు లేదని యుక్తియే మీకు తెల్పును. ద్వైతవాదము వచ్చినప్పుడెల్ల అద్వైతము తలెత్తి దానిని తఱిమివేసినది.

ఈ విషయమును గ్రహించుటలో గల కష్ట మొక్కటే. పారమార్థికపరత దైనందినవిషయము, సహజవివేకము. సామాన్యమానవుడు, అతని భాషలో చెప్పినప్పు డది అర్థము చేసికొనగలడు. తత్త్వజ్ఞులభాషలో చెప్పిన గ్రహింపజాలడు. తన్ను తాను వెలికి విక్షేపించుకొనుట మానవప్రకృతికి సాధార ణమే. మీ బిడ్డతోడి మీ సానుభూతిని యోచింపుడు. మీరు బిడ్డతో తాదాత్మ్యము పొందుదురు. అప్పుడు మీకు దేహములు రెం డగును. అటులనే మీ పెనిమిటి మనసుగుండ మీరు భావాను భవము పొందగలరు. దీనికి పరిమితి యెక్కడ? అనంతసంఖ్యాక దేహములద్వారా మీరు భావానుభవము పొందగలరు.

మానవుడు ప్రకృతిని అనుదినము జయించుచున్నాడు. మానవజాతి తనశక్తిని ఆవిష్కరించుచున్నది. భావనచేత మానవునిలోని ఈ శక్తికి అవధి నేర్పఱుపుడు. సమష్టిగ మానవ జాతికి గల శక్తి యనంత మని, మానవదేహ మనంత మని మీ రంగీకరింతురు. నీ వెవ రనున దొక్కటే ప్రశ్న. నీవు జాతివా? లేక వ్యక్తివా? నిన్ను నీవు ప్రత్యేకించుకొంటివేని ప్రతిదియు నిన్ను బాధించుచుండును. మీరు (హృదయ) విశాలతచెంది,

యితరులతో సానుభూతి నొంద నారంభింపగానే మీకు సహాయ మేర్పడును. ప్రపంచమందలి అందఱిలోను అత్యధికదుఃఖి స్వార్థ పరుడే. ఎవనిలో స్వార్థపరత్వ మించుకేని లేదో అత డందఱ కన్న మిక్కిలి సుఖి. అతడు తానే సమస్తసృష్టిగ అయినాడు; సమస్తజాతిగ అయినాడు. దేవు డతనిలోపల నున్నాడు. ...... కనుక ద్వైతములో—క్రైస్తవమతములో, హిందూమతములో, అన్నిమతములలో నైతికసూత్రావళి ... యిది : "స్వప్రయోజన పరుడవు కాకుము ... నిస్స్వార్థుడవు కమ్ము. ఇతరులకై పనులు చేయుము! (హృదయ) వైశాల్య మొందుము!

ఈ విషయమున "తెలియనిమనుజుని సుఖముగ దెలుపం దగు సుఖతరముగఁ దెలుపఁగ వచ్చుఁ దెలిసినవానిన్, తెలిసియుఁ దెలియని నరుఁ దెల్ప బ్రహ్మదేవున" కైనను సాధ్యము కాదు. యథార్థ మే మనగా మీ యాత్మ మీలోని యితర భాగములకంటె వేఱుకానట్టే మీరు జగత్తునకంటె వేఱు కారు. ఇట్లు కాదేని మీరు దేనిని కన లేరు, అనుభవింప లేరు. భౌతిక పదార్థసాగరములో మన దేహములు చిన్న సుడిగుండములవంటివి. జీవితము ఒకమలుపు తిరుగుచు, మఱొకరూపములో సాగిపోవు చున్నది. ... సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, మీరు, నేను, వట్టి సుడిగుండములమే. నాది యని ఒకానొక మనస్సును నేను ఏల ఎన్నుకొంటిని? అది మానససాగరమున ఒక మానసికపు సుడిగుండమే.

ఇదియే నిజము కానిచో, నా మాటలు మీ కిప్పు డెట్లు అందుచున్నవి? కొలనులో రాయి విసరివేసినచో అందొక చలనము కలుగును. అది నీటిని చలింపజేయును. నేను నా మనస్సును ఆనందదశలో పడవేయుదును. దానికి మీ మనస్సు లలోకూడ అట్టి యనుభూతి కలిగించు ప్రవృత్తి కలదు. ఎన్ని మారులు మీరు మీ మనస్సులో, హృదయములో భావించు

కొన్న విషయము, మీరు చెప్పకయే యితరుల మనస్సులకు తెలిసిపోలేదు ? సర్వత్ర మన యొక్కటే. ...... మన కెన్నటికిని అర్థము కాకుండున దిదే. ఈ జగత్తంతయు స్థలకాలనిమిత్తముల చేత రూపొందినది. భగవంతు డీ విశ్వముగా కనబడుచున్నాడు. ... ప్రకృతి యెప్పుడు ప్రారంభ మయినది ? మీరు మీ యథార్థ స్వరూపమును మఱచిపోయి, స్థలకాలనిమిత్తములకు బద్ధులయి నప్పుడు.

ఇది మీ దేహముల పరిభ్రమణవృత్తము. మీ యనంత తత్త్వమును అదే. ... అది నిజముగా ప్రకృతియే — దేశము, కాలము, నిమిత్తము, ప్రకృతి కర్థము అంతే. మీ రాలోచన ఎప్పుడు ప్రారంభించితిరో కాల మప్పుడు ప్రారంభ మయినది, మీకు దేహ మెప్పుడు ప్రాప్తించినదో స్థల మప్పుడు ప్రారంభ మయినది; కానిచో స్థల మనునది యెచ్చటను ఉండజాలదు. మీ రెప్పుడు పరిచ్ఛిన్నుల రయితిరో అప్పుడు నిమిత్తము ప్రారంభ మయినది. ఏదో విధ మయిన సమాధానము మనకు కావలె. ఇదిగో, సమాధానము. మన పరిచ్ఛిన్నస్థితి క్రీడ. కేవలము వినోదము కొఱకే. మి మ్మేదియు బంధింపదు; ఏదియు నిర్బంధింపదు. మీ రెన్నడును బద్ధులుగ నుండ లేదు. మనమే కల్పించుకొన్న ఈ నాటకములో మన పాత్రల మనము అభినయించుచున్నాము.

మఱొకటైన వ్యక్తిత్వమును గుఱించిన ప్రశ్నను ప్రస్తావింతము. తమ వ్యక్తిత్వమును కోల్పోవుట యనిన కొందఱ కపారభయము. పంది, దేవుడు కాగలిగినచో వరాహవ్యక్తిత్వమును విడనాడుట మేలు కాదా ? మేలే. కాని, పాపము ! పంది అప్పు డట్లనుకొనదు. ఏ దశ నా వ్యక్తిత్వము ? నేను శిశువుగా దోగాడుచు, బొటనవ్రేలు నోటపెట్టుకొన యత్నించుచున్న దశయా ? ఆ వ్యక్తిత్వమును కోల్పోవుటకేనా నేను విచారింప

వలసినది? నేనిప్పుడు నా శైశవదశను తలచుకొని నవ్వుకొను చున్నట్లు ఇక ఏబదిసంవత్సరముల తరువాత నా ప్రస్తుతస్థితిని తలచుకొని నవ్వుకొందును. వీనిలో నేను నిలుపుకొనవలసిన వ్యక్తిత్వ మేది? ...

ఈ వ్యక్తిత్వ మన నేమో మనము తెలిసికోవలసియున్నది. ... పరస్పరవిరుద్ధములగు రెండు ప్రవృత్తులు గలవు. ఒకటి వ్యక్తిత్వమును కాపాడునది. మఱొకటి వ్యక్తిత్వమును విడువ వలె ననెడి తీవ్ర మగు కాంక్ష. ... శిశువు అవసరముకొఱకు తల్లి తన యిచ్ఛను పూర్తిగా వదలుకొనును. ... ఆమె బిడ్డ నెత్తు కొన్నప్పుడు వ్యక్తిత్వపు ప్రేరణయు, తన్ను కాపాడుకొనవలె నన్న ప్రేరణయు ఇక వినబడవు. తాను ఏ పనికిమాలిన ఆహారము నయినను తినును. కాని, ఆమె బిడ్డలకు శ్రేష్ఠమగు ఆహారమే పెట్టును. కనుక మనము ప్రేమించువా రందఱికొఱకు మనము చనిపోవుటకు సంసిద్ధులమై యున్నాము.

ఒకవైపు మన వ్యక్తిత్వమును నిలుపుకొనుటకు చాల పాటుపడుచున్నాము; వేఱొకవైపు దానిని నిర్మూలించుటకు ప్రయత్నించుచున్నాము. ఫలిత మే మగుచున్నది? టాం బ్రౌన్ శాయశక్తుల ప్రయత్నింప వచ్చును. అతడు తనవ్యక్తిత్వము కొఱకు పోరాడుచున్నాడు. అతడు మరణించును, భువిపై నెట్టి సంచలనమును ఎచ్చటను లేదు. పందొమ్మిదివందలవర్షములకు పూర్వము ఒక యూదు జన్మించెను. అతడు తనవ్యక్తిత్వమును కాపాడుకొనుట కించుకయైనను ప్రయత్నించి యెఱుగడు. ... ఆవిషయము యోచింపుడు! ఆ యూదు తన వ్యక్తిత్వమును కాపాడుకొనుట కెప్పుడును పాటుపడలేదు. కనుకనే అతడు సర్వ లోకోత్తరు డయినాడు. ప్రపంచము అర్థము చేసికొనలేకున్న విషయ మిదే.

సకాలములో మనము వ్యక్తిత్వమును పొందియే తీరవలె. ఏ అర్థములో? మానవుని వ్యక్తిత్వ మేది? 'టాంగ్రౌను' కాదు జీవునియందున్న దేవుడు. అదియే నిజమయిన వ్య త్వము. దానిని మానవు డెంతగా సమీపించిన అతడు తన యసత్య వ్యక్తిత్వము నంతగా విసర్జించిన వా డగును. అత డెంత యధిక ముగా ప్రతిదానిని సేకరించి తనదిగా చేసికొనునో అతని వ్యక్తిత్వ మంత తగ్గిపోవును. అతడు తన్ను గుఱించి ఎంత తక్కువగా తలచుకొనునో, తన జీవితములో వ్యక్తిత్వము నెంత యెక్కువగా త్యజించునో ... అత డంత యధికముగా వ్యక్తి యగును. లోకము అర్థము చేసికొనని రహస్య మి దొక్కటి. ...

వ్యక్తిత్వ మన నేమో మనము మొదట అర్థము చేసికొన వలె. లక్ష్యమును సాధించుటె వ్యక్తిత్వము. మీ రిప్పుడు పురుషులు, లేదా, స్త్రీలు. మీరు మార్పు చెందుచునే యుందురు. మార్పు నరికట్ట గలరా? మీ మనస్సు లిప్పు డె ట్లున్నవో అటులనే వానిని నిలుపుకొనవలె నని మీ యభిమతమా? —కోపములు, ద్వేషములు, అసూయలు, కలహములు, మనస్సులో గల ఈ వేయి విషయాలు ఇట్టే యుండ వలెనా? వానిని నిలుపుకొందు మందురా? ... సంపూర్ణ విజయము సాధించువఱకును, మీరు పరిశుద్ధులు, పరిపూర్ణులు అగువఱకును మీ రెక్కడను, ఆగిపోజాలరు.

మీరు ప్రేమైకస్వరూపులుగా, ఆనందైకస్వరూపులుగా, అనంతసత్స్వరూపులుగ అయిన తరువాత మీ కిక కోప ముండదు. ... మీ దేహములలో దేనిని నిలుపుకొందురు? అంతమే లేని జీవితమును అనంతజీవితమును పొందువఱకు మీ రెక్కడను ఆగి పోజాలరు. మీరు ఆగునది అక్కడ! మీ కిప్పుడు కొంచెము జ్ఞానము కలదు. ఇంకను జ్ఞానము పొందుటకు మీరు నిరంతరము ప్రయత్నించుచున్నారు. మీ రాగున దెక్కడ? మీరు జీవిత

ముతో నైక్య మొందునప్పుడే గాని, యీ లోపుగా ఎక్కడను ఆగరు. ...

అనేకులు కోరు గమ్యము సౌఖ్యము. ఆ సౌఖ్యముకొఱకు వా రింద్రియముల నాశ్రయింతురు. విశేషసౌఖ్యమును పడయ ప్రయత్నింపవలసినది దానికంటె పైస్థాయులలో. అటుపిమ్మట ఆధ్యాత్మికస్థాయులలో. దాని కనంతరము తనయందే — తనలో నున్న భగవంతుడు. ఎవనికి ప్రీతి వెలివస్తువుపై కలదో, ఆ బాహ్య వస్తువు పోవుటతో అతనికి దుఃఖము కలుగును. ఈ సౌఖ్యము కొఱకు మీరు ప్రపంచములోని యే వస్తువుపైని ఆధారపడుటయు పొసగదు. సర్వసౌఖ్యములు ఆత్మయందే ఉన్నచో ఆత్మను నే నెన్నడును కోల్పోజాలను కనుక అందు నా సౌఖ్యము ఎల్లప్పుడు నుండును.......తల్లియు, తండ్రియు, బిడ్డయు, భార్యయు, దేహమును, ధనమును — సర్వమును వినాశ్యము, ఆత్మ తప్ప....... ఆత్మానందము తప్ప. సర్వవాంఛలు ఆత్మయందే కలవు...... ఇదియే మార్పు చెందని వ్యక్తిత్వము. ఇది పరిపూర్ణమయినది.

......దానిని పొందు టెట్లు? ప్రపంచమందంతటను మహాత్ము లెల్లరు — మహాపురుషులు, మహిళామతల్లులు — తొణకక నేతినేతిమార్గాన దేనిని కనుగొనిరో దానిని పొందగలరు......ఇరువది దైవములను, ముప్పది దైవములను ప్రతిపాదించు ద్వైతవాదముల సంగతి ఎందుకు. ఈమతభేదాలవలన ఏమియు ఫరవా లేదు......వాని యన్నిటియందు నున్న సత్య మొక్కటే. ఈ భేదభ్రాంతి తొలగవలె ననుటే ఆ సత్యము.... కనుక ఈ యహంకారము ఎంత తక్కువగా నున్న నేను నా యథార్థస్వరూపమునకు జగచ్ఛరీరమునకంత సన్నిహితుడనుగా నుందును: నా ప్రత్యేకమనస్సునుగుఱించి నే నెంత తక్కువగా భావించిన, నేను విశ్వమనస్సునకంత సన్నిహితుడనుగా నుందును.

నా యాత్మను గుఱించి యెంత తక్కువగా తలపోసిన విశ్వాత్మకంత దగ్గఱగా నుందును.

మన మొక దేహములో నున్నాము. మనకు కొంత సుఖము, కొంత దుఃఖము కలుగును. ఈ దేహములో నివసించుట వలన కలుగు ఈ స్వల్పసౌఖ్యముకొఱకు మనలను కాపాడుకొనుట కని లోకములో దేని నయినను చంపుటకు సంసిద్ధపడుదుము. మనకు దేహములు రెం డున్న ఇంతకంటె చాల మేలు కాదా? అదే విధముగా ఆనందముకొఱకు సంఖ్యాతిగ దేహములు. ప్రతి జీవియందును ఉన్నవాడను నేను. అన్ని చేతులతోను పనిసేయు వాడను నేను. అన్ని పాదాలతోను సంచరించువాడను నేను. ప్రతినోటిద్వారా మాటాడునది నేను. ప్రతిదేహములోను ఉండు నది నేను. నా దేహము లనంతములు, నా మనస్సు లనంతములు. నాజరెత్తువాడగు జీసస్సులోను, బుద్ధునిలోను, మహమ్మదులోను నుండిన వాడను నేను. పూర్వమునందును, వర్తమానమునందును సాధుమహాత్ము లందఱిలో నుండెడివాడను నేను. ఇకముందు ప్రభవింపగలవా రెల్లరయందు నుండబోవువాడను నేను. ఇది వాదమా? కాదు, ఇది సత్యము.

ఈసత్యమును మీరు సాక్షాత్కారము చేసికొన గలిగితి రేని, నిరవధికమగు నిర్వృతి ఇంక నెంత కలుగును! ఎంతటి ఉద్రిక్తానందము! దేహమువలన మన కిక్కడ లభింపదగిన దెల్ల పొందుట కే యొక్క దేహ మంతటి గొప్పది?......ఇతరుల దేహము లన్నిటిలో నున్నతరువాత, ప్రపంచములోగల దేహములన్నిటిని అనుభవించినపిదప మన కేమి గలుగును? మన మనంతముతో నైక్య మొందుదుము. అదియే లక్ష్యము. అ దొక్కటే మార్గము. ఒకాయన, "నాకు సత్యము సాక్షాత్కరించిన నేను వెన్నవలె కరగిపోదును" అనెను. జను లట్లు కరగిపోవలె నని నాయాశ. కాని, వారు కఠినులు. అంత త్వరగా కరగిపోరు!

మనము ముక్తుల మగుట కేమి చేయ వలె? మీ రిప్పుడు ముక్తులే....ముక్తు లెప్పుడు గాని బద్ధు లెట్లు కాగలరు? అది యసత్యము. మీ రెన్నడును బద్ధులుగ నుండలేదు. అపరిచ్ఛిన్న మయిన దెప్పుడు దేనిచేత పరిచ్ఛిన్నము కాగలదు? అనంతమును అనంతముచేత భాగించినను, గుణించినను, అనంతమున కనంతము కలిపినను లబ్ధము, అనంత మే యగును. మీరనంతులు; భగవంతు డనంతుడు. మీ రెల్లరు అనంతులె. సత్తులు రెం డుండుట పొసగదు; 'ఏకం సత్' అనంతము నేనాటికిని సాంతముగ మార్ప శక్యము కాదు. మీ రేనాడును బద్ధులు కారు. ఇదియే విష యము. మీ రిప్పుడు ముక్తు లయియే యున్నారు. మీరు గమ్య మును చేరుకొని యున్నారు—చేరుకొనవలసినదానిని చేరుకొనియే యున్నారు. మీరు గమ్యమును చేరుకొనలే దన్న తలంపునకు మనస్సులో నెన్నడును చోటీయకుడు....

మనము దేనిని భావింతుమో అదిగా అగుదుము. మీరు నిర్భాగ్యపు పాపాత్ము లని అనుకొన్నచో మిమ్ము మీరు వంచించు కొన్నవా రగుదురు: "నేను ప్రాకులాడెడి నీచ క్రిమిని". నరకము నందు నమ్మకము గల వారు మరణించిన తరువాత నరకములోనే ఉందురు: స్వర్గమునకు పోవుదు మని చెప్పువారు స్వర్గమునకే పోవుదురు.

ఇదంతయు క్రీడ... "మన మే దేని చేయ వలె. మంచినే చేయుదము" అని మీ రన వచ్చును. కాని, మంచిచెడ్డ లెవరికి లక్ష్యము? అంతయు క్రీడ! సర్వశక్తుడగు దేవుడు క్రీడించు చున్నాడు. అంతే... క్రీడించుచున్న సర్వశక్తుడగు దేవుడవు నీవే. మీ రిందులో పాల్గొని భిక్షుక పాత్రధరింప దలచినచో, ఈ పాత్రనిర్ణయమునకు మీ రితరుల నెవరిని నిందింపరాదు. బిచ్చగాడుగ నుండి నీ వనుభవించుచుండునది ఆనందము. నీ యథార్థ తత్త్వము దివ్యత్వ మని నాకు తెలియును కదా. నీవు రాజవు.

అయినను భిక్షుకపాత్ర ధరించుచున్నావు. ...... ఇదంతయు వినోదము. ఇది తెలిసి, ఆడుము. అందలి విషయమంతయు నిదియే. తరువాత దానిని సాధన చేయుము. ఈ విశ్వమంతయు పెద్దక్రీడ. అంతయు వినోదమే కనుక అంతయు మంచిదే. అంతరిక్షములోని నక్షత్రము వచ్చి పృథివిని డీకొనును. మన మందఱము మరణింతుము. అదియును వినోదమే. మీ యింద్రియములను పరితృప్తి పఱచు అల్పవిషయములనే మీరు వినోదములుగా పరిగణింతురు!...

ఇక్కడ ఒక మంచిదేవుడు కల డని, తప్పు చేసినప్పుడు కనుపెట్టి నన్ను పట్టుకొనుట కక్కడ ఒకదుష్టదేవుడు కల డని మనకు చెప్పబడుచువచ్చెను. నేను పసిబాలుడనుగా నున్నప్పుడు దేవుడు సర్వమును కనుపెట్టి యుండు నని నా కెవరో చెప్పిరి. నేను నిద్రపోవుటకు ముందు గదికప్పువైపు చూచితిని. కప్పు తెఱచుకొను నని నే ననుకొంటిని. ఏమియు జరుగలేదు. మనలను మనమే గాని మఱెవ్వరును చూచుట లేదు. మన ఆత్మ కాక మఱొక దేవుడు లేడు; మన మనుభవించునది కాక వేఱు ప్రకృతి లేదు. అలవాటు స్వభావకల్పము. స్వభావమును అదియే. ప్రకృతిని గుఱించిన దంతయు నిదియే. నే నొక విషయమును రెండు మూడు పర్యాయములు వల్లింతును; అంతట అది నా స్వభావ మగును. దుఃఖింపకుడు! పశ్చాత్తాపపడకుడు! అయిన దేదో అయినది. మిమ్ము మీరే దహించుకొన్నచో ఫలిత మనుభవింపుడు.

... వివేకముతో వ్యవహరింపుడు. తప్పులు చేయుదుము; అంతమాత్రముచేత నేమి? అదంతయు వినోదమే. కొందఱు మునుపటి పాపములు తలచుకొని యేడ్తురు, మూలుగుదురు; ఏమేమో చేయుదురు. అంతటి వెఱ్ఱికి లోనగుదురు. మీరు పశ్చాత్తాపపడకుడు. పని చేసిన తరువాత దాని తలంపు మీకు వలదు. ముందుకు సాగిపొండి. ఆగ వలదు. వెనుకకు తిరిగి

చూడకుడు. వెనుకకు తిరిగిచూచుట వలన మీకు కలుగు లాభ మేమి? మీకు వచ్చు నష్టమును ఏమియు లేదు; లాభమును రాదు. వెన్నవలె మీరు కరగిపోరు. స్వర్గములు, నరకములు, అవతారములు అంతయు వెఱ్ఱి!

జనన మెవరికి? మరణ మెవరికి? మీరు లోకములతో క్రీడించుచు ఏమేమో చేయుచు వినోద మనుభవించుచున్నారు. మీ కిష్ట మున్నంతకాలము ఈ దేహము నుంచుకొనుడు. ఇష్టము లేనప్పుడు ఉంచుకొనకుడు. అనంతము సత్యము; సాంతము లీల. 'అనంత' 'సాంత' దేహముల ఏకీభావము మీరు. ఈ విషయము తెలిసికొనుడు! జ్ఞానమువలన కలుగు భేద మేమియును లేదు; ఆట సాగిపోవుచునే యుండును. ... రెండు మాటలు — ఆత్మ, దేహము ఒకదానికొకటి చేర్పబడినవి. సాక్షికజ్ఞానము కారణము. మీరు సర్వదా ముక్తులని తెలిసికొనుడు. జ్ఞానాగ్ని సమస్త మాలిన్యమును, పరిచ్ఛేదములను కాల్చివేయును. నే నా యనంతుడను. ...

మీ రాదిలో ఎంత ముక్తులో ఇప్పుడును అంత ముక్తులే. ఇకముం దెప్పుడును అంత ముక్తులే. ఎవరు తాము ముక్తుల మని తెలిసికొందురో వారు ముక్తులే; ఎవరు తాము బద్ధుల మనుకొం దురో వారు బద్ధులే.

దేవు డేమయి పోవును? ఉపాసన మున్నగున వన్నియు ఏమౌను? వాని స్థానము వానికి కలదు. నన్ను నేను దేవుని గాను, నేనుగాను విభజించుకొంటిని; నే నుపాస్యుడ నగుదును. నన్ను నే నుపాసించుకొందును. ఏల ఉపాసించుకోకూడదు? దేవుడు నేనే. నా ఆత్మ నేల ఉపాసించుకోకూడదు? లోకైకేశ్వరు డెవరో అతడే నా ఆత్మయు. అంతయు వినోదము. మఱొక ప్రయోజనమే లేదు.

జీవితలక్ష్యము, గమ్య మేమి? ఏమియు లేదు. ఏల యన నే ననంతుడ నని నాకు తెలియును. మీరు బిచ్చగాం డ్రయినచో మీకు ఉద్దేశము లుండును. నాకుద్దేశములు లేవు, కొదువ లేదు, కావలసిన ప్రయోజనము లేదు. నేను మీ దేశమునకు వత్తును, ఉపన్యసింతును. — కేవలము వినోదమునకే. మఱొక అభిప్రాయమే లేదు. ఏ యభిప్రాయ ముండ గలదు? బానిసలుమాత్రమే పరులకొఱకు పనులు చేయుదురు. మీరు చేయు పనులు వేఱెవరి కొఱకును గాదు. మీ కనుకూలముగా నున్నప్పుడు ఉపాసన చేయుదురు. మీరు క్రైస్తవులతోగాని, మహమ్మదీయులతోగాని, చైనావారితోగాని, జపానీయులతోగాని కలియ వచ్చును. మీ రితఃపూర్వ మున్న వేల్పులను, ఇకమీద రానున్న వేల్పులను అందఱిని ఉపాసింప వచ్చును. ...

నేను సూర్యునిలో నున్నాను. చంద్రునిలో నున్నాను. నక్షత్రములలో నున్నాను. నేను దేవునిలో నున్నాను. నే నందఱు దేవతలలో నున్నాను. నా ఆత్మను నే నుపాసింతును.

దీనికి రెండవపక్షముకూడ నున్నది. అది యింతవఱకు చెప్ప లేదు. ఉరితీయబడబోవువాడను నేనే. దుష్టు లందఱును నేనే. నరకములలో శిక్షల నందుచున్నది నేను. అదియును వినోదమే. నే ననంతుడ నని తెలిసికొనుటే తత్త్వజ్ఞానమునకు గమ్యము. ఉద్దేశములును, లక్ష్యములును, ప్రయోజనములును, విధులును అప్రధానములు. ...

ఈ సత్యము మొదట శ్రోతవ్యము, తరువాత మంతవ్యము. విచారింపుడు. సర్వవిధసాధనములతో తర్కింపుడు. జ్ఞానులకు తెలిసినదియు నింతకంటె హెచ్చేమియు కాదు. మీరు ప్రతి వస్తువునం దున్నా రనుట పరమార్థ మని తెలిసికొనుడు. కనుక నే పరుల నెవ్వరిని హింసింపకూడదు. ఏల యన వారిని హింసించుటచే మిమ్మే మీరు హింసించుకొనుచున్నారు. ... కడపటి

విషయము — సత్యము నిదిధ్యాసితవ్యము. మనసును దానిపై బెట్టుడు. సర్వమును నుగ్గై మట్టిపాలై పోయి, మీరు ఒక్కరే ఉండు కాల మెుకప్పుడు వచ్చు ననుటను భావింప గలరా? ఆ ఉద్రిక్తానందానుభవక్షణము మి మ్మెన్నాటికిని విడువదు. మీకు దేహములు లే వని వా స్తవముగా తెలిసికొందురు. దేహములు మీ కెప్పుడును లేవు.

కాలతత్త్వ మున్నంతవఱకు నే నొక్కడను. ఒంటరి గాడను. ఎవరిని చూచి నాకు భయము? అంతయు నా ఆత్మయే. ఈ యాశయమును నిరంతరము ధ్యానము చేయవలె. ధ్యానము వలన సాక్షాత్కారము కలుగును. సాక్షాత్కారముపొందుట వలననే మీ రితరులకు శుభంకరులు కాగలరు. ...

"సౌమ్యుడా, బ్రహ్మవేత్తవుగ కననగుచున్నావు". * అదియే గమ్యము. నేను బోధించుచున్నట్టు ఇది బోధింపవలసిన విషయము కాదు. "ఒక చెట్టుక్రింద నే నొక గురువును చూచితిని. అతడు పదునాఱు సంవత్సరముల బాలుడు; శిష్యు డెనుబది సంవత్సరముల వృద్ధుడు. మౌనమే గురుని వ్యాఖ్యానము, శిష్యులకా, సందేహము లన్నియు పటాపంచ లయిపోయెను". † మాటాడున దెవ్వరు? సూర్యుని చూచుటకు కొవ్వొత్తిని వెలిగించుకొనున దెవరు? సత్యము భాసించునప్పుడు ఏ సాక్ష్యము నవసరము లేదు. మీరే గుర్తింపగలరు. ... మీరు చేయబోవు నది అదియే. ... దానిని సాక్షాత్కారముచేసికొనుడు. ముందు దానిని గుఱించి మననము సేయుడు. తర్కింపుడు. మీ కుతూహలమును తీర్చుకొనుడు. తర్వాత మఱి దేని తలంపును వలదు. మన మెప్పుడు నేమియు చదివియుండ కూడ దనియే నా కోర్కె.

* ఛాందోగ్య. IV-IX-2.

† దక్షిణామూర్తి స్తోత్రము - 12.

దేవుడే మన అందఱకు సాయపడుగాక! విద్యార్థికు డేమయి పోవునో చూడుడు :

"ఈ విధముగా చెప్పబడినది. ఆ విధముగా చెప్పబడి నది.' ..

"మిత్రుడా, నీ వేమందు వోయి?"

"నేను చెప్పున దేమియు లేదు". అత డందఱి యభి ప్రాయముల నేకరువుపెట్టును; అతడు మాత్ర మేమియు ఆలో చింపడు. ఇదియే చదువు అయినచో, ఏది వెఱ్ఱి? గ్రంథకర్త లందఱను చూడుడు! ... ఈ యాధునిక రచయితలను. రెం డయినను వారి సొంతవాక్యము లుండవు! అన్నియు ఉదాహృతము లైన ఇతరుల మాటలే. ...

గ్రంథములకు విశేషమైన విలువ లేదు. ఇతరులనుండి మన మందిపుచ్చుకొన్న మతమునకు ఎట్టి విలువయు లేదు. మతానుభవము భోజనమువంటిది. మీ మతము నాకు సంతృప్తి కల్గింపదు. జీసస దేవుని జూచెను, బుద్ధుడు దేవుని జూచెను. దేవుని మీరు చూడనిపక్షమున మీరు నాస్తికులకంటె మెఱుగు కారు. నాస్తికు డూరకుండును. మీరు అధికముగ ప్రసంగించి మీ ప్రసంగముచేత లోకమును కలవరపెట్టుదురు. పుస్తకములు, బైబిలులు, మతగ్రంథములు నిష్ప్రయోజనములు. నేను బాలు డనుగా నున్నప్పు డొక వృద్ధుని కలసికొంటిని; అత డే మతగ్రంథ మును చదువ లేదు. కాని, స్పర్శమాత్రముచేతనే ఆయన దేవుని గుఱించిన సత్యమును సంక్రమింపచేసెడివాడు.

ఓ బోధకులారా, మౌనము వహింపుడు. ఓ గ్రంథము లారా, మిన్నకుండుడు. ఓ భగవంతుడా, నీ వొక్కడవే మాట్లా డుము. నీ సేవకుడు వినుచుండును. ... సత్యమే లేనియెడల ఈ జీవిత మెందుకు? మన మందఱము దాని నందుకొనగల మని

అనుకొనుచుందుము. కాని, అందుకొనము. మనలో చాలమందికి అందుబాటగునది దుమ్ము మాత్రమే. అందులో దేవుడు లేడు. దేవుడు లేకున్నచో జీవిత మేల? ఈ విశ్వములో నెక్కడయినను విశ్రాంతికి స్థాన మున్నదా? దానిని తెలిసికొనవలసినపని మనది; దానికొఱకు మనము తీవ్రముగా అన్వేషింపము. మనము ప్రవాహములో కొట్టుకొనిపోవు చిన్న గడ్డిపోచవంటివారము.

ఈ సత్యము ఉన్నచో, దేవుడున్నచో మనలోనే యుండవలె. ... "దేవుని నా కన్నులతో చూచితి" నని నేను చెప్పగల్గి యుండవలె. లేకున్న నాలో పారమార్థికపరత లేనట్లే. నమ్మకములును, సిద్ధాంతములును, ధర్మోపదేశములును పారమార్థికపరత కాదు. అనుభూతియు, సాక్షాత్కారమునే పారమార్థికపరత. లోకులచే ఆరాధితులగుచున్న వారిమహిమాతిశయ మేమి? దేవుడు అనగా వారికి సిద్ధాంతము కాదు. తమ తాత నమ్మిన కారణముచేత తాము నమ్మువారా వారు? కాదు. తమదేహములకంటె, మనస్సులకంటె, సర్వముకంటె పరుడైన అనంతుని సాక్షాత్కారమే వారి యాధిక్యమునకు కారణము. ఆ దేవుడీషన్మాత్రముగా ఇందు ప్రతిఫలించుచున్నాడు. కనుకనే, అంతవఱకే—ఈ ప్రపంచము సత్యము. సజ్జనుని మనము ప్రేమింతుము. ఏల యన అతని ముఖమునం దా ప్రతిఫలనము కొంచెము హెచ్చుగా ప్రకాశించును. మనమును దానిని అందుకొనవలె. మఱొక మార్గము లేదు.

అది గమ్యము. దానిని చేర శ్రమింపుడు! మీ బైబిలును మీ రుంచుకొండి. ఆ క్రీస్తును మీ రుంచుకొండి. లేనిచో మీరు పారమార్థికపరులు కారు. పారమార్థికతను గుఱించి మాటాడకుడు. జనులు మాటాడుచునే యుందురు. "వారిలో కొందఱు అంధకారములో మునిగియుండియు, హృద్గతాహంకారముచే వెలుగు తమయొద్ద నున్న దనుకొందురు. అంతమాత్రమే

కాదు. ఇతరులభారమునుకూడ తాము నిర్వహింపబూనుకొందురు. చివరకు వారును వీరును గోతిలో పడుదురు.''*

ఏ మతసంస్థయు తనంతట తాను ఉద్ధరింపలేదు. ఒకానొక మతసంస్థలో జన్మించుట మంచిదే. కాని, అందే మరణించుట శోచనీయము. రండి, దానినుండి బయటికి! ... మొదటి సోపానముగ అది మంచిదే. కాని, దానిని విడిచిపెట్టుడు! అది శైశవస్థాయి. ... ఒకప్రక్క దాని నుండ నిండు! ... దేవుని సూటిగా సమీపింపుడు. సిద్ధాంతములు అక్కఱ లేదు, సూత్రములు అక్కఱ లేదు. అప్పుడే అన్ని సందేహములు మాయ మగును. అప్పుడే అన్ని వంపులు చక్క నగును.

ఎవడు అనేకములమధ్య ఏకమును దర్శించునో, ఈ అనంత మృత్యుమధ్యమున ఏకచైతన్యమును కాంచునో, అనేకములమధ్య నిర్వికారముగ నున్నదానిని తన ఆత్మయందే సాక్షాత్కరించుకొనునో అతనికే శాశ్వతశాంతి.



* కఠ. 1-ii-5.

శ్రీ సీతారామ [illegible]

[illegible]

నిర్వాహకులు :— శ్రీ [illegible]

[illegible]



కలకత్తాలో శ్రీ వివేకానంద స్వామి 1901

# వి ష య సూ చి క

# కర్మయోగము



## శీలముపై కర్మప్రభావము

కర్మమనుపదము 'కృ' అను ధాతువునుండి నిష్పన్నమైనది; సమస్త వ్యాపారమును కర్మమే. కర్మమను శబ్దమునకు సాంకేతికముగా కర్మఫలమనియు నర్థము కలదు. తత్త్వశాస్త్రానుసారము ఈ శబ్దమునకు ఒక్కొక్కప్పుడు మన పూర్వకర్మముల ఫలితమని యర్థమగును. కాని కర్మయోగమున 'పని' అను అర్థము మాత్రము గలదిగా మనము కర్మశబ్దమును గొనవలెను. మానవజీవిత పరమావధి జ్ఞానము. ఏకైకలక్ష్యముగ ప్రాచ్యతత్త్వశాస్త్రము మనకు దెలుపునదదే. మానవజీవిత పరమావధి సుఖముకాదు, జ్ఞానము. సుఖస్థితులకు ఎడతెంపుగలదు. సుఖమే పరమావధి యనుకొనుట భ్రాంతి; మానవులు తమ యజ్ఞానముచే సుఖమును పరమప్రాప్య మనుకొనుటయే లోకమున తామనుభవించు దుఃఖముల కన్నిటికిని మూలకారణము. కొంతకాలము గడచినంతనే మానవుడు తన గమ్యము జ్ఞానమే కాని సుఖము కాదనియు, సుఖదుఃఖములు రెండును సమానముగా తనకు గుణపాఠములను గఱపుటలో గొప్పవనియు, మేలు తనకెంత ప్రబోధకమో కీడును అంత ప్రబోధకమే యనియు—గ్రహింప నారంభించును. సుఖదుఃఖము లాతని మానసఫలకమున భిన్నసంస్కారములను ముద్రించును; ఈ సంస్కారముల అన్నిటిఫలితమే మానవుని 'శీలము' అనబడుచున్నది. ఎవ్వని శీలమునైనను బరిశీలించినచో అది కేవల మాతని ప్రవణతల మొత్తమని, చిత్తవృత్తుల సముదాయమని వెల్లడియగును; ఆ శీలమును నిర్మిం

సుఖదుఃఖములు రెండును సమానము లని తెలియును. శీలనిర్మాణమున కర్తృత్వము మంచిచెడుగులకు రెంటికిని సమానము. కొన్ని యెడల సుఖముకంటె దుఃఖమే విశేషముగా లోకులకు జ్ఞానాంజనమగుచుండును. లోకశ్రేష్ఠుల శీలమును బరిశీలించినచో, అందు అధికసంఖ్యాకులకు సుఖముకంటె దుఃఖమే విశేష ప్రబోధకరమైనదని—సంపదలకంటె దారిద్ర్యమే జ్ఞానాంజనమైనదని — అభినుతులకంటె అభిఘాతములే నిగూఢతేజమును వెలువడజేసినవని నిశ్శంకముగా వక్కాణింతును.

ఇకను. ఈ జ్ఞానమో, మానవునిలోనే ఉన్నది; జ్ఞానము బాహ్యమునుండి కలుగుటలేదు. అది మానవుని లోపలనే ఉన్నది. మానవుడు "తెలిసికొనుచున్నాడు" అనుటకంటె వాస్తవమునకు "కనిపట్టుచున్నాడు" "మఱుగు తొలగించుచున్నాడు" అనుటే మన స్తత్త్వశాస్త్రోచితభాష యగును. ఇట్లే మానవుడు "నేర్చుకొనుట" అనగా నిజమునకు అతడు అఖండ జ్ఞాననిలయమగు తన యాత్మను గప్పియున్న అజ్ఞానావరణమును తొలగించుకొని "కనుగొనుటే". న్యూటను గురుత్వాకర్షణ శక్తిని (గ్రావిటేషను)ను కనిపట్టినాడని చెప్పుచుందుము. అది యాతనికొఱకు నిరీక్షించుచు ఒకమూల గూర్చుండియుండెనా? అది యాతని మానసముననే యుండెను; సమయము వచ్చినంతనే దాని నాతడు కనుగొనినాడు. లోక మింతవఱకు గ్రహించిన జ్ఞానమంతయు మానసమునుండియే కలుగుచున్నది; అనంతవిశ్వ భాండాగారము నీ మానసముననే యున్నది. మనస్సును పరిశీలించుకొందమను తలంపును నీకు స్ఫురింపజేయునది, పరిశీలించుకొను నవకాశము గూర్చునది బాహ్యప్రపంచము. కాని పరిశీలన విషయముమాత్ర మెప్పుడును నీ మానసమే. ఆపిలు పండు రాలుట న్యూటనున కొక సూచనకాగా, నాతడు తన మనస్సులో మును పున్న భావముల కొలుకుల నన్నిటిని వరుసగా మరల

నమర్చుకొనినంతనే ఆతనికి వానిలో నూతనముగు సమన్వయము పొడకట్టెను; దానినే మనము గురుత్వాకర్షణ నియమము (లా ఆఫ్ గ్రావిటేషన్) అనుచున్నాము. ఈ సమన్వయము ఆపిలుపండులో లేదు, భూగర్భమున దేనియందును లేదు. జ్ఞానమంతయు—వ్యావహారికముగాని, పారమార్థికముగాని- మానవుని మనసులోనే కలదు. పెక్కెడల నిది మఱుగువడి, కనుగొనబడకుండును; ఈ మఱుగు క్రమముగా తొలగింపబడునప్పుడు మనము "నేర్చుకొనుచున్నాము" అని చెప్పుదుము. మఱుగు ఎక్కువగ తొలగుకొలఁది జ్ఞాన మెక్కువగ కలుగుట. ఎవ్వనియందుండి ఈ కప్పడము తొలగింపబడుచుండునో ఆతఁడే జ్ఞానాభివృద్ధిగాంచుచుండు మానవుఁడు; ఎవ్వనిపై ఈ కప్పడము దట్టమైయుండునో ఆతఁడు అజ్ఞాని; ఎవ్వనిపైనుండి అది పూర్తిగా తొలగెనో ఆతఁడే సర్వజ్ఞుఁడు. సర్వజ్ఞులితఃపూర్వము వెలసియున్నారు. ముందును వెలయుగలరనియు భవిష్యద్యుగములందు అసంఖ్యాకులై యుండగలరనియు నా నమ్మకము. మానసమున జ్ఞానము ఱాతియందగ్నివలె నున్నది; దానిని స్ఫురింపజేయుటే వెలువడజేయు నొఱపిడి. ఇట్లే మనలనే మనము నెమ్మదిగా పరిశీలించి చూచుకొన్నచో పెక్కు అభిఘాతములు మనకు గలిగినప్పుడు మన కన్నీళ్లు, మనమందహాసములు, మనసంతోషములు, మనదుఃఖములు, మననవ్వులు, మనయేడ్పులు, మన యాశీర్వచనములు, మనశాపములు, మననుతులు మననిందలు—ఇవి అన్నియు మననుండి వెలువడినవే అని మనకు తెల్లమగును. వీనియన్నిటిఫలితమే మన ప్రస్తుతస్థితి; ఈ సంఘట్టనములే సాముదాయికముగా కర్మమనబడుచున్నవి. ఆత్మకు తగిలి, ఆత్మతేజమును వెలువరించునదియు ఆత్మకుగల శక్తిజ్ఞానముల గనుగొనజేయునదియునగు ప్రతి మానసిక భౌతికప్రహారమును కర్మయే. కర్మశబ్ద మిట అతి విపులార్థమున ప్రయుక్తమైనది. మన మిట్లు సదా కర్మమొనర్చుచున్నాము. నేను మీతో మాటలాడుచున్నాను: ఇది కర్మము.

మీరు వినుచున్నారు: అది కర్మము. మనము ఊపిరి పీల్చుచున్నాము: ఇది కర్మము. నడచుచున్నాము: ఇదియు కర్మమే. మన శారీరమానసిక వ్యాపారమంతయు కర్మమే; దానిముద్రలు మనయందు నిలిచియుండును.

కొన్నికర్మములు చిన్నచిన్నవగు ననేకకర్మముల మొత్తమై యుండును. సముద్రతీరమున నిలువబడి అలలతాకుడుచే గలుగు శబ్దమును వినునప్పు డది మహాఘోషగా దోచును; ఐనను అందలి ప్రతి తరంగమును లక్షలకొలది చిన్నచిన్న తరంగములచే రూపొందిన దని మన మెఱుగుదుము; ఆ చిన్నతరంగములలో ప్రతిదియు సద్దుచేయుచున్నను మనకది విననగుటలేదు; అవియన్నియు గలిసి మహాతరంగమైనపుడే మనము తరంగఘోషను వినుచున్నాము. ఇట్లే ప్రతిహృదయస్పందనమును కర్మమే: కొన్ని విధములగు కర్మములు మన అనుభవమును తాకును — విస్పష్టముగా గోచరించును; ఐన నవియు చిన్నచిన్నకర్మముల సముదాయమే. 'నీ వొకనిశీలమును నిజముగా నిర్ణయింపదలచినచో ఆత డొనర్చిన ఘనకార్యములను పరికింపకుము. ఎప్పుడో యొకప్పుడు ప్రతి మూర్ఖుడును మహావీరుడు కావచ్చును. చాల మామూలైన పనులను జేయునప్పుడు అతనిని కనుపెట్టుము. ఒకమహాపురుషుని నిజమగు స్వభావమును వెల్లడించునవి అట్టి సామాన్యకృత్యములే. ఉత్కృష్టసమయము లత్యల్పులను సైతము ఏదైన నొకవిధమగు ఘనతకెక్కించును; కాని యెవ్వని శీల మెల్లప్పుడును ఉదాత్తమై యుండునో — తా నెట్టి పరిస్థితులలోనున్నను ఒక్కవిధముగానే యుండునో — ఆతడే నిజముగా మహాపురుషుడు.

శీలముపై కర్మప్రభావము అద్వితీయము, మన మెదుర్కొనవలసిన అఖండ శక్తి అదే. విశ్వశక్తులన్నిటిని తనవైపునకు ఆకర్షించుకొను కేంద్రమే మానవుడని చెప్పవచ్చును; ఈ కేంద్రమున ఈ శక్తులనన్నిటి నాతడు ఏకమొనర్చి మరల మహాప్రవాహరూప

మున వానిని వెలువరించుచున్నాడు. ఇట్టి కేంద్రమే యథార్థ మానవుడు, సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు; ఇట్టి మానవుడు విశ్వము నంతను తనవైపున కాకర్షించుకొనుచున్నాడు ; మంచి, చెడుగు, సుఖము, దుఃఖము, సమస్తము ఆతనివైపునకు బరుగిడి యాతని నావరించుచున్నవి; అందుండి శీల మను మనోభావ మహాప్రవాహము నాతడు వెలువఱచుచున్నాడు. ఆతనికి సమస్తము నాకర్షించుకొనుశక్తి యున్న చందముననే వెలికి ద్రోయు శక్తియు గలదు.

లోకమున మనకు గోచరించు సమస్తచర్యలు, మానవ సంఘమందలి సమస్తోద్యమములు, మనచుట్టునున్న సమస్త వ్యాపారములును భావ ప్రదర్శకములు, మానవసంకల్పరూపములు. యంత్రములు, సాధనములు, నగరములు, ఓడలు, యుద్ధ నౌకలు, — అన్నియు కేవలము మానవసంకల్పస్వరూపములు. ఈ సంకల్పము శీలమునుండియు శీలము కర్మమునుండియు నేర్పడుచున్నవి. "బుద్ధిఃకర్మానుసారిణీ" యను నట్లు కర్మానుగుణమగు బుద్ధి గలుగుచుండును. ప్రపంచమున జనించిన సంకల్పబలాన్వితులెల్లరును మహాకార్యశూరులు — లోకమును తలక్రిందు చేయజాలిన యఖండ శక్తిమంతులు. యుగయుగములనుండి చేయుచున్న నిరంతరకృషిచే వారి కట్టిసంకల్పబలము చేకూరినది. బుద్ధుని సంకల్పశక్తిని జీససుసంకల్పశక్తిని బోలు మహాసంకల్పశక్తి ఒక్కజన్మమున లభింపజాలదు. మనకు వారితండ్రు లెవ్వరో తెలియునుగదా! విశ్వమానవకల్యాణమునకై వారితండ్రు లొక్కమాటనైనను పలికినట్లు కానరాదు. జీససుతండ్రియగు జోసఫు వంటి వడ్రంగులు లక్షలకొలది గతించినారు : లక్షలకొలది యింకను సజీవులైయున్నారు. బుద్ధుని తండ్రివంటి క్షుద్రరాజులు లక్షలకొలది ప్రపంచమున మనిరి. అతని ఆజ్ఞల నతని సేవకులే మన్నించెడివారు కారేమో! మహాసంకల్పశక్తి కేవల వంశపరంపరానుగతమే యగుచో ఆక్షుద్రరాజన్యుడు ప్రపంచార్ధభాగము చేపూజల

నందుకొను పుత్త్రరత్నమును బడయగల్గుటకు గల కారణమేమో చెప్పుడు. వడ్రంగికిని, కోట్లకొలదిజనులు భగవంతునిగా నారాధించు నాతని పుత్త్రునికిని గల అజగజాంతరమునకు మీరేమి కారణము చూపెదరు? పారంపర్యవాదము (హెరిడిటి) దీని కెట్టి సమాధానమును కాజాలదు. బుద్ధుడును జీససును లోకముపై ప్రసారించిన తమ మహిమ్నసంకల్పశక్తి యెచ్చటినుండి వచ్చినది? ఈ మహాశక్తిసంఘాతము ఎందుండి వెలువడినది? నిరంతరాభివృద్ధి నొందుచు తుదకు జీససుగుండనో బుద్ధునిగుండనో ఒక్కుమ్మడి సంఘముపై బడి నేటికిని ఆగుదల లేకున్న యీ శక్తి యుగయుగములనుండియు ప్రపంచమున నుండియే యుండవలయును.

ఇవన్నియు కర్మముచే నిర్ణయింపబడుచున్నవి; గడింపనిదే ఎవనికిని ఏదియు దక్కదు. ఇది శాశ్వతనియమము; మన మొక్కొక్కప్పు డిది అట్టిది కాదనుకొనుచుందుము. కాని సుదీర్ఘ కాలమున అందుంగూర్చిన నమ్మకము మనకు ధ్రువపడగలదు. సిరిసంపదల కొఱకై యావజ్జీవ మొకడు యాతనపడుగాక, అందులకై వేలకొలది జనులను మోసగించుగాక, కాని తుదకు తనకు ధనవంతుడగుట కర్హత లేదని గ్రహించును: జీవిత మంత నరకప్రాయమును, అసహ్యము నగును. మన శరీరసౌఖ్యమునకై వస్తునివహముల ప్రోగుచేసికొనుచుందుముగాక, కాని దేనిని మనము గడించితిమో అదియే మనకు దక్కును. ఎవ్వడేని మూర్ఖుడు ప్రపంచములోనున్న గ్రంథజాలమునంతను కొని తన భాండాగారమున నిడుకొనుగాక, కాని తన కే గ్రంథములను జదువుటకర్హత కలదో వానినే యాతడు చదువగల్గును; ఈ యర్హత కర్మముచే గలుగుచున్నది. మనము దేని కర్హులమో, దేనిని జీర్ణించుకొనగలమో మనకర్మమే నిర్ణయించును. మన ప్రస్తుతస్థితికి మనమే బాధ్యులము; ఏమి కాగోరుదుమో అదిగా అగుటకును మనకు శక్తి కలదు. మన వర్తమానస్థితి పూర్వకర్మముల ఫలితమైనచో మనము పొందగోరుస్థితి ప్రస్తుత కర్మల ఫలితముగా పొందనగునని

నిశ్చితమగుచున్నది. కావున ఎట్లు నడచుకోవలయునో మనము తెలిసికొనవలయును. "కర్మ మెట్లొనర్పవలయునో తెలిసికొనుట వలని ఫలమేమి ? లోకమున ప్రతివ్యక్తియు ఏదే నొక విధమున కర్మ మొనర్చుచునే యుండునుగదా" యని మీ రనవచ్చును. కాని మన శక్తిసామర్థ్యములు నిరర్థకములగుటయు కలదు. కౌశల ముతోడను శాస్త్రదృష్టితోడను కర్మ మొనర్చుటయే కర్మయోగ మని భగవద్గీత వెల్లడించును : ఒనర్పవలయు విధానమును దెలిసి కొన్నచో కర్మచే నిరతిశయమహాఫలముల బడయవచ్చును. మనస్సులో ముందే ఉన్న శక్తిని వెలికి దీసికొనివచ్చుటయే, ఆత్మను మేల్కొల్పుటయే, కర్మసర్వస్వమని మనము జ్ఞప్తి యుంచుకోవలయును. శక్తి ప్రతి మానవునియందును కలదు ; అట్లే జ్ఞానమును గలదు. వివిధ కర్మములు ఈ శక్తిని ఈ జ్ఞానమును వెలువడజేయుటకై —ఈభూతములను మేల్కొల్పుటకై వినియో గించు ఘాతములవంటివి.

వివిధ సంకల్పములతో — మానవుడు కర్మ మొనర్చును ; సంకల్పరహితమగు కర్మము ఉండనేరదు. కొందఱు ప్రఖ్యాతి నభిలషించి యందుకొఱకై కర్మ మొనర్తురు. కొందఱు ధనము కోరి యందులకై కర్మము చేయుదురు ; మఱికొందఱు అధికార వాంఛచే కర్మమాచరింతురు, ఇంక గొందఱు స్వర్గాభిలాషచే కర్మపరు లయ్యెదరు. మరణానంతరము తమ పేరు నిలువవలయు నని చైనాదేశస్థులవలె గొందఱు కోరుకొందురు ; మరణపర్యం తము అచట నెవ్వనికిని బిరుదములు లభింపవు. ఏమైనను మన పద్ధతికంటె అదియే మేలు. అచట నొక డేదేని ఘనకార్యము చేసినపక్షమున గౌరవచిహ్నముగా నొక బిరుదును వానితండ్రికో తాతకో గతించినవారికి ఒసగుదురు. కొంద ఱిందులకై కృషి చేయుదురు. కొన్ని మహమ్మదీయసంప్రదాయములందలి కొందఱు మరణానంతరము తమపేర నొక పెద్దగోరీ కట్టించుకొనుటకై యావజ్జీవము పాటుపడుచుందురు. బిడ్డ పుట్టినంతనే ఆ బిడ్డకొఱకై

గోరిని సిద్ధపఱచియుంచునట్టి కొన్ని సంప్రదాయములవారిని నే నెఱుగుదును; అది వారిలో అత్యంత ప్రధానకర్మము — గోరీ యెంత పెద్దదో, చక్కనిదో దానికిసంబంధించిన మానవు డంతటి ఉత్కృష్టుఁడుగా పరిగణింపబడును. కొందఱు తపశ్చర్యగా — ప్రాయశ్చిత్తముగా— నెంచి కర్మ మొనర్తురు: సకలవిధ దుష్కార్యములనుజేసి తుదకొక గుడి గట్టుదురు; లేదా పురోహితుల వలన స్వర్గగమనాధికారమును బొందుటకై వారికి లంచముగా ముడుపు లిత్తురు. తాము పాపపూర్ణులైయున్నను ఈ విధమైన దానము తమ్ము పునీతులను జేయుననియు, శిక్షలకు గుఱికాక తాము తప్పించుకొందుమనియు వారి యభిప్రాయము. కర్మాచరణమునకు బురికొల్పు సంకల్పములు కొన్ని ఈ విధముగా నున్నవి.

నిష్కామముగా కర్మ మొనర్పుము. నిష్కామ కర్మపరాయణులు, పేరుప్రఖ్యాతుల ఆశింపనివారు, స్వర్గలోకమునకు బోవుటనుగూడ వాంఛింపనివారు నగు మహనీయులు ప్రతిదేశము నందును గొంద ఱున్నారు. మేలుకలుగునను హేతువుచేతనే వారు కర్మ మొనర్తురు. ఇంతకంటెను ఉన్నతాశయములతో లోకకల్యాణమందలి అవ్యాజప్రేమచే, లోకహితాభిలాషచే, దీనులకు హిత మొనర్చుచు మానవకోటికి దోడ్పడు మహాత్ములు కొందఱున్నారు. సర్వసాధారణముగా, పేరు ప్రఖ్యాతులను కోరువారికి అవి వెంటనే సిద్ధింపవు. ముదుసలులమై కాటికి కాళ్లు జాచుకొనియున్నప్పుడు అవి లభించును. స్వార్థరహితముగా మానవుడు కర్మ మొనర్చినయెడల దానివలన నాతని కెట్టిలాభమును లేదా? ఉన్నది, మహోన్నతలాభము ఉన్నది. స్వార్థరాహిత్యమే విశేష లాభదాయకము: కాని దాని నలవఱచుకొనునంతటి ఓరిమి జనులకు లేదు. ఆరోగ్యమునుబట్టి చూచినను అది విశేష లాభదాయకమే. ప్రేమ, సత్యము, స్వార్థరాహిత్యము అనునవి మనకు మహోన్నతాదర్శములే కాని, కేవలము నైతిక భాషాలంకారములు కావు; ఏలన ఈ యాదర్శములం దంతటి

శక్తి రూపొందియున్నది. ముఖ్య విషయము, ఎట్టి స్వార్థమును మనసులో నిడుకొనక భవిష్యత్తును—స్వర్గమును—నరకమును—మఱియు నట్టివానిని వేనినిగూర్చియు యోచింపక, ఐదుదినములు, కానిచో ఐదునిమిషములు కర్మ మొనర్పగల్గినవానిలో నైతిక మహాపురుషుడుగ కాగల శక్తి యున్నది. ఇది కష్టసాధ్యమే; కాని దీని విలువయు, దీనివలన గలుగు ప్రయోజనమును మన యంతరంగమున మనకు దెలియును. మహత్తరమైన యీ నిగ్రహముగ రూపొందునది అఖండశక్తియే. బాహ్యవ్యాపారము లన్నిటి యందు కననగు శక్తికంటెను ఆత్మనిగ్రహములో కననగు శక్తి అత్యధికతరము. నాలుగు గుఱ్ఱములబండి యెట్టి నిరోధమును లేక కొండమీదనుండి మహావేగముతో క్రిందికి వచ్చును, లేదా బండివాడు ఆ గుఱ్ఱములను నిరోధించును. యథేచ్ఛముగా గుఱ్ఱములను పోనిచ్చుటలోనా, వానిని నిగ్రహించుటలోనా—వీనిలో దేనిలో కననగు శక్తి ఎక్కువ? ఫిరంగిగుండు మహావేగమున వాయుమార్గమున పోయిపోయి దూరమున నెచ్చటనో పడును. మఱియొకటి మార్గమధ్యమున నే గోడకో కొట్టుకొని, అచట నిలిచిపోవును; ఆ దెబ్బకచట అమితమైన వేడిమి పుట్టును. స్వార్థసాధనకై వెలికి ప్రసారితమగు శక్తి అంతయు వ్యర్థమగుచున్నది. అట్టివ్యాపారము, నీయందుండి వెలువడు శక్తిని మరల నీవంకకు మరల్పజాలదు; కాని శక్తిని వెలికి పాఱనీక నిగ్రహించినచో నీకది బలాభివృద్ధికరమగును. క్రమమున నిట్టి యాత్మనిగ్రహము సాటిలేని సంకల్పశక్తిని, ఏ క్రైస్తునో బుద్ధునో రూపొందించు శీలము నుద్భవింపజేయును. మూర్ఖులీ రహస్యము నెఱుగరు, కాని మానవకోటినంతను పాలింపగోరుదురు. మూర్ఖుడైనను పాటుపడి వేచియుండగల్గుచో ప్రపంచమునంతను బరిపాలింపవచ్చును. అతని గొన్ని సంవత్సరములవఱకు వేచియుండనిండు; పాలింపవలయు నను ఆ మూర్ఖాభిప్రాయమును నిగ్రహించుకొనిండు; ఆ యభిప్రాయము పూర్తిగా తొలగినంతనే

లోకమున నాతడు అఖండశక్తిసంపన్నుడగును. కొన్ని జంతువులు కొన్ని యడుగులకు ఆవల చూడజాలనియట్లే మనలో ననేకులము కొన్ని సంవత్సరముల కవ్వల పరిణమించు సంఘటనములను జూడ జాలకున్నాము. సంకుచితమైన చిన్నవలయమే మనలోకము. దీని కవ్వల మనదృష్టిని ప్రసరింపజేయుటకు వలయు తాలిమి మనయొద్ద లేకుండుటచే అవినీతిపరులము, దుర్జనులము అగు చున్నాము. ఇది మన బలహీనత, శక్తిహీనత.

అత్యంతనీచకర్మములను సైతము నిరసింపరాదు. విశేష జ్ఞానవంతుడు కానివానిని స్వప్రయోజనమునకై, పేరుప్రఖ్యాతుల కొఱకై ప్రవర్తింపనిండు; కాని ప్రతిమానవుడును క్రమముగా ఉన్నతాశయములను బొందుటకై, ఉన్నతాశయములను గ్రహించుటకై సదా యత్నించుచుండవలయును.

"కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన*—కర్మ మొనర్చుటకు మాత్రమే కాని కర్మఫలములకు నీ వధికారివి కావు." కర్మఫలముల నటుండ నిమ్ము. కర్మఫలములను నీవు లక్షింపనేల? నీ వొకనికి సాయ మొనర్పగోరితివేని ఆతనికి నీయెడ నెట్టివైఖరి ఉండవలయునను విషయమునుగూర్చి యెన్నడును ఆలోచింపకుము. నీవొక సత్కార్యమునో ఘనకార్యమునో చేయగోరినయెడల దాని కెట్టిఫలము గలుగునో యను చింత నీకు వలదు.

ఈ కర్మాదర్శవిమర్శనమున నొక గడ్డుప్రశ్న తలెత్తు చున్నది. తీవ్రకర్మాచరణము ఆవశ్యకము; సదా మనము కర్మము నాచరింపవలయును. కర్మ మొనర్పనిదే నిముసమైనను మనము జీవింపజాలము.† అట్టిచో విశ్రాంతియో? జీవితయుద్ధమున

* భగవద్గీత, 2-47.

† "నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠ త్యకర్మకృత్"

—భగవద్గీత, 3-5.

నొకవైపున నున్నది కర్మము—కర్మ మను నీ సుడిగుండములో మన మందఱము దిర్దిర మహావేగముతో త్రిప్పబడుచున్నాము: మఱియొకవంక ప్రశాంతము, ఏకాంతము నగు సర్వసంగపరిత్యాగము భాసించుచున్నది. ప్రశాంతి రాజ్యమేలుచుండ సందడియు ఆడంబరము నట నుండనేరవు; తనమృగములతో, పూవులతో, పర్వతములతో నట నుండునది ప్రకృతి మాత్రమే. జీవితదృశ్యములగు నీ రెంటిలో నేదియు సమగ్రమైనది కాదు. అగాధసముద్రజలమున నుండు చేపను పైకి దీసికొనివచ్చినంతనే అది తన్ను పరిరక్షించుచున్న నీటియొత్తిడి తొలగుటచే ముక్కముక్కలై పోవురీతిని, ఏకాంతవాసమున కలవడినవానిని పొటెక్కిన ప్రపంచమహావర్తములోనికి దీసికొనివచ్చినయెడల అం దాతడు అణగిపోవును. గడబిడలతోడి వేగముతోడి జీవితమున కలవడిన వాడు ప్రశాంతినిలయమగు తావునకు వచ్చెనేని మనస్సమాధానము నందగలడా? కలవరపడి యాతడొకవేళ మనోవైకల్యము నొందవచ్చును. ఏకాంతవాసమున, అఖండమౌనమున నెవ్వడు తీవ్రకర్మపరత్వమును గాంచునో, తీవ్రకర్మపరత్వమున నెవ్వడు ఎడారియందు గాననగు నిశ్శబ్దతను ఏకాంతతను గాంచునో వాడే ఆదర్శపురుషుడు. ఆత్మనిగ్రహరహస్యము నాతడు గ్రహించినాడు, తన్ను అదుపులో ఉంచుకొన్నాడు. బండ్ల బాటసారుల రాకపోకలచే అత్యంతసంకులమగు మహానగరవీథులలో నాతడు సంచరించుచుండునపుడు నిశ్శబ్దమగు గుహాంతరాళమున నుండెనో యనునట్టు లాతనిమానసము ప్రశాంతినిలయమై యుండును; ఐన నాతడు తీవ్రకర్మాచరణపరుడుగనే యుండును. అదే కర్మయోగాదర్శము. ఈ స్థితిని పొందినచో నిజముగా నీవు కర్మరహస్యమును గ్రహించినట్లే.

కాని ప్రాప్తకార్యముల నొనర్చుచు స్వార్థరాహిత్యమున దినదినాభివృద్ధి గాంచుచు ప్రారంభస్థితినుండియు మనము కర్మ

యోగమును మొట్టమొదటినుండి తొడంగవలయును. మనము కర్మ మొనర్పవలయును, కర్మాచరణమునకు మనలను బురికొల్పుచున్న శక్తి ఏదో గమనింపవలయును; ప్రారంభమున గొన్ని సంవత్సరములవఱకు కర్మల నాచరింప మనల ప్రేరించునది తప్పక స్వార్థమే అని గ్రహింతుము; ఐనను పూనికచే క్రమముగా ఈ స్వార్థపరత్వము క్షయింప తుదకు నిక్కముగా స్వార్థరహిత కర్మ మొనర్పగల్గునట్టి సమయము వచ్చితీఱును. జీవితగహనములలో ముందున కేగుచుండు మనము పూర్తిగా స్వార్థరహితుల మగు దిన మెప్పుడో ఒకనాడు వచ్చునని మన మందఱము ఆశింపవచ్చును; ఈ స్థితిని ప్రాపించినంతనే మనశక్తులన్నియు ఏకాగ్రత నొందును; సహజజ్ఞానము వ్యక్తమగును.

## "ఎవని స్థానమున వాడు గొప్ప"

సాంఖ్యదర్శనము ననుసరించి ప్రకృతియందు మూడుశక్తు లున్నవి. సంస్కృతభాషలో వానికి సత్త్వ రజ స్తమస్సు లని పేరు. భౌతికప్రపంచమున నవి వ్యక్తమగు విధము ననుసరించి వానిని సమత, సవ్యాపారత, జడత అని చెప్పవచ్చును. అంధ కారము (లేదా నిర్వ్యాపారత) తమోలక్షణము; రాగద్వేష రూపమున వ్యక్తమగు సవ్యాపారస్థితి రజోలక్షణము, సవ్యాపారతా నిర్వ్యాపారతల సామ్యావస్థ సత్త్వలక్షణము.

ఈ మూడుశక్తులును ప్రతిమానవునియందును గలవు. ఒకప్పుడు తమస్సు ప్రబలమై యుండును; అంతట మనము సోమరుల మగుదుము, కదలలేకుందుము; ఏవో కొన్ని మనోభావ ములచేతనో స్తబ్ధతచేతనో బద్ధులమై యుందుము. మఱికొన్ని వేళల వ్యాపారపరతయు ఇంకను గొన్ని వేళల నీ రెండింటి ప్రశాంత సామ్యావస్థయు ప్రాబల్యము నొంది యుండును. మఱియు, విభిన్నమానవులందు ఈ శక్తులలో నేదియో యొకటి సాధారణ ముగా ప్రకోపించియుండును. నిర్వ్యాపారత, మొద్దుతనము, సోమరితనము ఒకానొకనిలక్షణముగను, కార్యపరత, శక్తి—మఱి యొకనిలక్షణముగను, కర్మాకర్మములు సామ్యస్థితినొందియుండుటచే గలుగు సాధుత్వమును ప్రశాంతతయు మాధుర్యమును వేఱొకని స్వభావముగను నుండవచ్చును. జంతువులలో నేమి, వృక్షము లలో నేమి, మనుష్యులలో నేమి — సమస్తసృష్టియందును వివిధములగు నీ శక్తు లించుమించొక ఆదర్శరీతిని వ్యక్తమగు చుండును.

కర్మయోగమునకు ఈ మూడును ముఖ్యములు. ఈ శక్తు లెట్టివో, వాని నెట్లు వినియోగించుకొనవలయునో బోధించుటచే

కర్మములను మనము మేలైనరీతి నొనర్చుటకై కర్మయోగము మనకు దోడ్పడును. మానవసంఘము వివిధాంతరువులతో గూడిన వ్యవస్థ. నీతినిగూర్చి మనకందఱకును దెలియును, విధులను గూర్చియు దెలియును; కాని భిన్నదేశములలో నీప్రాముఖ్యము మిక్కిలి భిన్నముగా నుండును. ఒకదేశములో నేది నీతిగ పరిగణింపబడునో అదియే మఱియొక దేశములో అవినీతిగ పరిగణింపబడవచ్చును. వివాహవిషయమున నొకదేశములో మేనరిక మంగీకరింపబడుచుండ మఱియొక దేశమున నది కేవల మధర్మముగా పరిగణింపబడుచున్నది; ఒకదేశపు జనులు తమ మఱదండ్రను పెండ్లియాడవచ్చును; మఱియొకదేశమున నది నీతిబాహ్యము. ఒకదేశమున జనులొక్కసారిమాత్రమే వివాహ మాడనగును, మఱియొకదేశమున ననేకపర్యాయములు పెండ్లి చేసికొనవచ్చును—నీతినియమము లీవిధముగా నున్నవి. ఇట్లే నైతికరంగమున అన్ని ఇతర శాఖలలోను ప్రమాణము విశేష ముగా భేదిల్లుచుండును. ఐనను నీతివిషయమున విశ్వమునకంతటికి నొక్కటే మానము ఉండవలయునను ఆశయము మన కున్నది.

విహితవిధులవిషయముకూడ నిట్టిదే. విధులనుగూర్చిన ఆశయము వివిధదేశీయులలో విశేషించి భేదిల్లుచుండును: ఒక దేశమున నొకడు కొన్నికార్యములు చేయనియెడల జను లాత డధర్మముగా బ్రవర్తించె నందురు; ఆ కార్యములనే మఱియొక దేశమున నాతడు చేసినయెడల జను లాతడు ధర్మమార్గమున వర్తింపలే దందురు; ఐనను విహితవిధులనుగూర్చి విశ్వజనీనమైన ఆశయ ముండవలయునని మనకు దెలియును. ఇదేవిధమున సంఘములో గొందఱు కొన్నికర్మములు తమకు విధ్యుక్తములని భావించుచుండ మఱికొందఱు అందులకు కేవలవ్యతిరిక్తముగా దలచుచు, ఆ కర్మములను జేయవలసివచ్చుచో గడగడలాడి పోదురు. మన కి విషయమై రెండుమార్గములున్నవి,—పరమార్థ

మున కొక్కమార్గమే కలదనియు తదితరములన్నియు అక్రమము లనియు భావించు మూర్ఖులవిధాన మొకటి,—మన మనఃప్రకృతి ననుసరించి లేక మన మున్న వివిధస్థాయుల ననుసరించి విధులు నీతులు మాఱుచుండవచ్చునని యంగీకరించు ధీమంతులవిధానము మఱియొకటి. విధులలో—నీతులలో—వివిధాంతరువులు గలవనియు జీవితమున నొకస్థితికిగాని, కొన్ని పరిస్థితులకుగాని అనువర్తించు నీతినియమములు తదితరమున కనువర్తింపవనియు అనువర్తింప జాలవనియు గ్రహించుటయే ఇందలి ముఖ్యవిషయము.

ఇందుల కొక యుదాహరణము :—మహాచార్యులందఱును "అపకారమును ప్రతిఘటింపకు" మనియు, "ప్రతిఘటింపకుండుటే అత్యున్నతమగు నైతికాదర్శ" మనియు బోధించియున్నారు. మనలో గొందఱు ఈ సూత్రమును పూర్తిగా అమలులోపెట్ట యత్నించిరేని 'సంఘ'మను భవనము ఛేదిలికూలుననియు దుర్మార్గులు మనఆస్తులను ప్రాణములనుగూడ హరింతురనియు తమకు తోచిన ట్లెల్ల మనతో ప్రవర్తింతురనియు మన మెఱుగుదుము. అట్టి యప్రతిఘటనమును ఒక్కదిన మాచరించినప్పటికిని విపత్తు వాటిల్లును. ఐనను "అపకారమును ప్రతిఘటింపకుము" అను బోధనయందలి సత్యమును సహజావబోధముచే మన యంతరంగ మున మన మెఱుగుదుము. ఇది మహోన్నతాదర్శముగా మనకు గాన్పించును; ఐనను ఈ సిద్ధాంతమునుమాత్రమే బోధించినచో మానవకోటిలో విశేషభాగమును నిరసించినవార మగుదుము. అంతేకాదు. సదా తాము చేయుచున్నది అధర్మమని గణుతింప జేసి లోకులకు కార్యాచరణమున మనోవ్యథ గల్గించుటయు సిద్ధించును; దానిచే వారికి మనోదౌర్బల్యము సంభవించును. మఱియు నిరంతరమగు నిట్టి యాత్మనిరసనము తక్కిన దౌర్బల్యములకంటెను విశేషమగు దౌర్జన్యమునకు హేతువగును. తన్ను తాను ద్వేషించుకొన నారంభించినవానికి పతనద్వారము ఈవఱకే తెఱవబడియున్నది; దేశమువిషయముకూడ నిట్టిదే.

మనలను మనము ద్వేషించుకొనకుండుటయే మన ప్రథమ ధర్మము. ఏలన, అభివృద్ధినొందుటకు మొదట మనయందును తరువాత భగవంతునియందును విశ్వాసము గలిగియుండవలయును. ఆత్మవిశ్వాసము లేనివానికి భగవంతునియందు విశ్వాసము గలుగుట కలలోనివార్త. స్థితియు ధర్మమును వివిధపరిస్థితుల కనుగుణముగ భేదిల్లుచుండునని గుర్తింపక తప్పదు. చెడుగును ప్రతిఘటించుట తనంతట దోషము కాదు, సర్వత్ర అది దోషము కాదు. పరిస్థితుల కనుగుణముగ చెడుగును ప్రతిఘటించుట మానవునకు ధర్మముగగూడ నేర్పడవచ్చు.

ప్రతిఘటింపకుండుట అత్యున్నత ప్రేమాదర్శమని పేర్కొనుచు అర్జునుడు యుద్ధరంగమున దన ప్రతిపక్షులు తనకు బంధువులు, మిత్రులు నగుటచే యుద్ధమొనర్ప నిరాకరించినందులకై శ్రీకృష్ణుడాతని కపటి యనియు, పిఱికివాడనియు భగవద్గీత యందలి రెండవ యధ్యాయమున బలికియున్నాడు. భగవద్గీతలో ఈ యధ్యాయమును జదివి పాశ్చాత్యులగు మీలో ననేకు లాశ్చర్యపడియుండవచ్చును. సర్వవిషయములందును విపరీత పరమావధులు (ఎక్స్ట్రీమ్స్) ఒకదానినొకటి పోలియుండును. అత్యంతమైన అన్వయస్థితియు అత్యంతమైన వ్యతిరేకస్థితియు నొక్కవిధముగానే ఉన్నట్లు తోచును; ఇది మన మందఱము గ్రహింపవలసిన గొప్ప గుణపాఠము; తేజఃస్పందనములు అత్యంత మందముగా నున్నప్పుడు మనము వానిని గనజాలము, అత్యంత వేగముగల్గియున్నను గనజాలము. శబ్దమువిషయముకూడ నిట్టిదే; మిక్కిలి తక్కువస్థాయిలో నున్నప్పుడు దానిని మనము వినజాలము; మిక్కిలి హెచ్చుస్థాయిలో నున్నప్పుడును వినజాలము. ప్రతిఘటనమునకును అప్రతిఘటనమునకును గల భేదము నిట్టిదే. బలహీనుడగుటచే, సోమరితనముచే, ప్రతిఘటింపజాలక యొకడు ప్రతిఘటింపడు. అతడు ప్రతిఘటింపకుండుట ఇష్టములేక కాదు,

శక్తి లేకయే. మఱియొకడు తాను కోరినచో ఎదిరింపరాని దెబ్బ కొట్టుటకు సమర్థుడనని యెఱుగును; ఐన నాతడు కొట్టకుండుటయే గాక తన శత్రువుల నాశీర్వదించును. దౌర్బల్యముచే ప్రతిఘటింప కుండువాడు పాపము చేయుచున్నాడు, కావున తాను ప్రతిఘటింప కుండుటవలన నెట్టి మేలును బొందజాలడు. ఇక రెండవవాడో, ప్రతిఘటించునేని పాపమున కొడిగట్టినవాడగును. బుద్ధుడు సింహాసనమును విడనాడెను, చక్రవర్తిపదవిని త్యజించెను; అట్టిది యథార్థత్యాగము. కాని త్యజించుట కేమియులేని బిచ్చగాని విషయమున త్యాగ మను మాటకే అవకాశము లేదు. కాబట్టి యీ యప్రతిఘటనమును గూర్చియు ఆదర్శప్రేమను గూర్చియు ప్రసంగించునప్పుడెల్ల నిజముగా మన యాశయమేమో అందుం గూర్చి మెలకువ వహింపవలయును. కావున ప్రతిఘటించు శక్తి మనకున్నదా లేదా అను విషయమును మనము మొదట జాగ్రత్తతో గ్రహింపవలయును. శక్తి కలిగియుండియు దానిని త్యజించి మనము ప్రతిఘటింపకుండునెడల ప్రేమపూర్ణమగు ఘనకార్యము నొనర్చినవారల మగుదుము; కాని ప్రతిఘటించు శక్తి లేక, మహోన్నతప్రేమోద్దేశములచే ప్రేరితులమగుచున్నామని ఆత్మ వంచన చేసికొన యత్నింతుమేని, చెప్పినదానికి వ్యతిరిక్తముగ ప్రవర్తించినవార మగుదుము. అర్జునుడు యుద్ధరంగమున దన్నెదిర్చియున్న మహాసైన్యవ్యూహమును జూచి పిఱికివాడయ్యెను; దేశమునెడను రాజునెడను ఆతని విధ్యుక్తధర్మము నాతని "ప్రేమ" మఱపించెను. శ్రీకృష్ణు డాతని కపటి యనుట కిదియే కారణము :—

"ప్రజ్ఞావాదములు భాషించుచున్నావు కాని నీ చేతలు నీ పిఱికితనమును చూపుచున్నవి. కావున లెమ్ము, పోరాడుము".*

* భగవద్గీత, 2-3, 11.

ఇదే కర్మయోగహృదయము. అప్రతిఘటనమే మహోన్నతాదర్శమని యెఱిగినవాడు, అప్రతిఘటనము మహోన్నత సత్త్వావిష్కరణమనియు, చెడుగును ప్రతిఘటించుట అప్రతిఘటన మనెడి ఆ మహోన్నత సత్త్వావిష్కృతికి అందించు మెట్టు అనియు ఎఱిగినవాడు కర్మయోగి. ఈ మహోన్నతాదర్శమును ప్రాపించుటకు మునుపటిదశలో చెడుగును బ్రతిఘటించుటే మానవుని కర్తవ్యము; అందులకై యాతని పాటుపడనిండు, పోరాడనిండు; భుజమెత్తి సూటిగా ప్రహరింపనిండు. ప్రతిఘటింపగల శక్తిని గడించిన పిమ్మటనే, అప్రతిఘటనము గుణమగును.

మా దేశమున నే నొకప్పు డొకనిని కలిసికొంటిని. ఆతడు జిజ్ఞాస యనునది లవలేశమును లేని కేవలపశుప్రాయుడనియు, మందుడనియు, అవివేకియనియు అంతకుముందే నాకు దెలియును. "భగవంతుని దెలిసికొనుటకు నే నేమిచేయవలయు? ముక్తి నాకెట్లు లభింపగలదు" అని ఆతడు న న్నడిగినాడు. "అసత్యము చెప్పగలవా?" అని నే నాతనిని బ్రశ్నించితిని. "నాచేతగాదు" అని యాతడు సమాధానము చెప్పెను. "ఐనపక్షమున అసత్యము చెప్పుట నీవు నేర్చుకొనవలయును. ఎవ్వడైనను కేవలపశు ప్రాయుడుగనో కాష్ఠప్రాయుడుగనో యుండుటకంటె అసత్యము చెప్పువాడుగ నుండుట మేలు. నీవు వట్టి మందుడవు; నిర్మలము, ప్రశాంతము, నిష్క్రియమునగు మహోన్నతస్థితిని పొందినవాడవు కానే కావు; ఏదేని దుష్కార్యమును జేయుటకుగూడ శక్తి చాల నంతటి మందుడవు నీవు." ఇది యాతనికి నేను చేసిన హితబోధ. అది యత్యంతము అసాధారణ సందర్భమనుట నిజము; నే నాతనితో నన్నవి పరిహాసవాక్కులు. కాని రాజసికస్థితినుండి ప్రశాంతినిలయమగు సంపూర్ణ సాత్త్వికస్థితిని బొందుటకై మానవుడు కర్మమార్గమున పురోగమింపవలెననియే నా తాత్పర్యము.

అలసతను, సర్వవిధములను తొలగించుకొనవలయును. ఎప్పుడుకాని కార్యపరత్వమనగా ప్రతిఘటనమే. సర్వవిధములగు దౌర్జన్యమును ప్రతిఘటింపుము, శారీరమానసిక దౌష్ట్యము నెదుర్కొనుము. "ఎవ్వరిని ద్వేషింపకుము, చెడుగునకు ప్రతికారము చేయకు"మని చెప్పుట సులభమేకాని, అనుష్ఠానమును జూచుసరికి ఆ విధమగు బోధనల తాత్పర్యము మనకు బోధపడును. లోకుల కన్నులయెదుట మనము అప్రతికారమును నటింపవచ్చును, కాని మన యంతరంగమున అంతసేపునున్న క్రుళ్లు మనకు దెలియును. ప్రతి ఘటింపకుండు ప్రశాంతి మనయొద్ద పూజ్యమని మనకు అనుభవవేద్యమే! ప్రతిఘటించుటే మంచిదని మనకుదోచును. నీవు ధనమును వాంఛించుచు, ధనాపేక్షగలవానిని లోకమంతయు దుర్మార్గునిగా పరిగణించుననుటనుగుర్తించి, తత్కారణమున నీవు ధనార్జన ప్రయత్నమునకు దిగనిపక్షమున నీ మనసుమాత్రము రేయింబవళ్లు ధనమువంకకే పరుగెత్తుచుండును. కపటత అనగా ఇదే. దీనిచే లేశమును ప్రయోజనములేదు. సంసారమున నిమగ్నుడవుకమ్ము. అట్లు కొంతకాలమైన వెనుక, అందలి సుఖదుఃఖముల నన్నిటిని అనుభవించినపిమ్మట నీకు వైరాగ్యము కలుగును, ప్రశాంతి యొదవును. కావున నీ యధికారవాంఛను తదితర వాంఛలను తీర్చుకొనుము. తీర్చుకొనిన పిమ్మట ఇవియన్నియు కేవల తుచ్ఛవిషయములని గ్రహించు సమయము వచ్చితీరును; అంతియేకాని ఈ వాంఛలు నెఱవేఱనిదే, ఈ పాటుపడనిదే— ప్రశాంతినిలయమగు ఆత్మసమర్పణస్థితికి నీవు వచ్చుట యసంభవము. ప్రశాంతివైరాగ్యములనుగూర్చి వేలకొలదిసంవత్సరముల నుండియు బోధనలు జరుగుచునేయున్నవి. చిన్ననాటినుండియు ప్రతిమానవుడును వానినిగూర్చి వినుచునేయున్నాడు, కాని నిజముగా ఆ స్థితిని బొందినమానవులు అరుదుగాగాని లేరు. నిజముగా ప్రశాంతియుతులు, ప్రతికారమన నెట్టిదో యెఱుగని వారునగు వ్యక్తులను నా జీవితమున నిరువదిమందిని జూచితినో

లేదో చెప్పజాలను; మఱి నేను ప్రపంచార్ధభాగమున బర్యటన మొనర్చియున్నాను.

ప్రతిమానవుఁడును సొంతయాదర్శమునే అవలంబించి, దానిని సాధించుటకు బ్రయత్నింపవలయును; తా నెన్నటికిని సాధించుకోజాలని యితరులయాదర్శముల నవలంబించుటకంటె అభివృద్ధి కిదియే నిశ్చితమార్గము. ఉదాహరణమునకు మన మొక బిడ్డను గైకొని తోడ్తోడనే దానిని ఇరువదిమైళ్లు నడువ నియమించినయెడల ఆ బిడ్డ చావనైన జచ్చును, లేదా వేయింట నొకటి ఆ యిరువదిమైళ్లు పర్యంతము ప్రాకి యలసిపోయి, సగముచచ్చి, గమ్యస్థానము జేరుకొనును. లోకముతోఁడి మన ప్రవర్తన సర్వసాధారణముగా ఈ విధముగా నుండును. ఏ సంఘమునగాని స్త్రీపురుషు లెల్లరధోరణియు నొక్కటిగనుండదు. కార్యాచరణమున కెల్లర శక్తిసామర్థ్యము లొక్కవిధమువి కావు. వారికి భిన్నాదర్శము లుండితీరవలయును. ఏ యాదర్శమునుగాని పరిహసించుటకు మనకు హక్కు లేదు. స్వీయాదర్శసిద్ధికై ప్రతివ్యక్తిని యథాశక్తి ప్రయత్నింపనిండు. నన్ను నీ యాదర్శమును బట్టిగాని, నిన్ను నా యాదర్శమునుబట్టికాని విమర్శింప దగదు. ఆపిలుచెట్టుగుణమును మఱ్ఱిచెట్టుమానా ననుసరించికాని, మఱ్ఱిచెట్టుగుణమును ఆపిలుచెట్టుమానా ననుసరించికాని పరీక్షింపదగదు. మఱ్ఱిచెట్టును బరీక్షించుటకు ఆచెట్టుపరిస్థితులనే గైకొనవలయును; ఆపిలుచెట్టునకు ఆపిలుచెట్టుపరిస్థితులనే పాటింపవలయును.

అనేకత్వమం దేకత్వ మనునది సృష్టినియమము. వ్యక్తిగతముగా స్త్రీపురుషులలో నెట్టి భేదములున్నను వానికడుగున ఏకత్వము గలదు. సాంఘికముగానేమి, వ్యక్తిగతముగా నేమి, స్త్రీపురుషులందుగల భిన్నవర్గములు, భిన్నశీలములు, సృష్టిలో నున్న సహజ భేదములు. కావున ఒక్కమానానే అనుసరించి వారి గుణదోషములను విమర్శింపరాదు, ఒక్క యాదర్శమునే

వారికందఱికిని విధింపరాదు. కేవల మది అస్వాభావికమైన అలజడిని గల్గించును. తత్ఫలితముగా మానవుడు తన్నే ద్వేషించుకొనదొడగి పారమార్థికపరతకును సౌజన్యమునకును దూరుడగును. స్వీయోన్నతాదర్శము ననుసరింప యత్నించుటకును ఆ యాదర్శము వీలైనంతవఱకు సత్యసన్నిహితమైయుండ బ్రయత్నించుటకును ప్రతిమానవుని ప్రోత్సహించుటయే మన కర్తవ్యము.

అతిప్రాచీనకాలమునుండియు హైందవ ధర్మశాస్త్రములందీతత్త్వము గుర్తింపబడియున్నది. బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, సన్న్యాసము అనెడు వివిధాశ్రమముల నవలంబించు వివిధవ్యక్తులకు హైందవ ధర్మశాస్త్రములందును వేదములందును వివిధధర్మములు విధింపబడియున్నవి.

హిందువుల సనాతన ధర్మశాస్త్రముల ననుసరించి సర్వజనసాధారణధర్మములుండుటే కాక, ప్రతి వ్యక్తిజీవితమునకును, ప్రత్యేకధర్మములున్నవి. బ్రహ్మచర్యాశ్రమముతో హైందవుని జీవిత మారంభమగును; పిమ్మట వివాహమాడి గృహస్థుడగును. వృద్ధదశలో వానప్రస్థుడగును. తుదకు సర్వసంగముల పరిత్యజించి సన్న్యాసి యగును. ఈ యాశ్రమములలో ప్రతిదానికిని ప్రత్యేక ధర్మములు కొన్ని విధింపబడియున్నవి. ఈ యాశ్రమములలో ఏఒక్క దానికిని తక్కినవానికంటె సహజాధిక్యమేమియులేదు. పారమార్థిక కర్మపరాయణుడగు బ్రహ్మచారి జీవిత మెంతగొప్పదో గృహస్థుని జీవితమునుఅంత గొప్పదియే. సింహాసనముపైని చక్రవర్తి యెంతటిఘనుడో, మహిమాంచితుడో, వీథులందలి పాకి వాడును అంతటి ఘనుడే, మహిమాంచితుడే. సింహాసనమునుండి యాతని దొలగించి పాకివానిపని చేయుమనుడు, అందతని సామర్థ్యమును కనుడు. పాకివానిని గద్దె నెక్కించి యాత డెట్లు పాలించునో చూడుడు. సంసారమున మెలగువానికంటె సంసారమును త్యజించినవాడు ఘను

డనుట నిష్ప్రయోజనము; సంసారమును పరిత్యజించి, స్వేచ్ఛగా, సుఖముగా జీవించుటకంటె సంసారమున మెలగుచు భగవంతుని గొలుచుట మిక్కుటముగా కష్టతరము. కాలక్రమమున భారతదేశమందలి చతురాశ్రమములును గార్హస్థ్యసన్న్యాసాశ్రమముల లోనికి దిగినవి. గృహస్థుడు వివాహితుడై తనవిధ్యుక్త పౌరధర్మములను నిర్వర్తించుచుండ, భగవదుపాసనమును ధర్మప్రచారమును జేయుచు కేవల పారమార్థికవిషయములకు తనశక్తిసామర్థ్యములను వినియోగించుచుండుటయు సన్న్యాసిధర్మములు. మహానిర్వాణతంత్రమునుండి యివ్విషయమునకు సంబంధించిన కొన్ని ఘట్టములను మీకు జదివి వినిపించెదను; దానివలన మానవుడు గృహస్థుడుగానుండి తనధర్మముల నన్నిటిని సమగ్రముగా నిర్వర్తించుట యెంతకష్టసాధ్యమో మీకు దెలియగలదు.—

గృహస్థుడు భగవద్భక్తుడై యుండవలయును; భగవజ్జ్ఞానమే ఆతని జీవితపరమావధి. సదా కర్మనిరతుడై తన విధ్యుక్తధర్మములను నిర్వహించుచు కర్మఫలముల నీశ్వరార్పణ మొనర్పవలయును.[1]

కర్మ మొనర్చుచు కర్మఫలము నాశింపకుండుట — అనగా ఒకనికి సాయ మొనర్చి యాతడు నీయెడ కృతజ్ఞుడై యుండవలయునని భావింపకుండుట — ఏదేని సత్కార్య మొనర్చి దానివలన నీకు పేరుప్రఖ్యాతులు గలుగునో కలుగవో యనువిషయమే తలపెట్టకుండుట — లోకమున నిజముగా మహాకష్టసాధ్యము. వట్టి పిఱికిపందకూడ లోకము తన్ను మెచ్చుకొనునపుడు ధైర్యశాలి యగును. లోకులు తన్ను స్తుతించునపుడు మూర్ఖుడును, ధీరపురుషోచితకార్యముల నొనర్చును; కాని సహచరుల పొగడ్తను గోరక సర్వదా సత్కార్యముల నొనర్చుచుండుట నిజముగా మహోన్నత త్యాగము. జీవనోపాధి నార్జించుట గృహస్థునకు

1. మహానిర్వాణతంత్రము VIII-23.

పరమధర్మము. కాని ఆ ఆర్జనమును కల్లలాడుటచేతను పరులను మోసగించుటచేతను, పరద్రవ్యాదుల నపహరించుట చేతను చేయదగదు; మఱియు ఈశ్వర సేవయు దీనజన సేవయు తనజీవిత ధర్మములని యాతడు జ్ఞప్తియుంచుకోవలయును.[2]

తలిదండ్రులు సాక్షాద్భగవత్స్వరూపులని గ్రహించి గృహస్థుడు సదా, సర్వవిధములను వారల సంతుష్టులనొనర్ప వలయును.[3] తల్లిదండ్రులు సంతుష్టులైనచో భగవానుడు సంతుష్టుడగును. తల్లిదండ్రులతో పరుషవాక్యములాడని పుత్రుడు నిజముగా సుపుత్రుడు.[4]

తల్లిదండ్రులయెదుట ఎగతాళి మాటలాడరాదు. తొందర పాటు చూపరాదు. కోపముగాని, ఆక్రోశముగాని చూపరాదు.[5] తల్లిదండ్రులయెదుట మ్రొక్కి నిలుచుండవలయును. వారు కూర్చుండుమనువఱకు కూరుచుండరాదు.[6]

తల్లికిని, తండ్రికిని, బిడ్డలకును, భార్యకును, పేదలకును బెట్టనిదే, గృహస్థుడు భుజించునేని అది పాపమగును.[7] ఈ శరీరమునకు తలిదండ్రులే కారణభూతులు కావున వారలకు మేలొనర్చుటకై మానవుడు లక్షకష్టములనైన ననుభవించుట కర్తవ్యము.[8]

తనభార్యయెడలను ఆతనికి విహితమైన ధర్మ మిట్టిదే; భార్య నాతడు దూషింపరాదు. కేవలము తల్లిగా భావించి

---

2. మహానిర్వాణతంత్రము VIII-24.
3. ,, -25.
4. ,, -26.
5. ,, -30.
6. ,, -31.
7. ,, -33, 34.
8. ,, -36, 37.

యామెను పోషింపవలయును. తా నెంతటి మహాకష్టముల నిక్కట్టుల ననుభవించుచున్నను భార్యపై కోపింపరాదు.[9]

తనభార్యనుమాని పరస్త్రీనిగూర్చి చింతించువాడు— కేవలమానసికముగా పరస్త్రీని స్పృశించినను — ఘోరనరకమునకు బోవును.[10]

స్త్రీలయెదుట అసభ్యసంభాషణ చేయరాదు. తనశక్తి సామర్థ్యములనుగూర్చి ప్రగల్భములాడరాదు. నే నిది చేసితి నది చేసితినని చెప్పరాదు.[11]

ధనముచే, వస్త్రములచే, ప్రేమచే, నమ్మికచే, మధుర వాక్కులచే గృహస్థుడు తనభార్యకు సంతుష్టి కూర్పవలయును; ఆమెమానసము క్షోభించుకార్య మెన్నడును చేయరాదు. పతివ్రత యగు ప్రియురాలి ప్రేమను బొందగల్గినవాడు సమస్తధర్మము లందును కృతకృత్యు డయినట్లే; సమస్తసద్గుణముల నార్జించు కొన్నట్లే.[12]

బిడ్డలయెడ గృహస్థు డవలంబింపవలసిన ధర్మములివి :— నాలుగేండ్లప్రాయము వచ్చువఱకును పుత్త్రుని ప్రేమానురాగము లతో బెంచుచు పదునాఱేండ్లవఱకును విద్యాబుద్ధులను గఱప వలయును.[13] ఇరువదియేండ్లప్రాయమున నాతని నేదియో యొక యుద్యోగమున నియోగింపజనును. తండ్రి యపు డాతని ప్రేమతో తనసమానునిగా జూడవలయును.[14] సరిగా నిదియే విధముగా కుమార్తెను బెంచి విశేషశ్రద్ధతో నామెకు విద్యాబుద్ధులను గఱప

9. మహానిర్వాణతంత్రము VIII-39.
10. ,, -40.
11. ,, -41.
12. ,, -42, 44.
13. ,, -45.
14. ,, -45.

వలయును. వివాహసమయమున తండ్రి యామెకు నగలను ధనము నొసగవలయును.[15]

వీనికి తర్వాత నతడు నిర్వహింపవలసిన ధర్మములు దన యన్నదమ్ములయెడ, అక్కసెల్లెండ్రయెడ, పేదలైయున్న యెడల వారిబిడ్డలయెడ, మిగిలిన తన బంధువర్గమునెడ, మిత్రులయెడ, సేవకులయెడ.[16] అటుపిమ్మట తన గ్రామవాసులయెడలను, బీదల యెడలను, ఎవరైనగానిండు—తనసాయము నర్థించువారలయెడ లను నిర్వర్తింపవలసిన ధర్మములు గృహస్థున కున్నవి.[17] తగినంత స్థితిపరుడై యుండియు గృహస్థుడు తనబంధుగులకును పేదలకును బెట్టనియెడల నట్టివాడు మానవుడుగాడనియు నట్టి పశువనియు గ్రహింపుడు.[18]

వస్త్రాహారములయందు. శరీరపోషణమునందు — తల దువ్వుకొనుటయందు — మిక్కుటమైన ఆసక్తి యుండకూడదు.[19] గృహస్థుడు పవిత్రహృదయుడై పరిశుద్ధశరీరుడై యుండుటయే గాక కర్మాచరణమునకు సంసిద్ధుడుగను తత్పరాయణుడుగను నుండ వలయును.[20]

శత్రువులవిషయమున గృహస్థుడు వీరుడై వర్తింప నొప్పును. శత్రువుల నాతడు ప్రతిఘటింపవలయును. ఇది గృహస్థుని విధి. అంతియేకాని యొకమూలగూర్చుండి యేడ్చుచు అప్రతిఘటనమునుగూర్చి యర్థరహితప్రలాపము లాడుచుండ రాదు. శత్రువులయెడ శౌర్యమును బ్రకటింపనియెడల ఆతడు

---

15. మహానిర్వాణతంత్రము VIII-47.
16. ,, -48.
17. ,, -49.
18. ,, -50.
19. ,, -51.
20. ,, -52.

తన విధిని నెఱవేర్పనివా డగును. గురువులయెడలను బంధుగుల యెడలను ఆతడు మేకపిల్లవలె పరమమృదువుగ మెలగ వలయును.[21]

దుర్మార్గులను గౌరవింపకుండుట గృహస్థుని విధి. దుర్మార్గుల యెడ గౌరవము చూపినచో దౌర్జన్యము నాదరించినవా డగును. గౌరవార్హులగు సజ్జనుల నగౌరవించినను తప్పే. స్నేహము నొనర్చుటలో తొందరపడరాదు; తనదారివీడి, కనబడినవారితో నెల్ల స్నేహము చేయరాదు. తాను స్నేహము చేయదలచినవారి చర్యలను, పరులతోడి వారి వ్యవహారధర్మములను గనిపట్టి వానిని గూర్చి పర్యాలోచించి మఱి వారితో స్నేహము చేయ వలయును.[22]

ఈ మూడువిషయములనుగూర్చి గృహస్థుడు మాటాడ రాదు.[23] తన ప్రఖ్యాతినిగూర్చి నలువురియెదుటను సంభాషింప రాదు. తనపేరును తానే ప్రయోగించుకొనుటకాని తనశక్తులను గొనియాడుకొనుటకాని కూడదు. రహస్యముగా దనకు దెలుప బడిన విషయములనుగూర్చి పల్కరాదు.

తాను దరిద్రుడననికాని భాగ్యవంతుడననికాని చెప్పుకో రాదు — తనసిరిసంపదలనుగూర్చి ప్రగల్భములు పలుకజనదు. తనయభిప్రాయములను తనకే ఉంచుకోవలెను. ఇది యాతని పరమధర్మము. ఇది కేవలలౌకికజ్ఞానముకాదు. ఇటు లొనర్పని యెడల ఆతని నధర్మవర్తను డనవచ్చు.

సంఘమున కంతటికిని గృహస్థుడే ఆధారభూతుడు, ఆతడే ప్రాపు; ఆర్జించువారిలో ముఖ్యుడు. దరిద్రులు, దుర్బలులు, పనిచేయనిబిడ్డలు, స్త్రీలు—ఎల్లరును గృహస్థుని మీదనే ఆధార

21. మహానిర్వాణతంత్రము VIII-53.
22. ,, -54.
23. ,, -59.

పడియుందురు; కావున నాతఁడు పరిపాలింపవలసిన కొన్ని ధర్మము లుండవలయును. ఈ ధర్మము లాతనికి ఆచరించుటకు వలయు మనోదార్ఢ్యము గల్గించునవై యుండవలయునుకాని, ఆదర్శమున కంటె జఘన్యములగు కార్యములను జేయుచున్న ట్లాతనికి దోపించునవై యుండరాదు. కావున నాత డేదైన పొరపాటుచేసి నప్పుడుకాని, దౌర్బల్యమున కధీనుడైనప్పుడుకాని నలువురి యెదుటను ఆగుట్టు వెల్లడించుకోగూడదు; మఱియు నేదేని యుద్యమము నారంభించి తన కందు జయము లభింపదని నిశ్చయముగా నెఱిగియుండినప్పుడు దానిని వెల్లడింపరాదు.[24] తనలోపమును తా నట్లు వెల్లడిచేయుట అవిహితమగుటయేగాక మనోదౌర్బల్యహేతువై జీవితమున విధ్యుక్తకర్మాచరణమునకు దన్నసమర్థుని జేయును. తొలుత విద్యను పిదప ధనమును ఆర్జించుటకై తప్పక శ్రమపడి ప్రయత్నింపవలయును. అది అతనివిధి. తనవిధిని నెఱవేర్పనిచో ఆతఁడు గృహస్థుఁడు కాఁడు. ధనము గడింప శ్రమపడని గృహస్థుడు ధర్మము తప్పినవాఁడు.[25] అలసుడై పనికి మాలిన జీవితముతో తృప్తివహించువా డవినీతిపరుఁడు. ఏలన తనపై వందలకొలదిమంది ఆధారపడియుందురు. ఆతఁడు ధనవంతుడైనచో తన్మూలమున వందలకొలది యితరులు సంరక్షింపబడుదురుగదా.

పాటుపడి ధనసంపన్నులైనవారు వందలకొలదిజనులు ఈ పురమున లేకుండినయెడల ఈ నాగరకత, ఈ ధర్మసత్రములు, ఈ మహామందిరములు—ఇవి యన్నియు నెక్కడివి?

అట్టి సద్వినియోగమునకై ధన మార్జించుట తప్పుగాదు. ఏలన, అది పదిమంది కుపయోగపడును. సంఘమునకును (దాని) జీవనమునకును గృహస్థుడే కేంద్రీభూతుడు. ధర్మమార్గమున

24. మహానిర్వాణతంత్రము VIII-57.
25. ,, -58.

ధన మార్జించి, ధర్మకార్యములకై దానిని వినియోగించుట ఒక సేవ. ఏలన, సన్మార్గమున ధన మార్జింప, దానిని సత్కార్యములకై వినియోగింప ప్రయత్నించువాడు గుహలో ధ్యానమొనర్చు తపస్వి యెట్టి మోక్షసాధన జేయుచున్నాడో అట్టి మోక్షసాధననే ప్రాయికముగా జేయుచున్నాడు; ఎట్లన భగవద్భక్తిచే, భగవంతునిదేయగు సమస్తసృష్టిజాతమునందలి భక్తిచే ప్రేరితమగు నాత్మార్పణము, స్వార్థత్యాగము నను సుగుణములే వీరిరువురి యందును భిన్నవిధములుగా వ్యక్తమగును.

మంచిపేరు సంపాదించుటకై గృహస్థుడు సర్వవిధములను ప్రయత్నింపవలయును. అతడు జూదమాడరాదు; దుర్మార్గుల సాంగత్యము చేయరాదు. అసత్యమాడజనదు. ఒరులకు తానెట్టి బాధను గల్గింపదగదు.

లోకులు తఱచు తాము నిర్వర్తింపలేని కార్యములలో దిగుచు స్వలాభార్థమై పరులను వంచించుచుందురు. మఱియు అన్నిటికిని కాల మనునది యొకటి యున్నదిగదా; ఒకసమయమున అపజయముగా పరిణమించునదియే వేఱొక సమయమున దిగ్విజయమై పరిణమింపవచ్చును [26]

గృహస్థు సత్యము పల్కవలెను, మృదువుగ పల్కవలెను, ప్రియముగ పల్కవలెను, హితకరముగ పల్కవలెను, ఇతరుల పనులనుగూర్చి తానేమియు మాటాడరాదు.[27]

చెఱువులను త్రవ్వించుచు, బాటలకిరువైపులను చెట్లను నాటించుచు, మానవులకును జంతువులకునుగూడ విశ్రాంతి మందిరములను నిర్మించుచు, బాటలను వేయించుచు, వంతెనలను

26. మహానిర్వాణతంత్రము VIII-59.
27. ,, -62.

గట్టించుచు గృహస్థుడు యోగీంద్రలభ్యమగు పదమునే పొందు చున్నాడు.[28]

గృహస్థునకు విహితమగు నిట్టి కార్యపరత కర్మయోగమున నొకభాగము. మహానిర్వాణతంత్రమునందే దీనికి తర్వాత నొక తావున నిట్లు చెప్పబడియున్నది : "స్వదేశముకొఱకుగాని, స్వధర్మముకొఱకుగాని యుద్ధరంగమున ప్రాణములనుబాయు గృహస్థుడు ధ్యానముచే యోగి పొందు పరమపదమునే పొందు చున్నాడు."[29] దీనివలన నొకనికి కర్తవ్యమైనది మఱియొకనికి కర్తవ్యము కాదని ఏర్పడుచున్నది. ఐనను ఇందొకటిమాత్ర ముత్తమగతిని గల్గించునదియు మఱియొకటి అధోగతిని గల్గించు నదియు కాదనియు ఆ శాస్త్రమే చెప్పుచున్నది. ధర్మములలో దేనిస్థానము దానికి గలదు. మనపరిస్థితుల ననుసరించి మనధర్మ ములను నిర్వర్తించుచుండవలయును.

దౌర్బల్యనిరసనమే ఈ వివేచనమంతటికిని ముఖ్యవిష యము. ధర్మమునగాని, కర్మమునగాని, వేదాంతమునగాని కాననగు సమస్తబోధనలందును ఇదియే నాకభిమతమగు తత్త్వము. మీరు వేదములను జూచినచో మరల మరల మీకు గాన్పించు మాట 'అభీః' - అభయము. దేనికిని భయపడకుడు. భయము దౌర్బల్యలక్షణము. లోకుల వెక్కిరింతలను హేళనలను లక్ష్యపెట్టక మానవుడు తనధర్మమును దాను నిర్వర్తించుచుండ వలెను.

సర్వేశ్వరుని గొలుచుటకై సంసారత్యాగియగువాడు సంసారవర్తనులై లోకకల్యాణార్థము కృషిచేయునట్టి గృహస్థులు

28. మహానిర్వాణతంత్రము VIII-63.

29. ,, -67.

భగవంతు నారాధించుట లేదని భావింపరాదు. ఇట్టులే భార్యా పుత్త్రులకొఱకై సంసారమును జేయువారును సంసారత్యాగులగు సన్న్యాసులను నీచులగు దేశసంచారులనుగా తలపోయరాదు. ఎవనిస్థానమున వాడు గొప్ప. ఈ యాశయమునకు ఉదాహరణముగ నొక కథను జెప్పెదను.

"ఎవ్వ డధికుడు? సంసారమును త్యజించి సన్న్యాసియగు నాతడా? లేక స్వధర్మానురక్తుడగు గృహస్థుడా?" అని యొక రాజు తనదేశమునకు వచ్చిన సన్న్యాసుల నందఱను బ్రశ్నించుచుండెను. ధీమంతు లనేకు లా ప్రశ్నకు సమాధానముచెప్ప బ్రయత్నించిరి. కొందఱు సన్న్యాసియే అధికుడని వక్కాణింప రాజు వారిని, "మీ ప్రతిపాదనమును నిరూపింపు" డనియెను. అది వారికి అసాధ్యమగుటచే రాజు వారిని, "వివాహితులై గృహస్థులు కం"డని యాజ్ఞాపించెను. అంత మఱికొందఱు వచ్చి, "స్వధర్మానువర్తనుడగు గృహస్థుడే గొప్పవాడు" అనిరి. వారితోగూడ రాజు, "అది యెట్లో నిరూపింపు" డనియెను. వారి కది యసాధ్యముకా నాతడు వారినిగూడ గృహస్థులను జేసివైచెను.

తుద కొక యువసన్న్యాసి తనరాష్ట్రమునకు రాగా, రాజాతనినికూడ ఇట్లే ప్రశ్నించెను. అంత నా యువసన్న్యాసి యిట్లు సమాధానము చెప్పెను: "ఓ రాజా, ఎవనిస్థానమున వాడు గొప్పతనమున ఇతరునకు సమానుడే." "అది యెట్లో ఋజువుచేయుడు" అని రాజుపలికెను. "ఋజువుచేసెదను కాని నే జెప్పు విషయమును నీకు నిరూపింపగలుగుటకై మొదట నీవు వచ్చి కొన్నిదినములవఱకు నావలె జీవింపవలయును" అని సన్న్యాసి వచించెను. అందులకు రాజు వల్లె యని సన్న్యాసితో తనరాష్ట్రమును వీడి పయనమయ్యెను. అనేకదేశములను దాటి తుదకు వారొక పెద్దరాజ్యమును జేర నందలి ముఖ్యపట్టణమున నొక మహోత్సవము జరుగుచుండెను. రాజును సన్న్యాసియు

అందలి భేరీఘోషను సంగీతమును వినిరి; ధగధగని యుడుపులను దాల్చి జనులు వీథులలో గుమికూడియుండిరి. ఉత్సవమున నొక పెద్దచాటింపు చేయబడుచుండెను. జరుగుచున్నదానిని జూచుటకై రాజును సన్న్యాసియు అట నిలిచిరి. యువరాణియగు నాదేశపు రాజకుమారి అచట సమావిష్టులైనవారినుండి యొకని భర్తగా వరించునని చాటించువాడు బిగ్గఱగా ప్రకటించుచుండెను.

రాజపుత్త్రికల కీవిధమగు స్వయంవరము భారతదేశమున సనాతనాచారము. ప్రతిరాజపుత్త్రికకును తనకు భర్తయగువాడు 'ఇట్టిట్లుండవలె' నను కొన్ని యభిప్రాయము లుండెడివి; కొందఱికి నిరతిశయసౌందర్యమభిమతము, కొందఱికి అసదృశపాండిత్యము ప్రియము, కొందఱికి అధికసంపద కావలెను. ఇరుగు పొరుగు రాజులందఱును మహోజ్జ్వలములగు నుడుపులనుదాల్చి కన్య కెదుట తమ్ము ప్రదర్శించుకొందురు. ఒక్కొక్కప్పుడు వీరును కన్య తమ్మే వరించునని తమ నమ్మకమునకు గల కారణములను తమ గొప్పలను సొంత స్తుతిపాఠకులచే ఘోషింపించుట కలదు. ఆకర్షకములగు వలువలనుదాల్చి, సింహాసనమున నాసీనయైయున్న రాజకుమారిని భటులు ప్రతిరాజునొద్దకును గొంపోవుదురు. వారి నవలోకించి యామె వారిచరిత్రలను వినును. నచ్చకపోయినచో "సాగిపొండు" అని భటుల కాజ్ఞాపించును. వలదనుకొన్నవారల నిక క్రేగంటనైనను లక్షింపదు. కాని రాజకుమారులలో నెవ్వరైనను తనకు నచ్చినయెడల వాని కంఠమున నామె పూలమాలికను వేయును; ఆత డామెభర్త యగును.

మనరాజును సన్న్యాసియు ప్రవేశించిన దేశమందలి రాజకుమారికి ముచ్చటైన అట్టి స్వయంవరోత్సవము జరుగుచుండెను. లోకమంతటియందును ఆమె సాటిలేని సౌందర్యవతి. ఆమెకు భర్తయగువా డామెతండ్రియనంతరము రాజ్యాధికారము

నొందును. మిక్కిలి చక్కనివానిని వివాహమాడవలయునని యామె యభిలాష; కాని యామెమనసునకు నచ్చినవరుడు దొరకకుండెను. చాలసారు లిట్టిస్వయంవరసమావేశములు జరిగినవి. కాని యా రాజకుమారి వరు నెన్నుకోలేకపోయెను. ప్రస్తుత సమావేశము మునుపటివానికంటె మహోజ్జ్వలతరము; మునుపటి వానికన్నిటికంటెను దీని కధికసంఖ్యాకులు వచ్చియుండిరి. సింహాసనాసీనయై యున్న రాజకుమారిని భటు లొకతావునుండి మఱియొక తావునకు గొంపోవుచుండిరి. సమావేశమం దెవ్వరి నామె లక్షించునట్లు కాన్పింపమి జనులు నిరుత్సాహులై, "ఈ సమావేశమును నిష్ఫలమగును కాబోలు"నని తలచిరి. ఆ సమయమున సూర్యుడాకసమునుండి దిగివచ్చెనా యని తోపించు దివ్యసుందరమూర్తియగు నొక యువసన్న్యాసి సమావేశమున నొకమూల నిలిచి యచటి సంభవముల జూచుచుండెను. భటులు రాజపుత్త్రిక నటకు గొనితేర నామె యా జగన్మోహనాకారుడగు సన్న్యాసిని గాంచినంతనే యచట నాగి పూలమాలిక నాతని మెడలో వైచెను. వైచుటయు, "ఇది యేమి యవివేకము? నేను సన్న్యాసినిగదా. నా కేమి! పెండ్లి యేమి!" యని యా యువసన్న్యాసి పూలమాలికను గైకొని పాఱవైచెను. అంత నా దేశపురాజు, "ఇతడు పేదయై యుండుటచే రాజకుమారిని పెండ్లియాడుటకు జంకుచున్నాడు కాబోలును" అని తలచి యాతని కిట్లు తెల్పెను: "నా పుత్త్రికతోగూడ అర్ధరాజ్య మిపుడు మీదగును. నాయనంతరము రాజ్యమంతయు మీదే!" ఇట్లు వచించి రాజు పూలదండను మరల సన్న్యాసిమెడలో వైచెను. "చాలుచాలును! నాకు పెండ్లి వలదు" అని సన్న్యాసి ఱివ్వున నా సమావేశమునుండి వెడలిపోయెను.

రాజకుమారి యా యువకుని మోహించి, "ఇతనినే పెండ్లాడవలెను, లేదా మృత్యువే శరణ్యము" అనుచు నాతని

గొనివచ్చుటకై యాతని ననుగమించెను. తనతోఁగూడ రాజు నటకు గొనివచ్చిన మన పూర్వసన్న్యాసి, "వీరి వెంబడి పోదము. రమ్ము!" అని రాజుతోఁగూడి వారివెనుక తగినంతదూరమున నడువసాగెను. రాజకుమారిని పెండ్లియాడ నిరాకరించిన యువ సన్న్యాసి యా దేశమునువిడిచి చాలదవ్వు నడచి యొకయరణ్యా మును బ్రవేశించెను. రాజకుమారియు నాతని వెంబడించు చుండెను. మనరాజును సన్న్యాసియు వారివెనుకనే యుండిరి. యువసన్న్యాసికి, యా యరణ్యమును అందలి నిగూఢమార్గము లును చక్కగ పరిచితములై యుండుటచే ఆకస్మికముగ నాత డొక మార్గమునజొచ్చి యదృశ్యుడయ్యెను. ఆతని గనిపట్టుటకై రాజ కుమారి యెంతయో ప్రయత్నించి తుదకు విఫలమనోరథయై యొకచెట్టుక్రింద జదికిలబడి విలపింపసాగెను; పాపము, ఆమెకు ఆ యరణ్యమునుండి వెలువడు మార్గముకూడ తెలియదయ్యెను. అంతట మనరాజును సన్న్యాసియు నామెను సమీపించి యామె ట్లనిరి: "అమ్మా, విచారింపకుము; ఈయరణ్యము వెలువడు మార్గము నీకు మేముచూపెదము. కాని యిపుడు మిక్కిలి చీకటిగా నుండుటచే సాధ్యముకాదు. ఇచట నొకపెద్దచెట్టుకలదు గదా. దీనిక్రింద మన మీ రాత్రి విశ్రమింతము. వేకువజామున లేచి వెడలుదము. నీకు మేము దారిచూపెదము."

ఆచెట్టుమీదనే గూడుకట్టుకొని మూడుపిల్లలతో నొక కపోతములజంట నివసించుచుండెను. అందు మగపిట్ట క్రిందనున్న ముప్వురుజనులను జూచి తనభార్య కిట్టు లనియెను: "ప్రేయసీ, ఇపు డేమి చేయుదము? వీరు మనయింటికి వచ్చిన యతిథులు గదా. శీతకాల మిది, చలికాచుకొనుటకు మనయింట నిప్పు లేదు." ఇట్లని యాపిట్ట ఆవ్వాన నెగిరి వెడలి ముక్కున నొక చంద్రనిప్పు గఱచుకొనివచ్చి యతిథులముందు బడవైచెను. వారు దానికి ఎండు టాకులను గట్టెలను జేర్చి మంటచేసికొనిరి.

కాని యాపిట్ట యంతటితో తృప్తినొందక మరల తనభార్య కిట్టు లనియెను: "ప్రియా, ఇప్పు డేమిచేయుదము? వీరి కాకలియగు చున్నది, మనయింట వీరి కిడుట కేమియు లేదే. మనమా గృహస్థులము; ఇంటికివచ్చినవారి యాకలి బాపుట గృహస్థ ధర్మముకదా. నాయోపిన పని నేను చేయవలయును, కావున నాశరీరమును వీరికి సమర్పింతును." ఇట్లని యాపిట్ట యగ్ని జ్వాలలో బడి మ్రగ్గెను. అతిథు లాపిట్ట యగ్నిలో బడుచుండుట గాంచి రక్షింప బ్రయత్నించిరి, కాని తత్పతనవేగముచే వారి కది సాధ్యము కాదయ్యెను.

కపోతాంగన తనభర్త యొనర్చిన పనినిగాంచి యిట్లు తల పోసెను: "ఇచట నున్నవారు ముగ్గురు. వీరు తినుట కొక చిన్న పక్షిమాత్రమే కలదు. వీరల కిది చాలదు. పతియత్నమును వృథా గానీయకుండుటయే సతిధర్మము. కావున నాశరీరమునుకూడ వీరలకు సమర్పింతును." ఇట్లనుకొని యాపక్షి యగ్నిలో బడి మృతినొందెను.

అంత నాకపోతములపిల్లలు మూడును తమతల్లిదండ్రు లొనరించిన కృత్యమును గాంచి ముగ్గు రతిథులకును జాలినంత యాహారము లేమి కిట్లు చింతింపసాగెను: "మన తల్లిదండ్రులు యథాశక్తి ప్రయత్నించినను వీరలకు తగినంత యాహారము లేదయ్యెను. తల్లిదండ్రులయుద్యమము నెఱవేర్చుట బిడ్డల ధర్మముగదా; కావున మన శరీరములను గూడ సమర్పింతము." ఇట్లు సంభావించి యాపక్షిశాబకములును అగ్నిలోని కుఱికినవి.

కన్నెదుట జరిగిన యాకృత్యమును గాంచి వార లాశ్చర్య చకితులై యాపక్షులను దినజాలరైరి; నిరాహారులై వార లా రాత్రి గడపిరి. ఉదయమున రాజును సన్న్యాసియు రాజకుమారికి త్రోవ జూప నామె మరల తనతండ్రియొద్ద కేగెను.

అంతట సన్న్యాసి రాజున కిట్లనియె : "రాజా, ఎవని స్థానమునవాడుగొప్ప యనువిషయము నీ కిపుడు ప్రత్యక్షమైనది కదా. సంసారివై వర్తింపదలతువేని ఏ నియమమున నైనను పరహితార్థమై ఆత్మార్పణమొనర్ప సంసిద్ధుడవై యాపత్తులవలె జీవింపుము. సంసారమును త్యజింపదలతువేని సౌందర్యస్వరూపిణియగు కాంతాలలామను రాజ్యమును తృణప్రాయముగా గణించిన యాయువకునివలె వర్తింపుము. గృహస్థుడవై యుండ నెంతువా, పరశ్రేయమునకై నీజీవితమును ఆహుతి యొనర్ప సంసిద్ధుడవుగనుండుము; సన్న్యాసివి కానెంచెదవా, ధనమును, సౌందర్యమును, అధికారమును కన్నెత్తిచూడకు. ఎవనిస్థానమున వాడు గొప్ప. కాని యొకని ధర్మము మఱియొకని ధర్మము కానేరదు."

# కర్మయోగ రహస్యము

జనులకు శరీరావశ్యకములను దీర్చుచు భౌతికముగా దోడ్పడుట నిజముగా ఘనకార్యమే; కాని సాహాయ్యావశ్యకత యెంత అధికమో, మనము చేయు సాయము తానెంత సాధకమో మన తోడ్పాటును అంత మహత్తరమైనది. ఒక గంటవఱకు నొకనియక్కఱలను దీర్పగల్గినచో నిజముగా నది యతనికి తోడ్పడుటయే; ఒక యేడాదివఱకు నాతనియక్కఱలను దీర్పగలిగినచో అది యంతకంటె విశేషమగు తోడ్పాటగును; కాని యాతని కొఱతలను శాశ్వతముగా దీర్పగల్గినచో నిశ్చయముగా నది యాతని కొనర్పగలిగిన మహోత్తమమగు తోడ్పాటు గదా. మనబాధలను శాశ్వతముగా తొలగింపగలిగినది తత్త్వజ్ఞానము. ఇతరమగు నెట్టి జ్ఞానమైనను మనయక్కఱలను గొంత కాలము వఱకు మాత్రమే తీర్పగలదు. తత్త్వజ్ఞానము ఒక్కటియే మానవుని లోటులను శాశ్వతముగా నిర్మూలించునది; కావున మానవున కొనర్చు నాధ్యాత్మిక సాహాయ్యమే మహోన్నతసాహాయ్యము. తత్త్వజ్ఞానదాన మొనర్చు నాతడే లోకమునకు నిరతిశయోపకారి. కావున మానవుని ఆధ్యాత్మికావశ్యకతల దీర్చినవారలే అఖండప్రభావవంతులుగ గననగుచున్నారు; ఏలన జీవితమున మనసమస్తవ్యాపారములకును పారమార్థికపరతయే మూలాధారము. ఆధ్యాత్మికశక్తి సంపన్నుడు సంకల్పించినచో సర్వవిషయములందును శక్తిమంతుడు కాగలడు; ఆధ్యాత్మికబలముండిననేకాని మానవుడు శరీరవాంఛలను సైతము తృప్తినొందించుకొనజాలడు. ఆధ్యాత్మికసాహాయ్యమునకు తరువాత వచ్చునది విద్యావిషయక సాహాయ్యము. విద్యాదానము అన్నదాన వస్త్రదానముల కంటెను ఉత్తమదానము; విద్యాదానము ప్రాణదానముకంటెగూడ అధికతరము; ఏలన, జ్ఞానమే

మానవుని యథార్థజీవితము. అజ్ఞానమే మృత్యువు. దుఃఖా జ్ఞానములలో గోరాడునట్టి అంధకారబంధురమగు జీవితమునకు విలువ లేనేలేదు. విద్యాదానమునకు తరువాతిది శారీర సాహాయ్యమే. కావున పరోపకారవిషయమున శారీరసాహాయ్యమొక్కటియే సాయమను భ్రమకల్గకుండ ప్రయత్నింపవలయును. ఇది శాశ్వతసంతృప్తి నొసగజాలమి దానములలో కడపటిదగుటయే కాక అధమముకూడనై యున్నది. భుజించుటచే నాయాకలి దుఃఖము తీఱును, కాని మరల నా కాకలి యగుచున్నది; నా యక్కఱ పూర్తిగా తీఱినప్పుడే కదా నాబాధ తొలగగలదు. ఆకలి నన్నపుడిక బాధింపదు; ఎట్టిదుఃఖమును దుఃస్థితియు గూడ నన్నిక గదల్పజాలవు. కావున మనల నాధ్యాత్మికముగా బలిష్ఠుల నొనర్పబూనున దేదియో అదియే మహోత్తమమగు సాహాయ్యము. తరువాతిది విద్యావిషయకమగు సాహాయ్యము, దానికి పిమ్మటిది శారీరకసాహాయ్యము.

సంసారబాధల చక్కజేయుటకు శారీర సాహాయ్య మొక్కటి చాలదు; మానవుని స్వభావము మాఱుపర్యంతము ఈ శారీరావశ్యకములును దుఃఖములును సదా కలుగుచునే యుండును; ఎంతటి భౌతికసాహాయ్యమైనను వానిని పూర్తిగా తొలగింపజాలదు. మానవులను పవిత్రుల నొనర్చు టొక్కటే ఈ సమస్యను పరిష్కరించుట కుపాయము. లోకమున గాన్పించు చెడుగంతయు, దురవస్థయంతయు అజ్ఞానప్రభవమే. మానవులు జ్ఞానులుగను, విశుద్ధులుగను, ఆత్మబలాఢ్యులుగను, విద్యావంతులుగను ఐనపిమ్మటే లోకమందలి దుఃఖము నివర్తిల్లునుగాని, ముందుకాదు. ప్రతిగృహమును మనము ధర్మసత్రముగా నొనర్తుముగాక, దేశమునంతను చికిత్సాలయములతో నింపుదుముగాక, మానవుని శీలము మార్పుచెందువఱకు అతని దుఃఖము ఉండనే యుండును.

సదా మన మందఱము కర్మ మొనర్చుచుండవలయునని భగవద్గీతలలో మాటిమాటికిని చెప్పబడియున్నది. ప్రతి కర్మము లోను సహజముగా మంచిచెడుగులు సమ్మిశ్రితములై యున్నవి. ఎచ్చటనైనను కొంతేనిమేలు గల్గింపని కర్మమును మనముచేయనే జాలము; ఎచ్చటనో కొంతకీడు కల్గింపని కర్మ ముండుటయే అసంభవము. ప్రతి పనిలోను మంచి చెడుగుల కలయిక యుండక తప్పదు. ఐనను నిర్విరామముగ కర్మ మొనర్చుచుండు మనును శాస్త్రము. మంచిచెడుగులకు రెంటికిని దాని దాని ఫలితములు గలవు. అట్టి కర్మముల నవి యుద్భవింపజేయుచుండును. సత్కర్మమువలన మనకు సత్ఫలమును దుష్కర్మమువలన దుష్ఫలమును గలుగుచున్నది. కాని మంచిచెడుగులు రెండును ఆత్మకు బంధనములే. కర్మమునకు గల యిట్టి బంధనస్వభావము నెంచి కర్మఫలములయందు మన మాసక్తులము కాకుందుమేని కర్మములు మనలను బంధింపజాలవనునదియే భగవద్గీతలందు దెలుపబడిన తరణోపాయము. నిష్కామకర్మాచరణ మన నేమో గ్రహింప యత్నింతము.

"తస్మా దసక్త స్సతతం కార్యం కర్మ సమాచర"*—నిరంతరముగా కర్మముల నాచరింపుము; కాని, వానియందు ఆసక్తుడవు గాకుము — అనునదియే భగవద్గీతలోని ముఖ్యాశయము. సంస్కార మనగా ఆంతర ప్రవృత్తియని చెప్పవచ్చును. చిత్తమును సరస్సుతో బోల్చు నెడల అందలి ప్రతివృత్తివీచికయు అం దుదయించి మరల నణగునప్పుడు పూర్తిగా నశింపక, ఒక విధమైన జాడను, ఆ (చిత్త) వృత్తి వీచిక మరల నుదయించు నవకాశమును గలుగ జేయుచున్నది. అట్టి యవకాశముతో గూడిన యీజాడయే సంస్కారమని చెప్పబడును. మనముచేయు ప్రతికార్యమును, శరీరమునందలి ప్రతిచలనమును, మనముచేయు

* భగవద్గీత, 3-19.

ప్రత్యాలోచనమును చిత్తమునం దిట్టి సంస్కారమును గల్గించు చున్నది. ఈ సంస్కారములు పైకి మనకు గోచరింపకున్నను అంతర్గతముగానుండి యజ్ఞాతముగా బనిచేయుటకు తగినంత శక్తి మంతములై యుండును. చిత్తమునందలి సంస్కారసమామ్నాయ ముచే మన స్థితిగతులు అనుక్షణమును నిర్ణీతములగుచున్నవి. ఇప్పు డీక్షణమున నాస్థితి ఇంతకుమునుపు నాజీవితమం దేర్పడియున్న సంస్కారముల సాముదాయకఫలితము. నిజముగా శీల మనగా నిదియే; ప్రతిమానవుని శీలమును ఈ సంస్కారముల మొత్త ముచే నిర్ణీతమగుచున్నది. మంచిసంస్కారములు ప్రబలములుగా నున్నయెడల శీలము మంచి దగును; చెడ్డసంస్కారములు ప్రబల ములుగా నున్నయెడల స్వభావము చెడ్డ దగును. నిరంతర మొకడు చెడ్డమాటలను వినుచు, చెడ్డయాలోచనలను జేయుచు, చెడ్డపనులను జేయుచుండునెడల వానిమానసము చెడ్డసంస్కారము లతో నిండియుండును; వానికి దెలియకుండగనే అవి వాని తలపు లందును కర్మములందును తమప్రభావమును జూపుచుండును. నిజమున కీదుష్టసంస్కారములు సదా పనిచేయుచునే యుండ చెడుగే వాని ఫలితమగును; చెడుసంస్కారములు గలవాడు చెడ్డవా డగుచున్నాడు, కాక వానికి తీఱదు; ఆతని యందలి యీ సంస్కారసముదాయము దుష్కార్యములను జేయ నాతనికి ప్రబల ప్రేరకమగుచున్నది. దుష్టసంస్కారముల చేతులలో నాత డొకయంత్రమై యుండ పాపముచేయ నవి యాతని బురి కొల్పుచున్నవి. ఇట్టులే యొకడు సదాలోచనలు చేయుచు సత్కార్యములను జేయుచుండునెడ వానివలనగలుగు సంస్కార సముదాయము మంచిదగుటచే నాతడు సంకల్పింపకున్నను సత్కా ర్యములనుజేయ నది యాతని నిర్బంధించును. ఎన్నియో సత్కా ర్యములను జేసి సదాలోచనలు జేసియున్నవాని కిక ముందును సత్కార్యములను జేయవలయునని అనివార్యమైన బుద్ధి పుట్టును; ఒకవేళ చెడుగు చేయవలయునని యాతడు కోరినను, ఆతని

సంస్కారము లన్నిటిఫలితముగా నాతని మానసమటుల చేయ నీయదు ; సత్సంస్కారము లాతనిబుద్ధిని మరల్చును ; వానికాతడు సంపూర్ణముగా అధీనుడైయున్నాడు. అట్టివాని సచ్ఛీలము సుప్రతిష్ఠితమైయున్నదని చెప్పనగును.

తన యవయవములను తాబేలు తన బొరుసులోనికి లాగుకొనిన యపుడు నీవు దానిని జంపినను, ముక్కముక్కలుగా గోసినను అందుండి అది వెలువడనిచందమున తన యవయవములను చిత్తవృత్తులను ఎవ్వడు స్వవశమొనర్చుకొనునో అట్టివాని శీలము మార్ప శక్యముకాక స్థిరపడును. తన యాంతరంగిక శక్తుల నాతడు వశపఱచుకొనియుండ నాతని సంకల్పమునకు వ్యతిరిక్తముగా నేదియు వానిని వెలికి తేలేదు. నిరంతర సద్భావములచే చిత్తమున నుదయించు సత్సంస్కారములచే సత్కార్యాచరణ ప్రవృత్తి బలీయమగునపు డింద్రియములను వశమొనర్చుకొనగలుగుదుము. శీలము స్థిరపడున దిట్లే; అటుపిమ్మటనే మానవుడు సత్యమును బ్రాపించును. అట్టి మానవునకు సదాక్షేమమే. అతడెట్టిపాపమును చేయలేడు. అతనిని నీవు ఏసంఘమందైన పెట్టవచ్చును. అతనికెట్టి విపత్తునుండదు. ఇట్టి సత్ప్రవృత్తి గల్గియుండుటకంటెను ఉత్తమమైన స్థితి కలదు. అదియే ముముక్షుత్వము, ఆత్మస్వాతంత్ర్యేచ్ఛ. సమస్త యోగములకును ఆత్మవిముక్తియే పరమావధి. లక్ష్యప్రాపకతయందు అన్ని యోగములును సమానములే. బుద్ధుడు విశేషముగా ధ్యానముచేతను క్రీస్తు ప్రార్థనచేతను బొందిన పరమపదమును ఇతర యోగాపేక్ష లేక కేవల కర్మముచేతనే పొందనగును. బుద్ధుడు కర్మపరాయణుడైన జ్ఞాని ; క్రీస్తు భక్తుడు. ఐనను వీ రిరువురును ఒక్కగమ్యమునే పొందిరి. ఉన్న చిక్కంతయు నిది. మోక్షమనగా సంపూర్ణ విమోచనము—దుష్కర్మజనితబంధము నుండియేగాక సత్కర్మజనిత బంధమునుండియు విమోచనము. ఇనుపసంకెలవలెనే

బంగారుసంకెలయు సంకెలయే. నా వ్రేలికి ముల్లు గ్రుచ్చుకొనిన యెడల దానిని తీసివేయుటకు మఱియొక ముల్లుపయోగింతును, పని తీరినంతనే రెంటి నవ్వల బాఱవైతును; రెండును ముండ్లే యగుటచే రెండవముల్లును పదిలపఱచుకొనుట నా కనావశ్యము గదా. కావున దుష్టసంస్కారములకు సత్సంస్కారములచే ప్రతిక్రియ చేయవలయును, మనస్సునందలి మాలిన్యమంతయు అదృశ్యమగుపర్యంతము, లేదా నిగ్రహింపబడి, మనస్సునం దొకమూలబడి మనవశమై యుండునంతవఱకు, దుష్టసంస్కారములను సత్సంస్కారములచే నూత్నతరంగముల తొలగించుకొనవలయును; గాని యటుపిమ్మట సత్సంస్కారములను సైతము నిర్జింపవలయును. అట్లు "ఆసక్తుడు" "అనాసక్తుడు" అగును. కర్మమొనర్పుము, కాని నీ వొనర్చు కార్యముచేతగాని, తలంపుచేతగాని నీ మానసమున ప్రగాఢ సంస్కారము గల్గకుండుగాక; చిట్టి కెరటాలు రానీ, పోనీ, ఘనకార్యములు నీ కండరములనుండియు బుద్ధినుండియు, వెలువడునుగాక. కాని మనసుపై నవి ఎట్టి గాఢ సంస్కారమును గల్గింపకుండుగాక.

కాని దీనిని సాధించుటెట్లు? దేనియందు మన మాసక్తులమో అట్టికార్యమువలన గలుగు సంస్కారము నిలిచియుండును. పగలు నేను వందలకొలది జనులను గలిసికొనవచ్చును. వారిలో నాకు ప్రియుడగువాని నొకనినిగూడ గలిసికొనవచ్చును; రాత్రి నేను పరుండబోవునపుడు పగలు చూచిన ముఖముల నన్నిటిని గూర్చియు చింతింప యత్నింపవచ్చు; అపుడు ఒకనిముసముమాత్రమే చూచినట్టియు ఐనను నేను ప్రేమించినట్టియు వదనముమాత్రమే నా మనోవీథిని నిలుచును; ఇతరము లన్నియు అదృశ్యములగును. మిగిలినవా రందఱియందుకంటెను ఈ ప్రత్యేక వ్యక్తియందు నాకు గలిగిన ఆసక్తి నా చిత్తమున గాఢతర సంస్కారమును గల్గించినది. శారీరకముగా జూచినయెడల ఇందలి

నా సంస్కారము లన్నియు నొక్కవిధమైనవే; నేనుచూచిన ప్రతివదనమును నా నేత్రాంతః పటలము (రెటీనా) లో ప్రతిబింబితమగునపుడు మెదడు వానిని లోనికి గొనిపోయినను చిత్తమున వానిచే ఒక్కవిధమగు ప్రతిక్రియయే గలుగుటలేదు. ఆ ముఖములలో ననేకములు మున్నెన్నడును నే నెఱిగినవి కాక నాకు పూర్తిగా క్రొత్తవై యుండవచ్చును. కాని క్షణకాలము నాకు గోచరించిన యా వదనమునకు సంబంధించిన భావములు ముందే నా మనస్సులో నుండియుండవలయును. ఆతని రూపము నా మనఃఫలకమున అనేక సంవత్సరములనుండి ముద్రితమై యుండియుండును; ఆతనిగూర్చి వందలకొలది విషయములు నాకు తెలిసియుండును. ఆతని యీ నూతనదర్శనము నా చిత్తమున నిద్రాణములై యున్న వందలకొలది స్మృతులను మేల్కొల్పినది; ఇతర ముఖములు నా మనస్సులో ముద్రితములైనంతకంటె, నూరు పర్యాయము లెక్కువగా ఇది ముద్రితమైనందున మానసముపై విశేషప్రాబల్యమును జూపును.

కావున "అసంగుడవై" వర్తింపుము; కార్యములను జరుగనిమ్ము, ఇంద్రియములను వ్యాపారములను జేయనిమ్ము; సదా, సర్వదా కర్మముల నాచరింపుము. కాని ఏ కెరటమునకును నీ మనస్సును లొంగనీయకుము. క్రొత్తవానివలె, ఆగంతుకుడగు విదేశీయునివలె ఈ లోకమున కార్యముల నొనర్పుము. నిరంతర కర్మనిరతుడవయ్యు, బద్ధుడవుగాకుము. బంధము భయంకరము. ఈ ప్రపంచము మన నివాసముగాదు. ఇది మన యాత్రలో మనము దాటవలసిన పెక్కు మజిలీలలో నొకటి. "ఆత్మార్థత్వాత్ సృష్టేః"* సమస్తప్రకృతియు ఆత్మకొఱకే, ఆత్మ ప్రకృతికొఱకు కాదను సాంఖ్యసూత్రమును స్మరింపుడు. పురుషుని శిక్షణముకొఱకుమాత్రమే ప్రకృతి యేర్పడియున్నది; దాని ఉనికి

* సాంఖ్యసూత్రము, 2-11.

కింతకంటె మఱియొక అర్థము లేదు. పురుషుడు జ్ఞానవంతుడై కైవల్యము నొందవలయును, అందుకే ప్రకృతి సంస్థితమైయున్నది.† మన మీ తత్త్వమును సదా గుర్తించినచో ప్రకృతితో నెన్నడును సంగము నొందనేరము; ప్రకృతి మనము చదువవలసిన గ్రంథమనియు, ఆర్జింపవలసిన జ్ఞానము నార్జించినంతనే ఇక నీ పొత్తము మనకు నిష్ప్రయోజనమనియు మనము తెలిసికొందుము. ఏమైనను ఇందులకు బదులుగా మనము ప్రకృతితో తాదాత్మ్యము నొందుచు, 'ప్రకృతికొఱకు పురుషు డేర్పడియున్నా'డని — 'శరీరముకొఱకే శరీరి' యని—తలంచుచు, సామాన్యలోకోక్తి చొప్పున తనువు నిల్చుటకై తినుటగాక తినుటకై తనువు నిల్పుకొనుచున్నాము; సదా ప్రకృతియే మనమని భ్రమించుచు ప్రకృతిమోహితుల మగుచున్నాము: ఇట్టి మోహము (సంగము) జనించినంతనే మానసమున ప్రగాఢసంస్కార మేర్పడుచున్నది. అది మనలను బద్ధులనొనర్చి స్వేచ్ఛచే కాక బానిసలవలె క్రియల నొనర్పజేయుచున్నది.

కర్మయోగోపదేశ సారమంతయు నిది: బానిసవలెగాక ప్రభునివలె, కార్యముల నొనర్పుము; నిరంతరము కర్మమొనర్పుము, కాని బానిసవలె నొనర్పకుము. ప్రతివ్యక్తియు నెట్లు కర్మము నాచరించునో మీరు చూచుచున్నారుగదా. ఎవ్వరికిని నిండువిరామము లేదు; నూటికి తొంబదితొమ్మండుగురు బానిసలవలె క్రియల నొనర్చుచుందురు, దుఃఖమే అందులకు ఫలము; అదియంతయు స్వార్థపరమైన కర్మము. బంధరహితుడవై కర్మమొనర్పుము. ''ప్రేమ'' శబ్దార్థమును గ్రహించుట చాల దుష్కరము; స్వాతంత్ర్యమున్ననేకాని ప్రేమ మెన్నడును ఉప్పతిల్లదు. బానిసయందు నిజమైన ప్రేమము ఉండజాలదు. నీవొక బానిసను గొని, గొలుసులచే బంధించి నీకై కార్యముల నొనర్ప నియమిం

† "....అపవర్గార్థం దృశ్యమ్"—పాతంజలయోగసూత్రములు, 2-18.

చితివేని గులామువలె నాతడు పనిచేయును గాని వానికి ప్రేమము ఉండజాలదు. కావున మనముకూడ బానిసలవలె ప్రాపంచిక విషయములకొఱకు కర్మ మొనరించునెడల మనలో ప్రేమ ముండదు, మన కర్మము నిజమైన కర్మము కానేరదు. మిత్రుల కొఱకును బంధుగులకొఱకును చేయు కర్మము మాత్రమే కాదు. మనకొఱకు మనము చేయు కర్మమువిషయముకూడ నిట్టిదే. స్వార్థపరమగు కర్మాచరణము దాసుని కర్మాచరణము, కర్మయోగ్యతకు నిదర్శనమిది: ప్రేమసంజనితమైన ప్రతికార్యమును ఆనందము నొనగూర్చును; శాంతిప్రదముకానట్టి—బ్రహ్మానందప్రదముకానట్టి — ప్రేమసంజనితకార్య మెద్దియు నుండజాలదు. నిజమైన అస్తిత్వము, నిజమైన జ్ఞానము, నిజమైన ప్రేమము ఒండొంటితో శాశ్వతముగా సంబద్ధములై యున్నవి; ఇవి మూడును ఒక్కటే: ఇం దొకటి ఉన్నచో తక్కిన రెండును నుండితీఱవలయును; సచ్చిదానంద స్వరూపమగు నద్వితీయ బ్రహ్మమున కివి మూడును మూడువైఖరులు. ద్వంద్వదశకు దిగినప్పుడు ఆ బ్రహ్మము ఈ ద్వైతప్రపంచరూపమున మనకు గోచరించుచున్నది; ఆ జ్ఞానమే ప్రాపంచికజ్ఞానముగా పరిణమించుచున్నది; ఆ యానందమే మానవహృదయవేద్యమగు నిక్కమైన ప్రేమకంతకును మూలాధారము. కావున నిజమైన ప్రేమము వలన ప్రేమించువానికిగాని, ప్రేమింపబడుదానికిగాని ఎన్నటికిని బాధ కలుగజాలదు. ఒక డొకస్త్రీని ప్రేమించు ననుకొనుడు; ఆమె పూర్తిగా తనకే దక్కవలయునని యాతడు కోరును; ఆమె ప్రతిచలనమునుగూర్చియు అత్యంతముగా అనుమానించుచుండును; ఆమె తనయొద్ద కూర్చుండవలయునని, నిలుచుండవలయునని, భుజింపవలయునని, వేయేల, తన యాజ్ఞానుసారమామె వర్తింపవలయునని కోరును. తా నామెకు దాసుడు కావున నామెయు తనకు దాసురాలై యుండవలయునని అతడు కోరును. అది ప్రేమకాదు; ప్రేమాంబరమును గప్పికొనియుండు

మోహవ్యాధి బోనిసది. దానివలన బాధ గలుగుచున్నది కావున నది ప్రేమ కాదు. ఆతడు కోరినదానిని ఆమె చేయకున్న ఆతడు బాధపడుచున్నాడు. ప్రేమకు ఫలముగా నెన్నడును బాధ కలుగదు. ఆనందమే ప్రేమకు ఫలము. ఆనందప్రదము కానిచో అది ప్రేమగాదు, ప్రేమాన్యమగు దానిని ప్రేమమని భ్రమించుట. ఎట్టిబాధయు, అసూయయు, స్వార్థపరమైన భావమును గలుగని రీతిని నీవు నీ భర్తను, భార్యను, బిడ్డలను, లోకమును, విశ్వమును ప్రేమింపగలిగిననాడు నీవు అసంగుడవు కాదగిన స్థితిని బొంది యున్నట్లు.

శ్రీకృష్ణు డర్జునునితో నిట్లనును: "అర్జునా, ఇటు చూడుము. క్షణమైనను నేను కర్మమును విరమించినయెడల ప్రపంచమంతయు నశించును. కర్మమొనర్చుటచే నేను పొంద దగిన లాభము లేశమును లేదు. నేను ఏకేశ్వరుడను, మఱి నే నెందులకు కర్మ మొనర్పవలయును? జగమును ప్రేమింతును కావున." భగవంతుడు విశ్వమును ప్రేమించుటచే అసంగుడై యున్నాడు; అట్టి నిజమైన ప్రేమ మనలనుగూడ అసంగుల నొనర్చును. ఎచ్చట సంగమున్నను, ప్రాపంచికవిషయముల యెడ మమకారమున్నను, అదియంతయు ఒకవిధమైన ప్రాకృత రేణువులకు గలుగు భౌతికాకర్షణమనియు, అది రెండు శరీరములను సదా ఒండొంటియొద్ద కాకర్షించుచు, అవి సన్నిహితములు కాజాలనియెడల బాధ కలిగించునదనియు మీరు తెలిసికొనవల యును. కాని నిజమైన ప్రేమ భౌతిక సంబంధముపై నాధారపడి నది కాదు. అట్టి ప్రియులు ఒండొరులనుండి వేలకొలదిమైళ్ల దూరమున నుండవచ్చును. కాని వారి యన్యోన్యప్రేమము ఏకరీతిగనే ఉండును; అది నశింపదు. అది యెన్నడును బాధా కరము కానేరదు.

ఇట్టి యనాసక్తి నలవఱచుకొనుటకు జీవితకాలమంతయు పట్టవచ్చు; కాని యీ స్థితిని బొందినంతనే ప్రేమపరమావధి

నొంది విముక్తుల మగుదుము; ప్రకృతిబంధవినిర్ముక్తులమై ప్రకృతిని దాని స్వస్వరూపమున దర్శింతుము, ప్రకృతి మనల నిక బంధింప జాలదు; సంపూర్ణ స్వతంత్రులమై యపుడు కర్మఫలముల నిసుమంతయు లక్షింపకుందుము; కర్మఫలము లెట్టివైన కానిండు, ఎవరికి లక్ష్యము?

నీ బిడ్డలకు నీ సగువానికి వారిని నీ వేమైన ప్రతిఫల మర్థింతువా? వారికై పాటువడుట నీ విధి, అంతే. నీ బిడ్డల యెడ నీ వెట్టి మనోభావము వహింతువో అట్టి మనోభావమునే నీవు ఉపకరించు వ్యక్తిపట్ల, పురముపట్ల, రాష్ట్రముపట్ల వహింపుము—ప్రతిఫల మెన్నడపేక్షింపకుము. దాతవై ప్రతివస్తువును లోకమునకు ఫలాపేక్షారహితముగా సమర్పింపగల్గినయెడల నీ కర్మములు నీకు బంధమును గల్పింపవు. ఫలాపేక్ష యున్నప్పుడే బంధము గలుగుచున్నది.

బానిసవలె క్రియల నొనర్చుట బంధమును స్వార్థపరత్వమును గల్పించుచో ఆత్మస్వాతంత్ర్యముతో కర్మ మాచరించుట సంగరాహిత్యజనితానందము నొనగూర్చును. న్యాయమును గూర్చియు ధర్మమునుగూర్చియు తఱచు మనము ఏమేమో చెప్పుచుందుముగాని న్యాయధర్మము లనునవి లోకమున కేవలము శిశుజల్పితములని మనము కనుగొందుము. బలము, కారుణ్యము అనునవి రెండే మానవ వర్తనమును నిర్ణయించునట్టివి. బలమును జూపుట విధిగా స్వార్థపరత్వమును జూపుటయే. తనకున్న అధికారముచేత ఆనుకూల్యములచేత వీలైనంతవఱకు తాను లాభపడుటకే ప్రతివ్యక్తియు ప్రయత్నించుచుండును. కారుణ్యమో, సాక్షాద్దివ్యతయే; మంచివారముగ నుండవలె ననిన మనమందఱము కరుణగలిగియుండవలయును. న్యాయమును హక్కులును సహితము కారుణ్యముమీదనే ఆధారపడియుండవలయును. కర్మఫలాపేక్షయంతయు మన ఆత్మాభివృద్ధిని నిరో

ధించును ___ అంతేకాదు, పర్యవసానమున దుఃఖకరమగును.
కారుణ్యమును స్వార్థరహితౌదార్యమును మన యాచరణమున పెట్టుటకు మఱియొక విధానము కలదు; మనము సాకార దైవమును నమ్మునెడ మన కర్మమును "ఆరాధన"గా భావించుటయే యీ విధానము. ఇందు మన కర్మఫలముల నన్నిటిని భగవానున కర్పింతుము; భగవాను నిట్లారాధించునెడ మనముచేయు కర్మములకు మానవకోటినుండి ప్రతిఫల మపేక్షింప మన కధికారము లేదు. సాక్షాద్భగవానుడును నిరంతర కర్మనిరతుడై అసంగుడై యున్నాడు. నీరు తామరాకును తడుపజాలని రీతిని స్వార్థరహితు డగువానికి ఫలసంగమును గల్పించి కర్మము వానిని బంధింప జాలదు. నిస్సంగుడు, స్వార్థరహితుడు నగువాడు పాపభూయిష్ఠము, జనాకీర్ణమునగు పట్టణపు నట్టనడుమ నివసించుచున్నను వానిని పాపము స్పృశింపజాలదు.

సంపూర్ణ స్వార్థరాహిత్య మన నెట్టిదో ఈ క్రిందికథచే నిరూపితమగుచున్నది. కురుక్షేత్ర యుద్ధానంతరము పంచపాండవులు అశ్వమేధయాగ మొనర్చి బీదల కపార దానధర్మము లొనర్చిరి. జనులెల్లరు ఆ యాగ ఘనతను వైభవమును గాంచి యబ్బురపాటు దెల్పుచు నట్టియాగమును లోక మింతదనుక కన్నది లేదని చెప్పుకొనసాగిరి. యాగానంతరము ఒక చిన్న ముంగిస యచటికి వచ్చెను; దానిశరీరము సగము బంగారు వన్నెతోడను సగము గోధుమ వన్నెతోడను ఒప్పుచుండెను. అది యజ్ఞమంటపమున నటునిటు పొరల నారంభించెను. తన చుట్టునున్న జనులను జూచి అది యిట్లనియె: "మీ రందఱును అసత్యవాదులు. ఇది యొక యజ్ఞము కానేకాదు". అంతట జను లిట్లు పల్కిరి: "ఏ మేమి? ఇది యజ్ఞమే కాదందువా? ధనమును నగలును బీదల కెట్లు ధారాపాతముగా కురిపింపబడినవో, ఎల్లరు నెట్లు భాగ్యవంతులై సుఖవంతులై యున్నారో నీ వెఱుగవా?

మానవానుష్ఠిత యాగములలో నిది మహాద్భుతతమము.'' అందులకు ముంగిస యిట్లు పల్కెను: ''ఒక్కప్పు డొక చిన్నగ్రామము ండెను. అందొక పేదబ్రాహ్మణుడు తనభార్యతోడను, కుమారునితోడను, కోడలితోడను నివసించుచుండెను. వారు నిఱుపేదలు. అతని బోధలకు ఉపదేశాలకు వారు వీరు చేయు స్వల్పసంభావనలే అతని బ్రతుకు కాధారము. ఇట్లుండగా ఆ దేశమున మూడుసంవత్సరముల పర్యంతము గొప్పకాటకము సంభవించెను. దానిచే ఆ పేదబ్రాహ్మణు డెప్పటికంటె హెచ్చుగ కష్టపడెను. దినములకొలది కుటుంబము పస్తుండ తండ్రి యెట్లో ఒకయుదయమున భాగ్యవశమున గొంత బియ్యపుపిండిని సంపాదించి తెచ్చి దానిని నాలుగు భాగములుచేసి కుటుంబమునందలి నల్వురకును బంచెను. వారు దానిని ఉడుకబెట్టుకొని భుజింపబోవుచుండ నింతలో నెవ్వరో తలుపు తట్టుచున్నట్లు వినవచ్చెను తండ్రి తలుపు తెఱవ నట నొక యతిథి నిలువబడియుండెను. భారతదేశమున అతిథి అనగా పవిత్రపురుషుడు, వానిని దైవముగా నెంచి పూజింపవలయును. కావున నా బీదబ్రాహ్మణుడు 'స్వాగతము, లోనికి రండు' అని వాని నాహ్వానించి తనవంతునకు పెట్టుకొన్న యాహారమును వానికి సమర్పించెను. ఆతడు దానిని క్షణములో భక్షించి యిట్లు పలికెను: 'చంపివైచితివయ్యా! పదిదినములనుండియు పస్తుపడియున్న నా కీ రవంతపిండియు ఆకలిని వృద్ధిచేసినది.' అది విని భార్య భర్తతో తనవంతునకు వచ్చిన యాహారమునుగూడ నాతనికి సమర్పింపుడని పలుక భర్త యంగీకరింపమి ఆమె యి ట్లనియెను: 'పాప మిత డిటకు వచ్చినాడు, ఈతని యాకలి బాపుట గృహస్థులమగు మన కర్తవ్యము గదా! ఈతని కిడుటకు మీయొద్ద నిక నేమియు లేనపుడు నా భాగమును సమర్పించుట భార్యనగు నా విధి.' ఇట్లని యామె తన భాగమును అతిథి కొసగెను. ఆతడు దానిని వెంటనే తినివైచి, 'ఆకలితో మాడిపోవుచున్నాను' అని పలికెను. బ్రాహ్మణునిపుత్త్రు

డంతట, 'నా భాగమునుగూడ స్వీకరింపుడు; తండ్రి బాధ్యతలను నిర్వర్తించుట పుత్త్రునివిధిగదా' యని తనభాగమునుగూడ అతిథికి సమర్పించెను. ఆతడు దానిని భుజించియు తృప్తినొందలేదని గ్రహించి కోడలు తనభాగమునుగూడ సమర్పించెను. అది తిని యాతడు సంతృప్తుడై వారలను దీవించి వెడలిపోయెను. నాటి రాత్రి యా కుటుంబమునందలి నలువురును క్షుద్బాధచే మరణించిరి. ఆ పిండియందలి కణములు కొన్ని నేలపై బడినవి. వానిపై నేను దొరలినంతనే నా శరీరమున సగము మీకు గాన్పించురీతిని సువర్ణవికారమైనది, అట్టి యజ్ఞమును మఱొక దానిని గనుగొనుటకై నాటినుండియు నేను లోకమంతయు తిరుగుచున్నాను; కాని యింతవఱకు నాకు గాన్పింపలేదు; నా శరీరమున రెండవప్రక్క మఱియెచ్చటను సువర్ణవికారము కాలేదు. నేనిది యజ్ఞమే కాదనుటకు కారణమిది!"

భారతదేశమునుండి త్యాగబుద్ధి పలాయన మగుచున్నది; మహాత్ములసంఖ్య నానాటికి క్షీణించుచున్నది. నే నాంగ్లభాష నేర్వ నారంభించినపుడు ఒక యాంగ్లపుస్తకమున విధేయుడగు నొకబాలునిగూర్చి యొక కథ చదివితిని. ఆతడు ఇల్లు విడిచి పనిచేయ వెడలి ముదుసలియగు తనతల్లికి తాను సంపాదించిన ధనములో గొంతభాగ మిచ్చెనట. ఇది మూడునాలుగు పుటలలో శ్లాఘింపబడినది. ఇం దేమున్నది? హిందూబాలుడైన ఈ కథ యందలి నీతియేమో ఎన్నటికిని గ్రహింపజాలడు. "ఎవరికి వారే" యను పాశ్చాత్య ధర్మతత్త్వమును విన్న నాకిపు డా కథ యందలి నీతి బోధపడుచున్నది. "చిన్న నా పొట్టకు శ్రీరామ రక్ష" యని ఇక గొంద ఱన్నిటిని తమకొఱకే భద్రపఱుచుకొనుచుండ తల్లులు, తండ్రులు, భార్యలు, బిడ్డలు దిక్కులేనివా రగుచున్నారు. ఇది ఏ దేశమునగాని ఏ కాలమునగాని గృహస్థాదర్శము కాగూడదు.

కర్మయోగమన నెట్టిదో మీ కిపుడు తెలిసినది— ప్రాణములనైనను లక్షింపక ప్రశ్నలేవియు అడుగక పరులకు దోడ్పడుటయే కర్మయోగము. వేలకొలది పర్యాయములు వంచింపబడుదురుగాక, కాని ఏమియు అడుగకుడు. ఇంత ఘనకార్య మొనర్చుచున్నామని కలనైనను తలపకుడు. బీదలకు మీరు చేయు దానధర్మములనుగూర్చి యెన్నడును ప్రగల్భములు పలుకకుడు. వారి కృతజ్ఞతను నిరీక్షింపకుడు. సరికదా, దానమొనర్చుటకు మీ కవకాశ మొసగినందులకై వారియెడ మీరే కృతజ్ఞులై యుండుడు. ఆదర్శసన్న్యాసియై మనుటకంటెను ఆదర్శగృహస్థుడై మెలగుట కష్టతరమనియు లేదా నిజమైన కర్మయోగిజీవనము నిజమైన సన్న్యాసజీవనముపాటియైనను కష్టమనియు మనకు స్పష్టపడినది.



# కర్తవ్య మనగా నేమి?

కర్మయోగవివేచనమున కర్తవ్యమనగా నేమో గ్రహించుటావశ్యకము. నేనొకపని చేయవలసియున్నప్పుడు అది నాధర్మమని మొట్టమొదట నేను గ్రహింపవలసియున్నది. తర్వాతనే దానినిచేయ నేను సమర్థుడ నగుదును. ధర్మమునుగూర్చి భిన్న దేశములందు భిన్నాభిప్రాయములు కలవు. మహమ్మదీయుడు కురానులో నేమి చెప్పబడియున్నదో అదియే తనధర్మ మనును; క్రైస్తవుడు బైబిలులో నేమి చెప్పబడియున్నదో అదియే తన ధర్మమని వక్కాణించును. భిన్న జీవితపరిస్థితులను, భిన్న చారిత్రక యుగములను, భిన్న దేశాల ననుసరించి ధర్మమునుగూర్చిన యభిప్రాయములు భేదిల్లుచుండుట మనకు ప్రత్యక్షము. సర్వజన సామాన్యములును, గ్రహింప దుర్లభములు నగు నితర శబ్దములను నిర్వచించు టెట్లు అసాధ్యమో అట్లే ధర్మమునుగూర్చియు నిట్టిదని నిర్వచించుట యసాధ్యము. ఆచరణమున ధర్మరీతిని, ధర్మానుష్ఠానమువలని ఫలములను గమనించితిమేని ధర్మమనగా నెట్టిదో ఇంచుక మనకు బోధపడును. కొన్ని సంఘటనములు మన యెదుట జరుగునపుడు సహజముగనో, శిక్షణముచేతనో ఒకానొక విధముగ ప్రవర్తింపించు అంతఃప్రేరణము మనకందఱకును గలదు; ఇట్టి ప్రేరణ కలిగినంతనే పరిస్థితినిగూర్చి మనస్సు ఆలోచింప మొదలిడును; ఒక్కొక్కప్పుడు కొన్నిపరిస్థితులలో ఒకానొక విధముగా వర్తించుట మంచిదని మనస్సు తలచును; మఱియొకప్పుడా పరిస్థితులందే ఆ విధమున వర్తించుట మంచిదికాదని తలచును. యోగ్యుడగు ప్రతిమానవుడును తన యంతఃకరణప్రవృత్తి ననుసరించు ననునది ధర్మమునుగూర్చి సర్వత్ర ఉన్న సామాన్యాభిప్రాయము. కాని యొకకార్యమును ధర్మమని నిర్ణయించు టెట్లు? కట్టెదుట గోమాంసముండగా క్రైస్తవుడు ప్రాణరక్షణార్థము

దానిని తాను తినకుండినగాని, మఱియొకనికి బెట్టకుండినగాని తన ధర్మమును తాను నెఱవేర్పలేదని నిశ్చితముగ భావించును. కాని హిందువు గోమాంసమును తాను తినుటకుగాని పరులకు బెట్టుటకు గాని సాహసించెనేని తనధర్మమును తాను నెఱవేర్పలేదనియే అతడు తప్పక భావించును. హైందవుడు నేర్చిన విద్యయు, పొందిన శిక్షణమును ఆతని నట్లు భావింపజేయుచున్నవి. గతశతాబ్దమున భారతదేశమున పేరుమోసిన థగ్గులను బందిపోటుదొంగలుండిరి. తమచేతనైన వారినెల్ల జంపి వారి ధనమును దోచుకొనుట తమ ధర్మమని వారు తలచిరి; ఎంతమందిని జంపిన అంత తమకు మేలని వారు భావించిరి. వీథిలోనికిపోయి యొకడు మఱియొకనిని తుపాకితో గాల్చి చంపినయెడల సాధారణముగా అట్టివాడు తన కృత్యమునుగూర్చి పశ్చాత్తాపపడవచ్చును. పాపము చేసితి ననుకో వచ్చును. కాని యాతడే పటాలములో సైనికుడై యొకనిని గాదు, ఇరువదిమందిని జంపినను అందులకై యానందించి తన ధర్మమును తాను అద్భుతముగా నిర్వహించితి నని తప్పక భావించును. కావున చేయబడిన కార్యమునుబట్టి ధర్మనిర్ణయము కానేరదనుట తెల్లము; ధర్మమును ధర్మమునుబట్టియే నిర్ణయము చేయుట కేవలము అసాధ్యము. కాని కర్తనుబట్టిచూచిన ధర్మ మనునది కలదు. మనలను భగవంతునొద్దకు చేర్చునట్టి కార్య మేదైనను సత్కార్యమే, అదియే మనధర్మము; మనల నధోగతి నొందించున దేదైనను దుష్కార్యమే, అది మనధర్మము కాదు. ఇట్లు కర్మమొనర్చువారమగు మన మనఃస్థితిననుసరించి కొన్ని కార్యములు మనల నుద్ధరించి మన కుదాత్తత గల్పింప గలినవై యుండ మఱికొన్ని మనలను పశుప్రాయులనుగాజేసి అధోగతి నొందింపగలవని గ్రహింపనగును. కాని సర్వవిధపరిస్థితులలో నుండు సర్వజనులనుబట్టి ఏకార్యమునకెట్టి ప్రవృత్తి గలదో, నిర్ణయించుట కష్టసాధ్యము. ఐనను ధర్మమునుగూర్చి సర్వకాలము లందును, సర్వదేశములందును సర్వవర్గములవారును ఆమోదించిన

ఆశయ మొకటికలదు. అది ''పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడనమ్''—'పరుల కుపకార మొనర్చుటయే పుణ్యము, పరులను పీడించుటయే పాపము' అను సంస్కృతవాక్యమున సూత్రితమైనది.

పుట్టుకచేతను సంఘమందలి స్థానముచేతను నిర్వర్తింపవలసివచ్చు ధర్మములను భగవద్గీత తఱచు తెల్పుచుండును. జీవితమందలి వివిధకార్యకలాపములపట్ల మనుజుల మానసిక నైతిక వైఖరిని, వారిజన్మమును సంఘమున వారిస్థానమును చాలవఱకు నిర్ణయించును. కావున మన మే సంఘమున జన్మించితిమో తదాదర్శములకును ఆచారములకును అనుగుణమగు నున్నతిని ఉదాత్తతను గలుగజేయు కర్మము నొనర్చుటయే మనధర్మము. కాని యన్ని సంఘములందును, అన్ని దేశములందును ఒక్కవిధమగు నాదర్శములుగాని ఆచారములుగాని యుండవని ముఖ్యముగా మనము గమనింపవలసియున్నది; ఇట్లు మనము గమనింపకుండుటయే వివిధదేశీయుల కొండొకరియందలి ద్వేషమునకు జాలవఱకు మూలకారణము. అమెరికాదేశీయుడు దేశాచారము ననుసరించి తన దేశీయు డేమియొనర్చునో అదియే ఉత్తమోత్తమధర్మమనియు తనయాచారము ననుసరింపని వా డెవ్వడైనను సరియే పరమ దుర్మార్గుడనియు తలచును. హిందువు తన యాచారములు మాత్రమే సరియైనవనియు ప్రపంచమంతటియందును ఉత్తమోత్తమములనియు నెంచుచు వానిననుసరింపని వా డెవ్వాడుగానిండు, పరమదుర్మార్గుడని తలపోయును. సహజముగా మన మందఱము ఈ పొరపాటునకు లోనగుచుందుము. కాని యిది చాల హానికరము; లోకమునందలి నిర్దాక్షిణ్యమునకు సగమువఱకు నిదియే హేతువు. నే నీ దేశమునకువచ్చి షికాగోబజాఱుగుండ పోవుచుండ వెనుకనుండి యొకడు నా తలపాగను లాగెను. వెనుకకు జూతునుగదా, నీటగు దుస్తులతో, అతడు చాలపెద్దమనుష్యుని వలె గనపడినాడు. నే నాతనితో మాటాడుసరికి, నాకు 'ఇంగ్లీషు'

వచ్చునని గ్రహించి యాతడు చాల సిగ్గుపడినాడు. ఆ బజాఋలోనే మఱియొకప్పుడు ఒకడు నన్నొకత్రోపుత్రోసినాడు. కారణమేమని నేనాతని బ్రశ్నింప నాతడును సిగ్గుపడి "ఆవిధమైనదుస్తులెందుకు ధరించితి" రనిఅడిగి క్షమాపణ వేడుకొనెను. వీరిసానుభూతియంతయు తమ వేషభాష లను సరిహద్దులలో బంధింపబడియున్నది. లోకమున బలవద్దేశాలు బలహీనదేశాలను అణగద్రొక్కి బాధించుటకు జాలవఱకు ఈ దురభిమానమే కారణము. దీనిచే సోదరమానవకోటియెడ వారిసోదరభావము ఇంకిపోవుచున్నది. తనవలె నేనెందులకు దుస్తులను దాల్పలేదని నా (కాషాయ) వస్త్రములను జూచి నన్ను అవమానింపజూచిన యావ్యక్తియే సజ్జనుడై, సజ్జనకుడై, సత్పౌరుడై యుండవచ్చును; కాని తనకంటె వేఱువిధమున వస్త్రధారణ మొనర్చిన వ్యక్తిని జూచినంతనే ఆతని సహజమార్దవము సమసిపోయినది, సర్వదేశములందును దేశీయులు క్రొత్తవారిని తమ లాభమునకు ఉపయోగించుకొందురు. ఏలన తమ్ముతాము ఎట్లు కాపాడుకోవలెనో వారికి తెలియదు. అందుచేత తాము చూచిన వ్యక్తులను గూర్చిన తప్పభిప్రాయములతోనే వారేగుదురు. నావికులును, సైనికులును, వర్తకులును విదేశములలో చాలవింతగ బ్రవర్తించుచుందురు. స్వదేశమున గలనైనను అట్లు ప్రవర్తింప దలపరు. ఇందుకేకాబోలు ఐరోపాదేశీయులను అమెరికాదేశీయులను చైనావారు "విదేశీయరాక్షసులు" (ఫారిన్డెవిల్స్) అని చెప్పుచుందురు. పాశ్చాత్యజీవనవిధానమందలి దయాసౌజన్యములను దరిసియున్నచో వారిట్లు పలికియుండరు.

కావున పరుల ధర్మమును వారిదృక్పథము ననుసరించియే మనము చూడయత్నింపవలయునే కాని మనధర్మనిర్ణయములను బట్టి యెన్నడును పరుల యాచారవ్యవహారములను పరిశీలింపరాదనుట ఒక్కటే ముఖ్యముగా మనము గుర్తింపవలసినవిషయము.

లోకమునకు మానా నేను గాను. లోకమును నేననుసరింపవలెనే కాని నన్ను లోక మనుసరింప నక్కఱలేదు. కావున పరిసరముల ననుసరించి మన ధర్మస్వరూపము మాఱుచుండుననుటయు, ఏ సమయమున కేది ధర్మమగునో దాని నాచరించుటయే ఈ లోకమున మనము చేయదగిన ఉత్తమోత్తమ కార్యమనుటయు స్పష్టము. వర్ణధర్మము నాచరింతుముగాక; అటు లాచరించిన పిమ్మట జీవితమందును సంఘమునందును మన స్థానముననుసరించి ప్రాప్తమగు ధర్మము నాచరింతముగాక. ఎట్లైనను మానవస్వభావమున నొక గొప్ప ప్రమాదము కలదు — అత డెన్నడును ఆత్మ పరీక్ష చేసికొనడు. సింహాసనము నధిష్ఠించుటకు చక్రవర్తి కెంతటి యోగ్యతకలదో తనకును అంతటి యోగ్యత కలదని తలచుచుండును. ఒకవేళ తనకట్టి యోగ్యతయున్నను తన విధ్యుక్త ధర్మమును మొదట తాను నెఱవేర్చి చూపవలయును; తర్వాత నంతకంటె ధర్మములు అతని కేర్పడుచుండును. మనఃపూర్వకముగా మనము కర్మాచరణమునకు దిగినంతనే ప్రకృతి మనకు ప్రహారణముల నొసగి నిజముగా మన 'తాహతు' ఎట్టిదో తెలిసికొనుటకు మనకు దోడ్పడును. తనకు అర్హతలేని స్థానము నెవ్వడును చిరకాల మధిష్ఠించియుండలేడు. ప్రకృతిలో సాగు సరుదుపాట్లకు విసుగుకొనుటవలన ప్రయోజనములేదు. క్రిందిమెట్టు పనులను జేయువా డందుచే క్రిందిమెట్టువాడుకాడు. ఏమానవుని గుణదోషములనుగాని అతని పనుల స్వరూపమును బట్టి నిర్ణయింపరాదు. ఏ దృష్టితో, ఏ విధముగా ఆతడు తన కర్మములను నిర్వహించునో దానినిబట్టి మానవుని న్యూనతాధిక్యములను నిర్ణయింపనగును.

కర్తవ్యమును గూర్చిన యీ యాశయముకూడ మార్పు చెందుననియు స్వార్థప్రేరణ లేనప్పుడే అత్యంత ఘనకార్యములు నెఱవేఱుచుండుననియు తర్వాతతర్వాత మనము గుర్తింతుము.

ఐనను కర్తవ్యతాబుద్ధితోఁ గూడిన కర్మాచరణమే కేవలనిష్కామ కర్మాచరణమునకు మనలను అందించును. అప్పుడు కర్మ ఆరాధనమగును. అంతేకాదు, అంతకంటె పైదగును. అప్పుడు కర్మము కర్మముకొఱకే ఆచరితమగును. నీతిరూపమునగాని ప్రీతిరూపమునగాని, కర్మతత్త్వము ఇతరయోగములందెట్లో ఇచ్చటను అట్లే. ఉద్దేశ్యమిది — ఉన్నత యథార్థాత్మ ప్రకాశించుట కనువుగా, జఘన్యాత్మను పలుచవాఱించుట. ఉన్నత రంగములలో ఆత్మ ఆవిష్కృతమగుట కనువుగా జీవిత జఘన్యరంగములలో శక్తులను వ్యర్థపఱుపకుండుట, క్షుద్రతృష్ణలను నిరంతరము నివారించుకొనుట—వీనిచే, ఇది సిద్ధించును. వానిని నివారించుకొమ్మని ధర్మము కచ్చితముగ కోరును. తెలిసియో తెలియకో కర్మానుభవరంగములలో సంఘవ్యవస్థయంతయు పెంపొందిన దిట్లే. ఆరంగములలో స్వార్థపరతను అణచుకొన్నచో మానవుని పారమార్థికతత్త్వ నిరవధికవికాసమునకు దారితెఱచినవార మగుదుము.

కర్తవ్య మెప్పుడును రుచింపదు. ఆచక్రము ప్రేమస్నిగ్ధమైనపుడే చక్కగా నడచును; కానిచో నిరంతరసంఘర్షణ మేర్పడుచుండును. ప్రేమార్ద్రహృదయులు కానియెడల తల్లిదండ్రులు తమబిడ్డలయెడలను, బిడ్డలు తల్లిదండ్రులయెడలను, భార్యాభర్తలొండొరుల యెడలను తమకర్తవ్యము నెట్లు నిర్వహింపగలరు? మన జీవితమున సంఘర్షణము నిత్యమును గానవచ్చుట లేదా? ప్రేమమూలముననే ధర్మము రుచించుచున్నది. స్వాతంత్ర్యనభోమండలముననే ప్రేమచంద్రుడు ప్రకాశించుచున్నాడు. ఐనను ఇంద్రియ కింకరులమై, మానవజీవితమున నిత్యము తటస్థించు కామక్రోధాదులకు నూఱింటికి దాసానుదాసులమై ఉండుటయా స్వాతంత్ర్యము? ఈ యల్ప సంఘర్షణము లన్నిటియందును — సహనమే మహోన్నతమగు స్వాతంత్ర్యప్రకటనము. స్త్రీలు తమ కోపస్వభావమునకును అసహనమునకును అగ్గమై

భర్తలను నిందించి తమ "స్వాతంత్ర్యము"ను నిలుపుకొనుచున్నా మని భావింతురుగాక, — కాని తన్మూలమున కేవలము తమ దాస్యమును ప్రకటించుకొనుచున్నామని . యెఱుగరు వారు, పాపము! ఎప్పుడును భార్యలను దూషించుచునేయుండు భర్తల విషయముకూడ నిట్టిదే.

స్త్రీకి గానిండు, పురుషునకు గానిండు — హృదయపవిత్ర తయే ప్రథమసుగుణము. ఎంతటి దుష్ప్రవర్తనుడైన నగుగాక, పరమ సాధ్వియు ప్రేమస్వరూపిణియునగు భార్యవలన సత్పథగామి కానేరని మానవు డెక్కడను ఉండడు. ప్రపంచ మింకను అంత చెడిపోలేదు. ఘాతుకులగు భర్తలనుగూర్చి పురుషుల మలినవర్త ననుగూర్చి లోకమున గోలచేయుచుందురుగాని, క్రూరాత్ములు, మలినశీలలునగు స్త్రీల సంఖ్యయు అట్టి పురుషులసంఖ్యకు తీసి పోదనుట నిక్కువము. స్త్రీలందఱును తా మనుకొనునంతటి యోగ్యురాండ్రును పవిత్రహృదయలు నగుట వాస్తవమేయైనచో అయోగ్యుడును అపవిత్రహృదయుడునగు పురుషుడొక్కడుకూడ లోకమున నుండియుండడని నాగట్టినమ్మకము. విశుద్ధతయు పవిత్ర తయు నిర్జింపజాలని దౌర్జన్యమేమి కలదు? తనభర్తను దక్క ఇతరు నెవ్వనిగాని తనబిడ్డగా భావించుచు ఎల్లరపట్ల మాతృ భావము నెఱపు సచ్ఛీలయు పతివ్రతయునగు ఇల్లాలి పవిత్రతా ప్రభావ మెంతగా వర్ధిల్లుననగా — ఎంతటి ఘాతుక మానవుడైన గాని ఆమెసన్నిధి నున్నప్పుడు పావిత్ర్యగంధ మెనయనివా డొక్క డైననుండడు. భర్తయగువాడును ఇదేవిధమున తన భార్యను దక్క మిగిలిన స్త్రీలనందఱను తనకు తల్లులనియో, కుమార్తె లనియో, సోదరీమణులనియో భావింపవలయును. మఱియు నెవ్వడు ధర్మప్రబోధకుడు గానెంచునో అట్టివాడు స్త్రీలంద ఱను తనతల్లులని భావించి వారియెడ మాతృబుద్ధికలిగి మెలగ వలయును.

లోకమున తల్లిస్థానమే మహోన్నతము. అఖండమగు స్వార్థరాహిత్యమును అలవఱచి దైనందినజీవితమున చూపజేయు స్థానమదే. భగవత్ప్రేమ యొక్కటియే మాతృప్రేమను మించునట్టిది; ఇతరమగు సమస్త ప్రేమలును జఘన్యములు. తన యోగక్షేమములకంటె ముందు తనబిడ్డలయోగక్షేమమును జూచుకొనుట మాతృధర్మము. కాని యిందులకుబదులు తల్లిదండ్రులు తమ యోగక్షేమములనే మొదట చూచుకొనుచుండినచో బిడ్డలకును తల్లిదండ్రులకును గల సంబంధము లెక్కలు వచ్చినంతనే తల్లిదండ్రులను త్రోసిరాజనునట్టి పక్షిశాబకములకును పక్షులకునుగల సంబంధముతో తుల్యమగును. స్త్రీని జగన్మాతృప్రతిరూపిణిగ సాక్షాత్కరించుకోగల మగవాడు నిక్కముగా ధన్యుడు. పురుషుని జగత్పితృప్రతిరూపునిగ సాక్షాత్కరించుకోగల స్త్రీ నిశ్చయముగా ధన్యురాలు. తమ తల్లిదండ్రులను ప్రత్యక్షదైవములనుగా దర్శించు బిడ్డలు ధన్యులు.

విహితకర్మములను కర్తవ్యబుద్ధితో నాచరించు టొక్కటియే ఉన్నతి నొందుటకు మార్గము. ఇట్టి కర్మాచరణముచే బలము గడించుచు క్రమముగా మహోన్నతస్థితి నొందుము. ఒకప్పు డొక బాలసన్న్యాసి అరణ్యమునకుపోయి ధ్యానోపాసనల నాచరించుచు చిరకాలము యోగాభ్యాస మొనర్చెను. అనేక సంవత్సరము లట్లు కఠినతపస్సాధన చేసిన పిమ్మట నొకనా డాత డొక చెట్టుక్రింద గూర్చుండియుండ కొన్ని యెండుటాకు లాతని తలపై బడెను. పై జూచుసరికి ఒక కాకికి కొంగకు చెట్టుచివర కలహము జరుగుచుండెను. అదిగని యాతడు కుపితుడై యిట్లు పలికెను: "ఏమేమి! ఎండుటాకులను నా తలపై రాల్ప సాహసించితిరిగా!" ఇట్లనుచు వానిని చుఱచుఱ చూచెను. చూడ్కి నుండి వెలువడిన అగ్నిజ్వాల ఆ పక్షులను దహించివైచెను. అట్టిది ఆతని యోగశక్తి. కేవల వీక్షణముచేతనే కాకిని కొంగను దగ్ధ

మొనర్పగల్గిన తన యోగశక్తిని దలచి యాతడు బ్రహ్మానందభరితు డయ్యెను. కొంతసేపైన పిమ్మట భిక్షాటనమునకై యాతడు దగ్గఱనున్న పట్టణమునకు పోవలసివచ్చెను. అటులు పోయి యాత డొక ద్వారముకడ "భవతి భిక్షాం దేహి" యని నిలువ, లోపలి నుండి, "నాయనా, క్షణము వేచియుండుము" అను శబ్దము విన నయ్యెను. ఆ పడుచుసన్న్యాసి తనలో తా నిట్లనుకొనెను: "ఓసీ, నిర్భాగ్యురాలా, న న్నిచ్చట కాచుకొనబెట్టునంతటి సాహసమా నీకు! కానిమ్ము, నా శక్తి నీ వెఱుగవులే." ఆత డట్లనుకొనుచుండ లోపలినుండి మరల నిట్లు వినవచ్చెను: "అబ్బాయి, గర్వింపకు, నేను కొంగనుకాను, కాకినికాను." అది విని యాత డాశ్చర్యపడెను; ఏమైన నాతడు వేచియుండవలసి వచ్చెను. కడకు ఆమె భిక్షమిడుటకు వచ్చెను. వెంటనే సన్న్యాసి యామెపాదములపై వ్రాలి ఇట్లు ప్రశ్నించెను: "అమ్మా, ఆ సంగతి నీ కెట్లు తెలిసినది?" ఆమె యిట్లు బదులుచెప్పెను: "నాయనా, నీ యోగముకాని, నీ సాధనలుకాని నే నెఱుగను. నే నతిసామాన్యను. నా భర్తకు జబ్బుగా నుండుటచే ఆయనకు సేవ చేయుచు నిన్ను కాచుకొబెట్టితిని. యావజ్జీవము నా ధర్మ మును నిర్వహించుటకే శ్రమపడితిని. అవివాహితనై యున్నప్పుడు నా తల్లిదండ్రులయెడ నా ధర్మమును నెఱపితిని; వివాహితనైతిని కావున నా భర్తయెడ నా ధర్మమును నిర్వహించుచున్నాను; ఇదే నేను చేయు యోగసాధన. కాని స్వధర్మాచరణముచే నాకు జ్ఞానోదయమైనది. ఈ విధముగా నీ మనోభావమును గ్రహించి యడవిలో నీ వొనర్చినపని తెలిసికొనగల్గితిని. ఇంతకంటె విశేషము గ్రహింపగోరెదవేని నే జెప్పు పట్టణమునకు పొమ్ము. అక్కడి యంగడివీథిలో నొకానొక వ్యాధుడు నీ కగపడును. ఆతడు నీకు కొన్ని విషయములు చెప్పును. అవి తెలిసికొని నీ వెంతయు సంత సింతువు." "ఆ పట్టణమునకు, మీదుమిక్కిలి ఆ వ్యాధునికడకు నే నేల పోవలయును?" అని సన్న్యాసి మున్ముందు తలచెను.

కాని తాను కన్న విషయము లతని కించుక తెలివి గలిగించినవి. కావున నతడు పోయెను. పట్టణమును సమీపించుసరికి బజారు కననయ్యెను. ఒకింతదూరమున స్థూలకాయుడగు నొకవ్యాధుడు పెద్ద పెద్ద కత్తులతో మాంసమును గోయుచు, కొనవచ్చిన వివిధ ప్రజలతో బేరములాడుచు సంభాషించుచుండుట అగపడెను. అంత నా బాలసన్న్యాసి యిట్లనుకొనెను: "శ్రీరామరక్ష! ఈతనియొద్దనా నేను ధర్మము నేర్చుకొనబోవునది! ఈత డొక రాక్షసావతారము. అంతకంటె వేఱేమియు కాదు." ఇంతలో వ్యాధుడు తలయెత్తిచూచి యిటు లనెను: "స్వామీ, రండి, ఆ సాధ్వి మిమ్మిచటకు బంపినదా? నా పని యగువఱకు ఆ యాసనమున గూర్చుండుడు." "ఇచట నేమి జరుగనున్నదో!" యని సన్న్యాసి తనలో దా ననుకొనుచు ఆ యాసనమున గూర్చుండెను. వ్యాధుడు తనబేరము సాగించి, సొమ్ము కైకొని, సన్న్యాసిని జూచి, "అయ్యా, రండి, మా యింటికి రండి" అని పిలిచెను. ఇల్లు చేరినంతనే సన్న్యాసికి ఒక యాసనమును జూపి, "ఇచట వేచియుండుడు" అని వ్యాధుడు లోనికి జనెను. అంత నాతడు వృద్ధులగు తన తల్లిదండ్రులకు స్నానముచేయించి, భోజనమిడి, వారిప్రీతికి చేయవలసినవానినెల్ల చేసి, పిమ్మట సన్న్యాసికడ కేతెంచి యిట్లు పలికెను: "నన్ను చూచుటకై మీరు వచ్చితిరే. నేను మీకు చేయగల కార్యమేమో సెలవిండు." సన్న్యాసి యంతట జీవునిగూర్చియు దేవునిగూర్చియు వ్యాధుని గొన్ని ప్రశ్నలు అడిగెను. వ్యాధు డవ్విషయములనుగూర్చి మహోపన్యాసమొనర్చెను. "వ్యాధగీత" యనుపేర నిది మహాభారతమం దొకభాగమై, వేదాంత మహోన్నత తత్త్వరాశియై విరాజిల్లుచున్నది. వ్యాధుడు తనబోధనమును ముగించుసరికి సన్న్యాసి యాశ్చర్యచకితుడై యిట్లు ప్రశ్నించెను: "మీరేల యిట్టి శరీరమును దాల్చియున్నారు? ఇంతటి విజ్ఞానులగు మీరు ఇట్టి ఏహ్యకర్మములను జేయుచు ఏల యీ వ్యాధశరీరమును ధరించితిరి?"

వ్యాధు డిట్లు సమాధాన మొసగెను : "నాయనా, ఏ కర్మమును ఏహ్యాము కాదు; ఏ కర్మమును మలినముగాదు. జన్మముచే నే నిట్టి పరిస్థితుల పరిసరములమధ్య చేరితిని. బాల్యమున ఈ వృత్తి నేర్చితిని. నాకు సంగము లేదు. నా విధిని చక్కగా నిర్వర్తింప యత్నించుచున్నాను. గృహస్థుడనగు నేను నా ధర్మములను నిర్వహింప ప్రయత్నించుచున్నాను. నా తల్లిదండ్రుల సుఖము నకై నే చేయగల్గినదెల్ల చేయ ప్రయత్నించుచున్నాను. మీ యోగము నే నెఱుగను. నేను సన్న్యాసస్వీకరణము చేయలేదు; సంసారమును విడిచి యరణ్యమునకును బోలేదు. ఐనను మీరు నాయొద్ద వినినట్టియు గనినట్టియు విశేషములన్నియు స్వవర్ణాశ్రమ ధర్మమును నిస్సంగత్వముతో నెఱపుటచే నాకు లభించినవి."

భారతదేశమున నొకమహర్షి, ఒకమహాయోగి, నా జన్మమున నే జూచిన యత్యద్భుత పురుషులలో నొకడు కలడు. అత డొక వింతపురుషుడు. ఎవ్వరికి నాతడు బోధింపడు; మీరు ప్రశ్నలడిగిన అతడు సమాధాన మొసగడు. ఆచార్యపదవి నాత డధిష్ఠింపజాలడు, అధిష్ఠింపడు. మీ రొకప్రశ్నవైచి, కొన్ని దినములచట కనుపెట్టుకొనియుండినపక్షమున ప్రసంగవశమున. అత డా విషయమును ప్రస్తావించి అద్భుతమగు తనబోధన తేజమును దానిపై బఱపును. కర్మరహస్యమునుగూర్చి యొకప్పుడు నా కాత డిట్లు తెల్పెను : "ప్రాప్యమును ప్రాపకము నొక్కటి కావలయును." నీ వొక కర్మ మొనర్చుచున్నప్పుడు మఱి దేనిని లక్షింపకుము. దాని నారాధనగా, మహోన్నతారాధనగా నొనర్చుచు, ఒనర్చుచున్నంతసేపు నీ జీవితమును దానికే సమర్పింపుము. ఇవ్విధమున కథలో వ్యాధుడును పతివ్రతయు మనః పూర్వకముగా, మహానందముతో తమధర్మమును నిర్వహించిరి తత్ఫలితముగా వారికి జ్ఞానోదయమైనది; దీనివలన నే యాశ్రమ ధర్మములనైనను సక్రమముగా, ఫలాపేక్షారహితముగా నిర్వ

హించినయెడల మహోన్నతాత్మానుభవము లభించునని విశదమగు చున్నది.

ఫలసంగ మున్నప్పుడే తనకు ప్రాప్తమైన కర్తవ్యము 'ఇట్లున్నదే' 'అట్లున్నదే' అని మానవుడు నసపెట్టును; ఫలాపేక్ష లేని వానికి సమస్తకర్మములును సమానయోగ్యములై కన్పట్టును; స్వార్థపరతను కామమును జయించి, ఆత్మస్వాతంత్ర్యమును బడయుటకై వారి కవి యన్నియు పటుతరసాధనములుగనే తోచును. తఱచు మనమందఱము విశేషమగు నహంకారమునకు వశులమగుచుందుము. మనము పూర్తిగా అంగీకరింపము కాని, మన మంగీకరించునంతకంటె ఎక్కువగనే మనకర్తవ్యములు మన పాత్రతనుబట్టియే నిర్ణీతములగుచుండును. స్పర్థ యసహనమును పెంచును, దానిచే దయాళుత్వము నశించును. నసపెట్టువానికి అన్నికర్తవ్యములును రుచింపనివే, ఏకర్మములును అతని కెప్పుడును తృప్తి నొసగజాలవు; ఆతని జీవితమంతయు తప్పక వ్యర్థమై పోవును. కావున పనిచేయుచునే ఉందముగాక, మనకర్తవ్యమేదైన నగుగాక. చేయుచునే ముందునకు సాగుదము. చక్రమునకు మనభుజమును మోటింప సదా సంసిద్ధులముగ నుందముగాక. అప్పుడు మనము వెలుగును తప్పక సాక్షాత్కరించుకొందుము.



# మనముచేయు మేలు మనకేగాని లోకమునకుగాదు

కర్తవ్యనిష్ఠ ఆధ్యాత్మికపురోగతియందు మన కెట్లు తోడ్పడునో అను విషయము నింకను విచారించుటకుముందు మఱియొక దృక్పథమునుండి కర్మమునకు భారతీయులమగు మేము గ్రహించు నర్థమును సూక్ష్మముగా దెలిపెదను. ప్రతిమతమునకును తత్త్వవిచారము, పురాణములు, క్రతుకలాపములు నను మూఁడుభాగము లుండును. తత్త్వవిచారమే ప్రతిమతమునను సారాంశమనుటకు సందియము లేదు; మహాపురుషచారిత్రములందలి ఐతిహ్యముల చేతను అద్భుతవిషయములనుగూర్చిన గాథలచేతను కథలచేతను పురాణములు సోదాహరణముగా తత్త్వమును విశదీకరించును; క్రతుకలాపములు దానికి సర్వజనగ్రాహ్యమగు రూప మొసగును— అట్లు రూపుగొన్న తత్త్వశాస్త్రమే క్రతుకలాపము. ఇదియే కర్మ. ప్రతిమతమందును ఇది ఆవశ్యకమైయున్నది. ఏలన, విశేషాధ్యాత్మికాభివృద్ధి నొందనిదే దుర్గ్రాహ్యములగు పారమార్థిక విషయములను మనలో ననేకులు గ్రహింపజాలరు. అన్నియు తమకు బోధపడునని మానవులనుకొనుట సులభమే కాని అనుష్ఠానానుభవమునకు వచ్చుసరికి ఆధ్యాత్మికవిషయములను గ్రహించుట చాల కష్టమని తెలియును. 'సంకేతములు' (సిమ్బల్స్) మనకు చాల తోడ్పడును. సంకేతములద్వారా తత్త్వమును బోధించు విధానమును మానుకోజాలము. అత్యంతప్రాచీనకాలమునుండియు సంకేతములు సర్వమతములందును వినియోగింపబడుచుండినవి. ఒకవిధముగ జూచిన సంజ్ఞలమూలముననేకాని మనము ఆలోచింపజాలము, అసలు శబ్దములు భావముల సంజ్ఞలే. పక్షాంతరమున జగత్తునందలి ప్రతిదియు సంజ్ఞ అనియే భావింపనగును. జగత్తంతయు నొక సంజ్ఞ. ఈ సంజ్ఞకు మఱుగుననుండు తత్త్వము భగవంతుడు. ఈవిధమైన సంజ్ఞాశాస్త్రము కేవలమానవకల్పి

తము కాదు; ఒకానొక మతమునకు జెందిన కొందఱు జను లొకచో జేరి, కొన్నిసంజ్ఞల నూహించి, వానిని తమమానసము నుండి వెలువఱచుచున్నారని భావింపరాదు. ఈ పారమార్థిక సంజ్ఞలకొక సహజాభివృద్ధి కలదు. కానిచో ఇంచుమించుగా ప్రతిమానవుని మానసమందును కొన్ని సంజ్ఞలు ప్రత్యేకముగ కొన్ని భావములకే ద్యోతకములుగ నుండుటకు కారణమేమి? 'సిలువ' యను † ఈ చిహ్నము మొట్టమొదట క్రైస్తవమతము నుండి పుట్టినదని మీలో ననేకులు భావింపవచ్చును; కాని వాస్తవ ముగా నిది క్రైస్తవమతమునకు పూర్వము, మోసెసు పుట్టుటకు ముందు, వేదములకు మునుపు, మానవులగూర్చిన విషయములకు ప్రమాణగ్రంథములు ఏర్పడుటకు పూర్వముననే యుండెను. 'ఏట్జెక్కు', 'ఫినిషియను' జాతులలో ఈ చిహ్నమును గనవచ్చు. ప్రతిజాతియందును సిలువ యను నీ చిహ్నమున్నట్లు గాన్పించును. ఇటులనే మ్రానుపై పెట్టబడి మేకులు కొట్టబడిన 'రక్షకుని', 'మానవుని' ప్రతిమ ప్రతిజాతివారికిని పరిచితమైనదిగనే కానబడును. చక్రము లోకమందంతటను నున్న యొక మహాసంజ్ఞయై యున్నది. అన్నిసంజ్ఞలకంటె అ [illegible]వ్యాప్తిగల సంజ్ఞ 卐 'స్వసికము' ఉన్నది. బౌద్ధులు దీనిని దమ[illegible] గొనిపోయి లోకమం దంతటను వ్యాపింపజేసిరను తలం పొకానొకప్పు డుండినది, కాని బౌద్ధమత మునకు అనేకయుగములకు పూర్వమే ఇది వివిధజాతుల వాడుకలో నుండెనని కనుగొనబడినది. ప్రాచీనబాబిలనులోను, ఈజిప్టులోను నిది కననగును. దీనివలన దేలుచున్న దేమి? ఈ సంజ్ఞలన్నియు కేవలాచారముననుసరించి యేర్పడినవి కానేరవు. వీని కేదియో యొక కారణ ముండియుండవలయును, మానవమానసమునకును ఈ సంజ్ఞలకును సహజసంబంధ ముండియుండవలయును. ఈ భాష సంకేతసంభవము కాదు; ఈ భావములను ఈ మాటచే దెల్పుద మని ప్రజలు దమలో దా మొడంబడిక చేసికొనియుండలేదు. భావమునకు సరిపడు శబ్దమును శబ్దమునకు సరిపడు భావమును

లేకుండిన దెన్నడును లేదు; భావములకును మాటలకును అవినా భావసంబంధము సహజము. ఇట్లు భావమును దెలుపునట్టి సంజ్ఞలు శబ్దరూపమునగాని వర్ణరూపమునగాని యుండవచ్చును. చెవిటి వారును మూగవారును శబ్దేతరములగు సంజ్ఞలతో నాలోచింప వలయును. మానసమందలి ప్రతిభావమునకును జతపడునట్టి రూపము గలదు; సంస్కృత వేదాంతమున నివియే నామరూపము లని చెప్పబడుచున్నవి. ఏర్పాటుచే భాషను సృష్టించు టెంత యసాధ్యమో సంజ్ఞాశాస్త్రమును సృష్టించుటయు నంత యసాధ్యమే. కర్మకలాపమందలి సంకేతములలో మానవుల పారమార్థికాశయములు ప్రకటితములగుచున్నవి. కర్మకలాపములు, దేవాలయములు మొదలగు ఉపకరణములు నిష్ప్రయోజనములని చెప్పుట సులభమే; ఆధునికకాలమున ప్రతిశిశువు నిట్లు చెప్పుచున్నాడు. కాని దేవాలయమున దేవు నర్చించువారు, అట్లు అర్చింపనివారికంటె పెక్కువిషయములలో భిన్నులుగ నున్నారనుట జనులు సులువుగా గుర్తింపగల విషయమే. కావున కొన్నియాలయములకును, క్రతుకలాపములకును ఇతర బాహ్యవిధులకును కొన్ని మతధర్మములతో నున్న సంబంధముచే ఆయా మతధర్మముల నవలంబించువారలకు ఆ రూపములు వేనికి సంజ్ఞలై యున్నవో ఆ ఆశయములను స్ఫురింపజేయును. కావున క్రతుకలాపములను సంజ్ఞలను పూర్తిగా ఉపేక్షించుట వివేకము కాదు. వీనినిగూర్చిన వివేచనయు వీని అనుష్ఠానమును సహజముగా కర్మయోగాంతర్గతములైనవి.

కర్మశాస్త్రమునకు రూపాంతరములు పెక్కుగలవు. శబ్దార్థముల అన్యోన్యసంబంధ పరిశీలనమును శబ్దశక్తిచే నేమి సాధింపగలమో పరిశీలించుటయు నిందొకటి. శబ్దశక్తిని ప్రతిమతము అంగీకరించుచున్నది. కొన్నిటిలో శబ్దమునుండియే సృష్టియంతయు ఉత్పన్నమైనదని చెప్పబడియున్నది. భగవత్సంకల్ప

బాహ్యాకారమే శబ్దము. ముందుగా తానను కొన్న రీతిలో సంకల్పించినరీతిలో భగవంతుడు సృజించెను. శబ్దమునుండి సృష్టి వెలువడినది. మన ఐహిక జీవితవేగములో ఒత్తిడిలో నాడీకోశము గ్రహణశక్తిని గోల్పోయి మొద్దువాఱుచున్నది. వయసు మీఱినకొలదియు, లోకమున ఇంకసంకను త్రిప్పటలు చెందిన కొలదియు, మఱింత మొండి తేఱుచుందుము; మనచుట్టును ముఖ్యములుగ మాటిమాటికిని గల్గు సంభవములను సైతము లక్షింపకుందుము. ఎట్లయినను మానవస్వభావము ఒక్కొక్కప్పుడు తన్ను చూపుకొనుచుండును. అపుడీ సామాన్యజీవిత సంఘటనములను జూచి యబ్బురపడి వాని తత్త్వమును గ్రహింప బ్రేరితులమగుచుందుము; ఇటు లబ్బురపడుటయే జ్ఞానార్జనమునకు మొదటిమెట్టు. మతములో వేదాంతములో శబ్దమునకుగల అధిక ప్రాముఖ్యము నటుంచి, మానవ జీవిత నాటకరంగమున శబ్దసంజ్ఞలు ప్రధానపాత్ర నిర్వహించుచుండుటను గుర్తింపవచ్చు. ఇప్పుడు నేను మీతో మాటలాడుచున్నాను. మిమ్ము నేను తాకుటలేదు. నామాటలచే జనించు వాయుస్పందనములు మీ చెవులలో బ్రవేశించి, నాడులను స్పృశించి మీ మనస్సులలో పరిణామములుగలుగ జేయుచున్నవి. దీనిని మీరు నిరోధింపజాలరు. ఇంతకంటె ఆశ్చర్యకరమైన దేమి? ఒకడు మఱియొకనిని "మూర్ఖుడా" యనినంతనే ఆతడు లేచి నిలువబడి పిడికిలి బిగియబట్టి తన్ను దూషించిన వాని ముక్కుపై గ్రుద్దుచున్నాడు. శబ్దశక్తి యెట్టిదో గనుడు! అతి దీనురాలైన యొకస్త్రీ విలపించుచున్నది; మఱియొకతె ఆమెను సమీపించి కొన్ని శాంతివచనములు చెప్పుచున్నది, క్రుంగిపోయిన యా దుఃఖితురాలి వెన్ను తిన్నబడ నామె దుఃఖవిరహితయై నవ్వుచున్నది. శబ్దప్రభావ మెట్టిదో చూడుడు! వేదాంతమున శబ్దము శక్తిమంతమే, సామాన్యజీవితమునను అది శక్తిమంతమే. ఎట్టితలంపును విమర్శనయు లేకే రేయింబవళ్లు మనమీ శబ్దశక్తిని వినియోగించుచున్నాము. శబ్దశక్తిస్వభావమును

గ్రహించుటయు దానిని జక్కఁగా వినియోగించుటయును గూడ కర్మయోగాంశమే.

పరులకు దోడ్పడుటయే, పరహిత మొనర్చుటయే లోకము నెడ మనధర్మము. మన మేల లోకహిత మొనర్పవలయును? లోకమునకు దోడ్పడుటకై చేయుచున్నట్లు పైకి గాన్పించునుగాని నిజముగా నది మనకే మనము తోడ్పడుటకే. పరోపకార మొనర్చుటకై సదా మనము ప్రయత్నింపవలయును. అదే మన పరమోద్దేశముగ నుండవలయును కాని మనము బాగుగా ఆలోచించి చూచినచో పరులకుగాని లోకమునకుగాని మన యుపకార మపేక్షితము కానేరాదని గ్రహింతుము. నీచేతను నాచేతను ఉపకార మొందుటకై యీ ప్రపంచము సృష్టింపబడలేదు. నేనొక క్రైస్తవ ధర్మోపదేశమున నిట్లు చదివియున్నాను: "సుందరమగు నీ ప్రపంచమంతయు జాలమంచిది, ఏలన పరోపకార మొనర్చుటకై మనకిది సమయమును సందర్భమును గల్పించుచున్నది." పైకిది చాల చక్కని యాశయమే కాని ప్రపంచమునకు మన యుపకారము కావలసియున్న దనుట దైవదూషణమే కాదా? ప్రపంచము దుఃఖభూయిష్ఠమనుటను కాదనలేము; అందుచేత పరుల కుపకార మొనర్చుటయే మనము చేయగలిగిన మహోత్తమ కార్యము; ఐనను పరుల కుపకార మొనర్చుట యనగా కేవలము మనకే మన ముపకార మొనర్చుకొనుట యని కాలక్రమమున గ్రహింతుము. నా చిన్నతనమున నాయొద్ద కొన్ని తెల్లని చుంచు లుండెడివి. చిన్ని చక్రములమర్పబడిన యొక చిన్నపెట్టెలో వాని నుంచువాడను. చుంచు లా చక్రములను దాట యత్నించునపుడెల్ల చక్రములు గిర్రిర తిరుగుచుండుటచే అవి యథాస్థానముననే యుండెడివి. ప్రపంచవిషయమును ప్రపంచమునకు మన ముపకారముచేయు విషయముగూడ నిట్టివే. ఉన్న ఉపకారమంతయు మనకు నైతికశిక్షణ లభించుటే. ఈ ప్రపంచము మంచిదికాని

చెడ్డదికాని కాదు; ప్రతివ్యక్తియు తనకు తానే యొక ప్రపంచమును నిర్మించుకొనును. గ్రుడ్డివాడు ప్రపంచమునుగూర్చి భావింపబూనునెడల గట్టిదిగనో, మెత్తనిదిగనో, వెచ్చనిదిగనో, చల్లనిదిగనో భావించునుగదా. మనము సుఖమయులముగనో దుఃఖమయులముగనో ఉందుము; వేలకొలదిసారులు మనకిదీ యనుభవగోచరమై యున్నది. సర్వసాధారణముగా యువకులు ఆశాపూరితులుగను వృద్ధులు నిరాశామయులుగను ఉందురు. యువకులకు జీవితము ముందున్నది. వృద్ధులు తమ కాలము దాటిపోయెనని, మొఱపెట్టుచుందురు; తీర్చుకోలేని వేలకొలది కోర్కెలకు వారి మానసమున పెనకువ గల్గుచుండును. ఏమైనను, ఈ యిరుతెగలవారును అవివేకులే. మన మనఃస్థితి ననుసరించి, మన దృక్పథము ననుసరించి జీవితము మంచిదిగాగాని చెడ్డదిగాగాని కాన్పించుచుండును; స్వతస్సిద్ధముగా అది యిం దేదియుగాదు. అగ్ని స్వతస్సిద్ధముగా మంచిదిగాని చెడ్డదిగానికాదు. శీతకాలమున మనము చలిదీర్చుకొనుట కుపయోగించునపుడు "నిప్పెంత బాగున్నది!" అనుకొనుచుందుము. నిప్పుచే మన వ్రేళ్లు కాలినప్పుడు దానిని దిట్టుదుము. ఐనను తనంతట అది మంచిదియు కాదు చెడ్డదియు కాదు. మనకుగల్గు దాని ఉపయోగమును బట్టి 'మంచిది' 'చెడ్డది' అను తలంపులుగల్గుచుండును; ప్రపంచ విషయముకూడ నిట్టిదే. ప్రపంచము పరిపూర్ణమే. ఇచ్చట పరిపూర్ణతయనగా తన ప్రయోజనముల నెఱవేర్చుకొనుట కది సమర్థమైయుండుటే. మనతో నిమిత్తములేకయే ప్రపంచము మిక్కిలి చక్కగా సాగునని మనమందఱము గట్టిగా నమ్మవచ్చును. దానికితోడ్పడుటకై మనము తాపత్రయపడ నక్కఱలేదు.

ఐనను మనము లోకహిత మొనర్పవలయును; లోకోపకార మొనర్పగాంచుట మనభాగ్యమను జ్ఞానము సదా ఉండునేని మనయందలి పరోపకారేచ్ఛయే మహోన్నత ప్రేరకశక్తియగును.

ఏదో పైమెట్టెక్కి కూర్చున్నవాడవై నాలుగు పైసలను చేత బట్టుకొని "ఓహోయి బీదవాడా, ఇదుగో" అని అనకు. అతనికి దానమిచ్చి నీవు మేలొందగల్గుటకై అతడొక డున్నందులకు కృతజ్ఞుడవై యుండుము. ధన్యత దాతకేకాని ప్రతిగ్రహీతకు కాదు. నీ యౌదార్యమును నీ దయాళుత్వమును లోకమున అమలుపఱచి, తన్మూలమున నీవు పవిత్రుడవై, పరిపూర్ణుడవగుటకై నీ కవకాశము లభించినదని కృతజ్ఞుడవై యుండుము. సమస్త సత్కార్యములును మనలను పునీతులనుగను పరిపూర్ణులనుగను నొనర్చును. మన యావచ్ఛక్తిని వినియోగించినను మనముచేయగల దేపాటి? ఒక యాసుపత్రిని కట్టింతుము, కొన్ని బాటలు వేయుదుము, ఒక ధర్మశాల నిర్మింతుము! 'ధర్మకార్యమునకు చందా' యని లోకులనుండి ఏ ఇరువది ముప్పది లక్షలో ప్రోగుచేయవచ్చు. ఒక పదిలక్షలతో నొక యాసుపత్రిని కట్టింపవచ్చు. రెండవ పదిలక్షలతో నాట్యప్రదర్శనములను పానగోష్ఠులను జరుపవచ్చు. మిగిలిన పదిలక్షలలో సగము ప్రభుత్వోద్యోగులు హరింతురు, సగము బీదలకు చేరును. మంచిది, ఇవియన్నియు ఏపాటి. ఒక్కతుపాను ఐదునిమిషములలో మీ కట్టడముల నన్నిటిని తుత్తునియలు చేయగలదు. అపుడు మనమేమి చేయగలము? ఒక్క అగ్నిపర్వతము పగిలి మనబాటలను, ఆసుపత్రులను, నగరములను, కట్టడములను సమస్తము తుడిచివేయునే! కావున లోకోపకారమను నీ మూర్ఖప్రలాపమును విరమింతముగాక, లోకము నీ సాయముకొఱకును నా సాయముకొఱకును పడిగాపులు పడియుండలేదు; ఐనను సదా కార్యనిరతులమై సత్కార్యములనొనర్చుచునే ఉండవలెను; ఏలన, దానివలని మేలు మనకే. పరిపూర్ణులమగుటకు మన కిదియొక్కటే మార్గము. మనము సాయముచేసిన ఏ యాచకుడుగాని మన కెన్నడును ఒక్క గవ్వయైనను ఋణపడినవాడు కాడు; వానికే మనము సమస్తము ఋణపడియున్నాము, ఏలన తనకు దానమిచ్చు నవకాశమును అతడు మన కొసగినాడు. లోకోపకారము చేసితి

మని కాని, చేయగలమని కాని, ఎవ్వరికో కొందఱకు మనము సాయము చేసితిమని కాని తలచుట పూర్తిగా తప్పు. అది మూర్ఖాలోచనము ; మూర్ఖాలోచన దుఃఖహేతువు. మన మెవ్వనికో సాయము చేసితిమని యెంచి యాతడు మనయెడ కృతజ్ఞత గనబఱుపవలయునని కోరుదుము ; అత డటుల చేయకుండుటచే బాధపడుదుము. మన కార్యములకు మన మేల ప్రతిఫల మాశింపవలయును? నీ తోడ్పాటునందుకొన్న వానియెడల కృతజ్ఞుడవై యుండుము. వానిని దేవునిగా భావింపుము. సోదర మానవ సాహాయ్యరూపమున భగవదారాధనావకాశము నొందుట మహాభాగ్యము కాదా! మనము నిజముగా నిస్సంగులమై యున్నచో ఈ ఆశావైఫల్య వ్యథలు లేక సంతోషముతో లోకమున సత్కార్యము లొనర్చు చుండగలము. నిస్సంగబుద్ధితో నాచరించు కర్మవలన నెన్నటికిని దుఃఖముగల్గదు, దుస్థితిగల్గదు. లోకము తన సుఖదుఃఖములతో సదా సాగిపోవుచునేయుండును.

ఒకప్పుడొక బీదవాడుండెను, అతనికి కొంత ధనము కావలసివచ్చెను. ఒకభూతమును వశపఱచుకొనినచో ధనము తెమ్మని కాని తన యిచ్చవచ్చిన కార్యముల నొనర్చుమని కాని దాని కాజ్ఞాపింపవచ్చునని వినియుండెను. అందుచే నాతడు భూతమును కైవసమొనర్చుకొనన్ నాత్రపడుచు భూతమును తన కొసగగల వ్యక్తికొఱకై ముందు వెదకుచు సంచరించెను. కడకు మహా శక్తి సంపన్నుడగు ఋషినొకని నాత డెట్లో కలిసికొని తనకు సాయము చేయుమని ప్రార్థింప, "భూతము నీ కేందుల" కని ఋషి ప్రశ్నించెను. అందుల కాతడు, "నా పనులను చేసిపెట్టుటకై నా కొక భూతము కావలయును ; దానిని సంపాదించు విధానమును బోధింపుడు ; స్వామీ, నా కది యత్యావశ్యక" మని చెప్పెను. ఋషి యందులకు, "నీనెమ్మదిని చెడగొట్టుకొనకు, ఇంటికిబొమ్ము!" అనెను. మఱునాడు మరల నాతడు ఋషియొద్దకేగి విలపించుచు

నిట్లు ప్రార్థించెను: ''నాకొక భూతమును దయచేయుము. స్వామీ, నాకు సాయపడుటకు భూతముకావలెను.'' తుదకు విసుగుగల్గి ఋషి యిట్లు పల్కెను: ''ఇదిగో మంత్రము. దీనిని జపింపుము, భూతము నీకడకు వచ్చును, అది నీవు ఏపని చెప్పినను చేయును. కాని జాగ్రత్తసుమీ! భూతములు మహాభయంకరములు. వానికి నిరంతరము పని కల్పింపవలయును. లేనియెడల అవి నీ ప్రాణము తీయును.'' పేదవా డందుల కిట్లు పల్కెను. ''స్వామీ, అదెంత పని! యావజ్జీవము దానికి నేను పనిచూపగలను.'' అంత నాత డొక యరణ్యమునకు పోయి చాలకాల మామంత్రమును జపింప తుద కొక పెనుభూతము ప్రత్యక్షమై యిట్లు పల్కెను: ''నే నొక భూతమను. నీ మంత్రము నన్ను వశపఱచుకొన్నది; కాని నీవు నాకు సదా పని కల్పింపవలయును సుమీ; నాకు నీవు పని చూప జాలనిచో తత్క్షణమే నిన్ను చంపివైతును.'' అంత నాతడు తనకై యొక ప్రాసాదమును నిర్మింపుమని చెప్పెను. భూతము, ''ఐనది, నిర్మించితిని ఇదిగో!'' అనియెను. ఆత డంత, ''నాకు ధనము తెమ్ము'' అని పలుక భూతము, ''ఇదిగో నీధనము'' అనియెను. ''ఈ యరణ్యమును పడగొట్టి యిచట నొక పురమునిర్మింపుము.'' ''ఇదిగో పూర్తియైనది, చేయవలయున దింకేమైన గలదా?'' యని భూతము తొండ్రించెను. అంత నాతడు భయపడసాగెను. ''దీనికి చెప్పుట కిక పనిలేదే, ఏమి చెప్పినను నిమిషమున చేసివేయుచున్నదే'' అనుకొనెను. భూత మిట్లు గద్దించెను. ''నాకేమైన పనిచెప్పుము, లేకున్న నిన్ను కబళించి వేయుదును.'' పాప మాతడు భూతమున కిక నేమియు పనిచూప జాలడాయెను. భయభ్రాంతుడయ్యెను. పరుగున బోయి ఋషిని దరిసి, ''స్వామీ, నా ప్రాణము కాపాడుడు'' అని మొఱపెట్టెను. ''ఏమి సంగతి'' అని ఋషి యడుగ నాత డిట్లు చెప్పెను. ''భూతమున కిచ్చుట కిక నాయొద్ద నేపనియు లేదు. నేను ఏపనిచెప్పినను ఆక్షణముననే అదిచేసివేయుచున్నది. 'పని చూపజాలని పక్షమున నిన్ను

మ్రింగివేయుదు'నని భయపెట్టుచున్నది. ఆ నిముసముననే భూతమచటికివచ్చి, "ఇదిగో నిన్ను మ్రింగివేసెదను." అని గద్దించెను. అతడు గడ గడ వణకసాగెను. నాప్రాణమును రక్షింపుడని ఋషిని ప్రార్థించెను. ఋషి యాతని కిట్లు తెల్పెను. "బయటపడు దారిని నీకై నేను కనుగొనెదను. వంకరతోకగలిగియున్న ఆకుక్కను జూచితివా? కత్తి గైకొని ఆతోకనుగోసి వంగియున్నదానిని నిడుపుచేయుమని భూతమున కిమ్ము." అంత నాతడు ఆ కుక్కతోకను ఖండించి భూతమున కిచ్చి దీనిని చక్కదీసి నాకిమ్మనెను. భూతము దానిని గైకొని అతిజాగరూకతతో నెమ్మదిగా నిడుపు చేసెను గాని, పట్టు వదలినంతనే అది మరల ముడుచుకొనియెను. భూతము దానిని మరల కష్టపడి సరిచేసినను చేయి వదలినంతనే మరల ముడుచుకొనిపోయెను. ఓరిమితోడ భూతము మరల ఆ కుక్కతోకను సరిచేసెను. కాని చేయివదలినంతనే మరల తోక ముడుచుకొనిపోయెను. దినములతరబడి భూతము ఆపనిని చేసెను. తుదకు, విసిగి యిట్లుతలచెను: "ఇదివఱకెన్నడును నాజన్మలో నాకిట్టి బాధ లేదు. ఆరితేఱిన వృద్ధభూతమనయ్యు ఇంతవఱకెన్న డిన్నితిప్పలు పడియెఱుగను." ఇట్లు భావించి యాభూతము ఆతనితో నిట్లు పల్కెను: "నీతో నేనొక యొడంబడిక చేసికొందును. నన్ను నీవు విడిచిపెట్టుము. నేనింతవఱకు నీకొసగిన వన్నియు నీ వుంచుకొనుట కంగీకరించి నిన్నిక బాధింపనని వాగ్దానము చేయుచున్నాను." ఆతడందుల కమితప్రీతుడై సంతోషముతో నంగీకరించెను.

ఈ ప్రపంచము వక్రతలో కుక్కతోకవంటిది. వేలకొలది సంవత్సరములనుండి దీనిని సరిచేయుట కనేకులు విశ్వప్రయత్నము చేయుచున్నారు; కాని వారిపట్టు వీడినంతనే ఇది యథాప్రకారము మరల వక్రమైపోవుచున్నది; అట్లుకాక అది మఱెట్లుండును? నిష్కామముగా నెట్లు కర్మమాచరింపవలయునో మానవుడు

మొదట తెలిసికోవలెను, తెలిసికొన్నచో దురభిమాని కాకుండును. లోకము కుక్కతోకవంటిదనియు ఎన్నటికిని తిన్నబడదనియు గ్రహించినచో మనము మూర్ఖాభినివేశగ్రస్తులము గాకుందుము. మూర్ఖాభినివేశమే లేకుండినయెడల లోకము ఇప్పుడుపురోగమించి నంతకంటె ఎంతో ఎక్కువగ పురోగమించియుండును. దురభిమానము మానవుల పురోగతికి దోడ్పడు ననుకొనుట మిక్కిలి పొరపాటు. పురోగతికి తోడ్పడకపోవుటే కాక దానివలన ద్వేషమును క్రోధమును బయలుదేఱి జనులలో సానుభూతిచెడి కలహములేర్పడి తిరోగతిగల్గును. మన మేపని చేసినను, మనయొద్ద ఏమున్నను అదియే లోకమున శ్రేష్ఠమైనదనియు మనముచేయని పనికిని, మనయొద్దలేని వస్తువునకును విలువలేదనియు దలచుచుందుము. కావున దురభిమానము నొందు ప్రవృత్తి మీలోగాన్పించినపుడెల్ల కుక్కతోకవంపు దృష్టాంతము జ్ఞప్తికి దెచ్చుకొనుడు. ప్రపంచమునుగూర్చి మీరు వ్యధజెంద నక్కఱలేదు, మీనిద్ర చెడగొట్టుకో నక్కఱలేదు. మీరు లేకున్నను అది సాగుచునేయుండును. దురభిమానరహితులరైనపుడే మీరు చక్కగా పని చేయగలరు. సమచిత్తత, ప్రశాంతి, వివేకము, ఆర్ద్రభావమును, మహాసానుభూతియు ప్రేమయుగలవాడే లోకాభ్యుదయ కర్మము నాచరించి తానును అభ్యుదయము నొందగలడు. దురభిమాని మూర్ఖుడు. అతనికి పరులయెడ సానుభూతి యుండనేరదు; లోకము నాతడెన్నడును చక్కజేయజాలడు, దానును పునీతుడు కాజాలడు. పరిపూర్ణుడు గాజాలడు.

నేటి యుపన్యాసమందలి ముఖ్యవిషయములను సింహావలోకన మొనరింతము. (1) లోకము మన కేమియు ఋణపడి యుండలేదనునదియు, మనమే లోకమునకు ఋణపడి యున్నామనునదియు మొదటివిషయము. ఏ లేశమైనను లోకహిత మొనర్ప ననుమతుల మగుట మనకందఱికి భాగ్యలభ్యము. లోకోపకార

మొనరించుటచే నిజముగా మనకే మన ముపకార మొనర్చుకొను చున్నాము. (2) లోకమున కొక భగవంతు డున్నా డనుట రెం డవ విషయము. ప్రపంచము కొట్టుకొని పోవుచున్న దనుటయు మీరును నేనును దానిని రక్షింపవలయు ననుటయు నిజము కాదు. భగవంతుడు సదా జగదంత రాత్ముడై యున్నాడు. ఆతడు అవి నాశి, ఎల్లప్పుడు చురుకుగలవాడు, అనంతజాగరూకుడు. విశ్వ మంతయు నిదరించుచుండునప్పుడు ఆతడు నిద్రింపడు; ఆతడు నిరం తరము కర్మ మొనర్చుచునే యున్నాడు. విశ్వమందలి సమస్త రూపములును పరిణామములును ఆతనివే. (3) మన మెవ్వరిని ద్వేషింపరాదనునది మూడవ విషయము. ఈ ప్రపంచము సదా మంచిచెడుగుల సమ్మిశ్రమే ఐయుండును. దుర్బలులయెడ సాను భూతి జూపుటయు దురాచారునిగూడ ప్రేమించుటయు మన ధర్మము. ఈ లోక మొకపెద్ద వ్యాయామశాల. ఆధ్యాత్మిక బలము నింకనింకను వర్ధిల్లజేసికొనుటకు మనమిచట వ్యాయామము చేయవలెను. (4) దురభిమానము ప్రేమకు విరుద్ధము. కావున మనము ఎటువంటి దురభిమానులమును గారా దనునది నాల్గవ విషయము. "పాపమును ద్వేషింతునే గాని పాపిని ద్వేషింపను" అని దురభిమానుల జారుడుమాటలు మీరు వినియుందురు. కాని నిజముగా పాపమునకును పాపికిని భేదము నేర్పఱుపగలిగిన వ్యక్తి మోమును గాంచుటకై ఎంతదూరమైన పోవుటకు నేను సంసిద్ధు డను. పైవిధమున జెప్పుట సులభమే. గుణగుణి విభేదమును చక్కగా గుర్తింపగల్గినచో మనము పరిపూర్ణమానవులమే కావచ్చు. కాని గుర్తించుట అంత సులభముకాదు. మఱియు మనలో సంక్షోభ మెంతతగ్గిన, ప్రశాంతి ఎంత హెచ్చిన, ప్రేమయు అంత హెచ్చును. మనపనులు అంతవరిష్ఠములుగ నుండును.



# అహంకారలయమే నివృత్తిధర్మసారము

మనయందుండి వెలువడు ప్రతికర్మమును ప్రతిక్రియగా మనయొద్దకే వచ్చునట్లు, మనపనులు ఇతరులపై ప్రభావముచూపవచ్చు, వారివి మనపై ప్రభావము జూపవచ్చు. దుష్కార్యముల నొనర్చు కొలదియు జనులు మఱింత దుర్జనులగుచుండుటయు, సత్కార్యముల జేయనారంభించినప్పుడు వారిబలము మెట్టుమెట్టుగ హెచ్చుటయు, సదా మంచిపనులనే చేయుచుండుట వారి కలవడుటయు మీరందఱును గుర్తించియుండవచ్చును. ఒండొరులపై ప్రభావ ప్రతిప్రభావముల జూపుకొనుశక్తి మనకున్నదనుటకంటె ఈ కర్మప్రభావాతిశయమును వివరింప వేఱొకయాధారము లేదు. ప్రకృతిశాస్త్రమునుండి యిందుల కొక యుదాహరణము. నేనొక పని చేయుచున్నప్పుడు నామనస్సు ఒకానొకస్పందనస్థితిలో నుండునని చెప్పవచ్చును; నా మనఃస్థితిప్రభావమునకు లోనగు ప్రవృత్తి సదృశపరిస్థితులందున్న మనస్సు లన్నిటికి నుండును. ఏకరీతిని శ్రుతిమేళగింపబడిన వివిధ వాద్యములు ఒకగదిలో నున్నప్పుడు వానిలో నొకదానిని ధ్వనింపజేసినచో తాము ను మ్రోగి ఆస్వరము నేపల్కు ప్రవృత్తి తక్కిన వాద్యములకు నున్నదనుటను మీరందఱును గమనించియుందురు. కావున సమానమైన బిఱ్ఱుగల మానసములన్నియు ఏదేనొక్కయాశయప్రభావమునకు సమానముగనే లోనగుచుండును. మానసముపైని ఆశయాల ప్రభావము దూరముమున్నగు కారణములనుబట్టి భేదిల్లుచుండును కాని ఆశయాలతాకిడికి మనఃకవాటము సదా తెరవబడియే యుండును. నేనొక దుష్కార్యము చేయుచున్నా ననుకొనుడు. అపుడు నా మానసము ఒకానొక స్పందనస్థితిలో నుండును. లోకమున నట్టి స్థితియందే యున్న ఇతరమానసములన్నిటికిని నామనస్పందనస్థితి ప్రభావమునకు లోనగునవకాశముకలదు. ఇట్లే నేనొకసత్కార్య

మును జేయుచున్నపుడు నామనస్సు మఱియొక స్పందనస్థితిలో నుండును; అట్టిబిగుతులోనేయున్న ఇతరమానసములన్నియు నామనఃప్రభావమునకు లోనగు నవకాశము గలదు. మనసుల కొండొకదానిపైగల యీ ప్రభావము ఇంచుమించు దానిదాని బిఱ్ఱునందలి ఎక్కువతక్కువలనుబట్టి యుండును.

పైదృష్టాంతమునే మఱికొంత అనుసరింతము:— తేజస్తరంగములు ఏదే నొకలక్ష్యమును జేరుటకు ముందు లక్షల కొలది సంవత్సరములు పయనము సాగింపవచ్చునుకదా. అట్లే భావతరంగములును దేనితో కలిసిపోయి తాము స్పందించునో ఆ లక్ష్యమును జేరుటకు ముందు వందలకొలదియేండ్లు పయనించి యుండవచ్చు. కావున మన వాతావరణమున మంచివియు చెడ్డవియు అగు భావస్పందనములు — నిండియుండు నవకాశము ఎంతేని గలదు. ప్రతి మానసమునుండి వెలువడు ప్రతిభావమును తన్ను స్వీకరించుట కనువగు మానసమును గలిసికొనుపర్యంతము స్పందించుచు పయనించుచునే యుండును. ఇట్టి భావములను గైకొనుటకు కవాటము తెఱచియుంచుకొన్న యే మానసమైనను వెంటనే వానిని గైకొనును. కావున నొకడు దుష్కార్యములను జేయుచున్నపుడు అతడు తన మానసమును ఒకానొక బిఱ్ఱు స్థాయికి తెచ్చుకొన్నాడు. అట్టిస్థాయి కనుగుణములై, వాతావరణమున నీవఱకే యున్నవని చెప్పదగినట్టి తరంగములన్నియు అతని మానసమున బ్రవేశించుటకై త్రొక్కటపడును. చెడ్డపనులను చేయువాడు సాధారణముగా చెడ్డపనులనే ఇంక నింకను ఎక్కువగాచేయుచుండుట కిదియే కారణము. అతని దుష్కార్యములు తీవ్రముగా హెచ్చిపోవుచుండును. సత్కార్యముల నొనర్చువాని విషయముకూడ నిట్టిదే; వాతావరణముననున్న 'మంచి' కెరటాలకన్నిటికిని అతడు తనలోనికి చోరవనిచ్చును, అతని సత్కార్యములు తీవ్రముగ పెరిగిపోవుచుండును. కావున దుష్కా-

ర్యముల నొనర్చునెడల రెండు రకాల ఆపదలకుపాలగుచున్నాము: మనల నావరించియున్న దుర్భావముల కన్నిటికిని మనలోనికి ప్రవేశమిచ్చుచున్నామను టొకటి, వందలకొలదిసంవత్సరముల యనంతర మగుగాక, ఇతరులపై ప్రభావము చూపగల చెడుగు సృజించుట రెండవది. మన దుష్కార్యాచరణమువలని బాధ మనకును ఇతరులకునుగూడ గల్గును. మన సత్కార్యాచరణము వలని 'మంచి' మనకును పరులకునుగూడ గల్గును. మఱియు మానవునందలి యితరశక్తులన్నిటివలెనే మంచి చెడుగు లను నీశక్తులును బాహ్యప్రపంచమునుండి తాము బలమును సంపాదించుకొనుచున్నవి

కర్మయోగానుసారము, మన మొనర్చు కర్మము ఫల వంతముకానిదే నశింపదు. ప్రకృతియందలి యేశక్తియు దానిని ఫలింపనీయక నిరోధింపజాలదు. నే నొక దుష్కార్యమును జేసితి నేని దాని దుష్ఫలమును నే ననుభవించి తీఱవలయును; దాని నీప్రపంచమున నేశక్తియు మాన్పజాలదు, ఆపజాలదు. ఇట్లే నే నొక సత్కార్యమును జేసితినేని అది సత్ఫలప్రదము గాకుండు నట్లు అడ్డుకొనుశక్తి యీ విశ్వమున లేదు. కారణమున్నచో కార్య ముండి తీఱవలయును, దాని నేదియు ఆపజాలదు, అడ్డుకొన జాలదు. ఇక కర్మయోగమునుగూర్చిన చాల చక్కని అనుపేక్ష్య మైన విషయము ఒకటి ప్రస్తావార్హ మగుచున్నది:—మన సత్క ర్మములును దుష్కర్మములునుగూడ అత్యంతము, అన్యోన్య సంబద్ధములై యున్నవి. మంచిచెడుగుల నడుమ నొక గీతగీచి, ఇది పూర్తిగా మంచికార్యము, ఇది పూర్తిగా చెడ్డకార్యమని చెప్పజాలము. ఒక్కసమయముననే సత్ఫలితమును దుష్ఫలిత మునుగూడ నీయజాలని కార్యము లేనేలేదు. ఇందుల కత్యంత సన్నిహితమైన యొక యుదాహరణము: నేను మీతో ప్రసంగించు చున్నాను. మీలో కొందఱు నేను సత్కార్యము చేయుచున్నా

నని భావింపవచ్చు. కాని ఇదేసమయమున వాతావరణమునందలి వేలకొలది క్రిములు నాచే చచ్చుచున్నవేమో! ఆ రీతిని కొన్ని ప్రాణులకు చెడుగుచేయుచున్నానేమో. మనము చేయుకార్యము మనకత్యంత సన్నిహితమై, మన మెఱిగినవారికి తగులుచు వారికి మేలుచేయుచున్నయెడల దానిని చాల సత్కార్యమనుచున్నాము. ఉదాహరణమునకు మీరు నా యుపన్యాసవ్యాపారము చాల మంచిదని చెప్పవచ్చును, కాని క్రిము లట్లు చెప్పవు. మిమ్ము మీరు జూచుచున్నారు కాని క్రిములు మీ కగపడుటలేదు. నే జేయు ప్రసంగము మీ విషయమున నెట్టిఫలితమును గల్గించు చున్నదో మీకు గోచరించుచున్నది. కాని క్రిముల విషయమున నెట్టి ఫలితమును గల్గించుచున్నదో మీకు ఆ రీతిని గోచరించుట లేదు. కావున మనదుష్కార్యములనుగూడ మనము పరిశీలించి చూచినయెడల ఎచ్చటనో వానివలన గొంతమేలు కలుగుట శక్య మని మనకు తెలియనగును. సత్కర్మములయందుగూడ నేదియో కొంత చెడుగున్నదనియు కేవల దుష్కర్మములందును ఏదో యొక మూల కొంత మేలున్నదనియు గుర్తించు నాతడే కర్మరహస్య మును గ్రహించినవాడు.

కాని దీనివలన దేలున దేమి? మన మెంత ప్రయత్నించి నను పూర్తిగ పవిత్రమని చెప్పదగిన కర్మముగాని, పూర్తిగ అపవిత్రమని చెప్పదగిన కర్మముగాని — పవిత్రతాపవిత్రతలను అహింస, హింస యను నర్థమున గ్రహింతుమేని—యుండనేరదు. పరులకు హింసలేకుండ జీవింపనే జాలము, శ్వాసింపనే జాలము; మనము నోటబెట్టుకొను ప్రతికబళమును మఱియొకని నోటినుండి లాగికొన్నదే. మనజీవితములే అన్యజీవితములను నెట్టివేయు చున్నవి. మానవులనో, జంతువులనో, సూక్ష్మక్రిములనో,— వీనిలో వేనినేని నెట్టివేయక మనకు తప్పదు. కావున కర్మముచే పరిపూర్ణత సిద్ధింప దను పర్యవసానము సహజముగా నేర్పడు చున్నది. అనంతకాలము మీరు కర్మ మొనర్చినను గహనమగు

ఈ కర్మవ్యూహమునుండి—బయల్పడు మార్గము లేదు. మీరు కర్మముల నెడతెంపులేక ఒనర్చుచునేయున్నను కర్మఫలితము లందలి యీ మేలు కీళ్ల కలయికను అంతుండదు.

కర్మమునకు లక్ష్యమేది అనునది మనము విచారింపవలసిన రెండవవిషయము. ఈ విశ్వము పరిపూర్ణస్థితికి వచ్చు సమయము—ప్రపంచమున వ్యాధిగాని, జరామరణములుగాని, దుఃఖదౌష్ట్య ములుగాని లేకుండు సమయము—వచ్చునని నమ్ము జనులు అధిక సంఖ్యాకులు ప్రతిదేశమునను గానవచ్చుచుందురు. ఇది చాల మంచి యభిప్రాయమే. అజ్ఞులకు ఉత్సాహమును ఉన్నతినిగూర్చ అది మంచి ప్రేరకశక్తియే; కాని క్షణమాలోచించితిమేని ఇది కేవల మసంభవమని స్ఫుటముగ తెలిసిపోవును. మంచి చెడుగులు ఒక్కనాణెపు ఇరువైపులే అనుట స్పష్టమైనప్పుడు అది ఎట్లు శక్య మగును? మేలుగల్గుచు అదేసమయమున కీడు లేకుండుట ఎట్లు సాధ్యము? పరిపూర్ణత యనగా నేమి? పరిపూర్ణజీవితమనుట 'విరోధాలంకారము'. మనకును బాహ్యప్రపంచమందలి ప్రతి వస్తువునకును నిరంతరము సాగు పోరాటమేకదా మనజీవితము. ప్రతిక్షణమును బాహ్యప్రకృతితో మనము నిజముగ పోరాడుచునే యున్నాము; నిర్జితులమైతిమేని జీవిత మంతరింపవలసినదే. తిండికై గాలికై ఎడతెంపులేక చెల్లు పోరాటమే జీవితము. వీనిలో నేది లేకున్నను చనిపోవుదుము. జీవితము నిరాటంకసరళప్రవాహము కాదు. అదొక సమ్మిశ్రఫలితము. లోపలనున్న ఒకానొక దానికిని బాహ్యప్రపంచమునకును సంఘటిల్లు బహుప్రకారము లగు నీ పోరాటమునే మనము జీవిత మనుచున్నాము. కావున ఈ పోరాటము ముగిసినప్పుడు జీవితమును ముగియుననుట విస్పష్టము.

ఆదర్శసౌఖ్యమనగా ఈ పోరాటము ముగిసినప్పటి స్థితియే. కాని యపుడు జీవితమును అంతమొందును. ఏలయన జీవితమంత

స్థానమున గూడబెట్టుకొను మానవసహజప్రవణతయే యీ ప్రవృత్తి. ఈ ప్రవృత్తి ఆగి నివృత్తి కల్గునేని అదే నీతికిని పారమార్థికపరతకును నాంది. ప్రవృత్తియు నివృత్తియు రెండును కర్మస్వరూపమునకు సంబంధించినవి: దుష్కర్మమే ప్రవృత్తి, సత్కర్మమే నివృత్తి. సమస్త నీతికిని పారమార్థికపరత కంతటికిని నివృత్తియే మూలాధారము. అహంకారము నిశ్శేషముగ లయించుటే, ఇతరునికై మనస్సును శరీరమును సర్వస్వమును త్యజింప సంసిద్ధుడగుటే నివృత్తిధర్మపరిపూర్తి. ఈ స్థితిని ప్రాపించిన మానవుడు కర్మయోగ పరమావధిని బొందినవాడే. ఇది సత్కర్మల మహోన్నత పరిపాకము. ఒక్కదర్శనమునైనను చదువకున్నను, ఏ దేవునందును నమ్మకము ఇంతకు మును లేకున్నను, ఇప్పుడును లేకున్నను, జన్మమున నొక్కసారియైనను భగవంతుని ప్రార్థింపకపోయినను, మానవుడు కేవలము సత్కర్మల ప్రభావముచేతనే 'పరులకొఱకు తన జీవిత సర్వస్వమును సమర్పింప సంసిద్ధుడగు'నట్టి దశ నధిగమించినచో, భక్తుడు ప్రార్థనలచేతను, వేదాంతి జ్ఞానముచేతను చేరుకొను చోటికే చేరుకొను నన్న మాట. కావున వేదాంతియు భక్తుడును కర్మయోగియు ఒక్క గమ్యమునొద్ద కలసికొందురని మీరు గుర్తింపవచ్చు. అహంకారలయమే ఆ ఏకగమ్యము. మతములు, తత్త్వశాస్త్రములు నెంత భేదిల్లినను సమస్తమానవకోటియు పరులకొఱకై తన సర్వస్వమును త్యజింప సంసిద్ధుడగు నాతనిజూచి పూజించును, అబ్బురపడును. ఇట మతప్రసక్తిలేదు సిద్ధాంతప్రసక్తిలేదు—పారమార్థికాశయములకన్నిటికిని కరము విముఖులగువారు సైతము ఇట్టి సంపూర్ణస్వార్థత్యాగ సంజనిత కృత్యమును గాంచినంతనే దాని కంజలి ఘటింతమని వారికి తోచును. ఎడ్విన్ ఆర్నాల్డ్ వ్రాసిన "ఏషియాజ్యోతి"ని జదివి స్వార్థత్యాగమును దక్క మఱిదేనినిగూర్చియు బోధింపని—ఏ దేవునిగూర్చియు బోధింపని—బుద్ధునియెడ స్వమతదురభిమానపూరితుడైన క్రైస్తవుడుకూడ నెట్టి గౌరవభావము జూపునో మీరు

కనలేదా? విషయమేమన, తన జీవితలక్ష్యమును గమ్యమును తన కెవ్వరితో భేదాభిప్రాయముగలదో వారి జీవితలక్ష్యమును గమ్యము నొక్కటియే యనుట స్వమతదురభిమాని యెఱుగడు, పాపము! భగవద్భావనను సదా ముందుంచుకొని సత్సంగపరివేష్టితుడైన ఉపాసకుడును తుదకు ఆ గమ్యస్థానమునే చేరి "దేవా, నీ యిచ్ఛయే నెఱవేఱుత" మనును. తనకై దేనినిగాని ఉంచు కోడు. అది అహంకారలయము. తన జ్ఞానముచే వేదాంతియు "నేను" అనునది వట్టిభ్రాంతి యని తెలిసికొని ఆ భ్రాంతిని సులభముగ విసర్జించుచున్నాడు; అది అహంకారలయము. కావున కర్మమును భక్తియు జ్ఞానమును అన్నియు నిచట కలసికొనును. భగవంతు డనగా జగత్తు కాదను ప్రాచీన మహాప్రబోధకుల బోధన కభిప్రాయ మిదియే. జగత్తు వేఱు, భగవంతుడు వేఱు — ఈ విభేద మెంతయు యథార్థము. 'జగత్తు అన్నప్పుడు మమకారమే వారికి వివక్షితము. 'న-మమ' అనుభావమే భగవంతుడు. సువర్ణ ప్రాసాదమున సింహపీఠి నధిష్ఠించియు ఒకడు మమకారగంధమేని లేనివాడుగ నుండవచ్చు. అట్లున్నప్పు డతడు భగవద్గతజీవనుడు. మమకారముగలిగియున్నవానికి ఇల్లు గుడిసె ఐనను, గుడ్డలుచింపి వైనను, 'నాది' అనుకొనుట కేమియు లేకున్నను, అత డేమో సంసారమున గాఢముగ మునిగియున్నవాడే.

ఇక మన ప్రధానవిషయములలో నొకదానికి మరలుదము — కొంతయైనను చెడుగు కలియని 'మంచి'ని మనము చేయలేమనియు, 'మంచి' యించుకేని కలియని చెడుగును మనము చేయలేమనియు చెప్పుదుము. ఇది తెలిసియున్నప్పుడు మన మెట్లు కర్మ మొనర్తుము? మానవుడు జీవించియున్నయెడల, పాపము, క్షుద్ర జంతువులను మొక్కలను చంపవలసియుండునని, దేనినైన ఎవని నైన హింసింపవలసియుండునని, కావున క్రమముగా ఆత్మహత్య నొనర్చుకొనుట ఒక్కటే సంసారతరణోపాయమని ఆశ్చర్యకర

మగునంత అసంగతముగా బోధించు మతసంప్రదాయములును కలవు. ఇదియే తమ మహోన్నతాదర్శముగా జైనులు బోధించి యున్నారు. ఈ సిద్ధాంతము చాల యుక్తియుక్తముగా నున్నట్లు కాన్పించును. కాని యీ సమస్యకు సరియైన సమాధానము భగవద్గీతయందు గానబడును. ఇదియే 'నిష్కామకర్మసిద్ధాంతము'. జీవితకర్మములను జేయుచు ఎందును సంగములేనివారముగ నుండుట. నీవు ఈ జగముననున్నను ఈ జగముకంటె సంపూర్ణముగా భిన్నుడవనియు, అందే కర్మ మొనర్చుచున్నను నీకొఱకు నీవు చేయుట లేదనియు గ్రహింపుము. నీకొఱకు నీ వేకర్మ మొనర్చినను అది తన ఫలితము నీకంటగట్టును. అది సత్కర్మమైనచో సత్ఫలితమును నీవనుభవించి తీఱవలయును, దుష్కర్మమైనచో దుష్ఫలితమును నీవనుభవించి తీఱవలయును; ఏ పనిగాని నీకొఱకై చేయబడనప్పుడు దాని ఫలితము నీకు చెందదు. ఈ యాశయముగల్గి భావస్ఫోరకమైన వాక్యము మా శాస్త్రగ్రంథాలలో కాననగును. 'లోకమునంతటిని చంపినను, (తానే చంపబడ్డను) తాను చేసినది తనకొఱకు కాదని గట్టిగ తెలిసినవాడు 'చంపినవాడు'ను కాడు, 'చంపబడినవాడు'ను కాడు. కావున కర్మయోగ మిట్లు బోధించును: ''లోకమును విడనాడకుము. లోకమున వర్తించుచు దాని ప్రభావములను సాధ్యమైనంతవఱకు జీర్ణించుకో. నీభోగానుభవమునకే అగుచో కర్మము చేయనే చేయకు.'' భోగానుభవము లక్ష్యముగనుండరాదు. మొట్టమొదట అహంకారమునుజంపుకొని, సమస్తలోకమును నీవే అని భావింపుము. ప్రాచీనక్రైస్తవులు చెప్పినట్లు ''ప్రాతమానవుడు చనిపోవలయును.'' నా భోగానుభవమునకై యే ఈ సమస్తవిశ్వమును ఏర్పడియున్నదను మమకారాశయమే ఈ ప్రాతమానవుడు. అవివేకులగు తల్లిదండ్రులు తమ బిడ్డల కిట్లు ప్రార్థింప బోధింతురు: ''ప్రభూ, నాకొఱకు నీవీ సూర్యుని సృజించితివి, ఈ చంద్రుని నా కొఱకు సృజించితివి...''

ఈ పసిపాపలకొఱకన్నిటిని సృజించుటకంటె భగవంతునకు మఱియొకపని లేదు కాబోలును! ఇట్టి యర్థరహిత ప్రలాపముల నెన్నడును మీ బిడ్డలకు బోధింపకుడు. ఇక మఱియొకరీతిలో అవివేకులైనవారు కలరు. చంపి తినుటకై యీ జంతువులన్నియు మనకొఱకు సృజింపబడినవనియు, ఈ ప్రపంచమంతయు మన భోగముకొఱకే సృజింపబడినదనియు వారు మనకు బోధింతురు. ఇది యంతయు అవివేకము. తనకొఱకే మానవుడు సృజింపబడినాడని పెద్దపులియు నిట్లు ప్రార్థింపవచ్చును: "ప్రభూ, నాచే తినబడుటకై వచ్చి తమ్ము తాము నాకు సమర్పించుకొనని యీ మానవులెంతదుర్మార్గులు! వీరు నీ శాసనమును ధిక్కరించుచున్నారు." లోకము మనకొఱకు సృజింపబడినచో మనమును లోకముకొఱకు సృజింపబడియున్నాము. మన భోగమునకై యీ లోకముసృజింపబడిన దనుకొనుట మనలను అణచిపెట్టు పరమదుష్టాభిప్రాయము. లోకము ఉండునది మనకొఱకు కాదు; ప్రతిసంవత్సరమును కోట్లకొలది జనులు ఇందుండి గతించుచున్నారు; ఇది లోకుల అనుభవమునకు తాకుట లేదు; గతించిన వారితావున కోట్లకొలది జను లితరులు భర్తీ అగుచున్నారు. లోకము ఎంతగా మనకొఱకేర్పడియున్నదో మనమును అంతగా లోకముకొఱకేర్పడియున్నాము.

కావున సక్రమముగా కర్మమొనర్చుటకై నీవు మొట్టమొదట సంగమును విడనాడవలయును. తదుపరి సంసార కల్లోలమున కలియక సాక్షివై కర్మమును సాగింపుము. నా గురుదేవుడిట్లు వచించువాడు: "మీ పిల్లలయెడ దాది వహించు భావమును వహింపుడు." దాది నీ బిడ్డను గైకొని ముద్దాడి దానితో నాటలాడుచు, అది తనబిడ్డయే యైనంత సుకుమారముగా దానితో ప్రవర్తించును; కాని నీ యిల్లు విడిచిపోవలయునని నీ వామెకు తెలిపినంతనే తన మూటయు ముల్లెయు గట్టుకొని వెంటనే బయలు

దేఱుటకు ఆమె సర్వసిద్ధముగనుండును. సమస్త రాగమును అపుడు విస్మరింపబడుచున్నది; నీ బిడ్డలను విడిచినప్పుడును ఇతరుల బిడ్డలను గైకొనునప్పుడును సాధారణమైన దాది కెట్టివ్యాకులతయు గలుగదు. "నాది" యని నీవు భావించునట్టి సర్వవిషయములందును నీ విట్టులే ప్రవర్తింపవలయును. నీవు దాదివి, భగవంతుని నీవు నమ్మినచో "నాది" అని నీవు భావించునట్టి సర్వము నిజముగా ఆ భగవంతుని దని నమ్ముము. మహాదౌర్బల్యము తఱచు మహాబలముగను సౌజన్యముగను తన్ను చూపుకొనును. నాపై నొక డాధారపడి యున్నాడనియు నే నొకనికి సాయము చేయగలననియు తలచుట వట్టి మనోదౌర్బల్యము. మన సమస్త సంగమునకును ఇదియే పుట్టినిల్లు, సంగమువలననే బాధ లన్నియు గలుగుచున్నవి. లోకమున నెవ్వడును మనపై నాధారపడియుండ లేదని, ఏ బిచ్చగాడును మన దానధర్మములపై నాధారపడడని, ఏ జీవియు మన దయపై నాధారపడడని, ఏ ప్రాణియు మన సాహాయ్యమునకై దేవులాడడని—మన మనస్సులకు మనము దెలుపవలయును. ప్రకృతియే సమస్త జీవులకును దోడ్పడుచున్నది. కోట్లకొలదిగ మన మిచట లేకున్నను ప్రకృతియే వానికి దోడ్పడును. నీవంటి నావంటి వ్యక్తులకొఱకై ప్రకృతిప్రవాహము ఆగిపోదు; ఈవఱకే చెప్పినట్లు ఇతరులకు సాయపడుటద్వారా మనలను తర్ఫీదుచేసికొనుటకు అవకాశము మీకుగాని నాకుగాని కలుగుట వరప్రసాదము. జీవితమున మనము నేర్వవలసిన గొప్పపాఠమిది; దీనిని పూర్తిగా నేర్చినంతనే మన కిక నెన్నడును అసౌఖ్యము కలుగదు; యథేచ్ఛగా సంఘముతో మన మపుడు కలిసిమెలగవచ్చును. మీకు భార్యలుండవచ్చు, భర్తలుండవచ్చు, దాసుల పటాలము లుండవచ్చు, ఏలుటకు రాజ్యము లుండవచ్చు. ప్రపంచము మీకై యుండునదికాదని, ప్రపంచమునకు మీ యావశ్యకత లేదని గుర్తించి మీరు వర్తించినచో వానివలన లేశమును మీకు హానికలుగదు. ఈ సంవత్సరముననే మీ మిత్రులలో

గొందఱు చనిపోయియుండవచ్చును. ప్రపంచము వారు లేకపోవుటచే పురోగమింపక వారు మరల రావలయునని నిరీక్షించుకొనియున్నదా ? దాని ప్రవాహమాగినదా? లేదు, ప్రపంచము సాగుచునేయున్నది. కావున ప్రపంచమునకు నీవలన నెఱవేఱవలసినదేదో ఉన్నదను భావమును, నీమనసునుండి తఱిమివేసికో. ప్రపంచము నీ సాయము నపేక్షింపదు. ఎవ్వడుగాని ప్రపంచమునకు తాను ఉపకారముచేయుటకై జన్మించితి ననుకొనుట అవివేకము, అహంభావము; అది సుగుణరూపమున నటించు స్వార్థపరత్వము. నీమీదగాని మఱియెవ్వరిమీదగాని ప్రపంచ మాధారపడినదికాదని గ్రహించునట్లు నీ మనస్సును నీనరములకును తర్బీదుచేసికొంటివేని అప్పుడు నీవుచేయు కర్మమువలన వ్యథారూపమగు నెట్టి ప్రతిక్రియయు కలుగదు. నీ వొకని కేదియైన నొసగి ప్రతిఫల మపేక్షింపనియెడల — ఆతడు నీయెడ కృతజ్ఞుడై యుండవలయుననియైన భావింపనియెడల — అతని కృతఘ్నతవలన నీకు బాధకలుగదు. ఏలన, నీవు దేనిని ఆశింపలేదు. బదులుగానేమేని పొందుటకు నీకొక హక్కున్నట్లు నీవు భావింపలేదు; అతనికి ప్రాప్తమైన దాని నాతనికి నీ వొసగినావు; ఆతని కర్మమే దానిని అతనికి సంపాదించినది; నీకర్మచే నీవు దానిని అందజేసినవాడవైతివి ఏదియో దాన మొనర్చితినని నీవు అహంకారము చెందు టెందులకు ? ఇయ్యబడిన ధనమునో, మఱి యే యితరదానమునో ప్రాప్తి కందజేసిన కూలివాడవు నీవు; తా నొనర్చిన కర్మముచే లోకము దానిని బడయుటకు అర్హత నొందినది. నీ యహంకారమున కిందు హేతువేమున్నది? లోకమునకు నీ విచ్చినందులో చాలగొప్ప ఏమియు లేదు. నిస్సంగత్వమును నీ వలవఱచుకొనినప్పుడు నీ కిక పుణ్యమును లేదు, పాపమును లేదు. 'మంచి' 'చెడుగు' అను తారతమ్యమును కలిగించునది స్వార్థపరత్వమే. ఈ విశ్వమున దేనికైనను సరే నీవైనిన్ను లోబఱచుకొన్ననే తప్ప దానికి నీమీద నెట్టిప్రభావమును లేదు.

మానవుని ఆత్మ వివేకవర్జితమై స్వాతంత్ర్యమును గోల్పోయిననే తప్ప ఆత్మపై దేనికిని ప్రభావములేదు. ఈవిషయము దుర్గ్రహమైనను కాలక్రమమున నీవు గ్రహింతువు. కావున దేనిప్రభావమును నీమీదికి రానీయక నీవు నిస్సంగత్వముచే జయించుచున్నావు. నే ననుమతించిననే కాని నాపై ప్రభావముచూపునధికారము దేనికిని లేదని చెప్పుట సులభమే. వెలుపలి జగము తనపై చూపు ప్రభావముచే ఖేదమోదములొందని వాని—దేనిని గాని నిజముగ తనపై ప్రభావముచూపనీయనివాని యథార్థలక్షణ మేమి? సంపదాపదలచే మనస్సు మాఱకుండు టే అతని లక్షణము. సమస్త పరిస్థితులందును ఆతడేకరీతి నుండును.

భారతదేశమున వ్యాసుడను నొక మహర్షి యుండెను. అతడు బ్రహ్మసూత్రకర్తగా సుప్రసిద్ధుడు, శుచి. అఖండసిద్ధి నొందుట కతని తండ్రి ప్రయత్నించి విఫలుడై యుండెను. తాతయు నిటులే ప్రయత్నించియు విజయము నందలేదు. ముత్తాతయు విజయోపేతుడు కాలేదు. వ్యాసుడును పూర్తిగా కృతార్థత నందలేదు. కాని ఆతని పుత్రుడగు శుకుడు ఆజన్మసిద్ధుడై వఱలెను. వ్యాసుడు శుకునకు జ్ఞానోపదేశము చేసి పరమార్థమును కఱపిన పిమ్మట జనకమహారాజు సభ కంపెను. అతడొక గొప్పరాజు, జనకవిదేహుడని అతనికి పేరు. విదేహుడనగా దేహరహితుడని యర్థము. రాజైనప్పటికిని అతనికి తన దేహస్మృతి బొత్తిగా లేదు. తానొక ఆత్మ ననుటే అతని సదానుభూతి. ఇట్టి జనకునివలన బోధోపదేశములను బడయుటకై తన బాలశుకుని వ్యాసు డనిపెను. శుకుడు తనయొద్దకు తత్త్వోపదేశార్థము వచ్చుచున్నా డను సంగతి జనకునకు దెలియును. అందుచే నాతడు ముందుగనే కొన్నియేర్పాట్లు చేసియుండెను. శుకుడు రాజభవనద్వారమును సమీపింప ద్వారపాలకు రాతని నిసుమంతయు లక్షింపరైరి. అతని కొక పీఠముమాత్రమిచ్చిరి. దానిపై నతడు మూడుపగళ్లు

మూడురాత్రులు కూర్చుండియుండెను. అతనితో ఎవరును మాటాడలేదు. ఎవరవని ఎటనుండి వచ్చితివని యైనను అడుగలేదు. అతడొకమహాముని పుత్రుడు. అతని తండ్రిని లోకమెల్ల గౌరవించును. అతడు తానును అత్యంత పూజార్హుడు. కాని నీచులును పామరులునగు నగరిరక్షకులు అతనిని లక్ష్యపెట్టరు. తర్వాత ఆకస్మికముగ రాజుగారిమంత్రులును పెద్దఉద్యోగు లందఱును అటకువచ్చిరి. నిరతిశయపూజలతో స్వాగతోపచారము గావించిరి. మహోజ్జ్వలకూటములలోనికి వారతనిని పిలుచుకొనిపోయి చూపిరి. పన్నీటస్నానముచేయించిరి, దివ్యాంబరముల గట్టనిచ్చిరి. ఎనిమిదిదినములుంచుకొని సర్వవిధభోగముల ననుభవింపజేసిరి. ప్రసన్నగంభీరమగు శుకునిమోము ఆదర నిరాదరములచే ఇంచుకేని మార్పొందలేదు. వాకిట వేచియున్నప్పుడును ఈభోగములనుభవించునప్పుడును అత డేకరీతి నుండెను. అంత నతడు రాజసభకు కొనిరాబడెను. రాజు సింహాసనాసీనుడై యుండెను. సంగీతము నృత్యాదివినోదములు చెల్లుచుండినవి. రా జంతట అంచువఱకు పాలునిండిన గిన్నెను శుకునిచేతికిచ్చి పాలొక్కచుక్కయైన తొణకకుండ నీ సభామందిరమును ఏడుమార్లు ప్రదక్షిణింపుమని కోరెను. పాటనడుమ, సుందరవదనముల ఆకర్షణనడుమ, శుకుడు గిన్నెచేతగొని బయలుదేఱెను. రాజు కోరినట్లు అతడు ఏడు ప్రదక్షిణములు చేసెను. పాలొకచుక్కయైన నేలపై చిందలేదు. ఆ బాలుడు తా ననుమతింపనిదే లోకమున నేదియు నతని మనస్సునాకర్షింపజాలదు. అతడు గిన్నెను రాజునొద్దకు తెచ్చినప్పుడు రాజు 'మీ నాయన నీకేమి బోధించెనో, స్వయముగ నీవేమి నేర్చుకొంటివో, నేను మరల చెప్పగల్గినదియు దానినే. పరమార్థము నీకు తెలిసినది, ఇంటికి పో' అనెను.

ఇట్లు మనోనిగ్రహమును సాధించినవానిపై వెలుపలిదేదియు ప్రభావముచూపజాలదు. అతని కిక బంధములేదు. అతని

మనసు స్వతంత్రము. అట్టివాడే సంసారమున చక్కగా జీవింప సమర్థుడు. లోకమునుగూర్చి ఇరుతెఱగులగు నభిప్రాయములు గల జనులు సాధారణముగా గాన్పించుచుందురు. కొందఱు నిరాశా వాదులై "ప్రపంచ మెంత ఘోరము! ఎంత దుష్టము!" అను చుందురు. మఱికొందఱు ఆశావాదులై "ప్రపంచ మెంత చక్కనిది! ఆశ్చర్యకరమైనది!" యనుచుందురు. మనోనిగ్రహము సాధింపని వారలకు ప్రపంచము చెడ్డదిగాతోచును లేదా మంచిచెడుగులసమ్మిశ్రముగానైన తోచుచుండును. మనోనిగ్రహ సంపన్నులమైనచో మనకు ఈ ప్రపంచమే ఆశాజనకమై, కన్ప ట్టును. ప్రపంచమున మన కపు డేదియు మంచిదిగాగాని చెడ్డదిగా గాని తోపదు; సర్వము ఉచితస్థానమున నున్నట్లు పొందుపొసగి యున్నట్లు కనిపించును. మొదటమొదట ప్రపంచము నరకమని చెప్పుచుండు కొందఱు మనోనిగ్రహమును సాధింపగల్గినంతనే ప్రపంచము స్వర్గమని చెప్పి తఱచు ముగించుచుందురు. మనము యథార్థ కర్మయోగులమైనచో పైనిచెప్పిన సిద్ధినొంద మనల శిక్షితులనొనర్చుకోగోరుదుమేని, మనము ఏ మెట్టునుండి ప్రారంభించినను సరే పరిపూర్ణమైన అహంకారలయమున పర్యవసించి తీఱుదుము. జీవభ్రాంతి తొలగినంతనే, దుఃఖనిబిడముగ కనిపించు చుండిన యీజగము ఆనందపూర్ణమగు స్వర్గమే ఐనట్లు కనిపింప గలదు. అందలివాతావరణమే పవిత్రమగును. ప్రతిమానవుని నెమ్మోమునను 'మంచి'యే కననగును. కర్మయోగోద్దేశమును కర్మయోగప్రయోజనమును అట్టిది! అనుభవములో దాని పరి పూర్తి అట్టిది."

మన వివిధయోగములకు ఒండొంటితో నెట్టి విరోధమును లేదు. అన్నియోగములును మనల నొక్కగమ్యమునకే చేర్చి పరిపూర్ణులను జేయును. ఏయోగమునైననుసరే మనము పూని కతో సాధింపవలయును. అంతే. కీలకమంతయు సాధనలోనున్నది.

మున్ముందు వినవలయును, తదుపరి మననము చేయవలయును. పిమ్మట అభ్యసింపవలయును. ప్రతియోగవిషయము నిట్లే. ఏయోగమును గూర్చికాని మొదట విని, దానిని గ్రహింపవలయును; దురవగాహముగానుండు విషయము లనేకములు సంతత శ్రవణ మననములచే చక్కగా బోధపడును. ప్రతివిషయమును తత్క్షణమే గ్రహించుట దుస్తరము. అన్నింటికిని వివరణము నీలోనే ఉన్నది. నిజముగా ఒరులచే నేర్పబడువాడు లేడు. మనకు మనమే నేర్చుకోవలెను. వెలుపలి బోధకుడు కేవలము మార్గసూచకుడు. అతని సూచన మన యాంతరంగికబోధకుని మేల్కొల్పుచున్నది. అపుడు మన భావనాశక్తిచేతను, గ్రహణశక్తిచేతను విషయము మనకు విస్పష్టమగును. దానియనుభవ మప్పుడు మనకు మనయందే గలుగును; ఇట్టి యనుభూతియే ప్రగాఢసంకల్పశక్తిగా పరిణమించుచున్నది. మొట్టమొదటిది అనుభూతి; పిమ్మట అదేసంకల్పముగా పరిణమించును, అంత నందుండి యద్భుతమగు క్రియాశక్తి యుదయించును, అంతట మన యావచ్ఛరీరమును కర్మయోగసాధనముగా మాఱుపర్యంతము, అహంకారలయమును అఖండనిస్స్వార్థతయు ప్రాప్తించుపర్యంతము, ఆ క్రియాశక్తి మన ప్రతినాళములోనికిని ప్రతినరములోనికిని, ప్రతికండరములోనికిని చొచ్చుకొనును. ఈ సిద్ధికి ఏవాదముమీదను, ఏసిద్ధాంతముమీదను, ఏ విశ్వాసముమీదను ఆధారపడవలసిన జరూరులేదు. ఒకడు క్రైస్తవుడా, యూదుడా, హిందువా యనున దెంతమాత్రము మనకు విచారణీయముకాదు. నీవు స్వార్థరహితుడవా, కాదా? ఇదియే లక్షింపవలసిన విషయము. స్వార్థరహితుడవైనచో ఒక్క పారమార్థిక గ్రంథమునైనను జదువకయే, ఒక్క ప్రార్థనాలయమునకైనను పోవకయే ఒక్క దేవాలయమైనను దర్శింపకయే పరిపూర్ణుడవయ్యెదవు. సమస్తయోగములకును గమ్యస్థాన మొక్కటియే యైయుండుటచే ఇతరయోగాపేక్షలేకయే ప్రతియోగమును

స్వయముగా మానవుని ముక్తుని గావింపజాలియున్నది. కర్మ జ్ఞాన భక్తి యోగమార్గములలో నేదియైనను సరే స్వయముగా సూటియైనమార్గమే; "సాఙ్ఖ్య యోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి నపణ్డితాః—జ్ఞానయోగ కర్మయోగములు భిన్నములని చెప్పువారు బాలురే, పండితు లట్లు వచింపరు." పైకి వేర్వేఱుగా నున్నట్లు గాన్పించినను ఈ రెండును మానవు నొక్కపరమావధికే చేర్చునని పండితు లెఱుంగుదురు.

# మోక్షము

కర్మమను మాటకు వ్యాపారమను నర్థముండుటే కాక శాస్త్రీయముగా అది కార్యకారణనియతినిగూడ సూచించునని యిదివఱకే చెప్పియున్నాము. ఏదేనొకఫలమును గల్గించునే వ్యాపారమైనను, ఏ క్రియయైనను, ఏ తలంపైనను కర్మ మనబడుచున్నది. ఇట్లు కర్మసిద్ధాంతమనగా, అనివార్యమగు కార్యకారణనియతియే. దీనిని ప్రతిఘటించుట శక్యము కాదు. కార్యమున్నచో కారణ ముండితీఱవలయును; మన తత్త్వశాస్త్రము ననుసరించి యీ నియమము సమస్త ప్రపంచమునకును వర్తించును. ఈ విశ్వమున ఎచ్చటగాని మనము చూచునదెల్ల, చేయునదెల్ల, అనుభవించునదెల్ల ఒకవైపున పూర్వకర్మకు తాను ఫలమై యుండుటే కాక మఱియొకవైపున భవిష్యత్ఫలమునకు తాను కారణమగుచున్నది. ఈ కార్యకారణభావముతోబాటు 'నియతి' అనగా నేమో మనము ఆలోచింపవలసియున్నది. ఒకక్రమము మరల ఆవృత్తమగు స్వభావమునకే 'నియతి' అనిపేరు. ఒక కార్యమువెంబడిని మఱియొకకార్యము జరుగుటకాని, అవియే ఒక్కొక్కప్పు డేకకాలమున జరుగుటకాని మనము చూచునప్పుడు ఈ క్రమముగాని ఏకకాలసంభవత్వముగాని మఱియొకప్పుడుగూడ జరుగునని యూహింతుము. మన తార్కికులును నైయాయికులును ఈ నియమమును 'వ్యాప్తి' యందురు. నియమమునుగూర్చినట్టి మన భావములన్నియు 'సంసర్గము' వలన గలుగుచున్నవని వీరి యభిప్రాయము. బాహ్యాంతర ప్రపంచములందు జరుగు సంఘటనలపరంపర ఒకవిధమైన నిత్యక్రమమున మనమానసమందలి విషయములతో సంయుక్తమగుచున్నది; దానిచే ఎపుడు మనము దేనినవలోకించినను వెంటనే అది మానసమందలి యితర విషయములతో నన్వయింపబడుచున్నది. చిత్తమున ఉప్పతిల్లు

ప్రతికెరటమును స్వసదృశములైన కెరటములను పెక్కింటిని ఉత్పాదించుచుండును. మానసికశాస్త్రము ననుసరించి ఇదియే 'సంసర్గ' (అసోసియేషన్) సూత్రము. విశ్వవ్యాప్తమును గంభీరము నగు సంసర్గసూత్రపు రూపాంతరములలో ఈ కార్యకారణనియతి ఒకటి. ఈ సంబంధ సార్వత్రికతకే సంస్కృతమున 'వ్యాప్తి' అని పేరు. 'దీనివెనుక ఇది వచ్చును. ఈ క్రమము ఇట్లే ఆవృత్తమగుచుండును' అను నియతి ఆంతర ప్రపంచమున నెట్టిదో బాహ్య ప్రపంచముననను అట్టిదే. కావున నియతి అనునది నిజముగా ప్రకృతియందు లేదు. గురుత్వాకర్షణశక్తి భూమియం దున్నదని కాని మఱొకనియతి ప్రకృతిలో మఱొకచోట నున్నదనికాని చెప్పుట పొరపాటు. వరుసగా జరుగు కొన్ని సంఘటనల క్రమమును మనస్సు గ్రహించునట్టి రీతియే నియమము; అది అంతయు మనస్సులో నున్నది. కొన్ని సంఘటనలు వరుసగాగాని ఏకకాలమునగాని జరుగుట, అవి యెప్పుడు నట్లే జరుగుననుభావ ముదయించుట, అందుంబట్టి సంఘటనక్రమమును మనస్సు గ్రహించుటను—దీనినే మనము నియతి అనుచున్నాము.

నియమము విశ్వనియమ మనునపుడు మనభావమేమి అనునది ఇక మన మాలోచింపవలసిన విషయము. 'సత్త' యందొకయంశమునకే మన స్తత్త్వశాస్త్రకారులుచెప్పు దేశకాలనిమిత్తములనునవి లక్షణములై యున్నవి. సత్తయందలి యీ యంశమే మన ప్రపంచము. అనంతసత్తయందు కేవల మొకయంశము దేశకాలనిమిత్తములవలన నేర్పడిన యొక విచిత్రరూపము నొందియున్నది—ఇదియే మన ప్రపంచము. కావున సోపాధికమైన యీ ప్రపంచముననే 'శాసనము' సాధ్యమగును. ఇందు కవ్వల ఎట్టి శాసనము నుండనేరదు. విశ్వము అని మనము నిర్దేశించునది సత్తయందలి మనోగోచరమగు నంశమునే — మనము చూడగలిగిన, అనుభవింపగలిగిన, తాకగలిగిన, వినగల్గిన, భావింప

గల్గిన, ఊహింపగల్గిన ఇంద్రియగోచరప్రపంచమునే; నియమబద్ధమైన ప్రపంచమిదే. దీని కతీతమగు సత్తను నియమమునకు కట్టువఱుప శక్యముకాదు; ఏలన మనోగోచర ప్రపంచమున కవ్వల కార్యకారణనియమము వర్తింపనేరదు. మన మనస్సు సంచరించు ప్రపంచమున కవ్వలిదేదియు కార్యకారణ నియమబద్ధము కాదు. ఏలన, ఇంద్రియాతీతమగు తావున విషయముల నన్వయించు మనోవ్యాపారము ఉండనేరదు. అది లేనిచోట కార్యకారణ నియతి యుండదు. సత్త కార్యకారణనియతికి కట్టువడుటయు శాసనబద్ధమని చెప్పబడుటయు నామరూపముల దాల్చినప్పుడే. కావున 'స్వతంత్రసంకల్పము' అనునదొకటి యుండుట అసంగతమని మనము గుర్తించుచున్నాము. అసలు ఆ మాటలే పరస్పర విరుద్ధములు; ఏలన సంకల్పమనునది మన మెఱుంగునదికదా; ఇక మన మెఱుంగునది సర్వము మన ప్రపంచములోనిదే. మన ప్రపంచమునందలి సర్వము దేశకాలనిమిత్తములను ఉపాధులచే రూపుదాల్చునది. మనము గ్రహించునది, గ్రహింపగల్గునది, సమస్తము కార్యకారణనియమబద్ధమై యుండవలయును. నియమబద్ధమగునది స్వతంత్రమై యుండు టెట్లు పొసగును? అన్యముల ప్రభావమునకు తా నధీనమై మరల తానొక కారణమగుచున్నది. కాని యేది సంకల్పరూపమగు మార్పునొందినదో, ఎది యింతకు మునుపు సంకల్పముకాదో, కాకుండి దేశకాలనిమిత్తములందు దగుల్కొని మానవసంకల్పరూపము నొందినదో, అది స్వతంత్రము; ఈ సంకల్పము దేశకాలనిమిత్తములను పంజరమునుండి వెలువడినంతనే మరల స్వాతంత్రమగును. ఇది స్వాతంత్ర్యమునుండి జనించును, బంధములకు కట్టువడును, మరల నందుండి వెలువడి స్వాతంత్ర్యమును బొందుచున్నది.

ఈ విశ్వ మెవనినుండి యుద్భవించుచున్నది? ఎవనియందు నిలిచియున్నది? మరల ఎవనియందు లీనమగుచున్నదను ప్రశ్న

లేపబడినది. ఇది స్వాతంత్ర్యమునుండి యుద్భవించి, బంధమున నిలిచి, మరల స్వాతంత్ర్యమున లీనమగుచున్నదని సమాధానము చెప్పబడినది. అనేకనామరూపములలో వ్యక్తమగుచున్న యీ అనంతతత్త్వమే మానవుడని మనము చెప్పునపుడు అందు కేవల మొక సూక్ష్మాంశమే మానవుడని మన తాత్పర్యము; మనకు గోచరించు నీ మనశ్శరీరములు అఖండతత్త్వమునం దొకయంశము, అనంతతత్త్వమం దొకబిందుమాత్రము. ఈ సమస్తప్రపంచము ఆ అనంతతత్త్వమం దొకలవము; ఇక మన నియమములును నిర్బంధములును, ఆనందములును, దుఃఖములును, సుఖములును ఆశలును సర్వము ఈ చిన్నప్రపంచములోనివే; మన పురోగమన తిరోగమనములుగూడ ఈ చిన్నయావరణములోనివే. కేవలమగు మన మనఃకల్పితమైన ఈ ప్రపంచము ఇట్లే సాగుచుండవలయు ననియు, మనకు దెలిసిన యీలోకపు పునర్భవమే యగు స్వర్గము నకు పోవలెననియు కోరుట ఎంత శిశూచితములో మీకు స్పష్టమే. అఖండానంతసత్త మనమెఱిగిన పరిమిత సోపాధికసత్తకు సరిపోవలెనను కోరికయు శిశూచితమనియు అసాధ్యమనియు వెంటనే మనకు విస్పష్టము కాగలదు. ఇప్పుడున్నదే తన కెల్లప్పుడు నుండవలెనని కోరువాడు—నేను ఒక్కొక్కప్పుడు చెప్పునట్లు 'హాయిగూర్చు మతము కావలె'నని కోరువాడు, తన ప్రస్తుతస్థితికంటె పైమెట్టు నూహించుకొననైన లేనంత పతనము చెందినవాడని మీరు గుర్తింపవచ్చును; తన ప్రస్తుత సంకుచిత పరిసరములతో అతడు తాదాత్మ్యము నొందుచున్నాడు. అంతకు మించి లేదు. తా ననంతు డనుసంగతి నాతడు మఱచినాడు. అతని ఆశయమంతయు ఈ నిముసమందున్న క్షుద్రసంతోషాలచే దుఃఖాలచే అసూయలచే పరిమితమై యున్నది. సాంతమైన ఇదే అనంతమని అతడు భ్రమించుచున్నాడు. ఇంతేకాదు, ఈ భ్రాంతి మాసిపోవుట కత డిష్టపడకున్నాడు. బౌద్ధులు 'తన్హా' 'తిస్స' యని చెప్పునట్టి జీవిత తృష్ణ నాతడు గట్టిగా అంటిపట్టుకొని

యున్నాడు. సుఖాలు, ప్రాణులు, చట్టములు, పురోగతులు, కార్యకారణనియతులు, లక్షలక్షలరకాలు మనకు తెలిసిన యీ చిన్నవిశ్వమునకు వెలుపల పనివడుచుండుట సుసంభవము. ఇంతకును ఇదంతయు మన యనంతాత్మతత్త్వమున కేవల మొక యంశమాత్రమే.

విముక్తిని బడయుటకై మన మీ ప్రపంచావధుల నతిక్రమింపవలయును. విముక్తి నిచట గనజాలము. పరిపూర్ణ సమత, క్రైస్తవులు చెల్పునట్టి 'మన ఆకళింపున కందని ప్రశాంతి' యీ లోకమునగాని, స్వర్గమునగాని, మన మనసులును తలంపులును సంచరింపగల మఱియెచ్చటగాని, మన యింద్రియముల అనుభవమునకును ఊహకును అందు ఏ ప్రదేశమునగాని లభ్యము కానేరదు. అట్టి యే తావును మనకు ఆ విముక్తిని నొసగజాలదు. ఏలన, ఆ సమస ప్రదేశములును ఈ విశ్వములోనివే కదా. నీ విశ్వమో, దేశకాలనిమిత్తబద్ధమై యున్నది. మన భూమి కంటెను దివ్యములైన ప్రదేశము లుండవచ్చును. అందలిసుఖము లిందలిసుఖములకంటె విశిష్టములై యుండవచ్చును. కాని యవియు విశ్వములోనివే కావున నియమబద్ధములే. కావున మనము అతిక్రమించిపోవలయును. ఈ క్షుద్రజగము ముగియుచోట పారమార్థికధర్మము ప్రారంభమగుచున్నది. ఈ యల్పసుఖములును, దుఃఖములును, ఈ క్షుద్రవిషయజ్ఞానమును అచట ముగియును. పరమార్థ మచ్చట ప్రారంభమగును. ఔపాధికభంగుర విశ్వమందున్న దృఢసంగమును మనము విడనాడువఱకు ఆవల నున్న నిరవధిక విముక్తిని జాడగా కాంచు ఆసపాటైనను మనకు లేదు. కావున మానవుల మహోదాత్తాభిలాషలకెల్ల లక్ష్యమగు ఆ విముక్తిని బొందుట కొక్కటేమార్గ మున్నది. ఏదనగా ఈ క్షుద్రజీవితమును విడనాడుట, ఈ క్షుద్రజగమును విడనాడుట, భువిని విడనాడుట, దివిని విడనాడుట, దేహమును విడనాడుట,

మనస్సును విడనాడుట, పరిమితమును సోపాధికమునైనదానినెల్ల విడనాడుట—క్షుద్రమగు ఈ యింద్రియజగమున మనోజగత్తున మన మోహమును త్యజించినచో వెంటనే విముక్తుల మగుదుము. సంసారబంధమునుండి వెలువడుటకు నియమబంధములను కార్యకారణనియతి నతిక్రమించు టొక్కటే మార్గము.

కాని ఈ సంసారసంగమును త్యజించుట చాల కష్టము; ఏ యల్పసంఖ్యాకులకో ఇది సాధ్యమగును. మనశాస్త్రములలో నిందులకు ద్వివిధమార్గములు చెప్పబడియున్నవి, ఒకటి "నేతి, నేతి—ఇది కాదు, ఇది కాదు" అను మార్గము. మఱియొకటి, "ఇతి, ఇతి—ఇది, ఇది" యను మార్గము. మొదటిది వ్యతిరేక మార్గము, రెండవది అన్వయమార్గము. ఇందు వ్యతిరేకమార్గ మన్నిటికంటె కష్టము. మహోన్నతలోకోత్తరచిత్తులును మహానంతసంకల్పశక్తిమంతులు నగువారు, ఊరక లేచి నిలబడి 'వలదు, నాకిది వలదు' అని చెప్పగనే వారి నిశ్చయమునకు వారి మనశ్శరీరములు విధేయములై యుండును. అట్టివారికే నేతి నేతి మార్గము సాధ్యము. వారే ఆ మార్గమున విజయము నందగలరు. అట్టివారు మిక్కిలి యరుదు. మానవులలో అత్యధికసంఖ్యాకులు అన్వయ మార్గమును సంసారమార్గమును ఎన్నుకొందురు. బంధములను బంధవిమోచనసాధనములుగ వినియోగించుకొందురు. ఇదియు నొకవిధమగు త్యాగమే. కాని విషయముల నెఱిగి, విషయముల ననుభవించి, ఆ రీతిని అనుభవమును గడించి, వస్తువుల స్వరూప మెఱిగి, మనసు వానిని విడనాడి సంగరహితమగువఱకు ఈ త్యాగము మెల్లగా మెట్టుమెట్టుగా జరుగును. మొదటిమార్గము వివేకముచే సంగరాహిత్యము నలవఱచుకొనుట, రెండవమార్గము కర్మచే, అనుభవముచే సంగరాహిత్యమును సాధించుట. మొదటిది కర్మమును జేయ నిరాకరించునట్టి జ్ఞానయోగము, రెండవది కర్మమును విడువక యాచరించునట్టి కర్మయోగము. ప్రపంచమున

ప్రతిజీవియు కర్మమొనర్పవలసియే యున్నది. ఎవరు ఆత్మయందే పూర్తిగ సంతుష్టులై ఉన్నారో, ఎవరికోర్కెలు ఆత్మ నతిక్రమించి పోవో, ఎవ్వరి మానస మెన్నడును ఆత్మపరాఙ్ముఖముగాకుండునో, ఆత్మయే ఎవరికి సర్వస్వమో, అట్టివారు మాత్రమే కర్మ మొనర్ప కుందురు; ఇతరులు కర్మ మాచరించితీఱవలయును. పైనుండి ఉరవడించు నీటివెల్లువ స్వాభావికముగనే లోతగు ప్రదేశమునబడి సుడిగుండమును నిర్మించును; ఆ సుడిగుండమున గొంచెముసేపు పరిభ్రమించి మరల నిరాటంకముగ సాగిపోవుటకు నిర్నిరోధ ప్రవాహరూపమున వెలువడును. ప్రతి మానవజీవితమును ఈ వెల్లువవంటిది. అది సంసారావర్తమునబడి దేశకాలనిమిత్త బద్ధమై, "నా తండ్రి, నా తల్లి, నా పేరు, నా ప్రఖ్యాతి" యని పలవించుచు ఈ సుడిగుండమున గొంతకాలము పరిభ్రమించి, తుదకెట్లో వెలువడి, తొంటిస్వేచ్ఛను మరల బొందును. సమస్త లోకము నిట్లే చేయుచున్నది. మనకు గోచరించినను, గోచరింప కున్నను, మన మెఱిగినను, ఎఱుగకున్నను, ఈ సంసార స్వప్నము నుండి వెలువడుటకే మనమందఱము పాటుపడుచున్నాము. ఈ జగదావర్తమునుండి వెలువడు శక్తిమంతుడగుటకే మానవుని లోకానుభవము.

కర్మయోగ మనగా నేమి? కర్మరహస్యమును గూర్చినట్టి జ్ఞానము. సమస్త ప్రపంచమును కర్మమొనర్చుచునే యున్నది. ఎందులకు? స్వాతంత్ర్యముకొఱకు, మోక్షముకొఱకు; మనస్స్వాతంత్ర్యమునకై, శరీరస్వాతంత్ర్యమునకై, ఆత్మస్వాతంత్ర్యమునకై, ఏకలక్ష్యమునకై—అణువు మొదలుకొని మహోన్నతజీవి వఱకును కర్మమొనర్చుచున్నారు. సమస్త వస్తువులును స్వాతంత్ర్యముకొఱకే సదా యత్నించుచున్నవి. బంధమును ద్రెంపుకొని పరుగిడజూచుచున్నవి. సూర్యుడు, చంద్రుడు, భూమి, గ్రహములు, సమస్తము బంధమును విదళించుకొని పరుగిడుటకే ప్రయ

త్నించుచున్నవి. ప్రకృతియందలి "కేంద్రము చుట్టును ప్రదక్షిణింప జేయు" (సెంట్రిఫ్యూగల్) శక్తులును, "కేంద్రమువంక కాకర్షించు" (సెంట్రిపెటల్) శక్తులును నిజమునకు మన విశ్వస్వభావమును దెలుపుచున్నవి. ప్రహారములకు సుదీర్ఘవిలంబములకు లోనై విశ్వమున త్రిప్పటచెంది తర్వాత విషయముల నెఱుగుటకు బదులు కర్మయోగావలంబనచే కర్మరహస్యమును, కర్మాచరణవిధానమును, కర్మమందలి యఖండనిర్మాణశక్తిని గ్రహింతుము. శక్తిని వినియోగించుకొను విధానము తెలియకున్నచో అందు విశేష భాగము వ్యర్థముగ ఖర్చుపడవచ్చును. కర్మయోగము కర్మాచరణమునకై శాస్త్రము నేర్పఱుచుచున్నది; ప్రపంచపు నడవడినెల్ల వినియోగించుకొను పద్ధతిని కర్మయోగము మనకు బోధించును. కర్మము అనివార్యము. అది అట్లుండవలసినదే. కాని మనము కృషిచేయవలసినది పరమపురుషార్థముకొఱకు. ఈ సంసారము మూడునాళ్ల ముచ్చట యనుటకు మోక్షమునకిది సాధనము కావున నిందుండి మనము తరింపవలయుననుటకు, విముక్తి ఈ ప్రపంచమున లేదనుటకు, విముక్తినికనుటకు మన మీ సంసారము నతిక్రమింపవలయుననుటకు, కర్మయోగము మనచే 'ఔ' ననిపించును. సంసారతరణమునకై మనము సంసారముగుండనే మెల్లగను తప్పకయు పురోగమింపవలెను. కుబుసము నూడ్చి దానిని జూచుచుండు పామువలె, సంసారమును విడిచి తటస్థసాక్షులుగనుండు నసాధారణపురుషులు లోకమున గొంద ఱుందురు; వారినిగూర్చి నేనిదివరకే చెప్పియున్నాను. లోకమున నిట్టి యలౌకికపురుషులున్నమాట వాస్తవము; కాని మిగిలిన మానవకోటి నెమ్మదిగా కర్మానుభవము పొందవలయును. కర్మ ప్రపంచముగుండ నడువవలసినవారే. మనకు అత్యధికలాభకరమైన రీతిలో కర్మరహస్యమును, కర్మాచరణవిధానమును కర్మయోగము మనకు దెలుపును.

కర్మయోగ మేమని బోధించును? "అసక్త స్సతతం కార్యం కర్మ సమాచర" "ఫలాపేక్షారహితుడవై విహితమైన కర్మము నెల్లప్పుడు చేయుచుండుము." దేనితోడను తాదాత్మ్య మును బొందకుము. నీ మనస్సును స్వతంత్రముగ ఉంచుకొనుము. లోకమున నీకు గాన్పించు నీ దుఃఖములన్నియు, ఈ బాధలన్నియు సంసారమున కనివార్యములైన పరిస్థితులు; దారిద్ర్యము, సంపదలు, సౌఖ్యము—అన్నియు క్షణికములు, ఇవి మన యథార్థ స్వరూపములోనివి కావు. యథార్థస్వరూపము సుఖదుఃఖాతీతము, ఇంద్రియాతీతము, భావనాతీతము. ఐనను మనమెప్పుడును కర్మ మొనర్చుచునేయుండవలయును. "కర్మముచేగాదు, సంగముచే దుఃఖము గలుగుచున్నది." మనముచేయు కర్మముతో తాదాత్మ్యమును బొందినంతనే దుఃఖ మనుభవింతుము. తాదాత్మ్య మును బొందనిచో దుఃఖ మనుభవింపము. ఎవ్వడైనను తనదిగాక మఱియొకనిదగు చిత్రపటము తగులబెట్టబడినచో సాధారణముగా బాధపడడు; కాని సొంత చిత్రపటమే తగులబెట్టబడినచో తానెంత బాధపడును! ఎందుచేత? రెండును చక్కని పటములేకదా, రెండును ఒక్కప్రకృతికే నకళ్లు కాబోలు. కాని దుఃఖము ఒక దానికై కల్గినంతకంటె చాల నెక్కువగా మఱొకదానికై కలుగు చున్నది. ఏలన, ఒకపటముపట్ల నాతడు తాదాత్మ్యము నొందు చున్నాడు; రెండవదాని విషయమున బొందుటలేదు. ఈ "నేను, నాది" యను నహంకార మమకారములే సర్వదుఃఖములకును కారణములు. మనసొమ్ము అనుకొనుటతోనే మమకారము జనిం చును. మమకారముచే దుఃఖము గలుగుచున్నది. మమకార ముతోగూడిన ప్రతికార్యమును, ప్రతిభావమును దేనియందో ఒకదానియందు సంగము గల్గించి వెంటనే దానికి మనలను దాసులను జేసివేయును. చిత్తమున నుదయించు "నేను, నాది" యను ప్రతివృత్తియు వెంటనే మనచుట్టు నొకగొలుసును దవిల్చును, మనలను బానిసలనుగా జేయును. నేను, నాది అని చెప్పకొను

కొలదియు బానిసతనము హెచ్చును. బానిసతనముతో దుఃఖమును హెచ్చును. కావున "లోకమందలి సమస్త పటముల సౌందర్యమును అనుభవింపుము, కాని వానిలో దేనితోడను తాదాత్మ్యమునుమాత్రము బొందకుము" అని కర్మయోగము మనకు బోధించును. ఏదియు "నాది" యనుకొనకుము. "నాది" యనుకొనినంతనే దుఃఖము మనల నావరించును. "నాబిడ్డ" యనియైనను నీ మనసులో అనుకొనకు. బిడ్డ ఉండనీ, కాని యది "నాది" యనకుము; అంటివా, దుఃఖమే నీకు ఫలము. "నా గేహము" అనకుము, "నా దేహము" అనకుము. ఉన్న చిక్కంతయు ఇందున్నది. ఈ శరీరము నీదియు కాదు, నాదియు కాదు, మఱియెవ్వరిదియును గాదు. ప్రకృతి నియమములచే ఈ శరీరములు వచ్చుచు బోవుచున్నవి; కాని మనకు బంధము లేదు, మనము సాక్షులము. పటమున కెంత స్వాతంత్ర్యము గలదో, గోడ కెంత స్వాతంత్ర్యమున్నదో ఈ శరీరమునకును అంతియే స్వాతంత్ర్యముగలదు. అట్టియెడ ఈ శరీరమున మన కింత మోహ మెందులకు? చిత్రకారుడొక చిత్తరువు వ్రాసినచో వ్రాసి యాతడు వెడలిపోవుచున్నాడు. "ఇది నా యధీనమున నుండవలయు" నను మమకారము నొందకుము. పొందితివా, నీకు దుఃఖ మారంభమగును.

కావున కర్మయోగ మిట్లు బోధించుచున్నది: "స్వార్థచింతను మమకారమును తలయెత్త నీయకుము; వీనిని నీ వణపగలిగినప్పు డణపుము, మనస్సున తత్సంబంధమగు వృత్తినిగూడ కలుగనీయకుము. అటుపిమ్మట నీవు సంసారమున ప్రవేశించి యథాశక్తి కర్మ మొనర్పవచ్చును. అపుడు లోకమున నీ యిచ్చవచ్చిన వారితో సంచరింపుము, ఇచ్చవచ్చిన ప్రదేశమునకు బొమ్ము, దానివలన లేశమును నీకు దోషము గలుగదు. నీటిలో నున్నను తామరాకును నీరంటుటలేదు, నీవు నిట్లే సంసారమున

వర్తింపవచ్చును. ఇదియే వైరాగ్యము.'' వైరాగ్యము లేనిదే ఏ యోగమును సాధింపజాలమని మీకు చెప్పియున్నట్లు నా జ్ఞప్తి. సమస్త యోగములకును వైరాగ్యమే మూలాధారము. ఇండ్లలో నుండుటను, నీటగుబట్టలు కట్టుటను, మధురాహారములు దినుటను మానివైచి, ఏ యెడారికో పోయి, నివసించువాడు పరమరక్తుడై యుండవచ్చును. అతనికున్నదెల్ల అతనిశరీరమే. శరీరమే తన సర్వస్వముగ అతడు గణింపవచ్చు. జీవించినంతకాలము శరీరముకొఱకే బాధలుపడుచుండును. శరీరమునకై మనము చేయున దేదియు వైరాగ్యముకాదు. వైరాగ్యమంతయు మనోగతము. 'నేను, నాది' యనునవి మానసిక పాశములు. ఈ పాశములచే శరీరముతోడను ఇంద్రియవిషయములతోడను బంధింపబడనియెడల మన మెచ్చటనున్నను, ఏమిగా ఉన్నను విరక్తులమే. ఒకడు సింహాసనాసీనుడైయు పరమ విరక్తుడుగను, మఱియొకడు చింపి గుడ్డలను గట్టుకొనియు పరమరక్తుడుగను, నుండవచ్చును. మొట్ట మొదట మనము వైరాగ్యమును సంపాదించి పిమ్మట నిర్విరామ కర్మాచరణదక్షులము గావలయును. వైరాగ్యము కష్టసాధ్య మనుట వాస్తవమే. ఐనను కర్మయోగము మనకు తత్సాధన కనువగు మార్గమును జూపును.

వైరాగ్యసాధనకు రెండుమార్గములు కలవు. ఇం దొకటి భగవంతునియందుగాని, మఱి యెట్టి బాహ్యసాహాయ్యమునగాని నమ్మకము లేనివారి మార్గము. వారి ఉపాయములు సొంత ఉపాయములు. ''నేను విరక్తుడను గావలయును'' అను దృఢనిశ్చయమును బూని వారు తమ మనోబలముతో, వివేకబలముతో, కృషి చేయవలసియున్నది. భగవంతునియందు విశ్వాసముగలవారి మార్గమింతకంటె చాల సులభము. వారు తమ కర్మఫలములను భగవంతునకు సమర్పించి, సంగరహితులై కర్మ మొనర్తురు. దేని నవలోకించినను, దేని ననుభవించినను, దేనిని వినినను, దేని

నొనర్చినను — సర్వము వారు భగవదర్పిత బుద్ధితోడనే యొన ర్తురు. మన మేకర్మ మొనర్చినను దానివలన స్వలాభమునుగాని, పరులచే స్తుతినిగాని ఆశింపకుందముగాక. సర్వము భగవంతు నిదే, కర్మఫలమును భగవంతునికే సమర్పింపుము. మనము జగ న్నాథుని సేవకులమనియు, ఆతని యాజ్ఞలను నిర్వర్తించుచున్నా మనియు, కర్మ మొనర్ప ప్రతిక్షణమును ఆతడే మనలను ప్రేరే పించుచున్నాడనియు భావించి కర్మఫలములయెడ నిర్లిప్తులమై యుందముగాక. నీ వారాధించునదెల్ల, అవలోకించునదెల్ల, చేయునదెల్ల, భగవానునకు సమర్పించి శాంతచిత్తుడవు గమ్ము. పరిపూర్ణ ప్రసన్నచిత్తులమై మన మనశ్శరీరములను సర్వమును భగవానునకు శాశ్వత సమర్పణముగా—యజ్ఞముగా—నొనర్తము గాక. అగ్నిలో హవిస్సులను వ్రేల్చుటకు బదులు అహోరాత్ర ములు యజ్ఞనారాయణునకు అహంకార సమర్పణమను నీ మహా యజ్ఞమును, ఈ యేకైక యజ్ఞము నొనర్పుము. "ఈ ప్రపంచ మున నిధినిక్షేపముల నన్వేషించుచు నీవే నా పెన్నిధానమవని కనుగొంటిని ; నన్ను నీకు సమర్పించుకొనుచున్నాను. ఈ సంసార మున ప్రియు నన్వేషింపసాగుచు నీవే నా ప్రాణప్రియుడవని, కను గొంటిని ; నన్ను నీకు సమర్పించుకొనుచున్నాను." భగవానునకు రేయింబవళ్లు ఇటు లాత్మనివేదన మొనర్చుకొనుచు నిట్లు వక్కాణిం తము గాక; "ఏదియు నాకొఱకుగాదు, మంచిదిగాని చెడ్డదిగాని తదుభయభిన్నముకాని, నేను దానిని లక్షింపను; నా సర్వస్వము నీకే సమర్పింతును." మన ఆభాసవ్యక్తిత్వమును రాత్రింబగళ్లు త్యజించుచుందము గాక. దాని నట్లువదలుకొనుట మనకొక వాడుక యగువఱకు, అది మన నెత్తురులోనికి నరములలోనికి మెదడులోనికి చొచ్చుకొనువఱకు, అహంకారత్యాగసంకల్పము నకు మనయావచ్ఛరీరమును ప్రతిక్షణమును విధేయమగువఱకు— రేయింబవళ్లు భగవానునకు మనలను మనము సమర్పించుకొందము గాక. రణభేరీనినాదములతో, ఫిరంగుల యగాదులతో, అఖండ

కోలాహలముతో గూడిన రణరంగ మధ్యమున కేగినను నీవపుడు ప్రశాంతచిత్తుడవై నిర్లిప్తుడవై యుందువు.

'కర్తవ్యము' అనెడి సామాన్యాశయము క్రింది మెట్టుది అని కర్మయోగము మనకు బోధించును ; ఐనను మనమందఱము మన కర్తవ్యము నాచరింపవలసినవారమే. కాని వింతయగు నీ కర్తవ్యబుద్ధి తఱచు మహా దుఃఖకారణ మగుచుండుట మీరు గుర్తింపవచ్చు. కర్తవ్యము మనలో నొక రోగముగా పరిణమించి యున్నది ; ఇదియే మనలను కర్మరంగమునకు లాగుచున్నది. ఇది మనల నావహించి మన జీవితమును దుఃఖమయ మొనర్చుచున్నది. ఇదియే మానవ జీవితవృక్షమునకు వేరుపురుగు. ఈ కర్తవ్యము— ఈ కర్తవ్యచింత —— మానవ మనఃకమలమును దహించివేయు చున్న గ్రీష్మసూర్యుడు. పాపము, కర్తవ్యదాసుల నటు చూడుడు! కర్తవ్యాలచే వారికి స్నానముచేయుటకు తీఱిక లేదు, భగవత్ప్రార్థనచేయుటకు తీఱిక లేదు. సదా "కర్తవ్యము" వారి నావహించి యున్నది. ఇంటినుండి వెడలి వారు కార్యనిమగ్నులై యుందురు. "కర్తవ్యము" వారి నావహించియున్నది!. ఇంటికివచ్చి మరల మఱునాటి కార్యములనుగూర్చి యాలోచింతురు. "కర్తవ్యము" వారి నావహించియున్నది! బండికి బూన్పబడిన గుఱ్ఱమువలె తుదకే నడివీధిలోనో ప్రాణములు విడువవలసివచ్చు నిట్టి జీవితము వట్టి బానిసజీవితము గదా! కర్తవ్యము అనగా అందఱికినగు అర్థమిదే. సంగరహితులమై, స్వేచ్ఛామయులమై కర్మఫలమును భగవంతునకు సమర్పించి కర్మముల నాచరించు టొక్కటే యథార్థకర్తవ్యము. మన విధులన్నియు భగవంతునివి. ఆతని కార్యముల నొనర్చుటకు నిమిత్తమాత్రుల మైనందులకు —— మనము ధన్యులము. మన నియమితకాలము మనము సేవచేయవలెను ; అది బాగుగాచేయుదుమో, ఓగుగాచేయుదుమో యెవ్వ రెఱుంగుదురు ? బాగుగా జేసినచో ఫలము మనది కాదు; ఓగుగా జేసినను

బాధ్యత మనదికాదు. కావున శాంతచిత్తుడవై, బంధరహితుడవై కార్యముల నొనర్పుము. ఇట్టి స్వాతంత్ర్యమును బడయుట చాల దుష్కరము. దాస్యమును కర్తవ్యమని చెప్పుట—ఈ రక్తమాంస కల్పిత శరీరమందలి వ్యామోహమునకు కర్తవ్యము అని నామ కరణముచేయుట — చాల సులభము! జనులు లౌకికజీవితము లోనికిదిగి, ధనముకొఱకో, తమకు మోహమున్న మఱి దేని కొఱకో పెనగులాడుచుందురు, కలహించుచుందురు. "ఎందుల కీ గందరగోళము?" అని వారి నడుగుడు. "ఇది మా కర్తవ్యము" అని సమాధానము చెప్పుదురు. కాని యథార్థమున కిది విపరీత మైన కాంచనవ్యామోహము, స్వలాభాపేక్ష. ఐనను వారు దీనిని పూలతో గప్పిపుత్తురు.

ఇంతకును విహితకర్తవ్యమనగానేమి? శరీరమునుసంగమును బలాత్కరించి మనచే దేనిని చేయించునో అదే ఈ కర్తవ్యము. మమకారము స్థిరపడినంతనే దానికి మనము కర్తవ్యమని నామ కరణముచేయుదుము. ఉదాహరణమునకు, వివాహాచారములేని దేశములలో భార్యాభర్తల నడిమి కర్తవ్యాలు లేవు. వివాహ మైనప్పుడు ఒండొరులమీది మోహమునకు కట్టువడి వారు కలిసి మనుచుందురు. పలుతరములైన వెనుక ఆ విధమైన జీవనము స్థిరపడును; స్థిరపడినంతనే అది విధి యగుచున్నది. ఇది యొక విధమైన దీర్ఘవ్యాధియని చెప్పవచ్చును. అది తీవ్రమైనపుడు దానిని వ్యాధి యనుచున్నాము; ఆ వ్యాధియే జీర్ణించినపుడు దానిని స్వభావమనుచున్నాము. అది వ్యాధి. అది తీఱనిదైనంతనే దానికే ధర్మమను పెద్ద నామకరణమొనర్చుచున్నాము. దానిపై పువ్వులు చల్లుచున్నాము; వాద్యములు ప్రయోగించుచున్నాము; మంత్రములు పఠించుచున్నాము;—ఇక నీ ధర్మముకొఱకై లోక మంతయు నడుముగట్టుకొని యుద్ధమునకు దిగుచున్నది; ఇక లోకులు ధర్మదీక్షాబద్ధులై యొకరినొకరు దోచుకొన నారంభించు

చున్నారు. మానవులందలి పశుస్వభావమును నిరోధించు పర్యంతము కర్తవ్యబుద్ధి మంచిదే. మఱొక యాదర్శము నందుకోజాలని క్రిందిమెట్టువారికి కిది కొంతవఱకు శ్రేయస్కరమే. కాని కర్మయోగులు కానెంచువారలు ఈ కర్తవ్యబుద్ధిని త్రోసిరాజనవలయును. మీకును నాకును ఏ విధియు లేదు. లోకమునకు నీ వొసగుదాని నెల్లరీతుల తప్పక యొసగుము, కాని 'విధి'గా మాత్రము కాదు. లోకమునకు నేను దీని నొసగితినని కలనైనను దలపకుము. కర్మాచరణమున నిర్బంధితుడవు గాకుము. నీవేల నిర్బంధితుడవు గావలయును? నిర్బంధముచే నే కార్యమును జేసినను అది సంగమును గల్గించును — ఏ విధియైనను నీ కెందుల కుండవలయును? సమస్తము భగవానునకు సమర్పింపుము. ఎల్లర దహించు కర్తవ్యవహ్ని రగులుచుండు ఈ భీకరాగ్నికుండమున ఈ యమృతము గ్రోలి సుఖింపుము. పరమేశ్వరసంకల్పము నే మనము నెఱవేర్చుచున్నాము. పుణ్యాపాప ఫలములతో మనకు బనియేమి? నీకు పుణ్యము కావలసియున్నచో పాపమునకును తలయొగ్గవలసిన దే. పాపఫలమునుండి తప్పించుకొనుటకు ఏకైక మార్గము పుణ్యఫలమునుగూడ విడుచుటయే. దుఃఖవిముక్తుడవు గావలయునన్నచో సుఖాసక్తిని విడుచుటే ఏకైకమార్గము. సుఖదుఃఖములు ఒండొంటి నంటియుండును. ఒకవైపున సుఖమున్నచో మఱియొకవైపున దుఃఖమున్నది. ఒకవైపున జన్మమున్నచో మఱియొకవైపున మృత్యువున్నది. మరణాతీతులము కావలయునన్నచో జీవితాభినివేశము విడుచుటే ఏకైకమార్గము. భిన్నదృక్పథములతో జూచుటచే భిన్నముగా నున్నట్లు గాన్పించు జననమరణము లొక్కటే. కావున 'దుఃఖరహితమగు సుఖము' 'మృత్యురహితమగు జన్మము' అను ఆశయములు బడిపిల్లలకును పసిబాలురకును చాల బాగుండును. కాని వివేకి ఇది కేవల విరుద్ధార్థకపదగుంభనమని గుర్తించి రెంటిని విడిచిపెట్టును. కావున నీ వే కార్యమొనర్చినను, దానివలన నీకు స్తుతిగాని బహుమానము

గాని కలుగవలయునని కోరకుము. మన మొక సత్కార్యమును జేసితిమో లేదో వెంటనే జను లందులకు మనలను శ్లాఘింప వలయునని కోరుచుందుము. ఏ ధర్మకార్యమునకో కొంతధనము నిచ్చినంతనే మన పేరులు పత్త్రికలలో అభివర్ణింపబడవలయునని వాంఛించుచుందుము. దుఃఖమేకదా యిట్టి వాంఛలకు ఫలము. ప్రపంచమందలి మహామహులు ఎవరికిని తెలియకే గతించినారు. వారినిగూర్చి లోకమున కించుకేని తెలియదు. ఆ మహామహులతో బోల్చిచూచినచో మన మెఱిగిన బుద్ధులును క్రైస్తులును రెండవతరగతివారే. నిశ్శబ్దముగ పాటువడిన అట్టి అజ్ఞాతమహానుభావులు నూర్లకొలదిగ ప్రతిదేశమందును మనియున్నారు. నిశ్శబ్దముగా జీవించి, వారు నిశ్శబ్దముగా వెడలిపోవుదురు. కాలక్రమమున వారి భావములు బుద్ధులయు క్రైస్తులయు వాక్కులలో వెలువడును. మన మెఱుగునది ఈ బుద్ధులను ఈ క్రైస్తులనే. ఉత్తమోత్తము లెన్నడును తమ జ్ఞానముచే పేరు ప్రతిష్ఠలను బొంద నాశింపరు. వారు తమ ఆశయాలను లోకమునకు విడిచి పెట్టుదురు; అవి తమవని చెప్పరు, తమపేర సంప్రదాయములను సిద్ధాంతములను స్థాపింపరు. అట్లు చేయుటకు వారిప్రకృతి సమస్తమును వెనుదీయును. వారు శుద్ధసాత్త్వికులు. వారెట్టి సంచలనమును గల్గింపజాలరు, తమప్రేమలో తామే కరగిపోవుదురు. భారతదేశమున నొక గుహలో నివసించు నిట్టి యోగిపుంగవు* నొకని నేదర్శించియున్నాను. నేగాంచిన యత్యద్భుత వ్యక్తులలో ఆతడొకడు. ఆతడు తన వ్యక్తిత్వమునే మఱచినాడు, అహంకారమాతనియందు కలికమునకైనను కానరాదు. సర్వమును దనలో

* ఈతడు పావా (పవనా) హారిబాబా యను గాజిపురపు సాధువు. స్వామి యీతనిగూర్చి ప్రత్యేకముగా నొకమహోపన్యాస మొసగియున్నాడు. ఈ సాధుపుంగవు నొకప్పు డొక పాము కఱవ, "పరమేశ్వరునుండి వార్తావహు డరుదెంచె" నని నిర్మిపుడె యుండెను.

నిముడ్చుకొను దివ్యత మాత్రమే యాతనిలో నున్నది. ఏదేని జంతువు ఆతని చేతిని కఱచినచో రెండవచేతినిగూడ దాని కొసగ సంసిద్ధుడై యాత డంతయు పరమేశ్వరేచ్ఛ యని పలుకును; తన కేమి ప్రాప్తించినను పరమేశ్వర సంకల్పమే. లోకుల కాతడు తన్ను చూపుకొనడు, ఐనను దివ్యాశయప్రపూర్ణుడు ఆతడు, ప్రేమామృత సింధువు.

ఇట్టి యోగిపుంగవులకు తరువాత గణింపదగినవారు రజోగుణాధికులు, కార్యదక్షులు, ధర్మ రక్షణార్థము నడుముగట్టుకొని పోరాడువారు. పరిపూర్ణుల భావములను గైకొని వీరు లోకమునకు బోధింతురు. ఉత్తమోత్తములగువారు నిశ్శబ్దముగా మహోదార పారమార్థికాశయములను సేకరింతురు; ఇతరులు—బుద్ధులును, క్రీస్తులును—ఊరూరుతిరిగి ధర్మప్రబోధ మొనర్చుచు పాటుపడుదురు. గౌతమబుద్ధుడు తాను ఇరువదియైదవ బుద్ధుడ నని సదా చెప్పుచుండినట్లు అతనిజీవితచరిత్రమున కాన్పించును. ఆతని ముందు మనిన యిరువదినలుగురును చరిత్రకు దెలియరైరి, ఐనను వారు వైచిన పునాదులమీదనే ఈ చారిత్రకబుద్ధుడు తన ధర్మసౌధమును నిర్మించెను. ఉత్తమోత్తము లెప్పుడును మౌనులుగా, ప్రశాంతులుగా, అజ్ఞాతులుగా నుందురు. వారే బుద్ధిప్రభావమును నిజముగా గ్రహించినవారు. తా మొక గుహలోనికి పోయి, ద్వారమును బంధించి, యథార్థములగు నైదుభావములను భావించి యంతటితో గతించినను, ఆ యైదుభావములును ఆచంద్రార్కము వెల్గొందునని వారికి గట్టిగా దెలియును. నిజముగా నట్టిభావములు పర్వతములను పగుల్చుకొని, సాగరములను లంఘించి, ప్రపంచ వ్యాప్తినిగాంచి మించును. అవి మానవహృదయాంతరాళమున ప్రవేశించి, మెదడులలోనికి వ్యాపించి, జీవితప్రవర్తనలలో వ్యవహారములలో తమ్ము ప్రకటించు మహిళలను మహాజనులను లేవదీయును. ఇట్టిసత్త్వస్వరూపులు సర్వదా సర్వేశ్వరునకు అత్యంత సన్నిహితులై యుండుటచే కార్యరతులు కాజాలరు;

పోరాడలేరు, పాటుపడలేరు, పెనగులాడలేరు, బోధింపలేరు, లోకహిత మందురే, దానిని చేయలేరు. ఎంత మంచివారైనను తీవ్రకార్య నిమగ్నులగువారియందే లవలేశమో అజ్ఞాన మింకను నిలిచియుండును. మన స్వభావమున గొంతమాలిన్య ముండిననే కాని కర్మమొనర్పజాలము. సాధారణముగా రాగముచేతను ప్రయోజనేచ్ఛచేతను ప్రేరేపింపబడుట కర్మస్వభావముననే కలదు. చీమ చిటుకుమన్న గ్రహించునట్టి జగద్రక్షకుని మ్రోల మానవుడు తన కర్మములకెట్టి ప్రాముఖ్యము నారోపించుకోగలడు! జగన్నాథుడే జగత్తునందలి ప్రత్యల్ప వస్తువును గూర్చియు శ్రద్ధ వహించుచున్నాడని గ్రహించియు మన చెయిదములకు ప్రాముఖ్యమును గల్పించుకొనుట దైవనిందయే గాదా? మనము ఆదరాద్భుతములతో నిలబడి కరములుమోడ్చి, "నీ యిచ్ఛయే నెఱవేఱుత" మని ప్రార్థింపవలసినవారమే! మహోన్నతతములు పూర్తిగా సంగవిరహితులై యుండుటచే కర్మమొనర్పజాలరు. ఎవ్వరి మానసము ఆత్మలీనమై యున్నదో, ఎవ్వరి కోర్కెలు పరమాత్మైకనిమములో, ఎవ్వరు పరమాత్మతో నిత్యయోగముపొంది యున్నారో అట్టివారికి కర్మము లేదు. వారే నిజముగా మానవోత్తములు, వారు దక్క ఇతరులందఱును కర్మమొనర్చి తీఱవలయును. కాని, అట్లొనర్చునప్పుడు లోకములో ఎంతటి క్షుద్రవస్తువునకైనను సరే మనము తోడ్పడగలమని ఎన్నడును భావింపకుందుముగాక. మేలొనర్చుట మనవలనగాదు. ప్రపంచ మను నీ మహా వ్యాయామశాలలో మనమొనర్చు మేలు మనకే. ఇదియే కర్మాచరణమున మన కుండవలసిన సరియగు మనోవైఖరి. ఈ విధముగా కర్మమొనర్చితిమేని, యిట్టి కర్మాచరణము మనకు భగవద్దత్తమగు మహావకాశమని సదా మనము గుర్తించి వర్తించితిమేని, మనకు దేనియందును ఎప్పుడును సంగముగల్గదు. మీబోటి నాబోటి లక్షలకొలది జనులు తాము ఈ లోకమున ఘనులమని తలపోయుచుందురు. కాని మనము అందఱమును మరణిం

తుము. మరణించిన ఐదునిమిషములకే ప్రపంచము మనలను మఱచిపోవును. కాని, భగవంతుడు శాశ్వతుడు. ''సర్వశక్తిమంతుడు సంకల్పింపనిచో క్షణమైన నెవ్వడు జీవింపగలడు? క్షణమైన నెవడు శ్వాసింపగలడు?'' ఆతడే సదా జగద్వ్యాపారపరాయణుడగు దేవుడు. శక్తిసమస్తము అతనిది, అతని యధీనము. ఆతని యాజ్ఞచే గాలులు వీచుచున్నవి. సూర్యుడు ప్రకాశించుచున్నాడు, పుడమి జీవించుచున్నది, భువిని మృత్యువు తాండవించుచున్నది. ఆతడే సర్వనిర్వాహకుడు, సర్వము ఆయనే, సర్వమందున్నవాడాయనే. మనచేతనైనది ఆయన నుపాసించుట మాత్రమే. సర్వ కర్మఫలత్యాగ మొనర్పుము, లోకహితము కొఱకే లోకహిత మొనర్పుము; అపుడే అఖండవైరాగ్య మబ్బును. ఇట్లు హృదయగ్రంథులు తెగి అఖండమోక్షము ఫలించును. నిజమున కిట్టి మోక్షమే కర్మయోగమునకు లక్ష్యము.



# కర్మయోగాదర్శము

భిన్నమార్గములచే ఒక్కగమ్యమునే ప్రాపింపగల మనునది వేదాంతమతమందలి మహోదాత్తాశయము; కర్మము, భక్తి, యోగము, జ్ఞానము నని వీనిని నేను స్థూలముగా నాలుగు అని నిర్దేశించియున్నాను. ఐనను ఈ మార్గాలు ఒకదానితో నొకటి చేరనే చేరనంత వేర్వేరైనవి కావని జ్ఞప్తియుంచుకొండి. ఒక యోగము మఱియొక యోగమున గలిసిపోవును. కాని ఎందు ఏది ప్రధానముగ నున్నదో దాని కాపేరు పెట్టుదుము. కర్మ యోగమునకు దక్క ఇతర యోగములకు కేవల మసమర్థులగు వారు కొందఱును, ఉపాసకులు మాత్రమే యగువారు కొందఱును, జ్ఞానాన్యవిహీనులగువారు కొందఱును ఉన్నారని కాదు. ఎవని యందు ఏవిధము ఏ పథము ప్రధానముగ నున్నది అను దాని ననుసరించి యీ విభాగము లేర్పఱుపబడినవి. తుద కివి యన్నియు ఒక్కగమ్యమును బొందుననియు, అం దైక్యమొందుననియు మనము గ్రహించియున్నాము. సర్వమతములును, అన్నికర్మో పాసనలును మనల నొక్కగమ్యమునే ప్రాపింపజేయుచున్నవి.

ఆ గమ్యమును చూప నేనిదివఱకే యత్నించియున్నాను. నేను గ్రహించినరీతిలో మోక్షమే ఆ గమ్యము. నిర్జీవమగు— జడమగు — భౌతిక పరమాణువు మొదలుకొని జీవలోకమున మహోన్నతసత్త్వయగు మానవాత్మపర్యంతము, అణువు మొదలు కొని మానవునివఱకు, మనచుట్టును మనకు గాన్పించు సమస్తము మోక్షమునొద్దకే దారిచేసికొనిపోవుచున్నది. ప్రపంచమంతయు నిజముగా విముక్తికై సాగు ఈ పోరాటపు ఫలితమే. సమస్త సంయోగములందును ప్రత్యణువును స్వీయమార్గమున సంచరింప నితరాణువులనుండి విడివడ యత్నించుచున్నది; కాని యితరాణు వులు దానిని నిరోధించుచున్నవి. సూర్యమండలమునుండి మన

భూమండలము తొలగిపోవ యత్నించుచున్నది, ఇట్లే భూమండలమునుండి చంద్రమండలము ఎడసిపోవ బ్రయత్నించుచున్నది. చీలిపోవు స్వభావము ప్రతివస్తువునకును గలదు. అందు కొక అంతులేదు. విముక్తికొఱకైన యీ పెనగులాటయే ప్రపంచములో మన కగపడుదానికెల్ల మూలము. దీని ప్రేరణచేతనే యోగి ప్రార్థించుచున్నాడు, దొంగ దొంగిలించుచున్నాడు. అవలంబిత కార్యవిధానము సరియైనది కానిచో ఆ కార్యమును మనము పాప మనుచున్నాము. అది సక్రమమై ఉత్తమమార్గము ననుసరించినచో ఆ కార్యమును మనము పుణ్య మనుచున్నాము. కాని ప్రేరక మేమో, విముక్తికొఱకైన పెనగులాట ఏమో ఉభయమున కొక్కటియే. బద్ధదశలో నున్నాననెడి యెఱుకచే బాధితుడై యోగి దానిని బాపుకొనుటకై భగవంతుని ప్రార్థించుచున్నాడు. తన కేవో కొన్ని వస్తువులు లేవను తలంపు దొంగను బాధించుచున్నది, ఆ లేమిని బాపుకొనుటకై—అందుండి విముక్తి నొందుటకై—యాతడు ప్రయత్నించును. అందుకై దొంగిలించుచున్నాడు. చేతనాచేతన సమస్త ప్రకృతికిని మోక్షమే ఏకైక గమ్యము: తెలిసినను తెలియకున్నను సర్వము ఆగమ్యమువంకకే దారిచేసికొనిపోవుచున్నది. యోగి వెదకుచున్న విమోచనమునకును, దొంగ వెదకుచున్న విమోచనమునకును చాల భేదము కలదు; యోగికి ప్రియమగు విమోచనము అనిర్వచనీయ బ్రహ్మానందప్రద మగుచున్నది. దొంగ కోరుకొనునదియో, వానికి మఱింత బంధమును గల్పించుచున్నది.

ప్రతిమతములోను ఆవిష్కృతమై కానవగునది విముక్తికై సాగు ఈ ప్రయాసయే. క్షుద్రశరీరాభిమానమును విడనాడుటే యగు స్వార్థరాహిత్యమునకును, సమస్త నీతికిని ఇదే పట్టుగొమ్మ. ఎవ్వడేని పరహిత మొనర్చుచు సత్కర్మముల నొనర్చుచున్నచో "నేను, నాది" యను సంకుచితావధులకు లోబడి అతడుండజాల

కున్నాడని యర్థము. నిస్స్వార్థత కొక పరిమితి లేదు. సమస్త నీతిశాస్త్రములును సంపూర్ణ స్వార్థత్యాగమే పరమావధి యని బోధించుచున్నవి. కేవల నిస్స్వార్థతను మానవుడు సాధించు ననుకొండి, అప్పు డత డేమగును? అత డిక మునుపటి 'ఫలానా' పుల్లయ్యగాని ఎల్లయ్యగాని కాడు. అత డనంతవ్యాప్తిని గడించెను. మునుపటి యల్పవ్యక్తిత్వము శాశ్వతముగా గతించినది. అతడు అనంతుడైనాడు. ఈ యనంతత్వప్రాప్తియే సమస్త మతములకును నీతివేదాంతబోధనలకును పరమావధి. ఈ యాశయమునే వేదాంతశాస్త్రసరణిలో చెప్పినప్పుడు విని వ్యక్తివాది భయమందును. ఐనను నీతిని బోధించునపుడు తాను తెల్పునదియు ఈ యాశయమునే. స్వార్థరాహిత్యమున కాతడు హద్దులేదనును. వ్యక్తిత్వ సిద్ధాంతము ననుసరించి యొకడు పూర్తిగా స్వార్థరహితుడైనా డనుకొందము; ఇతర సిద్ధాంతములు దెలుపు ముక్తులకును వానికిని భేదమేమి? విశ్వముతో నాతడు తాదాత్మ్యము నొంది యున్నాడు. ఇట్టి యైక్యము నొందుటే అన్నింటికిని పరమావధి. పాపము వ్యక్తివాదికి తనవాదమును స్వక్రమసిద్ధాంతపర్యంతము అనుసరించు ధైర్యములేదు. మానవప్రకృతి కంతటికిని ఏది గమ్యమో ఆ మోక్షమును స్వార్థరహిత కర్మమూలమున బొందుటయే కర్మయోగము. స్వార్థమగు ప్రతి పనియు గమ్యమును జేరనీక మనల నాటంకపఱచును, నిస్స్వార్థమైన ప్రతికార్యమును మనలను గమ్యమువైపునకు గొనిపోవును. కావుననే ఈ యేకైక రీతిలో నీతిని నిర్వచింపవచ్చు :—"ఏది స్వార్థపరమో అదియే అవినీతి; స్వార్థరహితమగునదేదియో అదియే నీతి."

కాని వివరములను గమనించుచో విషయ మంత సరళముగా గాన్పింపదు. ఉదాహరణమునకు, పరిసరముల ననుసరించి వివరములు మాఱుచుండునని నే నిదివఱకే చెప్పియున్నాను. ఒక్క కార్యమే ఒకరీతిపరిస్థితులలో స్వార్థరహితముగను, వేఱొక

రీతిపరిస్థితులలో పూర్తిగా స్వార్థపరముగను నుండవచ్చును. కావున సర్వసాధారణ నిర్వచనమును మాత్రమే తెలుపుచు వివరములను విభిన్న దేశకాలపరిస్థితుల కనుగుణముగ నిర్ణయించుకొన వదలివేయుట మనకు సాధ్యమైనది. ఒకదేశములో నొక విధమైన ప్రవర్తన ధర్మచోదితముగా పరిగణింపబడుచుండ నదియే మఱియొకదేశమున అధర్మయుక్తమని పరిగణింపబడుచున్నది; ఏలన రెండింటను పరిస్థితులు భిన్నములుగా నున్నవి. బంధవిమోచనమే సమస్త ప్రకృతికిని పరమావధి; పూర్ణమగు స్వార్థరాహిత్యమే తత్ప్రాప్తి కుపాయము. స్వార్థరహితమగు ప్రతిభావమును ప్రతిశబ్దమును ప్రతికార్యమును మనలను గమ్యమువైపునకు గొనిపోవుటచే ధార్మిక మనబడుచున్నది. ఈ నిర్వచనమే సమస్త మతములందును నీతివ్యవస్థలందును చెల్లుచుండును. కొన్ని మతములలో ధర్మమునకు ప్రభవము పరుడగు భగవంతుడే. ఎవ్వడేని యొక కర్మమును జేయవలయుననుటకుగాని, చేయరాదనుటకుగాని హేతు వేమని మీరు వారి నడిగినయెడల "అది భగవదాజ్ఞ" అని వారు సమాధానము చెప్పుదురు. కాని వారి ధార్మిక నియమములకు మూల మేమైనను, వారి ధర్మశాస్త్రముల ముఖ్యోద్దేశమేమో స్వార్థచింతను విడువవలయు ననుటయే. ధర్మమునుగూర్చి యిట్టి యుత్తమాశయము గలిగినవారయ్యు తమ యల్పవ్యక్తిత్వమును విడువవలయుననినంతనే కొందఱు భయపడుచుందురు. పూర్తిగా స్వార్థరహితుడు — స్వార్థచింతనే విడనాడినవాడు—స్వార్థమై యెట్టికార్యమును జేయనివాడు—ఎట్టిమాటయు నాడనివాడు — ఇట్టివాని స్థితినిగూర్చి పర్యాలోచించి, వానిలో "తాను" అనునది యెచ్చట నున్నదో చెప్పుమని వ్యక్తిత్వమును బట్టుకొని ప్రాకులాడువానిని మనము అడుగవచ్చును. స్వార్థమై తా నెంతవఱ కాలోచించునో, సంభాషించునో, ప్రవర్తించునో అంతవఱకే ఆ "తాను" అనునది వానియెఱుకలో నుండును. పరులతలంపే, ప్రపంచమునుగూర్చినతలంపే, ఎల్లరంగూర్చిన

తలంపే, గల వానియొద్ద ''తాను'' అనునది ఎక్కడున్నది? శాశ్వతముగా అంతరించినది.

కావున స్వార్థరహిత సత్కర్మాచరణ మూలమున మోక్షమును బొందుట కేర్పడిన నైతిక మత వ్యవస్థయే కర్మయోగము. కర్మయోగియగువా డేసిద్ధాంతమును విశ్వసింప నక్కఱలేదు. భగవంతుని యస్తిత్వమునుగూడ నాతడు నమ్మనక్కఱలేదు. ఆత్మ యెట్టిదని కాని, పరతత్త్వ మెట్టిదని కాని విచారింప నక్కఱలేదు. స్వార్థరాహిత్యమును సాధించుటయే ఆతని ముఖ్యాశయము; ఆతడు దానిని స్వయముగా సాధించుకోవలయును. ఆతని జీవిత మందలి ప్రతిక్షణమును 'అనుభూతి'గా నేయుండవలయును. ఏలన, దేనిని జ్ఞాని తన వివేకము చేతను దివ్యజ్ఞానము చేతను, భక్తుడు తన ప్రేమ చేతను సాధింపజూచునో దానినే ఎట్టివాదములను సిద్ధాంతములను అపేక్షింపక కర్మయోగి తన కర్మాచరణము చేతనే సాధించుకోవలసియున్నది.

ఇక తరువాతి ప్రశ్న:—ఈ కర్మ మెట్టిది? లోకహితాచరణ మెట్టిది? లోకమునకు హితము మన మొనర్పగలమా? వ్యావహారికముగా జూచినచో ''ఒనర్పగలము'', పారమార్థికముగా జూచినచో ఒనర్పజాలము. శాశ్వతమగు నెట్టిహితమును లోకమునకు మనము సమకూర్పజాలము; సమకూర్పగల్గినచో లోక మీ విధముగా నుండదు. ఐదు నిమిషములు ఒకని యాకలి మనము బాపవచ్చును; కాని వానికి మరల ఆకలియగుచున్నది. మన మొరుల కొనగూర్పగలిగిన యే సౌఖ్యమైనను క్షణికమే, అనుట స్పష్టమే. మాటిమాటికి ఆవృత్తమగు ఈ సుఖదుఃఖ జ్వరమును మరల రానీయక మాన్పగలవాడు లేడు. లోకమునకు శాశ్వతానందమును దేనినిగాని గల్గింపగలమా? సముద్రమున ఒకచోట పల్లము గావింపక వేఱొకచోట కెరటమును లేపుట శక్యము కాదు. మానవుని యాశలను అక్కఱలను బట్టిచూచిన వలయు

సద్వస్తునిచయము లోకమున నెల్లప్పుడును ఒకంతగనే యున్నది. దానిని మనము వృద్ధిచేయ జాలము, తగ్గింపను జాలము. ఇంత వఱకు తెలిసిన మానవచరిత్రను గైకొని చూడుడు. ఒక్కరీతి సుఖములే, ఒక్కరీతి దుఃఖములే, స్థితిగతులలో ఒక్కరీతితార తమ్యములే గాన్పించుటలేదా? కొందఱు ధనవంతులుగను, కొందఱు దరిద్రులుగను, కొంద అధికులుగను, కొంద అల్పులు గను, కొందఱు ఆరోగ్యవంతులుగను కొంద అనారోగ్యవంతులు గను లేరా? ఈ పరిస్థితులన్నియు నేటి యమెరికాదేశస్థులపట్ల నెట్లున్నవో ప్రాచీనకాలమున ఈజిప్టు, గ్రీసు, రోము దేశస్థుల పట్లను సరిగా నట్లే యుండినవి. మానవచరిత్ర మన మెఱిగినంత వఱకు ఇవియన్నియు నెల్లప్పుడు నొక్కవిధముగానే యున్నవి; ఐనను అనివార్యములైన యీ సుఖదుఃఖముల వెంబడి పరుగిడు చునే వీనిని మాన్ప పోరాటము సదా సాగుచుండుటయు స్పష్టమే. లోకుల జీవయాత్రను సుగమ మొనర్చుటకై యఖండకృషిసల్పిన వేలకొలది స్త్రీపురుషులు చరిత్రలో ప్రతియుగమందును ప్రభవించి యున్నారు. కాని, వారియత్నము లెంతవఱకు ఫలించినవి? ఆట బంతి నొకచోటినుండి మఱియొకచోటికి ద్రోయుటయే మనము చేయగలిగిన పని. ఇది డాంటె కవి తన కావ్యమున వర్ణించిన నరకములోని లోభులవిషయమును తలపునకు దెచ్చుచున్నది. బంగారుబంతిని ఆ లోభులు కొండమీదికి దొరలింప నాజ్ఞాపితు లైరి. కొంచెము దొర్లించినంతనే ప్రతిపర్యాయమును అది మరల క్రిందికి వచ్చుచుండెడిది. భగవద్రాజ్యమునుగూర్చిన మన ప్రసం గములు బడిపిల్లల కథలవలె మనోహరములేకాని ఆకథలకంటె అవి మిన్నగలేవు. భగవద్రాజ్యము రానున్నట్లు కలగను ప్రతి దేశీయులకును, ఆరాజ్యమువచ్చినపుడు అందు శ్రేష్ఠభాగము ప్రపంచ ప్రజలలోనికెల్ల తమకే దక్కనను నమ్మకమును గలదు. ఇది భగవద్రాజ్యమును గూర్చిన నిస్స్వార్థాద్భుతమైన ఆశయము!

ఈ లోకమునకు మనము సుఖమును పెంపొందింపజాలము, అట్లే దుఃఖమునుకూడ వృద్ధిచేయజాలము. భువిపై ప్రదర్శితము లగు సుఖదుఃఖ శక్తుల మొత్తము సదా ఒకంతే. ఆ తట్టుననుండి యీ తట్టునకును ఈ తట్టుననుండి యాతట్టునకును దానిని మనము త్రోయుదుము. అంతేకాని అదేమో అట్లే ఉండును. ఏలన అట్లుండుట దాని స్వరూపము. ఇంతలో పోటును, అంతలో పాటును, ఇపు డువ్వెత్తుగ మీఁది కెగురుటయు, అపుడు బళ్లున క్రిందపడు టయు—లోకస్వభావమందే కలదు. అవి అట్లుండవనుకొనుట 'పుట్టినవారికి చావు ఉండదనుకొనుటవంటి యుక్తియుక్తమే! అది వట్టి పిచ్చిమాట. ఏలన జీవితము అను ఆశయములోనే 'మరణము' ఇమిడియున్నది. సుఖము అను ఆశయములోనే 'దుఃఖ' మిమిడియున్నది. దీపము సదా తగులబడిపోవుచుండును. అదియే దాని జీవనస్వభావము. నీకు జీవనము కావలసియున్నచో అను క్షణమును అందులకై మరణింపవలయును. ఒక్కతత్త్వమునే భిన్న దృక్పథములతో చూచినప్పుడు అది వ్యక్తమగు భిన్నరీతులే 'జీవనము'ను 'మరణము'ను. ఒక్క అలకుగలుగు పోటుపాటులే అవి. ఆ రెండిటి కలయికయే సమగ్రస్వరూపము. ఒకడు 'పాటు' వైపు మాత్రమే చూచి నిరాశావాదియగును. మఱొకడు పోటువైపు మాత్రము చూచి ఆశావాదియగును. తల్లిదండ్రుల ఆవేక్షణలో ఉండి బడికిపోవుచుండు బాలునికి ప్రతిదియు మహానందకరముగనే కనిపించును. అతని అక్కఱలు సరళములు. అతడు గొప్ప ఆశావాది. వివిధానుభవములుగాంచిన వృద్ధునిలో ప్రశాంతి హెచ్చియుండును. అతనిలోని ఉడుకు చాలవఱకు తప్పక చల్లబడియుండును. కావున వినాశలక్షణములు తమచుట్టునుండ, పురాతన దేశాలవారిలో ఆశ, క్రొత్తదేశాలవారియందున్నంతకంటె తక్కువగానుండుట విధాయకము. భారతదేశములో ఒక సామెతకలదు: 'వేయేండ్లు పట్టణము' 'వేయేండ్లు అరణ్యము'. అడవి పట్టణముగను, పట్టణము అడవిగను మాఱు మార్పు సర్వత్ర సాగిపోవు

చున్నది. ప్రజలను వారివారి దృక్పథములనుబట్టి ఆశావాదులుగనో నిరాశావాదులుగనో చేయునదదే.

ఇక సమత్వభావమునుగూర్చి విచారింతము. ఈ 'భగవద్రాజ్యాశయములు' ('మిలెనియము' నకు సంబంధించు భావములు) జనులను కార్యాచరణమునకు పురికొల్పెడి ప్రబలశక్తులు. భగవానుడీలోకమును పరిపాలింప వచ్చుచున్నాడనియు అపుడు పరిస్థితులలో నెట్టిభేదములు నుండవనియు ననుట పెక్కుమతముల బోధనలలో ప్రధానముగానున్నది. ఈ సిద్ధాంతమును బోధించువారు కేవల స్వమతదురభిమానపూరితులు. కాని నిజముగ మానవకోటిలో వీ రెప్పుడును అత్యంత నిష్కపటచిత్తులు. దురభిమానము మీాది యీామోజు నూతగాగొనియే క్రైస్తవమతము బోధింపబడినది; గ్రీసురోము దేశములందలి బానిసలకు క్రైస్తవ మతము నంత ఆకర్షకముగ జేసిన దదే. భగవద్రాజ్యమును దెల్పు మతము నవలంబించినచో నాటితో తమ బానిసతనము నిర్మూలమగుననియు, తినుట కేమి, త్రాగుట కేమి, వలసినంత లభించుననియు నమ్మి యీా బానిసలు క్రైస్తవపతాకచుట్టును మూాగిరి. మొట్టమొదట ఈయాశయమును బోధించినవారు అజ్ఞులు దురభిమానులేకాని నిజముగా వారు చాల నిష్కపటచిత్తులు. ఈ 'మిలెనియము' (భగవద్రాజ్య) సంబంధపుటాశ నేడు సమత్వ రూపమును స్వాతంత్ర్య సమత్వ సౌభ్రాత్రరూపమును దాల్చినది. ఇదియు దురభిమానమే. నిజమైన సమత్వము ప్రపంచమున నిదివఱకెన్నడును ఉండినది లేదు, ఉండుట ఎప్పుడును అసాధ్యమే. ఇచట మనమందఱము సమానులమై ఎట్లుండగలము? అసాధ్యమగు నిట్టిసమత్వమనగా సంఘమరణమే. లోక మిప్పుడున్నట్లు దీనిని ఉంచజేయునదేది? సమత్వము లేకుండుటయే. సృష్టికి పూర్వముదగు ప్రళయమనుదశలో సంపూర్ణమైన సమత్వ ముండును. అపుడు విశ్వసృజనశక్తులన్నియు నెట్లు గల్గును? పెనువ

చేతగల్గును, పోటీచేతగల్గును, పోరాటముచేతగల్గును. స్థూలద్రవ్యమందలి యణువులన్నియు సర్వసమత్వము పొందియున్న వనుకొనుడు. అపుడెట్టిసృష్టిక్రమమైన నుండునా! ఉండుట అసాధ్యమని శాస్త్రమునుండి మనకు దెలియును. నిశ్చలమైయున్న నీటిని కలంపుడు; అందలిప్రత్యణువును ఒకదానికెదురుగ నొకటి ఉరవడించుచు మరల నిశ్చలత్వము నొందుటకు ప్రయత్నించుట కననగును, విశ్వమనబడు నీదృశ్యమంతయు — అందలి వస్తువులన్నియు—అదేవిధమున మరల సంపూర్ణసామ్యస్థితి నొందుటకే కొట్టుకొనుచున్నవి, మరల నొక కదలికగల్గును. మరల సంయోగమును సృష్టియు నేర్పడుచున్నవి. అసమత్వమే సృష్టికి పరమమూలము. ఐనను సమత్వమును మాపు శక్తులు సృష్టి కెంతయావశ్యకములో సమత్వమును బొంద యత్నించు శక్తులును అంత యావశ్యకములే.

కేవలసమత్వము, అనగా అన్నిరంగములలోను ఒండొంటితో పోరు అన్నిశక్తుల పరిపూర్ణసామ్యస్థితి, జగత్తున నెన్నడును సాధ్యముకాదు. ఆస్థితిని మీరందుకొనునప్పటికి, ఈప్రపంచము ఏప్రాణి వసించుటకును కేవల మనర్హమైయుండును. అపుడే ప్రాణియు నుండనేరదు. కావున 'భగవద్రాజ్యము' (మిలెనియము) అనెడి యీ ఆశయము లన్నియు అసాధ్యము లగు టట్లుండ, వానిని సాధింప మనము యత్నించినచో, అవి తప్పక మనలను విలయమొందించును. మానవునకును మానవునకును గలభేద మెందున్నది? అది విశేషముగా ధీశక్తిలో నున్నది. మన మందఱము సమాన ధీశక్తితో బుట్టినామని మతిహీనుడు దక్క నేను మఱెవ్వరును జెప్పడు. మనమందఱము సమానములుకాని శక్తులతో ఈ లోకములోనికి వచ్చుచున్నాము; అధికులముగనో జఘన్యులముగనో జన్మించుచున్నాము. జననపూర్వమే నిర్ణీతమయిన స్థితినుండి తప్పించుకొనుట పొసగదు. అమెరికను ఇన్డియనులు ఈ దేశమున

(అమెరికాలో) వేలకొలది వత్సరములుగా నున్నారు; మీపూర్వులే యల్పసంఖ్యాకులో వారి దేశములోనికి వచ్చినారు, వచ్చి దేశస్థితిలో వారెంతటి మార్పుగలిగించిరో చూడుడు; అందఱును సములైనయెడల అమెరికా ఇన్డియనులు పట్టణములను నిర్మింపక పోవుటేల? బహువిధముల దేశము నెందుల కభివృద్ధిచేయలేదు? మీ పూర్వులతో వేఱువిధమైన ధీశక్తి ఈ దేశమునకు వచ్చినది. వేఱువిధములైన చిత్తసంస్కారములు తండములుగ వచ్చినవి. అవి పనివడి తమ్ము ఆవిష్కరించుకొన్నవి. మరణమే పరిపూర్ణ సమత్వము. ప్రపంచమున్నంతవఱకు భేదములుండును, ఉండితీఱవలయును. పరిపూర్ణసమత్వముగల 'భగవద్రాజ్యము' (మిలెనియము) కల్పాంతమప్పుడే వచ్చును. అంతకుముందు సిద్ధింపజాలదు. ఐనను భగవద్రాజ్యమును ('మిలెనియము'ను) — నెలకొల్పవలయునను ఆశయము మహాప్రేరణశక్తి. సృష్టికి అసమత్వమెట్లావశ్యకమో అసమత్వమును పరిమిత మొనర్పవలయునను యత్నమును అట్లే ఆవశ్యకమైయున్నది. ముక్తులమై మరల భగవంతుని బ్రాపించుటకై ఈ పోరాటము లేకున్నచో సృష్టియు నుండదు. ఈ శక్తులకు రెంటికిని గల భేదమే మానవులయుద్దేశముల స్వరూపమును నిర్ణయించునది. కర్మాచరణమున కీ యుద్దేశ్యములు సదా ఉండును. వీనిలో కొన్ని బంధమునొందించును, గొన్ని మోక్షమును నొందించును.

చక్రములోపల చక్రముగనున్న యీ జగద్యంత్రము భయంకరమైనది. అందులో చేయిపెట్టి దొరుకుకొంటిమేని మనము వినష్టులమై పోయినవారమే. ఒకానొక కర్తవ్యమును పూర్తి చేసితిమేని ఇక మనకు విశ్రాంతియే అని మనమందఱు మనుకొనుచుందుము. కాని ఆపనిలో ఒక లేశము పూర్తియగుటకుముందె, మఱొకపని కాచుకొనియుండును. చిక్కైన యీజగన్మహాయంత్రము మనల నీడ్చుకొనిపోవుచున్నది. ఇందుండి వెలువడుటకు రెండే

మార్గములు కలవు. మనకోర్కెలన్నియు విడిచి, తటస్థులమై జగద్యంత్రముతోడి జోలిని పూర్తిగావదులుకొని దాని దారిని దాని నేగనిచ్చుట ఒకదారి. ఇది చెప్పుటకు చాల సులభమేకాని చేయుటకు ఇంచుమించు అసాధ్యమే. చేయగలవాడు కోటి కొక్కడైన నుండునో నే నెఱుగను. సంసారములోనికి ఉఱికి కర్మరహస్యమును గ్రహించుట రెండవ మార్గము, ఇదియే కర్మయోగమార్గము. జగద్యంత్రచక్రములనుండి తొలిగిపోవకుడు, అందే మెలగుచు కర్మరహస్యము నెఱుగుడు. సంసారమున నుండియే సరియగు కర్మమాచరించినచో అందుండి తరింపవచ్చును. ఆ యంత్రముగుండనే పోవును వెలికేగుదారియు.

మన మిపుడు కర్మ మన నెట్టిదో గుర్తించితిమి. ప్రకృతి కాధారములలో నొకభాగమగు నీకర్మము సదా సాగుచునే యుండును. భగవద్విశ్వాసము గలవారి కిది ఎక్కువగా బోధపడును. ఏలన, భగవంతుడు మనసాయమునకై దేవులాడుచుండుట లేదని, భగవంతు డంతటి యసమర్థుడు గాడు అని వారెఱుగుదురు. ప్రపంచము సదా సాగుచునేయుండును. కాని మన పరమావధి మోక్షమే, నిరహంకారతానిర్మమతలే. కర్మయోగము ననుసరించి కర్మమే మోక్షసాధనము. ప్రపంచమును సుఖమయముగా జేయవలయునను నాశయములన్నియు స్వమతదురభిమానులను కర్మాచరణమునకు పురికొల్పునవగునంతవఱకు మంచివే కావచ్చు కాని స్వమతదురభిమానమువలన నెంతటి మేలు కలుగునో అంతటి కీడును కలుగునని మనము ఎఱుగవలయును. సహజమగు ముముక్షుత్వముకంటె కర్మాచరణమునకు వేఱొక ఆశయ మేల యని కర్మయోగి ప్రశ్నించును. సామాన్యలౌకికోద్దేశముల కతీతులరై యుండుడు. "కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన" * — కర్మమొనర్చుటకే కాని ఫలవిష

---

* భగవద్గీత, 2-47.

యమై నీకెన్నడును అధికారములేదు. ఈ తత్త్వమును గ్రహింపుటకును అనుభవించుటకును మానవుడు తన్ను తాను తర్ఫీదు చేసికోవలెనని కర్మయోగి వక్కాణించును. సత్కర్మ మొనర్ప వలయునను భావము స్వాభావికమైనంతనే కర్మయోగికి వెలుపలి నుండి యిక నెట్టి ప్రేరకములును అక్కఱలేదు. మంచిచేయుట మంచిది కావుననే మంచిచేయుదముకాక, స్వర్గాభిలాషతో సత్కర్మమొనర్చువాడు సహితము బద్ధుడగునని కర్మయోగి వచించును. స్వార్థచింత యణుమాత్రమున్నను అట్టి కర్మము మనలను ముక్తుల నొనర్చుటకు బదులు మఱింత బద్ధులను జేయును.

కావున సర్వకర్మఫలత్యాగ మొనర్చుటయే, ఫలములయెడ ననాసక్తులమై యుండుటయే, మనకు ఏకైకతరణోపాయము. 'ఈ జగత్తు మనము కాదు, మనము ఈ జగత్తు కాము, నిజమునకు మనము దేహములము కాము, నిజముగా మనము కర్మ మొనర్చుటలేదని ఎఱుగుడు. నిత్యనిశ్చలము, నిత్యప్రశాంతము నగు ఆత్మయే మనము. దేనిచే గానిండు, మన మేల బద్ధులము కావలయును? పరిపూర్ణముగా మనము అనాసక్తులమై యుండ వలయునని చెప్పుట చాల మంచిదే, కాని ఉండుట కుపాయ మేమి? ఫలాపేక్షారహితముగా జేయు ప్రతి సత్కర్మమును క్రొత్త బంధమును కల్పింపకుండుటేకాక ఉన్న సంకెళ్లలో ఒక కొలికిని త్రెంపును. ఫలాపేక్షను విడనాడి మనములోకమున వ్యాపింప చేయు ప్రతి సద్భావమును లోకమున నిలిచి, కర్మబంధమును సడలించి, మనము మానవులందెల్ల పవిత్రతములమగువఱకును మనల నింక నింకను పవిత్రులనుగ జేయుచు బోవును. ఐన నిది యంతయు విపరీతముగను, అనుష్ఠానమున కశక్యమగు మహా వేదాంతముగను దోపవచ్చును. భగవద్గీతనుగూర్చి నే ననేక పూర్వపక్షములను జదివియున్నాను. ప్రయోజనము నుద్దేశింపక మనము కర్మ మొనర్పజాలమని యనేకులు వక్కాణించియున్నారు.

స్వమతదురభిమానప్రేరణమూలముననేగాని మఱియొకవిధమున స్వార్థరహితకర్మ మొనర్పబడుట వారెన్నడును కన లేదు కాబోలును! అందుచేతనే వారట్లు పల్కుదురు.

కర్మయోగబోధనలను నిజముగ ననుష్ఠించిన యొక మహనీయునిగూర్చి కొన్నిమాటలను జెప్పి విరమింతును. అతడే బుద్ధుడు. కర్మయోగమును పూర్తిగా ఆచరణమున జూపిన మహనీయు డాత డొక్కడే. ప్రపంచమున బుద్ధుడుదక్క మిగిలిన ప్రవక్తలందఱికిని తమ్ము స్వార్థరహిత కర్మాచరణమునకు పురి కొల్పు బాహ్యాశయము లుండినవి. బుద్ధుని విడిచి మిగిలిన ప్రవక్తల నందఱను రెండువర్గములవారినిగ విభజింపవచ్చును. ఒకవర్గము వారు తాము భువికి దిగివచ్చిన భగవదవతారమూర్తులమని పలుక, రెండవతరగతివారు తాము కేవలము భగవద్దూతలమని చెప్పియున్నారు; ఎంతటి ఉన్నత పారమార్థికభాషలో మాటాడి నను ఉభయపక్షములవారును కర్మాచరణమునకు బాహ్యము నుండియే ప్రేరణమును బొందిరి, బాహ్యలోకమునుండి ఫలముల నాశించిరి. కాని బుద్ధుడొక్కడే యిట్లు వక్కాణించిన మహా ప్రవక్త: "దేవునిగూర్చి పలువిధములగు మీ సిద్ధాంతములతో నాకు పనిలేదు. ఆత్మనుగూర్చి సిద్ధాంతరాద్ధాంతముల చర్చల వలన నేమి ప్రయోజనము? సత్కర్మ మొనర్చుచు సజ్జనులై యుండుడు. మోక్షమునుగాని మఱి యేయితర తత్త్వమునుగాని ఇదియే మిమ్ము పొందించును." బ్రదుకు నడవడిలో బుద్ధునికి స్వలాభోద్దేశము లేనే లేదు. అతనికంటె హెచ్చుగ శ్రమించిన వాడేడి? అందఱికంటె అంతటి పరమోచ్ఛ్రితినందుకొన్న మఱొక మహనీయుని మానవకోటి చరిత్రలో జూపుడు. మానవజాతి అంతయు అట్టి మహోన్నత తత్త్వజ్ఞానమును, సమస్త జీవుల తనయందిముడ్చుకొనిన యట్టి యఖండసానుభూతిని జూపిన యట్టి శీలవంతు నొక్కనినే కన్నది.

మహోన్నతతత్త్వమును బోధించిన యీ తత్త్వజ్ఞశిఖామణికి పరమనికృష్టజంతువులందుగూడ గాఢ సానుభూతియుండెను. ఐనను తన్నుగూర్చి యాతడెట్టి గొప్పలను జెప్పుకొనలేదు. అతడాదర్శ కర్మయోగి, కేవలము నిస్స్వార్థముగ కర్మ నాచరించినవాడు, అంతటి మహోన్నత మానవుడు మఱొకడు జన్మించియుండలేదని మానవచరిత్ర చూపుచున్నది. కరుణాప్రతిభల అట్టి సాటిలేని మహిష్ఠమేళనము, రూపుదాల్చిన అట్టి మహిష్ఠాత్మశక్తి, మఱి లేదు. ప్రపంచమందలి మహాసంస్కర్తలలో ఆతడే ప్రప్రథముడు. మఱియు ధైర్యముగ నిట్లు వక్కాణించినవారిలో ఆతడే ప్రథముడు: ''ప్రాత వ్రాతపతులను చూపినంతనే నమ్మకు, దేశీయులందఱును నమ్మినంతనే నమ్మకు, శైశవమునుండియే నిన్ను నమ్మించినారని నమ్మకు. కాని తర్కించి చూడుము. విభజించి చూచిన పిమ్మట అది విశ్వశ్రేయస్కరమని నీకు తోచినచో దానిని నమ్ముము. అదే లక్ష్యముగా బ్రదుకు, అదే లక్ష్యముగా బ్రదుక నితరులకు తోడ్పడుము.'' ధనమునుగాని, యశమునుగాని, మఱి దేనినిగాని వాంఛింపక, నిర్వ్యాజకర్మపరాయణుడగు నాతడే వరిష్ఠ కర్మయోగి. మానవుడట్లు ఆచరింపగల్గిన అతడు బుద్ధడగును. ప్రపంచపరివర్తన మొందించు శక్తి యాతనినుండి వెల్వడును. కర్మయోగమున కతడే మహోన్నతాదర్శము.

# విషయసూచిక

## ఆత్మతత్త్వపరిశోధనకు మూలము

వివేకానందస్వామి పాశ్చాత్యదేశములలో నున్నప్పుడు చర్చలలో తఱచు పాల్గొనువాడు కాదు. లండనునగరములో, "ఆత్మానుభవమును వైజ్ఞానికాధారములతో నిరూపించుటకు వీలగునా?" అను విషయమునుగుఱించిన ఉపన్యాసముపై చర్చ జరిగెను. చర్చలో స్వామి పాల్గొన్న సందర్భ మదొకటి. చర్చలో తాను విన్న ఒకమాటను ప్రస్తావించుచు ఆయన ఇట్లనెను. ఆమాట పాశ్చాత్యదేశాలలో ఆయన వినుట కిది మొదటిసారి కాదు.

నేనొక్క విషయమై చెప్ప దలచితిని. స్త్రీలకు ఆత్మలు కలవను విషయమున మహమ్మదీయులకు నమ్మకము లేదన్న యభిప్రాయము పొరపాటు, ఇది క్రైస్తవులలో చిరకాలమునాటిఅపోహ అని చెప్పవలసివచ్చినందుకు మిక్కిలి విచారించుచున్నాను. ఈ యపోహ వారికి చాల ఇష్టముగా నున్నట్లు కనబడుచున్నది. తమ కిష్టములేనివారినిగుఱించి చాల దుష్ప్రచారము చేయగోరుట మానవప్రకృతిలోని వైచిత్ర్యము. నేను మహమ్మదీయుడను కానని మీకు తెలియును కదా. అయినను నేనీ మతమును గుఱించి పరిశీలించుట కవకాశములు కలిగినవి. స్త్రీలకు ఆత్మలు లేవని తెలియజేయు మాట ఒక్కటికూడ ఖొరానులో లేదు. అంతే కాక స్త్రీలకు ఆత్మలు కల వనియే చెప్పబడినది.

ఇక్కడ సాగుచుండిన ఆత్మవిషయికచర్చలో నేను చెప్ప వలసినది ఏమియు లేదు. ఆత్మనుగుఱించిన విషయములు వైజ్ఞానికముగా నిరూపించుటకు వీలున్నదా అనుట మొదటి విషయము. అసలు నిరూపించుట యనగా నేమని మీ యభిప్రాయము? మొదట జ్ఞాతపరము, జ్ఞేయపరము అని యిరుపక్షము లుండుట అవసరము. రసాయనికశాస్త్రమును పదార్థ విజ్ఞానశాస్త్రమును

గొనుడు. అవి మనకు చాల పరిచితములు, వానినిగూర్చి మన మెంతో చదివియున్నాము. సర్వసామాన్య విషయమునుగుఱించిన నిరూపణమైనను సరే లోకములోని ప్రతివ్యక్తియు నిజముగ అర్థముచేసికొనగలడా? అడవిమనుష్యున కొకనికి మీ ప్రయోగములలో నొకదానిని చూపుడు. అందత డేమి అర్థముచేసికొగలడు? ఏమియు అర్థముచేసికోలేడు. ప్రయోగము నర్థముచేసికొను స్థాయికి వచ్చుటకు చాల పూర్వశిక్షణ మవసరము. శిక్షణకుపూర్వ మత డేమియు గ్రహింపజాలడు. దారిలోని పెద్ద అడ్డంకి అది. వైజ్ఞానికనిరూపణ యనగా కొన్ని వాస్తవసంఘటనలను సర్వజనుల కర్థముకాగలట్లు విశ్వజనీనస్థాయికి దించుటయా? అయినచో లోకములో నేవిషయమునుగుఱించియు అట్టి నిరూపణ సాధ్యము కాదందును. సాధ్యమే యగునేని మనవిశ్వవిద్యాలయములు, మనచదువులు అన్నియు వ్యర్థములే. జన్మచేతనే మనము ప్రతివైజ్ఞానికవిషయము నర్థముచేసికొనగలుగుదుమేని మనము విద్యాభ్యాసము చేయు టెందుకు? ఇంతింతచదువు లెందుకు? ఈ చదువుల కుపయోగము లేనే లేదు. కనుక చిక్కువిషయములను మన ప్రకృతస్థాయికి గొనివచ్చుటే 'వైజ్ఞానికనిరూపణ'యను మాట కర్థ మగుచో అది బొత్తిగా అసంగతము అనుట స్పష్టము. కొన్ని విషయములను మఱికొన్నిగడ్డువిషయములను నిరూపించుటకు ఉదాహరించుటయు వైజ్ఞానికనిరూపణ యను మాట కర్థము కావచ్చు. ఈయర్థమే సరియైన దేమో! జటిలము లయిన కొన్ని సంఘటనలను అంతకంటె తక్కువ జటిలములయిన సంఘటనల సాయముతో వివరింతుము. ఆవిధముగా మనము వానికి చేరువగుదుము; వానిని క్రమక్రమముగా ప్రకృతపు మన సాధారణ జ్ఞానస్థాయికి గొనివత్తుము. ఈపనికూడ చాల క్లిష్టమైనది, చాల కష్టమైనది. ఇందులో శిక్షణయు, ఎంతో చదువును ఉన్నవి. నేను చెప్పదలచుకొన్న దంతయు నిది: ఆత్మవిషయములను గుఱించిన వైజ్ఞానికరీతిని వివరించుటకు జ్ఞేయపక్షమున సంపూర్ణ

ప్రమాణములు కావలెః దానితోపాటు తెలిసికొనగోరువారికి విశేషశిక్షణయు అవసరము. ఆప్రమాణములును ఈశిక్షణయు ఉన్నచో మనముందున్న విషయనిరూపణమును గాని ఖండనమును గాని ఔననియో కాదనియో చెప్పగల్గియుందుము. అంతవఱకు మానవసంఘములో జరిగిన అత్యంత గమనార్హ విషయము నయినను, పలుమాఱు గ్రంథస్థముచేయబడిన విషయము నయినను ఆశువుగా నేని నిరూపించుట మిక్కిలి దుస్సాధ్య మనియే నా యభిప్రాయము.

మతములు స్వప్నప్రభవములు అనియు వానిని ప్రత్యేకించి శోధించినవారు అవి కేవలము ఊహ లని భావింతు రనియు కొందఱు అవిచారితముగ వివరించిరే—అందును గూర్చి:—మతములు స్వప్నప్రభవము లని సులువుగా చెప్పివేయబడినది. అట్లను కొనుటకు కారణము లేదు. ఉన్నచో అజ్ఞేయవాది దృక్పథ మవలంబించుటయు బహుసులభమయ్యెడిది. కాని, దురదృష్టవశమున ఈవిషయ మంత సులువుగా నిర్ణయించుటకు వీ లయినది కాదు. ఈకాలమున సైతము అద్భుతసంభవములు ఇతరములు అనేకములు జరుగుచున్నవి. ఈయన్నిటిని పరిశీలింపవలె. పరిశీలింపవలసిన యావశ్యకతయుండుటే కాదు; ఇంతకాలముగాను పరిశీలింపబడుచునే యున్నవి. గ్రుడ్డివాడు 'సూర్యుడు' లే డనును. అంతమాత్రముచేత సూర్యుడు లే డని ఋజువు కాదు. ఇట్టి విషయములు పెక్కు సంవత్సరములకు పూర్వమే పరిశీలింపబడినవి. నరములు పనిచేయు సూక్ష్మరీతులను కనుగొనుటకుతగిన ఉపకరణములుగ అగుటకై మానవజాతులు శతాబ్దములతరబడిగ తమ్ముతర్ఫీదుచేసికొన్నారు; వారి ఆపరిశీలనాఫలితములు యుగములకు పూర్వమే ప్రకటితములైనవి. ఈవిషయముల పరిశోధనకై కళాశాలలు నెలకొల్పబడినవి. ఇందులకు సజీవనిదర్శనములైన స్త్రీ పురుషులు ఇప్పటికిని కలరు. ఇందంతటను పరిహాసప్రసంగ మెంతో ఉన్నది, తప్పు ఎంతో ఉన్నది, అసత్య మెంతో

ఉన్నది. ఇట్టివి ఎందులో లేవు? సామాన్యవైజ్ఞానికవిషయ మేదేని తీసికొనుడు. వైజ్ఞానికులు గాని, సామాన్యమానవులుగాని ఏవో రెండు మూడు విషయములను పరమసత్యములుగాను మిగిలిన యన్నిటిని వట్టి ఊహామాత్రములుగాను పరిగణింతురు. అజ్ఞేయ వాది తాను నమ్ముట కిష్టము లేని విషయముల నెట్టిపరీక్షలకు గురిసేయునో తన విజ్ఞానశాస్త్రమునుగూడ ఆ పరీక్షలకే గురి సేయు గాక. తత్క్షణమే దానిలో సగభాగము పునాదులతో చలించిపోవును. మనము ఊహలపై ఆధారపడి జీవింపక తప్పదు. మనము ఉన్న స్థితితో సంతృప్తిపడి యుండలేము; మానవాత్మకు స్వాభావికమైన వికాస మది. మనము ఇటువైపు అజ్ఞేయవాదుల మగుచునే దేనినైనను ఇక్కడ అన్వేషించుచు పోవుట పొసగదు; మనము గ్రుచ్చి ఎత్తవలయును. ఇందుచేత మనపరిమితుల నతిక్రమించి, అజ్ఞేయముగా తోచు దానిని తెలిసికొనుటకు శ్రమ పడవలె; ఈశ్రమ సాగితీఱవలసినదే.

ఆవక్తకంటె నిజముగ నేనొక అడుగు ముందుకు పోవుచున్నా నని నా తలంపు. మనస్సంబంధవిషయాలు చాలమట్టుకు యథార్థ మనస్తత్త్వ శాస్త్రవిషయికపరిశోధనకు అందిచ్చు మెట్లు. భూతావేశాల పీఠమునొద్ద పరవశతల వంటి క్షుద్రవిషయములే కావు—అవి పిల్లల ఆటలవంటివి — దూరముగనుండు వా రొండొరులకు మానసికముగ భావము లందించుకొనుటే కాదు — బాలురలో సైతము నేను దానిని చూచియున్నాను. ఇంచుమించు మన స్సంబద్ధములుగా కనిపించు విషయా లన్నియు యథార్థపరిశోధన కందించుమెట్లే. కడపటి ఉపన్యాసకుడు ఉన్నతయోగదృష్టి విషయములు అను పేర్కొన్నాడే, అవి జాగ్రదవస్థకు పైదశలోనుండు మనస్సుకు గల్గు అనుభవము లని నే నందును. మొదట గుర్తింపవలసినవిషయము మనస్సు అటువంటి స్థితి పొంద గలదా లేదా యనుట. నావివరణ, వక్తచెప్పినదానికి కొంత భిన్నముగా నుండును. పదముల యర్థమును స్పష్టము చేసినపిమ్మట మే మేకీభవింతు

మేమో. జగత్తు, ఇప్పుడున్నది ఉన్నట్టుగా, మన ఈజాగ్రదవస్థకు కట్టుపడియుండ లేదు. కావున ఇప్పుడున్న జాగ్రదవస్థ మరణానంతరముకూడ ఉండునా ఉండదా అనుదానిపై ఆధారపడు ముఖ్యవిషయ మెక్కువగా లేదు. ఎఱుక ఉనికితోపాటు పరివ్యాప్తము కాదు; నా దేహములోను, మన అందఱి దేహములలోను—దేహమును గుఱించి మన మెఱిగియున్న భాగము బహుస్వల్పము; విశేషభాగము మన యెఱుకలో లేదు అని మన మంగీకరింపవలెను. మన మెఱుగకున్నను అది యున్నది. ఉదాహరణకు ఎవరికిని తనమెదడును గుఱించిన యెఱుక ఎప్పుడును లేదు. నేను నా మెదడు నెన్నడును చూడ లేదు. దానిని గుఱించిన స్మృతి నాకు ఎప్పుడును లేదు. అయిన నది కల దని నాకు తెలియును. కనుక మనకు కావలసినది స్మృతి కాదు. మనకు కావలసినది — ఈ స్థూలభౌతికపదార్థమునకు భిన్నముగా నున్న దేదో దానియునికి. ఆజ్ఞాన మీ జీవితములోనే పొందవచ్చును. ఏవిజ్ఞానశాస్త్రముగాని ఎంతవఱకు నిరూపింపబడినదో ఆజ్ఞానముకూడ అంతవఱకు నిరూపింపబడియే యున్నది. మన మీ విషయములను పరిశీలింపవలె. మఱొక విషయముగూడ ఇక్కడి సదస్యులకు మనవిచేయదలచుకొన్నాను. పలుమాఱు మన మీ విషయమై భ్రమలో తగులొంటి మని జ్ఞప్తియందుంచుకొనుట మేలు. మన ముందు కొంద ఱొక విషయమును నిరూపింతురు. అది యాధ్యాత్మిక ప్ర సాధారణ మయినది కాదు. అది నిజ మని మనము గ్రహింపజాలనందున దానిని నిరాకరింతుము. అనేకసందర్భములలో అది నిజము కాక పోవచ్చు. కాని, అనేకసందర్భములలో మన మట్టి నిరూపణగ్రహింపగలస్థితిలో నున్నామో లేమో — అట్టి విషయమును తెలిసికొనుటకు మన దేహములు, మనస్సులు యోగ్యములె నవిగా చేసికొంటిమా, లేదా యని గమనించుట మఱచి పోవుచుందుము.

# యోగమార్గములు *

మన ప్రధానసమస్య విముక్తులమగుట. 'అహంబ్రహ్మాస్మి' 'నేను బ్రహ్మమను' అను సాక్షాత్కారము పొందువఱకును ముక్తి నొందజాల మను విషయము స్పష్టమే. ఈ సాక్షాత్కారము పొందుటకు పెక్కుమార్గములు గలవు. ఈ మార్గము లన్నిటికిని సాధారణముగ యోగము లని పేరు. (కలసిపోవుట; పరతత్త్వముతో నైక్యమొందుట). ఈ యోగము లనేకవర్గములుగా విభాగము చేయబడియున్నను ప్రధానముగా ఇవి నాలుగువిధము లని చెప్ప వచ్చు: వీనిలో ప్రతియొక్కటియు వక్రమార్గమున బ్రహ్మసాక్షాత్కారమునే గల్గించును. కనుక ఇవి విభిన్నచిత్తవృత్తుల కనుకూలములుగా నుండును. ఆభాసమానవుడు పారమార్థికనరుడుగ బ్రహ్మముగ పరిణమించుట లేదని జ్ఞప్తియుంచుకోవలయును. బ్రహ్మమునకు మార్పు లేదు. అది నిత్యముక్తము, నిత్యశుద్ధము; దానిస్వరూపమును తాత్కాలికముగా మఱుగు పఱచిన అవిద్య తొలగింపబడవలసియున్నది. సమస్తయోగవిధానముల ఉద్దేశము (ప్రతిమతము నొకయోగమే) అవిద్యను తొలగించి, స్వస్వరూపమునకు మరలు అవకాశమును ఆత్మకు గల్గించుట. ఈ ముక్తిసాధనలో మనకు ముఖ్యముగా సాయపడునవి అభ్యాసమును, వైరాగ్యమును. వైరాగ్య మనగా జీవితమందు నిస్సంగత్వము. మనకు సకలబంధములను కల్పించునది భోగేచ్ఛయే. అభ్యాస మనగా ఈ యోగములలో ఏదోఒకదానిని నిరంతరము సాధనచేయుట.

కర్మయోగము : కర్మయోగము కర్మమూలమున చిత్తశుద్ధి గాంచుట. ఏదయిన మంచిపని గాని, చెడ్డపని గాని చేసిన

* స్వామిజి మొదటిసారి అమెరికాకుపోయినప్పుడు పాశ్చాత్యశిష్యుడొకడు వేసిన ప్రశ్నలకు సమాధానముగా వ్రాసినది.

యెడల సత్ఫలితమో, దుష్ఫలితమో అది కలిగింపవలెనుకదా. కారణ మున్నంతవఱకు ఫలితమును నివారింపజాలు శక్తి ఏదియు లేదు. సత్కర్మలవలన సత్ఫలితములు, దుష్కర్మలవలన దుష్ఫలితములు కలుగుచున్నంతవఱకు ఆత్మ విముక్తి నొందు ఆసపాటు లేక శాశ్వతముగా బంధములో నుండవలసినదే. కర్మ దేహాము నకో, మనస్సుకో మాత్రమే చెందును; ఆత్మకు ఎప్పుడును చెందదు. అది ఆత్మపై నొక తెఱను కప్పి పెట్ట గలదు. అంతే. దుష్కర్మలు కల్పించు తెఱ అవిద్య. సత్కర్మకు నైతికశక్తులకు పుష్టికలిగించు ప్రభావము కలదు. కనుక అది నిస్సంగత్వమును కలిగించును; దుష్క్రియాప్రవృత్తిని నశింపజేసి, చిత్తశుద్ధిని కలిగించును. ఫలానుభవాసక్తితో పనిచేసినచో, అది భోగమునే కలుగజేయును గాని, చిత్తశుద్ధిని కలుగజేయజాలదు. కనుక సమస్తకర్మను ఫలానుభవకాంక్ష యేమాత్రము లేకుండ చేయవలె. కర్మయోగి సమస్తభయమును. ఇహామునందుగాని, పరము నందుగాని భోగము ననుభవింపవలె నన్న ఆసక్తిని పూర్తిగా పరిత్యజింప వలె. ప్రతిఫలాసక్తిలేకుండ చేసెడి కర్మ సకలబంధము లకు మూలకంద మగు స్వార్థపరత్వమును ఛేదించివేయును. ''నేను కాదు, నీవే'' అనునే కర్మయోగి సదా అనుసంధించుచుండవలసిన మాట. ఎంతటి స్వార్థత్యాగమైనను అతనికి మిక్కుట మనిపింపదు. అతడు చేయు త్యాగమును, స్వర్గమునకు పోవలె నన్న కోర్కెగాని, పేరుప్రతిష్ఠలుపొందవలె నన్న కాంక్షగాని, ఈలోకములో ఏదో ప్రయోజనముపొందవలె నన్న ఆసక్తి గాని లేకయే చేయును. ఈ నిస్స్వార్థకర్మకు వివరణమును ఇందుల హేతూపన్యాసమును జ్ఞానయోగమునందుమాత్రమే కలవు. అయినను మానవునియం దున్న సహజదివ్యత్వమే అతనికి కేవల మవ్యాజముగ జగద్ధితమునకై త్యాగము చేయుట యందు మోజు గలిగించును. అతని మతమును, అభిప్రాయమును ఏదయిన నగును గాక. పెక్కండ్రకు ధనదాస్య మతిమాత్రము. అటువంటి

వారికి, ధనాశచుట్టును ఏర్పడియున్న పేరడును (క్రిస్టలైసేషను)ను ఛేదించివేయుటకు కర్మయోగ మత్యవసరము.

తరువాత పేర్కొనతగినది భక్తియోగము: ఏదో ఒక రూపమైన భక్తి, ఉపాసన, ప్రేమ — మానవునకు మిక్కిలి ప్రీతికరమును, సులభమును, స్వాభావికమును అయిన మార్గము. ఆకర్షణము ఈ ప్రపంచప్రకృతి; వియోగమే అనివార్యమైన దాని కట్టకడపటి ఫలితము. అటులనే మానవహృదయములో ఐక్యమునకు సహజప్రేరకము ప్రేమ; అది దుఃఖమునకు ప్రబల హేతువే. కాని, దానిని సరియగు లక్ష్యమువైపునకు సరియైన విధముగా మరలించినచో అది మోక్షమును గలిగించును. భక్తికి లక్ష్యము భగవంతుడు. జ్ఞాతయు జ్ఞేయమును లేక ప్రేమ ఉండ జాలదు. మనప్రేమకు బదులు ప్రేమచూపెడి ప్రాణియే తొలుత ప్రేమకు లక్ష్యము కావలె. కనుక ప్రేమకు లక్ష్యమగు దేవుడు ఒకవిధముగా మానవదేవుడే కావలెను. అతడు ప్రేమదైవతముగ నుండవలెను. అటువంటి దేవుడు కలడా యను ప్రశ్న అటుంతము. ఎవరికి హృదయములో ప్రేమ కలదో వారికి బ్రహ్మము ప్రేమ దైవతముగా, సగుణుడుగా తోచు ననుట తథ్యము.

దేవుని న్యాయమూర్తిగానో, శిక్షవిధించువానిగానో లేక మనము భయముతో లోబడవలసినవానినిగానో భావించి చేయు ఉపాసనావిధానములు తక్కువస్థాయికి చెందినవి. ఇవి క్రమక్రమముగా ఉదాత్తవిధానములుగ పెంపొందునవే అయినను ప్రేమ యనుటకు తగినవి కావు. ఇక ప్రేమను గుఱించియే యోచింతము. ప్రేమ నొక త్రిభుజముగా చెప్పుదము. త్రిభుజములోని మూల కోణము మొదటికోణము నిర్భయము. భయ మున్నంతవఱకు నది ప్రేమ కాదు. ప్రేమ సమస్తభయమును పాఱద్రోలును.

బిడ్డ నెత్తికొనియున్న తల్లి తనబిడ్డను కాపాడుకొనునట్లు బెబ్బులి నయిన నెదుర్కొనును. ప్రేమ రెండవకోణము ఏమియు కోరకుండుట, యాచింపకుండుట. మూడవకోణము ప్రేమ ప్రేమ కొఱకే ప్రేమించుట. లక్ష్యముండవలె అను ఆశయము కూడ అదృశ్యమగును. ప్రేమ ప్రేమించు ఏకైకరూపము ప్రేమయే. ఇది పరమోన్నతతత్త్వము. ఇదే బ్రహ్మము.

దీని తరువాతిది రాజయోగము: దీనికి ఈ యోగము లన్నిటితో పొత్తు కుదురును. ఏ నమ్మకము లున్నను, ఏ నమ్మకములు లేకపోయినను ఈ యోగ మన్నివర్గాల అన్వేషకులకును సరిపడును. పారమార్థికవిచారమున కిది నిజమైన సాధనము. ప్రతివిజ్ఞానశాస్త్రమున కొక ప్రత్యేకపరిశోధనావిధాన మున్నట్లే పారమార్థికపరిశోధనకు విధానము ఈ రాజయోగము. ఈ శాస్త్రముకూడ ప్రకృతిభేదముల ననుసరించి వివిధముల అన్వయింపబడుచున్నది. దీనిలోని ముఖ్యాంగములు: ప్రాణాయామము, ఏకాగ్రత, ధ్యానము. దేవునియందు విశ్వాసము గల వారికి గురువునొద్ద నుండి ఉపదేశముపొందిన 'ఓమ్' వంటి పవిత్రసంకేతనామ మేదేని మిగిలి సాయపడగలదు. ప్రణవ మన్నిటికంటె ఉత్కృష్ట మయినది. అది బ్రహ్మమునే ప్రతిపాదించును. ఈ పవిత్రసంకేతపదములను జపించుచు వానియర్థమును ధ్యానము చేయుట ముఖ్యసాధన.

పిమ్మట జ్ఞానయోగము: ఇది మూడుభాగములు. బ్రహ్మమే సత్యము, తక్కినదెల్ల మాయ (సోపాధికము) అను సత్యమును వినుట, శ్రవణము, మొదటి భాగము. రెండవది: ఈ తత్త్వము నన్నిదృక్పథములనుండి తర్కించుట. మూడవది: తర్కవితర్కము లన్నిటిని కట్టిపెట్టి సత్యమును సాక్షాత్కరించుకొనుట. ఈ సాక్షాత్కారము అనగా (1) బ్రహ్మమే సత్యము, తక్కినదెల్ల అసత్యము అను గట్టి నమ్మకము. (2) భోగాసక్తిని

పూర్తిగా విసర్జించుట. (3) ఇంద్రియనిగ్రహము, మనోనిగ్రహము. (4) గాఢమగు మోక్షకాంక్ష — ఈ సత్యమును నిరంతరము ధ్యానించుట, ఆత్మకు దాని యథార్థతత్త్వమును జ్ఞాపకము చేయుట — ఇవే ఈ యోగమునకు మార్గములు. ఇది పరమోత్కృష్టయోగము; కాని, బహుదుష్కరము. దీనిని బుద్ధిచేత గ్రహించువారు పెక్కురున్నారు. కాని, సాక్షాత్కారము పొందువారు చాల అరుదు.



# కర్మరహస్యము

(కాలిఫోర్నియా - లోసేంజెలిసులో 1900 సంవత్సరము
జాన్యువరి 4-వ తేదీని చేసిన ఉపన్యాసము)

కర్మ చేయునప్పుడు లక్ష్యమున కెంత శ్రద్ధ వహింప వలెనో సాధనమునందు సైత మంతటి శ్రద్ధ వహింప వలె. ఇది నా జీవితములో నేర్చుకొన్న చాల గొప్ప పాఠములలో నొకటి. నే నీ పాఠ మెవనియొద్దనుండి నేర్చుకొంటినో అతడు మహా పురుషుడు. అతని జీవితమే ఆయుత్కృష్టసూత్రములకు ప్రత్యక్ష నిదర్శనము. ఆ ఒక్క సూత్రమునుండి నేను గొప్ప పాఠముల సదా నేర్చుకొనుచునే యుంటిని. విజయమును సాధింపగలరహస్య మంతయు అందే కల దని నాకు తోచుచున్నది: లక్ష్యమున కెంత శ్రద్ధ వహింపవలెనో సాధనమునందును అంతటి శ్రద్ధ వహింప వలె.

జీవితములో ఒక గొప్ప లోప మిది:—వివరములను పూర్తిగా మఱచిపోవునంతగా లక్ష్యము మనల నాకర్షించును, గమ్యము మనల అంత ఎక్కువగా మరులు గొల్పును, సమ్మోహితులను చేయును, మన మనస్సులో దాని కంత ప్రాబల్యము గలుగును.

అపజయ మెప్పుడు కలిగినను, మనము విమర్శపూర్వకముగా పరిశీలించినచో — నూటికి తొంబదితొమ్మిది సందర్భములలో దానికి కారణము సాధనములవిషయమై మనము శ్రద్ధ వహింపకపోవుటే అని గుర్తింపగలము. మనకు కావలసినది సాధనమును సమగ్రమొనర్చుటయందును బలపఱచుటయందును చక్కని జాగరూకత. సాధనము సరిగా నున్నచో ఫలితము కలిగి

తీఱవలసినదే. కారణమే కార్యమును కలిగించునది యన్న విషయము మనము మఱచిపోవుదుము; కార్యము తనంతట తాను గలుగదు; కారణములు సరియైనవిగా, తగినవిగా, ప్రబలములైనవిగా నున్ననే గాని ఫలితము కలుగదు. ఒకమారు లక్ష్యమును ఎన్నుకొని, దానికి సాధనమును నిర్ణయించుకొన్న తరువాత లక్ష్యమును మన మించుమించు జాఱవిడిచినను విడువవచ్చు. సాధనము సమగ్రముగ నున్నచో లక్ష్యము సిద్ధించితీఱు నను నమ్మకము మనకు కలదు. కారణమున్నచోట ఫలితము విషయమున ఇక చిక్కే లేదు. ఫలితము కల్గితీఱును. కారణము విషయమై మనము జాగ్రతపడినచో ఫలితము తనవిషయమై తానే జాగ్రతపడును. లక్ష్యసిద్ధియే ఫలితము. సాధనమే కారణము: సాధనమునందు శ్రద్ధవహించుటే జీవితములోని గొప్పరహస్యము. ఈ విషయమును మనము భగవద్గీతయందుకూడ చదువుదుము. మనము కర్మమొనర్పవలె నని, నిరంతరము కర్మమొనర్చుచుండవలె నని, యావచ్ఛక్తితో కర్మచేయవలె నని, మనము చేయు పని యేదయినను మన మనస్సు నంతటిని దానియందు సంలగ్నమొనర్పవలె నని గీతనుండి నేర్చుకొనుచున్నాము. కర్మమొనర్చుచున్నంతసేపు మనము నిస్సంగులముగానే ఉండవలెను. అనగా, ఏదియు మనలను కర్మమునుండి తొలగింప రాదు; అట్లున్నను మనకు కావలసినప్పుడు మనము కర్మమును విడిచిపెట్ట గలిగి యుండవలె.

మనజీవితములను పరిశీలించినచో దుఃఖమునకు గల తక్కిన కారణము లన్నిటికంటె మిక్కిలి ప్రబలమైన కారణముగా మనము గుర్తించున దిది: ఒకపనికి పూనుకొని దానియందు మనసర్వశక్తిని వినియోగింతుము — ఆ పని నెగ్గకపోవచ్చు. అయినను దానిని విడనాడలేకుందుము. అది మనకు బాధకలిగించుచున్న దని దానినింకను అంటిపట్టుకొనియుండుటవలన మనకు మఱింతదుఃఖమే

కలుగు నని మనకు తెలియును. అయినను దానితో తెకతెంపులు చేసికొని రాలేము. మధుపము మధువును త్రాగుటకు వచ్చినది. దాని కాళ్లు తేనెముంతకు అంటుకొనిపోయినవి. అది తొలగి పోలేకున్నది. మనము మాటిమాటికిని అదే స్థితిలోనికి వచ్చు చున్నాము. సృష్టిరహస్య మంతయు నదే. మన మిక్కడ ఎందు కున్నాము? మనము తేనెత్రాగుట కిక్కడకు వచ్చితిమి. వచ్చి చూడగా మనచేతులు, కాళ్లు దానికి అంటుకొని యున్నవి. మనము వచ్చినది పట్టుకొనుటకు. కాని మనమే పట్టుపడితిమి. భోక్తల మగుటకై వచ్చితిమి కాని, మనమే భుక్తులముగ నున్నాము. ఏలుటకై వచ్చితిమి; మనమే ఏలుబడికి లోనగు చున్నాము. త్రిప్పుటకై వచ్చితిమి; కాని, మనకే త్రిప్పట కలుగు చున్నది. సర్వదా మనకు కననగుచున్న దిదియే. ఇది మన జీవితములోని ప్రతిస్వల్పవిషయములోనికిని చొచ్చుకొని వచ్చును. మనపై ఇతరుల మనస్సులు ప్రభావము చూపుచున్నవి. ఇతరుల మనస్సులపై ప్రభావము చూపుటకు మనము నిరంతరము పెనగు లాడుచున్నాము. జీవితసౌఖ్యముల ననుభవింపవలెనని మనము కోరుచుందుము; అవి మన ఆయువుపట్లనే తినివేయుచున్నవి. ప్రకృతినుండి సర్వము రాబట్టుకోవలె నని కోరుచుందుము; కాని, ప్రకృతియే మననుండి సర్వమును గుంజుకొను నని, మనలను పీల్చి పిప్పిచేసి పాఱవేయు నని—మనము చిరకాలమునకు గ్రహింతుము.

అట్లు కానిచో జీవితమంతయు ఆనందోజ్జ్వలముగా నుండె డిదే. పరవా లేదు, మనము దొరకుకొనకున్న చాలును. సుఖ దుఃఖము లన్నియు నున్నను, జయాపజయము లన్నియు నున్నను జీవితము ఆనందపరంపరగ నుండ వచ్చు.

అదొక్కటే దుఃఖకారణము: మనము సంగము గలిగి యున్నాము; పట్టుపడుచున్నాము. కనుక గీత యిట్లు చెప్పును: సదా కర్మమొనర్పుడు, కర్మమొనర్పుడు; కాని, సంగము నొంద

కుడు; పట్టుపడకుడు. దేనియందును సంగ మొందకుండుశక్తిని మీకే ఉంచుకొండి. వస్తువు ఎంత ప్రియమైన నగు గాక, దానికై మన డెంద మెంతగా ఆత్రపడినను పడును గాక, దానిని విడువనున్న ప్పుడు విడుచుటకై కల్గు దుఃఖ మదెంతటిదిగా నున్నను నుండును గాక. మీకు చిత్తము వచ్చినప్పుడు దానిని విడిచివేయు శక్తిని ఉంచుకొండి. ఈ జన్మములోగాని వేఱు ఏ జన్మములోగాని దుర్బలుల కిక్కడ స్థానము లేదు. దౌర్బల్యము బానిసతనమునకే దారి తీయును. దౌర్బల్యము శారీరకముగాను, మానసికముగాను అన్ని విధముల దుఃఖములకు దారితీయును. దౌర్బల్యము మృత్యువు. మనలను లక్షలకొలది సూక్ష్మజీవు లావరించియున్నవి. కాని, మనము దుర్బలులము కానిదే, వానిని చోర నిచ్చుటకు శరీరము సిద్ధపడి మున్ముందుగనే అందుల కనుకూలముగ నుండనిదే, అవి మనకు కీడు చేయ జాలవు. దుఃఖప్రద సూక్ష్మజీవు లొకకోటి మన చుట్టును ఎగురుచుండు గాక. పర్వా లేదు! మనస్సు దుర్బల మగువఱకు మనల సమీపించు సాహసము వాని కుండదు. మనల పట్టువఱచుకొను శక్తి వాని కుండదు. ఇది యొక మహాసత్యము: బలమే జీవితము; దౌర్బల్యమే మృత్యువు. బలమే నిత్యావ్యయ సౌఖ్యము. దౌర్బల్యము నిరంతరశ్రమ, దుఃఖము; దౌర్బల్యమే మృత్యువు.

ఇప్పటి మన సౌఖ్యము లన్నిటికిని కారణము 'సంగము'. మన మిత్రులందును మన బంధువులందును మనకు సంగ మున్నది. మానసికాధ్యాత్మిక కార్యకలాపములందు మనకు సంగ మున్నది. బాహ్యవస్తువులందు మనకు సంగ మున్నది. అందుచేతనే వాని వలన మనకు ప్రీతిగలుగుచున్నది. మరల మనకు దుఃఖము కలి గించునదియు ఈ సంగమే కాక మఱేది? ఆనందమును గడించు టకు మనము నిస్సంగులము కావలెను. తలంచుకొన్నప్పుడే సంగ మును త్రెంచుకొనుశక్తియే మన కున్నచో ఎట్టి దుఃఖము నుండదు.

యావచ్ఛక్తితో ఒకవస్తువునందు సంగము వహింపగలిగియుండియే, వలసినప్పుడు సంగమును త్రెంచుకొను శక్తిగలమానవుడే ప్రకృతి నుండి సారమును పొంద గలిగియుండును. సంగమును త్రెంచుకొనుట కెంత శక్తి ఉండవలెనో సంగము వహించుటకును అంత శక్తి కావలెను. అదే చిక్కు. దేనిచేతను ఎప్పుడును ఆకర్షింపబడని మానవు లున్నారు. వా రెప్పుడును ప్రేమింపలేనివారు, కఠినహృదయులు, ఉదాసీనులు. వారు జీవితబాధలనుండి చాల వఱకు తప్పించుకొందురు. గోడ ఏనాడును దుఃఖపడదు. గోడ ఏనాడును ప్రేమింపదు. దానికి నొప్పి ఎప్పుడును లేదు. అయిన నేమి? గోడ గోడయే. నిజముగా గోడగా నుండుటకంటె సంగము కలిగియుండుటయు పట్టుపడుటయునే మేలు. కావున ఎప్పుడును ప్రేమ నెఱుగక, రాతిగుండెకలిగి, అనేకజీవితబాధలనుండి తప్పించుకొనువానికి జీవితానందములును తప్పిపోవును. మన మాశించునది ఆ స్థితి కాదు. అది దౌర్బల్యము, అది మృత్యువు. ఏనాడును దౌర్బల్యమును చెందని, దుఃఖమును అనుభవింపని, ఆత్మ—జాగరితమైనది కాదు. అది బండతనము. మన కది యక్కఱ లేదు.

మనకు ఈ ప్రేమమహాశక్తి కావలె. సంగము అనెడి మహాశక్తి కావలె. ఒరులకై మనల కోల్పోవుచు, మనలను నిశ్శేషముగ సంహరింపనిచ్చుచు, మన ఆత్మసంతటిని ఏకైకమగు నొక లక్ష్యముపై చేర్పగల శక్తి కావలె — ఇది దేవతలకుండు శక్తి. మనము దేవతలకంటెకూడ పైమెట్టున నుండ గోరుదుము. పరిపూర్ణుడగు వాడు ఒకప్రేమలక్ష్యముపై తనయావదాత్మను కేంద్రీకరింపగలడు; కాని అతడు నిస్సంగియే. ఇ దెట్లు సాధ్యము? ఇందుకు మఱొకరహస్యముకూడ తెలిసికొనవలయును.

బిచ్చగాని కెన్నడును సుఖము లేదు. అతనికి దొరకునది బిచ్చము. దాని నిచ్చు కనికరమునకు మఱుగున నిరసనభావ ముండును; కనీసము బిచ్చగాడు అధమాధము డన్న భావమైన

నుండును. నిజమునకు తనకు వచ్చెడిదానితో నతడు ఎన్నడును సుఖపడడు.

మన మందఱము బిచ్చగాండ్రమే. మన మే పని చేసినను దానికి ప్రతిఫలము కోరుదుము. మన మందఱము వర్తకులము. మనకు జీవితములో వ్యాపారదృష్టి; సుగుణములలో వ్యాపార దృష్టి; మతములో వ్యాపారదృష్టి, అక్కటా! ప్రేమలోకూడ వ్యాపారదృష్టియే కదా.

మీరు వ్యాపారము చేయుటకు వచ్చినప్పుడు, ఇచ్చిపుచ్చు కొనుసందర్భమున, క్రయవిక్రయములసందర్భమున క్రయవిక్రయ ధర్మములకు బద్ధులు కండు. సమయ మొకప్పుడు ప్రతికూలముగా నుండును; ఒకప్పుడు అనుకూలముగా నుండును; ధరలలో హెచ్చు తగ్గు లుండును; నష్టము కలుగు నను తలంపు నీకు సదా ఉండును. అద్దములో చూచుకొనుటవంటి దది. నీ ముఖప్రతిబింబము కని పించును: నీవు ముఖము వికృతముగా పెట్టుకొన్న అద్దములోని ప్రతిబింబముఖముకూడ వికృతముగ నుండును; నీవు నవ్విన అద్దము లోని బింబము కూడ నవ్వును. ఇదియే క్రయము విక్రయము, ఇచ్చుట పుచ్చుకొనుట.

మనము చిక్కుకొందుము. ఏవిధముగా? మన మిచ్చెడి దానివలన కాదు; మన మాశించెడిదానివలన. ప్రేమకు ప్రతి ఫలముగా మనకు దుఃఖము సంప్రాప్తమగును; మనము ప్రేమించుట వలన కాదు; ప్రేమకు ప్రతిఫలముగా ప్రేమకొఱ కెదురుచూచుట వలన. ఆశ లేని చోట దుఃఖము లేదు. కోర్కెనుండియే, ఆశ నుండియే సమస్తదుఃఖములు పుట్టుచున్నవి. ఆశలు జయాపజయ నియమాలకు బద్ధపడినవే. కోర్కెలు దుఃఖమును కొనిరాక తప్పవు.

నిజమైన విజయములోను, నిజమైన సౌఖ్యములోను గల గొప్ప రహస్య మిది: ఎవరు ప్రతిఫల మాశింపరో, ఎవరు

సంపూర్ణముగా నిస్స్వార్థులో వారు అందఱకంటె అధికవిజయ వంతులు. ఇది చూచుటకు విరుద్ధముగ కనిపించును. స్వార్థచింత లేని ప్రతివ్యక్తియు వంచింపబడుటయు, అతనికి కీడు జరుగుటయు మనము చూచుట లేదా? స్థూలదృష్టికి అటులనే కనబడుచున్నది. "క్రైస్తు స్వార్థచింత లేనివాడు. అయినను అతనిని చిత్రవధ చేసిరి." నిజమే. కాని, అతని నిస్స్వార్థతయే అతని మహత్తరవిజయమునకు కారణ మన్న విషయము కూడ మనకు తెలియును — కోటానకోట్ల ప్రజల జీవితములకు నిజమైన విజయమంగళము గూర్చు నట్టి ఆ మహత్తరవిజయము.

ఏదియు కోరకుము; ప్రతిఫల మాశింపకుము. నీ వీయ వలసిన దేదియో యిచ్చివేయుము; అది నీకు మరల వచ్చును — కాని ఆ తలంపు నీ కిప్పుడు వలదు. అది వేయంతలై మరల నీకు దక్కును — కాని నీ దృష్టి దానిమీద ఉండకూడదు. ఇచ్చుటకు నీకు శక్తియుండవలె; నీ వీయవలె. అంతటితో అది సరి. జీవిత మంతయు నిచ్చుటే అని తెలిసికొనుము. ప్రకృతియే బలాత్క రించి నీచే త్యాగముచేయించును. కనుక బుద్ధిపూర్వకముగానే యిచ్చివేయుము. శీఘ్రముగానో, ఆలస్యముగానో నీవు వదలుకొని తీఱవలసినదే. నిల్వచేసికొనుటకు జీవితములో ప్రవేశించితివి. భల్లూకపుపట్టుతో కవ్వుకొనవలె ననుకొంటివి. కాని, ప్రకృతి నీ గొంతు పట్టుకొని నీ పిడికిలి తెఱపించును. నీ కిష్టమయినను, కష్టమయినను నీవు త్యాగము చేయవలసినదే. "నే నీయను" అని నీవు చెప్పినచో వెంటనే దెబ్బ వచ్చి పడును; నీకు నొప్పి కలుగును. తుట్టతుదకు తన సర్వస్వమును త్యాగము చేయవలసిన నిర్బంధమునకు గుఱి కాని వ్యక్తి లేనే లేడు. ఈ నియతిని ఎంత ప్రతిఘటించి పెనగులాడిన అంతగా దుఃఖపడవలసి వచ్చును. త్యాగము చేయు సాహసము లేకపోవుటచేతనే, ప్రకృతితో రెడి ఈ గొప్ప కోర్కెకు ఇష్టపడగలంత వైరాగ్యము మనకు లేక

పోవుటచేతనే, మనకు దుఃఖము గల్గుచుండును. అడవులు పోయినవి. వానికి బదులుగా ఉష్ణము లభించుచున్నది. సూర్యుడు సముద్రము నుండి నీటిని గ్రహించుచున్నాడు, మనకు వర్ష రూపమున తిరుగ ఇచ్చుటకే. పుచ్చుకొనుటకు, ఇచ్చివేయుటకు నీ వొక యంత్ర మవు. ఇచ్చివేయుటకే నీవు పుచ్చుకొందువు కనుక ప్రతిఫలము కోరకుము. నీ వధికముగా ఇచ్చినకొలది నీ కధికముగా లభించు చుండును. ఈ గదిలోని గాలి నెంతత్వరితముగా బయటికి పంపి వేసిన అంతత్వరితముగా బయటి గాలి వచ్చి ఈ గదిలో నిండును; అన్ని తలుపులు, ద్వారములు మూసివేసినయెడల లోపలిగాలి లోపలనే ఉండును. వెలుపలిగాలి లోపలికి రానే రాదు. లోపలి గాలి ముఱిగి, క్రుళ్లి, విషముగా మాఱిపోవును. నది తనజలము నంతటిని సాగరములో కలిపి నిరంతరము ఖాళీ అగుచున్నది. నిరంతరము క్రొత్తనీటితో నిండిపోవుచున్నది. సముద్రములోనికి పోవుటను నిరోధింపకుము. ఏ క్షణములో నీ వా పని చేసిన ఆ క్షణ ములో నిన్ను మృత్యుదేవత గ్రసించును.

కనుక బిచ్చగాడవుగ కాక ఉండుము; నిస్సంగుడవుగ నుండుము. జీవితములో నిది యన్నిటికంటె భయంకరమయిన పని! మార్గములో నున్న అపాయములను లెక్కపెట్టకుము. ఈ చిక్కులను బుద్ధిచేత గుర్తించినను వానిని అనుభవించువఱకు అవి మనకు నిజముగా తెలియవు. దూరమునుండి చూచినప్పుడు తోట స్థూలాకృతి తెలియవచ్చు: అంతమాత్రమున ఏమి? మనము దానిలో నున్నప్పుడే దానిని గుఱించిన అనుభవము మనకు కలుగును; దానిని మనము తెలిసికొనగలము. మన ప్రయత్నము లన్నియు విఫలమైనను, గాయములనుండి రక్తము స్రవించుచున్నను, మనము కండతుండెములుగ చీల్పబడినను — ఇన్ని యనుభవములతోను ధైర్యమును నిలబెట్టుకొనవలె — ఇన్ని కష్టములలోను మన దివ్యత్వము దృఢముగ చూపవలె.

ప్రతీకారము చేయుమని, దెబ్బకు బదులు దెబ్బ కొట్టుమని, మోసమునకు బదులు మోసము చేయుమని, కల్లకు బదులు కల్ల లాడుమని, శక్తికొలదియు ఢీకొనుమని ప్రకృతి మనల కోరును. కాని ప్రతీకారము చేయకుండవలె ననిన, నిగ్రహము వహింపవలె ననిన, తటస్థుడుగ నుండవలె ననిన—దేవాతీతశక్తి కావలెను.

మనము నిస్సంగులమై యుండవలె నని ప్రతిదినము క్రొత్తగా సంకల్పము చేసికొందుము. మనము వెనుకకు తిరిగి చూచుకొని మనప్రేమకును, మమత్వమునకును ఆస్పదము లయిన వస్తువులను చూతుము. వానిలో ప్రతిఒక్కటియు మనల నెట్లు దుఃఖముపాలు చేసినదియు గ్రహింతుము. "ప్రేమ"యే కారణముగా మనము నిరాశాగాధములలో పడిపోతిమి! ఇతరులచేతిలో మనము కేవలము బానిసలుగ నున్న ఉనికి మనకు స్పష్టమగును. మన మధోగతికి ఈడ్చుకొనిపోబడితిమి! మఱొకమారు దృఢ సంకల్పము చేసికొందుము: "ఇకమీద నేను స్వతంత్రుడనుగ నుందును. ఇకమీద నేను నా యధీనమందే ఉందును." కాని, సమయము వచ్చినప్పుడు మునుపటి కథయే పునరావృత్తమగును! మరల ఆత్మ చిక్కుకొని విముక్తిపొందజాలకుండును. పక్షి వలలో నున్నది, పెనుగులాడుచున్నది, గిలగిలకొట్టుకొనుచున్నది. ఇదియే మన జీవితము.

ఈ చిక్కులు నాకు తెలియును. అవి దారుణము లయినవి. నూటికి తొంబదిమంది నిరుత్సాహపడుదురు; ధైర్యమును కోల్పోవుదురు. మన వంతు వచ్చినప్పుడు నిరాశావాదుల మగుదుము. చిత్తశుద్ధి, ప్రేమ మొదలగు ఉదాత్తోదారములగు నన్నిటియందును వారికి నమ్మకము నశించును. యౌవనదశలో క్షమ, దయ, సరళత, నిష్కాపట్యము మొదలగు లక్షణములు గల వారు వార్ధక్యములో అబద్ధములపుట్టగా మాఱిపోవు వారిని మనము చూచుచున్నాము. వారి మనస్సులు కౌటిల్యములకు నిలయములు.

వెలుపలికి వారినడవడి పద్ధతులు ఎంత నాజూకుగానైన నుండ వచ్చును. వారు పొగరుబోతులుగా నుండరు. వారు మాటాడరు. కాని, మాటాడుటయే వారికి మేలు; వారిహృదయములలో చైతన్యము లేదు. కనుక వారు మాటాడరు. వా రెవ్వరిని దూషింపరు, ఆగ్రహింపరు; వా రాగ్రహింపగలిగిన మంచిది; దూషింపగలిగిన వేయిరెట్లు మంచిది. కాని, వా రా పని చేయ జాలరు. వారి హృదయములో మృత్యు వున్నది. మృత్యు శైత్యము వారి హృదయముల నావరించినది. ఇక వారు వ్యవహ రింపజాలరు. దూషించుటకు, పరుషవాక్కు పలుకుటకు కూడ వారికి శక్తి లేదు.

ఇదంతయు మనము తప్పించుకోవలె: కనుకనే మనకు దేవాతీతశక్తి కావలసియున్న దని నేను చెప్పుచున్నాను. అతిమానుషశక్తి చాలదు. దేవాతీతశక్తి ఒక్కటే గతి, తరణో పాయము. ఆ శక్తిచేత మనము ఈ చిక్కులగుండ, ఈ దుఃఖ వర్షములగుండ నిరపాయముగ దాటుకోగలము. మనము తుత్తుని యలు చేయబడవచ్చు, చీల్చబడవచ్చు కాని అంతసేపును మన హృదయములు ఇంకనింకను ఉదాత్తతరములుగ పెంపొందుచుండ వలెను.

ఇది చాల కష్టమే. కాని, నిరంతరసాధనవలన మన మీ కష్టము నతిక్రమింపగలము. మనమే మనలను దేనికైనను లోబఱచుకొనకున్న మన కేదియు సంభవింపజాల దన్న విషయము మనము తెలిసికొనవలెను. నా శరీరము అందుకు సిద్ధపడువఱకు ఏ వ్యాధియు నాకు వాటిల్లజాల దని యింతకుముందే చెప్పియుంటిని కదా; వ్యాధులు క్రిములపైనే ఆధారపడియుండవు. ముందుగనే దేహమున గల రోగోన్ముఖతపై నాధారపడియుండును. మనము దేనికి అర్హులమో అదియే మనకు గల్గుచుండును. మనము గర్వ మును కట్టిపెట్టి, దుఃఖార్హత లేనిదే మనకు దుఃఖము ఎప్పుడును

సంప్రాప్తము కాదని గ్రహింతము. కలుగదగని కష్టము ఎన్నడును కలిగియుండలేదు; నా చేతులతో నేనే దారిచేసి రప్పించుకొనని కీడు నాకెన్నడును గల్గియుండలేదు. ఇది మనము తప్పక తెలిసికోవలసిన విషయము. నిన్ను పరిశీలించి చూచుకో. కష్టము అనుభవించుటకు నిన్ను నీవే సిద్ధపఱచుకొన్నందుననే, కలిగిన ప్రతికష్టమును నీకు కలిగినదని కనుగొందువు. సగము నీవే చేసికొంటివి. మిగిలినసగము బాహ్యజగము చేసినది. కష్టములు కలిగినదట్లు. అది మనలను శాంతపఱచును. ఇప్పుడు ఈ పరిశీలనవలన ఆశాజనకమైన హెచ్చరిక కూడ కలుగుచున్నది. ఆశాజనక మగు ఆ హెచ్చరిక యిది: "బాహ్యప్రపంచము నా యధీనమున లేదు. నాలో నున్న, నాకు దగ్గఱగా నున్న నా జగత్తు నా యధీనమందున్నది. ఏదేని పరాజయముగూర్చుట కీ రెంటికలయిక కావలసినయెడల, నాకు కష్టము కలిగించుట కీ రెండును అవసర మయినచో, నా యధీనములో నున్నదానిని నేను తోడ్పఱుపను; అప్పుడు కష్ట మెట్లు సంభవింప గలదు? నిజముగా నన్ను నేను నా అధీనమునకు తెచ్చుకొందునేని, నా కెన్నడును కష్టము కలుగబోదు."

శైశవదశనుండియు మనము మనకు బాహ్యముగానున్న వానిపైనే బాధ్యత నారోపింప సదా ప్రయత్నించుచున్నాము. ఇతరులను చక్కబఱచుటకే మనము సదా లేచుచుందుము; మనలను చక్కబెట్టుకొనుటకు కాదు. మనకు దుఃఖము గల్గినప్పుడు, "అయ్యో! రాక్షసలోకము!" అందుము. ఇతరులను తిట్టుదుము. 'ఎంత మూర్ఖోన్మత్తులు' అందుము. నిజముగా మనము అంత మంచివారమే అయినచో ఇట్టి లోకములో ఎందు కుండవలె? ఇది రాక్షసులలోకమైనచో మనమును రక్కసులమే కావలెను; కానిచో మన మిక్కడ ఉండుట కేమి కారణము? "అహో! లోకు లంతటి స్వార్థపరులే!" నిజమే; కాని మనము

అంతకన్న మేలైనవార మయినచో వారి నడుమ ఎందు కుండ వలె? ఆ విషయ మాలోచింపుడు.

మన కేది ప్రాప్తవ్యమో అదియే సంభవించును. మనము మంచివార మని, లోకము చెడ్డ దని చెప్పినప్పుడు అసత్యము చెప్పితి మన్న మాట అట్లుండుట ఎన్నటికిని పొసగదు. అది మనకు మనమే చెప్పుకొను ఘోర మయిన అసత్యము.

నీవు మొట్టమొదట నేర్చుకొనవలసిన పాఠ మిది: వెలుపల నున్న దేనిని నిందింపరాదు, వెలుపల నెవనిపైనను నేర మారోపింపరాదు అని దృఢనిశ్చయము చేసికో. మానవుడుగ నుండుము, లెమ్ము, నేరమును నీపైనే ఉంచుకో. అదియే సదా నిజమని నీవు గ్రహింతువు. నిన్ను నీ యధీనములోనికి తెచ్చుకో.

ఒకక్షణములో మన మానవత్వమును విశేషముగా ప్రసుతింతుము —— మనము దేవతల మందుము, సర్వజ్ఞుల మందుము, సర్వశక్తుల మందుము, దోషరహితుల మందుము, కళంకరహితుల మందుము, లోకమునం దందఱికంటె నిస్స్వార్థుల మందుము; మఱు క్షణముననే ఒకచిన్న రాయి మనలను గాయపఱచుచున్నది. క్షుద్రుడగు నొక ఎల్లయ్యకు గలిగిన యించుకపాటి కోపము మనకు వ్యథ గూర్చుచున్నది. దారిని పోవు ఏ మూర్ఖుడైనను సరే ''ఈ దేవతలను'' ఏడ్పించుచున్నాడు! ఇదంతయు అవమానకరము కాదా? మన మట్టి దివ్యులమే అయినచో ఉండవలసిన దిటు లేనా? నిజముగా తప్పు లోకముదేనా? మనజిత్తులలో ఏదైనను సరే, అందఱికంటె ఉదాత్తుడును పవిత్రుడు నయిన దేవునికి వ్యథ గూర్ప గలవా? నీవు అంతటి స్వార్థరహితుడ వైనచో దేవుని వంటివాడవే. నిన్నే లోకము బాధింప గలదు? త్రిసప్తనరకాల గుండ నీ వెట్టి చెఱుపును నలుగుడును లేక దాటిపోగలవు. నీకష్టములను చెప్పుకొనుటయు, బాధ్యతను బాహ్యలోకముపై పెట్టగోరుటయు 'బాహ్యలోకము నీ యనుభవములో నున్న' దని

చూపును. బాహ్యలోకము నీ యనుభవమం దుండుటచే నీ వేమని చెప్పుకొనుచున్నావో అది (దివ్యుడవు) నీవు కాలేదని స్పష్టమగు చున్నది. దుఃఖముపై దుఃఖము పేర్చుకొనుచు, బాహ్యప్రపంచము నిన్ను బాధించుచున్న దని భావించుటచేత, "అయ్యో! ఈ రాక్షసప్రపంచము! వీడు నన్ను బాధించుచున్నాడు, వాడు నన్ను బాధించుచున్నాడు" అని ఈ విధముగా ఆక్రందించుటచే నీవు నీ దోషమును మఱింతగా పెంచుకొనుచున్నావు. ఇది దుఃఖమునకు అసత్యములను కలుపుకొనుటే.

మనవిషయమై మనమే జాగ్రత్తపడవలె: ఇంతవఱకు మనకు సాధ్యమే — ప్రస్తుతము, కొంతకాలము ఇతరులవిషయ మాలోచించుట విరమించుకోగలము. సాధనమును శుద్ధమొనర్తము గాక. ఫలితము దానిజాగ్రత్త అదే పడగలదు. మనజీవితములు మంచివియు, విశుద్ధములును అయిననే ఈ ప్రపంచమును మంచిది గను, విశుద్ధముగను ఉండగల్గును. అది ఫలితము; మనము సాధనములము. కనుక మనలను మనము పరిశుద్ధపఱచుకొందము గాక. మనలను పరిపూర్ణులనుగా జేసికొందము గాక.



# భక్తి

ఈశ్వరుడు సగుణుడన్న ఆశయము ఏవో కొన్ని మతము లలో దక్క, దాదాపు అన్ని మతములలోను కలదు. బౌద్ధ, జైన మతములలో లేదే కాని ప్రపంచములోని తక్కిన సర్వమతము లందును దేవుడు సగుణుడన్న భావము కలదు. దీని ననుసరించి భక్తి, పూజ అను భావము కలిగినది. బౌద్ధులకును జైనులకును ఈశ్వరుడు లేకపోయినను వారు తమ మతస్థాపకులను తదితరులు దేవుని పూజించినట్లే పూజింతురు. బదులు ప్రేమను మానవునకు జూపగల యొక పరతత్త్వమునెడ భక్తిసేయుటయు పూజించు టయు అను ఆశయము విశ్వజనీనము. వివిధ మతములలో ఈ ప్రేమయు, భక్తియు వివిధదశలలో, వివిధపరిమాణములలో వ్యక్తమగుచున్నవి. కర్మకలాపములతోకూడిన దశ మిక్కిలి జఘన్య మయినది. ఈ దశలో సుసూక్ష్మాశయము లించుమించు అసంభవములే. అవి అట్టడుగుస్థాయికి గొనిరాబడి స్థూలరూప మొందింపబడును. రూపములు వానితోపాటు వివిధసంకేతములు ప్రాముఖ్యమునకు వచ్చును. భావాతీతమయినదానిని రూపకల్పన మూలముననుు, సంకేతముల సాయముతోను గ్రహించుటకు మానవుడు ప్రయత్నించుచుండుట ప్రపంచచరిత్రమందంతటను కాననగును. గంటలు, వాద్యములు, కర్మలు, గ్రంథములు, ప్రతిమలు అనెడి మతబాహ్యరూపములన్నియు—ఈ శీర్షికక్రిందికి వచ్చును. ఇంద్రియప్రీతికరములయినవెల్ల అప్రత్యక్షమైనదానికి ప్రత్యక్షరూపకల్పనచేయుటకు మానవునకు సాయపడునవెల్ల స్వీక రింపబడినవి, పూజింపబడినవి.

సంకేతముల నన్నింటిని, కర్మల నన్నింటిని ప్రతిఘటించిన సంస్కర్తలు ప్రతిమతములోను అప్పుడప్పుడు ఉండియే యున్నారు.

వారి ప్రతిఘటన నిష్ప్రయోజన మగుచుండెను. ఏలయన మానవుడు మానవుడుగా నున్నంతకాలము—అంటిపట్టుకొనుటకు స్థూలమైన యొకదాని ఆవశ్యకత, తమ ఆశయాల కొక ఆశ్రయావశ్యకత, తమ మానసికరూపకల్పనల కన్నిటికి కేంద్రముగ నుండగలదాని ఆవశ్యకత అధికసంఖ్యాకులకు సదా కలదు. కర్మకలాపములకు స్వస్తి చెప్పించుటకే మహమ్మదీయులును, ప్రాటెస్టెంటులును చేసిన భగీరథప్రయత్నములు. కాని, కర్మకలాపములు వారి ఆచారములలోనికే చొచ్చుకొన్న వనుట మనకు ప్రత్యక్షము. వానిని పరిత్యజించుట సాధ్యముకాదు; సుదీర్ఘకాలము పెనగులాడియు జను లొక సంకేతమునుండి మఱొకసంకేతమునకు మాఱుదురు అంతే. మహమ్మదీయుడుకానివా డుపయోగించు ప్రతికర్మయు, ప్రతిరూపమును, విగ్రహమును, క్రతువును దుష్టము లని భావించు మహమ్మదీయుడు తన గుడికి కాబా యొద్దకు వచ్చునప్పు డట్లనుకొనడు. మతానుష్ఠానపరుడగు ప్రతి మహమ్మదీయుడు తా నెక్కడ ప్రార్థనచేసినను తాను కాబా కభిముఖముగ నిలబడియున్నా ననియే భావింపవలెను. అక్కడ కతడు యాత్రార్థియై వెడలినప్పు డా ఆలయపు గోడయందున్న నల్లని రాతిని ముద్దిడుకొనవలె. ఆ రాతిమీద ముద్రితము లయిన లక్షోపలక్ష యాత్రికుల ముద్దులు భగవంతుడు తీర్పుచెప్పు తుదినాడు విశ్వాసవంతుల కనుకూలురగు సాక్షులుగా రూపొంది నిల్చును. ఇంతేకాక 'జింజిం' బావి యొకటి కలదు. ఆ బావినుండి ఎవరుగాని కొంచెము నీరుతోడినచో వారి పాపములు క్షమింపబడు ననియు, పునరుత్థానదినమునకు పిమ్మట వారు క్రొత్తదేహము దాల్తురు అనియు, వారు శాశ్వతముగా జీవింతు రనియు మహమ్మదీయులు నమ్ముదురు. ఇతరుల విషయములో సంకేతములు భవనములరూపము దాల్చుట కాన నగును. ఇతరస్థలములకంటె 'చర్చ్'లు పవిత్రము లయిన వని ప్రాటెస్టెంటుల నమ్మకము. చర్చే ఇట సంకేత మగుచున్నది. లేదా, గ్రంథము కలదు.

సంకేతములన్నిటికంటె వారికి 'గ్రంథము' మిక్కిలి పవిత్రతరమయినది.

సంకేతములను ఖండించుచు బోధచేయుట నిష్ప్రయోజనము. అసలు వానిని ఖండించి ఏల బోధింపవలెను? మానవుడు సంకేతములను ఉపయోగింపరాదనుటకు కారణము లేదు. వాని వెనుక నున్న భావములను స్ఫురింపజేయుటకై మానవులు సంకేతము లుంచుకొని యున్నారు. ఈ విశ్వమే ఒక సంకేతము. దీనియందును, దీనిగుండను ఇది సూచించు విషయమును గ్రహించుటకు మనము ప్రయత్నించుచున్నాము. అది దీనివెనుకను, దీని కతీతముగాను ఉన్నది. గమ్యము ఆత్మయే కాని స్థూల ద్రవ్యము కాదు. రూపములు, ప్రతిమలు, గంటలు, దీపములు, గ్రంథములు, చర్చిలు, గుడులు—ఈ పవిత్రసంకేతము లన్నియు చాల మంచివే; ప్రవర్ధమానమగు ఆధ్యాత్మికత అను అంకురమునకు మిక్కిలి సాయపడునవే. కాని, అంతవఱకే. అంతకు మించరాదు. అనేకుల విషయములో చూతుమేని మొక్క పెరుగుట లేదు. ఒక చర్చివాడుగా పుట్టువొందుట చాలమంచిదే కాని ఒక చర్చివాడుగానే మరణించుట చాల చెడుగు. ఆధ్యాత్మికత అను చిన్న మొలకకు తోడ్పడు కొన్ని ఆచారాల అవధులకు లోబడి మానవుడు పుట్టువొందుట చాల మంచిదే కాని ఆ ఆచారాల అవధులలోనే అతడు మరణించునేని, ఆ మరణము అతడు ఎదుగలేదని, ఆత్మ కెట్టి వికాసమును గలుగలేదని సూచించును.

కనుక సంకేతములను, కర్మకలాపములను, ఆచారములను శాశ్వతముగా నుంచుకోవలసినదని ఎవడేని చెప్పినచో అది తప్పు. సంకుచితాధఃస్థాయిలో ఆత్మ ఉన్నప్పుడు, దాని వృద్ధికి ఈ సంకేతములును క్రతువులును తోడ్పడు నని ఒకడను నేని అది సరి. ఆత్మాభివృద్ధి అనగా బుద్ధివికాసము కాబోలు నని మీరు పొరపడరాదు. ఒకడు మహామేధావిగ ఉండనువచ్చు, ఆధ్యాత్మికముగ

నతడు శిశువుగనే ఉండనువచ్చు. దీని నిజమును మీ రిప్పుడే తెలిసికొనుటకు వీ లగును. సర్వవ్యాపియైన దేవునందలి నమ్మకము మీకందఱకు కలుపబడియున్నది. ఆ విషయ మాలోచించి చూడుడు. సర్వవ్యాపకత అన నేమో భావింపగలవారు మీలో ఎంతకొలదిమంది! శ్రమపడి ప్రయత్నించితి రేని 'మహాసముద్రము' 'ఆకాశము' 'విశాలమైన పచ్చికబయలు' 'ఎడారి' — వీనిలో ఏదైన నొకదానితలంపును బోలినది మీకు స్ఫురించును. ఇవన్నియు భౌతికప్రతిమలు. భావాతీతమైనదానిని భావాతీతముగనే, లక్ష్యమును లక్ష్యముగనే మీరు భావింపలేకుండునంతవఱకు ఈ రూపాలను, ఈ భౌతికప్రతిమలను ఆశ్రయింపక మీకు తప్పదు. ఈ ప్రతిమలు మనస్సులోనివైనను, వెలుపలివైనను ఎక్కువ భేద మేమియు లేదు. మన మందఱము విగ్రహారాధకులముగనే పుట్టియున్నాము. విగ్రహపూజ మానవప్రకృతియందే కలదు. కనుక అది మంచిదే. దాని నెవరు దాటిపోగలరు? పరిపూర్ణుడయినవాడే, దివ్యావతారమూర్తియే దాట గలడు. తక్కినవా రందఱును విగ్రహారాధకులే. రూపములతో, ఆకృతులతో కూడిన ఈ విశ్వమును మనము చూచుచున్నంత కాలము మన మందఱమును విగ్రహారాధకులమే. విశ్వము మనము పూజించుచున్న ఒక మహత్తరసంకేతము. 'దేహమే నే' నని చెప్పువాడు పుట్టుకచేతనే విగ్రహారాధకుడు. మన మాత్మలము; ఆకృతి లేని ఆత్మలము, అంతములేని ఆత్మలము, స్థూలద్రవ్యము కాని ఆత్మలము. కనుక, భావాతీతమైనదానిని గ్రహింపజాలనివాడు, దేహమువంటి స్థూలద్రవ్యమునందును స్థూలద్రవ్యముగుండను కాక ఆత్మస్వరూపమును భావించుకోజాలనివాడు విగ్రహారాధకుడే. ఇటులయ్యును జనులు ఒకరొకరిని విగ్రహారాధకులని పేర్కొనుచు ఎట్లు పోరాడుకొనుచున్నారు! అనగా ప్రతివాడు తన విగ్రహమే సరియైనదనియు ఇతరుల విగ్రహములు సరియైనవి కావనియు అనుచున్నాడు.

కావున మన యిట్టి పసితనపు భావములను వదలించుకో వలె. మత మనగా వ్యర్థప్రసంగములో, సిద్ధాంతములతో కూడిన విధానములో అని భావించెడివారి మాటలను దాటిపోవలె. వారికి మత మనగా బుద్ధిచేత అవుననియో కాదనియో చేయు నిర్ణయము మాత్రమే; వారికి మత మనగా, తమ పురోహితులు చెప్పుమాటలను నమ్ముటయే; వారికి మత మనగా, తమ పూర్వులు నమ్మినదే; వారికి మత మనగా తా మంటిపట్టుకొనియుండు కొన్ని యభిప్రాయముల, మూఢవిశ్వాసాల సమూహమే. వారు వాని నంటిపట్టుకొనియుండుటకు కారణ మవి దేశీయులందఱికిని గల మూఢవిశ్వాసము లగుటయే. ఇట్టి వీరి ప్రలాపాలను మనము దాటిపోవలెను. మానవకోటిని సర్వాంగసంపన్నమును ఏకైకమునగు పెద్దనిర్మాణముగా, మెల్లగా వెలుతురువంకకు వచ్చుచున్నదానినిగా కొనవలెను. మానవతతి నొక యద్భుతాంకురముగను భగవంతుడనెడి అద్భుత సత్యమున కభిముఖముగా మెల్లగా వికసించుచున్నదానినిగను కొనవలెను. దాని మొదటిపరిభ్రమణములు, తొలి చలనము లెప్పుడును స్థూలద్రవ్యముగుండను, కర్మకలాపముల ద్వారాను మాత్రమే జరుగును.

ఈక్రతుకలాపముల కన్నిటికిని హృదయము తక్కిన అన్నిటికంటె ముఖ్యమైన ఆశయము — నామభజనము. మీలో ప్రాచీన క్రైస్తవాచారములను పరిశీలించినవారును లోకమునందలి తక్కినమతములను పరిశీలించినవారును వాని అన్నింటను ఈ ఆశయమును ఈనామభజనమునుగుర్తించియుందురు. నామము పరమపావన మని చెప్పబడియున్నది. పావనభగవన్నామము పవిత్రతలో సాటిలేనట్టి దనుగణనము బైబిలులో చూచుచున్నాము. నామము లన్నిటిలో అదే పవిత్రతమము. ఆనామమే భగవాను డనియు భావింపబడినది. అది ముమ్మాటికి నిజమే. ఈజగత్తు నామరూపాత్మకము కాక మఱియేమి? మాటలు లేకుండ

మీ రాలోచింప గలరా? శబ్దార్థములను ఒండొకదానినుండి వేఱుచేయుట సాధ్యము కాదు. వానిని వేఱుచేయ వీలగు నేమో మీలో ఎవరయినను ప్రయత్నించి చూడుడు. మీరెప్పుడు భావించినను నామరూపములగుండనే భావించుచుందురు. ఒకటి మఱొకదానిని స్ఫురింపజేయును; భావము శబ్దమును, శబ్దము భావమును స్ఫురింప జేయును. ఇట్లు ఈవిశ్వమంతయు భగవంతుని బాహ్య సంకేతము. దాని వెనుక నున్నది మహిమాంచితమైన భగవన్నామము. ప్రతిదేహము నొకరూపము. ఆ దేహమునకు వెనుక దాని నామ మున్నది. మీ ఫలానా మిత్రుని తలచుకొనగానే మీభావవీథిలో అతని దేహము వచ్చి నిల్చును. మిత్రుని దేహమును తలచుకొనగానే అతని నామము స్ఫురించును. ఇది మానవతత్త్వమందే గలదు. అనగా మనస్తత్త్వశాస్త్రానుసారము మానవుని మనస్సులో రూపస్ఫూర్తి లేక నామస్ఫూర్తి ఉండదు, నామస్ఫూర్తి లేక రూపస్ఫూర్తి ఉండదు. అవి విడదీయరానివి; ఒక్కకెరటమునకే అవి బాహ్యాంతరపక్షములు. కావున విశ్వమంతటను నామములను గొప్పసేయుటయు భజించుటయు జరుగుచు వచ్చుచున్నది. తెలిసియో తెలియకయో మానవుడు నామమహిమను కనుగొన్నాడు.

అనేకమతములలో పవిత్రాత్ములను పూజించుట చూచుచున్నాము. కృష్ణుని పూజింతురు. బుద్ధుని పూజింతురు. జీససును పూజింతురు. ఇంకను అట్టివారిని పూజింతురు. యోగుల పూజించుటకూడ కలదు. లోకమంతటను వందలకొలది యోగులు పూజింపబడుచున్నారు. ఔను, మఱి ఏల పూజింపబడరాదు? కాంతిస్పందనము ఎల్లప్పుడునున్నది. గుడ్లగూబ దానిని రాత్రులందు చూచును. అనగా అప్పుడు మానవుడు చూడలేకున్నను అదేమో ఉన్నదన్న మాట. మనుష్యునకు ఆ కాంతిస్పందనము దీపము, సూర్యుడు, చంద్రుడు మున్నగువానిలో మాత్రమే కానిపించును.

భగవంతుడు ఎల్లెడల నున్నాడు. అతడు తన్ను తాను ప్రతిజీవి యందును వ్యక్తముచేసికొనుచున్నాడు; కాని మానవులకుమాత్ర మతడు మానవునియందే కనబడును, మానవునియందే గుర్తింపబడును. దేవుని వెలుగు, దేవుని సాన్నిధ్యము, దేవుని తత్త్వము మానవునిముఖముగుండ ప్రకాశించినప్పుడే మానవుడు గ్రహింపగలడు. ఈ విధముగా మానవుడు దేవుని మానవ రూపమున అనాదిగా ఉపాసించుచున్నాడు. మానవుడు మానవుడుగా నున్నంతకాల మట్లుచేయవలసినదే. మానవు డీ పద్ధతిని ఖండింపవచ్చును; ప్రతిఘటింపవచ్చును. కాని, దేవుని సాక్షాత్కరింపజేసికొనుటకు ప్రయత్నింపగానే దేవుని మానవునిగా సంభావించుట తన ప్రకృతికి అనివార్య మని గుర్తించును.

కావున దాదాపు ప్రతిమతములోను దేవునిపూజవిషయమున మూడు ముఖ్యవిషయము లున్నవి — విగ్రహములు (సంకేతములు); నామములు; దివ్యపురుషులు. ఇవి అన్నిమతములందును గలవు. కాని, మతము లొకదానితో మఱొకటి కలహింపగోరుచున్న సంగతి మనము గమనించుచున్నాము. ఒకడు, "నేను జపించెడి నామమే నామము; నేను మన్నించెడి రూపమే రూపము; నేను పూజించెడి మహాత్ములే లోకమునకెల్ల మహాత్ములు; మీ వన్నియు వట్టి కల్లలు" అని చెప్పును. ఈ కాలములోని క్రైస్తవమతాచార్యులు కొంచెము కనికరముకలవారైరి. ప్రాచీనమతములలోని వివిధపూజావిధానములు క్రైస్తవ విధానమునకే పూర్వరూపములని యొప్పుకొందురు. క్రైస్తవమే ఏకైకవిధాన మని వారు పరిగణింతురు. ప్రాచీనకాలమున దేవుడు తన్ను తాను పరీక్షించుకొన్నాడు; వివిధవిధానములు కల్పించి తనశక్తులను పరీక్షించుకొన్నాడు. అవన్నియు క్రైస్తవములో పూర్ణత్వము పొందినవి. ఈమాత్రమే ఐనను ఇది గొప్పపురోగతియే. ఏబదియేండ్ల క్రిత మీపాటియైనను వా రని యుండరు;

తమ మతముదక్క మఱేదియు సత్యము కాదు. ఇట్లనుకొను చుండినవారు ఏ యొక మతముననో, జాతిలోనో, వర్గములోనో ఉన్నవారు మాత్రమే కారు. 'తా మేమి చేయుచున్నారో అదే అందఱికిని ఆచరణీయము' అనియే ప్రజలు సదా తలంచుచుందురు. ఈ విషయముననే విభిన్నమతముల పరిశీలనము మనకు తోడ్పడు నది. మనవే మనవే అని మన మనుకొనుచుండిన ఆశయములే నూర్లకొలది సంవత్సరములుగ ఇతరులలోను ఉన్న వనియు ఒక్కొక్కప్పుడు మనలో వ్యక్తమైనంతకంటె మేలుగా ఇతరులలో వ్యక్తమై యున్న వనియు — ఈ పరిశీలనము మనకు చూపును.

ఇవి భక్తికి బాహ్యరూపములు. వీని ద్వారా మానవుడు సాగిపోవలె. సాధకుడు ఆర్జవముగలిగి, సత్యమును చేరుకొనవలె నని నిజముగ కోరునేని అతడు వీని నతిక్రమించి, రూపము లొక లెక్క కాదనుకొను అంతస్తు నందుకొనును. మతరంగమున దేవాలయములు కాని, చర్చిలు కాని, గ్రంథములు కాని, విగ్రహ ములు గాని పసిబిడ్డల తోటబడివంటివి. ఆధ్యాత్మికశిశువు పుష్టి చెంది ఉన్నతపథముల నందుకొనుట కివి సాయపడును; ఈ ప్రాథమికసోపానములు మతమును కోరువారి క వ స ర మే. భగవంతునికొఱకై తృష్ణ, తీవ్రాశ, కలుగుటతో నిజమయిన భక్తి కలుగును. ఈ తృష్ణ ఎవరి కున్నది? అదియే అసలు ప్రశ్న. మతము సిద్ధాంతములలోను, సూత్రములలోను, ప్రజ్ఞావాదముల లోను లేదు. మతము అనగా మన స్థితియు, మన పరిణతియునే. మతము అనగా సాక్షాత్కారానుభవమే. దేవుని గుఱించి, ఆత్మను గుఱించి, సృష్టిరహస్యములను గుఱించి ఎందఱో ప్రసం గించుచుందురు. మనము వినుచున్నాము. వారిని ఒక్కొక్కరినిగా "నీవు భగవత్సాక్షాత్కారము పొందితివా? నీ యాత్మను దర్శిం చితివా?" — అని ప్రశ్నింపుడు. ఓ నని సమాధానము చెప్ప గలవా రెందఱు? అయినను వారు పరస్పరము పోరాడుకొనుచునే

యున్నారు! ఒకప్పుడు భారతదేశములో వివిధమతశాఖల ప్రతినిధులు సమావేశమై వాదులాడుకొనసాగిరి. శివు డొక్కడే దేవు డని ఒకడు చెప్పెను; విష్ణు వొక్కడే దేవు డని మఱొకడు చెప్పెను. ఇటులనే ఒక్కొక్కరు ఒక్కొక్కని దేవు డనిరి. ఈ వివాదముల కంతు లేకపోయెను. ఒకజ్ఞాని ఆ దారిని పోవు చుండెను. వివాదమును పరిష్కరింపవలసినదిగా వారతని నాహ్వానించిరి. శివుడే పరాత్పరు డని వాదించినవాని నతడు, "నీవు శివుని చూచితివా? నీకతని పరిచయ మున్నదా? లేనిచో అతడే పరాత్పరు డని నీకెట్లు తెలియును?" అని ప్రశ్నించెను. పిమ్మట ఆ జ్ఞాని విష్ణుభక్తునివైపుతిరిగి, "నీవు విష్ణువును చూచితివా?" అని యడిగెను. వారినందఱిని ఈ ప్రశ్న అడిగి వారిలో నెవ్వరికిని దేవునిగుఱించి యేమియు తెలియ దని గ్రహించెను. తెలియదు కనుకనే వాదులాడుకొనుచుండిరి. వారికి నిజముగా తెలిసియున్నచో వాదులాడుకొనెడివారు కారు. కడవను నీటితో నింపుచున్నప్పుడు చప్పు డగును. కడవ నిండిన తరువాత చప్పు డుండదు. అదే విధముగా వివిధమతశాఖలవారి యీ వాదులాటలును, పోరాటములునే వారికి మతమును గుఱించి యేమియు తెలియ దని స్పష్టముచేయుచున్నది. వారికి మతము అనగా పుస్తకములలో వ్రాసిపెట్టదగిన వ్యర్థప్రలాపములు. దొరకిన ప్రతిపుస్తకము నుండియు సంగతులు దొంగిలించి, ఎట్టి కృతజ్ఞతయు చూపకే ప్రతివాడును గ్రంథము వ్రాయుట కుఱవడించును, ఆ గ్రంథమును వీలైనంత పెద్దదిగా చేయజూచును. తరువాత ఆ గ్రంథకర్త తన పుస్తకమును లోకములోనికి వదలి అంతకు ముందున్న అశాంతికి మఱికొంత అశాంతిని చేర్చును.

జనులలో అత్యధికసంఖ్యాకులు నాస్తికులు. ఆధునికాలములో పాశ్చాత్యప్రపంచములో మఱొకవర్గపు నాస్తికులు ఏర్పడియున్నందులకు నాకు సంతోషము, నే జెప్ప నెంచినది అనాత్మ

వాదులను. వారు ఋజుత్వముగల నాస్తికులు, వారు ఆస్తికుల మని చెప్పకొను నాస్తికులకంటె మేలే. వీరు దాంభికులు; 'మతము' 'మతము' అని వీరు వాదులాడుచుందురు, పోరాడు చుందురు. కాని, వీరికి అందు అక్కఱ లేదు. దాని నర్థముచేసి కొనుటకు నీ రెప్పుడును ప్రయత్నింపరు, సాక్షాత్కరించుకొనుటకు ప్రయత్నింపరు. క్రైస్తు సూక్తులను స్మరింపుడు: "అడుగుము, నీ కీయబడును; అన్వేషింపుము, నీవు కనుగొందువు; తట్టుము, తెఱవబడును." ఈ మాటలు అలంకారములు కావు, అసత్యములు కావు. ప్రతి అక్షరము నిజము, అవి మనలోకమునం దవతరించిన ఈశ్వరపుత్రులలో అందఱికంటె మహోన్నతుడైన వాని హృద్రక్తపరీవాహమే. మీరును నేనును ఈభవనమును చూచుచున్నంతకంటె నూఱంత లెక్కువ గాఢముగ దేవుని స్వయముగ తాకి అనుభవించి, దేవునితో మాటాడి, దేవునితో వసించిన వాని సాక్షాత్కారానుభవమునుండి పుట్టిన వాక్కు లవి, దేవుడు ఎవరికి కావలెను? ఇదియే అసలు ప్రశ్న. లోకములోని జను లందఱు దేవుని కోరుచు, అతనిని పొందలేకపోవుచున్నా రని నీ యభిప్రాయమా? కోరియు పడయలేకపోవుట పొసగదు. కోర బడు వస్తువు వెలుపలిజగమున లేకున్నచో, ఏ కోరిక ఉండును? మానవుడు గాలి పీల్చ కోరును; వెలుపల గాలి సిద్ధముగానున్నది. మానవుడు భుజింపగోరును; తినుట కాహార మున్నది. ఈకోర్కె లను కలిగించున దేది? వెలుపల నున్న వస్తువులే. వెలుతురు చేతనే చూపు కలుగుచున్నది. శబ్దముచేతనే శ్రవణముగలుగు చున్నది. మానవులలోగల ప్రతివాంఛను బాహ్యమునం దంతకు ముందే యున్న వస్తువులు కలుగజేసిన వన్నమాట. పరిపూర్ణత కావలె నను కోర్కె, ప్రకృతి నతిక్రమింప వలె నను కోర్కె, లక్ష్యము నధిగమింపవలె నను కోర్కె,—ఈ కోర్కెను ఏదియో పుట్టించి, మానవుని ఆత్మకు పట్టించి దాని నచట ఉంచినది, లేకున్న అది అట నెట్లు కల్గినది? కనుక ఎవనియం దీ తృష్ణ లేప

బడినదో అతడు లక్ష్యమును చేరుకొనును. కాని, మనము దేవుని తప్ప తక్కిన సర్వమును కాంక్షింతుము. నీ చుట్టును నీవు కను చున్నది పారమార్థికపరత కాదు. నేనుండు ఇంటియజమానురాలికి కూటము నిండుగ, ప్రపంచమున అన్నిప్రాంతములనుండియు తెప్పించుకొన్న కుర్చీలు, బల్లలు మొదలయిన సామానులు గలవు. జపాన్ వస్తువులు కొనుట నేటినాగరకలక్షణము; కనుక ఆమె ఒక జపానుపాత్రను కొని గదిలో నుంచును. ప్రజలలో అత్యధిక సంఖ్యాకుల పారమార్థిక పరత ఇంతమాత్రపుదే; అన్నిరకాల భోగవస్తువులును వారి కున్నవి. కాని దానికి కొంత (పారమార్థిక) రుచిని కూర్పనిదే, జీవితము బాగుండదు, ఏల యన సంఘు మాక్షే పించును. అది యుండవలె నని సంఘు మాశించును; కనుక వారిలో పారమార్థికపరతకూడ కొంత అగపడవలె. లోకములో నిప్పు డున్న పారమార్థికపరత్వపు స్థితి ఇది.

ఒక శిష్యుడు తనగురువుదగ్గఱకు పోయి, "గురుదేవా, నాకు భగవత్సాక్షాత్కారానుభవము కావలె" అని చెప్పెను. గురువు ఆయువకునివైపు చూచెను, ఏమియు మాటాడలేదు, మందహాసము చేసెను. యువకు డనుదినము వచ్చుచు తనకు భగవత్సాక్షాత్కారము కావలె నని చెప్పుచుండెను. యువకునకు తెలిసినంతకంటె ఎక్కువ తెలిసినవాడు కదా వృద్ధుడు. ఒకనాటి మిడిమిడి యెండవేళ గురువు తనతో నదికి స్నానమునకు ర మ్మని శిష్యుని పిలిచెను. యువకుడు నీటిలో మునుక వేసెను. వృద్ధు డతని వెంబడినే పోయి అతనిని నీటిలో బలముగా నదిమిపెట్టెను. యువకుడు కొంతసేపు గిలగిల తన్నుకొన్న తరువాత గురువు విడిచి పెట్టెను. తరువాత, "నీటిలో నున్నప్పుడు నీ కన్నిటికంటెఎక్కువ జరూరుగ నుండిన దేది?" అని యతడు శిష్యునడిగెను. "పీల్చుటకు గాలి" అని శిష్యుడు చెప్పెను. "భగవంతునికొఱకు నీకంతటి ఆత్రము ఉన్నదా? ఉన్నచో నీ వతనిని ఈక్షణమే దర్శింప

గలవు'' అని గురువు చెప్పెను. అంతటి తృష్ణ, తహతహ ఉన్న గాని కేవలము మేధాశక్తితోను, గ్రంథములతోను, ఆచారవిధానములతోను ఎంత శ్రమపడినను సాక్షాత్కారానుభవము నీకు కలుగదు. నీలో ఆతృష్ణ మేలుకాంచువఱకు నీవు నాస్తికునకంటె మేలైనవాడవు కావు; నాస్తికునకు ఋజుత్వమైనను ఉన్నది; నీకు అదియు లేదు.

ఒక మహాజ్ఞాని ఇట్లు చెప్పుచుండెడివాడు : ''గదిలో దొంగ ఉన్నాడనియు, ప్రక్కగదిలో పెద్ద సువర్ణరాసి ఉన్న సంగతి అతనికి తెలిసెననియు రెండుగదులకును మధ్య అడ్డుగానున్న గోడ పలుచనిదనియు—అనుకొనుము. ఆచోరుని పరిస్థితి ఎట్లుండును? నిద్ర పట్టదు. అన్నము తినలేడు. ఏమియు చేయలేడు. ఆసువర్ణరాసి నపహరించుటయందే అతని మనస్సు పూర్తిగ వ్యగ్రమై యుండును. సౌఖ్యనిధి ఆనందనిధానము, తేజఃఖని (=భగవంతుడు) అందుబాటులో నున్నాడను నమ్మకము జనులందఱకు నిజముగా నున్నచో వారు భగవంతుని పొందుటకు ప్రయత్నింపక యిప్పుడు వ్యవహరించుచున్నట్లే వ్యవహరింతురనుకొంటివా?'' భగవంతుడున్నాడను విశ్వాసము మానవునకు కలుగుటతోడనే అతనిని పొందవలెనన్న కాంక్షతో ఇతనికి పిచ్చెత్తిపోవును. ఇతరులు వారి దారిని వారు పోవచ్చుగాక. కాని, యిక్కడ తాను గడపుచున్న జీవితమునకంటె మహోన్నతమగు జీవితము కలదన్న నమ్మకము మానవునకు కల్గిన తత్క్షణమే, ఇంద్రియములే సర్వస్వము కాదనియు, నిత్యమును అమరమును అనశ్వరమునగు ఆత్మానందముతో పోల్చిచూడగా పరిచ్ఛిన్నమగు ఈభౌతికదేహము లెక్కలోనిది కాదనియు గట్టి నమ్మకము మానవునకు కలిగిన తత్క్షణమే, ఆయానందమును తనకు సంపాదించుకొనువఱకు నతనికి పిచ్చెత్తిపోవును. ఈపిచ్చియే, ఈతృష్ణయే, ఈవెఱ్ఱియే పారమార్థికజగత్తులో నిద్రలేచుట

(ప్రబోధము) అనబడును. అది కలిగినప్పుడు మానవునిలో పారమార్థికపరత ప్రారంభ మగుచున్న దన్న మాట. కాని ఇందుకు చాల కాలము పట్టును. ఆచారములు, కర్మకలాపములు, ఈప్రార్థనలు, యాత్రలు, ఈ గ్రంథములు, గంటలు దీపములు, పురోహితులు అందుకు సన్నాహమే. ఇవి ఆత్మమాలిన్యమును క్షాళనము చేయును. ఆత్మ నిర్మల మయినప్పుడు సహజముగానే అది నైర్మల్య ఖని యయిన భగవంతునే చేరుకొనఁ గోరును. ఇనుపతునుక శతాబ్దములుగా మట్టిలోఁ పూడుకొనియున్నందున చెంతనేయున్న అయస్కాంతముచేత అది ఆకర్షింపబడక పోవచ్చును. కాని మట్టిని కడిగివేసిన వెంటనే అది అయస్కాంతము చేత ఆకర్షింపబడును ; అదే విధముగా యుగయుగములుగా దుమ్ముతో, మాలిన్యముతో, క్రౌర్యముతో, పాపములతో ఆవరింపబడిన మానవాత్మ అనేకజన్మల తరువాత ఆచారనిష్ఠచేతను, కర్మకలాపములచేతను, పరోపకారములచేతను, పరులను ప్రేమించుటచేతను విశుద్ధి చెందును. అప్పుడు దానికి స్వతస్సిద్ధమగు ఆధ్యాత్మికాకర్షణ కలుగును. అది మేలుకాంచి ఈశ్వరునివంకకు దారి చేసికొనుచు పోవును.

ఈ ఆచారములు, సంకేతములు అన్నియు కేవలము ప్రారంభదశవి. నిజమైన భగవత్ప్రేమ కాదు. ప్రేమ ప్రేమ అను పలుకు లెల్లెడ మనకు వినవగుచుండును. ప్రతివారును, "దేవుని ప్రేమింపుడు" అనుచుందురు. ప్రేమ అనగా నేమో మానవులకు తెలియదు. తెలిసినచో అంత తేలికగా మాటాడరు. ప్రతి పురుషుడును తాను ప్రేమింప గల నని చెప్పును. తనప్రకృతియందు ప్రేమ లే దని తెలిసికొనుట కతని కెంతో కాలము పట్టదు. ప్రతి స్త్రీయును తాను ప్రేమింప గల నని చెప్పును. తన కది సాధ్యము కాని పని యని త్వరలోనే తెలిసికొనును. ప్రేమను గుఱించి లోకమంతటను మాటలు వినబడుచున్నవి. కాని, ప్రేమించుట

కష్టము. ప్రేమ ఎక్కడ ఉన్నది? ప్రేమ ఉన్న దని నీకెట్లు తెలియును? బేరమాడుట ప్రేమకు తెలియనిది. ఇదే ప్రేమకు మొదటి లక్షణము. ఒకడు మఱొకనిని అతనిదగ్గఱనుండి యేదో పొందగోరి ప్రేమించినచో అది ప్రేమయే కాదు; అది వ్యాపారము. క్రయవిక్రయము లున్నచోట అది ప్రేమ కాదు. కనుక దేవుని, "ఇది యిమ్ము, అది యిమ్ము" అని ప్రార్థించుట ప్రేమ కాదు. అది ప్రేమ యెట్లగును? నేను నిన్ను ప్రార్థింతును. నీవు నాకు ప్రతిఫలముగా ఏదో యిత్తువు; అదియే జరుగుచున్నది; అదియే వ్యాపారము.

ఒకానొక మహారాజు వేటకు అడవికి పోయెను. అక్కడ అత డొక జ్ఞానిని కలసికొనుట తటస్థించెను. అతనితో కొంచెము సేపు మాట్లాడగానే మిక్కిలి ప్రీతుడై "స్వామీ, నే నర్పించు దానిని కృపతో స్వీకరింపవలసిన" దని ప్రార్థించెను. "స్వీకరింపను. నా పరిస్థితి నాకు సంపూర్ణసంతృప్తికరముగ నున్నది. ఈ చెట్లు నాకు భుజించుటకు చాలినన్ని ఫలము లిచ్చును; ఈ సుందరనిర్మలనిర్ఝరములు నాకు కావలసిన నీటిని అంతటి నొసగును; నేనీ గుహాలలో నిద్రింతును. నీవు చక్రవర్తివి కావచ్చు గాని నీ బహుమతులు నాకేల?" అని యతడు పలికెను. "కేవలము నన్ను పునీతుని చేయుటకు, నన్ను సంతోషపెట్టుటకు, నాతో నగరమునకు విచ్చేసి, ఏదేనొక కానుకను స్వీకరింపుడు" అని చక్రవర్తి బతిమాలెను. చివరకు జ్ఞాని, చక్రవర్తివెంట పోవుట కంగీకరించెను. అతడు రాజప్రాసాదమునకు పిలుచుకొనిపోబడెను. అక్కడ బంగారము, నగలు, చంద్రకాంతశిలలు, మహాద్భుత వస్తువు లనేకములు ఉండినవి. ఐశ్వర్యము, ప్రభావము సర్వత్ర ప్రత్యక్షముగ నుండెను. చక్రవర్తి తాను ప్రార్థనచేసివచ్చువఱ కొకనిమిషము జ్ఞానిని వేచియుండ గోరి, ఒకమూలకు బోయి, "ప్రభూ, నాకు ఇతోధికముగ ఐశ్వర్య మిమ్ము, ఇంతకంటె

ఎక్కువగ సంతాన మిమ్ము, ఇంకను అధికముగ రాజ్య మిమ్ము'' అని ప్రార్థన చేయ సాగెను. ఇంతలో జ్ఞాని లేచి పోదొడగెను. జ్ఞాని పోవుచుండుటను చూచి చక్రవర్తి అతనివెంటబడి, "నిల్వుడీ స్వామీ, నా బహుమతిని స్వీకరింపలేదే, పోవుచున్నారే!'' అనెను. జ్ఞాని రారాజువైపు తిరిగి, "ఓయి బిచ్చగాడా, నేను బిచ్చగాండ్రను యాచింపను. నీవేమి యీయ గలవు? నీవే యింత తడవు యాచించుచుంటివే'' అనెను. ప్రేమ భాష ఇది కాదు. ఇది యిమ్మని, అది యిమ్మని నీవు దేవుని యాచించినచో ప్రేమకును, వ్యాపారమునకును భేద మేమి? బేరమాడకుండుటే ప్రేమకు మొదటి లక్షణము. ప్రేమ సర్వదా యిచ్చునదియే కాని పుచ్చుకొనునది కాదు. ఈశ్వరపుత్రు డిట్లనును: దేవుడు కోరినచో నా సర్వస్వ మతని కిచ్చివేయుదును. నేను మాత్ర మతని నేమియు కోరను. ఈ విశ్వములో నేదియు నాకక్కఱ లేదు. అతనిని ప్రేమించుట నాకిష్టము. కనుకనే ప్రేమింతును. ప్రేమకు ప్రతిఫలముగా నే నేమియు ఆశింపను. దేవుడు సర్వశక్తి యగునా కాదా అనుట ఎవరికి లక్ష్యము? శక్తి నిమ్మని గాని, శక్తిని చూపు మని గాని దేవుని నే నడుగను. అతడు ప్రేమనాథు డగు దేవుడు. నా కది చాలు. వేఱు ప్రశ్నలు నేను అడుగ బోను.''

నిర్భయత్వము ప్రేమ రెండవలక్షణము. దేవుడు మేఘముల కావల కూర్చుండి, ఒకచేతితో బహుమతు లిచ్చుచు, మఱొక చేతితో శిక్షలు విధించుచుండు వా డని భావించుచున్నంత కాలము ప్రేమ కవకాశము లేదు. నీవు భయపెట్టి ప్రేమింప జేయగలవా? గొఱ్ఱెపిల్ల సింహమును ప్రేమించునా? ఎలుక పిల్లిని ప్రేమించునా? బానిస తనదొరను ప్రేమించునా? బానిస లొక్కొక్కప్పుడు ప్రేమ నభినయింతురు. కాని అది ప్రేమ యగునా? ఎప్పుడుగాని భయమునందు ప్రేమ నెచ్చట కందువు? అది బూటకము. ప్రేమతో భయ మెన్నడును చేరదు. వీథిలో నొక

యువమాత ఉన్న దనుకొనుము : కుక్క మొఱిగినయెడల ఆమె దగ్గఱగా నున్న యింటిలోనికి పాఱిపోవును. మఱునా డామె తన బిడ్డ నెత్తుకొని వీథిలో నున్న దనుకొనుము. సింహము బిడ్డపై కుఱికినచో ఆమె ఎచ్చట నుండును ? సింహమునోటి కడ్డముగ నిల్చి బిడ్డను కాపాడుచుండును. సమస్తభయమును ప్రేమ జయించినది. భగవంతునియందలి ప్రేమ విషయముకూడ నంతే. దేవుడు బహూకరించుచున్నాడా, దండించుచున్నాడా అనుట ఎవరికి లక్ష్యము ? ఆ తలంపు ప్రేమించువాని కుండదు. స్వగృహమునకు వచ్చినప్పటి న్యాయమూర్తినిగూర్చి యోచింపుడు. భార్యకత డేలాగు కనిపించును ? న్యాయమూర్తిగా కాదు, బహుమతిప్రదాతగా కాదు, దండనాధికారిగా కాదు; పెనిమిటిగా, ప్రియుడుగా కనిపించును. తనబిడ్డల కత డేలాగు కనిపించును ? తమ్ము ప్రేమించెడి తమ తండ్రిగా కనిపించునే కాని దండనాధికారిగా కనిపింపడు, బహుమతిప్రదాతగా కనిపింపడు. అట్లే దేవుడు తన బిడ్డలకు శిక్షకుడుగా ప్రతిఫలప్రదాతగా ఎన్నడును అగపడడు. ప్రేమ నెన్నడును చవిచూడనివారికే భయమును, కంపమును గల్గును. సకలవిధములయిన భయమును పరిత్యజింపుడు—దేవుడు దండనాధికారి, ప్రతిఫలప్రదాత అనెడి భయంకరాశయముల కొకవిలువ అనాగరకుల చిత్తములం దుండ వచ్చు. కొందఱు మానవులు వరిష్ఠధీమంతులయ్యు ఆధ్యాత్మికముగా ఆటవికులుగనే ఉందురు. అట్టి వారి కా భావము లోకవేళ తోడ్పడవచ్చునేమో. పారమార్థికపరులగు వారికి, పారమార్థికపరతను సమీపించుచున్న వారికి, పారమార్థికపరిజ్ఞానము మేలుకొంచుచున్న వారికి మాత్ర మా భావములు కేవలము పసితనపు ఊహలుగ, మూఢభావములుగ తోచును. వారు భయాశయములను నెట్టి వేయుదురు.

ప్రేమకు గల మూడవ లక్షణము ఇంకను పైమెట్టుది. ప్రేమ సదా పరమోన్నతాదర్శము. మొదటి రెండుదశలగుండ

అతిక్రమించిపోయినపిదప, బేరమాడు చిత్తవృత్తిని, భయప్రవృత్తిని పరిత్యజించినపిమ్మట ప్రేమ పరమోన్నతలక్ష్య మని గ్రహింప నారంభించును. రూపవతియగు యువతి కురూపియగు యువకుని ప్రేమించుట లోకములో ఎన్నిపర్యాయములు మనము కనుట లేదు! సుందరపురుషుడు విరూపిణియగు స్త్రీని ప్రేమించుట మన మెన్నిపర్యాయములు కనుట లేదు! ఏమి యీ ఆకర్షణము! ప్రేక్షకులకు కనబడునది కురూపియగు పురుషుడును, విరూపిణియగు స్త్రీయునే. కాముకులకు కనిపించినది వారు కాదు; ప్రేమించువారి దృష్టికి ప్రేమింపబడువారిలో లోకాతీతసౌందర్యము కానవచ్చుచుండును. ఇ దెట్లు? కురూపియగు పురుషుని ప్రేమించు స్త్రీ తన మనస్సుననున్న ఆదర్శసౌందర్యమును కొని, దానిని కురూపియగు పురుషునిమీదికి చాచును; ఆమె పూజించునదియు ప్రేమించునదియు తన ఆదర్శమునే గాని కురూపియగు పురుషుని కాదు. ఇంతకును అతని రూపము కేవల మొక సూచన. దాని మీదికి ఆమె తన లక్ష్యమును విసరి, దానిని కప్పును; అది ఆమె కారాధ్యవస్తు వగును. మనము ప్రేమించు ప్రతిచోటను ఇది అన్వయించును. మనలో అనేకుల అక్కచెల్లెండ్రును అన్నదమ్ములును చాల సామాన్యరూపముగలవారే. కాని మన అన్నదమ్ములు మన అక్కచెల్లెండ్రు అను ఆశయమే వారిని మన కంటికి అందగింప చేయును.

ఇందు ఇమిడి యున్న తత్త్వరహస్య మిది: ప్రతియొక్కడును తన లక్ష్యమునే వెలికి నిగిడించి, దానినే పూజించు ననుట. బాహ్యజగము కేవల మొక సూచకజగమే. మనము చూచున దంతయు మన మనస్సులలోనుండి మనము వెలికి చాచుకొన్న వే. ఇసుకరేణు వొకటి గుల్లచేపలోనికి కొట్టుకొనిపోయి, చీకాకు కలిగించును. ఈ చీకాకువలన చేపయందు స్రావము పుట్టును. అది యిసుకరేణువును కప్పివేయును. తరువాత అందమైన

అణిముత్యే మేర్పడును. ఈ విధముగా బాహ్యావస్తువులు మనకు సూచనల నొసగును. వానిమీదికి మనము మన ఆదర్శముల చాపుదుము, మనవస్తువులను రూపొందించుకొందుము. ఈలోకము దుష్టులకు కేవల మొక నరకముగా కననగును. సజ్జనులకు కేవలము స్వర్గముగా అగపడును. ప్రేమించువారి కీ జగత్తు ప్రేమపూర్ణముగ కనిపించును; ద్వేషించువారి కీ జగము ద్వేషపూర్ణముగా కనిపించును. కలహప్రవృత్తిగలవారికి కలహము తప్ప మఱొకటి కనిపింపదు. శాంతిప్రియులకు శాంతి తప్ప మఱేమియు కానరాదు. పరిపూర్ణునకిచట భగవంతుడు దక్క మఱేమియు కనబడదు. కనుక మనము సర్వదా మన పరమోన్నతాదర్శమునే ఉపాసింతుము. ఆదర్శము నాదర్శముగ ప్రేమించు స్థాయిని మన మందుకొన్నప్పుడు సకలసందేహములును, వాదములును శాశ్వతముగా పటాపంచలయిపోగలవు. దేవుని నిరూపించుటకు పీలున్నదా లేదా అనెడి విషయ మెవరికి కావలె? ఆదర్శ మెప్పటికిని పోజాలదు. ఏల యన ఆదర్శము మనప్రకృతిలో భాగమే. నా యునికిని సందేహించినప్పుడే నా ఆదర్శమును సందేహింతును. నా యునికిని శంకింప జాలను కనుక నా ఆదర్శమును శంకింప జాలను. భగవానుడు ఏకకాలమందే సర్వశక్తిగను, సర్వకృపాళువుగను ఉండుట శక్యమగునా కాదా అను విషయ మెవరికి పట్టినది? మానవతతికి ప్రతిఫలమును ప్రసాదించునది దేవుడేనా, మనపైని దేవునిచూపు దయాసంపన్నుడగు ప్రభునిచూపా, క్రూరప్రభుని చూపా—అను విషయ మెవరికి కావలె?

కాముకుడు ఈయన్నిటిని దాటినాడు. బహుమతులు, శిక్షలు, భయములు, సందేహములు, వైజ్ఞానికనిరూపణలు, తదితర నిరూపణలు ___ వీని కతీతు డతడు. ప్రేమాదర్శ మతనికి చాలు. విశ్వ మీ ప్రేమావిష్కృతియే అన్న విషయము తనంతట తేటతెల్లమయినది కదా! సూక్ష్మాణువును సూక్ష్మాణువును,

స్థూలాణువును స్థూలాణువును, కలుపున దేది? గ్రహముల నొం డొకదానివంక కురవడింపచేయుచున్న దేది? మానవునివంకకు మానవుని, స్త్రీవంకకు పురుషుని, పురుషునివంకకు స్త్రీని జంతువులలో ఒకదానివంక కొకదానిని ఆకర్షింపచేయు న్న దేది? ఈ విశ్వ మంతటిని ఒక్క కేంద్రమువంక కాకర్షించుచున్న దేది? అదే ప్రేమ యనబడునది. అది పరమాణువునుండి బ్రహ్మ వఱకు అన్నింటిలోను వ్యక్తమైయున్నది. ఈప్రేమ సర్వశక్తిమంత మయినది, సర్వోపగతమయినది. వ్యష్టియందును, విశ్వమందును, చేతనమందును, అచేతనమందును ఆకర్షణరూపమున వ్యక్తమగు చున్నది భగవానుని ప్రేమే. విశ్వమునం దున్న ఏకైకమైన ఇచ్ఛాశక్తి అదే. ఆప్రేమప్రేరణచేతనే క్రైస్తు మానవకోటికై తన ప్రాణ మర్పించెను. బుద్ధభగవానుడో తిర్యగ్జంతువుకై సైతము జీవితముధారవోసెను; బిడ్డకై తల్లియు, భార్యకై భర్తయు చేయు త్యాగమును పురికొల్పునదియు ఆప్రేమే. ఆప్రేమమహిమవలననే జనులు తమదేశముకై ప్రాణము లర్పింప సిద్ధపడుచున్నారు. ఇంకను విచిత్రమయిన విషయ మేమన, ప్రేమమహిమవలననే చోరుడు చౌర్యము చేయుచున్నాడు; హంతకుడు హత్య చేయుచున్నాడు. వీనిలో సైతము ప్రేరక మదే. అది వ్యక్తమగుతీరు మాత్రమే వేఱు. విశ్వమందున్న యేకైకప్రేరకశక్తి అదే. దొంగకు బంగారమందు ప్రేమ; ప్రేమ అందు గలదు. అది యపసవ్య మార్గము పట్టుచున్నది. సకలదుష్కార్యములకును, సకల సత్కార్యములకును వెనుక నున్నది, నిత్యప్రేమ. ఒకడు న్యూయార్కులోని పేదసాదల సాహాయ్యార్థము వేయిడాలర్లకు చెక్కు వ్రాసి యిచ్చు ననుకొందము. అదే సమయమున ఆగదిలోనే మఱొకడు మిత్రునిపేర దొంగసంతకముచేసె ననుకొందము. ఇరువురు వ్రాసినదియు ఒక్క దీపపువెలుగుననే. ఆవెలుతురును ఎవరు వినియోగించుకొన్నతీరుకు వారు బాధ్యులు. ప్రస్తుతింపవలసినదిగాని, దూషింపవలసినది గాని వెలుతురునుకాదు. దేనియందును

సంగము లేక సమస్తములోను ప్రకాశించుచున్నది, ప్రేమ. అదియే విశ్వమందలి ప్రేరకశక్తి. అదియే లేకున్న, విశ్వమంతయు క్షణ మాత్రములో తుత్తునియ లయిపోవును. ఈప్రేమయే భగవానుడు.

"ప్రేయసీ, భర్తకొఱకే భర్త నెవ్వతెయు ప్రేమింపదు. భర్తయందున్న ఆత్మకొఱకే భర్తను ప్రేమించును; ఓ ప్రియా, భార్యకొఱకే భార్య నెవడును ఎప్పుడును ప్రేమింపడు. భార్యయం దున్న ఆత్మకొఱకే భార్యను ప్రేమించును. ఆత్మకొఱకు కాక మఱిదేనికొఱకుగాని దేనిని ఎవ్వరును ప్రేమింపరు." అంతగా ఖండింపబడు ఈ స్వార్థపరత్వము సైతము ఆప్రేమావిష్కారమే. ఈలీలకు తటస్థుడవుగా నుండుము. దానిలో కలసిపోక యద్భుత మయిన ఈసర్వాదిగ్దర్శకచిత్రమును, రంగముతరువాత రంగముగా సాగుచున్న ఈ మహత్తరనాటకమును, ఈయద్భుతస్వరమేళనము నాలకింపుము; అన్నియు ఒక్కప్రేమ దాల్చురూపములే. స్వార్థ పరత్వమందుసహితము ఆయాత్మ యనేకమై అంతకంతకు వృద్ధి పొందును. ఒక్క ఆత్మ, ఒక్కపురుషుడు వివాహితుడయిన తరు వాత ఇద్దఱు అగును, బిడ్డలు పుట్టినప్పుడు పెక్కండ్రు అగును. యావత్ప్రపంచము, అఖిలవిశ్వము తానే అన్న యనుభవము కలుగువఱకు అతడు వృద్ధిపొందుచుండును. విశ్వప్రేమపుంజముగా, అనంతప్రేమగా భగవత్స్వరూపమగు ప్రేమగా అతడు విరివి చెందును.

మన మీ విధముగా పరాభక్తిదశకు వత్తుము. ఈదశలో రూపములు, సంకేతములు రాలి పోవును. ఈస్థితిని చేరుకొన్న వాడు ఏ ఒక్క శాఖకును చెందడు. అన్నిశాఖలును అతనిలో ఇముడును, అతడు దేనికి చెంద గలడు? అన్నిగుడులును ఆలయ ములును అతనియందే యున్నవి. అతనిని ఇముడ్చుకోగలంత పెద్ద 'చర్చ్' ఎక్కడ ఉన్నది? అట్టివా డేవో కొన్ని పరిమితరూపము లకు కట్టుపడజాలడు. అనంతమగు ప్రేమతో అత డైక్యమొంది

నాడు. ఆ ప్రేమకు అంతు ఏదీ? ప్రేమాదర్శమును అవలంబించిన ప్రతిమతమునందును దానిని వ్యక్తము చేయుటకై సాగు పెనగు లాట మనకు కనవచ్చును. ఈ ప్రేమ కర్థము మనకు తెలియును. అనురాగములతో, ఆకర్షణలతో కూడిన ఈ ప్రపంచములోని ప్రతివస్తువు ఆయనంతప్రేమ దాల్చురూపమే. దానిని వ్యక్తము చేయుటకు వివిధ దేశములకు చెందిన జ్ఞానులు, యోగులు ప్రయత్నించిరి. అయినను క్షుద్రములయిన యింద్రియవాంఛారూపములను సహితము దివ్యప్రేమగా రూపించి చిత్రించుటకు భాషకు గల సర్వశక్తులను వారు వినియోగించుచుండుట మనము కాంతుము.

హీబ్రూ రాజయోగి ఈ విధముగా కీర్తించెను. భారతీయులు ఈ తీరుగానే కీర్తించిరి: "ఓ ప్రియా, అధరాస్వాదము, నొక్కసారి ప్రసాదింపుమా! నీ వొక్కసారి ముద్దుపెట్టుకొంటివా, నీకొఱకైన తృష్ణ నిరంతరముగ వృద్ధిపొందును! సమస్తదుఃఖము లంతరించును. భూతవర్తమానభవిష్యత్తుల మఱపు కలుగును. నిన్ను గుఱించిన ధ్యానమే కలుగును." కోర్కెలన్నియు నశించిన తరువాత ప్రియునకు పట్టుపిచ్చి యట్టిది. "మోక్ష మెవరికి కావలె? రక్షింపబడుట కాత్రపడు వా రెవ్వరు? పరిపూర్ణత్వము పొందుటమాత్ర మెవరికి లక్ష్యము? విమోచన కోరువా రెవ్వరు?" అని ప్రియు డనును. "నాకు వసునిచయ మక్కఱ లేదు. ఆరోగ్యమైనను నా కవసరము లేదు. నాకు సౌందర్య మవసరము లేదు. నాకు మతివిభవమక్కఱ లేదు: లోకములోని సకలపాపములకును మధ్య నన్ను మరల మరల జన్మింప నిమ్ము; అయ్యో 'కష్టమే' అనను కాని, నిన్ను ప్రేమింప నిమ్ము. ప్రేమకొఱకే ప్రేమింప నిమ్ము".

ఈకీర్తనలలో వ్యక్తమగు ప్రేమోన్మాద మది. మానవ ప్రేమలలో అత్యుదాత్తమైనది అత్యంతప్రకాశమైనది, బలిష్ఠమైనది అత్యాకర్షకమైనది మగువకును మగవానికిని నడిమిప్రేమ.

కనుక గభీరతమమగు భక్తిని ప్రకటించుటకు ఆ భాష వ్యవహరింప బడినది. మానవప్రేమయందున్న ఈ యున్మాదము భక్తయోగుల ప్రేమోన్మాదపు టస్పష్టతమమైన ప్రతిఫలనమే. నిజమైన ఈశ్వర భక్తు లున్మాదము పొంద గోరుదురు; ఈశ్వరప్రేమచే మత్తైక్క నభిలషింతురు; దైవోన్మత్తులు కాగోరుదురు. వారు ప్రతిమతము నకు చెందిన జ్ఞానులును, యోగులును పాత్రలనిండుగ తయారు చేసిన ప్రేమను సేవింపగోరుదురు. ఆ పాత్రలో జ్ఞానులును, యోగులును తమహృదయసారమును పోసిరి. దానిలో ప్రతిఫల మాశింపక ప్రేమకొఱకే ఈశ్వరుని ప్రేమించిన భక్తుల ఆశలు కేంద్రీకరింపబడియున్నవి. ప్రేమకు ప్రతిఫలము ప్రేమయే. ఎటువంటి ప్రతిఫల మది! అ దొక్కటే సమస్తదుఃఖములను బాపునది. ఆప్రేమపానము చేయుటచేతనే భవరోగములు మాయ మగును. మానవుడు దైవోన్మత్తుడై తాను మానవుడనన్న విషయము మఱచిపోవును.

కట్టకడపట వివిధవిధానములు పరిపూర్ణైక్యము అను ఒక్క కేంద్రమువంకకే సాగును. ప్రారంభమున మనము సర్వదా ద్వైతులుగానే ఉందుము. దేవుడు వేఱు తత్త్వము. నేను వేఱు తత్త్వము. ఇరువురికి మధ్య ప్రేమ ప్రకాశించును. అంతట మానవుడు దేవుని సమీపింప నారంభించును. దేవుడును మానవుని సమీపింప ప్రారంభించినట్లుండును. మానవుడు తండ్రిగా, తల్లిగా, మిత్రుడుగా, ప్రియుడుగా, జీవితములోని వివిధబాంధవ్యములను అవలంబించును. కట్టకడపటి దశలో అతడు ఉపాస్యవస్తువుతో ఒక్కటి యగును. "నేను నీవే, నీవు నేనే; నిన్ను ఉపాసించుట మూలమున నన్ను నేనుపాసించుకొనుచున్నాను. నన్ను నేను ఉపాసించుకొనుటలో నిన్ను నేను ఉపాసించుచున్నాను." మాన వుడు దేనితో ప్రారంభించునో దానిపరమావధి అందు జూతుము. ప్రారంభమున అది తనకొఱకు ప్రేమ తన పరిమితవ్యక్తిత్వము

కొఱకే యగుటచేత ప్రేమ స్వార్థపరమైనది; కడపటిదశలో నిండు వెలుగు ఆవిష్కారమైనది. అప్పుడు ఆత్మ అనంత మైనది. ప్రారంభమున దేవు డెక్కడో ఒకవ్యక్తిగా నున్నాడు. అత డిప్పు డనంతప్రేమ అయినాడు. మానవుడు కూడ రూపాంతర మొందినాడు. అతడు దేవుని సమీపించుచున్నాడు. ఇదివఱకు తనలో పుష్కలముగా గల నిరర్థకవాంఛ లన్నిటిని అతడు విసర్జించుచున్నాడు. కోర్కెలు పోగా వానితోపాటు స్వార్థచింతయు మటుమాయమైనది. కొట్టకొనన ప్రేమకును ప్రేమప్రభవమునకును ప్రేమలక్ష్యమునకును గల ఐక్య మతనికి ప్రత్యక్షమైనది.



# మూర్తిపూజ

(శాన్‌ఫ్రాన్సిస్కోలో 1900 వ సంవత్సరము ఏప్రిల్ 10 వ తేదీని చేసిన ఉపన్యాసము)

యూదులచరిత్ర, యూదులభావసంపద అంతయు పురోహితులు ప్రవక్తలు అను నిరుతెఱగుల బోధకులచేత సృజింపబడిన దనుట మీలో బైబిలుఅధ్యయనముచేసినవారి కందఱికిని తెలిసిన విషయమే. పురోహితుల శక్తి 'మార్పులను నిరోధించునది'. ప్రవక్తల శక్తి పురోగతిసాధకము. మార్పులను నిరోధించు క్రతుకలాపనిష్ఠ చొచ్చుకొని, అన్నియు ఆచారబంధమున తగుల్కొనును — అనుటే ఉన్న విషయమంతయును; ప్రతి దేశములోను ప్రతిమతములోను ఉన్న నిజ మిదే. తరువాత క్రొత్తక్రొత్త అనుభూతులు పొందిన ద్రష్టలు క్రొత్తగా నవతరింతురు; క్రొత్త ఆదర్శములను, క్రొత్త ఆశయములను బోధించి వారు సంఘమున కపూర్వపురోగతి కల్గింతురు. కొన్ని తరములలోనే అనుచరులకు తమ గురువుల ఆశయములందు విశ్వాసము మితిమీఱి, వారు బోధించిపోయినది దక్క వేఱేమియు గుర్తింపజాలని స్థితికి వత్తురు. ఈ యుగములో మిక్కిలి ముందంజవేయువారుగను, మహోదారులుగను నుండు ఆచార్యులు కొన్నిసంవత్సరములలోనే మార్పునకు మిక్కిలి విముఖులగువారుగ మాఱిపోవుదురు. ముందంజవేయు ఆశయములు గల్గి యుండిన యీ మేధావులు తమవంతువచ్చినప్పుడు తమకంటె కొంచెము ముందుకు పోవువానిని నిరోధింపజూత్తురు. తాము అందుకొన్న మెట్టును దాటి యెవరినిగాని వారు ఆవలకు పోనీయరు. ఉన్నదాని నున్నట్లే ఉంచుట వారికి సంతృప్తికరము.

ప్రతిదేశములోను ప్రతిమతములోను దానినిరూపుదాల్పించు సూత్రములద్వారా ఏశక్తి పనివడునో, ఆశక్తి మతాచారాల రూప

మున వ్యక్తమగుచుండును....సూత్రములు, గ్రంథములు, కొన్ని నియమములు, చలనములు — నిలుచుండుట, కూర్చుండుట, — ఇవన్నియు ఒకతరగతి ఉపాసనావిధానమునకు సంబంధించినవే. జనబాహుళ్యమునకు అందుబాటుకై ఆధ్యాత్మికోపాసనము స్థూల రూపము దాల్చుచుండును. ఏదేశములోగాని అత్యధికసంఖ్యాకులగుజనులు ఆత్మను ఆత్మగా ఉపాసింపగల్గి ఎప్పుడుకాని ఉండరు. ఇంతవఱకట్టిది సాధ్యము కాలేదు. వారట్లుపాసింపగల కాల మొకనాటికి వచ్చునో రాదో నాకు తెలియదు. ఈనగరములో ఎన్నివేలమంది భగవంతుని ఆత్మగా ఉపాసించుటకు సంసిద్ధులయి యున్నారు? మిక్కిలి కొలదిమందియే. వారికి అది శక్యము కాదు; వారు వసించునది ఇంద్రియజగమున. వారికి మీరు సిద్ధపఱుపబడిన ఆశయాలను సరఫరా చేయవలెను. దేహముతో చేయుటకు వీలుగా ఏవో చెప్పుచుండవలె; "ఇరువదిపర్యాయములు లేచినిలబడుడు; ఇరువదిపర్యాయములు కూర్చుండుడు" అనుడు. ఇది వారికర్థము అగును. నాసారంధ్రములలో నొకదాని గుండ పీల్చుకొన్న గాలిని రెండవదానిగుండ విడువు మనుడు. వారికది అర్థ మగును. ఆత్మనుగుఱించిన యీ ఆదర్శవాద మంతయు వారెంతమాత్రము అంగీకరింపజాలరు. అది వారి తప్పు కాదు......భగవంతుని ఆత్మగా ఉపాసింపగలశక్తి మీకున్నచో, మంచిదే! కాని, మీకది సాధ్యము కాకుండిన కాల మొకప్పు డుండెను......జనులు మొరటుగా నున్నచో వారి పారమార్థికాశయములుకూడ మొరటుగానే ఉండును. వారి ఆచారాలు వికారముగాను, మొరటుగాను ఉండును. జనులు నాజూకు, సంస్కృతి గల వారయినచో వారి ఆచారాలు ఎక్కువ సొగసుగా నుండును. ఆచారాలుండవలసినదే. కాని, ఆ ఆచారములు కాలగతి ననుసరించి మాఱుచుండవలె.

ఈ లోకాన స్థాపింపబడిన మతములలో విగ్రహారాధనను ద్వేషించుటలో మహమ్మదీయమతమునకు సాటి మఱొకటి లేదు.

ఇది వింటే......మహమ్మదీయులకు చిత్తరువులు, శిల్పము, సంగీతము పనికిరావు......అది రూపపూజకు దారి తీయును. మత గురువు సదస్యులవంక చూడడు. చూచినచో భేద మేర్పడును. ఈ మతములో భేదభావము లేనే లేదు. అయినను మహమ్మద్ పైగంబరు గతించిన రెండు శతాబ్దములలోపుగానే యోగుల పూజ వెలసినది. ఇట నున్నది, యోగి కాలిగ్రేలు! అట నున్నది సాధువుచర్మము! ఇట్లు సాగుచున్నది. ఏ యే దశలగుండ మనము ముందుకు సాగిపోవలెనో ఆదశలలో విగ్రహారాధనదశ ఒకటి.

కనుక దానిపై కత్తిదూయుటకు బదులు ఆ ఉపాసనలోని శ్రేష్ఠాంశములను గ్రహించి, వాని కాధారములగు సూత్రములను పరిశీలింతము గాక.

పూజావిధానము లన్నిటిలో మిక్కిలి తక్కువస్థాయికి చెందినది చెట్లపూజ, రాళ్లపూజ. సంస్కారము బొత్తిగా లేని ప్రతి మూఢుడు ఏదో వస్తువును తీసికొని, దానికి తనభావము కొంత చేర్చును; అది యతని కుపకరించును. అతడు అస్థిఖండమును పూజింపవచ్చు, రాతిని పూజింపవచ్చు, దేనినైన పూజింపవచ్చు. ఈ మోటు పూజాదశలన్నిటిలో మానవు డెన్నడును చెట్టును చెట్టుగా, రాతిని రాయిగా పూజించుట లేదు. ఈవిషయమును మామూలు బుద్ధిచేతనే తెలిసికొనవచ్చును. మానవులు రాళ్లను, చెట్లను పూజించినా రని విద్వాంసు లొక్కొక్కప్పుడు చెప్పుచుందురు. అదంతయు అర్థములేనిమాట. మానవజాతి కొన్నిదశలగుండ పురోగమించినది. ఆదశలలో చెట్లను పూజించు చుండినదశ యొకటి. నిజమున కేనాడు గాని మానవుని పూజకు గుఱి ఆత్మవస్తువే గాని మఱొక టేదియును కాదు. అత డాత్మ. ఆత్మవస్తువు కాక మఱి ఏదియు ఆతని అనుభవమునకు రాదు. మనస్సు దివ్యము. అది ఆత్మను భౌతికపదార్థముగా పూజించు నంతటి గొప్ప పొరపాటును చేయజాలదు, రాతిని చెట్టునుపూజించు

నప్పుడు మానవుడు రాతిని పరమాత్మగా, చెట్టును పరమాత్మగా భావించెను. ఆపరమపురుషుని యంశ మొకటి చెట్టులోను, రాతిలోను ఉన్న దనియు, రాతిలోను, చెట్టులోను ఆత్మ ఉన్నదనియు అతడు భావించెను.

వృక్షపూజయు, సర్పపూజయు కలిసియే సాగుచుండును. జ్ఞానవృక్షము కలదు కదా. వృక్షము సర్వదా ఉండవలసినదే. చెట్టుతో ఏదో ఒకవిధముగ సంబంధపడి సర్ప మున్నది. ఇవి ప్రాచీనతమపూజావిధానములు. వానిలోనయినను ఏదో ఒక వృక్షమే ఏదో ఒక శిలయే పూజింపబడుచున్నవి. లోకములోని అన్ని చెట్లును, అన్ని రాళ్లును పూజింపబడుట లేదు.

మూర్తి పూజలో ఇంతకంటె పైస్థాయి పూర్వులప్రతిమలను, దేవుని విగ్రహములను పూజించుట. జనులు చనిపోయిన వారి ప్రతిమలను చేయుదురు, దేవుని రూప మిట్లుండు నని తాము భావించిన రీతిగా దేవుని విగ్రహములను చేయుదురు. తరువాత వారా ప్రతిమలను, విగ్రహములను పూజింతురు.

ఇంతకంటె పై మెట్టుపూజ గతించిన యోగులను, సత్పురుషులను, ఉత్తమస్త్రీలను ఆరాధించుట. వారి శరీరావశేషములను జనులు పూజింతురు. శరీరావశేషములలో మహాపురుషుల సాన్నిధ్య మొకవిధముగా ఉన్న దనియు, వారు తమకు సాయపడుదు రనియు జనులు నమ్ముదురు. యోగులయెముకను స్పృశించినమాత్రమున తమవ్యాధులు నయ మగునని నమ్ముదురు. ఎముకయే వ్యాధిని కుదుర్చునని కాదు; అందు సన్నిధి చేసియున్న యోగి కుదుర్చు నని......

ఇవన్నియు అధమస్థాయికి చెందిన పూజలు. కాని. మన మందఱము ఈదశలగుండ పోవలసినవారమే, బుద్ధితో విమర్శించినప్పుడే వాని జఘన్యత గోచరించును. మనహృదయములనుండి వానిని తొలగించుకోలేము. ఒకనియొద్ద

నుండి ప్రతిమలను, యోగులను తీసివేసి, అతనిని దేవాలయము నకు పోకుండ నివారించినను అత డేమో అందఱు దేవుళ్లను భావించుకొనుచునే యుండును. భావించుకొనక తప్పదు. పొడవగు గడ్డముగల్గి మేఘముపై కూర్చున్న వృద్ధుని రూపముననే కాని దేవునిగూర్చి తాను భావింపలేనని ఎనుబదిసంవత్సరముల వృద్ధు డొకడు నాతో ననెను. దానిని బట్టి యేమి తెలియుచున్నది? అతని చదువు పూర్తి కాలేదన్నమాట. బ్రహ్మవిద్యాధ్యయనము జరు గనే లేదు. మానవరూపముననే—కాక మఱేవిధముగాను అతడు దేనినిగాని భావన చేయజాలకున్నాడు.

మూర్తిపూజా విధానములో దీనికంటె ఇంకను పైమె ట్టున్నది—అది సంకేతప్రపంచము. అందును రూపము లున్నవి. కాని అవి చెట్లు కావు; రాళ్లు కావు; ప్రతిమలు కావు; యోగుల శరీరావశేషములు కావు. అవి సంకేతములు. ప్రపంచమంతటను నానావిధములగు సంకేతము లున్నవి. వృత్తము శాశ్వతత్వమును సూచించు గొప్ప సంకేతము......చతురస్ర మొక సంకేతము; సిలువ సంకేత మందఱకును తెలిసినదే; S వలె Z వలె మెలివేసి కొన్న రెండుప్రేళ్ల సంకేత మున్నది.

సంకేతములలో ఏఅర్థమును లే దని కొందఱు భావింతురు. ......మఱికొందఱ కన్నివిధముల మంత్రములును కావలె. వారికి సత్యమును స్పష్టముగా, సరళముగా చెప్పిన వా రంగీకరిం పరు.......మీరు చెప్పునది వారికి ఎంత తక్కువగా బోధపడిన అంత మేలు. మిమ్ము మఱెంత గొప్పవారుగా వారు భావింతురు. మానవప్రకృతి యిది. అన్ని కాలములలోను, ప్రతిదేశములోను అట్టి ఉపాసకులు కొన్నిబొమ్మలను, రూపములను చూచి మోస పోవుచుందురు. రేఖాగణితము శాస్త్రములన్నిటిలో గొప్పది. జనబాహుళ్యమునకు దానిపరిజ్ఞాన మించుకేని లేదు. రేఖాగణిత శాస్త్రజ్ఞుడు చతురస్ర మొకటి గీచి దాని నాలుగు కొసల నభిమం

త్రించు నేని లోకమంతయు తిరుగుడుపడ జొచ్చు ననియు, ఊర్ధ్వ లోకముల ద్వారములు తెఱచుకొను ననియు, దేవుడు దిగివచ్చి, గంతులువేయుచు బంటుగ నగు ననియు—వారు నమ్ముదురు. నే డిట్టి యున్మత్తులు కొల్లలుగా నున్నారు. రాత్రింబవళ్లు వా రీ విషయములనే చదువుచున్నారు. ఇదంతయు నొకవిధమైన వ్యాధి. దీనిని కుదుర్చుట వైద్యుని పనే కాని వేదాంతి పని కాదు.

నేను పరిహాసము లాడుచున్నాను. కాని, ఇది అంత విచారకరమైన విషయమే. ఈ సమస్య భారతదేశములో ఇంత తీవ్రరూపమున కననగుచున్నది. ఇవి జాతిపతనమునకు పారతంత్ర్యమునకు వినాశమునకు లక్షణములు. వీర్యలక్షణము, ప్రాణలక్షణము, ఆశాలక్షణము, ఆరోగ్యలక్షణము, శుభమైనదాని కెల్ల లక్షణము — బలము. దేహ మున్నంతవఱకు, దేహమునకు బల ముండ వలె; మనస్సునకు బల ముండ వలె; చేతికి బల ముండ వలె. ఈ మంత్రతంత్రములమూలమున ఆధ్యాత్మికశక్తి పొందవలె నన్న వాంఛలో భయము, ప్రాణభయము ఇమిడియున్నది. నేను చెప్పనెంచినది ఈ సంకేతములను కాదు.

కాని, సంకేతములలో కొంత నిజ మున్నది, కొంత సత్యమాధారముగా లేక ఏ అసత్యమును ఉండజాలదు. అసలు వస్తువొకటి లేక అనుకరణ ముండుట పొసగదు.

వివిధమతములలో సంకేతముల రూపమున జరుగు పూజావిధాన మున్నది. క్రొత్తవి వీర్యసంపన్నములు, కవితాభావబంధురములు, స్వారస్యసమంచితములు నగు సంకేతము లున్నవి. లక్షోపలక్షల ప్రజలపై సిలువచిహ్నమునకు గల అద్భుతప్రభావమును తలంపుడు. నెలవంకసంకేతమునుగుఱించి ఆలోచింపుడు! ఈసంకేత మొక్క—దాని ఆకర్షణను తలంపుడు! ప్రపంచమంతటను మంచివి, గొప్పవి అగు సంకేతము లున్నవి. అవి ఆత్మతత్త్వమును

స్పష్టపఱచును; మనఃపరిస్థితులను కొన్నిటిని గలిగించును; అవి యద్భుతమగు విశ్వాసబలమును, ప్రేమశక్తిని జనింపజేయుట సాధారణముగా కననగుచుండును.

ప్రాటెస్టెంటుమతమును కాథలిక్ మతమును పోల్చిచూడుడు. నాలుగుశతాబ్దములుగా ఈ రెండు తెగలును ఉన్నవి కదా. యోగులును మతమునకై ప్రాణ మర్పించినవారును ఎక్కువమంది ఏ శాఖలో జన్మించిరి? కాథలిక్కుల కర్మకలాపములు — ధూప దీపములు, స్తోత్రములు, మతాచార్యులు ధరించెడి దుస్తు విశేషములు — వీని కన్నిటికిని ప్రేక్షకులచిత్తముల కెక్కునట్టి అద్భుతశక్తి గలదు. స్వయముగ వాని కెంతో ప్రభావము ఉన్నది. ప్రాటెస్టెంటుమతము ఎంతయు తపఃప్రచురము, నీరసము. ప్రాటెస్టెంటులు పెక్కులాభాలను సాధించిరి. కాథలిక్కులకంటె వారు కొన్ని విషయములలో నధికస్వాతంత్ర్య మిచ్చిరి. వారి ఆశయములలో ఎక్కువ స్పష్టతయు, వ్యష్టిదృష్టియు ఉన్నవి. అ దంతయు సరె. కాని, వారు కోల్పోయినదికూడ ఎక్కువే. ......చర్చిలలోని లిఖితచిత్రాల విషయమును గైకొనుడు. అది కవిత్వరచనకు ప్రయత్నము. కవిత్వతృష్ణ ఉన్నచో కవిత్వ మేల ఉండరాదు? ఆత్మ కోరుదానిని దాని కేల యీయకూడదు? మనకు సంగీత ముండితీఱవలసినదే. ప్రెస్బిటేరియనులు సంగీతము నకుసైతము విముఖులే. వారు క్రైస్తవులలో "మహమ్మదీయులు". 'కవిత్వమంతయు నంతరించుగాక!' 'సకలకర్మకలాపములు నంత రించుగాక!' తరువాత వారు సంగీతమును పాడుదురు. అది వీనుల విందుగ నుండును. సమష్టిగా వారందఱు వేదికపైనుండి జ్ఞాన జ్యోతికై ఎట్లు శ్రమపడుదురో నేను చూచియున్నాను.

బాహ్యారంగమున వ్యక్తము చేయబడు నిండైన కవిత్వమును మతనిష్ఠయు ఆత్మకు ఉండనిండు. ఏల ఉండరాదు? ...... రూపారాధనను మీరు పోరాడి అణపజాలరు, మాటిమాటికి

RIAL LIBRARY
540 03

UDDAPAH.

అదే విజయమును పొందుచుండును. ......కాథలిక్కులు చేయునది మీరు ఊహింపనిదో అంతకంటె మేలుగా మీరు చేయుడు. కాని, మన మంతకన్న మేలైనదానిని, దేనినిగాని చేయను లేము, ఉన్న కవిత్వమును ఉంచుకోను లేము. అది దారుణస్థితి. కవిత్వము మిక్కిలి అనివార్యము! మీరు లోకోత్తరులగు తత్త్వవేత్తలు కావచ్చు. కాని, తత్త్వశాస్త్రమే మహోన్నతకవిత్వము. అది ఎండిపోయిన ఎముకల ప్రోవు కాదు. సమస్తమునకును సారమైనది. ద్వైతమైన దేనికంటెను గూడ పరమసత్య మెక్కువ కవిత్వభరిత మైనది.

పారమార్థికవిషయమున పాండిత్యమునకు స్థానము లేదు; అధికసంఖ్యాకులకు పాండిత్య మవరోధమే. ......ఒకడు లోకములోని సకలగ్రంథములను జదివియుండవచ్చును. కాని పారమార్థికపరుడు కాకపోవచ్చును. మఱొకడు సంతకమైనను చేయలేనివాడుగ నుండవచ్చును. కాని, అతనికి పరమార్థపరిజ్ఞానము, పరమార్థానుభవము ఉండవచ్చును. పారమార్థికపరత అనగా మన అంతస్సాక్షాత్కారమే. 'మానవీకరించు' పారమార్థికపరత అని నే ననునప్పుడు గ్రంథములు, నియమములు, సిద్ధాంతములు అని నా యభిప్రాయము కాదు. తనహృదయమున వెలసియున్న నిత్యతత్త్వమును ఏకొంతేని అనుభవించి అఖండసాక్షాత్కార మొందినవా డనియే నా యభిప్రాయము.

నేను నా జీవితకాలమంతయు నెవరిచరణసన్నిధిని ఆశ్రయించియుంటినో — ఆ మహనీయుని భావములు కొన్నిమాత్రమే బోధించుటకు ప్రయత్నించుచున్నాను — ఆయనకు తన పేరు వ్రాసికొనుటకూడ తిన్నగా చేతకాదు. నేను లోకమంతటను సంచారము చేసితిని. కాని, అటువంటివ్యక్తిని, మఱొక్కనిని నే నెక్కడను చూడ లేదు. ఆయనను తలంచుకొన్నప్పుడు 'నేను మూఢుడ' ననిపించును. ఏల యన గ్రంథములు చదువవలె నని

నా కనిపించును. ఆయన యేనాడును పుస్తకము ముట్ట లేదు. ఇతరులు భుజించిన పిమ్మట ఆ యెంగిలితట్టలను నాకవలె నని ఆయన ఎన్నడును కోర లేదు. కావుననే ఆయన కాయనయే గ్రంథము. నా జీవితకాలమంతయు ఎల్లయ్యా చెప్పినది, పుల్లయ్యా చెప్పినది తిరిగి చెప్పుచుండుటే గాని నేను సొంతముగా చెప్పిన దెప్పుడుకాని లేదు. ఇరువదియైదు సంవత్సరములనాడు ఎల్లయ్యా చెప్పినది, అయిదేండ్లక్రితము పుల్లయ్యా చెప్పినది నీకిప్పుడు తెలిసి యున్నవి అనిన, అందులో ఆధిక్యమే మున్నది? చెప్పుటకు సొంతముగా మీయొద్ద ఏమున్నదో చెప్పుడు.

పాండిత్యము వలన ప్రయోజనము లేదన్న సంగతి గమ నింపుడు. పాండిత్యమును గూర్చిన మీ అందఱి అభిప్రాయాలు తప్పు. మనస్సుకు పుష్టి, శిక్షణ కలిగించుట ఒక్కటే పాండిత్య మునకుండు విలువ. సదా గ్రంథార్థములను కబళించుచున్న మనము అజీర్ణరోగులము కాకుండుట ఆశ్చర్యము. ఇక గ్రంథపఠ నమునకు స్వస్తి చెప్పుదము. పుస్తకము లన్నిటిని తగులబెట్టుదము. మనలనే అదుపున నుంచుకొని ఆలోచన చేయుదము. మీరు "వ్యక్తిత్వము"ను కోల్పోవుటనుగుఱించి అతిగా మాటాడుచు మనస్సును కలవరపెట్టుకొందురు. సదా సాగు ఈ కబళనముచేత మీరు వ్యక్తిత్వము ననుక్షణము కోల్పోవుచునే యున్నారు. నేను బోధించినదానిని మీ రెవరు గాని నమ్మరు రేని నాకు విచారము కలుగును. సొంతముగా ఆలోచించుకొను శక్తిని మీలో ఉద్దీపింపజేసికొంటిరేని అదే నాకు మిక్కిలి సంతోషకరము. ...గొఱ్ఱెలమందతో కాక పురుషులతో, స్త్రీలతో మాట్లాడవలె నని నా కోర్కె. పురుషులతో, స్త్రీలతో అనగా వ్యక్తిత్వము గలవారితో నని నా యభిప్రాయము. వీథిలోనుండి ముఱికిగుడ్డ పేలికల నేరుకొని వచ్చి, బొమ్మలకు చుట్టబెట్టుటకు మీరు పసి బిడ్డలు కారు కదా!

ఇది జ్ఞానార్జనకు స్థానము! ఆయన విశ్వవిద్యాలయములో నున్నాడు! మిస్టర్ బ్లాంక్ చెప్పిన దంతయు నతనికి తెలియును. కాని, మిస్టర్ బ్లాంక్ ఏమియు చెప్పలేదు! నా యిష్టమునకు నన్ను వదలుదురేని, "పో, పొమ్ము! నీ వొక లెక్క లేదు!" అని ప్రొఫెసర్‌తో చెప్పివేసియుందును. ఎట్టి యిడుములు పడవలసి వచ్చినను సరే, ఈ వ్యక్తిత్వమును మీరు జ్ఞాపక ముంచుకొనుడు! అంతగా నీ కిష్టమగుచో తప్పు ఆలోచన చేసినను సరే. సత్యమును గ్రహించినను, గ్రహింపకపోయినను పరవా లేదు. మనస్సును అదుపులో ఉంచుటే ముఖ్యాంశము. ఇతరులదగ్గఱనుండి నీవు కబళించిన సత్యము నీది కాదు. నా నోటిగుండ నీవు సత్యమును బోధింప లేవు; నా నోటినుండి నీవు సత్యమును గ్రహింపను లేవు. ఎవరును మఱియొకరికి బోధింప జాలరు. సత్యమును నీవు సాక్షాత్కరించుకోవలె. నీవే నీ ప్రకృతి ననుసరించి నిర్వహింపవలె. ...... వ్యక్తిత్వమునకై అందఱము పెనగులాడవలె — మీరు బలవంతులుగ నుండవలె. మీ కాళ్లపై మీరు నిలబడవలె. మీ ఆలోచనలను మీరే ఆలోచించుకొనవలె. మీ ఆత్మను మీరు సాక్షాత్కరించుకొనవలె. కారాగారబద్ధులయిన సైనికులవలె అందఱు ఒక్కమారుగా లేచి నిలబడుట; ఒక్కమారుగా కలసి కూర్చుండుట; అందఱు కలసి ఒక్కతిండి తినుట; అందఱు ఒక్కమారుగా తల లూపుట — ఈ విధముగా నితరులు సరఫరా చేసెడి సిద్ధాంతములను గుటక వేయుటవలన ప్రయోజనము లేదు. వైవిధ్యము జీవలక్షణము. ఏకరూపత మృత్యులక్షణము.

ఒకసారి నేను భారతదేశములోని ఒకనగరములోనుండగా ఒకవృద్ధుడు వచ్చి, "స్వామీ, నాకు మార్గోపదేశముచేయుడు." అని యడిగెను. ఇప్పుడు నాయెదుట నున్న బల్ల ఎంతనిర్జీవమో అత డంత నిర్జీవుడుగా నుండుట గుర్తించితిని. మానసికముగా, ఆధ్యాత్మికముగా అతడు నిజముగ మృతుడే. నే నిట్లడిగితిని:

"నేను చెప్పినది చేయుదువా? దొంగిలింపగలవా? మద్యము సేవింపగలవా? మాంసము తినగలవా?"

మీ రుపదేశించుచున్న దేమి అని ఆత డాశ్చర్యముతో నడిగెను.

నే నిట్లంటిని: "ఈగోడ యెప్పు డయిన దొంగతనము చేసెనా? గోడ యేనాడయిన మద్యము త్రావెనా?"

"లేదు, స్వామీజీ."

మానవుడు దొంగతనము చేయును, మద్యము త్రాగును, దేవు డగును. "మిత్రుడా, నీవు గోడవు కావని నే నెఱుగుదును. ఏ దయిన చేయుము! ఏదైన చేయుము!" అతడు దొంగతనము చేసినచో, ముక్తిమార్గమున అడుగిడినట్లే అని నాకుతోచినది.

అందఱు ఒక్కమాటనే చెప్పుచు, ఒక్కసారిగా లేచినిల బడుచు, ఒక్కసారిగా కూర్చుండుచున్న మీరు ప్రత్యేకవ్యక్తులని నా కెట్లు తెలియును? ఇది మృత్యుదేవత కభిముఖముగ బోవు మార్గము! మీయాత్మలకొఱ కేదేని చేయుడు! మీకిష్టమయి నచో తప్పుపనులనైన చేయుడు. కాని, ఏదో చేయుచుండుడు! నా చెప్పునది మీ రిప్పుడే గ్రహింపలేకున్న ముందుముందు గ్రహింపగలరు. ఆత్మను వార్ధక్య మావహించిన ట్లున్నది. ఆత్మ త్రుప్పుపట్టినది. ఈత్రుప్పును దులిపివేయవలె. పిమ్మట సాగి పోవుదుము. లోకములో చెడుగు ఎందుకున్నదో ఇప్పుడు మీరు గ్రహింతురు. ఇంటికి పోయి త్రుప్పుదులుపుకొనుటకొఱ కీవిషయ మాలోచింపుడు!

మనము ఐహికవస్తువులకొఱకు ప్రార్థనలు చేయుచుందుము. ఏదో ప్రయోజన మాశించి దుకాణదారునివలె ఉపాసన చేయు దుము. కానిండు, అన్నవస్త్రములకొఱకు ప్రార్థన చేయుడు. ఉపా సన మంచిపనే. ఏమియు చేయకుండుటకంటె ఏదోచేయుట ఎప్పటికిని మేలే. "ఏమామయు లేకపోవుటకంటె గ్రుడ్డిమా

మైనను ఉండుట మేలు.'' కోటీశ్వరుడైన యువకుడు వ్యాధిగ్రస్తుడగును. వ్యాధిని పోగొట్టుకొనుకోర్కెతో అతడు పేదలకు దానముచేయ నారంభించును. అది మంచిపనే. కాని, అది పారమార్థికపరత కాదు; ఆధ్యాత్మికపరత అసలే కాదు. అది యంతయు ఐహికరంగమునందలి వ్యవహారమే. ఏది ఐహికము? ఏది కాదు? జగమును ఉపేయముగను భగవంతుని ఉపాయముగను ఆశ్రయించినచో అది ఐహికము. దేవుని ఉపేయముగను జగమును ఉపాయమాత్రముగను ఆశ్రయించినప్పుడు ఆధ్యాత్మికపరత ప్రారంభమయిన దన్న మాట.

కనుక భౌతికజీవితమునే యభీష్టముగా కోరువానికి వాని స్వర్గము లన్నియు ఐహికజీవితమునకు పొడిగింపులు మాత్రమే. చనిపోయినవారి నందఱను అతడు చూడగోరును. మఱొక పర్యాయ మీమంచికాల మనుభవించుట కాశపడును.

గతించినవారి యాత్మలను మనకడకు గొనివచ్చెడి స్త్రీ యొకరితె — మధ్యవర్తిని — ఉన్నది. ఆమె కాయము బహుస్థూలము. అయినను ఆమెను మధ్యవర్తిని అందురు. చాల సంతోషము! ఆస్త్రీకి నాయం దెంతో యిష్టము. ఆమె నన్నొకమారు ఆహ్వానించినది. విగతజీవుల ఆత్మ లన్నియు నాతో చాల గౌరవముతో వ్యవహరించినవి. నా కొక విచిత్రమయిన అనుభూతి కలిగినది. గుర్తించితిరా? అది పిశాచాలతో సల్లాపించు యర్ధరాత్రివేళ. మధ్యవర్తిని యిట్లనెను: ''......ఇక్కడదయ్యము నిలబడి యున్నది. నేను దానిని చూచుచున్నాను. అక్కడ బల్లమీద ఒకహిందువు ఉన్నా డని దయ్యము నాకు చెప్పుచున్నది.'' నేను చివాలున లేచి, ''ఈమాటచెప్పుటకుదయ్యమే రావలసిన అవసరము లేదు'' అంటిని.

అప్పు డక్కడ ఒకయువగృహస్థుకూడ ఉన్నాడు. అతడు తెలివిగలవాడు, బాగుగా చదువుకొన్నవాడు. అతడు గతించిన

తనమాతృదేవిని చూచుటకు వచ్చెను, మధ్యవర్తిని "ఫలానావాని తల్లి యిచ్చట నున్నది" అనెను. ఆయువకుడు తనతల్లినిగుఱించి నాకు చెప్పుచుండెడివాడు. చనిపోవునప్పు డామె మిక్కిలి బక్కచిక్కి యుండినదట. కాని, తెర వెనుకనుండి యీవలికి వచ్చిన స్త్రీ! మీ రామెను చూచియుండవలసినది! ఆయువకు డేమి చేయునో యని చూచుచుంటిని. నే నాశ్చర్యచకితుడ నగునట్లు అత డొక్క గంతు వేసి ఆమెను కౌగిలించుకొనెను. "అమ్మా, ఆత్మప్రపంచములో నీ వెంతచక్కగా ఎదిగితివి!" అని యత డనెను. "నే నిప్పు డిక్కడ ఉండుట నాభాగ్యము. మానవస్వభావము తెలిసికొనగలిగితిని!" అని నేననుకొంటిని.

మూర్తిపూజ విషయమునకు మరల వత్తము......ఈ ప్రపంచమును ఈజీవితమును లక్ష్యములుగా గొని, వానిని బడయుటకు భగవంతుని ఉపాయముగా ఉపాసించినచో అది అధమ స్థాయికి చెందిన ఉపాసన యగును......ఈమాంసపుముద్దకును, ఈయింద్రియసుఖములకును అతీతమైన దేనినిగూర్చిన ఆశయమును జనబాళ్యమునకు లేదు. ఈజీవితములో సైతము వీ రనుభవించు సౌఖ్యము లన్నియు పశుసౌఖ్యతుల్యములే......వారు జంతువులను భక్షింతురు. తమబిడ్డలను ప్రేమింతురు. ఇదియేనా మానవునియాధిక్య మంతయును? మనము సర్వశక్తుడగు దేవుని పూజింతుము. ఎందుకొఱకు? ఈభౌతికవస్తుసంపద నిచ్చుటకు, దానిని సదా కాపాడుచుండుటకును......అనగా మనము పశుపక్షులస్థాయి నతిక్రమింపలేదని యర్థము. వానికంటె మన మే మాత్రము అధికులముగ లేము. వానికి తెలిసినంతకంటె మన కెక్కువేమియు తెలియదు. అయ్యో మన గతి! వానికంటె మన మెక్కువ తెలిసియుండవలసినవారము! వానికిని మనకును గల భేద మొక్కటే. వానికి మన కున్న దేవునివంటి దేవుడు లేడు......మనకు పశువుల కున్న పంచేంద్రియములే ఉన్నవి. వాని

యింద్రియములే బలీయములు. కుక్క ఎముక నెంత రుచి ననుభవించుచు నమలునో! అంత రుచి ననుభవించుచు మన మొకముద్ద అయినను తిన లేము. వాని జీవితసుఖము మనజీవితసుఖముకంటె చాల హెచ్చు; కనుక మనము పశువులకంటెకూడ కొంత క్రిందిమెట్టే.

ప్రకృతిశక్తులలో ఏదో ఒకటి మీ మీద ఇప్పటికంటె మేలుగా పనిచేయగల్గియుండునట్లు ఏమిగాఐనను ఉందమని మీరు ఏల కోరుకోవలెను? అత్యంతముఖ్యముగా మీరాలోచింపవలసిన విషయ మిది. మీ కేది కావలెను? ఈ జీవితమును ఈయింద్రియములును, ఈదేహమునా? లేక చ్యుతిగాని మార్పుగాని లేని దేదైన నొకటియా?

కావున దాని అర్థ మేమి? ... "ప్రభూ, నాకు నా ఆహార మిమ్ము, నా ధన మిమ్ము! నా వ్యాధులను పోగొట్టుము! ఇది చేయుము, అది చేయుము!" అని మీ రందురు. ఈ విధముగా మీరు చెప్పినప్పుడెల్ల, "నేను భౌతికపదార్థమను. భౌతికతత్త్వమే నా గమ్యము" అను ఆశయముచే మీకు మీరు మత్తుగొల్పుకొనుచున్నారు. భౌతికమగు తృష్ణను పరితృప్తిపఱచుకొను నప్పు డెల్ల 'మేము దేహములమే కాని, ఆత్మలము కా' మని మీకు మీరు చెప్పుకొనుచున్నారు. ......

దేవా, ధన్యుడను. ఇది స్వప్నమే! దేవా, ధన్యుడను. ఈ స్వప్నము మాయ మగును. దేవా, ధన్యుడను. మృత్యువు ఉన్నది. మహిమాన్వితమగు మృత్యువు, ఏల యన అది యీ భ్రాంతిని, స్వప్నమును, ఈ మాంసమయజీవితమును, ఈ వేదనను అంత మొందించును. ఏ స్వప్నమును శాశ్వతముగా ఉండజాలదు; ఇప్పుడో మఱికొంతసేపటికో అది అంత మొందక తప్పదు. స్వప్నమును శాశ్వతముగా నుంచుకొనగలవా రెవ్వరును లేరు. స్వప్న మశాశ్వతమైనందుకు నేను దేవునకు ధన్యతాభివందన

యింద్రియములే బలీయములు. కుక్క ఎముక నెంత రుచి ననుభవించుచు నమలునో! అంత రుచి ననుభవించుచు మన మొకముద్ద అయినను తిన లేము. వాని జీవితసుఖము మనజీవితసుఖముకంటె చాల ౼చ్చు; కనుక మనము పశువులకంటెకూడ కొంత క్రిందిమెట్టే.

ప్రకృతిశక్తులలో ఏదో ఒకటి మీ మీద ఇప్పటికంటె మేలుగా పనిచేయగల్గియుండునట్లు ఏమిగాఐనను ఉందమని మీరు ఏల కోరుకోవలెను? అత్యంతముఖ్యముగా మీరాలోచింపవలసిన విషయ మిది. మీ కేది కావలెను? ఈ జీవితమును ఈయింద్రియములును, ఈదేహమునా? లేక చ్యుతిగాని మార్పుగాని లేని దేదైన నొకటియా ?

కావున దాని అర్థ మేమి? ... "ప్రభూ, నాకు నా ఆహారమిమ్ము, నా ధన మిమ్ము! నా వ్యాధులను పోగొట్టుము! ఇది చేయుము, అది చేయుము!" అని మీ రందురు. ఈ విధముగా మీరు చెప్పినప్పుడెల్ల, "నేను భౌతికపదార్థమను. భౌతికతత్త్వమే నా గమ్యము" అను ఆశయముచే మీకు మీరు మత్తుగొల్పుకొనుచున్నారు. భౌతికమగు తృష్ణను పరితృప్తిపఱచుకొను నప్పుడెల్ల 'మేము దేహములమే కాని, ఆత్మలము కా' మని మీకు మీరు చెప్పుకొనుచున్నారు. ......

దేవా, ధన్యుడను. ఇది స్వప్న మే! దేవా, ధన్యుడను. ఈ స్వప్నము మాయ మగును. దేవా, ధన్యుడను. మృత్యువు ఉన్నది. మహిమాన్వితమగు మృత్యువు, ఏల యన అది యీ భ్రాంతిని, స్వప్నమును, ఈ మాంసమయజీవితమును, ఈ వేదనను అంత మొందించును. ఏ స్వప్నమును శాశ్వతముగా ఉండజాలదు; ఇప్పుడో మఱికొంత సేపటికో అది అంత మొందక తప్పదు. స్వప్నమును శాశ్వతముగా నుంచుకొనగలవా రెవ్వరును లేరు. స్వప్న మశాశ్వతమైనందుకు నేను దేవునకు ధన్యతాభివందన

మొనర్తును! అయినను ఈవిధమగు ఉపాసన మంచిదే. ఉపాసన చేయుడు! ఏవిధమగు పూజయు లేకుండుటకంటె దేనికోఅకో ఒకదానికొఅకు పూజ చేయుట మేలే. ఈ దశలగుండనే మనము దాటుకొనిపోదుము. ఇవి ప్రథమపాఠములు. క్రమక్రమముగా ఇంద్రియములకు, దేహమునకు, ప్రాపంచికసౌఖ్యములకు అతీతమయినదానిని మనస్సు భావింప నారంభించును.

అది ఎట్లు గలుగును? మొదట మానవుడు యోచింప నారంభించును. ఒకసమస్యను గుఱించి యోచించునప్పుడు అందు శ్రేష్ఠమగు భావనానందమే గాని విషయసుఖము లేదు. ...... మానవుని రూపొందించునదదే. ... ఒక మహాశయమును కొనుడు! అది గభీరమగును, ఏకాగ్రత గల్గును. అప్పుడిక మీకు దేహస్మృతి యుండదు. ఇంద్రియములు ఆగిపోయినవి. మీరప్పుడు దేహేంద్రియముల కతీతస్థాయియందుందురు. ఇంద్రియములద్వారమున వ్యక్తమగుచున్నదంతయు ఆ ఒక్క భావమందు కేంద్రీకృతమయినది. ఆక్షణమున మీరు పశుస్థాయి కతీతులైతిరి. సాక్షాత్కారానుభవము మీకు గలుగును. మీనుండి ఆ యనుభూతి నెవడును తీసికొనజాలరు—దేహమున కతీతమయినదానిని దర్శింతురు. ... అదే మనస్సునకు గమ్యము. ఆ గమ్యము ఇంద్రియరంగమున లేదు.

ఈ విధముగా ఇంద్రియరంగములో చేసెడి కృషి ఫలితముగా మీ కితరరంగములలోనికి అధికాధిక ప్రవేశము కలుగును. అటు తరువాత ఈ జగము మీనుండి రాలిపోవును. ఆత్మజ్యోతి దర్శనము మీకు కలుగును. ఆ యనుభూతితో మీ ఇంద్రియములు, ఇంద్రియభోగములు, దేహాసక్తి కరగి పోవును. ఆత్మప్రపంచము నుండి దర్శనానుభవాలు ఒకదానివెంట నొకటిగా కలుగును. యోగము పూర్తియగును. ఆత్మస్వస్వరూపమున ప్రకాశించును. అప్పుడు మీరు దేవుని ఆత్మగా ఉపాసింప నారంభింతురు.

ఉపాసనము ప్రయోజనాంతరసాధనము కాదని మీ రప్పుడు గ్రహింతురు. హృదయమున మనఉపాసన ఆయనంతము-శ: సాంతము నగు ప్రేమయే. అది సర్వేశ్వరుని చరణసన్నిధిని నిరంతరము జరుగుచుండు ఆత్మసమర్పణ. "నీవే. నేను కాను. నేను మరణించితిని. ఉన్నది నీవే. నేను లేను. నాకు ఐశ్వర్యము వలదు, సౌందర్యము వలదు, విద్యసైతము వలదు, నాకు మోక్షము సైతము వలదు. నీ కిష్ట మయినచో రెండుకోట్ల నరకములకయి నను నన్ను పంపుము. నేను కోరున దొక్కటే. నీవు నా ప్రేమారాధ్యుడవుగ నుండుము?"





కేలిఫోర్నియాలో శ్రీ వివేకానంద స్వామి 1900

# అమెరికను పత్రికల నివేదికలు

## ౧

### మతసహనము

(మెమ్ఫిస్ కమ్మర్షల్ - జాన్యువరి 17, 1894)

సుప్రసిద్ధహిందుసన్న్యాసియగు శ్రీ వివేకానందస్వామిని గౌరవించుటకై అధికసంఖ్యాకప్రజలు క్రిందటి రాత్రి సభాభవనమున సమావేశమెరి. స్వామి హిందుమతమునుగూర్చి ఉపన్యసించెను.

న్యాయమూర్తి ఆర్. జె. మోర్గను స్వామిని సదస్యులకు పరిచయపఱచుచు నుపన్యసించెను, సంక్షిప్తముగ నుపన్యసించెను, ఎంతో సంగతి తెల్పుచు ఉపన్యసించెను, గొప్పదైన ఆర్యజాతి వర్ధిల్లిన రీతిని వివరించెను, ఆవృద్ధినుండియే హిందు-యూరపియశాఖలు గల్గిన రీతిని దెల్పెను, ఇట్లు అమెరికాప్రజలకును వారియెదుట ఉన్న స్వామికిని జాతిసంబంధముకూడ కల దని చెప్పెను.

ఆ ప్రాచ్యప్రతిభాశాలిని సదస్యులు సమృద్ధసాధువాదములతో ఆదరించి, ఆయనయుపన్యాసమును మొదటినుండి తుదవఱకు ఆసక్తితోను అవధానముతోను ఆలకించిరి. ఆయనరూపము మనోహరము, ముఖవైఖరి పసిడిమిసిమిగలది అవయవముల పరస్పరానురూప్యము స్పృహణీయము. ఆయన ధరించియుండిన అంగి రోజాపూలవన్నెగలది నడుమున కొక నల్లని ధట్టి యుండెను, షరాయియు నల్లనిదే, తలపైని పసుపుపట్టుపాగా సొంపుగ అమరియుండెను. ఆయన ఉపన్యాసవైఖరి చాల బాగుండెను. ఆయన

వాడిన ఆంగ్లభాష - పదముల నెన్నుకొన్న విధమునం దేమి వ్యాకరణశుద్ధియం దేమి వాక్యనిర్మాణమం దేమి - నిర్దుష్టముగ నుండెను. ఊనిక పడవలసిన అక్షరములపై పడక పడరాని అక్షరములపై బడుచుండెను. ఉన్న ఉచ్చారణలోప మదొక్కటే. హెచ్చరికతో విన్నవారికి వినబడని పదములు లేనే లేవు. ఆ ఉపన్యాసము స్వతంత్రభావములతో అపూర్వవిషయములతో విశాల జ్ఞానముతో నిండియున్నందున విన్నవారి శ్రద్ధకు చక్కని ఫలితమే ముట్టినది. నాటి ఉపన్యాసవిషయమునకు 'సర్వమత సహనోపదేశ' మను పేరు తగియుండును. ఆయన తన యుపన్యాసమున భారత దేశమతమునకు సంబంధించిన పరమాదర్శములనే తార్కాణించుచుండెను. ఈ 'సహనమును' 'ప్రేమయు'నే గౌరవార్హములగు సర్వమతముల మూలాశయములు అనియు సకలమతములకు ప్రాప్యమైన లక్ష్య మిదే అనియు ఆయన ప్రతిపాదించెను.

హిందూమతమునుగూర్చిన అతని యుపన్యాసము వైపుల్యముకలది కాదు. హిందూమతసారమును విభజించి చెప్పుటకే అతడు ప్రయత్నించెను. దానికి సంబంధించిన కథలనుగాని దాని ఆచారాలనుగాని చెప్పబూనుకోలేదు. తన మతమునకే ప్రత్యేకములైయున్న విశ్వాసములకు కర్మకలాపాలకు సంబంధించిన కొన్ని లక్షణాలను మాత్రమే ఆయన వివరించెను. ఆవివరణ అత్యంతస్పష్టముగను ఎంతో సరళముగను ఉన్నది. హిందూమతమునకు సంబంధించిన గూఢ (=మిస్టికల్) లక్షణాలను, ఆయన తేటతెల్లముగ వర్ణించెను. ఆలక్షణాలనుండియే తఱచు అపార్థము చేసికొనబడుచున్న అవతారసిద్ధాంతము పెంపొందినది. కాలవిభేదాలు తనమతమున పాటింపబడ వనియు, వర్తమానమునందును భవిష్యమందును ఎల్లమానవుల కున్నట్టి నమ్మకమే బ్రహ్మమతము వారికి గతమునందును కలదనియు నతడు చెప్పెను. పాపము మూల పురుషునినుండి పరంపరగా సంక్రమించుచు వచ్చుచున్న దను విష

యమును (ఒరిజనల్ సిన్) హిందూమతము నమ్మదనియు మానవత్వమున పరిపూర్ణత సాధ్యమే అను నమ్మకము మీదనే సకలోద్యమములను అభిలాషలను, హిందూమత మాధారపడుచు ననియు అతడు స్పష్టముచేసెను. అభివృద్ధికిని పవిత్రత్వసిద్ధికిని విశ్వాసముతో గూడిన నమ్మకమే ఆధారముగ నుండవలె ననుట అతని వాదము. మానవుని అభివృద్ధి అనగా సహజమైన పరిపూర్ణతకు మరలుటే. ఈపరిపూర్ణత సాధనలచేతను ప్రేమచేతను గలుగవలె. ఈ గుణాలను తనదేశీయులు ఎట్లు అమలులో పెట్టి యున్నదియు, హింసితులకెల్ల భారతదేశము ఎట్లు శరణముగ నుండినదియు చూపి —టిటసు జెరుసేలమును కొల్లగొట్టి గుడిని పడగొట్టినప్పుడు యూదులకు భారతీయు లాశ్రయము నిచ్చుట నుదాహరించెను.

రూపములపై హిందువుల కెక్కువ ఊనిక లేదను విషయమును అతడు తేటతెల్లము కావించెను. ఒక్కొక్కప్పుడు ఒక్క కుటుంబములోని వారే ఒకొక్క రొక్కొక్కమతమువారుగ ఉందురు. ఐనను అందఱును ప్రేమాశయమును పూజింతురు. దాని ద్వారా భగవంతునే పూజింతురు. భగవంతుని ముఖ్య గుణము ప్రేమ. అన్ని మతములలోను 'మంచి' ఉన్న దనియు, పవిత్రత గాంచవలె ననెడి మానవు నుత్సాహమే అన్ని మతములుగ రూపుదాల్చిన దనియు, కావున అన్ని మతములును పూజార్హములే యనియు హిందువుల యభిప్రాయ మట. ఇందులకు ప్రమాణముగ ఆయనకొన్ని వేద(?)వాక్యములను ఉదాహరించెను. ఆవాక్యములందిట్లు చెప్పబడియున్నది – ఒక్క చెలమలోనుండి నీరు కొనుటకు నానారూపములగు బిందెలు కొనిరాబడు నేని ; బిందెలరూపములు పెక్కులుగ నున్నను వానిని నింపుజలము (పరమార్థము)ఒక్కటే. అత డింకను ఏ మనె ననగా—అన్ని రూపాల నమ్మకాలును దేవుడెఱుగును. ఏ పేరుతో తన్ను పిలిచినను దేవుడు గుర్తించు

కొనును, తనకు కావింపబడిన పూజ ఏవిధముదైనను, అది తనది అని దేవుడు గుర్తించును.

క్రైస్తవులు ఆరాధించు దేవుడును హిందువులు ఆరాధించు దేవుడును ఒక్కడే యట! బ్రహ్మ విష్ణు మహేశ్వరు లనెడి హిందువుల త్రిమూర్తులు, సృష్టి స్థితి సంహారములకై ఒక్క భగవంతుడు దాల్చు ముమ్మూర్తులే యట. ఒక్కడే అని భావింపక ముగ్గురు అని భావించుట అపభ్రంశమేయట. అందులకు కారణము సామాన్య మానవులు ప్రతి ఆచారమునకును ఇంద్రియగోచరమగు రూపమును గోరుటే యట. కావున హిందువుల వేల్పుల విగ్రహములు దివ్యగుణములకు చిహ్నములే.

హిందువుల 'అవతారసిద్ధాంతము'ను వివరించుచు ఆయన కృష్ణునికథను జెప్పెను. పురుషరేతస్సంపర్కములేని గర్భమునుండి ఆయన జనించె నట. కృష్ణునిచరిత్రమునకును జీసను చరిత్రమునకును చాల పోలిక ఉన్నది. కృష్ణు డుపదేశించినది నిష్కామ ప్రేమసిద్ధాంతము నట. ఆవిషయమును, స్వామి ఇట్లు చెప్పెను. "దైవభీతి పారమార్థికపరతకు ప్రారంభ మగు నేని భగవత్ప్రేమ పారమార్థికపరతకు పరమావధి యగును".

ఆయన సమగ్రోపన్యాసము నిట సంక్షేపించుట శక్యము కాదు. కాని అది చక్కని విశ్వాసమునకు ధాటీమండితమైన సమర్థనము. సామర్థ్యముతో కావింపబడిన విశ్వమానవ సౌభ్రాత్రాభ్యర్థనము. పర్యవసానమున ఆయన ఏ మనె ననగా — క్రైస్తును అంగీకరించుటకు తాను సంసిద్ధుడనే అనెను. కాని, కృష్ణునకును బుద్ధునకునుగూడ మ్రొక్కవలసినదే అనెను. నాగరకత యందున్న నిర్దయాంశమును చక్కగ వర్ణించి, పురోగతివశమున పుట్టిన దోసగులకు క్రీస్తు బాధ్యుడని తా నంగీకరింప ననెను. ఉపన్యాసములో ఈపర్యవసానము మీాదు మిక్కిలి మనోహరముగ ఉండినది.

౨

# భారతదేశాచారసంప్రదాయములు

(అపీల్ అవలాంచి - జాన్యువరి 21, 1894)

నిన్న మధ్యాహ్నానంతరము 'లాసాలెట్ అకాడమి (మెమ్ఫిస్)' యొద్ద హిందుయతి వివేకానందస్వామి ఉపన్యసించెను. ముసురుపట్టి వాన కురియుచున్నందున, శ్రోతలసంఖ్య చాల తక్కువగ ఉండెను.

ఉపన్యాసవిషయము 'భారతదేశాచారసంప్రదాయములు', వివేకానందుడు మతవిషయికముగ గావించిన ప్రతిపాదనలు ఈ నగరములో నేమి అమెరికాలోని తక్కిన నగరములలో నేమి, కొందఱు విమర్శకాగ్రేసరుల చిత్తములందు నిరాటంకముగ నాటుకొన్నవి.

క్రైస్తవగురువులు బోధించుచుండిన సనాతనవిశ్వాసమునకు ఆయనసిద్ధాంతము గొడ్డలిపెట్టుగ నుండెను. ఇన్నాళ్లును భారతదేశమున క్రైస్తవేతరుల అజ్ఞానమేఘచ్ఛన్న మనస్సులకు వెలుగు గలిగించుటకే అమెరికను క్రైస్తవుల మహోద్యమము సాగుచుండినది. కాని వివేకానందుని మతపుప్రాచ్యజ్యోతిలో మనపూర్వులు బోధించుచుండిన ప్రాచీనక్రైస్తవము మఱుగువడుచున్నట్లున్నది. వివేకానందుని బోధనలకు అమెరికాలో విద్యాధికుల చిత్తములు సారవంతములగు క్షేత్రము లయినవి.

ఇది వెఱ్ఱిభ్రాంతుల యుగము. చిరకాలముగ ఉన్న అక్కఱనే వివేకానందుడు తీర్చుచున్నట్లున్నాడు. ఆయన నిరతిశయ పాండిత్యసంపన్నులగు భారతీయులలో నొకడు. ఆయన వ్యక్తికున్న ఆకర్షణశక్తి మహాద్భుతము. ఆయన వాగ్ధాటి శ్రోతలను

మంత్రముగ్ధుల నొనర్చుచుండెను. ఆయన ఆశయాలు మహోదార ములే కాని, ఆయన దృష్టిలో ప్రాచీనక్రైస్తవములో ప్రశంసార్హ ములైన విషయములు లేనే లేవు. మెంఫిసునగరమునకు వచ్చిన మంత్రులకుగాని వక్తలకుగాని ఇంతవఱకు గల్గిన గౌరవమునకంటె హెచ్చుగౌరవము వివేకానందునకు గలిగినది.

ఆ హిందు సన్న్యాసిపట్ల మన దేశమున గల్గినంత హృదయ పూర్వకాదరము మన మతబోధకులకు భారతదేశమున గల్గినచో క్రైస్తవేతరదేశాలలో క్రైస్తవమతము బాగుగ వ్యాపించి యుండెడిదే. చరిత్రదృష్టితో చూతుమేని నిన్న మధ్యాహ్నా నంతర మాయన కావించిన ఉపన్యాసము ఆసక్తిగొలుపునదే. అత్యంతప్రాచీనకాలమునుండి నేటివఱకు తన మాతృదేశపు చరిత్రను సంప్రదాయములను ఆయన చాల చక్కగ ఎఱిగి యున్నాడు. వివిధప్రాంతములను మనోహరలక్ష్యములను ఆయన సొంపుగను నిరర్గళముగను వర్ణింపగలడు.

శ్రోతలలో మహిళలు ఆయనను మాటిమాటికిని ప్రశ్న లడిగి ఉపన్యాసమునకు విచ్ఛేదము గల్గించుచుండిరి. ఎట్టి జంకును లేక ఆయన అన్నిప్రశ్నలకును జవాబు చెప్పినాడు. తన్ను మతవిషయికచర్చలోనికి దింప వలె నను ఉద్దేశముతో ఒకానొక మహిళ అడిగిన ప్రశ్నకు మాత్రము అతడు జవాబు చెప్ప లేదు. నాటి ఉపన్యాసవిషయమును వీడి అప్రసక్తవిషయములందు అడుగిడ నతడు నిరాకరించెను. "ఆత్మ ఒకశరీరమును వీడి వేఱొక శరీరమును కూడుట" మున్నగు విషయాలను గూర్చిన తన యభిప్రాయాలను అతడు మఱొకనాడు చెప్పెదునని ఆ ప్రశ్నించిన యామెతో ననెను.

ప్రసంగవశమున ఆయన 'మా తాతకు మూడవయేటనే పెండ్లి అయ్యెను. మా తండ్రికి పెండ్లి పదునెనిమిదవయేట జరిగెను. నాకు పెండ్లి కానే లేదు" అనెను. సన్న్యాసికి పెండ్లి నిషిద్ధము

కా దట. సన్న్యాసి పెండ్లాడునేని, సతియు పతివలె సన్న్యాసిని అగు నట, పతి కున్న హక్కులు అధికారాలు ఆమెకును ఉండు నట. సంఘములో పతికున్న స్థానమే సతికిని ఉన్న దట.*

ఒక రడిగిన ప్రశ్నకు జవాబుగా ఆయన ఇట్లనెను: భారత దేశమున ఏ కారణ మున్నను సరే, పెండ్లిని రద్దుచేసికొను ఆచారము లేదు. కాని పెండ్లికి పిమ్మట 14 సంవత్సరము లయినను కుటుంబమున సంతానము గల్గకున్నచో సతియనుమతి నొంది పతి మ ఱొక్కతెను పెండ్లాడవచ్చును. ఆమె అనుమతింపకున్న, అతడు పునర్వివాహమును మానుకోవలసినదే. గోరీలను గుడులను ఆయన వర్ణించిన తీరు నిరుపమాన మనోహరము. ఆ వర్ణనలను బట్టి చూడ నేటిశిల్పులకున్న శాస్త్రీయజ్ఞానమునకంటె ప్రాచీనుల కుండిన శాస్త్రీయజ్ఞానము చాల మేలైన దని తెలియుచున్నది.

నేటి రాత్రి కడసారిగా వివేకానందస్వామి ఈ నగరమందలి వె. ఎమ్. హెచ్. ఏ. హాలులో దర్శన మొసగును. చికాగో స్లేటన్ లీసియమ్ బ్యూరోవారి ఆధ్వర్యమున మూడేండ్ల కాల మాయన ఈ దేశమున పర్యటించుచు ఉపన్యసింపవలె నను ఒప్పంద మున్నది. రేపు ఆయన చికాగోకు బయలుదేఱును. ఆయన కచట 25 వ తేదీనాటి రాత్రి ఒక కార్యక్రమము గలదు.

(డిట్రాయిట్ ట్రిబ్యూను - ఫెబ్రువరి 15, 1894)

యూనిటిక్లబ్బువారి ఆధ్వర్యమున నిన్న సాయంకాలము సుప్రసిద్ధహిందూయతివరుడు బ్రాహ్మసమాజీయుడు వివేకానంద స్వామి యునిటేరియను చర్చిలో ఉపన్యసించెను. వేనవేలు

* సన్న్యాసులు పెండ్లాడుదు రని స్వామి చెప్పియుండడు. విలేఖరి పొరపడియుండును. ఏలన సన్న్యాసికి పెండ్లి నిషిద్ధ మనియు, పెండ్లాడుట పతన మనియు, ఆశ్రమమునుండి అట్టివాడు బహిష్కృతు డగు ననియు—అంద ఱెఱుగుదురు.

ప్రజలకు ఆతని దర్శనశ్రవణభాగ్యము గల్గినది. ఆయన స్వదేశీయ వేషమున ఉండెను. ఒడ్డును పొడుగును సుందరవదనమును విలక్షణ దర్శనీయములుగ నుండినవి. ఆయన వాగ్ధాటి శ్రోతలను తన్మయుల నొనర్చెను. మాటిమాటికి సభలో హర్షధ్వానములు మ్రోగు చుండెను. భారతదేశాచారసంప్రదాయము లను విషయమును గూర్చి ఆయన ఉపన్యసించెను. విషయమును నిర్దోషరమణీయ మైన ఆంగ్లభాషలో అందజేసెను. తాము తమదేశమును 'ఇండియ' అని కాని, తమ్ము 'హిందువులు' అని కాని పేర్కొన రట. దేశనామము హిందుస్థానము. వారు బ్రాహ్మణులు. ప్రాచీన కాలమున వారి వ్యావహారికభాష సంస్కృత మట. పదముల అర్థమును ప్రసక్తియు ఆ భాషలో వివృతములై తేటతెల్ల మగు చుండెడి దట. కాని ఇప్పు డ దంతయు పోయె నట. జ్యూపిటరు అను పదమునకు సంస్కృతమున 'స్వర్గమం దున్న తండ్రి' అని యర్థ మట. ఉత్తరహిందూదేశమందలి భాష లన్నియు ఇంచు మించు ఒక్కతీరువేఅట. కాని దక్షిణహిందూదేశమునకు పోయినచో, అచ్చటి ప్రజలతో సంభాషింప జాల డట. ఫాదర్, మదర్, సిస్టర్, బ్రదర్ మున్నగు ఆంగ్లపదములకును వాని గీర్వాణసమాంతరములకును ఉచ్చారణలో దగ్గఱ పోలిక లున్నవి. వీనిని మఱికొన్ని ఆధారాలను బట్టి చూచి మన మందఱము ఒక్కజాతికి, ఆర్యజాతికి చెందినవార మని అతడు అభిప్రాయ పడినాడు. ఈ జాతికి చెందిన అన్నిశాఖలవారును తమ అభేద మును గోల్పోయిరి.

నాల్గు వర్ణాల వా రుండిరి. (1) పురోహితులు. (2) భూ పతులు యోధులు. (3) వర్తకులు శిల్పులు. (4) పనివాండ్రు పరిచారకులు. మొదటి మూడువర్ణాలలోను బాలురకు పదవ పదునొకండవ పదుమూడవ వయస్సు రాగానే వారిని కులపతుల కర్పించుచుండిరి. అచట వారు ముప్పదవ ఇరువదిఐదవ ఇరువదవ

వయస్సు వచ్చువఱకు ఉండెడివా రట. ... ప్రాచీనకాలమున బాలురకును బాలికలకునుగూడ విద్య కఱపబడుచుండె నట. కాని ప్రస్తుతము విద్య బాలురకుమాత్రమే అట. చిరకాలముగ నిలబడిపోయి ఉన్న యీ పక్షపాతమును చక్క జేయుటకు ప్రయత్నము ఇప్పుడు సాగుచున్నది. విదేశీయులు దేశపాలకు లగుటకు పూర్వము, ప్రాచీనకాలమున దేశమందలి స్మృతులలోను వేదాంతమందును అధికభాగమును రూపేర్పఱచినవారు మహిళలే యట. ప్రస్తుత కాలమున హక్కులు స్త్రీలకును కల వనియే హిందువు భావించుచున్నాడు. స్త్రీలు తమహక్కును దక్కించుకొందురు, చట్టములు స్త్రీలకే అనుకూలములుగ ఉన్నవి.

గురుకులమున చదువు పూర్తిచేసికొని మరలినవాడు పెండ్లి చేసికొని గృహస్థుడు కావచ్చు. ఇంటి పనులలో సతిపతులకు బాధ్యత సమానము, ఉభయులకును హక్కు లున్నవి. క్షత్రియ వర్ణమున మాత్రము దుహితలు పతులను స్వయముగ వరించు ఆచార ముండెడిది. తక్కిన అన్నివర్ణములలోను పెండ్లి ఏర్పాట్లను చేయువారు తల్లిదండ్రులే. అతిబాల్యవివాహములను అరికట్టు ప్రయత్న మిప్పుడు సదా సాగుచున్న దట. వివాహక్రియ చాల ముచ్చటగ నున్నది. వధూవరులు ఒండొరుల హృదయముల స్పృశించుకొని దేవు నెదుటను సదస్యులసమక్షమునను తాము పరస్పరము విశ్వాసము గల్గియుందు మని ప్రమాణము సేయుదురు. పెండ్లికానిదే ఎవనికి యజనాధికారము లేదు. సమష్టిఆరాధన మందిరములకు పోవువాడు భార్యాసమేతుడుగనే పోవలెను. ఆహ్నికక్రమమున హిందువు పంచయజ్ఞముల చేయును — బ్రహ్మ యజ్ఞము, పితృయజ్ఞము, దేవయజ్ఞము, భూతయజ్ఞము, మనుష్య యజ్ఞము. హిందుగృహస్థునింట తృణమైన నుండువఱకును అతిథి పూజకు లోటుండరాదు. అతిథిసంతర్పణానంతరము బిడ్డలకు భుజింపబెట్టి పిమ్మట తల్లిదండ్రులు భుజింపవలెను. ప్రపంచప్రజ

లందఱిలోను మిక్కిలి పేదప్రజలు భారతీయులు, కాని ఏకటవు కాలముననో తప్ప, వారిలో ఆకలిచే చచ్చువా రెప్పుడు నుండరు. నాగరకత కలిగించుట పెద్దపని. లెక్కలను పోల్చి చూచి ఇంగ్లండు ప్రజలలో ఒక్కొక్క నన్నూఱుగురిలో ఒక త్రాగుబో తుండు ననియు, భారతదేశప్రజలలో పదిలక్షలమంది కొక్కని చొప్పున త్రాగుబోతు లుందు రనియు ప్రతిపాదింపబడినది. శవములదహన సంస్కారము వర్ణింపబడినది. ఏ గొప్పభూస్వామి మరణించి నప్పుడో తప్ప, తక్కినప్పుడు మరణవార్తకు ప్రకటనలు ఉండవు. ఒకపక్షముదినములు ఉపవసించిన పిమ్మట, తండ్రితాతలకై బంధువులు పేదలకో లేక ఏదేని సంస్థను స్థాపించుటకో దానము లిత్తురు. నీతిపరతయందు సర్వేతరదేశీయులస్థాయికంటెను భారత దేశీయులస్థాయి చాల పై మెట్టట.



3

# హిందు తత్త్వశాస్త్రము

(డిట్రాయిట్ ఫ్రీప్రెస్, ఫెబ్రువరి 16, 1894)

హిందుయతీశ్వరుడగు వివేకానందస్వామి నిన్న సాయంకాలము యూనిటేరియను చర్చిలో రెండవసారి ఉపన్యసించెను. సదస్యులు అధికసంఖ్యాకులుగనుండిరి. ఉపన్యాసమును ఎంతయు మెచ్చుకొనుచుండిరి. ఉపన్యాసమునకు ప్రకటితమైన శీర్షిక 'హిందుతత్త్వశాస్త్రము'. అందునుగూర్చి ఎంతో వినకుతూహలపడుచుండిన శ్రోతల నిరీక్షణము కొంతవఱకే సఫలమాయెను. బౌద్ధసిద్ధాంతప్రస్తావమును వచ్చినది. ప్రచారకార్యక్రమమునకు పూనుకొన్న ప్రపంచమతాలలో బౌద్ధమే మొట్టమొదటిది అనియు ఒక్కచుక్కయైనను నెత్తురు కార్పకే బౌద్ధము తక్కిన అన్ని మతాలను మించి ఎక్కువమందిని తనలో కల్పుకొన్నదనియు అతడు చెప్పినప్పుడు, శ్రోతలు హర్షధ్వానములు చేసిరి. కాని వక్త బౌద్ధమతమునుగూర్చికాని బౌద్ధతత్త్వశాస్త్రమునుగూర్చికాని సదస్యుల కేమియు తెల్పలేదు. క్రైస్తవమతము మీది కతడు కొన్ని చుఱుకైన ఎత్తిపొడుపుమాటలు విసిరెను. క్రైస్తవేతరదేశాలలో క్రైస్తవమును ప్రవేశపఱచుటవలన గలిగిన చిక్కులను దైన్యమును అతడు ఎత్తిచెప్పెను. కాని అతడు తనదేశప్రజల సాంఘికపరిస్థితిని తనశ్రోతల సాంఘికపరిస్థితిని పోల్చి చెప్పక నేర్పుతో తప్పించుకొనెను. స్థూలముగ అతడు చెప్పిన దేమనగా, క్రిందిమెట్టు సత్యమునుండి పైమెట్టు సత్యము నందుకొనుటనే హిందుతత్త్వజ్ఞులు బోధించిరట. క్రొత్త క్రైస్తవసిద్ధాంతమున అట్లు కాదు గదా, దాని నవలంబించినవానికి తన పూర్వవిశ్వాసముల నన్నిటిని విడిచిపెట్టుట విహితము. వానిని

విడిచి, నూతనసిద్ధాంతమును పూర్ణముగ అంగీకరింపవలెను. 'లోకమునందలి సకలప్రజలును ఒక్కమతావలంబు లగుదు రను కొనుట రిత్తకల' అని అత డనెను. "పరస్పరవిరుద్ధాంశముల సంఘర్షణకు మనస్సు గుఱియైనప్పుడే కాని, ఎట్టి భావోద్రేకమును పుట్టు వొందజాలదు. మార్పు అసహ్యమైనప్పుడే, క్రొత్త వెలుతురు చూపబడ్డప్పుడే, ప్రాతదారివారికి క్రొత్తదారి చూపినప్పుడే— భావోద్రేకము వెలువడును."

[మొదటి ఉపన్యాసము పెక్కండ్రకు ద్వేషము గల్గించినది కావున 'ఫ్రీప్రెస్' పత్రికావిలేఖకుడు చాల జాగ్రత్త వహించెను. అదృష్టవశమున డిట్రాయిట్ ట్రిబ్యూనుపత్రిక స్వామిజిపక్షమును విడువక బలపఱచుచుండెను. కావున ట్రిబ్యూను పత్త్రికా విలేఖకుడువ్రాసికొన్న జ్ఞాపికలు అసమగ్రములుగ నున్నను ఫెబ్రువరి తే 16 ది నాడు ఆపత్రికలో వెలువడిన నివేదిక మూలమున హిందూతత్త్వశాస్త్రమునుగూర్చిన ఆయన ఉపన్యాసము ఇంచించుక మనకు అందినది.]

(డిట్రాయిట్ ట్రిబ్యూను, ఫెబ్రువరి 16, 1894)

బ్రాహ్మణయతి వివేకానందస్వామి యూనిటేరియను చర్చి యొద్ద నిన్న సాయంకాలము మరల ఉపన్యసించెను. ఉపన్యాస విషయము 'హిందూతత్త్వశాస్త్రము.' ఉపన్యాసకుడు కొంతసేపు తత్త్వశాస్త్రమును వేదాంతమునుగూర్చి స్థూలముగ ప్రసంగించెను. కాని మతమునకు సంబంధించిన అంశమునుగూర్చి మాత్రమే తా నుపన్యసింతు ననెను. ఆత్మయందు నమ్మకము గల్గియు దేవుని విషయ మజ్ఞేయము అని చెప్పు కక్ష యొకటి కలదు. బౌద్ధము నీతి ప్రధానమైన గొప్పమతమే ఐనను వారును దేవునందు విశ్వాసము లేక చిరకాల ముండజాలక పోయిరి. జయంట్లు (జైనులు) అను నొక మతమువా రున్నారు. వారికి ఆత్మయందు విశ్వాస

మున్నది కాని, నీతి దేశమును పాలించు ననుటను వారు నమ్మ
ఈమతమువారు పెక్కు లక్షలమంది భారతదేశమున
నుండిరి. వారి పురోహితులును సన్న్యాసులును తమ శ్వాసము
మానవులకో మృగాలకో తాకినచో మృత్యువు గల్గు నను నమ్మ
కముచేత తమ ముఖములను రుమాళ్లతో కప్పుకొందు రట.

సనాతనుల కందఱికిని (రెవలేషను=) శ్రుతి యందు నమ్మ
కము కలదు. వేదములందలి ప్రతి మాటయు సూటిగా భగవంతు
నుండియే ప్రభవించిన దని కొందఱు తలంతురు. అత్యధికసంఖ్యా
కములగు మతములలో మాటల అర్థమునకు సాగదీత సమ్మతమే.
మఱి హిందువులభాష సంస్కృతము. అందు ప్రతిమాటకును
దాని సమగ్రార్థమును హేతువులును మార్పొందక అట్లే ఉండునట.

ఆ ప్రఖ్యాతప్రాచ్యమహాశయు నభిప్రాయమున, మనకున్న
పంచేంద్రియములకంటె ఎక్కువ అమోఘమైన అఱవ ప్రమాణ
మొకటి కల దట. ఏ దనగా శ్రుతిప్రమాణము. ఒకడు విశ్వ
మందలి సర్వమతగ్రంథములను జదివి యుండవచ్చు కాని దేశమున
పలుగాకితనమున అత డందఱిని తలదన్నువాడుగ ఉండ వచ్చు.
శ్రుతి అనగా ఆధ్యాత్మికసాక్షాత్కారాల నివేదికలే.

కొంద అవలంబించు మఱొక మతము -సృష్టికి ఆద్యంత
ములు లేవని. విశ్వము లేని కాల మొకటి యుండె ననుకొం
దము. అప్పుడు దేవు డేమి చేయుచుండెను? సృష్టి అనగా హిందు
వుల అభిప్రాయమున రూపకల్పనమే. ఒక మానవుడు ఆరోగ్యము
గలశరీరముతో మంచి కుటుంబముతో ఒప్పుచు దివ్యమానవుడుగ
పెంపొందును. మఱొకమానవుడు వికలవక్రదేహుడుగ పుట్టి దుష్టు
డుగ పరిణమించి, దౌర్జన్యఫల మనుభవించును. ధర్మస్వరూపుడును
పరమపవిత్రుడునగు దేవుడు ఒకనిని పెక్కు ఆనుకూల్యములతోను
మఱొకనిని పెక్కుప్రాతికూల్యములతోను సృజింప నేల? మానవు

నకు పరిస్థితుల నెన్నుకొను స్వేచ్ఛ లేదాయె. తప్పు చేసినవానికి 'నీవు చేసినది తప్పు' అని చెప్పు అంతరాత్మ ఉన్నది. ధర్మాధర్మ తారతమ్యము వివరింపబడెను. అన్నియు భగవత్సంకల్పాధీనము లగు నేని, విజ్ఞానశాస్త్రాలు అంతరించిపోవును. మానవునకు పత నము ఎంతవఱకు సాధ్యము. మరల పశుస్థాయికి మరలుటశక్యమా?

తాను హిందువుగ జన్మించినందుచేత వివేకానందస్వామి, ధన్యుడాయె నట. రోమనులు జెరుసేలమును ధ్వంసము చేసి నప్పుడు పెక్కువేలమంది యూదులు భారతదేశమునకు వలస పోయి రట. అరబ్బులు పారశీకదేశమునుండి పారశీకులను తఱిమినప్పుడు వారు వేలకొలదిగ పాఱి భారతదేశమున తల దాచుకొని అక్కడ ఎట్టి బాధయు లేకుండి రట. అన్నిమతము లును సత్యములే అన్న నమ్మకము హిందువుల కున్న దట, కాని అన్నిమతములకంటెను హిందూమతమే ప్రాచీన మట. అన్యమత ప్రచారకులను హిందువులు హింసించి యెఱుగ రట. మొట్ట మొదట ఆంగ్లమతప్రచారకులను భారతభూమిపై అడుగుపెట్ట నీయక ఆంగ్లేయులే అడ్డగింపగా, తాను మధ్యస్థుడై ఆమతప్రచార కులకు తొలి సాయము చేసినవాడొక హిందు వట. సర్వ మందును విశ్వాసముండుట (రిలిజియను) ఆస్తిక్యమట. దానిని వివరింప అతడు 'అంధగజన్యాయము' నుదాహరించెను. అంధులలో ఒక్కొక్కడు ఏనుగు నవయవములలో ఒక్కొక్క దానిని తాకి చూచి 'ఏనుగనగా నిట్టిది' అని తానొక ప్రత్యేక నిర్ణయము చేసికొనెను. ప్రతియొక్కని నిర్ణయమును సరియైనదే. కాని అన్నియు కూడిననే సమగ్రసత్యము రూపేర్పడును. సత్యమే సత్యమున కందించు మెట్టు అని, క్రిందిసత్యము మీదిసత్యమున కందించు నని హిందూతత్త్వజ్ఞులు చెప్పుదురు. ఒకానొకనాటికి అందఱు నొక్క మతమువా రగుదు రని తలంచువారి తలంపు వట్టి కలయే. అందఱు నొక్కమతమువా రగుట అనగా మతమే అంత

రించుట. ప్రతిమతమువానిలోను చీలిక లేర్పడును. ప్రతిచిన్న కక్షవారును తమమత మొక్కటే సత్య మనియు అన్యములు అసత్యము లనియు వాదించుచుందురు. బౌద్ధమున అన్యమతముల వారిని హింసించుట లేనే లేదు. ప్రచారకులను విదేశముల కంపుటకు ప్రారంభకులు బౌద్ధులే. "నెత్తు రొక్కచుక్కయైనను కార్పక అన్యులను కోట్లకొలదిగా స్వమతములోనికి దింపుకొన్న వారము మే" మని చెప్పుకోగలవారు బౌద్ధులు మాత్రమే. హిందువులకు ఎన్ని దోషములు ఎన్ని మూఢవిశ్వాసము లున్నను— మతాంతరులను వా రెప్పుడును హింసింపరు. క్రైస్తవదేశాలలో సర్వత్ర ఇన్ని దుష్కృత్యములు సాగుచున్నవే, క్రైస్తవులు వాని నెట్లనుమతించుచున్నారో — అని అత డనెను.

౪

# అ ద్భు త ము లు

(ఈవినింగ్ న్యూస్, ఫెబ్రువరి 17, 1894)

న్యూస్ పత్రికాప్రతినిధి తమ పత్రికలో అద్భుతములను గూర్చి వ్రాయబడిన సంపాదకీయమును వివేకానందునకు చూపెను. దానిని తిలకించి ఆయన "నా మతమునకు నిరూపకముగా ఏదేని అద్భుతము (మిరకిల్) ను చేసిచూపు మనెడి న్యూసుపత్రికవారి కోరికను నేను తీర్పలేను. నేను అద్భుతాలను చేయువాడను కానుట మొదటి విషయము. రెండవది: అప్పటమైన హిందు మతము అద్భుతాలపైని ఆధారపడినది కాదు. అద్భుతాల నొక ప్రమాణముగ మేము పరిగణింపము. మన పంచేంద్రియముల కందని అద్భుతాలు కొన్ని ఉన్నవి కాని అవియు ఏదో ఒక నియమమున ('లా') కు కట్టువడినవే. మా మతమునకు వాని అక్కఱ లేదు. హిందూదేశమున జరిగినట్లు విదేశపత్రికలు ప్రకటించు అద్భుతము లన్నియు 'చేతిగారడిటక్కులు' వశీకార వంచనలు. అవి జ్ఞానులైన వారు చేసెడివి కావు. జ్ఞానులు సంతపొంతల ధనమునకై అద్భుతములుచేయుచు దేశములు చుట్టువారు కారు. పిల్లతనపు వినోదాలకు లొంగకనట్టియు పరమార్థ జిజ్ఞాసగలట్టియు వారికి మాత్రమే వారిని కన నెఱుగ శక్యమగును.

౨౫

# మానవుని దివ్యత్వము

(డిట్రాయిట్ ఫ్రీప్రెస్, ఫెబ్రువరి 18, 1894)

హిందూతత్త్వశాస్త్రజ్ఞుడును మతాచార్యుడునగు వివేకానందస్వామి యూనిటేరియనుచర్చియొద్ద వరుసగా చేయుచుండిన ఉపన్యాసములు — మతవిషయికోపన్యాసములు — నిన్న రాత్రి ముగిసినవి. నిన్నటి ఉపన్యాసవిషయము * 'దేవునిదివ్యత్వము'. వాతావరణము బాగు లేకున్నను 'ప్రాచ్యసోదరుడు' (అలాగు పిలిపించుకోవలె అని ఆయన కోరిక) వచ్చుటకు అరగంట ముందుగనే వాకిండ్లతోసహా మండపము ప్రజలతో కిటకిట నిండిపోయెను. అన్నివృత్తులవారును వ్యాపారాలవారును — న్యాయవాదు లేమి, న్యాయమూర్తు లేమి, ధర్మమహామాత్యు లేమి, వర్తకు లేమి, యూదుమతగురువు లేమి — వేయిచెవులతో వేచియుండు సదస్యులలో ఉండిరి. అత్యధికసంఖ్యాకులగు మహిళలనుగూర్చి చెప్పనక్కఱ లేదు. ప్రతిఉపన్యాసమునకును మహిళలు తప్పక వచ్చుటచేతను ఏకాగ్రమైన వారి అవధానముచేతను శ్యామదేహుడగు ఆ ఆగంతుకుని పైని ప్రశంసలు వర్షింపవలె ననెడి వారి దృఢనిశ్చయము తెలియ నగుచుండెను. ఉపన్యాసవేదికపై నతని సామర్థ్యమువలెనే అతని కచ్చేరిగదియు వారిని ఆకర్షించుచుండెను.

క్రిందటి ఉపన్యాసాలం దున్నంతకంటె నిన్నటిరాత్రి యుపన్యాసములో వర్ణనాంశములు తక్కువగ నుండెను. మొదటి రెండుగంటలసేపు వివేకానందుడు 'మానవ' 'దివ్య' విషయము

* ఇది పొర. ఉపన్యాసవిషయము "మానవుని దివ్యత్వము".

లను 'వేదాంతపు' టల్లికలో అమర్చెను. విజ్ఞానశాస్త్రము అనగా సర్వసామాన్యవివేకమే అని తోపజేయుసంత యుక్తియుక్తముగ అతని వక్కాణ ముండెను. యుక్తియుక్తమైన అతని చక్కని అల్లిక వివిధమహోజ్జ్వలవర్ణప్రపూర్ణమై యుండెను. విశ్వాకర్షక ప్రాచ్యపరిమళభరితములై నానావర్ణశోభితములైన వారిదేశపు చేనేతవస్త్రములతో సమానముగ ఆయన వాగ్జాలము ప్రీతికరముగను ఆకర్షకముగను ఉండెను. చిత్రకారుడు వన్నెల నుపయోగించుకొన్నట్లు ఈ శ్యామవర్ణుడు కావ్యోచితోత్ప్రేక్షలను ప్రయోగించును. రంగులు వాని వానికి అర్హమైన తావులం దమరియుండును. విపరీతనానాత్వమున్నను అతని వాణికి దానికే ప్రత్యేకమైన మరలుగొల్పు శక్తి ఉన్నది. నిర్ణయములు యుక్తియుక్తములు, వేగముగ ఒకదానివెంబడి నొకటి దొర్లుచుండెను, అవి క్షణక్షణపరిణామాద్భుతములుగ ఉండెను. దక్షుడగు నాతని శ్రమ సఫలమగునట్లు, సోత్సాహములగు సాధువాదములు మాటి మాటికిని మిన్నుముట్టుచుండెను.

*తన్ను పెక్కు ప్రశ్నలు పెక్కండ్రు అడిగినారని ఉపన్యాసకుడు పీఠికగా చెప్పెను. వానిలో కొన్నింటికి సమాధానమును ఆయన ఏకాంతముగ చెప్ప గోరెను. కాని ఉపన్యాసవేదికపై నుండి సమాధానము చెప్పుటకు మూడు ప్రశ్నలను ఆయన ఎన్నుకొనెను. వాని నెన్నుకొనుటకు గల కారణములు మీాద స్పష్ట మగును. ఆ ప్రశ్న లేవనగా — "భారతదేశమున ప్రజలు తమబిడ్డలను మొసళ్లనోళ్లలో త్రోయుదురా?" "వారు జగన్నాథస్వామి రథచక్రములక్రిందబడి ఆత్మహత్య చేసికొందురా?" ఇండియనులు న్యూయార్కునగరవీథులలో పరుగులిడుచుందురా అని అడిగినప్పుడు ఆ ప్రశ్నను విదేశములో సంచ

* ఈ 'పేరా' సంపూర్ణగ్రంథావళి మొదటి సంపుటము 'భారతదేశము అంధకారబంధురమా' అను శీర్షిక క్రింద 160-61 పుటలలో కూడ కలదు.

రించు చుండు అమెరికాదేశీయుడు ఎట్లు భావించునో, పై ప్రశ్న లలో మొదటిదానిని మన యుపన్యాసకుడు అట్లే భావించెను. (యూరోపు) ఖండములో అట్టి కట్టుకథలను పెక్కండ్రు ఈ కాలమునగూడ ప్రచారముచేయుచున్నారు. సమాధానము చెప్పుటకు అర్హత ఇంచుకైనను లేనంత నవ్వులచేటైన వాక్య మది. కొంద ఱజ్ఞానులు సదభిప్రాయముతోనే 'ఆడుబిడ్డలను మాత్రమే మొసళ్ల వాత కర్పించు టేల' అని అడిగినప్పుడు విపరీతభావగర్భముగ ఆయన 'ఆడుబిడ్డలు ఎక్కువమృదువులుగను సుకుమారులుగను ఉందురు, కావున జలచరములు సులభముగ నమలగల వని అజ్ఞానాంధకారబంధురమైన ఆదేశమున తలంతు రేమో'' అని జవాబు చెప్పెను. జగన్నాథక్షేత్రమునుగూర్చిన కట్టుకథనుగూర్చి ఉపన్యాసకుడు చెప్పిన జవాబు — ''ఆ క్షేత్రమున రథోత్సవము అనాదికాలముగ జరుగుచున్నది. కొందఱు యాత్రికులు రథమును లాగుటకై త్రాటిని అందుకొను ఆత్రములో జాఱి పడి నలిగిపోయి యుండవచ్చును. అట్టి కొన్ని దుర్ఘటనలు చేర్పులతో మార్పులతో అత్యుక్తులుగ పరిణమించినవి. వానిని విని ఇతరదేశముల సహృద యులు వెఱగుపడిరి.'' వితంతువులను దహించుట లే దని వివేకానందస్వామి చెప్పెను. వితంతువులు తమ్ము తామే అగ్ని సాత్కరించుకొనుచుండి రనుట నిజమే. అది జరిగిన కొన్ని చోట్లలో ఆత్మహత్యను సదా ప్రతిఘటించువారగు సాధువులు అట్లు చేయ రా దని వారికి నొక్కి బోధించుచునే యుండిరి. పతివ్రతలైన వితంతువులు పతులతో సహగమింతు మని పట్టు పట్టినప్పుడు వారిని ముందుగ అగ్నిపరీక్షలో నెగ్గవలె నని నిర్బం ధించెడివారు. ఆ స్త్రీలు తమ చేతులను మంటలోనికి చాచెదరు. వాని కాలుడుకు వారు తొణకకుండిరేని, ఇక వారికోరికలను నెఱవేర్చుకొనుటకు ఎట్టి ప్రతిఘటనయు ఉండెడిది కాదు. ప్రేమ పూర్ణలైన మహిళలు ప్రియభర్తలతో సహగమించి అమరధామ మునకు చేరుకొనుట భారతదేశమున మాత్రమే ఉండిన యాచా

రము కాదు. అట్టి ఆత్మహత్యలు ప్రతిదేశమునను జరిగియున్నవి. ఏ దేశములోనైననుసరే, అది అసాధారణమైన దురభినివేశము. ఇతరదేశములలో ఎంతో, అంతే భారతదేశములోను, అది అరుదైన సంభవమే. భారతదేశమున ప్రజలు మహిళలను కాల్పరనియు, మంత్రకత్తెలను వారెన్నడును దహించియుండలేదనియు, ఉపన్యాసకుడు మరల వక్కాణించెను.

నాటి ఉపన్యాసవిషయమును తొడంగుచు వివేకానందస్వామి జీవితమందలి భౌతికమానసికాధ్యాత్మికగుణముల విభజించి చెప్పబూనెను. ఈ దేహము ఒకపైచిప్ప. మనసు అనునది పనిచేయునదే కాని అది యొక చిన్న వింత భాగమే. విలక్షణమైన అవిభాజ్యస్వరూపము గలది ఆత్మ. అఖండమైన ఆత్మస్వరూపమును సాక్షాత్కరించుకొనుటే కాపాడబడుట (సాల్వేషను). దానిని హిందువులు ముక్తి అందురు. ఔననిపించు వాదవైఖరితో ఉపన్యాసకుడు ప్రతిజీవుడును స్వతంత్రుడే అని నిరూపించెను. ఏల యన పరతంత్రుడగుచో జీవుడు అమృతత్వమును ప్రాపింపజాలడు. జీవునకీ సాక్షాత్కార మెట్లు కలుగ వచ్చునో తెల్పునొక కథను వారిదేశకథాజాలమునుండి అతడు ఉదాహరించెను. గర్భిణియగు సింహి గొఱ్ఱెపైకి దూకుచు ఆఊపుచే ఈని మరణించెను. ఆ సింహకిశోరమునకు గొఱ్ఱె పాలిచ్చి పెంచెను. పెక్కేండ్లవఱకు అది తానొక గొఱ్ఱె అనుకొని గొఱ్ఱెగా ప్రవర్తించుచుండెను. ఒకనాడు మఱొక సింహము మటు తలసూపి మొదటి సింహము నొక తటాకమునొద్దకు పిలుచుకొనిపోయెను. మొదటి సింహము తటాకమందు తనప్రతిబింబమునకును రెండవసింహపు ప్రతిబింబమునకును గల సాజాత్యమును జూచి వెంటనే గర్జించి ఆత్మతేజమును గుర్తించెను. గొఱ్ఱెగా ప్రవర్తించిన సింహమువలె అనేకులు మూలలలో ఒదిగి "మేము పాపులము" అని చెప్పుకొనుచు తోచిన ప్రతిరీతిలోను నీచులుగా ప్రవర్తింతురు. ఆత్మలో

నున్న దివ్యతను పరిపూర్ణతను ఇంకను గుర్తించుకోలేకుందురు. మగవానిచేతను మహిళచేతను 'నేను' అనిపించుకొనునది ఆత్మ. ఆత్మ స్వతంత్ర మగు నేని, 'అనంతాఖండము' నుండి దానిని వేఱు సేయు టెట్లు? తటాకముపై సూర్యభగవానుడు ప్రకాశించుచుండ, లెక్కకు మిక్కిలియైన ప్రతిబింబములు క్రింద కననగును కదా, గొప్పదైన మూలము అగపడుచున్నను అర్థమగుచున్నను. ఒక్కొక్క ప్రతిబింబమును వేఱుగా కననగునట్లు ఒక్కొక్క జీవాత్మయు వేఱైనట్లు తోచును. ఆత్మకు స్త్రీత్వ పుంస్త్వములు లేవు. అఖండముక్తదశ నధిగమించినప్పుడు శారీరకమాత్రములగు స్త్రీత్వ పుంస్త్వములతో దాని కేమి జోలి? ఈసందర్భమున ఉపన్యాసకుడు స్వీడన్బోర్గుతత్త్వశాస్త్రసముద్రపులోతులకు దిగెను. హిందువిశ్వాసమునకును అర్వాచీనుడగు స్వీడన్బోర్గు నాధ్యాత్మికపు వక్కాణములకును గల పోలికలు స్పష్టముగ తెలియనయ్యెను. ప్రాచీనుడగు హిందుమతగురుని పరంపరకు చెంది ఆసనాతన విశ్వాసమునే ఆధునికభాషలో స్వీడన్బోర్గు పొందుపఱచినాడా అనిపించెను. ఫ్రెంచితత్త్వవేత్తలలోను నవలారచయితలలోను సర్వాధికుడు [బల్సాక్?] ఉదాత్తతావహ మగు తన 'అఖండాత్మ గాథ'లో పొందుపఱచుట కర్హ మని స్వీకరించిన భావప్రక్రియ అది. ప్రతిజీవునిలోను పరిపూర్ణత కలదు. అతని భౌతికసత్తయను తమమునకు మఱుగున ఆ పరిపూర్ణత కలదు. దేవుడు తన పరిపూర్ణతలో నుండి కొంతభాగము జీవుని కిచ్చి నందున జీవుడు శ్రేయ మొందె నని చెప్పుదు మేని అప్పటినుండి దేవుని పరిపూర్ణతలో ఆయన జీవునకు ఇచ్చివేసినభాగము కొఱవపడి యున్నదని తలంచిన వార మగుదుము. కాని వికల్పములకు లోబడని శాస్త్రసిద్ధాంతము జీవుడు అవిభాజ్యు డనియు జీవునిలో పరిపూర్ణత ఉండక తప్ప దనియు ఆపరిపూర్ణస్వరూపమును అధిగమించుట 'విముక్తి' యు 'అవిభాజ్యానంతత్వసాక్షాత్కారము'ను అగునే కాని 'రక్షింపబడుట' కానేరదనియు నిరూపించినది. 'ప్రకృతి'

అన్నను 'జీవుడు' అన్నను 'ఆస్తిక్యము' (రిలిజన్) అన్నను ఒక్కటే.

అన్ని మతములును మంచివే. లోటానీళ్లలోని బుడగ యందలి గాలి వెలుపలిగాలిమొత్తముతో కలిసిపోవ ప్రయత్నించును. నూనెలో ద్రాక్షాసవామ్లములో ఇతరద్రవాలలో దాని దాని చిక్కనలో గల యెక్కువతక్కువలకు తగ్గట్లు ఆప్రయత్నాలు ప్రతిహతము లగుచుండును. జీవితాభ్యాసాలను సంబంధాలను వంశపరంపరాప్రాప్తగుణాలను శీతోష్ణపరిస్థితుల ప్రభావాలను బట్టి ఒకప్రజకు ఒకమత మెంతయు తగియుండును. ఆకారణాలచేతనే మఱొక ప్రజకు మఱొక మతము తగియుండును. 'ఉన్నదెల్ల శ్రేష్ఠము' అనుటే ఉపన్యాసకుని నిర్ణయాలసారముగా కనిపించెను. ఒకదేశమువారి మతమును తటాలున మార్చ ప్రయత్నించుటెట్లుండు ననగా ఆల్ప్సుకొండల మీదినుండి ప్రవహించు నదిని జూచిన యొకడు అదిపాఱుచుండుదారి బాగులేదనుకొనుటను బోలి యుండును. హిమాలయపర్వతములమీది నుండి ప్రవహించుచున్న మహానదిని, తరతరాలుగా పెక్కువేల సంవత్సరాలుగా ఆలాగు ప్రవహించుచున్నదానిని జూచి మఱొకడు "ఇది ప్రవహించు దారి సూటిగా లేదు చక్కగా లేదు"అనును. దేవు డొకవ్యక్తి యనియు, ఊర్ధ్వ (లోక) మున ఆయన పీఠమున్న దనియు క్రైస్తవుడు భావించును. స్వర్గములోనైనను, స్వర్ణపథాంచలమున నిలుచుండి, అప్పుడప్పుడు స్వర్గేతరస్థలముపైని చూడ్కి ప్రసరింపజేయుచు, తారతమ్యమును చూచుచున్ననే కాని – క్రైస్తవుడు తప్పనిసరిగా సుఖపడజాలడు. ఆస్వర్ణసూత్రము (గోల్డనురూలు) నకు, బదులు హిందువు నమ్ము సిద్ధాంత మిది:—అనహమ్మతి మంచిది, అహంకారము చెడ్డది, ఈనమ్మికద్వారా అవిభాజ్యతానంతత్వములు ప్రాప్తించును, యథాకాలము అత్మవిముక్తి నెఱవేఱును. ఐనను స్వర్ణసూత్రము

(గోల్డనురూల్) ఎంత పామరమతము? అన్నాడు వివేకానందుడు. 'సదా నేను' 'సదా నేను' అనుటే క్రైస్తవమతము. ఒరులు నీ కేమి చేయగోరుదువో ఒరులకు నీ వది చేయవలెను! అది ఘోరము ఘాతుకము అనాగరకము ఐన మతము. ఐనను క్రైస్తవమతమును దూషించుట అతని కిష్టము లే దట. ఏలయన ఎవరు ఆమతముతో సంతృప్తిచెందియున్నారో వారి కది బాగుగా సరిపోవును. పెద్దవాగును ప్రవహించిపోనిండు. పరిష్కారమంతయు ప్రకృతివశమైయుండ ఆ నదిదారిని తాను మార్చబూనగోరువాడు అవివేకి. దయ్యాలలో నిజమైననమ్మకముండువాడును సర్వము దైవవశమను సిద్ధాంతము వాడునగు వివేకానందుడు 'అన్నియు బాగున్నవి. క్రైస్తవుల మతము మార్చవలె నను కోరిక నాకు లే''దను తన యభిప్రాయమును నొక్కి చెప్పెను. వారి మతము క్రైస్తవము. అది మంచిదే. తనది హిందూమతము, ఇదియు మంచిదే. ప్రజల మతివిభవములో వైవిధ్య ముండును కదా. తదనుగుణముగా వారి దేశ మతములలోగూడ వైవిధ్య మేర్పడియున్న దట. ఈవైవిధ్యము ఆధ్యాత్మిక పరిణతిలోని మెట్లను సూచించు నట. హిందుమతము స్వార్థపరమైన మతము కా దట, ఎంతసేపటికి తన లక్ష్యములందు అహంకారమునే చూపు మతము కాదట, సదా లాభాశలనో దండన భయములనో ప్రదర్శించుచుండు మతము కా దట. 'అహంకార లయముచేత అనంతత్వ మధిగమింప నగు' నని అది జీవునకు చూపును. దేవుడు భువిపై ఒకకొందఱకు మాత్రమే తన్ను చూపుకొనె ననుటయు, క్రైస్తవులు దేవునుండి దిగివచ్చినవారని చెప్పుటయు, క్రైస్తవమత మవలంబించుటకు లంచము లిచ్చుటయు - అను ఈ పద్ధతి పాపిష్ఠ మట. అది దారుణావినీతికరమట. క్రైస్తవమతమును అక్షరాలా అవలంబించినచో అవలంబించిన దురభినివిష్టుల నైతికప్రకృతులను అది లజ్జావహముగ పరిణ

మింపజేయు నట. దానిచే జీవుడు అనంతత్వమును ప్రాపించు కాలము మఱింత త్రోపుడు పడిపోవు నట.

* * * *

['జైను'లను మాటను 'జైయంట్లు' అని పొరపాటుగా వినిన ట్రిబ్యూను పత్రికాలేఖకుడే కాబోలు 'బర్న్' (దహించుట) అనుమాటను పొరపాటుగా 'బరి' (పూడ్చుట) అని వినెను. అది పోను, (గోల్డనురూలును) స్వర్ణసూత్రమునుగూర్చిన స్వామిజి మాటలు తప్ప, తక్కిన దాని నంతయు అతడు యథాస్థితముగనే నివేదించియున్నాడు]:—

(డిట్రాయిట్ ట్రిబ్యూన్, ఫెబ్రువరి 18, 1894)

నిన్నరాత్రి యూనిటేరియను చర్చియొద్ద ఉపన్యసించుచు వివేకానందస్వామి తెల్పిన విషయములు – విధవలు సజీవముగ పూడ్వబడ (కాల్పబడ?) వలె నను మతనిర్బంధము కాని చట్ట నిర్బంధము కాని భారతదేశమున లేదు. ఆసహగమనము చేసిన చోట నెల్ల మహిళలు తాముగా కోరి చేసినదే. ఈయాచారము నొకచక్రవర్తి నిషేధించియు నుండెను. కాని తదనంతరము అది మరల ప్రబలి ఆంగ్లప్రభుత్వమువారు దానిని ఆపువఱకు సాగు చుండినది. దురభినివేశము కలవారు అన్నిమతాలలోనుఉన్నారు. క్రైస్తవములో ఉన్నట్లే హిందుమతములోను ఉన్నారు. తపసు చేయుచు తలపైకెత్తిన చేతులు మరల దించుటకు సాధ్యము కాక అట్లే నిలబడిపోవునంత దీర్ఘకాలము వాని నెత్తిపెట్టుకొను దురభినివేశముగల భారతీయుల నంద ఱెఱుగుదురు. అట్లే కొందఱు ఒక్కతీరుననే (కదలక) నిలబడియుండు నియమము పూనుదురు. కొన్నాళ్ళకు వారి దేహముల దిగువభాగములు వారి యధీనమునుండి పూర్తిగా తప్పిపోవును. తర్వాత ఎప్పుడు గాని వారు నడవ లేరు. అన్నిమతములును సత్యములే. ప్రజలు తమ

నడవడులందు నీతిని పాటించిరి, అది మంచి దగుటచే పాటించిరే కాని, 'దేవునాజ్ఞ' అని పాటింపలేదు. మతమును మార్చుట యందు భారతీయులకు నమ్మకము లేదట, 'మతమును మార్చుట' ను వారు 'తప్పుదారి' అనిరి. పెక్కుమతములుండుటకు సంబంధములు పరిసరములు చదువులు — ఇవి యన్నియు కారణములు. ఒకమతమువాడు ఇంకొకనిమతము 'తప్పు' అని చాటుట ఎంత అవివేకము! అది ఎంత యుక్తియుక్త మనగా — ఏషియావాడొకడు అమెరికాకు వచ్చి మిసిసిపిమహానదిని జూచి "ఓ నదీ, నీ దారి పూర్తిగా తప్పుదారి. నీవు మరల వెనుకకు ప్రవహించుచు పుట్టినచోటికి పోయి అటనుండి మరల బయలుదేఱవలెను" అని చెప్పుట ఎంత యుక్తియుక్తమో అంత యుక్తియుక్తము. అమెరికావాడొకడు ఆల్ప్సుకొండలయొద్దకు వచ్చి జర్మనుసముద్రములోనికి పాఱుచున్న ఒకనదిని జూచి "నీ దారి మిక్కిలి వంపుదారి, నేను చెప్పినరీతిగా నీవు ప్రవహింపవలెను, అదొక్కటే చక్కబాటు" అని చెప్పుట ఎంత అవివేకమో ఇది అంత అవివేకము. ఈ భూమి ఎంత పురాతనమో స్వర్ణసూత్రము (గోల్డనురూలు) అంత ప్రాచీన మట. అన్ని నీతిసూత్రాలకును అదే మూల మని చెప్పవచ్చు నట. మానవుడు స్వార్థపరత్వపు మూట. 'నరకాగ్నిసిద్ధాంతము కేవలము వెఱ్ఱి' అని ఆయన అభిప్రాయము. లోకములో కష్టము లున్నవి అని మనకు తెలిసియున్నప్పుడు వాని కర్తృ లేని సుఖ ముండుట పొసగ దట. కొందఱు మతాచారపరులు ప్రార్థించు విధమును ఆయన ఎగతాళి చేసెను. హిందువు నిమీలితనేత్రుడై అంతర్యామిగ నున్న ఆత్మతో యోగము అభ్యసించునట. క్రైస్తవులు ఆకసమున పీఠముపై కూర్చున్న దేవుని తాము చూచుచున్నట్లుగా ఒకవైపు తేఱిచూచుచుండగా తాను చూచియున్నా డట. మతరంగమున విపరీతపరమావధులు రెండు — దురభినివేశము నాస్తికత. నాస్తికునిలో కొంత మంచి ఉన్నది. దురభినివిష్టుని బ్రతుకంతయు

క్షుద్రుడైన తన కొఱకే. 'జీససుహృదయచిత్రము' నెవడో అనామకుడు తనకు పంపెనట. పంపినవానికి ఆయన తనకృతజ్ఞతను చెల్లించెను. ఆ పంపుట స్వమతదురభిమానావిష్కారమే అని అత డభిప్రాయపడెను. దురభిమానులు ఏ మతమునకును చెందరు. వారి దొక ఒక విపరీతసృష్టి!

# అకారాది

No 03 Date CUDDAPA

